పరీధావి - సంక్రాంతి
13-1-1973
ప్రతులు - 1000



రచన :
**తిక్కన కావ్యశిల్పము**

రచయిత :
**కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి**

ప్రచురణ :
వైఖరీ ప్రకాశనము

ముద్రణ :
నాగేంద్ర ఆర్ట్ ప్రింటర్స్ & శివాజీ ప్రెస్, సికింద్రాబాదు

మూల్యము : సాదా ప్రతి రూ. 17 - 00
మేలు ప్రతి రూ. 20 - 00

ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు చేసిన ఆర్థికసహాయముతో ముద్రితము

ప్రతులకు :

వైఖరీ ప్రకాశనము,
క్వార్టర్ 2, పోస్ట్‌గ్రాడ్యుయేట్ సెంటర్,
విద్యారణ్యపురి, వరంగల్ - 1.

క్వాలిటీ పబ్లిషర్స్,
అరండల్‌పేట,
విజయవాడ - 2.

# ఆశీస్సు

శ్రీ రామకోటి శాస్త్రిగారు రచించిన 'తిక్కన కావ్యశిల్పము' అన్న గ్రంథమును అందందు జూచితిని తిక్కన్నగారి శిల్పము చాల సూక్ష్మమైనది ప్రధానముగా ఆయన పద్యరచనయందు, శబ్దములు ప్రయోగించుటయందు, వర్ణనలు సముచితముగా చేసి వానివెనుక నేవియో రసములను లేదా భావములను దాచిపెట్టుటయందు పలువిధముగా నుండును తిక్కన్న శిల్పమును నిజముగా చెప్పినచో ప్రతిపద్యమునకు వ్యాఖ్యానము వ్రాయవలసి యుండును తాత్పర్యమే పొడకట్టించుకొనలేనివారు అంత లోతులకు పోలేరు. ఆ పోయినవారు వానిని చెప్పవలయును. ఈ కావ్యశిల్పమనునది సప్తసముద్రములవంటిది ఒక కావ్యమునకు వంద దశలున్నచో, వంద తక్కువ, అన్నిదశలందు పలుమంది చిత్ర చిత్రములయిన శిల్పమును చేయుదురు ఒక సౌధమును తీసికొన్నచో సౌధనిర్మాణము చేయుట మహాశిల్పము ఆ సౌధములో నొక స్తంభమున్నచో స్తంభనిర్మితి శిల్పము ఆ స్తంభమునందు చెక్కబడిన వందబొమ్మలలో ప్రతిదియు నొక శిల్పము ఇవియన్నియు కలిసి స్తంభరామణీయకము నెట్లు వృద్ధిపరచుచున్నవో చూచుట అది మరియు పెద్దశిల్పము ఈ రీతిగా మహాకవులు వ్రాసిన కావ్యములను చదువుటయు అక్షరమునుండి ప్రయోగింపబడిన శబ్దములనుండి పద్యరచననుండి కథాశిల్పము రచనా శిల్పము రససంపాదన శిల్పము పలువిధములుగానున్న మహాకవుల రచనలు మనకెప్పుడెచట నందినచో నచ్చట పట్టుకొనవలసినదే తప్ప సంపూర్ణముగా చూచుట కష్టమని నా యభిప్రాయము తిక్కన్నగారొక విశిష్ట శిల్పి. ఆయన శిల్పము ప్రధానముగా జిలుగుపనిమీద ఆధారపడి యుండును. అందుచేత స్థూలముగా చెప్పుట కష్టము. శ్రీ రామకోటి శాస్త్రిగారు ఆ తిక్కన్నగారి జిలుగుపనితనములు పలుచోట్ల చూపించిరని చెప్పవలయును వీరు చూపిన కొన్నిభాగములు మిక్కిలి రమణీయములుగా నున్నవి రహస్యములను వెల్లడించుచున్నవి. తిక్కన్నగారప్పుడప్పుడు పదిపద్యములుగా తీసికొని అదియొక ఘట్టముగా నున్నచో దాని నొక కావ్యముగా చేయును మహాకావ్యరచనా శిల్పమునంతయు నా పదిపద్యములలో పెట్టును. ఇట్టివి పలుచోట్ల నుండును. ఆయన కథలను చెప్పుట బహువిధములుగా నుండును. అన్ని విధములను పట్టుకొనుట కష్టము. మొత్తముమీద తిక్కన్నచేసిన ఈ జిలుగుపనుల

చేత ఆయన మహాశిల్పి యన్న విషయమట్లుండగా మహాకావ్య నిర్మాణ ప్రథమ లక్షణమునుండి పాఠకుల మనస్సులను ప్రాశస్త్యక భాగములను మరలించుట జరిగినదేమో అన్న యనుమానము నాకు చిన్నప్పటినుండి యున్నది. పైగా నింతటి మహాగ్రంథ మొక్కసారి యెవ్వడు చదువును? ఎంత విమర్శకుడైనను వాని విమర్శజ్ఞానము సంపూర్ణముగా నొక్కసారి కలుగదు. కాలక్రమమున బుద్ధి వికసించును. వ్రాసిన మహాకవులును అట్టివారే. ఈ గ్రంథము ముప్పది యేండ్లమీద వ్రాయబడినచో మొదటిభాగములలోని శిల్పలక్షణములకంటె చివరిభాగములలోని శిల్పలక్షణములు వేరు. రామకోటిశాస్త్రిగారు వ్రాసిన ఈ విమర్శనములో తిక్కన రచనలో పలుచోట్లగల అట్టి పలువిధములైన శిల్పములు చూపింపబడినవి. ఇది పాఠకులకు మిక్కిలి యోగ్యమైనది. నిస్సందేహముగా భావుకుల కుపయోగించును. మరియు నెంతయో వ్రాయదగినదగును. అభిప్రాయము వ్రాయుటలో ఎంతని చెప్పగలము?

మరియు నేటి విమర్శ కొంత చరిత్ర - కొన్ని పొగడ్తలు - కొంత గోల. వీనితో విమర్శనముయొక్క సుష్ఠు స్వరూపముకూడ గోచరించుటలేదు. అట్టి గ్రంథము మరియొక భాషలో నున్నచో నన్నయ తిక్కనాదుల గురించి విమర్శనలు మరికొన్ని వందల గ్రంథములుగా సిద్ధమగును. ఆ ప్రయత్నములేదు. ఒక సంపూర్ణదృష్టి మనకు లేదనిపించుచున్నది. అట్టి మహాకార్యము జరిగినచో దానిలో ఈ రామకోటిశాస్త్రిగారి ఈ గ్రంథము కొన్ని కొన్ని ఘట్టములయొక్క కొన్ని కొన్ని రహస్యములు తీర్మానించి పెట్టినట్లు తెలియును. శ్రీ రామకోటిశాస్త్రిగారు తిక్కనయందు చూపించిన కొన్ని శిల్పములవంటివి ఆ తిక్కన్న రచనలో నెన్నియో కలవు. అట్టివన్నియు చూపించుట సాధ్యముకాదు. ఈయన చేసిన పనినిబట్టి తిక్కన వానిని మన మూహింపవలయును. ఈయనకు నా ఆశీస్సులు.

విజయవాడ
24-12-1972

విశ్వనాథ సత్యనారాయణ

# ఆ మో ద ము

'తిక్కన కావ్యశిల్పము-తత్త్వము అను' నీ సిద్ధాంత గ్రంథము శ్రీ కేత వరపు వేంకట రామకోటిశాస్త్రిగారు తమ పి ఎచ్. డి. పట్టమునకై 1960 లో ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు సమర్పించినది ఇది నా పర్యవేక్షణలో జరిగిన మొదటి పరిశోధన ఫలితము కనుక నాకు మిక్కిలి ప్రీతిపాత్రము. ఒక పుష్కరము తరువాతనైనను ఈ గ్రంథము వెలుగులోనికి వచ్చుచున్నందుకు సంతోషము.

కవిబ్రహ్మ తిక్కనకు తెలుగు సాహిత్యమున నొక విశిష్టస్థానమున్నది ఆయన వైశిష్ట్యమును ఇంతకుపూర్వము పండితులు విమర్శకులు కొంత వెల యించినారు. ఒక మహాకవి సృష్టించిన సారస్వతమును భావుకులు సహృదయులు నైన విమర్శకులు తరచినకొలది నూత్నాతినూత్న విషయములు వెల్లడియగు చుండును. శ్రీ రామకోటిశాస్త్రిగారు ఈ సిద్ధాంత గ్రంథమున చేసిన మహా కార్య మట్టిదే.

ఈ గ్రంథమున మొదటిభాగము తిక్కనగారి నిర్వచనోత్తర రామాయ ణము మరియు నితరమైన మృగ్యకృతులకు సంబంధించినది; రెండవభాగము భారతమునకు సంబంధించినది మొదటి భాగమున తిక్కన దేశకాలములు, అతని కృతులు, ఉత్తరకాండ రామకథను స్పృశించిన పూర్వకృతులు, ఉత్తర రామాయణమందలి యంగిరసము-ఇతర రసములు, మూలానుసరణ విధానము, నాయకుడు, కావ్యదృష్టి వైలక్షణ్యము, కావ్య నిర్మాణ కుశలత, భవభూతి దిఙ్నాగుల ప్రభావము, ఉత్తరకాండమును రచించిన తరువాతి కవులు, అశ్వా సాద్యంత పద్యములు, జయంతి రామభట్టు కృతి, తిక్కన విజయసేన మందలి పద్యములను విషయములగూర్చి సాకల్యము సమీచీనము నైన పరిశోధనము జరిగినది. రెండవభాగము పెద్దది. దీనిలో తెలుగు భారతము కావ్యేతిహాస

మనియు భారతమునకు నాయకుడు ధర్మరాజనియు స్థాపించుటే కాక, సంస్కృత భారతముతో తెలుగుభారతము నెందుకు పోల్చగూడదో, కవిత్రయమువారు భారతము నెట్లు భావించిరో, తిక్కనగారి భారత [illegible]లోని పరమార్థ మేమిటో నిష్కర్షచేయనైనది. విరాటము సంధిపర్వమనియు, ఉద్యోగము పాండవ సమరోద్యోగపర్వమనియు స్థాపించుట జరిగినది యుద్ధపట్కము, శాంతిత్రయము, ఆశ్రమవాస చతుష్టయముల [illegible]లి వైశిష్ట్యమును క్రొత్త దృష్టితో చెప్పుట జరిగినది భారతమందలి యుపకథల పరమప్రయోజనము సతర్కముగా నిరూపితమైనది వర్ణనలే, చేయగలయునో మహాకవి తిక్కనగారి ప్రకృతి వర్ణనల వైశిష్ట్య సార్థక్యము లెట్టివో, ఆయా పాత్రల స్వభావము లెట్టివో, పాత్రోన్మీలన మెట్లు జరిగినదో, వారి జీవసంపుటి యెట్టిదో నిరూపితము లైనవి చివరన దోషముకాని రసదోషము, అంగిరసములు, అలంకార విచారము, వృత్తౌచిత్య విచారము లున్నవి

తిక్కనగారి తాత్త్వికధార శాస్త్రిగారి సిద్ధాంత గ్రంథమున నొక ప్రముఖభాగమైనను అది యీ ముద్రిత గ్రంథమున లేదు అది మఱియొక గ్రంథముగా వెలువడ దగినది

తిక్కనగారి కావ్యశిల్ప మను విషయము ఒక సముద్రము వంటిది. సహృదయ విమర్శకు లెవ్వరా శిల్పావిష్కరణమునకు పూనుకొన్నను పతమెత్తి వచ్చును. శ్రీ రామకోటిశాస్త్రిగారు కూడ చేసినపని అంతియ. కాని అంతలోనే ఆయనచూపిన నేర్పు, దిట్టతనము, చూపు అగ్గింపదగినవి ఆయిన దర్శనమున కొక ప్రత్యేకత యున్నది. ఆదర్శనమును వెలయించు పద్ధతికిగూడ ఒక ప్రత్యేకత యున్నది. కవిత్వము వ్రాయుట, కవిత్వము నర్థముచేసికొనుట, కవిత్వమును వ్యాఖ్యానించుట-ఉత్తరోత్తరము కష్టసాధ్యములు. కొందరు విమర్శకులు ఈ కవిత్వము బాగున్నది, ఈ కవిత్వము బాగు లేదందురు ఉదాహరణము లిత్తురు. కాని అది ఎందులకు బాగున్నదో ఎందులకు బాగులేదో సతార్కికముగా నిరూపింప జాలరు. శ్రీరామకోటిశాస్త్రిగారేది చెప్పినను తర్కసహితముగా ప్రకరణౌచిత్య మహితముగా నిరూపించి పరిశోధనమను ప్రక్రియను సార్థకముగా సాధించి కృతకృత్యులైనారు. ఈ గ్రంథము తిక్కన కావ్యశిల్పము నధ్యయనము చేయుటకేకాక మహాకవులైన వారి కావ్య మర్మము తెలుగుటకు క్రొత్తపుంతలు చూపుచున్నది. పండితులకు పరిశోధకులకు సహృదయులకు

విమర్శకులకు ఈ గ్రంథ ముపాదేయము సంభావనీయము నగునని నా విశ్వాసము. సంతతాధ్యయనశీలముగల శ్రీ రామకోటి శాస్త్రిగారు మునుముందిట్టి సార్థకములైన గ్రంథములు వెలయించి పరిశోధన ప్రక్రియకును విమర్శన సాహిత్యమునకును పుష్టిని తుష్టిని కూర్చగలరని నా నమ్మకము.

ఉస్మానియా విశ్వవిద్యాలయ
స్నాతకోత్తర కేంద్రము,
విద్యారణ్యపురి-ఓరుగల్లు.
26-12-1972.

బి. రామరాజు

# అంకితము



శ్రీదేవతా ముఖాంబుజ పరిమళమందహాసునకు
ఆదరణీయ సార వివిధాత్మ గుణప్రసన్నునకు
ఈదృగస్మదఖిలాభ్యుదయ హేలాలతాలవాలునకు
మోదమాన మనఃపరిణతమూర్తి కాళ్వారుస్వాములకు.

# కృతజ్ఞత

ఉస్మానియా విశ్వవిద్యాలయములో ఆంధ్రభాషా శాఖ పరిశోధన విభాగమున 1957 లో చేరి పూర్తిగా రెండు సంవత్సరములు అధ్యయనము చేసి ఒక సంవత్సరములో ఈ గ్రంథమును వ్రాసి డాక్టరేటు పట్టమునకై 1960లో సమర్పించితిని. ఇంత చేసిన తరువాత తిక్కన్నగారి వాఙ్మయ వైశిష్ట్య మును సుష్ఠుగా అవగాహన చేసికొనుటకు ఒక జీవితము చాలదని తెలిసినది. రెండు మూడు సంవత్సరములలో ఒక సాధారణ బుద్ధి ఎంత గ్రహింపగలదో అంతమాత్రమే ఇందు వ్రాయబడినది. మహాభారత రచన క్రియా కలాపమును తిక్కన్నగారొక ఆరాధన విశేషముగా భావించిరి. రచనమునకువలెనే అధ్య యనమును ఈజన్మ కామాత్రము సమకూడినది. అంతే సంతోషముగా నున్నది.

నే నీ యింత గ్రంథము నెట్లు వ్రాయగలిగితినని దహరాకాశములోనికి చూడగా—వేలూరి శివరామశాస్త్రి, సూరి భగవంతం, ఖండవల్లి లక్ష్మీరంజనం, బిరుదురాజు రామరాజు, వట్టికోట ఆళ్వారుస్వామి, సి నారాయణ రెడ్డి, దాశరథి, కాళోజి నారాయణరావు, దివాకర్ల వెంకటావధాని, ఎ యస్ త్యాగరాజు, మడిపడగ బలరామాచార్యులు, కాకర్ల వేంకటరామనరసింహం, పోణంగి శ్రీరామ అప్పారావు, వెల్లంకి అమ్మన్నశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ ఈ మొదలయిన మహానుభావులు మరియెందరో కనుపించుచున్నారు ఎవరు ముందు ఎవరు వెనుక ? ఎవరేమి చేసినారు ? అది నాకు తెలియదు. నాకొక్కటి తెలియును. ఆ యందరయందును యథాయోగ్యముగా పరమేశ్వరుడు మేలుకొనియుండు టను నే ననుభవించితిని. ఇదంతయును ఆచార్య శ్రీ బిరుదురాజు రామరాజుగారి పర్యవేక్షణమున జరిగినది అందువల్ల తిక్కన్నగారి వాగ్వైఖరీ హృదయము నిట్లు దర్శించి వ్రాయగలిగితిని. వ్రాసి సరిగా ఒక పుష్కరమైనది. ఇప్పటికైనను ఈ మాత్రము అచ్చులో కనుపించినదనగా అందుకు హరి శివకుమారుడు కార ణము. చూడగా చూడగా నా కనుపించుచున్నదికదా ఇదేమి దేవుని పెళ్ళికాదు కదా యని. అవును. కాదు. కర్తృత్వము నాయందు నిలబెట్టుటకు సూత్ర ధారులై పట్టువిడువక నాకు వెన్నుబలముగా నిలిచిన శ్రీరామరాజుగారికి కృతజ్ఞుడనని చెప్పిన చాలదు. మరి ఎక్కువ చెప్పుటకులేదు. ఉన్నచో బాగుండు నని యున్నది.

26-12-1972 రామకోటిశాస్త్రి

# విషయ సూచిక

## ప్రథమ ఖండము

## నిర్వచనోత్తరరామాయణము

సంఖ్య | | పుట

## ద్వితీయ ఖండము

## శ్రీమహాభారతము

తన కావించిన సృష్టి తక్కొరులచేతం గాదునానాముఖం
బునఁ దాఁ బల్కిన పల్కు లాగమములై పొల్పొందు నా వాణి భ
ర్తను నీతం డొకరుండ నాఁ జను మహత్త్వప్రాప్తిన్ గవిబ్రహ్మనా
వినుతింతున్ గవి తిక్కయజ్వ నఖిలోర్వీదేవరాధ్యుఁబ్రియున్.

— ఎఱ్ఱన - హరివంశము

# ప్రథమోన్మేషము

## 1. దేశకాలములు - కృతులు

తిక్కనగారి తాతయు, తండ్రియు గుంటూరి విభులు. ఆయన మాత్రము నెల్లూరిని పాలించిన మనుమసిద్ధికి మంత్రిగా నుండెను. మరియు నాతనికి నిర్వచనోత్తర రామాయణము నంకితము చేసెను. మనుమసిద్ధి తండ్రికి, తిక్కన్నగారి పెద్దతండ్రి సిద్ధన మంత్రిగా నుండెను. ఈ యీ విషయములను బట్టి చూడగా తిక్కన్నగారు గుంటూరున జన్మించి, బాల్యము గడచినప్పటినుండి నెల్లూరు చేరుకొని పెదతండ్రి యొద్ద పెరిగి, ఆయన ప్రాపకముననే మనుమసిద్ధికి దగ్గరివాడై తరువాత మంత్రియై యుండునని పించుచున్నది. బాల్యమునందు గుంటూరుతోను, మిగిలిన వయస్సునందం తయు నెల్లూరుతోను, తిక్కన్నగారికి సంబంధముండియుండు ననుటలో విప్రతిపత్తి కానరాదు.

మనుమసిద్ధి దాయాదులచేత రాజ్యభ్రష్టుడు కావింపబడగా, తిక్కన్న గారు ఓరుగంటి ప్రభువైన గణపతిదేవమహారాజును దర్శించి, తత్సహాయమున మనుమసిద్ధిని తిరిగి నెల్లూరు సింహాసనమున నుంచినట్లు తెలియుచున్నది. గణపతిదేవుడు క్రీ.శ. 1198-1262సంవత్సరముల మధ్యకాలమున నోరుగంటి సింహాసనము నధిష్ఠించి పాలించినవాడు[1]. నిర్వచనోత్తర రామాయణమున నవతారికలో మనుమసిద్ధి విజయగండ్గోపాలుని జయించినట్లు చెప్పబడియున్నది. ఆ విజయగండగోపాలుడు క్రీ. శ 1250 ప్రాంతముననున్న తెలుగు పల్లవరాజు ... యగండ గోపాలుడు కావచ్చునని శ్రీచాగంటి శేషయ్యగారు వ్రాసిరి[2].

---

1. తెలుగు విజ్ఞాన సర్వస్వము. పుటలు 222, 280.
2. ఆంధ్రకవి తరంగిణి. సం-2. పుట 289.

నిర్దుష్టమగు శాసనప్రమాణముయొక్క సహాయమున మనుమసిద్ధి క్రీ.శ. 1249లో రాజ్యమునకువచ్చి 1290 వరకు పరిపాలనము సాగించెనని తెలియుచున్నట్లుగా శ్రీ మారేమండ రామారావుగారును వ్రాసిరి[1]. అందువలన తిక్కన్నగారు గణపతిదేవ మహారాజునకు సమకాలికుడై మనుమసిద్ధికి మంత్రియై, సుమారు 1210–1300 మధ్యకాలమున నుండియుండవచ్చునని యూహింపబడినది.

రెండు మూడు సంవత్సరము లటుఇటుగా "తిక్కన జీవితము ఇంచుమించు క్రీ. శ 13వ శతాబ్ది ఆది నుండి అంతమువరకు విస్తరిల్లియుండె" నను శ్రీ పింగళి లక్ష్మీకాంతము[2] గారి వాక్యము సమంజసమై ప్రమాణభూతముగా నున్నది.

తిక్కన్నగారు నిర్వచనోత్తర రామాయణము, భారతము మాత్రమే కాక విజయసేనమను మరియొకకావ్యమును, కవివాగ్బంధన మనియు, కవి సార్వభౌమఛందస్సనియు ననబడు నొక ఛందోగ్రంథమును, కృష్ణశతకమును, వ్రాసెనని చెప్పబడుచున్నది[3]. మొదటి రెండు గ్రంథముల విషయమున వివాదము లేదుగాని చివరి మూడు గ్రంథముల విషయమున నున్నది ప్రస్తుతము లభించిన నిర్వచనోత్తర రామాయణమునగాని, భారతమునగాని, తిక్కన్నగారు తన యితర కృతుల విషయమును చెప్పియుండలేదు. వివాదగ్రస్తములైన మిగిలిన మూడింటి యందును నొక్క విజయసేనము తిక్కన్నగారిచేత వ్రాయబడి యుండవచ్చు ననిపించుచున్నది ఆ విషయమిచ్చట కొద్దిగా వ్రాయబడును.

పెదపాటి జగన్నాథకవి యనునాతడు "ప్రబంధ రత్నాకరము" అను సంకలనగ్రంథము నొకదానిని సిద్ధము చేసెను. ఆ జగన్నాథకవి క్రీ.శ. 1550–60 ప్రాంతము వాడని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అభిప్రాయపడిరి. కాకినాడ సాహిత్యపరిషత్తు పుస్తక భాండాగారమున మరియొక సంకలనగ్రంథము పేరు తెలియరాని యొకనిచేత గ్రథింపబడిన దున్నదని, దానిని, జగన్నాథ కవి దానిని, కలిపి శ్రీ ప్రభాకర శాస్త్రిగారు ప్రబంధ రత్నావళి యనుపేర

---

1. భారతి. వృష. కార్తికము. పుటలు 438–444.
2. తెలుగు విజ్ఞాన సర్వస్వము పుట 809.
3. ఆంధ్రకవితరంగిణి సం. 2. పుటలు 178–185.

క్రీ.శ. 1918లో ముద్రింపించిరి. శ్రీ శాస్త్రిగారిచే సంపాదింపబడిన యీ ప్రబంధ రత్నావళి యందు తిక్కన్నగారి విజయసేనములోనివిగా పదునొకండు పద్యములు కనిపించుచున్నవి*. ప్రబంధ రత్నావళిలోని, విజయసేనమునందలి పద్యములనబడు వాటిలో రెండవది, యేడవది జగన్నాథ కవిచేత గాక, పేరు తెలియరాని ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథ సంధాతచేత నుదాహరింప బడినవని శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి.

అప్పకవియు, కస్తూరిరంగకవియు, ఏ పద్యము విజయసేనములోని దని సంశయప్లుతయతికి నుదాహరణముగా తీసి చూపినారో[1], ఆ పద్యమునే కూచిమంచి తిమ్మకవి, చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనములోనిదని తన లక్షణ గ్రంథమున నుదాహరించెనట[2]. ప్రబంధరత్నావళియందు చిమ్మపూడి యమరేశ్వరుని విక్రమసేనములోని పద్యములు గూడ కొన్ని (53) యున్నవి. కూచిమంచి తిమ్మకవి చెప్పినట్లుగా నా పద్య మా యేబది మూడింటిలోను లేదు. మరియు విజయసేనములోనివిగా నుదాహరింపబడిన పద్యములలోను నదిలేదు. అప్పకవిగాని, రంగకవిగాని తిక్కన విజయసేనమని యనలేదు. ఊరక "విజయసేనమునుండి" యని వ్రాసిరి. విజయసేనములోని దని రంగకవి మరియొక పద్యము గూడ నుదాహరించెను (3 – 353). అక్కడగూడ విజయసేనమునకు తిక్కన్నగారు కర్తయని చెప్పలేదు. తిక్కన్నగారి పేరెత్తి యుత్తరరామాయణము నందలి 'శ్రీరాస్తాం' శ్లోకము నుదాహరించిన రంగకవి విజయసేనము విషయమున కర్తను ఏల చెప్పలేదో తెలియదు. ఈ లాక్షణిక గ్రంథ ప్రామాణ్యము ననుసరించి విజయసేనమును తిక్కన్నగారే వ్రాసినారనుట కవకాశము కనిపించుటలేదు. మరియు విక్రమసేనము, విజయసేనము ఒకదానికొకటి పొరపాటుగా గ్రహింపబడిన వనియు అనిపించుచున్నది.

---

* అనుబంధము 5.

1. అప్పకవీయము 3-254; ఆనందరంగరాట్ఛందము 3-189.
2. "సర్వలక్షణ సార సంగ్రహమున నుదాహరించి యున్నాడు" అని ఆంధ్ర కవి తరంగిణి (సం. 2 పుట 182) యందున్నది. కాని 1927 సంవత్సరమున శ్రీ నందిరాజు చలపతిరావుగారి చేత ఏలూరు మంజువాణీ ముద్రాక్షరశాల యందు ముద్రింపబడిన సర్వలక్షణ సార సంగ్రహమున ఆ పద్యము కానవచ్చుట లేదు.

కస్తూరి రంగకవి యుదాహరించిన రెండవ పద్యము ప్రబంధ రత్నావళి యందున్న 'తిక్కన విజయసేనములోని పద్యముల'లో నున్నది. మొదటి పద్యము ప్రబంధరత్నావళియందు లేకపోయినను, ఇరువురు లాక్షణికు లా పద్యము విజయసేనము లోనిదని చెప్పుచున్నారు. ప్రబంధరత్నావళి విజయసేనము తిక్కన్నగారు వ్రాసినదని చెప్పుచున్నది. అందువలన నా మొదటి పద్యముగూడ తిక్కన్నగారి విజయసేనములోనిదని యంగీకరింపవచ్చును.

అప్పుడు కూచిమంచి తిమ్మకవి మాట యేమగునని ప్రశ్న వచ్చును. ఇరువురు లాక్షణికులు పొరపాటువడి విక్రమసేనములోని పద్యమును విజయసేనములోనిదిగా నుదాహరించినా రనుటకంటె, ఒక్క తిమ్మకవియే విజయసేన మనుటకు పొరపాటున విక్రమసేన మనినాడని యనుకొనుట మేలు. ఆ ఒక్క పద్యము చిమ్మపూడి యమరేశ్వరుని విక్రమసేనము లోనిదని సాక్ష్యము చెప్పుచున్నదొక్క తిమ్మకవియే. విజయసేనము లోనిదనువారిరువురు. విజయసేనమునకు కర్త తిక్కన్నగారని జగన్నాథకవి చెప్పుచున్నాడు. కనుక విజయసేనమును తిక్కన్నగారు వ్రాసి యుండవచ్చుననియు, లక్షణ గ్రంథములయం దుదాహరింపబడిన పద్యములు తిక్కన్నగారివే యనియు నిశ్చయముగా నూహింపవచ్చును.

మరియొక్క విశేషమేమనగా తిక్కన్నగారి విజయసేనము లోనివిగా ప్రబంధరత్నావళి యందున్న పద్యములలో "తరుణుల వీగు చన్నుగవ— అను పద్యమట్లే నిర్వచనోత్తర రామాయణమున నున్నది (1-51)*. దానికి ముందు పరిఖను వర్ణించు సీసపద్యమొకటి నిర్వచనోత్తర రామాయణము నందువలెనే విజయసేనము నందును నున్నది. నిర్వచనోత్తర రామాయణము లోని వైశ్యవర్ణనము పద్యమునందలి భావమునకును, విజయసేనమునందలి వైశ్యవర్ణనమునకును దగ్గరిపోలికయున్నది. "ఉజ్జ్వలలక్ష్మిరెప్పుడుతమ్మలవడం దెందు" (1 - 58) అని యుత్తర రామాయణమునను, "లక్ష్మి తమ చెప్పిన యట్టులుచేయు" అని విజయసేనమునందును నున్నది — తాను

* మఱియు విరాటపర్వములో 'దుర్వారోద్యమ' పద్యము రెండుచోట్ల గలదు. 255, 172. విరాట పర్వములోని 4-234, 236 పద్యము లుద్యోగమున 3-35,37 పద్యములుగా నున్నవి. మఱియు ని. రా. 8-60, ని.రా.5-355 చూడవచ్చును.

వ్రాసిన పూర్వగ్రంథమునందలి పద్యము ఉత్తరగ్రంథము నందును, ఒక గ్రంథము పూర్వ భాగమున వ్రాసిన పద్యముల నుత్తరభాగము నందును, అవసరమునుబట్టి యట్లే గాని, కొద్దిపాటి మార్పుతో గాని, వాడుకొనుట తిక్కన్నగారి కలవాటున్నదనుటకు నుదాహరణములు చాల చూపించ వచ్చును. నిర్వచనోత్తర రామాయణము నందలి "శ్రావ్యంబై చెలగెన్ గభీర మధురజ్యానాద" మన్న పద్యమట్లే భారతమున నున్నది. మరియు విరాట పర్వము నందలి 'ఓంకారవాచ్య' మన్న పద్యము మొదటి రెండు పాదములును నాల్గక్షరముల మార్పుతో నానుశాసనిక పర్వమునందున్నవి[1]. కనుక విజయసేనమును తిక్కన్నగారు ముందు వ్రాసి, అందలి పద్యమునే నిర్వచనోత్తర రామాయణమున నుపయోగించుకొని యుండవచ్చునని యూహించుట నిర్హేతుకము గాదు.

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు తాము సంపాదించి ముద్రించిన "ప్రబంధమణిభూషణము" నందు విజయసేనములోని పద్యముల నైదింటిని గుర్తించిరి అందొకటి ప్రబంధరత్నావళి యందున్నది. ఆ గ్రంథము పీఠికలో "తిక్కనసోమయాజి విజయసేనము కూడ రచించెను" అని వ్రాసిరి. కాని శ్రీ కవిగారు తా మా పద్యములు తిక్కన్నగారి విజయసేనములోనివని యే ఆధారము ననుసరించి గుర్తించిరో చెప్పలేదు.

శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు విజయసేనములోనివని తమ యాంధ్రుల చరిత్రమున నుదాహరించిన రెండు పద్యములను శ్రీ చాగంటి శేషయ్యగారు చూపించిరి[2] అందలి మొదటి సీసపద్యము ప్రబంధమణి భూషణమున నున్నది. దానిని శ్రీ కవిగారును తిక్కన్నగారి విజయసేనము లోనిదిగా గుర్తించిరి.

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు "కవిబ్రహ్మనాబడు నితడు (తిక్కన్న) విజయసేనమను మఱియొక గ్రంథము చేసియున్నవాడు. అది రాజమహేంద్రవరములో నా మిత్రుని యొద్ద నున్నదట. కాని నాకు చూచు భాగ్యము పట్టినదికాదు[3]-" అని యొకచో వ్రాసిరి. ఆ వ్రాతను

---

1. నిర్వ. రా. 4-71, విరాట 5-182; విరా. 1-32, అనుశాసన 4-189.
2. ఆంధ్రకవి తరంగిణి సం. 2. పుట 178.
3. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. సం.2. సంచిక 1. (ప్రమాది. చైత్రము)

జూచి యీ గ్రంథకర్త శ్రీ శాస్త్రిగారిని దర్శించి, ఆ గ్రంథము విషయము ప్రస్తావించగా, తా మబద్ధము మాత్రము వ్రాయలేదనియు, తమ కా గ్రంథమును జూచిన జ్ఞాపకము లేదనియు, ఆ మిత్రు డెవరో కూడ ప్రస్తుతము చెప్పగల స్మృతి లేదనియు చెప్పిరి. శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారు చూడక పోయినను, రాజమహేంద్రవరమున నెవరియొద్దనో తిక్కన్నగారి విజయ సేనముప్రతి కొంత కాలము క్రిందటివరకు నుండి యున్నదనుట మాత్రము స్పష్టము.

పెదపాటి జగన్నాథకవి విజయసేనము తిక్కన్నగారు వ్రాసినట్లుగనే చెప్పుటచేతను, విజయసేనములోని పద్యములు కొన్ని లాక్షణిక గ్రంథము లందును, సంకలన గ్రంథములందును కనిపించుట వలనను, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ మానవల్లి రామకృష్ణకవి*, శ్రీ చాగంటి శేషయ్య గార్లవంటి పరిశోధక పండితులు విజయసేనము తిక్కన్నగారి కృతి యని యభిప్రాయపడుచుండుటచేతను, చారిత్రకులైన శ్రీ చిలుకూరి వీరభద్ర రావుగారును విజయసేనము తిక్కన్నగారు రచించెనని చెప్పుచుండుట వలనను[1], శతవృద్ధులును కవిసార్వభౌములును నైన శ్రీ శ్రీపాద కృష్ణ మూర్తిశాస్త్రిగారు విజయసేనము మొన్నమొన్నటి వరకు రాజమహేంద్ర వరమున నున్నమాట సత్యమేనని చెప్పుటచేతను, లభించిన పద్యములనుబట్టి ఆ గ్రంథము తిక్కన్నగారు వ్రాసియుందురనుట కవకాశము కనిపించుట చేతను, ప్రస్తుత పరిస్థితిలో నీ గ్రంథకర్తయు విజయసేనము కర్తృత్వము తిక్కన్నగారిదేయని యభిప్రాయపడుచున్నాడు.

---

* శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి సొంతము ప్రబంధమణిభూషణము అచ్చుప్రతి, శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారి యొద్ద నున్నది. అందు నా యా పద్యముల ప్రక్కన, నవి యే కవివో, యే గ్రంథములోనివో వ్రాయ బడియున్నవి. ఆ వ్రాత శ్రీ కవిగారిదేననియు, ఆయన తరువాత తరువాత తెలియవచ్చిన యంశముల నట్లు ప్రక్కన గుర్తుగా వ్రాసికొనె ననియు శ్రీ అప్పారావుగారు చెప్పుచున్నారు. అట్లు శ్రీ కవిగారిచేత విజయసేనము లోనివిగా గుర్తింపబడిన పద్యము లైదు. ఆ యైదు పద్యములును ననుబంధమున నీయబడినవి (అనుబంధము-6).

1. తిక్కనసోమయాజి. పుట 67.

కవివాగ్బంధనము తిక్కన్నగారు వ్రాసి యున్నట్లనిపించుట లేదు. అది "తిక్కన సోమయాజి చెప్పె"నని యున్న ఒక పద్యమును శ్రీ చాగంటి శేషయ్యగా రుదాహరించిరి[1] ఆ పద్యము తప్ప మరొక యాధార మేమియు లేదు. శ్రీ శేషయ్యగారును "తిక్కనసోమయాజి యీ లక్షణ గ్రంథమును రచించెనని నమ్ముట కవకాశము లేదు"[2] అనుచున్నారు. కాని "తిక్కన తన కవివాగ్బంధనమున నీతనిని, నీతని గ్రంథమును పేర్కొని యుండుటచే నంతకంటె ముందువాడు"[3] కావలయునని క్షేమేంద్ర కవిని గురించి శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు వ్రాసినదానిని బట్టి చూడగా నాయనకు, కవివాగ్బంధనము తిక్కన్నగారు వ్రాసినారన్న విశ్వాసమున్నట్లు తోచుచున్నది. ఇంతకుమించి కవివాగ్బంధనమునకును తిక్కన్నగారికిని మరేమి సంబంధము లేదు.

ఇక మిగిలినది కృష్ణశతకము. ఈ శతకము మొదలు తిక్కన్నగారి దని యే ప్రమాణము మీద నెవరూహించిరో తెలియదు. "అరయన్ శంతను పుత్రుపై-" అను పద్యము భక్తప్రియ శతకము (కృష్ణా! భక్తప్రియా!-యని మకుటము) లోనిదని కొందరు చెప్పుచున్నారని మాత్రమే శ్రీ శేషయ్యగారు వ్రాసిరి[4] ఆ పద్యము కృష్ణా! దేవకీనందనా అను మకుటముతో దేవకీనందన శతకమునం దున్నది. చివర 'భక్తప్రియా' యని యెవరో మార్చియుందురు. ఆ దేవకీనందన శతకము, విక్రమార్క చరిత్రము కృతిపతియైన సిద్ధనమంత్రి తండ్రి జన్నయ యను నాతడు వ్రాసినది. "విమల వర్తనమున వేదశాస్త్ర పురాణ వాక్యార్థ సరణికి వన్నెవెట్టి; పరమ హృద్యంబైన పద్యశతంబున దేవకీతనయు విధేయుజేసె-"[5] అని జక్కన కవి స్పష్టముగా జన్నయను గూర్చి వ్రాసినాడు. పద్యశతమున దేవకీ తనయు విధేయుజేసికొనినాడనగా వందపద్యములతో దేవకీనందనుని

---

1. ఆంధ్రకవి తరంగిణి సం. 2. పుట 185.
2. ఆంధ్రకవి తరంగిణి సం. 2. పుట 184.
3. తెలుగు కవుల చరిత్రము. పుట 331, మరియు అనంతుని ఛందము ద్వితీయ ముద్రణ పీఠిక. పుట 52.
4. ఆంధ్రకవి తరంగిణి సం. 2 పుట 185.
5. విక్రమార్క చరిత్రము 1-44.

స్తుతించి తనకు విధేయుడుగా చేసికొనినాడని – అనగా దేవకీనందన శతకము వ్రాసినాడని అర్థము. కనుక తిక్కన్నగారికా శతకముతో నెట్టి సంబంధమును కానవచ్చుట లేదు.

తిక్కన్నగారు వ్రాసినవి మూడు గ్రంథములు – విజయసేనము, నిర్వచనోత్తర రామాయణము, శ్రీ మహాభారతము. విజయసేన ముప లభ్యము కాలేదు. అందువలన రెండు గ్రంథములే – అవే పరిశీలన యోగ్యములు.

## 2. ఉత్తరకాండ కథ – పద్మ పురాణము

పద్మపురాణము పాతాళఖండమున శ్రీరాముని యశ్వమేధాంది ముతో కూడిన యుత్తరకథ యున్నది. రామాశ్వమేధము చాల విపుల ముగా వర్ణింపబడియున్నది. శ్రీరాము డశ్వమేధము చేయుటకు హేతువు పద్మపురాణము చెప్పుచున్నది. అగస్త్యుడు, రావణుడు బ్రాహ్మణుడని చెప్పగానే శ్రీరాముడు బ్రహ్మహత్యా పాతకమునకు భయపడి దుఃఖింపగా, నాయన యశ్వమేధము చేసినచో బ్రహ్మహత్యాఘము తొలగునని చెప్పి నాడు. అందుకు శ్రీరాము డశ్వమేధము చేసినాడు. సీత శ్రీరాముని చేత విడువబడుటకు కారణముగా నామె కొక శాపము పద్మపురాణమున చెప్పబడియున్నది. చిన్నతనమున సీత కీరదంపతులకు వియోగము కలి గించి బాధించినదట. అపుడు కీరాంగన సీతను నీకు పతివియోగము కలుగు గాక యని శపించినది. అట్లు సీతవలన వియోగము ననుభవించిన కీరము చాకలియై యయోధ్యయందు పుట్టి, సీత విషయమున నపవాదును పుట్టించి నది—మరియు పద్మపురాణము పాతాళఖండమున జాంబవంతుడు శ్రీరా మునకు చెప్పినట్లుగా పూర్వకల్పరామాయణమున సంగ్రహముగా నున్నది. ఈ పాతాళఖండమున నున్న మరియొక విశేష మేమనగా వాల్మీకి, బాల, అరణ్య, కిష్కింధ, సుందర, ఉత్తరకాండములు వ్రాసెనని అయోధ్య కాండము వాల్మీకి వ్రాసినట్లుగా పద్మపురాణము చెప్పుటలేదు.

ఉత్తరకాండముననున్న శ్వేతుని కథ పద్మపురాణము సృష్టిఖండమున అగస్త్యుడు శ్రీరామునకు చెప్పినట్లుగనే యున్నది మరియు నుత్తర కాండ

మున నధికపాఠములుగా గుర్తింపబడిన గృధ్రోలూక సంవాదరూప వృత్తాంతము మొదలైనవి పద్మపురాణమున నున్నవి. ఉత్తరకాండమున నున్న రాక్షసవంశ వివరములు మాత్రము పద్మపురాణమున లేవు. శంబూకవధా వృత్తాంతము పద్మపురాణ ముత్తరఖండమున నున్నది.

## 3. ఉత్తరకాండ కథ - జైమినీ భారతము

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి యాంధ్రానువాదమును బట్టి జైమినిభారతము అశ్వమేధ పర్వము తెలియుచున్నది. శ్రీరాముని యశ్వమేధ మీ పర్వమున ప్రసక్తికి తీసుకొనిరాబడినది. ఉత్తరకాండము నందలి ప్రధానాంశములు—శ్రీరాముడు సీతను పరిత్యజించుట, ఆమె వాల్మీకియాశ్రమమున నుండి కుశలవులను గనుట మొదలైనవి జైమినీ భారతమున నున్నవి పద్మపురాణమునందునవలెనే శ్రీరాముని యశ్వమేధమునకు, పౌలస్త్యుని సంహరించుటవలనవచ్చిన బ్రహ్మహత్యాపాతక నిరాసనబుద్ధియే హేతువుగా, నీ జైమినీ భారతమును చెప్పుచున్నది

మరియు నిందు రెండు మూడు క్రొత్త విషయము లున్నవి. క్రొత్త వనగా నుత్తరకాండమున లేనివి. పద్మపురాణమున లేనివి. తిక్కన్న గారు వ్రాయనివి. (1) సీత గర్భవతియైనది. నాలుగు మాసములు గడచినవి. అపుడు శ్రీరామున కొక కలవచ్చినది – లక్ష్మణునితో చెప్పి సీతను గంగానదీ కూలమున దిగవిడచి రాబంపినట్లు ఆ స్వప్న విషయమును తెల్లవారగనే వసిష్ఠునకు చెప్పినాడు శ్రీరాముడు. ఆయన జనకుని పిలువ నంపి, సీతాగర్భరక్షణార్థము పుంసవనము చేయింపుమని చెప్పినాడు. జనకుని పిలుచుకొని రమ్మని లక్ష్మణుని పంపినాడు శ్రీరాముడు. జనకుడు వచ్చినాడు. ఆ పుంసవన మహోత్సవము జూచి యలరి జనకుడు తన రాజ్యమును శ్రీరామునికి కర్పించి వనములకు బోయెను. (2) అయోధ్యలోని చాకలి యొకడు భార్యనేమోయనినాడు. ఆమె యలిగి పుట్టినింటికి పోయినది. తండ్రి యామెను చివాట్లుపెట్టి యల్లుని యొద్దకు తీసికొనివచ్చినాడు. ఆమె పుట్టినింటికి బోయి తిరిగి వచ్చు లోపల నాల్గు దినములు గడచినవి. ఆ యల్లుని కోపమల్లే యున్నది. ఇది నా యిల్లు దాటిపోయి నాల్గు దినములైనది. ఇక దీనిని నే నేలుకొనను. రాక్షసుని యింటనున్న

సీతను భార్యగ దాయని తెచ్చుకొను రాఘవుడనుగాను నేను. నాకు నీ కూతు రక్కరలేదని యా చాకలి మామతో ననినాడు. ఈ మాట నే చారులు శ్రీరామున కెరింగించిరి (3) సీత అత్తగారి నిక వనములకు బయలుదేరుచు నత్తలకు నమస్కరించి యనుజ్ఞయిమ్మనినది. వారు సీతను పోవలదనినారు. ఆమె కాదుకూడదని బయలుదేరినది — ఈ మొదలైన క్రొత్త విషయములిందున్నవి. జైమినీభారతమున శంబూక వధ విషయము లేదు. పద్మపురాణమునందు వలెనే రావణప్రసంగము లేదు. ఉత్తర కాండమునందు వలె సీత పాతాళమున కేగుట పద్మపురాణమునగాని, జైమినీ భారతమునగాని లేదు. సీతారాముల పునస్సమాగమమునే ఈ రెండు గ్రంథములును చెప్పుచున్నవి

ఉత్తరకాండము నందలి శ్రీరాముని కథావిషయములు భారతము నందున్నది.[1] ఆనందవర్ధనులు ధ్వన్యాలోకమున వాల్మీకి సీతావియోగ పర్యంతము తన ప్రబంధమును రచించి కరుణరసమును నిర్వహించెనని వ్రాసెను దిఙ్నాగుడు, భవభూతి యుత్తర రామాయణ కథనే గ్రహించి నాటకములు వ్రాసిరి—ఈ యన్నింటిని బట్టి చూచినచో ఉత్తరకాండము ప్రక్షిప్తమని త్రోసివేయరాదనియు, అది వాల్మీకియే వ్రాసినాడనియు నిశ్చయముగా నమ్మవచ్చును. అదియుగాక ఉత్తరకాండము లేనిదే పూర్వ రామాయణము సంపూర్ణముకాదు. ఆ విషయము తరువాత వ్రాయబడును.

## 4. ఉత్తరకాండము — పూర్వ రామాయణము

ఉత్తరకాండము వాల్మీకియే రచించెననియు, రచింపలేదనియు నొక వివాదమున్నది. ఆ వివాదము జోలిపెట్టుకొనకుండ నిచట నొక విషయము విచారింపబడును. ఉత్తరకాండము యొక్క యవసరము పూర్వరామాయణమున కేమైన నున్నదాయని ప్రశ్న. అవసరమున్నచో నీ యుత్తరకాండమును వాల్మీకికాక యెవరు వ్రాసినగాని శిరోధార్యమే యగును. నిజమున కవసరమేమియు లేనప్పుడది వాల్మీకి వ్రాసినాడన్నంత మాత్రమున దాని కధికముగా గౌరవమేమియు నుండదు. అనగా నుత్తరకాండము వైశిష్ట్యము

1. ద్రోణ-అధ్యా. 59 మరియు అశ్వమేధపర్వము. అధ్యా. 4.

దానిని వ్రాసినవానిమీద గాక పూర్వరామాయణముతో దానికున్న సంబంధముమీద యాధారపడి యున్నట్లుచెప్పబడుచున్నది.

ఉత్తరకాండములోని కథావస్తువునందలి ప్రధానాంశము లివ్వి— 1. రావణ సంహారానంతరము తిరిగి వచ్చి శ్రీరాముడు సభార్యుడై యయోధ్యా సింహాసనమధిష్ఠించుట. 2. అగస్త్యుడు శ్రీరామునకు రాక్షస వంశ వివరములను చెప్పుట 3. సీతారాముల గృహస్థజీవనము. 4 శ్రీరాముడు సీతను పరిత్యజించుట. 5 శత్రుఘ్నునిచేత లవణుని శ్రీరాముడు చంపించుట. 6. శ్రీరాముడు శంబూకుని వధించుట. 7. శ్రీరాము డశ్వమేధమునుచేయుట. 8. కుశలవులు శ్రీరాముని చేరుట. 9. సీత పాతాళమునకు బోవుట. 10. కౌసల్యాదులు స్వర్గమున కేగుట 11. కుశలవుల పట్టాభిషేకము. 12. శ్రీరాముడు శ్రీమన్నారాయణుడై వైకుంఠమున స్వస్థానమును చేరుకొనుట—శ్రీమద్రామాయణము నంతకు నాయకుడు శ్రీరాముడు కనుక నీ యుత్తరకాండమునకును నాయనయే నాయకుడు. శ్రీరాముని పుట్టుకకు ముందునుండి ప్రారంభమైన బాలకాండముతోడి శ్రీమద్రామాయణము, శ్రీరాముని స్వస్థానము ప్రవేశించి శ్రీమన్నారాయణు డగుటతో ముగియు నుత్తరకాండముతో పూర్తియైనది. అట్లగుటయే లెస్స. ఏల ?

శ్రీమద్రామాయణ మాదికావ్యమనబడుచున్నను ముఖ్యముగా నది యితిహాసము. భారతముగూడ కావ్యమని పేర్కొనబడినప్పటికిని యితిహాసమే. ఇతిహాసమున నాయకుని కథ కావ్యనాయకుని కథ వంటిదికాదు. ఇతిహాస శబ్దార్థము విచారించినచో నిది యెట్లో తెలియును.

"ఇతి = ఏవమర్థే ప్రత్యక్షనిర్దేశం ద్యోతయతి. హః = ఇహ శబ్ద ఆగమః; ఆసః = ఆసనం; ఏవం ప్రకారాః ప్రసక్తాః పరిదృశ్యమానా ఆగమికార్థాః కర్మఫలసంబంధ స్వభావాయత్ర ఆసతే". మరియు నింకొక విధముగా చెప్పవచ్చును—"ఇతిః = జ్ఞానం; తస్యహాసః = హర్ష పూర్వకోవికాసః". ఈ రెండర్థములను చెప్పినది శ్రీ మదభినవగుప్తులు[1]. కర్మఫలముతో సంబంధించిన యర్థములు ప్రత్యక్షముగా నెందు చూపబడునో అది యితిహాసమనబడునని యొక నిర్వచనము. కర్మయొక్క ఫలము వలని యనుభవము

1. నాట్యవేదము. పుట 6.

కేవల మీ శరీరముతోడి యీ జన్మకు మాత్రమే సంబంధించినదికాదు జన్మ రాహిత్యము కలుగువరకు కర్మఫలానుభవముండును. అనగా కర్మఫలానుభవము ఇహపరములకు రెండింటికిని సంబంధించియున్నది ఇతిహాస నాయకుని కర్మఫలముతో సంబంధించిన యర్థము ప్రత్యక్షముగా చూపించవలయునన్నచో, ఆ నాయకుని ఇహపరలోకముల యందలి స్థితిని నిరూపించవలసియుండును అప్పుడే ప్రత్యక్షముగా చూపబడినట్లు.

శ్రీమద్రామాయణ మితిహాసము. నాయకుడు శ్రీరాముడు. శ్రీరాముడుగా నవతరించుటకు పూర్వ మాయన శ్రీమన్నారాయణుడని బాలకాండమున చెప్పబడియున్నది. శ్రీరాముడుగా శరీరమును ధరించి కష్టసుఖముల ననుభవించి తిరిగి శరీరమును త్యజించి వైకుంఠమున శ్రీమన్నారాయణుడగుట చెప్పబడనేవలయును. భారతమునను నాయకుడైన ధర్మరాజు యముని యంశమున పుట్టినాడని యాదిపర్వమున చెప్పబడి, స్వర్గారోహణ పర్వమున ధర్మరాజు యమునిలో లీనమైనాడని చెప్పబడినది. ఇతిహాస నాయకుడైన వాని స్వస్థానమునుండి మానుషతనువుతో నావిర్భవించుట యొక్కయు, స్వకర్మ నిర్వహించుట యొక్కయు, కర్మఫలానుభవముతో చివరకు స్వస్థానము ప్రవేశించుట యొక్కయు ప్రత్యక్ష ప్రదర్శనమే ఇతిహాసమునందలి వస్తువుగా నున్నది. శ్రీమదభినవులు తచ్ఛబ్దార్థము నట్లే నిర్వచించిరి. కనుక శ్రీమద్రామాయణము, శ్రీరాముడు తిరిగి స్వస్థానమును ప్రవేశించుటను చెప్పుటతోగాని సంపూర్ణము కాదు. బాలకాండమున శ్రీరాముడవతరించినాడు. ఉత్తరకాండమున దేహమును చాలించినాడు. అందువలనఉత్తరకాండములేక పూర్వరామాయణము స్వయం సంపూర్ణము కాదు.

ఇంకొక విషయము — శ్రీమద్రామాయణము సీతాయాశ్చరిత మనబడుచున్నది. సీతాదేవి చరిత్రము భూమినుండి పుట్టుటనుండి, తిరిగియందు ప్రవేశించువరకు నున్నది. సీత భూమిని ప్రవేశించుట యుత్తరకాండమున నున్నది. ఈ కాండములేనిచో సీత చరిత్రము సంపూర్ణము కాదు. బాలకాండమున సీత యావిర్భవించుట చెప్పబడినది. ఈ యుత్తరకాండమున నామె యవతారపరిసమాప్తి యున్నది. ఇదంతయు సీత చరిత్ర. ఇందువలనను నుత్తరకాండములేక పూర్వరామాయణము స్వయంసంపూర్ణము కాదు.

శ్రీరాము డవతారపురుషుడు. భగవంతుని యవతారము పరమార్థము ధర్మసంస్థాపనము. అది ద్విధాభూతము. దుష్టశిక్షణ - శిష్టరక్షణ. యుద్ధకాండముతో ముగియు పూర్వరామాయణమున దుష్టశిక్షణయే యున్నది. అనగా నవతారము ప్రయోజనమున సగమే యంతవరకు నిరూపింపబడినది. శిష్టరక్షణరూప ధర్మసంస్థాపన మీ యుత్తరకాండమున నిరూపింపబడినది. కనుక నీ కాండములేక శ్రీరాముని యవతార ప్రయోజనము సంపూర్ణముగా నిరూపింపబడదు. ఇందు వలనగూడ నీ కాండము లేకుండ శ్రీమద్రామాయణము స్వయం సంపూర్ణము కాదు.

పూర్వరామాయణమంతయు నితిహాస నాయకుడైన శ్రీరాముని చరిత్రముతోడనే యున్నది. ప్రతినాయకభూతుడైన రావణుని వంశవృత్తాంతము, వారి పుట్టుక అందులేవు. రావణుని పుట్టుపూర్వోత్తరములు చెప్పబడక శ్రీమద్రామాయణము సంపూర్ణముకాదు. ఆ విషయము లీ యుత్తర కాండమున నున్నవి. కనుక నీ కాండము యొక్క యవసరము పూర్వ రామాయణమున కున్నది.

ఈ యీ హేతువులను బట్టి యీ యుత్తరకాండమును వాల్మీకి వ్రాసినాడనియే సిద్ధాంతము. కానిచో నీ కాండము నెవరు వ్రాసిరో అతడు నిజముగా నితిహాసస్వరూపస్వభావము లెరిగిన వాల్మీకి యట్టివాడు కనుక వాల్మీకివలెనే గౌరవింపదగినవాడు.

ఆ వ్రాసినదెవరో మనకు తెలియదు గనుక, పూర్వరామాయణమంతయు వాల్మీకి వ్రాసినాడని నమ్ముచున్నాము గనుక, నీ కాండము కూడ నాయనయే వ్రాసినాడని యనుకొనుచున్నచో నష్టము లేదు[1].

1. శ్రీమదాంధ్ర వాల్మీకి వావిలికొలను సుబ్బారావుగారు, ఉత్తరకాండ మంతయు ప్రక్షిప్తమని తోసిపుచ్చుట తగదనియు, వాల్మీకియే దీనిని గూడ వ్రాసెననియు, తొమ్మిది కారణములతో తమ రామాయణమున (మందరము-ఉత్తరకాండము. పుటలు 2, 3, 4) వ్రాసిరి.

# ద్వితీయోన్మేషము

## 1. అంగిరసము

తిక్కన్నగారు రామాయణోత్తరకాండ కథను తెనుగున నిర్వచన కావ్యముగా వ్రాసెను. నిజమునకాయన తనది నిర్వచనోత్తర రామాయణమని యనలేదు. "ఉత్తర రామాయణోక్తియుక్తుడనైతి" (1-11) నని యవతారిక యందును, "ఉత్తర రామాయణంబను మహాకావ్య"మని యాశ్వాసాంత గద్యములందును ఆయన వ్రాసికొనెను. కంకంటి పాపరాజు ఉత్తర రామాయణము వచ్చిన తరువాత తిక్కన్నగారి రామాయణము వేరుగా గుర్తింపబడుటకుగాను నిర్వచనోత్తర రామాయణ మనబడినదని యొక యూహ కలదు. అది నిజమే కావచ్చును. అంతమాత్రమున నంతకు పూర్వ మీ రామాయణమున కా పేరు లేదనలేము. "వచనము లేకుండ" తా నీ రామాయణము వ్రాయుచున్నట్లుగా తిక్కన్నగారే చెప్పుకొనిరి. వచనము లేకుండ ననగా నిర్వచనముగా ననియేగదా! నిర్వచనముగా వ్రాయబడినది నిర్వచనోత్తర రామాయణ మనుటలో విశేషములేదు. మొదటినుండియు దాని కా పేరుండి యుండుననుకొనుటగూడ దోషము కాదు.

తిక్కన్నగారు నిర్వచనముగా వ్రాసిన యుత్తర రామాయణము పూర్తిగా నుత్తరకాండము ననుసరించిలేదు. శ్రీరాముడు కుశలవులకు రాజ విద్యలు చెప్పించుకొనుచు "ధర్మవతి...ధారుణియేలె మహోన్నతి" నన్నంత వరకు వ్రాసి తిక్కన్నగారు తన గ్రంథమును ముగించెను. ఈ ముగింపు ఇతి హాసము యొక్క ముగింపు కాదు. కావ్యము యొక్క ముగింపు. కావ్యమున నాయకుని యైహికజీవితమే ప్రపంచింపబడును. మరియు నాయకుని

మరణమును కావ్యము చెప్పదు. ముఖ్యముగా మన భారతీయ సంప్రదాయము చెప్పదు. శ్రీమద్రామాయణ మితిహాసమని చెప్పబడినదిగదా! అందలి యొక భాగ మీ యుత్తరకాండము. ఇతిహాసమునందలి యొక భాగమును గ్రహించి కావ్యముగా వ్రాయవచ్చునా? వ్రాయవచ్చును. కిరాతార్జునీయాది కావ్యము లట్టివే. కాని వాటికిని, ఈ నిర్వచనోత్తర రామాయణమునకును కొంత భేదమున్నది. ఆ కావ్యములు ఇతిహాస నాయకుని చరిత్రతో నున్నవికావు. నాయకునకు సర్వాత్మనా సహాయపడు అర్జునాదుల కథలతో నున్నవి నిర్వచనోత్తర రామాయణ మట్లుగాక ఇతిహాసనాయకుడైన శ్రీరాముడే నాయకుడుగా నున్నది. ఈ గ్రంథము వ్రాయుటలో తిక్కన్నగారేమి చేసిరనగా శ్రీరాముని ధర్మసంస్థాపనము నందలి ద్వితీయాంశమైన శిష్టరక్షణమును, స్వయముగా ధర్మము నాచరించి లోకమునకు ప్రత్యక్ష నిదర్శనమగుటయును మాత్రమే గ్రహించి అంతవరకు స్వయం సంపూర్ణముచేసిరి. అందువలన నితిహాసము దృష్టి తిక్కన్నగారికి లేదు. ఆయనది కావ్యదృష్టి.

తిక్కన్నగారి యుత్తర రామాయణము కావ్యము. అయినచో నిందలి కథయొక్క ఆద్యంతము లెవ్వి? నాయకుడైన శ్రీరాముని జీవిత మెట్లు నిష్కర్షింపబడినది? శ్రీ రాముడు రాజ్యాభిషిక్తుడగుట కథకు మొదలు. కుమారులను పెట్టుకొని రాజ్యమును సుఖముగా ధర్మనిరతితోనేలె నన్నది తుది. వర్ణాశ్రమధర్మములను సక్రమముగా సంస్థాపించి, లోకాపవాదమునుండి తనను కాపాడుకొనుటకుగాను భార్యను గూడ త్యజించి, ధర్మసంరక్షణార్థము శంబూకుని వధించి, యశ్వమేధముచేసి, సీతా వియోగ దుఃఖమును లోన నణచుకొని, రాజధర్మమును నిర్వర్తించు శ్రీరాముని జీవితమే నిర్వచనోత్తర రామాయణమున నిరూపింపబడినది.

శ్రీ రామునికథ నిట్లు కావ్యమున భావించుటతో తిక్కన్నగారి పరమరమణీయమైన యాంతర్యము కనిపించుచున్నది. "ధీరోదాత్త నృపోత్తముడు రామధరణీపతి సద్వృత్తము సంభావ్యము" (1-11) అని ఆయనయే చెప్పుకొనెను. ధీరోదాత్త నృపులలో నుత్తముడైన శ్రీ రాముని ధరణీపతిత్వము యొక్క సద్వృత్తమును సంభావించుట కొరకీ యుత్తర రామాయణము వ్రాయబడినదని చెప్పినట్లైనది. తిక్కన్నగారి యావాక్యము

జాగ్రత్తగా గమనింపదగినది. శ్రీరాముడు ధీరోదాత్త నృపోత్తముడు. నృపుడనగా నరులను రక్షించువాడు. అట్టి నరపాలకులలో శ్రీరాముడుత్తముడు. అట్టివారైన ధీరోదాత్తులలో నుత్తముడు. ధీరత్వమనగా క్లేశ సహనము. శ్రీ రాముని యందలి క్లేశసహనము మఱియు నుత్తమమైనది. శ్రీరాముడనుభవించిన క్లేశము భార్యావియోగ క్లేశము. అది సాధారణ క్లేశములవంటిది కాదు. అందును శ్రీరాముడా క్లేశమును కావలయునని తానుగా తెచ్చుకొన్నది. ఊరక తెచ్చుకొనలేదు. ఆయన నృపాలుడు. తనచేత పాలింపబడు జనముల యొక్క ఇచ్ఛారూపమైన యభిప్రాయము నెరిగి తదభీష్టము నెరవేర్చు కొరకుగా తెచ్చుకొన్న క్లేశమది. దానిని సహింపగలుగుట ధీరోదాత్త నృపోత్తమత్వము. పైన ధీరశబ్దమునకే యర్థము చెప్పబడినది. ఉదాత్తతయున్నది. అవికత్థనతతోడి కృపాళుత్వము, హర్ష శోకాదుల వలని యనభిభూతత్వము, గుణ్యాదుల మొత్తము. లక్షణము ఉదాత్తత. ఈ ధీరోదాత్తత శ్రీరాముని యందు తిక్కన్నగారెట్లు నిరూపించిరో శ్రీరాముని పాత్రోన్మీలనమున వ్రాయబడును. మరియు పైన నుదాహరింపబడిన తిక్కన్నగారి వాక్యమున ధరణీపతి యని యున్నది. ఆ మాట ఈ యుత్తర రామాయణమున శ్రీరాముని ధరణీపతిత్వమే ప్రధాన విషయమని చెప్పుచున్నది. సీతాపతిత్వము కాదన్నమాట. ధరణీపతి యనగా, అధర్మమార్గమున దుష్టాక్రాంతము కాకుండ ధరణిని రక్షించుచు నడుపులో పెట్టు పురుషుడు. ఆ యర్థమిట్లు వివరింపబడును. ధరణియనగా విశ్వమును ధరించునది. ధర్మమన్నను విశ్వమును ధరించునదియే. ధరణీపతి యనగా ధర్మమునకు పతి. అనగా ధర్మమును రక్షించువాడు. ధర్మస్తుత ద్విధః – వేదమునందే కర్మవిధిగా విహితమైనదో అది ధర్మము. మరియు నది జనులచేత పూని చేయబడుచున్నది. కనుకనే యది ధర్మమైనది. లోకమును ధరించు ధర్మమును రక్షించుట యనగా, నది జనముచేత పూనికతో నాచరింపబడునట్లు చూచుట. లోకమెట్లాచరించును? శ్రేష్ఠులను చూచి యాచరించును. శ్రీరాముడు శ్రేష్ఠుడు. రాజు. అందుకుగాను తానుగా శ్రీరాముడు తన విహితధర్మమును అనగా రాజధర్మమును పూనికతో నాచరించినాడు ఆ యాచరించుటయే శ్రీరాముని యందలి ధరణీపతిత్వ లక్షణము. ఆ లక్షణ మీ నిర్వచనోత్తర రామాయణమున నిరూపింపబడగలదని తిక్కన్నగారు మొదటనే చెప్పిరి.

ధీరోదాత్త నృపోత్తముడైన రామధరణీపతి సద్వృత్తమును సంభావించుటను ముఖ్యముగా నుద్దేశించుట చేతనే తిక్కన్నగారి కావ్యమును "శ్రీరామచంద్రు డిట్లు మహారాజ్యపదస్థుడై" (2-2) అని ప్రారంభించి,

"ధరణి నెందును కాలవర్షము......ధరణి యేలె రాఘవపుంగవుండు మహోన్నతి" (10-160) అని ముగించిరి. అనగా శ్రీరాముడు ధీరత్వ - ఉదాత్తత్వముల కలిమిని యెట్లు ధర్మమును నిర్వహించెనో చూపుటయే ఈ కావ్యము వ్రాయుటలో తిక్కన్నగారి యాంతర్యము ఆ ధీరోదాత్తత్వముల నా శ్రీరాముడు ప్రదర్శించిన సన్నివేశములు పరమౌచితీ పర్యాప్తములుగా నిరూపించుట ద్వారా నా యా గుణములు ప్రతీయమానములు కావలయును ఆ యగుటతో తిక్కన్నగా రుద్దేశించిన కథయైపోకతప్పదు. సీత పాతాళమున కేగుటతో శ్రీరాముని ధీరోదాత్త లక్షణము పరాకాష్ఠను పొందుచున్నది. ఇక కథ లేదు. అందునల్లనే తిక్కన్నగారు, కుశలవులకు రాజవిద్యలు చెప్పించుకొనుచు ధరణి యేలెనని వెంటనే కావ్యమును ముగించినది. ధీరోదాత్త నృపోత్తమునిగా శ్రీరాముని సంభావించి ఈ యుత్తర రామాయణమున తిక్కన్నగారు నిరూపించిరి. ఈ నిరూపణ మంతయు ధర్మానుప్రాణిత మగుటవలన నీ కావ్యమున నంగిరసము ధర్మవీరము.

## అంగిరసము ధర్మవీరము

అసలు రసము వీరము. అందొక ప్రభేదము ధర్మవీరము. దయా, దాన, యుద్ధవీరముల వలె, వీరము ధర్మమునం దభినివేశము కలదియైనచో ధర్మవీరమగును. వీరముత్తమ ప్రకృతికము ఉత్సాహము స్థాయిగా గలది, వీరము. అనుభవమునకు వచ్చిన సుఖదుఃఖములయందు మమత్వబుద్ధి లేకుండుట యుత్సాహము యొక్క పరమమైన గుణము అనగా అవిషాదము - అవిస్మయము - అమోహముగల ప్రవృత్తి యెవనికుండునో వానియం దుత్సాహము, అధ్యవసాయము కలిగి వానిని వీరుని గావించునని తాత్పర్యము. వాని బుద్ధి ధర్మమునందు లగ్నమైనచో వాడు ధర్మవీరుడు.

ధర్మవీర మన్నదానిలో రెండు శబ్దములున్నవి. ధర్మము - వీరము. వీరమనగా, దృఢమైన పట్టుదలతో నొకదానిని సాధించుటకు సర్వాత్మనా

చేయు పురుషకారము. ధర్మము ద్విధాభూతము. సామాన్యధర్మమని – విశేషధర్మమని. సర్వవర్ణ, సర్వ ఆశ్రమములకు సామాన్యములైన ధర్మములు సామాన్య ధర్మములు. వర్ణాశ్రమ ధర్మములు విశేష ధర్మములు ఆపద్ధర్మములు – మోక్షధర్మములు ననునవి మరియొక రకము విశేష ధర్మములు. ఈ యుత్తర రామాయణమున నాయకుడైన శ్రీ రాముడు క్షత్రియుడగుటవలన మరియు రాజగుటవలన, ఆయన ప్రవృత్తి విశేష ధర్మమునందే. అనగా రాజధర్మమునందని. ఒక్క వాక్యములో చెప్పినచో రాజధర్మమంతయు ప్రజలను ధర్మము నతిక్రమించనీయక లెస్సగా రంజింపజేసి రక్షించుట. ఏవం విధమైన రాజధర్మమునం దుత్సాహము కలవానిగా శ్రీరాముని తిక్కన్నగారు నిరూపించిరి. శ్రీరాము డిట్లనినాడు –

“హాని జీవితంబులైన మిమ్మైనను
వలయుచోట విడువవచ్చు గాని
వర్తనంబు గౌరవం బొక యించుక
యైన విడువ దుష్పహంబు నాకు” ౩_12॥

శ్రీరాముడు ప్రాణతుల్యులైన తమ్ములనైనను విడుచునటగాని వర్తనమున గౌరవమొకింతయైనను విడువజాలడట. ఆయన వర్తనమేమి? ప్రజారంజనము – ప్రజారక్షణము. ఆయన ప్రజ రంజించుట నుద్దేశించి భార్యను త్యజించెను. వర్ణాశ్రమధర్మములను రక్షించుకొనుట కొరకు శంబూకుని వధించెను. అశ్వమేధముచేసి దేవతాప్రీతి ఘటించెను. ఇవన్నియు రాజధర్మములే. ఈ యుత్తర రామాయణమున శ్రీరాముని ప్రవృత్తి యంతయు రాజధర్మమునందే. అందువలన శ్రీరాముని యిందలి కథ ధర్మానుప్రాణితమై. కావ్యరసము ధర్మవీరమగుచున్నది.

ఇచట నొక ప్రశ్న పుట్టుచున్నది. ఈ నిర్వచనోత్తరరామాయణమున ధర్మవీరము రసమనియు, ధీరోదాత్తుడైన శ్రీరాముడు నాయకుడనియు చెప్పబడినచో, పది యాశ్వాసముల మొత్తము గ్రంథములో మొదటి యేడాశ్వాసములును (దాదాపు) రాక్షసవంశ ఉత్పత్తి – వికాస వినాశములతో నున్నవి గదా ?

ఆ వివరములన్నియు శ్రీరాముని ధీరోదాత్తతనుగాని, కావ్యరసమైన ధర్మవీరమును గాని స్థాపించుచున్నవా ? అని. ఇది చాల గడ్డు ప్రశ్న.

నిర్వచనోత్తర రామాయణముయొక్క కావ్యత్వము విచారింపబడుచో నీ ప్రశ్నకొక పరిష్కార మార్గము సూచింపబడును.

## 2. రెండు లఘుకావ్యముల సంపుటి

తిక్కన్నగారు తనది మహాకావ్యమనియే ఆశ్వాసాంత గద్యముల యందు వ్రాసికొనెను. కావ్య, మహాకావ్య, ప్రబంధ, మహాప్రబంధ శబ్దములు మొదటినుండియు నొక నిర్దిష్టార్థమున నుపయోగింప బడుటలేదు. ఈ 'మహా' యన్నది విస్తృతికి సంబంధించినదిగా తోచుచున్నది. అష్టాదశ వర్ణనములుండుట మహాకావ్యలక్షణమన్నచో, నగరాది వర్ణనములు వ్యస్తముగా వ్రాసి ఒకచో చేర్చినపుడు మహాకావ్యమగుట లేదు. కావ్యము నగుటలేదు. ఆ యన్ని వర్ణనములును నొక కథ నాశ్రయించుకొని యున్నపుడు కావ్యమన్న వ్యవహారము కలుగుచున్నది కనుక కావ్యత్వము వర్ణనల మీద కాక కథమీద నాధారపడి యున్నది. అష్టాదశవర్ణనలు గాని, ఇరువది నాలుగు వర్ణనలుగాని కావ్యమునకు మూలమైన కథావస్తువు విస్తరించు విధానమును సూచించుచున్నవి. కావ్యమున కథ విస్తరించిన కొలది ఆ యా వర్ణనలు ప్రసక్తిని కల్పించుకొనును. కనుక కావ్యమునకు ముఖ్యముగా కావలసినది కథ. ఆ కథార్థము ఘటితపూర్వాపరమై యుండవలయును. అనగా కావ్యమున కథ మొత్తమొక యేకకావ్యత కొదిగి యుండి, ఒక రసముచేత నిర్భరము కావలయును.

నిర్వచనోత్తర రామాయణమున నాయకుడు శ్రీ రాముడు గనుక కథ యంతయు వానిని చుట్టుకొనియే యుండవలయును. మొదటి యేడాశ్వాసములలోని కథ శ్రీరాముడగస్త్యుని వలన వినినది. అది రాక్షసవంశ కథ. తరువాత యాశ్వాసములలో నున్నది శ్రీరాముని కథ కావ్యమునకు కావలసినది నాయకుని మనోధర్మము ననుసరించి, అది దాని కననుకూలము లైన భావములచేత తాడితమయ్యును స్థైర్యము కోలుపోక, ఒడుదుడుకులకు లోనయ్యును తిరిగి నిలువ ద్రొక్కుకొనుచు నెట్లు గమ్యమును చేరుచున్నదో నిరూపించుట. అనగా నాయకుని మనోవాక్కాయ కర్మములవలన ఉద్దిష్టార్థమును వ్యజ్యమానము చేయుటయందు శ్రద్ధతీసికొనిన కవి కర్మ కావ్యమగుచున్నది. నిర్వచనోత్తర రామాయణము కావ్యమైనచో నంతయు

శ్రీరాముని మనోవాక్కాయ కర్మకలనమై యుండవలయును చివరి మూడాశ్వాసములు నిస్సందేహముగా శ్రీరాముని మనో వాక్కాయకర్మ కలనయే. మరి మొదటి యేడాశ్వాసములు ప్రధానముగా రావణుని మనోవాక్కాయకర్మలను ప్రపంచించి చూపుచున్నవి. ఆయాశ్వాసముల యందలి వస్తువు శ్రీరామునిచేత వినబడుట తప్ప శ్రీరామునకు విశేషము గాను సంబంధించినవి కావు. భారతము జనమేజయునకెట్టిదో నిర్వచనోత్తరరామాయణమున మొదటి యేడాశ్వాసముల యందును శ్రీ రాముడు అట్టివాడు. తన తాత ముత్తాతల కథను జనమేజయుడు విన్నట్లుగా, తన చేత చంపబడిన రావణుని యొక్కయు వాని పుట్టు పూర్వోత్తరములయు కథ శ్రీరాముడు వినినాడు. భారతమునకు జనమేజయు డెట్లు నాయకుడు కాజాలడో అట్లే మొదటి యేడాశ్వాసములకును నిర్వచనోత్తర రామాయణమున శ్రీరాముడు నాయకుడు కాజాలడు

నిర్వచనోత్తర రామాయణము నందలి మొదటి యేడాశ్వాసముల కథకును నాయకుడు రావణుడు. చివరి మూడాశ్వాసములకును నాయకుడు శ్రీరాముడు రావణ నాయకమైన కథ కొంత, రామనాయకమైన కథ కొంత నిర్వచనోత్తర రామాయణమున నున్నట్లు ఇద్దరు నాయకుల నాశ్రయించుకొని రెండు కథలతో నున్న యీ గ్రంథమునకు యేకవాక్యతగాని, ఒక రసముగాని యుండదు. ఏకవాక్యతకగుచున్న నొక కథతో, నొక రసముతో, నిర్భరము కాని యీ గ్రంథము కావ్యము కాజాలదు. కావ్యమే కాజాలని గ్రంథమునకు మహా కావ్య ప్రసక్తియే లేదు. కనుక నిర్వచనోత్తరరామాయణము మహా కావ్యము కాదు. ఒక ప్రధానఫలమును సాధించుట నభిలషించిన నాయకుని చిత్తవృత్తి రూపమైన కథా వస్తువొకటి నిర్వచనోత్తరరామాయణమున సంధి సంధ్యంగ విన్యాసము కలిమిని నిర్మింపబడలేదు గనుక నదిమహా కావ్యము కాజాలదు.

నిర్వచనోత్తర రామాయణము నందలి పూర్వోత్తర భాగములు దేనికదిగా నొక నాయకపురుషుని చుట్టుకొని యేకవాక్యత కగుచున్నవి*.

* హనుమజ్జన్మవృత్తాంతము లెక్కలోనికి తీసికొనకుండ పూర్వభాగము ప్రస్తుతము గ్రహింపబడినది.

అందువలన రెండు లఘుకావ్యముల సంపుటిగా నీ తిక్కన్నగారి యుత్తర రామాయణమును సంభావింపదగును. అపుడు పూర్వభాగము రావణనాయకము. రావణుడు ధీరోద్ధతుడు ఉత్తరభాగము శ్రీరామనాయకము. రాముడు ధీరోదాత్తుడు. ఈ యుత్తరబాగమే ఉత్తరరామాయణ శబ్ద వాచ్యము. ఈ యుద్దేశముతోడనే నితః పూర్వము తిక్కన్నగారు శ్రీ రాముని యుత్తరకథాప్రపంచాశికను సంభావించిన రీతియు, అంగిరసము విషయమును వ్రాయబడినది ఇపు డిట్లనవచ్చును. ఒక గ్రంథమున నున్న ఏ రెండుమూడాశ్వాసములనో గ్రహించి నాయకనిర్ణయము, రసనిర్ణయము చేయవచ్చునా ? అట్లయినచో నొక గ్రంథమున నొకనికి నచ్చిన యే యొక ఘట్టమునో పట్టుకొని యాగ్రంథముయొక్క అంగిరసము విషయమున నిర్ణయము చేయవచ్చునుగదా ? నిజమున కీ రెండు పద్ధతులును మంచివికావు. ఈ రెండవదానికంటె మొదటిది కొంత నయము. ఏదో కొంత కథను పట్టుకొని, ఏతన్నిర్వహణమును పట్టుకొని, అందలి నాయకుని, ప్రతీయమానమగు రసమును పర్యాలోచనచేసి చెప్పబడుచున్నదికదా ! అందువలన నాపద్ధర్మముగా నట్టిపని చేయవచ్చును. అయినచో నుత్తర భాగమునే యేల ప్రధానముగా గ్రహింపవలయును ? మొదటి యేడాశ్వాసములనే ప్రధానముగా గ్రహించి నిర్వచనోత్తర రామాయణము రావణ నాయకమనరాదా యనవచ్చును కాని యనరాదు. ఏమనగా తిక్కన్న గారు, ధీరోదాత్త నృపోత్తముడైన రామధరణీపతి సద్వృత్తమును సంభావ్యమనియే తానీ యుత్తర రామాయణము వ్రాయుటకు పూనుకొని నట్లు స్వయముగా చెప్పుకొనెను. కవియొక్క ఆంతర్యము స్పష్టముగా తెలియవచ్చుచున్నప్పుడు తద్విపరీతముగా గ్రంథమును వ్యాఖ్యానింపరాదు. అయినచో తన యాంతర్యమున ననుకూలము కాని రావణోదంతమును నంత విపులముగా నేడాశ్వాసముల గ్రంథముగా నేల వ్రాసెనన్న ప్రశ్నయు పుట్టును.

దీనికి వచ్చు సమాధానమంత సంతృప్తికరముగా నుండదు. అయినను నొక సమాధానము నిట్లూహింప వచ్చును రావణోదంతము గ్రంథ విస్తరమై విపులముగా కనిపించుచున్నది. కాని కాలముమీద విస్తరించ లేదు అగస్త్యుడు శ్రీరామున కా రాక్షసవంశ వృత్తాంతమంతయు నొక కొన్ని గంటలలో చెప్పెను. ఉదయము శ్రీరాముని దర్శించుట కగస్త్యుడు

ఋషులతో కూడి వచ్చెను. మధ్యాహ్నమగు వరకు శ్రీరామునియొద్ద నుండి రాక్షసవంశ చరిత్ర చెప్పెను. ఈ సమయ సూచిక తిక్కన్నగారు చేసిరి. అగస్త్యుడు చెప్పిన దంతయు విని శ్రీరాము డిట్లనెను.

"మునిలితిరి విచిత్ర కథా
రసప్రవృత్తిం దడవెరుంగరాక యనుష్ఠా
నసమయమయ్యె నభోమ
ధ్య సమీపంబునకు దరణి యరుగుచు వచ్చెన్." 7 - 114

మూలమునం దీ సూచనలేదు. అగస్త్యాదులు వెళ్లిపోయిన తరువాత సూర్యాస్తమయమైనదని యందు చెప్పబడినది.[1] అనగా మూలమున దాదాపు దినమంతయు నీ రాక్షసవంశవృత్తాంతము చెప్పబడి నట్లర్థమగుచున్నది. తిక్కన్నగారు దానిని మరియు తగ్గించి రెండు మూడు గంటల వ్యవధిలో చెప్పబడినట్లు సూచించి. తిక్కన్నగారు స్వయముగా చేసిన యీ మధ్యాహ్న సమయ సూచనను బట్టి, ఈ గ్రంథవిస్తృతి కొంత యపార్థమును కలిగించునని యాయనకే తోచి, అది యంత ప్రధానము కాదు—ఏదో నాడు రెండు మూడు గంటలలో ముగిసిన విషయమది—అని ఆ యపార్థమును తొలగించుట కాయన యత్నించిన వైన మూహింపబడుచున్నది. తరువాతి శ్రీరాముని వృత్తాంతమే బహుకాలవిస్తృతిమీద వరచుకొని యున్నది. అందువలన తిక్కన్నగారి యాంతర్యము దానివలన చెడలేదు. కాని రావణాక్షేపముల గ్రంథ మనగనే ప్రధానముగా కొట్టవచ్చినట్లు కనిపించుచున్నది.

నిజమునకది ప్రధానము కాదు. గ్రంథము విస్తారముగా నున్నందున నా పూర్వభాగము రావణనాయకముగా పరామర్శించుట లెస్స. అందువలన పూర్వోత్తరభాగముల విభజన మంగీకరింపవలయును. అపుడు నిర్వచనోత్తర రామాయణము రెండు లఘుకావ్యముల సంపుటి యగును.

అంత ప్రధానముగాని, ఒక రెండుమూడుగంటల వ్యవధిలో చెప్పబడిన విషయమునకు ప్రాధాన్య మంటగట్టి, నిర్వచనోత్తర రామాయణము రెండు లఘుకావ్యముల సంపుటి యనుట యేల? మొత్తము శ్రీరామ

1. ఉత్తరకాండము. సర్గ. 36. శ్లో. 66.

నాయకమైన యొక కావ్యమనియే యేల యనరాదు? అనవచ్చును. అప్పుడు మరల నా యేడాశ్వాసముల గ్రంథము శ్రీరాముని ధీరోదాత్తత కెట్లుపస్కారక మగుచున్నదన్న ప్రశ్న వచ్చును. అట్టి వంశమున పుట్టిన యట్టి రావణుని సంహరించినాడన్న దొక్కటితప్ప శ్రీరాముని విషయమున నాయకత్వము మరేమియు నగుటలేదు మరియు శ్రీరాముని యా గొప్పతనము పూర్వరామాయణమునకు సంబంధించినదిగాని యుత్తరరామాయణమునకు సంబంధించినది కాదు. ఊరక శ్రీరాముడు వినిన రాక్షసవంశకథ యేడాశ్వాసములలో వ్రాయబడిన దనుకొనవలయును అప్పుడు కూడ చివరి మూడాశ్వాసములవలననే నిర్వచనోత్తర రామాయణమునకు కావ్యత్వము సిద్ధించుచున్నది గాని మొదటి యేడాశ్వాసములవలన సిద్ధించుటలేదు నిర్వచనోత్తరరామాయణము కావ్యమనదలచుకొనినచో చివరి యాశ్వాసముల యందలి శ్రీరాముని ధీరోదాత్తప్రవృత్తిని బట్టి యనవచ్చును. మొదటి యేడాశ్వాసముల గ్రంథమును వృథాయగుచున్నది, అంత గ్రంథమును వృథాచేయుట మంచిదికాదు. అందువలన రెండు లఘుకావ్యముల సంపుటిగా యంగీకరించి పూర్వోత్తరగ్రంథములను వ్యస్తముగా రావణ శ్రీరామ నాయకములుగా పరామర్శించుట యుచితము. అయినచో పూర్వభాగమునకు రావణుడు నాయకుడు. రసము రౌద్రము—లేక రౌద్రస్ఫూర్తి కలిగిన యుద్ధవీరము.

## 3. పూర్వభాగము - రావణ నాయకము

### రౌద్రస్ఫూర్తి గలిగిన యుద్ధవీరము రసము

నిర్వచనోత్తరరామాయణము నందలి పూర్వభాగమనగా స్థూలముగా ద్వితీయాశ్వాసము నుండి సప్తమాశ్వాసము వరకు ప్రథమాశ్వాసము అయోధ్యావర్ణనము మొదలగువాటితో నున్నందున నది శ్రీరామునకు సంబంధించినదే యగుచున్నందున రావణనాయకముగా చెప్పబడు నీపూర్వభాగములో లెక్కకు తీసికొనబడలేదు. హనుమజ్జన్మవృత్తాంతమును గూడ నిందు చేర్చకుండ స్పష్టముగా చెప్పినచో ద్వితీయాశ్వాసము 17 వ పద్యము నుండి సప్తమాశ్వాసము 93 వ పద్యము వరకు రావణుని చుట్టుకొని సాగిన రాక్షసవంశచరిత్ర రూపమున నున్నది పూర్వభాగము

రావణుడు ధీరోద్ధతుడు. మాయాపరత్వము – [illegible]ంపిత – చపలత్వము – అహంకారము – దర్పము – ఆత్మశ్లాఘ – నిరంతరము మెప్పు [illegible] దుండునో వాడుద్ధతుడు. రావణు డధికముగా [illegible] మోగుణ ప్రధానుడు. [illegible] మోగుణము మోహాత్మకము వాని తల్లి కైకసి సంతానేచ్ఛ [illegible] పట్టి యసురవేళ. తరువాత రావణుడు తన సోదరును చంపజాల నట్టి వరమును బ్రహ్మవలన పొంది మరియు మరు సెక్కినాడు. ఈ విరువురికిని [illegible] స్వభావమైన మోహావేశము కలిపిని రావణుడు ప్రవృత్తుడు [illegible] సర్వ విషయములను తెలిసి వాని చరిత్రమైనది. రావణుని [illegible] లో ముఖ్యాంశములు రెండు ఒకటి తానే పిరుచనన్నది లోకము [illegible] వలయుననన్న స్పృహమైన యిచ్ఛతోడి ప్రవృత్తి. రెండవది స్త్రీ విషయికమైన సుఖము విధి నిషేధములకు సంబంధ నిష్టానుసారము ననుభవించుట [illegible] గన మగటిమికి చాల తార్థ్యమన్న ప్రవృత్తి మొగటిదాని కంటె [illegible] మరియు చెడ్డది ఈ రెండవదానియుంఎలి ప్రవృత్తిని బట్టియే రావ[illegible] మొదటిదాని యందును విజయము లభింపలేదు అనగా దీని వలననే [illegible] యశ్లైనదనుట కాదు గాని, వాని మరణమునకు దారి తీసినది మాత్రము రెండవ గుణమేనని చెప్పుట తాత్పర్యము.

రావణుని యందు చెప్పబడిన యీ రెండు గుణములకు [illegible] మైన పదార్థము వాని ఉన్మాదహృదయము. ఉన్మాద హృదయుడుగా రావణుడు పుట్టినాడని తిక్కన్నగారు వ్రాసిరి*

రావణుని యీ ఉన్మాదహృదయమున మొట్టమొదటిసారిగా కలిగిన భావవికారము మత్సరము. దాని ననుసరించి యుత్సాహము పుట్టినది. రావణుడు చిన్నవాడుగా నున్నపుడు కైకసి, ఒకనాడు ధనదుడు తండ్రి యొద్దకు వచ్చి పోవుచుండగా వానిని చూపి కుమారునితో "మీ రొక్కని పుట్టి శ్రీతేజములం దతడట్లుగ నీ విట్లతిహీనతనున్న పురుషు డంద్రుడనిన్ను ?" (8-60) అని యనినది. ఆ మాటకు, ధనదుని చూచిన రావణుడు "మాత్సర్యంబు చిత్తంబునం దనరంగా నుత్సాహంబు వాటించి" (8-61) వానిని మించెదను లెమ్మని తల్లితో ననినాడు. అంతకు పూర్వము తిక్కన్నగారు

* 8 - 55. ఉన్మదమగు హృదయంబుగల తనయునిం గాంచెన్.

రావణుని చిత్త వికారము ఏమియు చెప్పలేదు వాని చిత్తమున పొడమిన మొదటి వికారమే మాత్సర్యము. ఇకవాని జీవితమంతయు నట్లే దాని మీద సాగినది అట్లు సాగుటకు మాత్సర్యముతో పాటు ఉత్సాహము కూడ పుట్టుట మూలము.

ఆ యున్మదహృదయమున పుట్టిన మాత్సర్యము తోడి యుత్సాహము వలననే శిరస్సులు నరికి హోమముచేయుచు బ్రహ్మను గూర్చి తపించి, మరణము తనకు రాకుండ వరమును బొందినాడు. వాని మానవులు లోక లెక్కలోనివారు కారు. అందువలన మానవులను వదలి మిగిలిన యే జీవివలనను, మరి దేనివలనను కూడ మరణము లేకుండ వరమడిగినాడు మానవులు తనను చంపలేరని వాని నమ్మకము. అంతవరకు బాగుగనే యున్నది - అనుజులతో శ్లేష్మాతక వనమున రావణుడుండగా సుమాలి వచ్చినాడు. సుమాలి రావణునకు తాతగారు. తాము వెనుక దేవతలవలన పడిన పాట్లు మనుమనికి చెప్పినాడా సుమాలి. లంకానగరము ముందపహరించుట యుక్తమనియు బోధించినాడు. తల్లిమాటవలన మత్సరయుతుడై ప్రచండమైన తపముచేసి యుద్ధతుడైనాడు రావణుడు. ఈ మాతామహుని బోధ వలన నికనా యుద్ధతితోడి ప్రవృత్తి ప్రారంభమైనది. లంకను స్వాధీనము చేసికొనినాడు దిగ్విజయము చేయుటకు బయలుదేరినాడు రావణు డోడిన దొక్క కార్తవీర్యార్జునునకు,వాలికి మాత్రమే. మిగిలిన యందరిని రావణుడే యోడించెను

రావణుని మోహాత్మకమైన తమోగుణప్రవృత్తిలోని చమత్కారమేమనగా వెనుక తనుపడిన యవస్థను, ముందు చేయబోవుదాని విషయమున స్మరింపకుండుట కార్తవీర్యుని చేతిలోపడి యెందుకును పనికిరాకుండ బోయినాడు గదా! తిరిగి వాలిమీదికి పోవుటయేల? వాని జీవితలక్షణమే యది దుష్టబుద్ధితో ప్రవర్తించగా వేదవతి "పునరుద్భవమయ్యేద నీకు మృత్యువై" (5-19) అని ప్రాణములు త్యజించినది అంతకుముందామె తపము పేర్మికి భయపడినాడు కూడ రావణుడు. సాధారణ బుద్ధియైనచో నిక స్త్రీల జోలి పెట్టుకొనడు. కాని రావణునిది యసాధారణబుద్ధి. లోకమునందలి స్త్రీల నందరను చెరబట్టినాడు రంభను బలాత్కరించినాడు అది వాని స్వభావము. ఇవి రావణుడు చేసిన పనులు

ఇంతకును రావణుడు ప్రకటించినది వీరమగునా? లేక రౌద్రమగునా యని ప్రశ్న. వీరమనుటకంటె రౌద్రమనుట మంచిది. ఏమనగా వీరమును ప్రదర్శించు నాయకుని మనోలక్ష్యము తను సాధింపబోవునది పరమోత్కృష్టమై లోకోత్తరముగా నుండునట్లు చూచుకొనును. ఒక విధముగా చూచినచో ప్రతి పనియందును స్వార్థముండక తప్పదు కాని యొకడు లోకశ్రేయోదాయకమైన కార్యమును, తనకు కీర్తిప్రతిష్ఠలు రావలయుననియే చేసినను, ఆకార్యము యొక్క లోకోత్తరత ముందు వాని స్వార్థము పరార్థమగును. వాడుచేసిన కార్యమే గణనీయమగును. వీర మట్టిది అది యుత్తమప్రకృతికము. రౌద్ర మట్టి ప్రకృతికము కాదు. రావణాసురుడు తానుగా కల్పించుకొని యందర మీదకు దండెత్తినాడు కుబేరుని మీదికి దండెత్తుటకు హేతువు, ఆయన దూతను పంపించి, నాయనా! నీవు చేయుపనులు కీర్తిదములుకావు – మునిజనములను దుర్దశపాలు చేయుట – అప్సరోవనితల నార్తిపెట్టుట – దేవలోకము మీద విరుచుకొని పడుట – ఇవన్నియు మంచి పనులు కావు – అని చెప్పించుట. మధునిపై దాడి వెడలుటకు హేతువు, రావణుడూరలేని కాలమున వచ్చి వాడు కుంభీనసి నెత్తికొని పోవుట. అందువలన వాని మీదకు పోవచ్చును తనయంతటివానికి బుద్ధులు చెప్పుటకు కోపపడిన క్రోధముతో ధనదుని మీదకు కూడ పోవచ్చును. మిగిలిన దండయాత్రలకేమాత్రము కారణములు లేనే లేవు. ఊరక చేతుల తీటకొద్ది పోయినాడు. ఇవన్నియు వీరుని లక్షణములు కావు పరశురామాశ్వత్థామలు వీరులే యయ్యును వారి కృత్యములు రౌద్రములే యైనవి[1]. ఆ లెక్కలో రావణుని కృత్యములును నంతే.

మొట్టమొదట ధనదుని చూచి తల్లి తనతో నన్నమాటను బట్టి మత్సరము పుట్టినది మాత్సర్యము రౌద్రమునకు విభావము. రావణునకది స్వభావము. రావణుడు సర్వదేవతలను పీడించుటకు హేతువు నూహించినచో నది పూర్వము తన తాతలను వారు వేధించిరన్న క్రోధమే యగుచున్నది. రౌద్రమునకు క్రోధమే స్థాయి. రౌద్రమునకే తాడన పీడన పాటన చ్ఛేదన సంప్రహారాదులు కర్మలు. మూలములో రావణుడు వాటి యన్నింటియందును

1. నాట్యవేదము. పుట 228.

ప్రవృత్తుడు పైగా రావణునిది రక్షోజాతి. ఈ యన్నింటిని బట్టియు రావణుని కృత్యములు రౌద్రములే యగుచున్నవి. లేనిచో క్రోధాతిశయము కలిగిన తామస ప్రవృత్తి ప్రదర్శించిన యుద్ధవీర మనవలసివచ్చును - అట్లన్నను నది రౌద్రమేయగును. కనుక నిర్వచనోత్తర రామాయణ పూర్వ భాగమున రసము రౌద్రము. కానిచో రౌద్రస్ఫూర్తి గలిగిన యుద్ధవీరము.

## 4. వీరము - ధర్మవీరము

దాన, ధర్మ, యుద్ధములన్న అవాంతర భేదములతో వీరరసమును భరతుడు నాట్యశాస్త్రమున ప్రస్తావించెను[1]. దయా వీరమన్న నాల్గవ భేదము తరువాత కల్పింపబడినది. పండితరాయలు సత్య, పాండిత్య, క్షమా, బల, వీరములన్న మరి నాల్గవాంతర భేదములను కల్పించి మొత్తము యెనిమిది యవాంతర భేదములను వీరరసము విషయమున నంగీకరించినట్లు కనిపించు చున్నది భరతుడు మూడవాంతర భేదములను చెప్పినప్పటికిని, కొంచెము సూక్ష్మముగా విచారించినచో దానము, ధర్మమునం దంతర్భవింపనంత పృథగస్తిత్వము కలది కాదని తెలియగలదు. అపుడు ధర్మవీరము-యుద్ధవీరము - అని రెండు విధములుగనే వీరరసముండును. ముందు వీరరస స్వరూపము కొద్దిలో చెప్పబడును.

ఉత్సాహాత్ అధ్యవసాయాత్ అవిషాదిత్వాత్ అవిస్మయా
మోహాత్ వివిధా దర్థ విశేషాత్ వీరరసో నామ సంభవతి[2]

వీరరసమును గూర్చి భరతుడు చెప్పిన విషయమిది వీరమునకు స్థాయి ఉత్సాహము. ఉత్సాహమనగా ఆస్థ. అనగా ప్రవృత్తి రూపమైన చిత్త వృత్తి ఏవంవిధమైన చిత్తవృత్తి లక్షణము కలవాడు వీరుడు అధ్యవసాయ మనగా ఆ క్రియా పరిసమాప్త్యంతమగు నెడతెగని ప్రయత్నము. అనగా దేనియందాస్థయున్నదో అది సాధ్యమగువరకు విడువని పూనిక యని యర్థము. మొదలుపెట్టబడిన కార్యము ఫలప్రాప్తి పర్యంతము కొనసాగింపబడకపోవు

---

1. నాట్యశాస్త్రము. పుట 211.
2. నాట్యవేదము. పుట 226.

టకు గల చాల కారణములలో విషాదము, విస్మయము, మోహము, అన్నవి ప్రధానములు. కార్యము తుద నెగ్గించుట వీరుని లక్షణము. అందువలన భరతుడు వీరరసమును గూర్చి చెప్పుచు నా మూడింటి యభావమును పేర్కొనెను. అన్యత్ర ప్రవృత్తి లేని దుఃఖరూప చిత్తవృత్తి విషాదము. అన్యత్ర ప్రవృత్తి లేని యనగా స్తబ్ధమైన, ప్రశాంతమైన యని యర్థము. వీరము ప్రవృత్తి రూపము. అందువలన పరిస్థితి ననుసరించియు సూత్రకారుడు చెప్పెను.

అనగా వీరుడు దేశకాలములు ప్రతికూలములైనను కలిసిరాని దుఃఖము సంప్రాప్తించినను, దానిని వీరుడు తన ప్రవృత్తి ప్రతిబంధము కానీయక చేసికొనవలయును అనగా దానిని దిగమ్రింగవలయును. అదియే యవిషాదిత్వము. ధర్మవీరుడైన శ్రీరామునకు సీతా వియోగదుఃఖము సంప్రాప్తించినది కాని యది ప్రజారంజన, రక్షణాది రాజధర్మ నిర్వాహణమున శ్రీరాముడు ప్రవర్తించుట కాటంకము కాలేదు. ఆ దుఃఖము నణచుకొని యాయన ప్రవర్తించినాడు. అదె యవిషాదిత్వము. అన్యత్ర ప్రవృత్తి కాటంకముకాని దుఃఖమనగా కలిగిన దుఃఖమును లోపల నణచుకొనుట. విస్మయమనగా నలోకసామాన్య విషయదర్శన శ్రవణములవలన నుత్పన్నమగు సుఖరూప చిత్తవృత్తి. సుఖానుభవరూప చిత్తవృత్తియైనది అన్యత్ర ప్రవృత్తి లేనిదే. వీరునకు అవిస్మయము కావలయును శ్రీరామునకు కుశలవులు తన కుమారులని తెలియుటయు, వారు ప్రత్యక్షముగా నుండుటయు విస్మయహేతువులు. శ్రీరాముడా సుఖరూప చిత్తవృత్తిని కూడ దుఃఖము నెట్లో అట్లే వెలికిరానీయలేదు. రానీయక వారితో కలిసి రాజ్యపరిపాలన చేసినాడు. అది వీరుని లక్షణము. మోహమనగా చిత్తము స్వాస్థ్యమును కోలుపోవుట. చిత్తమట్లగుటకు హేతువులు భయము, వియోగము. వీరము నిర్భయము. వియోగమున క్రుంగిపోనిది. అందుకని అమోహము సూత్రమున చెప్పబడినది.

వీరము ప్రవృత్తి రూపము. ఆ ప్రవృత్తియే ఉత్సాహము. విషాద, విస్మయ మోహాదులు ప్రవృత్తి కాటంకములు. అవి చిత్త వికారములగుట వలన, వాటి ప్రాదుర్భావమే లేకుండుట కష్టము. అందువలన వీరుడు తన ధ్యేయమునందలి ప్రవృత్తిని యవి యడ్డకట్టకుండ మాత్రము చూచుకొనవల

యును ఈ ప్రకరణమున నింతకు మునుపు చెప్పబడిన యుభావశబ్దమున కిదియే యర్థము. మొదట యుత్సాహము, పూనిక సఫలమగువరకు విర మించని దృఢమైన పట్టుదల – అదే అధ్యవసాయము, మధ్యమధ్య సంప్రా ప్తించెడు విషాదవిస్మయాదులను వెలికుబ్బనీయక లోనడచుకొని ధ్యేయము నందు ప్రవృత్తుడగుట, వీరుని లక్షణము. ఏవంవిధ లక్షణలక్షితుడు శ్రీరాముడు. రాజధర్మమునందు బద్ధబుద్ధియై ధర్మవీరుడైనవాడు — ఇసం తయు నిర్వచనోత్తరరామాయణమునందలి యుత్తరభాగమునకు సంబంధిం చిన విషయము

ధర్మవీర మాదర్శప్రధానము. లోక సంగ్రహైక తత్పరత గలిగిన వీరపురుషుల ప్రవృత్తి ధర్మవీరము. ఐహికమైన స్వార్థమున పర్యవసింపని ఫలము గలిగినట్టియు, సంఘ దేశహితైకా పాదకమైనట్టియు ధర్మకర్మల యందు ప్రవర్తించు చిత్తవృత్తిగల పురుషుడు ధర్మవీరుడు. ధర్మమనగా శ్రుతి, స్మృతి, ఇతిహాస పురాణాదులు విశ్వముయొక్క శ్రేయస్సుకొర కే యే కర్మలు చెప్పినవో వాటి మొత్తము స్వరూపము విశేషధర్మ ములలో రాజధర్మము శ్రేష్ఠమైనది. రాజు ధర్మస్వరూపుడు. ధర్మము యొక్క స్థితికి రాజు మూలము. రాజు పురుషులలో శ్రేష్ఠుడు శ్రేష్ఠుని ననుసరించి లోకముండును. కనుక రాజు ధర్మమునందు ప్రవృత్తుడు కావల యును. ఆ ప్రవృత్తి లక్షణము తిక్కన్నగారిచేత నిర్వచనోత్తర రామా యణమున శ్రీరాముని విషయమున నిరూపింపబడినది. శ్రీరాముని పాత్రో న్మీలనము విధానము వ్రాయుచో నీ విషయమే సోదాహరణముగా నిరూ పింపబడును.

## యుద్ధవీరము - రౌద్రము

వీరముత్తమ ప్రకృతికము[1]. తత్ప్రభేదమే గనుక యుద్ధవీరము ను త్తమ ప్రకృతికమే. రౌద్రలక్షణములైన క్రోధ, పిశున, ఉద్ధత, కలహ ప్రియాదులన్నియు నధమప్రకృతి కలవారివి[2] యుద్ధ వీరమున ధర్మా

1. నాట్యశాస్త్రము. పుట 208.

2 నాట్యశాస్త్రము. పుట 708.

ధర్మములవిచారణ మున్నది. శోకము లేదు. సంగ్రామ సంప్రహార ములు రెండింటియందున్నను యుద్ధవీరము తత్కాలమున సత్త్వగుణ సంగ ప్రాప్తిగన రజస్సునుండి యభివ్యక్తమగుటయు, రౌద్రము సత్త్వగుణ విహీన ములనణచిన తమస్సునుండి వెలివచ్చుటయు. కారణముగా నా రెండింటి కిని భేదము సూచింపబడుచున్నది. వీరమున కుత్సాహము మూలము. రౌద్రమునకు క్రోధము మూలము. స్వార్థము పర్యవసింపని లోకహితైకసా పేక్ష చిత్తవృత్తి ఉత్సాహమునకు మూలము. క్రోధమునకు కామము మూలము. తన యనుభవమునకు కాని దానిని, కావలయునని కోరుట కామము. తనకు లేక నితరులకున్న దానిని, వారికి కాకుండా తనకు కావలయు నని కోరుటగాని, దానిని వారిని మించి తాను పొందవలయునని గాని కోరు టయు కామమే. మొదటి దానికంటె ఇది మరియు దుష్టము. ఇది మాత్సర్య రూపకామము. నిర్వచనోత్తరరామాయణము రావణుని కామ మీ విధ మైనది. దీనినుండి సహజముగా నావిర్భావమగునది క్రోధము. క్రోధము గలవాని కృత్యములు రౌద్రములు. రావణుడు క్రోధము వలన ప్రవర్తించి నాడు. అందువలన వాని కృత్యములను వర్ణించిన పూర్వభాగము రౌద్ర రస పరిప్లుతము.

రావణుడు రాక్షసుడు గనుక అంగజ, స్వభావజ రౌద్రములు రెండును వాని నాశ్రయించి సహజముగా నున్నవి. "రాక్షసీవృత్తి కలవారు శృంగా రము సేవించినను ప్రసభముగ బలాత్కరించి సేవింతురు[1]" అను భరత మతానుకూలముగనే రావణుని రంభాసంభోగము తిక్కన్నగారిచేత వర్ణింప బడి యుండుట మూలమున, రావణుని విషయమున రౌద్రమునే నిరూపించ దలచుకొనినట్లు స్పష్టపడుచున్నది. అందువలన నిర్వచనోత్తర రామా యణము పూర్వభాగమున రౌద్రమేరసమని నిశ్చయింపవచ్చును. అధికముగా రావణుని యుద్ధయాత్రలు వర్ణింపబడినను, రౌద్రమునకు కూడ యుద్ధ ముండుటకు వీలున్నది గనుక బాధలేదు. కానిచో రౌద్రస్ఫూర్తి గలిగిన యుద్ధవీరము రసమనవలయును. ఇట్లనుకొన్నందున ప్రయోజనమేమనగా నిర్వచనోత్తర రామాయణము మొత్తముమీద వీరరసమనియు, అందు

1. నాట్యవేదము. పుట 228.

పూర్వోత్తర భాగములు క్రమముగా యుద్ధవీర, ధర్మవీరముల నాశ్రయించి యున్నవనియు, తిక్కన్నగారు వీరరసము యొక్క ప్రధాన ప్రభేదముల నొక గ్రంథమున నిర్వహించి చూపినారనియు ననుకొన వీలగును. యుద్ధ వీరము నందొక దశలో రౌద్రస్ఫూర్తి కలుగక తప్పదు. అట్టి స్ఫూర్తియే నిర్వచనోత్తర రామాయణమున పూర్వభాగము నందున్నదనియు ననుకొన వచ్చును - రావణుని పాత్రచిత్రణము పరిశీలింపబడుచో సోదాహరణముగా నీ యీ విషయములు సూచింపబడగలవు.

# తృతీయోన్మేషము

## 1. పూర్వభాగము - మూలానుసరణ విధానము

శ్రీరాముని సందర్శించుటకై వచ్చిన అగస్త్యాది మునులు రాక్షసులందరికంటెను బలపరాక్రమములుకలవాడుగా నింద్రజిత్తునాబడు మేఘనాదుని ప్రశంసించినట్లును, శ్రీరాముడాతని కంత శక్తిసామర్థ్యము లెట్లు వచ్చెనని యడిగినట్లును[1], దానిమీద నగస్త్యుడు రాక్షసవంశోత్పత్తినుండి ప్రారంభించి చెప్పినట్లును మూలమున నున్నది. ఈ శ్రీరాముని ప్రశ్ననుబట్టి తరువాత ఇంద్రజిత్తుయొక్క చరిత్ర ముఖ్యముగా చెప్పబడవలయును. కాని నిజముగా నగస్త్యునిచేత చెప్పబడిన ఇంద్రజిత్తు చరిత్ర చాల కొద్ది. ఒక్క దేవేంద్రుని మీదికి తండ్రితోపాటు బయలుదేరిపోయి వానిని తన మాయాశక్తిచేత బంధించిన విషయమే ఇంద్రజిత్తునుగూర్చి యగస్త్యుడు చెప్పినది[2]. మిగిలిన గ్రంథము రావణుని చుట్టుకొని యున్నదియే. అనగా రావణ మాహాత్మ్యముతోనున్న తరువాతి కథ కనుగుణముగా మూలమునందున్న శ్రీరాముని ప్రశ్న కనిపించుటలేదు. తిక్కన్నగారు రుచిరరమణీయముగా మార్చిరి. శ్రీరాముడు "కడిదిమగలవి దశాస్యుం గొడుకుం దమ్ములని గరంబు గురువుగ మీ చెప్పెడి భంగి జూడ వారల నడుగంగా వలసియున్నది మునినాథా! అమ్మనుజ భోజనల జన్మమ్ములనుం దపముచేసిన తెరంగును శౌర్యమ్ములను చెప్పుము" (2-15, 16) అని యగస్త్యు నుద్దేశించి యడిగినట్లుగా తిక్కన్నగారు వ్రాసిరి. నిర్వచనోత్తర రామాయణమున శ్రీరాముని ప్రశ్నయందు, మేఘనాథునకు ప్రాధాన్యము తొలగింపబడినది. రావణుడు ముందు పేర్కొన

---

1. ఉ. కాం. సర్గ. 1. శ్లో. 30, 31; 35-39.
2. 28-30 సర్గలు.

బడి ప్రాధాన్య మీయబడినాడు. దీనివలన తరువాత చెప్పబడు కథయంతయు శ్రీరాముని ప్రశ్నకు సమాధాన మన్నట్లుగా నైనది. మూలమున నడుగ బడని విషయము చెప్పినట్లుండగా తిక్కన్నగారు మూలమున చెప్పబడిన విషయమున కనుగుణముగా ప్రశ్నను పుట్టించి యడుగబడినదే చెప్పబడిన దన్నట్లు చేసెను.

తిక్కన్నగారి విషయమునగూడ నొక ప్రశ్న నూహింపవచ్చును. శ్రీరాము డడిగినదా రావణుని యొక్కయు, ఆతని కుమారుని యొక్కయు, కుంభకర్ణుని యొక్కయు వివరములనే కదా! మరి యగస్త్యుడు "తొల్లి కృతయుగమున" అని ప్రారంభించినట్లుగా యేల వ్రాసెనని. రావణోదంత మునకు కృతయుగమునుండి ప్రారంభింపబడవలసిన యవసరమున్నది అట్లు ప్రారంభించుటవలన రావణుని చిత్తవృత్తికి సంబంధించిన రెండు విషయములు సాధింపబడినవి. రావణుడు సుమాలికి కూతురు కొడుకు పులస్త్యునకు కొడుకు కొడుకు పులస్త్యుడు బ్రహ్మ కుమారుడైన మహాముని. సుమాలిది రాక్షసాన్వయము అనగా రావణుడు వేదవిద్యాసరస్వతియైన బ్రహ్మ వంశములోని వాడెట్లగుచున్నాడో, అట్లే రాక్షసాన్వయములోని వాడునగు చున్నాడు ఆ రెండు వంశముల లక్షణములును రావణునియందున్నవి. రావణుని తపశ్శక్తి, విద్యానిధిత్వము, అచంచలమైన శివభక్తి ఈ మొద లైనవన్నియు తండ్రినుండి సంక్రమించినవి. మోహాత్మకమైన తమోగుణ స్వభావము, మాత్సర్యముతోడి యుద్ధతి మొదలైనవి తల్లినుండి సంక్రమించి నవి ఈ రెండు గుణముల సమాహార స్వరూపమే రావణుడు. కాని చిన్న తనమునుండియు తల్లి యొక్కయు, తల్లితండ్రి యొక్కయు బోధల మూల ముగా వాని చిత్తవృత్తి రాక్షసమైనది. బ్రాహ్మ్యము కాలేదు. అంత రాంతరముల యందున్నది దానియందే ప్రవృత్తి కుదిరినది కాదు. ఆ వైలక్షణ్యమే రావణుని ప్రత్యేకత. మరి యదియునుగాక రావణుని లోక కంటక ప్రవృత్తి యంతయు సుమాలి మూలమున నైనది. ఆ సుమాలి తమ పడిన కష్టముల మూలముగా మనుమని దేవతలకు ప్రతీకారము చేయు వానిగా బోధించినాడు. సుమాలి పూర్వపుటుదంతము కృతయుగమున నుండియున్నది. పులస్త్యుడు కృతయుగమున నుండియున్న ముని. అందు వలన "తొల్లి కృతయుగము"న అని ప్రారంభించి చెప్పబడిన యంశములన్నియు

రావణుని తరువాత చెప్పబడు నుదంతమున కుపస్కారకములే యగుచున్నవి. రావణుని మాతామహ వంశమును ప్రారంభించుచు "హేతి ప్రహేతు లనఁ ప్రఖ్యాతులుదయమైరి రాక్షసాన్వయమున" (౭-౬౩) అని తిక్కనగారు హఠాత్తుగా నెత్తుకొనిరి.

మూలమున, తొలుత బ్రహ్మ యుదకములను సృజించుట – మరికొన్ని సత్వములను సృష్టించుట – ఆ సత్వములయందు కొన్ని రాక్షసులగుట – ఆ రాక్షసులనుండి హేతి ప్రహేతు లుదయించుట. ఈ మొదలుగా క్రమమున్నది. తిక్కనగారా క్రమమును వదలిరి. తిక్కనగారు వదలుటకు హేతువు, తరువాతి రావణుని ప్రవృత్తిని సమన్వయించి సంపూర్ణపరచుట కావచ్చును. రావణుడు, తల్లి ధనదుని చూపించి "పురుషుఁడంద్రే నీవు" అన్నంతవరకు మంచివాడే. అంత మాత్సర్యము పుట్టి ఘోరముగా తపముచేసి బ్రహ్మవలన వరములను పొందికూడ మంచివాడుగనే యున్నాడు. సుమాలి వచ్చి బోధించుట మొదలుగా రావణుని లోకకంటకత్వము ప్రారంభమైనది. అనగా రావణుడు రావణుడుగా నగుటకు హేతువు వాని యాత్మధర్మముగాక తల్లి యొక్కయు, తాతగారి యొక్కయు పెంపకపుబుద్ధులు హేతువులగుచున్నవి. రావణుని యందట్లు పెంచబడిన బుద్ధిలక్షణమే వానికి చరిత్రను సృష్టించినది. రావణుని పితృపితామహులు మాత్రము ప్రథమసృష్టిలో సంబంధము కలవారు. బ్రహ్మ – పులస్త్యుడు – విశ్రవసుడు – రావణుడు – ఈ వరుస యెడతెగక వచ్చినది. అనగా రావణుని యాత్మధర్మము బ్రహ్మనిష్ఠము. రక్తమాంసముల వలని గుణములన్నియు రాక్షసనిష్ఠము. కావున తయు రావణుని మనోలక్షణము. మనస్సు సంకల్ప వికల్ప రూపవికారము ధర్మముగా గలది. మనోలక్షణ మెట్లు పునాది కలది కాదో అట్లే యెతల్లక్షణమునకు మూలమైన తల్లి వంశము కూడ పునాది లేనిది. మధ్యలో ప్రారంభమైనది. మనోలక్షణము పరిస్థితుల మూలముగా రూపుగట్టుకొనునది. అనగా నాత్మ ధర్మమునువలె మొదటినుండి యుండునది కాదు. రావణుని మనోలక్షణము మాతామహులవలన నైనది. అందువలన సుమాలి వంశము మూలపురుషులను హఠాత్తుగా ప్రవేశపెట్టుట వలన నౌచిత్యమే సంపాదింపబడినది. ఇది కొంచెము దూరాన్వయముగా కనిపించ వచ్చునుగాని, కావ్యార్థమున కుత్కర్షాపాదకమైనందునను, సమన్వయించుటకు చెప్పబడిన

విషయము సత్యదూరము కాకపోవుట వలనను, దూరాన్వయ మేమియు లేదు.

సుమాలి తన కూతురు కైకసిని వెంటబెట్టుకొని భూలోకమున తిరుగుచు, తండ్రియొద్దకు వచ్చిపోవుచున్న ధనదుని చూచి, పాతాళమునకు బోయి ఏమిచేసిన తమ పడినపాట్లకు ప్రతీకారము జరుగుననియు, శ్రేయము కలుగుననియు నాలోచించి, యౌవనవతియైన తన కూతును పౌలస్త్యునొద్దకు పంపినట్లు మూలమున నున్నది[1]. పాతాళముననే యౌవనవతియైన తన కూతుంగని ఆమెవలననే తనకు మేలు జరుగవలయుననియు, జరుగగలదనియు నిశ్చయించుకొని, ఆమెను వెంటబెట్టుకొని తగిన యల్లునికై తిరుగుచు, సుమాలి, తండ్రికి నమస్కరించి పోవు ధనదుని జూచి, వాని తండ్రికి తన కూతునిచ్చినచో బాగుండు ననుకొని, ఆమెతో నామాట చెప్పినట్లును, ఆమె సరే యని పౌలస్త్యుని యొద్దకుపోయి వానికి భార్యయైనట్లును, తిక్కన్న గారు వ్రాసిరి. తిక్కన్నగారి యీ మార్పువలన సుమాలి యాంతర్యము స్పష్టముగా బోధపడుచున్నది. విష్ణువున కోడిపోయి లంకారాజ్యమును వదలి పాతాళమున సుమాలి తలదాచుకొనినాడు. వానికి తిరిగి విజృంభింప వలయునని యున్నది. కాని శక్తి లేదు. తన కూతురు సంతానమువలన తన యభీష్టము నెరవేరగలదన్న నమ్మకమొకటి వానికున్నది అందువలన నామె వలననే తనకు మేలు జరుగగలదనుకొనుచున్నాడు ఆమెకు వయస్సు వచ్చినది వివాహము చేయవలయును ఆమెను వెంటబెట్టుకొని వరాన్వేషణము భూలోకమున చేయుటకు ప్రారంభించినాడు. ధనదుడు కనిపించినాడు. ప్రస్తుతము లంకాధిపతి యతడు. వానిని చూచుటతోడనే సుమాలి కొడలు మండినది. తమ రాజ్యమును వాడనుభవించుచున్నాడు. వానికది లేకుండ జేసి తాను పొందవలయును. తనకు శక్తి లేదు తన కూతురు సంతానమైనను నాపని చేయవలయును. అట్లని మరి యెవరికో తన కూతునిచ్చినచో కలుగు సంతానము వైశ్రవణుని యోడింపలేకపోవచ్చును. వానికి బ్రహ్మాదుల బలమున్నది. అందువలన తన కూతును పౌలస్త్యునకే యిచ్చినచో నపుడు కైకసి సంతానమున కొక విధముగా లంకపై యధికారము దానంతటనదియే కలుగును. తన మనుమల కండగా నిలబడి వ్యవహారము తాను చేయవచ్చును.

---

1. సర్గ. 9, శ్లో. 1...10.

అపుడు లంక తిరిగి తనకగును. తన మనుమలకైనచో తనకైనట్లే. ఇంత యూహను సుమాలి చేసియే కైకసిని పౌలస్త్యుని యొద్దకు పొమ్మనినాడు. మూలమునందున్న విషయమునుబట్టి కూడ సుమాలి యాంతర్యము నిట్లూహింపవచ్చును. కాని సుమాలి మొదటినుండియు కూతురుమీద పెట్టుకున్న యాశ, వైశ్రవణుని చూడగనే వాని బుద్ధి పనిచేసిన విధము, మనమూహించుటకు మూలమునవకాశము తక్కువ. శిక్కన్నగారు పెద్దగా మార్చినదేమియు లేదు. క్రొత్తగా చేర్చినదియు లేదు. వైశ్రవణుని చూచి యింటికిపోయి ఆలోచించినాడని యున్న మూలమును, సుమాలి ఇంటి యొద్దనే మొదటి నుండియు నొక విధముగా నాలోచించుకొనుచుండి, వైశ్రవణుని చూచి, యప్పటికప్పుడే తెన్నుగా నూహించినాడన్నట్లుగా తిక్కన్నగారు వ్రాసిరి. ఇదేమి క్రొత్త విషయము గాని, పెద్ద మార్పుగాని కాదు. మూలమునందలి యాంతర్యము నెరిగి వ్రాసెను. కావ్యము నిబిడబంధముగా నగుట నిట్టెరిగి వ్రాసెడు వ్రాతలవలననే. అన్నియు మూలమునందున్న విషయములు వ్రాయుచున్నట్లుగా స్థూలదృష్టికి కనుపించుచు సూక్ష్మవిచారణమునకు విషయముగా విషయముల ననుసంధానముచేసి రచన చేయుట కవిత్రయమును వారిలోని ప్రత్యేకమైన ప్రతిభానము. తిక్కన్నగారా కోవలోని ప్రవేశింపబోవుచున్న వ్యక్తియేగదా

ఇట్టిదే మరొకటి. రావణుడు లంకను స్వాధీనము చేసికొని, పెండ్లి పేరంటములు గావించుకొని, లోకకంటకుడుగా విజృంభించియున్న సమయమున వైశ్రవణుడు దూతను పంపించి నీవు దుష్టవర్తనుడవగుచున్నావు, అది మంచిదిగాదని చెప్పించెను. ఆ చెప్పించుటలో, నింతకాలమునుండి నేను శివుని యారాధించుచున్నాను – అందువలన నాకు నీసంగతి యింతకు పూర్వము తెలియలేదు – ఇప్పుడు తెలిసినది – అందుకే దూతను పంపుచున్నానని చెప్పించెను. రావణుడా దూతను వధించెను. ఇది మూలము నందున్నది[1].

రావణుడంతగా మండిపడి దూతను వధించుటకు హేతువు వైశ్రవణుడు తన తపస్సు సంగతి చెప్పించుట. ఈయన తపస్సు చేసిన విషయము

1. సర్గ. 1౩, శ్లో. 17....౩౩

తనకు తెలియజేయుటకే మిషను పెట్టుకొని దూతను పంపినాడని రావణు డూహించినాడు అందుకు కోపము వచ్చినది దూతను చంపినాడు. రావణునకు కోపమువచ్చుట వాని తీవ్రమైన యుద్ధత స్వభావమునుబట్టి జరుగవలయును. కాని మూలమున వైశ్రవణుని మాటలవలననే జరిగినట్లున్నది, ఏమనగా మూలమున వైశ్రవణుని సందేశము పదునారు శ్లోకములు – అందు పది తను తపస్సుచేసిన విధము, శివుడు తనతో సఖ్యముచేసిన విధమును చెప్పినవి. స్థూలదృష్టికే అందు వైశ్రవణుని తపస్సునకు ప్రాధాన్యమున్నట్లు తోచును. రావణుని బుద్ధితీవ్రతతో నచట నిమిత్తములేదు. ఈ విషయమున తిక్కన్నగారు చేసిన మార్పు చాల చిన్నది. వైశ్రవణుని తపస్సు చాల యప్రధానమును నల్పమైనదిగా వ్రాసి తిక్కన్నగారు మూలార్థమునంతయు రావణుని బుద్ధితీవ్రతముఖమున సాధించిరి. వైశ్రవణుని సందేశమంతయు నైపోయిన తరువాత చిట్టచివరలో తిక్కన్నగారిట్లు వ్రాసిరి:

"ఇంతకాలంబు నే బోయి హిమనగమున
శాంకరంబగు ధర్మంబు సలుపుచునికి
నెరుగనైతి, మగుడివచ్చి యెల్ల నెరిగి
యెరుగఁ జెప్పితి హితము నా యెరిగినంత."[2] 4–30

మూలమునందలి యర్థమే తిక్కన్నగారును వ్రాసిరి. కాని వైశ్రవణునకు తన తపము గొప్పదనము రావణున కెరుకపరచు నుద్దేశము లేదన్నట్లుగా నున్నది తిక్కన్నగారి పద్యము ఇంతకుముందు చెప్పబడిన బుద్ధులన్నియు పోద్రోసి రావణుడీ గీత పద్యములయందలి రెండు పంక్తులను బట్టుకొని, ఆ వాని తపస్సిద్ధి యెట్టిదో చెప్పుమని యాదూత నడిగినాడు. ఫలితార్థమును దూత చెప్పినాడు. దానిమీద రావణుడు మండిపడి, ఇందుకొరకే ఆయన నిన్ను పంపినాడు. తన కీశ్వరునితోనైన స్నేహమును మాకు తెలియజేయుట కీ పనిచేసినాడు. సరే వాని మదమడగింతును. ముందు నిన్ను చంపవలయునని, దూతను చంపినాడు – ఇది తిక్కన్నగారు వ్రాసిన విధానము. మూలమునందలి యర్థమే వ్రాసియు రావణుని మనోలక్షణ మభివ్యక్తమగునట్లుగా వ్రాయబడినది. ఈ లక్షణము మూలమునందలి రావణునిలో లేదు. నిర్వచనోత్తర రామాయణమున రావణుడు తన వక్రమైన తీవ్ర బుద్ధిచేత వైశ్రవణుని యందొక దోష మారోపించినాడు. మూలమున రావణుడు దోషమును

చూచుటకును ఇచట చూచుటకును చాల భేదమున్నది. రావణుడు విషయము ను గ్రహించు విధానముయొక్క వైలక్షణ్యమును తిక్కన్నగారు సృష్టించి చూపెను

కైలాసగిరి నెత్తి పరమశివునివలన భయపడి యాక్రోశించిన రావణుని దయతలచి శివుడు వానిని విడుచునప్పుడు చంద్రహాసము నిచ్చెనవి మూలమున నున్నది. రావణుడు వేయిసంవత్సరములుగా చేతులట్లు గిరి క్రింద నలిగి పోవుచున్నప్పుడు శివుని స్తవము చేయుచు నాక్రోశించెననియు, అపుడు శివుడు కరుణించి చంద్రహాసమును బహూకరించినట్లును మూలము నందున్న[1] విషయమును తిక్కన్నగారు వదలిరి. నిజమున కీది వదలదగినదిగా తోచుట లేదు. రావణుని ప్రముఖమైన ఆయుధవృత్తాంతము, వానికి శివభక్తి కుదురుట మొదలైన విషయములను తెలియజేయుచున్న విషయ మది. తిక్కన్నగారేల వదలిరో తెలియదు.

రావణు డింద్రుని మీదకు పోవుచు కైలాసనగమున విడిసినప్పటి యంధకార వర్ణనము, చంద్రచంద్రికా వర్ణనము తిక్కన్నగారు స్వయముగా చేసిరి మూలమునందా ప్రసక్తి మరొక విధముగా నున్నది. మదనార్తులైన కిన్నరమిథునము లాప్రాంతమున పాటలు పాడుచు తిరుగుచున్నారనియు, విద్యాధరమిథునములు క్రీడించుచున్నవనియు నీ మొదలైన విషయములు మూలమునందున్నవి.[2] తిక్కన్నగా రివి వదలిరి. ఈ విధముగా కొంత స్త్రీజన మాప్రాంతమున నున్నపుడు కామబాణవశంగతుడైనరావణు డటు దిక్కుగా నేలపోలేదన్న ప్రశ్న మూలము ననుసరించి పుట్టును. తిక్కన్నగా రా ప్రశ్నను పుట్టనీయకుండ వ్రాసెను. మరియు తిక్కన్నగారు రావణునకు మదనవికారము కలిగినతీరు గూడ సుకుమారముగా వర్ణించిరి. చకోర దంపతుల క్రీడలను జూచిన రావణునకా బుద్ధి పుట్టినదట ఆ సమయమున నే రంభ వచ్చినది.

రావణుడు వాలిమీదకు పోగా, తన దగ్గరకు వచ్చుచున్న రావణుని వాలియే ముందుగా నొడిసిపట్టుకొని చంకనిరికించుకొని యాకాశమున

1. సర్గ. 16, శ్లో. 37. 47.
2. సర్గ. 26, శ్లో. 7, 6.

కెగిరిపోవుచుండగా రావణుని మంత్రులు వాలి వెంటబడినట్లును మూలమున నున్నది.[1] రావణుడే నెమ్మదిగా వెనుకచాటుగాబోయి వాలిని పట్టుకొన్న ట్లును, వాని వచ్చుటజూచి జాగ్రత్తగా చూడనివానివలె వాలి యున్నట్లును, ఉండి రావణుని చంకనిరికించుకొన్నట్లును తిక్కన్నగారు వ్రాసిరి. రావణుని మంత్రులు వాలి వెంటబడుట ప్రయోజనరహితము గనుక తిక్కన్నగారు వదలిరి.

ఇది ప్రధానముగా నిర్వచనోత్తర రామాయణమున కనిపించు, పేర్కొనదగిన, మూలముతోడ భేదించిన కథాంశముల స్థూలరూపము.

లెక్కప్రకారము పూర్వభాగములో చేరకపోయినను హనుమజ్జన్మ వృత్తాంతవిషయ మిచటనే సూచింపబడును.

మూలమున హనుమంతుని ప్రసక్తి శ్రీరాముడు తెచ్చినాడు.[2] రావణుడు, వాలి ఇరువురును స్నేహము కలిపికొనినారని చెప్పి యగస్త్యుడు తన చెప్పుటను ముగించగా శ్రీరాముడు హనుమంతుని లెస్సగా పొగిడి, వాని వలననే తా నీ నాడు సింహాసనమున నుండగలిగినట్లుగా మాట్లాడి, సుగ్రీవునకు బద్ధసఖుడుగదా హనుమంతుడు; అతనికిని వాలికిని వైరము గలిగినప్పుడు వాలి నేల చంపక విడిచినాడు ? అతనికి తన బలము తనకు తెలియదని నే ననుకొందును. మహాత్మా! నీ వీ విషయమును చెప్పుమని యగ స్త్యుని యడిగినాడు. అగస్త్యుడు హనుమజ్జన్మవృత్తాంతమును చెప్పినాడు. తిక్కన్నగా రీ విషయము వ్రాయలేదు. "హనుమంతునకు వాలికిం గల (విక్రమమున) అంతరమే కొలదియొకొ ?" (7-97) అని శ్రీరాము డగస్త్యుని యడిగినట్లుగా వ్రాసిరి మొదలు మూలమున నీ హనుమంతుని ప్రసక్తి వచ్చుటయే యంత సమంజసముగా లేదు ఐనను తరువాత చెప్ప బడిన హనుమద్వృత్తాంతమును బట్టి చూచినచో కొంతవరకు మూలమునం దున్న శ్రీరాముని ప్రశ్నయే యుచితముగా నున్నట్లు తోచుచున్నది.

వాలి మీదకు సుగ్రీవుని పక్షమువహించి హనుమంతుడు పోకుండుటకు వాని బలము వానికి తెలియదనియు, ఆ సమయమున వానికి తెలియజెప్పిన

---

1. సర్గ. 34, శ్లో. 14-24
2. సర్గ. 35.

వాడును లేననియు, అదే కారణమనియు నగస్త్యుడు చెప్పుట వలన శ్రీరాముని ప్రశ్నకు కొంత సమాధానము చెప్పబడినట్లైనది. మిగిలిన కథ హనుమంతుని కంత బలమెట్లు వచ్చెనో చెప్పునది. నిర్వచనోత్తరరామాయణమున శ్రీరాముని ప్రశ్న మంత యుచితముగా నిర్వహించుటలేదు. లేదని తిక్కన్నగారికే తోచినదో యేమో "ఆంజనేయు నతులబలము విన వేడ్క సేసె నితడు – విస్తరించి తెలిపెదరంత సెప్పవలయు నాకు" (7–93) అని యనుకొని యగస్త్యుడు హనుజ్జన్మవృత్తాంతము చెప్పినట్లుగా వ్రాసెను.

మూలమునందలి కథాభాగము మాత్రమే తిక్కన్నగారిచేత నట్టి మార్పులతో నిర్వచనోత్తర రామాయణ పూర్వభాగమున గ్రహింపబడి యనుసరింప బడినదో కొన్ని ప్రధానాంశముల విషయమున నిక్కడ వివరింపబడినది.

## 2. ఉత్తరభాగము – మూలానుసరణ విధానము

నిర్వచనోత్తరరామాయణమునందలి యుత్తరభాగము–అనగా నష్టమ, నవమ, దశమాశ్వాసములు – శ్రీరామనాయకమై ఉత్తర రామాయణ శబ్ద వాచ్యముగా నున్న గ్రంథ మీ చివర మూడాశ్వాసములే. ఇందు తిక్కన్న గారిచేత కొంతమూలము కొద్దిపాటి మార్పులతో ననుసరింపబడి యున్నది. మరి కొంత మూలము పూర్తిగా విడువబడినది. ఆ యా విషయములు క్రమముగా వ్రాయబడును.

సీతారాముల వనవిహారము మూలమున ముప్పదియారు శ్లోకముల (42) ఒక సర్గలో వర్ణింపబడినది. అందు మొదటి పదునారు శ్లోకములు కేవలముగా నుద్యానవనము నందలి వృక్షలతాపుష్పాదుల వర్ణనము. తరువాతి పదిశ్లోకములలో సీతారాములు అరుంధతీ వసిష్ఠులవలె, శచీపురందరులవలె విహరించుచుండగా దశసహస్రవర్షములు గతించినట్లు చెప్పబడినది. తదనంతర మారు శ్లోకములలో, సీతారాముల పూర్వాహ్ణాపరాహ్ణములయందలి దైనందిన కృత్యములు, సీతాదేవి గర్భవతి యగుట, శ్రీరాముడామెను తన కోరిక యేమో చెప్పుమని యడుగుటయు నున్నది. అంత సీత తనకు తపోవనములను చూచి రావలయునని కోరికగా నున్నదనుట, సరే రేపు పోవుదువుగాని లెమ్మని శ్రీరాముడనుటతో నాసర్గ ముగిసినది–తిక్కన్న

గారీ సర్గలోని విషయములను చాల పెంచి వ్రాసెను వనవిహారమునకు ముందు, సీతారాములు నెత్తము లాడుకొనుట - గంధములు పూసికొనుట ప్రణయకోపాభినయము ఇత్యాదులు తిక్కన్నగారు వర్ణించిరి. వనవిహార వర్ణనము మరియు విస్తరింపబడినది రూపవతులును, నృత్తగీతవిశారదలును నైన స్త్రీజనము మద్యము సేవించి శ్రీరాముని ముందాడినారనియు, పాడినారనియు మూలమున నొక శ్లోకమున్నది.[1] తిక్కన్నగారు దానిని విరివి చేసిరి నిర్వచనోత్తరరామాయణమున పెంచి వ్రాయబడిన వనవిహారాదిక మంత యుదాత్తముగా కనిపించుట లేదు

లక్ష్మణునితో సీతను అడవికి పంపునపుడు శ్రీరాముడామెతో మాట్లాడినట్లు మూలమునలేదు మాటాడినట్లుగా తిక్కన్నగారు వ్రాసిరి ఆ సమయమున నాయనచేత మాటాడించుటలో తిక్కన్నగారుత్తాలమైన కవితాశక్తిని ప్రదర్శించిరి. శ్రీరాముని పాత్ర విషయమున నప్పుడది చెప్పబడును.

లవణుని గూర్చి విన్నవించుటకు మునులు వచ్చుటకు మునుపు శ్రీరాముడు సీతను గూర్చి యేకాంతమున చింతించుచున్నట్లుగా తిక్కన్నగా రారేడు పద్యములు వ్రాసిరి (9-86...92). మూలమునందట్లులేదు. ఆ పద్యము లట్లు వ్రాసి తిక్కన్నగారు శ్రీరాముని యుదాత్తత నెంత పరమ రమణీయముగా చిత్రించినదియు ముందు ముందు వ్రాయబడును

శ్రీరాముడు శంబూకుని వద్దకుపోయి, నేను శ్రీరాముడను - దశరథుని కుమారుడను, అని చెప్పినట్లుగా మూలమున నున్నది[2]. తిక్కన్నగారట్లు శ్రీరామునిచేత చెప్పించలేదు. శంబూకుడు నేను ఫలానా యని చెప్పగానే శ్రీరాముడు వాని శిరస్సు ఛేదించినట్లు మూలమున నున్నది[3]. తిక్కన్నగారచట శ్రీరాముని మనోవికారమును చెప్పి, అతని ధర్మవీర లక్షణమును లోకాతిశాయి రమణీయముగా నిరూపించిరి. అదియు తరువాత వ్రాయబడును

---

1. సర్గ 42. శ్లో 21.
2. సర్గ. 75, శ్లో. 16.
3. సర్గ. 76, శ్లో. 4.

శ్రీరాముడు రాజసూయము చేయుదుననుట, తమ్ముడు అశ్వమేధము చేసె మేలని యనుట – మొదలైనవి మూలమున, శంబూకవధానంతర మగస్త్యుని దర్శించి శ్రీరాము డింటికి తిరిగి వచ్చిన తత్క్షణమే జరిగినట్లున్నవి. అట్లు తిరిగి వచ్చిన తరువాత కొంత కాలమునకు శ్రీరాముడు రాజసూయము విషయము చెప్పుటయు, తమ్ముడు అశ్వమేధము మేలని యనుటయు జరిగినట్లు తిక్కన్నగారు వ్రాసిరి.

శ్రీరాము డశ్వమేధము చేయునపుడు బంగారముతో సీతాప్రతిమను చేయించుకొని పత్నీకృత్యములను దానితో నెరవేర్చెనని తిక్కన్నగారు వ్రాసిరి. మూలమున బంగారు సీతాప్రతిమ విషయము కానరాదు

శ్రీరాముడు కుశలవుల వలన శ్రీమద్రామాయణ గానము విని, ఈ కృతి యెవ్వరు చేసిరి? అని యడుగగా వారు స్పష్టముగా నిన్నివేల శ్లోకములు, ఇన్ని సర్గలు, మరియు నిన్ని యుపాఖ్యానములుగల ఈ కృతి వాల్మీకి చేసినదని చెప్పినట్లు మూలమున నున్నది[1]. కుశలవులా శ్రీరాముని ప్రశ్నవిని వాల్మీకి మొగము గనుగొని, తదనుమతిని "ఈ సందర్భము వీరలు చేసిన యది. మేము వీరి శిష్యులము. రసోల్లాసమధురమగు దీని నుపాసింతుము"– (10–124) అని వాల్మీకిని చూపి చెప్పినట్లుగా తిక్కన్నగారు వ్రాసిరి. లెక్క గట్టుకొని సిద్ధముగా నున్నట్లున్న మూలమునందలి కుశలవుల సమాధానమునకంటె తిక్కన్నగారి కుశలవుల సమాధానమే బాగున్నది.

శ్రీరాముడు ఉత్తరకాండ కథను గూడ కుశలవుల వలన వినుట కుపక్రమించి, సీత కుశలవులన్న కుమారులను గనినదన్నమాట వినిన తరువాత, ఎదురుగా రామాయణమును గానము చేయుచున్నవారు తన కుమారులేయని తెలిసికొన్నట్లు మూలమున నున్నది[2]. కుశలవులవలన తత్కృతి వాల్మీకి కృతమని యెరిగిన తత్క్షణమే, అసలు మీరెవ్వరు నాయనా యని యడిగినట్లును, అదే సమయమని వాల్మీకి చెప్పినట్లును తిక్కన్నగారు వ్రాసిరి. ముందుగా శ్రీరాముని సభకు వాల్మీకి వచ్చినట్లుగా మూలమునలేదు. శ్రీరాముడు దూతను వాల్మీకి యొద్దకు పంపుటయు, ఆయన సీత యట్లే

1. సర్గ. 94, శ్లో. 25....27.
2. సర్గ. 95, శ్లో. 2.

శపథము చేయును లెమ్మని ప్రత్యుత్తరమిచ్చుటయు, రెండవనాడు యజ్ఞవాటమున కాయన సీతను వెంటబెట్టుకొని వచ్చినట్లును మూలమున నున్నది[1]. సీత శపథము చేయుట, దేవతలు, జనములు గుంపులు గట్టుకొని చూడ వచ్చుట తిక్కన్నగారు సుళువుగా దాటవేసిరి. సీత రసాతలమునకు పోయిన వెంటనే జనముల హాహారవములు - శ్రీరాముని దుఃఖము - భూదేవిమీద శ్రీరాము డాగ్రహించుట - ఇత్యాదులన్నింటిని తిక్కన్నగారు వదలిరి.

శ్రీరాముని యాగ్రహ మభివ్యక్తము కాకుండగనే, వాల్మీకి మాట చొప్పున, కుశలవులు శ్రీరాముని పార్థించినట్లును, ఆయన యుపశమించి నట్లును తిక్కన్నగారు వ్రాసిరి. శ్రీరాముని దుఃఖోపశమనము చేయుటకు బ్రహ్మ వచ్చి రామాయణమంతయు పూర్తిగా వినుమని యన్నట్లు మూలమున నున్నది.[2] తిక్కన్నగారు బ్రహ్మను ప్రవేశపెట్టనే లేదు. అటనుండి కుమారులతో నయోధ్య చేరుకొని శ్రీరాముడు సుఖముగా నుండెననుటతో తిక్కన్నగారు నిర్వచనోత్తర రామాయణమును ముగించిరి.

ఇంతవరకు నుత్తరభాగమును కొద్దిపాటి మార్పులతోడను, కూర్పులతోడను, మూలము నెట్లనుసరించుచున్నదో కేవలము కథాంశములు గ్రహించి చూపబడినవి. ఇక నీ యుత్తరభాగమున తిక్కన్నగారు పూర్తిగా వదలిన మూలమునందలి కథావిషయము లిచట చూపింపబడును.

సీత నరణ్యమున వదలివచ్చిన తరువాత లక్ష్మణునకు నృగమహారాజు చరిత్ర - నిమికథ - యయాతి చరిత్ర శ్రీరాముడు చెప్పినట్లు మూలమున నున్నది.[3] తిక్కన్నగారు వీటిని పూర్తిగా వదలిరి - లక్ష్మణుడన్నగారితో నిట్లనినాడు "నీవిట్లు దుఃఖింపతగదు - దుర్బలపుబుద్ధిని త్యజింపుము. ప్రజా రక్షణము, రంజనము, ఇవేకదా కర్తవ్యములు?" అని. ఆ మాటలు విని శ్రీరాముడు "అవును, నీవన్నది నిజము - పౌర కార్యములు తీర్చుటయందు ప్రాలుమాలరాదు. పూర్వము నృగమహారా జిట్లు ప్రాల్మాలి నిర్యాతనరకమున బడినాడు?" అని లక్ష్మణునకు నృగమహారాజు చరిత్ర చెప్పెను. తరు

1. సర్గ. 95, శ్లో. 12; సర్గ. 96, శ్లో. 11, 12.
2. సర్గ. 98, శ్లో. 13..22.
3. సర్గలు. 53.. 59.

వాత చెప్పబడిన నిమికథ కింపై యర్థమును చెప్పుదిదే. మహానుభావుడైన వసిష్ఠునియందు నిమిశాపము వహింపవలసినదని శాస్త్ర మడుగగా శ్రీరాముడు యయాతి మహారాజు కథచే సత్త్వగుణ ప్రధానుడై క్షమావంతుడయ్యెనని ఆయన కథను చెప్పెను – ఇది మూలమున నా కథలు ప్రసక్తికి వచ్చినవారు. శ్రీరాముని ప్రజాపాలనమునందలి ఔన్నత్యబుద్ధిని ఆ కథలు స్థాపించు మాట నిజమే కాని, కావ్య నాయకుడైన శ్రీరామునితో వానికి ప్రత్యక్షసంబంధము లేదు ప్రజాపాలన మిట్లు చేయవలయుననియు, పూర్వులీ ప్రకారము చేసినారనియు తెలియుటలేదు. తానుగా నట్లాచరించుట వేరు. శ్రీరాముని యాచరణమే కావ్యమైన నిర్వచనోత్తర రామాయణమున కావలయును గాని, ఆ శ్రీరాముని పూర్వరాజవృత్తపరిజ్ఞాన ప్రదర్శన మక్కర లేదు. శ్రీరాముని చేతలయందే దృష్టిని పెట్టుకొని వాని ధర్మప్రవృత్తిని నిరూపించుటకు పూనుకొనిన తిక్కనగారు రాజుల కథలు శ్రీరాముడు లక్ష్మణునకు చెప్పినట్లుగా వ్రాయక పోవుటయే సముచితముగా నున్నది.

లవణాసురుని యుదంతము మూలమున[1], వాని బాధలు పట్టుకొన లేకున్నామని చెప్పుటకు వచ్చిన మునులు శ్రీరామునకు చెప్పినట్లును, తరవాత చ్యవనుడు శత్రుఘ్నునకు చెప్పినట్లును నున్నది. తిక్కనగారు శత్రుఘ్నుడు మాత్రము వాల్మీకాశ్రమమున మునుల వలన లవణుని యుదంతమెరిగినట్లు వ్రాసి, శ్రీరామునకు మునులచేత చెప్పించకుండ, ఆ విషయము శ్రీరాముని యెరుకలోనిదిగనే నిరూపించెను. తపస్వులు వచ్చి లవణుడెవరో చెప్పువరకు శ్రీరామునకు వాని విషయము తెలియకపోవుట ధర్మస్థాపకుడైన శ్రీరామున కుదాత్తతను సంపాదింపదు. అందువలన తిక్కనగారు మునుల చేత చెప్పించి యుండకపోవచ్చును అయినచో మునులు వచ్చి చెప్పుకొనువరకు వానిని వధించుటకు శ్రీరాముడేల యత్నము చేయలేదనవచ్చును నిజమునకు లవణుడు పరమదుర్మార్గుడే యైనను వాడుగా శ్రీరాముని మీదికి రాలేదు మునులను బాధించుచున్నాడు: తమ్ము రక్షింపుమని శ్రీరాముని వారు కోరిరి వారువచ్చి శ్రీరాముని కోరుట కేవలము నిమిత్తము. అపుడు శరణాగతత్రాణముగా లవణుని శ్రీరాముడు వధింపించినాడు – లవణుని

---

1. సర్గలు. 61, 67.

యుదంతము శత్రుఘ్నుడెరుగుట కావలయును లవణుని సంహరించిన దాత డే గదా ! అందుకనియే మునులవలన నెరిగినట్లుగా తిక్కన్నగారు వ్రాసిరి.

లవణుని వధించుటకు పోవు శత్రుఘ్నునకు, మార్గమధ్యమున తన యాశ్రమమున దిగినప్పుడు, వాల్మీకి సౌదాసనరేంద్రుని కథ చెప్పినట్లు మూలమున నున్నది[1]. తిక్కన్నగారది వదలిరి. ఆ కథ శ్రీరాముని యుదాత్తతకు గాని, శత్రుఘ్నుని లవణవధకుగాని సంబంధించినది కాకపోవుటచేత వదలి యుండవచ్చును.

శంబూకుని వధించిన శ్రీరాము డగస్త్యుని జూడబోయినాడు. ఆ మహర్షి విశ్వకర్మచే చేయబడి తన యొద్దనున్న ఆభరణమును శ్రీరామునకు బహూకరించినాడు. ఈ యాభరణము తమకెక్కడనుండి వచ్చినది స్వామీ యని శ్రీరాము డాయన నడిగెను. ఆ ప్రశ్నను పురస్కరించుకొని యగస్త్యుడు శ్వేతకేతుని కథ చెప్పినాడు. ఆ కథ విని శ్రీరాముడు, శ్వేతుడు తపస్సు చేసిన యరణ్యమట్లు మృగపక్షిశూన్యంబై యుండుటకు హేతువేమని యడుగగా, దండుని కథ నగస్త్యుడు చెప్పినాడు. ఇదంతయు మూలమున నున్నది.[2] తిక్కన్నగారిచేత విడువబడినది.

శ్రీరాముడు ముందు రాజసూయము చేయవలయుననుకొని తమ్ములతో చెప్పినాడు. అశ్వమేధము చేయుట మంచిదని వారనిరి. శ్రీరామునకు లక్ష్మణుడు అశ్వమేధము మాహాత్మ్యమును నిరూపించుటకుగాను వృత్రవధ చేసిన ఇంద్రుని కథ చెప్పినాడు. ఆ తరువాత శ్రీరాముడు లక్ష్మణునకు ఇలమహారాజు కథ చెప్పినాడు[3]. మూలమునందున్న యీ కథలను తిక్కన్నగారు వదలిరి. లక్ష్మణుడు చెప్పిన వృత్రవధ విషయము, బ్రహ్మహత్యాదోషమును గూడ అశ్వమేధము నపనయింపగల యంత మాహాత్మ్యము కలదని చెప్పి శ్రీరాముని, అది చేయుటకు ప్రోత్సహించునదివలె నున్నది. కాని, శ్రీరామున కశ్వమేధము మాహాత్మ్యము తెలియదా? అదియునుగాక, శ్రీరాముడు వెంటనే ఇల మహారాజు కథ చెప్పి యశ్వమేధమాహాత్మ్యమును ప్రకటించినాడు. కనుక శ్రీరామునకా విషయము తెలియును. అట్టిచో

1. సర్గ. 65.
2. సర్గలు. 77-81.
3. సర్గలు. 85-90.

నా ఫలవలని ప్రయోజనమంత కానరాదు. తిక్కన్నగారందు వలననే వదలి యుందురు.

సీత రసాతలమునకు పోయిన తరువాత శ్రీరాముని యోదార్చుటకు బ్రహ్మ వచ్చినాడన్న మూలవిషయము ననుసరించి, వారి దుఃఖముయొక్క తీవ్రత యభివ్యక్తమగుచున్నది. శ్రీరాముడు ధీరోదాత్తుడును, ధర్మవీరుడునునైన నాయకుడుగా నిరూపించబడు నిర్వచనోత్తర రామాయణమున హర్షశోకాదులవలన వాని యనభిఘాతత్వమే ముఖ్యముగా వెలుగునకు తీసికొనిరాబడవలయును. సీతావియోగదుఃఖమును శ్రీరాముడు తనంతగా తాను దిగమ్రింగుకొనినట్లు వ్రాయుటయే నిర్వచనోత్తర రామాయణమునకు కావలయును. అదే సొగసు. తిక్కన్నగారు చేసినదే యది.

అటుతరువాత కౌసల్యాదుల యొక్కయు, లక్ష్మణుని యొక్కయు, శ్రీరాముని యొక్కయు గమనము మొదలైన విషయములను చెప్పుచున్న సర్గలన్నియు[1] తిక్కన్నగారు వదలిరి. నిర్వచనోత్తర రామాయణము కావ్యమగుట మూలముననుు, ధర్మవీరముతోడి శ్రీరాముని ప్రవృత్తిని నిష్కర్షించుట కవి యుపయోగించునవి కాకపోవుటవలనను తిక్కన్నగారు వదలి యుందురు. కేవలము రాజధర్మనిర్వహణమున శ్రీరాముని ధీరోదాత్తత యెట్టి యుత్సాహశక్తి లక్షణలక్షితమైనదియు చూపుటను ప్రధానముగా పెట్టుకొన్న గ్రంథమగుటచేత, నిర్వచనోత్తర రామాయణమిపు డెంతవరకు తిక్కన్నగారిచేత వ్రాయబడి యున్నదో, అంతవరకే వ్రాయబడుట సమంజసము.

1. సర్గలు. 99–111.

# చతుర్థోన్మేషము

## 1. శ్రీరాముడు

శ్రీరాముడు ధర్మవీరుడనియు, అందువలన నిర్వచనోత్తర రామాయణమున రసము ధర్మవీరమనియు వెనుక చెప్పబడినది నిజమునకు ధీరోదాత్త ధీరశాంతులవలె ధర్మవీరుడని ఒక నాయకభేదము లేదు. శ్రీరాముడు ధీరోదాత్తుడు. ధీరోదాత్తుడైన శ్రీరాముడు ధర్మవీరమునందు ప్రవృత్తి కలవాడగుట మూలమున శ్రీరాముడు ధర్మవీరుడనబడినాడు. ఇచట ముఖ్యముగా గమనింపవలసిన విషయము ఒకటి యున్నది శ్రీరాముని ధీరోదాత్తత కుపబలకముగా ధర్మవీరము పరిశీలింపబడవలయును. అసలు ధర్మవీరము ధీరోదాత్త ప్రకృతులయందే యుండును. అనగా ధర్మవీర ముత్తమప్రకృతికమగుచున్నది. వీరమే భరతు డుత్తమప్రకృతిక మనినాడు. చతుర్విధనాయకులను చెప్పు శబ్దము లందున్నది ధీరశబ్దము. దానిని వదలినచో ఉదాత్త, ఉద్ధత; లలిత, శాంత పురుషులు చతుర్విధనాయకు లగుదురు. భరతుడన్న ఉత్తమ ప్రకృతి ఉదాత్తపురుషప్రకృతిగా గ్రహింపవచ్చును. ధీరశబ్దమున కర్థము క్లేశసహనమని అలంకారికులు చెప్పిరి. ఆ క్లేశసహనత్వము ఉదాత్తుని యందొక విధముగను, ఉద్ధతుని యందొక విధముగను, లలితునియం దింకొక విధముగను, శాంతునియందు వేరొక విధముగను నుండును. అనగా క్లేశసహనము పురుషలక్షణముగాను, అట్టి పురుషులే నాల్గురకముల ప్రకృతులతో కావ్య నాయకులగుటను, పూర్వభారతీయాలంకారికులు నిష్కర్షించి పెట్టినట్లును తోచుచున్నది. మిగిలిన ప్రకృతులతో నిమిత్తము లేదు. ఒక్క ఉదాత్తప్రకృతి విషయమే పర్యాలోచింపవలసి యున్నది. ఏలననగా శ్రీరాముడు ధీరోదాత్తుడు గనుక.

ఉదాత్తప్రకృతియైన శ్రీరాముడు రాజు కనుక వాని ప్రవృత్తి రాజధర్మమునందే నిష్ఠ కలది. నిర్వచనోత్తర రామాయణమున శ్రీరాముని రాజధర్మములలో ప్రజారంజనరూప సామాన్యధర్మము గ్రహింపబడినది. అనగా శ్రీరాముని నిర్ణయములయు ప్రజారంజనమునం దున్నవి. ప్రజారంజన రూపమైన రాజధర్మము నిర్వచనోత్తర రామాయణమున ప్రాధాన్యము వహించుచున్నది. లోకమున వర్ణాశ్రమ ధర్మసంస్థాపనముచే రాజధర్మము ప్రారంభమగును. వర్ణాశ్రమధర్మసంస్థాపనవలన బ్రాహ్మణులును సర్వజనులును సంతృప్తులగుట జరుగును. ఏ పని చేసినను అసంతృప్తులు కొందర నివార్యముగ నుందురు. శ్రీరాముడు రాజు కాగానే వర్ణాశ్రమధర్మములు సక్రమముగా జరుగునట్లు శాసించెను. ఈ శాసనము కొందర కహితమగుట శ్రీరాముని కెరి గినట్లే తిక్కన్నగారు వ్రాసిరి. సీతను గురించిన అపోహ లోకమున ఏర్పడుట కా శ్రీరాముని వర్ణాశ్రమముల నృత్త్వములరని సమీపరించుటగా గాంచుట తిక్కన్నగారిచేత చెప్పబడినది. ఎంత కాలమా రాజును గూర్చిన చెడ్డ లోకమున చెప్పుకొనబడుచుండునో అంతకాలమును ఆ రాజు నరకమున నుండును. శ్రీరాముడందువల్లనే తనకు పాపము రాకుండ, ఏమున్నను అది యేదు మాటయైనను చెప్పవలసినదిగా భద్రునితో ననినాడు. భద్రుని మాట విన్న తరువాత తమ్ములతో "విడిచెంతు చాల మేలయ్యు, వర్తనంబు గౌరవం బొకయించుకయైన విడిచిన దుష్కృతమనియు" (౭-119,120) అనినాడు. శ్రీరాముడు తన వర్తనమునందలి గౌరవము ప్రజలదృష్టిలో తగ్గకుండు టను లక్ష్యముగా పెట్టుకొన్నవాడు. ఆ లక్ష్యమెప్పుడు సిద్ధించును? ప్రజా రంజనమును ఘటించినప్పుడు. శ్రీరాముడు సీతతో కలిసియుండుట మంచిది గాదని ప్రజ అనుకొనుచున్నది. శ్రీరాముని వర్తనమునందు లాఘవ భావము లోకమున కేర్పడినది. దానిని పోగొట్టవలయును. అందుకు శ్రీరా ముడు తాను సీతను పరిత్యజించుటయే పరమమైనదిగా నిర్ణయించు కొన్నాడు. సీతను పరిత్యజించినాడు. అందువలన శ్రీరాముని వర్తనము నందలి గౌరవభారము ప్రజల దృష్టిలో చాల గొప్పదైనది. శ్రీరాముడు చేసిన రెండవ ప్రజారంజన కార్యము లవణుని చంపించుట. వాడు రాక్ష సుడు. రావణాదులవలె ఋషులను బాధించువాడు. వానిని రాముడు చంపలేదు. శత్రుఘ్నునిచేత చంపించెను. లవణుడు చచ్చుటవలన ముఖ్య ముగా విప్రులు తృప్తులైనారు. అనగా విప్రప్రీతిని ఘటించుటయందు

రాముని ప్రవృత్తిని లవణాసురవధ నిరూపించుచున్నది. అయ్యును అది సీతా పరిత్యాగమువలె కేవలము శ్రీరాముని ప్రత్యక్షప్రాధాన్యము లేనిది. మూడవది శంబూక వధ. ఇది వర్ణాశ్రమ ధర్మములు చెనికిపోకుండ చూచుటను స్థాపించునది. అశ్వమేధము ధర్మకర్మ. దానివలన దేవతలు ప్రీతులు కావలయును. రాజధర్మములో దేవతాప్రీతి ఘటించుటయు నొకటి. తిక్కన్నగారు శ్రీరాముని అశ్వమేధమును గురించి విపులముగా వ్రాయలేదు. అందు కుశలవులను, వాల్మీకిని, సీతను ప్రవేశపెట్టి శ్రీరాముని కేవలమాంతరంగికమైన సీతాపరిత్యాగము వలని క్లేశమును తిరగతోడి శ్రీరాముని ధీరోదాత్తతను స్థాపించుటయందే తిక్కన్నగారి తాత్పర్యము గోచరించుచున్నది. అది ఎట్లో తరువాత వ్రాయబడును శ్రీరాముని పాత్రను పరిశీలించునపుడు లెక్కలోనికి తీసికొనవలసినవి ముఖ్యముగా సీతాపరిత్యాగ ఘట్టము, శంబూక వధ–రెండు మాత్రమే. తరువాత అశ్వమేధము. అటు తరువాత లవణాసుర వధ

శ్రీరాముడు వీరుడు మరియు నందు ధర్మవీరుడు. వీరునియందు ముఖ్యమైనది అవిషాదత్వము. విషాదము కలుగును గాని అది వెలికిరాదు. అనగా ప్రవృత్తి కాటంకముకాదు ఆ కానితనమే వీరలక్షణము. తన భార్యను గురించి లోక మేమనుకొనుచున్నదో శ్రీరాముడు విన్నాడు. ఆ లోకమనుకున్నది చాల దుర్భరమైనది. దానివలన నొక విలక్షణమైన మానసికవికారము కలుగవలయును. అనగా కలిగితీరవలయును. కలుగుట మానవలక్షణము. అది వెలికి రానీయక నడుముకొనుట వీరలక్షణము. ఆ ఘట్టమున,గర్భవతియైన భార్యను పరిత్యజింపవలసి వచ్చినందుకు శ్రీరాముడు పడిన తపనను, మరియు నిర్వహింపవలసిన రాజధర్మమునందు నిష్ఠను చెదిరిపోనీయని ధృతి లక్షణము. ఈ రెండింటిని ఏకకాలమున నిర్వహించుటలో తిక్కన్నగారు చాల జాగ్రత్త పడిరి.

శ్రీరాముని సన్నిధికి భద్రుడు వచ్చినాడు. లోకము శ్రీరాముని గూర్చి యనుకొను మంచినంతయు చెప్పినాడు. మంచియే చెప్పితివి కీడు మాటలుగూడ చెప్పుమనినాడు శ్రీరాముడు. ఈ యనుట అసామాన్యముగా నున్నది. ఏల? శ్రీరాముడు వానిని తరిమి యడిగినాడు. తరిమి యడుగుటలో విలక్షణమేమనగా ఏదో తన పరోక్షమున జైయుండునన్న

దృఢమైన జ్ఞానము కలిమి. మరియు వానిచేగూర్చి పలుకులు నిర్వింప వచ్చును. ఎదుటివాడేదో దాచి చెప్పినప్పుడు ; దాచి చెప్పుచున్నట్లు వాని మాటాడు ధోరణి పట్టియిచ్చినప్పుడు. భద్రుడు మాట్లాడిన దానినిబట్టి చూడగా వాడేదో దాచి మాటాడినట్లులేదు. వాని మాటలు విని శ్రీరాముడీ—

"తొలుత రాజ్యంబు సేయంగ దొడగి మనము
వివిధ వర్ణాశ్రమంబుల వృత్తమరసి
యలవరించుచో గొందర కహితమగుట
గొన్ని మాటలు పుట్టకయున్నె—?" (8–97)

అని ఏవో కొన్ని మాటలు పుట్టక తప్పదన్న నిశ్చయజ్ఞానముతో నున్నవానివలె అనుచున్నాడు. అతని కా జ్ఞానమెట్లు కలిగినది? అతనికి లోకస్వభావము తెలియును. వాల్మీకి బాలకాండమున వ్రాసినాడు. శ్రీరాముడు విద్వాంసుడని, మరియు నాత్మవానని. వీటన్నిటి తాత్పర్య మేమనగా శ్రీరాముడు సర్వజీవులయొక్క తత్తత్సంస్కారానుగుణమైన మనోభావముల స్వరూపస్వభావముల లోతుపాతు లెరిగినవాడని. అందు వల్లనే శ్రీరాముడు సీతను పరిత్యజించిన తరువాత దుఃఖమును నిగ్రహించుకొని రాజ్యపాలనాది బహుకృత్యములందు ప్రవృత్తుడగుచును ఏకాంతముగ నున్నపుడు సీతనుగూర్చి పలవరించుచు—

"లోకము వారి మెచ్చునకు లోలవిలోచన బారవైచితిం
బో కొరగామి యంతటన పోయెనె? దీనికి నింక గొందరో
వో కృపమాలి చేసె నిది యెప్పుడు పొమ్మని దుర్వినీతిగా
గైకొనిరేని వారి మదికందున కెయ్యది గందుదైవమా!" (9–91)

అని యనుకొన్నట్లు తిక్కన్నగారు వ్రాసిరి. ఈ పద్యము చాల చమత్కార మైనది శ్రీరాముడనుకొనుచున్నాడు. తాను సీతను పల పరిత్యజించెను. లోకమువారి మెచ్చునకు. అనగా లోకమువారు తనను మెచ్చుకొనుట నాశించి. అనగా తత్పూర్వము తనను మెచ్చుకొనకపోవుట సంభవించినదన్న మాట. అది ఒక కొరగామి. ఆ కొరగామిని పోగొట్టుకొనుటకు శ్రీరాముడు సీతను పరిత్యజించినాడు. అంతమాత్రముతో నది తీరిపోయినట్లేనా? తత్కాలమున తీరిపోయినట్లే. అనగా తాను తాత్కాలికముగా తనయెడల

లోకము కనిపెట్టిన నొక కొరగామిని తొలగించుకొన్నట్లు. ఆ కనిపెట్టిన లోకమే సర్వముగాదు. అది లోకమునందలి యొక భాగము. మరి మిగిలిన భాగమట్లే యున్నది. మరియు లోకము శాశ్వతమైనది. అపుడా శాశ్వతమైన లోకము తాను చేసిన చేతను గురించి యేమనుకొనును? "ఓహో! కృపమాలి చేసెనిది యెప్పుడు పొమ్మని దుర్వినీతిగా గైకొనును" అనగా ఏ తల్లోకమును తన యందొక కొరగామి కనిపెట్టుచున్నది. ఏల కనిపెట్టినదనగా తాను చేసిన పనివలన మనస్సున కంటైనందువలన. మరి దానికి తానేమి చేయవలయును? తానేమియు చేయగలిగినది లేదు. దైవమే ఏమైనను చేసిన చేయవలయును. ఇది శ్రీరాముని సీతాపరిత్యాగమునకు హేతుభూతమైన లోకమును గూర్చిన పర్యాలోచనము. ఇంత పర్యాలోచన మెవడు చేయును? సర్వజీవుల మనోవైలక్షణ్యము నెరిగినవాడు చేయగలడు. శ్రీరాముడట్టివాడు. అట్టివాడు గనుకనే భద్రుని తరిమి యడిగినాడు. "కీడు మాట సెప్పనగునో కాదో నాకనుఁ బాపము సుట్టక యుండ నేమి గల్గినఁగల యంతవట్టును చెప్పు మేరపడ" అని ధర్మసంస్థాపనాచార్యతత్త్వము బుజమున వేసికొన్న, లోకము మనోవైచిత్ర్యము నెరిగిన పురుషుడట్లే మాట్లాడును అట్టివా డుదాత్తుడు. ధర్మస్వరూపుడు ధర్మము కొరకు పుట్టినవాడు.

సీతను గురించి లోకమేమనుకొనుచున్నది భద్రుడు చెప్పినాడు శ్రీరాము డేవో కొన్ని మాటలు పుట్టియుండు ననుకొన్నాడుగాని సీతను గురించియే పుట్టియుండునని యనుకొనలేదు. ఏల అనుకొనలేదు?

సీతను గురించి లోకమొక కాని యూహను చేయుట కామెయందవకాశ మున్నదన్న బుద్ధియే శ్రీరామునకు లేదు. లేకపోవుటకు హేతువు రావణవధానంతర మామె అగ్నిపరీక్షలో నెగ్గికొనివచ్చుట కావచ్చును బ్రహ్మాదులు సీత పావిత్ర్యమును, పతివ్రతత్వమును ప్రశంసించుట కావచ్చును. కావచ్చుననుట యేలయనగా వెంటనే శ్రీరాముడనినాడు— "వేవురునేల నేను పృథివీసుత చిత్తము పెంపెఱుంగనే..."(8–117) అని. అనగా శ్రీరాముడు సీతయందంత నిశ్చయభావముతో నున్నాడు సీత యందొక కీడు గల్గుట భూవలయము సంచలత పొందినను, వారిధి మేరదప్పినను, దేవనగము పాతగిలి త్రెళ్ళినను, అసంభవమన్న దృఢమైన బుద్ధితో

నున్నాడు శ్రీరాముడు. అట్టి సీతను గూర్చియే లోకము కానియూహ చేసినది. మాట పుట్టించినది. శ్రీరాముని యూహావధిని దాటి లోకము ప్రవర్తించినది. ఏల ప్రవర్తించినది? విధివలన ప్రవర్తించినది. దాని నెవడును ఆపలేడు. ఈ యూహ శ్రీరామునకు వచ్చినదా? వచ్చినట్లు తిక్కన్నగారు వ్రాసినారా? వచ్చినది. వచ్చినట్లాయన వ్రాసెను. శ్రీరాముడు సీతను పరిత్యజించుటయే కృత్యముగా నిశ్చయించుకొని తమ్ములతో తన నిశ్చయము చెప్పుచు లక్ష్మణునితో—

> "కొనిచని వాల్మీకి తపో, వన పరిసరభూమిం ద్రోచివచ్చెడి దయ్యం
> గనకును నాకును నిదె విధి...." (8_126)

అనినాడు. తాను చేసిన నిశ్చయము నిజముగా తాను చేయదగినది గాదు. సీతకును ఆ స్థితి రావలసినది గాదు. రెండును జరిగినవి. ఈ జరుగుటయు విధియె. "అయ్యంగనకును నాకును నిదె విధి". లోకము విధి వశమున ఏమో అనగూడని దన్నది. ఆ విధియె శ్రీరామునిచేత సీతను పరిత్యజించు నిశ్చయము చేయించినది. ఆ విధియె భర్తవలన పరిత్యజింప బడి యడవుల పాలగుటను సీతయందు కల్పించినది. అందుకే శ్రీరాముడు "అయ్యంగనకును నాకును నిదె విధి" యనినట్లు తిక్కన్నగారు వ్రాయుట. విధి యనగా నేమి? స్థూలముగా చెప్పినచో కర్మ. సూక్ష్మముగా విచారించుకొన్నను కర్మయె విధి యగును. అయినచో కర్మయని విధియని యనుట యేలనగా లోకముయొక్క అనుభవము ద్వివిధముగా నున్నది. ప్రత్యక్ష కర్మానుభవ మొకటి. పరోక్ష కర్మానుభవ మొకటి.

మొదటిదానియందు కర్మయు, తత్ఫలితముగా వచ్చిన యనుభవము— రెండును ప్రత్యక్షములు. రెండవదానియందు అనుభవము ప్రత్యక్షమేగాని కర్మ ప్రత్యక్షము గాదు. అనగా పూర్వ పూర్వ జన్మములయందలి కర్మల యొక్క అనుభవ మీ జన్మమునకాగా,లోకము ఆ తనకైన యనుభవమునకు హేతువైనది ప్రత్యక్షము కానందువలన, పూర్వజన్మముయొక్క కర్మ సంబంధి స్మృతి లేనందున,కారణము లేక కార్యము పుట్టుటకు వీలులేనందున, తనకైన యనుభవమున కప్రత్యక్షముగా హేతువగుచున్నదానిని (నిజమున కది కర్మయే యైనను) విధియని వ్యవహరించుచున్నది. సీతారాములకు

సంభవించిన యాస్థితి విధివలన వచ్చినది. మరియు దీని కుపబలకముగా సీతను అరణ్యమున వదలి వచ్చునపుడు సుమంత్రుడు లక్ష్మణునితో చెప్పిన పూర్వోదంతమున్నది. పితృ, అనుజ, సీత, వియోగజనిత పీడలను శ్రీరాముడు పొందునని పుట్టిననాడు భూసురులు చెప్పినారట. వారెట్లు చెప్పిరి. శ్రీరాముడు జన్మించిన కాలమునందలి గ్రహస్థితినిబట్టి చెప్పియుండవచ్చును. మరియు తిక్కన్నగారు వ్రాయకపోయినను విష్ణుమూర్తికి భృగుమహర్షి శాపమున్నది దారావియోగవ్యథను పొందుమని. విష్ణు వపుడా శాపమును జన్మాంతరమున ననుభవించుట కంగీకరించినాడు[1]. శ్రీమద్రామాయణోత్తర కాండమున లేదుగాని సీతకును భర్తృవలన వియోగదుఃఖము ననుభవించుట కొక శాపమున్నది[2]. ఇవన్నియు నేల వ్రాయుటనగా విధి బలవతియని చెప్పుటకు—భూసురుల మాటలను లక్ష్మణునితో చెప్పి సుమంత్రుడు మరియు నిట్లనినాడు.

> " కావున విధికృత్యములగు
> నీ వృత్తాంతములకు నింత యేటికి వగవన్ " (8-56)

అనగా ఏది విధికృత్యమని తెలియబడునో దాని విషయమున వగపు కూడదన్నమాట. వగపనగా సుఖదుఃఖ రూపాత్మకమైన చిత్తవృత్తి. సీతను అరణ్యమున వదలి వచ్చుచున్న లక్ష్మణునకు మనోగ్లాని పట్టుకున్నది దాని తెగుదల చెప్పుమనగా సుమంత్రుడు భూసురుల మాటలను చెప్పి చివరి కా మాట యనినాడు. సీతను తీసుకొనిపోవుట కామెను రథమెక్కించి నపుడు కలిగినది ఉత్తలపాటు. దానికిని దీనికిని భేదమున్నది. శ్రీరాముని మాటచొప్పున లక్ష్మణుడుత్తలపాటు నణుచుకొన్నాడు మనోగ్లాని దాని వలె దిగమ్రింగదగినది కాదని తోచుచున్నది. దీనికి విరుగుడున్నది. దాని వలన ఇది పోవును. సుమంత్రుడు చెప్పిన దానినిబట్టి ఇది విధికృత్యమని తెలిసినపుడు దానివలన పుట్టిన మనోగ్లాని సమసిపోవును. గ్లాని సంచారి భావము. దాని లక్షణమే మరేదో ఒక అనుభావము నభివ్యక్తము చేసి తాను తిరోధానముచెందుట. గ్లాని దుఃఖరూప చిత్తవృత్తి – ఆధి

---

1. ఉత్తరకాండము. సర్గ 51.
2. పద్మపురాణము - పాతాళఖండము.

వ్యాధులవలన కలిగినదే గ్లాని యగును. ఆధి యనగా మనస్సునకు కలిగిన బాధ. వ్యాధి యన్నది శరీరమునకు కలిగిన బాధ. అసలాధి యనగా అధిష్ఠానము. అధిష్ఠానము పరమాత్మ. పరమాత్మకు బాధ కలిగినదని జీవుడనుభవించు దుఃఖరూపమైన అనుభవమేది యున్నదో అది ఆధిగ్లాని ఆధికి ఇతరమై, ఏది ఆధి యట్లు జీవుని పరిభ్రమింప జేయునో అది వ్యాధి (వి+ఆధి). అది శరీరము. ఆ శరీరమునకు సంభవించిన రోగము తనకేనని జీవుడు దుఃఖరూప అనుభవమెప్పుడు పొందునో అది వ్యాధిగ్లాని లక్ష్మణుని విషయమున మనోగ్లాని కలిగినది అనగా ఆధిగ్లాని లక్ష్మణుని అధిష్ఠానము శ్రీరాముడు. వానికి బాధ కలిగినదని లక్ష్మణుడు దుఃఖరూపమైన అనుభవము పొందినాడు. అధిష్ఠానము యొక్క యథార్థస్థితి, దాని అనివార్యత, సుమంత్రునివల్ల తెలిసికొనుటలో లక్ష్మణుని మనోగ్లాని తెగినది. లక్ష్మణుడు తెలిసికొన్నది విధి స్వరూపము. విధి యంతటి బలవతి.

చిత్రమంతయు, ఇది విధికృత్యమని తెలిసికొని కూడ తెలియనట్లు సుఖదుఃఖముల యనుభవమునకగు చిత్తవృత్తిని దానినుండి నిరోధించుకొనలేని శరీరధర్మము అభివ్యక్తమగుటలో నున్నది. శ్రీరాముడు సీత విషయమున జరిగినదంతయు విధికృత్యమనియే యనుకొనినాడు. అనుకొని కూడ "నేత్రంబుల బాష్పవారి నిగ్రనుడుప" (8_128) దగిన స్థితిలో నైనాడు. శ్రీరాముడుత్తమప్రకృతి కనుక, హర్షశోకముల వలన అనభిభూతుడు గనుక, రాజధర్మనిర్వహణమునందు నిష్ఠ కలవాడు కనుక, సీతను అడవికి పంపునపుడామెతో తనలోని ఆలోచన వెలికి తెలియనీయకుండ మాటాడినాడు. అప్పుడు తిక్కన్నగారు—

"అడలడచి నెమ్మనంబున వెడతెలి వొడగూర్చి..." (8_311)

యని వ్రాసిరి. తెలివి యనగా జ్ఞానము. వెడతెలివి యనగా ఇంచుకజ్ఞానము. మరియు చిత్రమైన జ్ఞానము. ఆ సమయమున మాటాడుటకు కావలసిన తెలివట్టిది. ఆ తెలివి ఎంత చిత్రమైనదనగా ఒక విధముగా శ్రీరాముడు సత్యము చెప్పుచున్నట్లు కనిపించుచు చెప్పని యట్లుండునంత చిత్రమైనది. శ్రీరాముడు సీతతో లక్ష్మణుని సమక్షమున అన్నట్లుగా తిక్కన్నగారు వ్రాసిన రెండు పద్యములును, సీతాదేవి లోపల అనుకొన్నట్లుగా వ్రాసిన ఒక పద్యమును జాగ్రత్తగా పరిశీలించినచో శ్రీరాముని వెడతెలివి స్పష్టపడును. శ్రీరాముడు సీతతో

"పొలతుక ! గంగచేరువ తపోవన భూములు సూడ నీమదిన్
మొలచిన కౌతుకంబు తుదిముట్టగ లక్ష్మణదేవు నిన్ను నం
దులకు మనోముదంబెసగ దోకొనిపో నియమించితిన్ సము
జ్జ్వల మణికాంతమైన రథసత్తమ మెక్కుదు రమ్ము-" (8-132)

నీవు గంగచేరువనున్న తపోవనభూములు చూడగోరితివి. నీకు కుతూహల మీడేరునట్లుగా లక్ష్మణుని నిన్నచటకు తీసికొనిపోవుటకు నియమించితిని. ఇక రథమెక్కుము. ఇది శ్రీరాముని అడిన మాటలవలన సీతకు బోధపడిన తాత్పర్యము. శ్రీరాముడు గంగచేరువ తపోవనభూములు చూడగోరితి వనియే యనినాడు చూచిరాగోరితి వనలేదు. అంతకు పూర్వము శ్రీరాము డేకాంతమున గర్భవతియైన సీత నేమైన కోరుకొనుమనినప్పుడు సీత అన్న మాటలలో గూడ "సింగంబుల్ మునిబాలకుల్ ధర్మప్రీతిమై జూచుచున్ గంగాతీరము కానలోన దిరుగంగా గౌతుకంబయ్యెడి" (8-89) ననియె అన్నది. ఆమెయు చూచి రావలయునని యున్నదనలేదు. ఆనాడందుకు ప్రతి శ్రీరాముడన్న దానిలో గూడ "నీవు గోరినట్లు చేయుటెంత పెద్ద. శీఘ్రంబ యచటికి బుచ్చువాడ"(8-90) ననియే యున్నది తిరిగి వచ్చుట వారి మాట లలోలేదు. విధి ఆ మాట రానీయలేదు వారి నోటివెంట "పొలతుక గంగ చేరువ" అన్న పద్యమున కావలయునని శ్రీరాముడు చూచిరాగోరితివని యనక పోయినను అంతకు ముందు జరిగిన సీతతోడి సంభాషణమునం దైనను ఆ మాట రావచ్చును. రాలేదు తిక్కన్నగారు ఆ మాట రానీయక జాగ్ర త్తగా వ్రాసిరి. అనగా ముందు జరుగబోవు కథ కనుకూలములైన వాక్య ములే పాత్రములు పలికినట్లు వ్రాయుట కావ్యశిల్పము. మూలమున సీత తన కోరికను శ్రీరామునితో చెప్పుచు — "అప్యేక రాత్రం కాకుత్స్థ నివ సేయం తపోవనే"[1] అని అన్నట్లున్నది. సీతను పంపునపుడు శ్రీరాముడు మాటాడినట్లు మూలమునలేదు. అచటలేని దానిని కల్పించి. అంతకుముందు మూలముననున్న "నొకరాత్రి" అన్న విషయమును తొలగించి, మొత్తము జరుగబోవు కథను, శ్రీరాముని ఉదాత్త ప్రకృతిని, ధర్మనిష్ఠను తిక్కన్నగారు పరమరమణీయముగా వ్యంగ్యమానము చేసినారు.

---

1. ఉత్తర కాండము సర్గ. 42, శ్లో. 35.

శ్రీరాముని ధర్మవీరమును ప్రపంచించుటలో తిక్కన్నగారు అధికముగా అవిషాదత్వ లక్షణమును పోషించినారు. సీతావియోగజనిత విషాదమును శ్రీరాము డేకాంతమున మాత్రమే అనుభవించును. శ్రీరాము డెంత దుఃఖమును మ్రింగికొని "ప్రజల కనురాగలతల్ నివ్వటిలజేయు" చున్నదియు శ్రీరాముని ఏకాంతచింతను గమనించినచో తెలియును. ఏకాంతమున ధైర్యము వల్లటిల్లును. ఇతరములయందు ప్రవృత్తిలేని స్థితితో మనస్సు నెడ బాయని దానిని గురించి భావన వచ్చును. తిక్కన్నగారు –

"మనమున బాయని ధరణీ, తనయవలని వగల నేకతంబ
పొగులు నమ్మనువంశదీపకుండు–" (8–86) అని వ్రాసిరి

సీతావిషయిక సుఖదుఃఖరూపమైన చింతనము శ్రీరాముని మనస్సును విడనాడలేదు. ఏకాంతమనగా ఇతరప్రవృత్తులనుండి విరమించుకొన్న చిత్తముండుట కనువైన ప్రదేశము. అచట మనస్సును విడనాడని–అనగా మనస్సులోని–సుఖదుఃఖరూపానుభవము మాత్రముండును. శ్రీరాముని మనస్సులో సీతావిషయికమైన చింత యున్నది. అది ప్రస్తుతము దుఃఖరూపము. తాను ధీరోదాత్తుడు గనుక అది తన ఇతరప్రవృత్తుల కాటంకము కాకుండ చూచుకొనుచున్నాడు. ఇతరత్ర ప్రవృత్తిలేనపు డదే ప్రవృత్తి. అది అనివార్యము. అందువలన సీతను గురించి శ్రీరాము డేకాంతమున చింతించుట. శ్రీరాముని ఆ చింత యొక్క చరమదశను తిక్కన్నగారొక ఆటవెలది పద్యమున లోకోత్తరముగా నిరూపించినారు. ఆ పద్యమిది—

"అని దురంత శోకమునఁ బొంది సెజ్జపై
మేనువైచి కన్నుగోనలందు
నివుడు వశ్రువారి చెవుల కొలంకుల
నిండ నిట్టుఁ జను విభుండు మరియు". (8–89)

శ్రీరాముడు పాన్పుమీద వెల్లికల పండుకొనివాడు. ఆయన కావలయునని అట్లు పండుకొనలేదు. మేనును పాన్పుమీద పడవేసినాడు. ఆ శరీరమట్లు వెల్లికలపడినది. ఇక శరీరస్మృతి లేదు. సర్వేంద్రియములు సీతా విషయికమై

పర్యాలోచించుచున్నవి. కన్నులవెంట నీరు దానంతట అది కారిపోవుచున్నది. వెల్లికల పండుకొనియున్న శరీరముయొక్క కన్నులనుండి నీరు కారుటవలన ఆ నీరు కనుకొలకులనుండి జారి చెవిగూబల ప్రక్కగా చెవుల కొలకులు నిండి పోయినవి. ఆ చెవుల కొలకులు నిండిపోయినను శ్రీరాము డా పండుకొన్న పండుకొనుట కదలలేదు. అంత నిశ్చేష్టతను శ్రీరాముడు పొందినాడు. పూర్వ స్మృతులు వచ్చినవని, వానివలన దుఃఖము పెరిగినదని వ్రాయుట అంతయు నొక యెత్తు; పై ఆటవెలది పద్యము వ్రాయుట ఒకయెత్తు. అంత సూక్ష్మ విషయము పరిశీలనపటువైన బుద్ధి మహాకవులకుండును. తిక్కన్నగారు మహాకవి. మరియు చివరకు తిక్కన్నగారు వ్రాసినారు—

> "అని వందుచు నంగన దెస
> వనటకు సామ్రాజ్య వివిధ వర్తనమునకుం
> దన చిత్తము పొక్కగ న
> మ్మనుజేంద్రు డుదాత్త వృత్తిమాట యేలునెడన్" (9-92)

అంగనదెస వనటకు వందుచు, సామ్రాజ్య వివిధ వర్తనమునకుం దన చిత్తము పొక్కగ-శ్రీరాము డుదాత్తవృత్తి మహి యేలెను. సీత విషయమై పర్పడిన శోకమునకు సంతాపించుచును, రాజ్యపరిపాలనాది వివిధ వర్తనములు తప్పనిసరి యగుటవలన శ్రీరామునిచిత్త ములికినది. అయినను రాజ్య కార్యనిర్వహణమున కా యులు కడ్డము రానీయకుండ చేసికొన్నాడు శ్రీరాముడు. ఆ చేసికొనుటయే ఉదాత్తవృత్తి. ఈ పద్యము సీతాపరిత్యాగ మునకు సంబంధించిన చివరిపద్యముగా తిక్కన్నగారు వ్రాసిరి. దీని తరు వాత పద్యము లవణాసురుని ప్రసక్తికి తెచ్చినది. ప్రియభార్యావియోగ శోకానలభిభూతాంతఃకరణము కలిమి యుదాత్తత. ఏతదంతఃకరణము మహి యేలుటయందు ప్రవర్తించుట ఉదాత్తవృత్తి. శ్రీరాముడట్లుగా రాజ్యము చేసెను. ధీరోదాత్తుడైన శ్రీరాముడు ధర్మవీరుడై రాజధర్మమునకు ప్రాణ భూతమైన జనమానసరంజన కృత్యములు నెరవేర్చుటలో మొదటిది పూర్తి యైనది.

సీతయొక్క ఎడబాటును గురించి శ్రీరాముడనుకొనునది ఏకాంత మున నున్నపుడు;మరియు అశ్వమేధ సమయమున పసిడి సీతాప్రతిమను ప్రక్క

నుంచుకొన్నపుడును ఏకాంతమున శ్రీరాముడార్తినిపొందుటనొకసారిమాత్రమే తిక్కన్నగారు వ్రాసిరి. అశ్వమేధము సమయమున నేమియు వ్రాయలేదు. హృద్గతఖేదము లోనడచి అని మాత్రమే వ్రాసెను (10–105). ఈ పద్యముల తాత్పర్యమేమనగా శ్రీరాముని మనస్సు మాత్రమే నిరంతరము సీతా వియోగ దుఃఖరూపముగనే ఉన్నది. ఆ యుండుట అతని రాజ్యధర్మ నిర్వహణమున కాటంకము కాలేదు. శ్రీరాముని మనోగత దుఃఖము ఎప్పుడు తొలగినదియు తరువాత వ్రాయబడును.

"భూనాథుడిట్లు దమ్ములుఁ
దానును వివిధ ప్రకార ధర్మనిరతులై
నానా విధ సజ్జన స
మ్మాన సదాదాన నిపుణమతి నున్నయెడన్" (10–52)

ఈ ఘట్టము శంబూక వధ ఘట్టము ప్రారంభమగుటకు ముందున్నది. మరియు లవణాసురుని వధించివచ్చిన శత్రుఘ్నుని తిరిగి మధురాపురము రాజ్యమునేలుటకు శ్రీరాముడు పంపినాడన్న తరువాత నున్నది. శ్రీరాముడును వాని తమ్ములును వివిధ ప్రకార ధర్మనిరతులు ధర్మము వివిధ ప్రకారము. వాటియందు నెడతెగక ప్రవర్తించువారు శ్రీరాముడను, తదనుజులును. అట్లు ప్రవర్తించుటలో వారు నానావిధ సజ్జనసమ్మాన నిపుణమతులు. మరియు సదాదాన నిపుణమతులు. శంబూకుని శ్రీరాముడు వధించుటను ప్రారంభింపబోవుచు తిక్కన్నగారిట్లు వ్రాసిరి – శ్రీరాముడు వివిధ ప్రకార ధర్మనిరతుడు. నానావిధ సజ్జనసమ్మాన నిపుణమతి. ఒక బ్రాహ్మణ బాలుడు చనిపోయినాడు. ఒక శూద్రుడు తపస్సు చేయుచున్నాడు. అతని తపస్సందుకు హేతువు. ఆ శూద్రుని చంపి ఆ బ్రాహ్మణుని రక్షింపవలయును. ఆ శూద్రుని చంపుట ధర్మమేయగును. త్రేతాయుగమున శూద్రుడు తపస్సు చేయుటధర్మముగదా.? అందుకని ధర్మము వివిధ ప్రకారము. ఎప్పుడు ఏ ధర్మమునకు స్థితి యుండునో అప్పుడా ధర్మమునందు నిష్ఠగలవాడగుట శ్రీరాముని లక్షణము. అందుకే శంబూకుని వధించినాడు. శంబూకుడు శూద్రుడు. నిజమే వాడు యుగధర్మము నతిక్రమించినాడు. కాని చేయు

---

1. 9-86...91.

నది తపస్సు. అందువలన వాడు గతరోష మదభ్రమ చిత్తవృత్తి. ఏవం విధ చిత్తవృత్తి సజ్జన సహజము. ఆ శంబూకుడు సజ్జనుడు. సజ్జనులును నానా విధములుగా నుందురు. అందా శంబూకుడొకడు శ్రీరాముడు సజ్జనుడైన శంబూకుని వధించి ఎవరికిని పొందరాని గతిని పొందించి సమ్మానించినాడు. శ్రీరాముడు శంబూకుని వధించుట ధర్మనిరతి. వరికి పొందరాని గతికేగించుట సమ్మానము. ముందు రాబోవు కథకు పీఠికాప్రాయముగా నున్న పద్యమది

ఈ శంబూకవధ శ్రీరాముని వర్ణాశ్రమధర్మ వ్యవస్థాభూతుడుగా నిరూపించునది. ధర్మవీరుడైన శ్రీరాముని అవిస్మయరూప చిత్తవృత్తిని తిక్కన్నగారిచట నిరూపించిరి. ఈ విస్మయమును కరుణాతిశయముగా చూపించుట గమనింపదగినది. శ్రీరాముడు ధర్మాచార్యుడు. అతివిదగ్ధత నలుదిక్కులు శోధించి చివరకు శంబూకుని వద్దకువచ్చినాడు. వానినిట్లడిగినాడు—

"ఏమి కులంబున బుట్టితి ?
నామం బెయ్యది ? తపంబునకు ఫలమై నీ
కామించిన తెఱఁగెట్టిది ?
నీ మదినున్నట్లు నాకు నిక్కము చెపుమా—" (10–73)

శ్రీరాముడడిగిన ప్రశ్నలకు వరుసగా శంబూకుడు సమాధానము చెప్పినాడు. శ్రీరాము డచ్చెరువందినాడు ఆశ్చర్యము దేనికి ? వాని సత్య హితోపదేశవాణీవిభవమునకు. అది కేవలమాశ్చర్యకరము కాదు. శూద్రముని చేయు గాఢతపము వలని ఫలిత మాతనికెట్లు లభించునాయన్న అనుకూల భావము. వెంటనే వానిని సంహరింపవలసి యున్నదన్న విషయము జ్ఞాపకము రాగానే ఆ మునిపై "సదయంబగుచూడ్కి నిల్పి చింతా వివశత్వమందె నృపధర్మము నీచముగా దలంచుచున్" (10–75). ప్రజా పాలనము నృప ధర్మము. పరిపాలనమనగా రక్షణ. బ్రాహ్మణ బాలుని ప్రాణమును రక్షించుటకే శూద్రమునిని చంపవలసి వచ్చినదేయన్న వెనుకడుగు పడుట జరిగినది. ధర్మనిర్వహణ విషయమున కృపనెడసేయవలయును. కాని—

కరుణాతిశయంబు ప్రజా
పరిపాలన రీతియుఁ బెనగువడి యుల్లములో
బిరిగొన నిశ్చయమునకుం
జొరజాలక తలకు పాలసుండును బోలెన్—" (10–77)

"నరనాథుండిటులెట్టకేలకు విలీనంబైన చిత్తంబు సు
స్థిరభావంబున బట్టుకొల్పికొని నిశ్చింతాత్మ నత్తాపసున్
శరణార్థి స్ఫుట రక్షగోరి తునిమెన్"— (10–80)

శ్రీరాముని చిత్తము విలీనమైనది. అనగా ద్రవీకృతమైనది. నిశ్చయ రూపమైన అంతఃకరణమునకు చిత్తమని పేరు. ఇదియే బుద్ధి యనబడును తపస్సు చేయుచున్న శూద్రుని చంపవలయునన్న చిత్తము – అనగా నిశ్చయము–కరుణాతిశయమున ద్రవీకృతమైనది అనగా కరుణమునందు ప్రవర్తించినది. కేవలము కరుణము నిష్క్రియాత్మకము: శ్రీరాముడు ధర్మవీరుడు. వీరము ప్రవృత్తి రూపము వర్ణాశ్రమధర్మ వ్యవస్థాభూతము శ్రీరాముని చిత్తము సమాహితదూరమైనది. కనుకనే శ్రీరాముని పాలసుడవి తిక్కన్నగారు వ్రాయుట అట్టి చిత్తమును సమాహితము చేసికొనినాడు ఆ చేసికొనుట యెట్లుండుననగా "బలిమిని నౌషధరసంబు పానము సేయందలకొను రోగార్తుని క్రియ" (10–79) వలె నుండును. చిత్తము సమాహితము కాగానే ప్రజ్ఞ నాబడు జ్ఞానము గలుగును. అపుడు వస్తుయాథార్థ్యము బోధపడును అందువల్లనే శ్రీరాముడు శంబూకుని "సంరంభ శూన్యాంగుడై" తునుమ గలుగుట. అనగా శ్రీరామునకా మునిని చూచినప్పటినుండి చిత్తము స్వాస్థ్యమును కోల్పోయినది. అందుకు హేతువు కేవలము "విస్మయము". దానిని శ్రీరాముడణచుకొనలేక కొంతసేపు తటపటాయించినాడు. ఆ శూద్ర ముని సత్యము పలుకుటకు – వాని తపస్సునకు శ్రీరామునికాశ్చర్యము కలిగినది. ఆ యాశ్చర్యము నణచుకొనుటకు యత్నించుచుండగా నది కరుణముగా మారినది. అపుడు శ్రీరాముడు పాలసుడు. "పెద్దయు వడి నిలిచి తలంచుకొనిన" (10–78) గాని విలీనంబైన చిత్తమును సుస్థిర భావంబున పట్టుకొల్పికొనలేకపోయినాడు. అనగా చిత్తమును సమాహితపరచుకొనలేకపోయినాడు వీరుడు గనుక చివరకు సంరంభశూన్యముగా శూద్రమునిని సంహరించినాడు – ఇది శ్రీరాముడు చేసిన రెండవ ధర్మామప్రాణితమైన వీరకార్యము.

ఇక శ్రీరాముడు చేసిన మూడవ కార్య మశ్వమేధము. నిర్వచనోత్తర రామాయణమున తిక్కన్నగారీ అశ్వమేధమునకు ప్రసక్తిని కల్పించుట రమణీయముగా లేదు. ధర్మ సంగ్రహైకతత్పరాత్ముడై శ్రీరాముడు చేసినాడు.

అసలు ఉత్తరాకాండమున గూడ ఈ యజ్ఞముప్రసక్తికి వచ్చిన సందర్భముచిత రమణీయముగా లేదు. పైగా ముందు శ్రీరాముడు రాజసూయము చేయుదుననగా తమ్ములు, ముఖ్యముగా భరతుడు, రాజసూయము వలదని అశ్వమేధము చేయుమనును. ఈ సందర్భమున నుత్తరకాండమున భరతుడు "సత్యమేవం విధం యజ్ఞ మాహర్తాసి కథం నృప, పృథివ్యాం రాజవంశానాం వినాశో యత్ర దృశ్యతే"[1] యనినాడు. తిక్కన్నగారు గూడ "విశ్వభూజన మనుజేశ్వరప్రకర సంక్షయ మూలమునా ప్రసిద్ధికెక్కిన క్రతువేల"(10-100) అని భరతుడన్నట్లు వ్రాసెను. లక్ష్మణుడు అశ్వమేధంబుపూజ్యమనినాడు. కాని ఉత్తరరామచరితమున నాల్గవ అంకమున "అశ్వమేధ ఇతి నామ విశ్వవిజయినాం క్షత్రియాణాం ఊర్జస్వల స్సర్వక్షత్ర పరిభావీ మహానుత్కర్ష నికషః" అని యున్నది రాజసూయము జన మనుజేశ్వరప్రకర సంక్షయ మూలమై అశ్వమేధము కాకపోవుట యెట్లో విచారింపవలసి యున్నది యజ్ఞము ప్రారంభమైనది.

"క్రతు వొనరింప దొడగి భూ
పతి పత్నీకృత్యములకుఁ బసిడిని సీతా
ప్రతిమ నొడగూర్చుకొని హృ
ద్గత ఖేదము లోననడచి ధైర్యము పేర్మిన్". (10-105)

హృద్గతఖేదము లోననడచుట యేమి? సీతావియోగ దుఃఖము నిరంతరము శ్రీరాముని హృదయగతమై యున్నది. ఇపుడు యజ్ఞమున పత్నీ కృత్యములకు పసిడి సీతాప్రతిమను పెట్టుకొని తానే ఆ కృత్యములను నెరవేర్పవలసి వచ్చినది. అయ్యో సీత ఇపుడుండవలసినది గదా! ఉన్న ఆమెను లేకుండ చేసికొంటిని. చేసికొని కూడ ఈ ప్రతిమను పెట్టుకొని ఆమె ఉన్నట్లనుకొనవలసి వచ్చెను. ఇది యేమి గతి? ఇత్యాదిగా దుఃఖము–అది హృద్గతము. దానిని లోన ధైర్యముయొక్క అతిశయమువలన శ్రీరాము డణచినాడు. ఆ ధైర్యముదాత్తతలోనిది. అదివరలో సామాన్యముగా లోననున్న దుఃఖము ఈ యజ్ఞసమయమున, సీతాప్రతిమను చూచినపుడు వెలికివచ్చుట సహజము. సామాన్యుల కనివార్యము. శ్రీరాముడు దానిని లోన నణచినాడు. ఇప్పుడే గాదు. లవకుశులు తన కుమారులని తెలియ వచ్చిన తరువాత శ్రీరాముడు—

1. ఉత్తరకాండము సర్గ. 83, శ్లో. 14.

"ఆనందము గదిరిన నఖి
మాని యగుట నయ్యవస్థమది నిడుకొని" (10-141) న వాడుగనే తిక్కన్నగారు వ్రాసిరి ఇచట ఖేదము ను ఎట్లు హృదయమున నణచుకొనినాడో అట్లే అచట ఆనందమును మదినణచుకొనినాడు శ్రీరాముడు హర్షశోకాదుల వలని అనభిభూతత్వమనగా నది వాల్మీకి వీరు నీ కుమారులని చెప్పగనే శ్రీరాముని అంతఃకరణమున కలుగవలసిన భావవికారములు కలిగినవి

> "అనవుడు జనపతి నెమ్మన
> మున నచ్చెరువాటు ముదము ముప్పిరి గొనగా
> కనుదోయి సమ్మదాశ్రుల మునుగగ
> ఫలకములుమేన ముసుగు వడంగన్" (10-140)

కాని శ్రీరాముడేమియు లేనివానివలెనే వాల్మీకితో మాట్లాడినాడు.

తిక్కన్నగారు శ్రీరాముని పాత్రచిత్రణమున చేసిన మరొక లోకాతిశాయి శిల్పము సీత భూదేవిని ప్రార్థించి ఆమెతో పాతాళమునకేగిన సందర్భమున నున్నది. ఆ సందర్భమున నుత్తరకాండమున "దండకాష్ఠ మన ష్టభ్య బాష్ప పర్యాకులేక్షణః, అవాక్శిరా దీనమనా రామో హ్యాసీత్సుదుఃఖితః. సరుదిత్వాచిరంకాలం బహుశో బాష్ప ముత్సృజన్, క్రోధశోక సమావిష్టో రామోవచన మబ్రవీత్......ఏవంబ్రువతి కాకుత్స్థే క్రోధశోక సమన్వితే"[1] అని యున్నది. సీత పాతాళమునకు పోగానే - అనగా భూదేవి ఆమెకు మార్గమీయగనే - శ్రీరాముడు క్రోధ శోకసమన్వితుడై భూదేవి నుద్దేశించి పలికినాడు. సర్వము నాశనము చేయుదునని పలికినాడు. బ్రహ్మ శ్రీరాముని శాంతింపజేయవలసి వచ్చినది. నిర్వచనోత్తరరామాయణమున తిక్కన్నగారివిషయములను స్పృశింపకుండ-

> "అక్కుమారులు రాము పాదంబుజముల
> కెరగి " భూదేవి తప్పు సహింపవలయు
> దేవ!" యని ముద్దుపుట్ట బ్రార్థించునట్లు

1. ఉత్తరకాండము సర్గ 98, శ్లో. 1,2;12.

గాగ నత్తరి వాల్మీకి గరపుటయును
వారలు నవ్విధమున నా
భూ రమణుని మదికి నింపు పుట్టింపగ" (10–145,146)

అని రెండు పద్యములు వ్రాసెను శ్రీరామునకు నిజముగా నా సమయమున క్రోధశోకములు కలుగుట సహజము. ఆ కలుగుట వెలికి తెలియబడకుండ నున్నది సీత శపథముచేసి పాతాళమునకు పోయిన సందర్భమున నచట చాలమంది యున్నారు శ్రీరామునిలో కలిగిన క్రోధశోకము లచటివారియెరుక కందునట్లుగా లేవు అనగా బహిర్గతములు కాలేదు. అట్లు కాకుండ నిగ్రహించుకొనుట ధీరోదాత్తత కాని అసలు కలుగకుండ నిగ్రహించుకొనుట తరము కానిది. ఆ శ్రీరాముని మనస్సులోని క్రోధశోకములను వాల్మీకి గ్రహించినాడు. వాల్మీకి గ్రహించినట్లుగా వ్రాయుటలోగూడ రమణీయార్థస్ఫురణమున్నది. అసలు రామాయణము వ్రాసినదాయనే కదా! ఆయన శ్రీరాముని మనోధర్మము లెరిగియేగదా దానిని వ్రాసెను. ఆ యెరుగుట యెట్లు కూడినది? భవభూతి ఉత్తరరామ చరితము సప్తమాంకమున వాల్మీకిని గురించి "యదినం అస్మాభిరార్షేణ చక్షుపాసముద్వీక్ష్య" అని చెప్పినాడు. మరియు తిక్కన్నగారు—

ఇహపర సౌఖ్య నిదానము
మహితాపత్యంబ యనుచు మనుజేంద్రు మనో
విహరణముఁ బుత్రలాభ
ప్రహర్ష విషయంబుజేసె పరమప్రీతిన్" (10–144)

అని వ్రాసిరి. మనుజేంద్రుని యొక్క మనస్సుయొక్క పరిక్రమమునకు పుత్రలాభము వలని ప్రహర్షమును విషయము చేసినాడు వాల్మీకి. ఆ పద్యములో ఏక విషయమును బోధించు రెండు శబ్దములున్నవి. అపత్యమొకటి;పుత్రుడని మరియొకటి.నపతత్యనేన పితా నరకమితి అపత్యం. పున్నామ్నో నరకాత్త్రాయత ఇతిపుత్రః.శ్రీరాముని మనస్సుయొక్క విహరణము–ఇచట విహరణమునకు వృత్తి యని యర్థము శ్రీరాముని మనస్సు సర్వేంద్రియములద్వారా సీత విషయమున ప్రవృత్తిని పొందగా వాల్మీకి తద్విషయమునుండి అపత్యరూప విషయాభిముఖముగా మరలించినాడు. శ్రీరామునితో వాల్మీకి పుత్ర

లాభము నెరిగించినాడు. ఊరక నెరింగించుట కాదు. ఇహపరములకది నిదానమనినాడు నిదానమనగా దేనిచేతనైతే కార్యము పుట్టింపబడునో అది. అనగా ఇహపరసౌఖ్యములు జీవికగునది అపత్యము వలన నన్నమాట. భార్యవలన కాదు.

ఈ విషయమును వాల్మీకి వలన శ్రీరాము డెరుగుటతో ఇహపరసుఖ రూప హర్షమునందు మనస్సు ప్రవర్తించినది. ఆ ప్రవర్తించుటతో సీతవలని క్రోధశోకము లంతరించినవి. ఆ యంతరించుట అట్లే అంతరించి పోవలయు నని వాల్మీకి, శ్రీరాముని మనస్సు ఏ హర్షమునందు ప్రవర్తించుచున్నదో ఆ హర్షమునకు మూలభూతులైన కుమారులను ఆతని పాదసమీప వర్తులను చేసినాడు. వారికి ముద్దుపుట్ట ప్రార్థించునట్లుగా గరపినాడు. వారట్లే చేసిరి. శ్రీరాముని మదికి ఇంపు పుట్టినది. అనగా ఏ సంతోషమున శ్రీరాముని మనస్సున్నదో అది అందే అట్లుండినదైనది. అనగా క్రోధశోకములు తిరోభూతములైనవి. పుత్రలాభ హర్షము నిలచినది. మూలముననున్న శ్రీరాముని క్రోధశోకములను స్పృశింపని వాడువలె తిక్కన్నగారు రచనచేసి అసలు శ్రీరాముని అంతఃకరణప్రవృత్తియొక్క ప్రథమస్వరూపమును వ్యజ్యమానము చేసినాడు. ఉత్తమకావ్య రచనాశిల్పాపూర్వము లిట్లుండును.

మనుజేంద్రుు మనోవివరణము పుత్రలాభప్రహర్ష విషయము చేసె నన్నదానికి సంబంధించిన మరొం విషయమున్నది. తొమ్మిదవ యాశ్వాసమునందు "మనమున ఛాయని ధరణీతనయవలని వగల......" అను పద్యము కలదు. రాముని మనమున సీతవలని వగలు విడువక యున్నవి. అనగా శ్రీరాముని మనస్సునకు విషయమైనదేది? సీతవలని వగపు. అది యెంతవరకున్నదనగా వాల్మీకి శ్రీరాముని మనోవిహరణకు బుత్రలాభ ప్రహర్ష విషయముగా చేయువరకు. సీత పాతాళమునకు పోయిన క్షణము ననే శ్రీరాముని మనస్సున కామె విషయము కాలేదు. ఆమె నాయన పరిత్యజించిన నాటినుండియు నాయన మనోవిహారణమునకు విషయమై యున్నది. అట్టి మనస్సును వాల్మీకి చివరకు పుత్రలాభరూపము సుఖమున కభిముఖము చేసినాడు. అనగా ఇక శ్రీరాముని మనస్సు సీతా వియోగాదికమునుండి ప్రవృత్తిని కోల్పోయినదన్నమాట. శ్రీరాముని మనస్సును పట్టుకొనియున్న దుఃఖము సీతావియోగ సంబంధి ఏతద్ దుఃఖమును పుత్రయుగ యోగానంద

మగ్గించి వాల్మీకి తొలగించినాడు. శ్రీరాముని మనోగతమైన దుఃఖము ఇప్పుడు తొలగిపోయినది. ఈ సందర్భమున శ్రీరాముని కేవల మాంతరంగికమైన సీతావియోగము వలని క్లేశమును సుకుమారముగా తిరుగతోడి దానిని అణగద్రొక్కగల పుత్రలాభసుఖమును ప్రస్ఫుటపరచి శ్రీరాముని ధీరోదాత్తత తోడి ధర్మవీరమునందలి అస్థిత్వమును తిక్కన్నగా రుచితరమణీయముగా నిరూపించిరి.

సీతను పరిత్యజించుటలో లోకారాధన తత్పరత, శంబూకుని వధించుటలో ధర్మనిర్ణయముతోడి ప్రతీకార కర్మాచరణము, అశ్వమేధము చేయుటలో ధర్మసంగ్రహైకతత్పరత మూలభూతములుగా శ్రీరామునియందు కనిపించుచున్నవి. లవణాసురవధ చేయించుటలో కేవలము దుష్టరాక్షస శిక్షణ, విప్రరక్షణ అంతే

## 2. రావణుడు

నిర్వచనోత్తరరామాయణము నందలి పూర్వభాగమునకు రావణుడు నాయకుడని వెనుక చెప్పబడినది. ఆ పూర్వార్ధమును మూలముతో పోల్చి పరిశీలించుచు వ్రాయుటతోనే శ్వాచిత్కముగా రావణుని మనోభావములు స్పృశింపబడినవి రావణుడు ధీరోద్ధతుడు. రావణుని చరిత్రలోనున్న ముఖ్యాంశములు రెండనియు, అవి తానే వీరుడనన్న భావము, విధి నిషేధములేని స్త్రీవిషయసుఖవాంఛ అనియు ఇతఃపూర్వము వ్రాయబడినది. ఉత్తరార్ధమున ధర్మవీరము రసమైనట్లు పూర్వార్ధమున రౌద్రస్ఫూర్తితోడి యుద్ధవీరము రసము.

> "తను నిట్లాడిన తల్లి మాటలకు మాత్సర్యంబు చిత్తంబునం
> దనరంగా దశకంధరుండనియె నుత్సాహంబు వాటించి యీ
> తనితో సాటి యనంగ మేలన అమంద శ్రీవిలాసంబు సే
> కొని యీ లోకములెల్ల నేలుదును నీకుం జింతయింతేటికిన్" (౩-61)

ఈ నిర్వచనోత్తర రామాయణమున రావణుని మనోవాగ్వైఖరులు ప్రప్రథమముగా నావిష్కరించిన పద్యమిది. తండ్రికడకు వచ్చి పోవుచున్న ధనదుని జూచి చిన్నవోయి కైకసి రావణునితో నన్నది.

"ఇతని మహాసంపద చూ
చితె - మీరొక్కనిః పుట్టి శ్రీతేజములం
దిత డిట్లుండగ నీ వి
ట్లితి హీనతనున్న యుష్మదంబ్రదే విన్నున్" (౩-౧౮)

అని ఆ మాట వెంబడి రావణుని చిత్తముననొక వికారము కలిగినది. అది మాత్స్యర్యము. మత్సరము యొక్క భావము మాత్సర్యము. మదముచేత వర్తించుట యేది గలదో అది మత్సరము. అన్యశుభద్వేషముతో మత్సరము ప్రారంభమగును పరక్లేశమువలన సంతోషపడుట మత్సరమునకు పరాంకోటి. రావణునకు మాత్సర్యము కలిగినదనగా ధనదుని వైభవమునందు ద్వేషము కలిగినదని. ఆ ద్వేషముతో వానిని మించవలయునని బయలుదేరినాడు. ఉత్సాహంబు వాటించి అని యనినాడు రావణుడు ఉత్సాహమనగా విక్రమచేష్ట. ప్రయాసాదికమును నోర్చుకొనుట. ఇవి దేనికి ? ఇష్టప్రయోజన సిద్ధ్యర్థము. రావణుడు తన తల్లితో అనినాడు—ఉత్సాహమును పాటించి ఈ ధనదునితో సమానమని గాని, అంతకంటె యెక్కుడనిగాని అనిపించుకొని ఈ లోకముల నెల్ల తా నేలెదనని. రావణుని వాక్కు నిక్రమించుటను చెప్పుచున్నది. చిత్తము మాత్సర్యమలీమసమైనది. ఇచట ఉత్సాహమునకు చెప్పిన యర్థముతో పొసగియుండలేదేమని యనవచ్చును నిజమే. లేదు. వెనుక చెప్పినది వీరమునకు స్థాయియైన ఉత్సాహమును గురించి. ఇచట అది కాదు. ఇచట ప్రసక్తమైన రావణసంబంధి వీరము అచ్చము వీరము కాదు. రౌద్రస్ఫూర్తి మిక్కుటముగా నున్నది. దీనికి స్థాయి క్రోధము. ఇచట ఉత్సాహమన్నది ఒక సంచారి భావము మాత్రమే యగును.

రావణుడుద్ధతుడు. ఉద్ధతియనగా నూరక పైకెగురుట. ఆ యెగురుట కొక అంతని యుండదు. అదొక విచిత్రమైన తలతిరుసు. ఎన్నిసార్లు దెబ్బలు తిన్నను ఆ యెగురుట ఆగదు. అది అట్లే సాగిపోవుచుండును. ఏవంవిధమైన సాగుదల యెవ్వనికుండునో వాడుద్ధతుడు. రావణుడుద్ధతుడు. ఆ అదరిపాటులో ఆత్మస్తుతి–పరనింద–ఇత్యాది దుర్గుణములన్నియు నుండును విశ్వనాథ కవిరాజు ధీరోద్ధతలక్షణముగా చపలతనుగూడ పేర్కొనెను.[1] చపల

1. ఆంధ్ర సాహిత్య దర్పణము–87–82.

మనగా స్థితి లేనిది.మరియు నా శబ్దమునకు "చప మందాయాం గతే" అని మందమైన జ్ఞానము కలదన్న యర్థమును చెప్పవచ్చును. అదియనుగాక "అవిమృశ్యతో యః కార్యం పురుషోవధ బంధనాదికం కుర్యాత్, అవినిశ్చిత కారిత్వాత్సతు ఖలు చపలో బుధైర్జ్ఞేయః" అని యుండుటనుబట్టి, వధ బంధనాది కృత్యముల నెవడన్యులయందు విచారదూరుడై చేయునో వాడు చపలుడు. ధీరోద్ధతుడు చపలుడు. రావణుడట్టివాడు. రావణుడు అసురరాజు. పరప్రాణహరణము లక్షణముగాగల దసురజాతి. ఆ జాతికి రాజు రావణుడు. రావణుని తపస్సునకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనగా రావణుడు—

> "దేవవ్రాత వియచ్చరప్రకర దైతేయవ్రజాది క్రియన్
> జావే రూపున నాకు లేకునికి యిష్టం బాశ్రితశ్రీకరా" (3-69)

అనినాడు పరప్రాణహరణక్రియాతత్పరుడు కాబోవుచున్నవాడగుటవలన ముందు తన ప్రాణము తనను వీడిపోకుండునట్లు వరమడిగినాడు. ఎవనిచేతను తాను చావకూడదు.తనచేత చాలమంది చావవలయును. అది వాని మనోలక్షణము. ఈ లక్షణము లక్షణముగా పైకి కనిపించనట్లు మాటాడుట గడుసుదనము. ఆ వరమును కోరుటకు ముందు, అందుకొక కారణమును చూపువాడు వలె—

> "దేవా విన్నప మాదరింపుము భయోద్రేకంబునన్ మృత్యువుం
> గావంగోరు బహుప్రకారముల లోకంబంతయుం కావునన్" అని...

ప్రారంభించినాడు. రావణునియొక్క కుటిలమనోవృత్తిని చూపించుటకుగాను తిక్కన్నగారిట్లు వ్రాసిరి. బ్రహ్మవలన వరములు పొందిన వెంటనే రావణుడు తండ్రి కడకు పోయి లంకారాజ్యము తనకు గావలయుననినాడు. తండ్రి చీవాట్లుపెట్టి పంపినాడు. ఈ విషయము జరుగునట్లుగనే రావణుడున్నాడు. ఈ సందర్భమున తిక్కన్నగారు, సుమాలి రావణునకు లంకను స్వాధీనపరచుకొనుమని బోధించుచో ("మదిలో నారయు మిద్ది")"ధనదుడగ్రజుండు తదీనమగు లంక యాసపడుట యుచితమగునె" (3_93,94) అనినట్లు వ్రాసిరి. సుమాలి చెప్పిన మాటలు తాననుకొనుచున్నవే. అవే తనకిష్టములు

కూడ. తండ్రి తనకు వ్యతిరేకముగా నున్నాడు. తా నెదురుతిరిగి నిలువ గలుగవలయును. తన నిలుచుటకు మాతామహుని బలమెంతవర కుపకరిం చునో చూచుకొనదలచి "ధనదుడగ్రజుండు......" అనినాడు రావణుడు. సుమాలియొక్క చిత్తంబు చందమనగా నిశ్చయము విధమన్నమాట. సుమాలి మాటాడకుండ ప్రహస్తుడే మాటాడినాడు. చివరకు సుమాలి "సందియమేటికి ? మాకు నెల్ల ప్రభువవీవ-లంకాపురపతిపై నీవ పనుపు మొక దూత నాతని పాలికి" (3-98) అనినాడు. ఈ సుమాలి మాటలతో రావణున కొక నూత్న బలము వచ్చినది. ఇక తండ్రితో నిమిత్తములేదు. తన కండగా తాతగారున్నారు. రావణుడు దూతను ధనదుని వద్దకు పంపెను. ధనదుడు తండ్రివద్దకు వచ్చి రావణుడు తన కడకు దూతను పంపిన తెరగు-తానని పంపిన తెరగు చెప్పగా విశ్రవసుడనినాడు—

"మున్ని కార్యము వాడు నన్నడిగినన్ మోమీక కోపించి మీ
యన్నం బుణ్యచరిత్రు నేన మును లంకాధీశ్వరుం జేసితిం
జన్నే వాని పరాభవంబునకు నుత్సాహంబు సేయంగ నీ
కన్నన్ మోములు గంటువెట్టుకొని రోషాయత్తుడై యుత్తరిన్."

"దిగ్గన లేచిపోయె గణుతింపక వాడు విరోధలబ్ధి నై
యగ్గలికంబునన్ మనలనంచర జీరికి జేకొనండు నే
మ్యగ్గురు భక్తిధర్మ రుచిమాన్య వివేకము లెంతవవ్వు నీ
కెగ్గొనరింపకుండ బురమిచ్చి తొలంగుము-" (3-107,108) అని.

ఈ విశ్రవసుని మాటలవలన తెలియుచున్నది-అంతకు పూర్వమే రావణుని లంకారాజ్యము విషయము తండ్రితో ప్రస్తావించినాడని. మరియు సుమాలితో రావణుడన్న "ధనదుడగ్రజుండు తదధీనమగు లంక ఆసపడుట యుచిత మగునె" అన్నమాటలు విశ్రవసుడు రావణునితో నన్న దాని యర్థమును చెప్పునవి మాత్రమే. రావణుడు స్వయముగా దూతను పంపినాడు కుబేరుని యొద్దకు. ఈ విషయము తెలియగనే విశ్రవసు డిక రావణుడు తనను మించి పోయిన ట్లెంచుకొనినాడు. "సమ్యగ్గురు భక్తి ధర్మ రుచి మాన్య వివేకము లెంతదవ్వు"-కుబేరునితో నీ వా పురమును వదలిపొమ్మని చెప్పినాడు.

రావణుడు లంకకు చేరుకొన్నాడు.

"అని బాహాబల గర్వ నిర్వహణ విద్యాపారగుండైన యా
దనుజాధీశుడు వైరమెత్తి బలముం దానుం వెసంబోయి పో
యి నిజావాసము బాసి విత్తపతి పోయెంబోయె నావించు బే
ర్చిన యౌద్ధత్యము నిత్యమైన విజయశ్రీవిభ్రమోద్భాసియై.

లంకకునేగి రాజ్య సుఖలంపటుడై యభిషేక మంగళా
లంకృతమూర్తిఁ జేకొని చలంబు బలంబును నుల్లసిల్ల ని
శ్శంకత రాక్షసాన్వయభుజావిభవం బలరన్ జగద్భయం
బంకురితంబు చేసె తొలకాడెడి వీరరసంబు పెంపునన్." (3-113,114)

లంకను ప్రవేశించుచున్న రావణుని చెప్పు పద్యము మొదటిది. ప్రవేశించిన రావణుని చెప్పునది రెండవది. లంకారాజ్య మాక్రమింపక పూర్వము రావణుని బాహుబల ప్రసక్తి తిక్కన్నగారు తేలేదు లంకా ప్రవేశముతోనే రావణుని ఏతద్విద్యాపారగత్వము అక్కఱకు వచ్చినది. వాడు లోకముమీద విరచుకొనిపడుట సర్వము ప్రారంభమైనది. లంకారాజ్య మాక్రమించిన తరువాతనే. అందువల్లనే బాహుబలగర్వనిర్వహణవిద్యాపారగుడైన రావణుడు లంకారాజ్యాభిముఖుడై సాగినట్లు తిక్కన్నగారు వ్రాయుట. మరియు నా పద్యము రావణుని ముందు ముందు లోకముమీద యెత్తిపోవుటను సూచించుచున్నది విజయశ్రీని గూడ పేర్కొనుచున్నది నిత్యమైనది వాని పేర్చిన యౌద్ధత్యము. రావణుడు లంకలో స్థిరపడి పెండ్లి పేరంటములైన తరువాత జగద్భయ మంకురితము చేసినాడు.

ఇక వరుసగా కుబేరుని-మరుత్తుని-సురథుని-పురూరవుని-దుష్యంతుని-గాధిని-అనరణ్యుని జయించినాడు రావణుడు. ఒక్క కుబేరునితో మాత్రము కొద్దిగా యుద్ధము చేయవలసివచ్చినది మిగిలిన రాజులందరును "ఊరకనే వశమైరి. వారిలో అనరణ్యుడు రావణునితో ఎగురు తిరిగి యుద్ధముచేసెను. అటు తరువాత యమునిమీదకు, పాతాళమునందలి భోగావతీపురము మీదకు, నివాతకవచుల మీదకు, కాలకేయులమీదకు, వరుణునిమీదకు రావణుడు పోయెను. ఆ పైన మధురాక్షసుని వశముగావించుకొని ఇంద్రుని పైకిబోయి వానిని తనకుమారుడు బట్టి తేగా విజయియైనాడు తాను ఇదంతయు రావణుని విజయపరంపర. కుబేరుని మీదికెత్తిపోవుటకు హేతువు తనకు కుబేరుడు

నీతులు చెప్పు దూతను పంపుటయే. మొదట రావణుని చిత్తమున మాత్సర్యము పుట్టినదే కుబేరునిపైని. అనాడు తల్లితో రావణుడనినాడు — “ అతనితో సాటియన–మేలన......పలుదును ” అని లంకను కానడిగించినపుడు కుబేరుడు ఎదురు చెప్పకుండ వెడలిపోయినాడు. ఆ పోవుటలో కుబేరుడు ఏదో బంధుభావము పోతువన్నట్లుగా మాటాడినాడు (4–102). రావణునకు భయపడి పోవుచున్నట్లు మాటాడలేదు. రావణునకు కావలసినది తననుజూచి భయపడుట. అది అప్పటిలో కుబేరుడు చేసినట్లు రుజువులేదు. మరియు నిప్పుడీ దూతను పంపించుటలోని కుబేరుని అంతర్భావము రావణుడు తన జీవలక్షణమునుబట్టి గ్రహించినాడు.

“రక్షోవంశ హితోపదేశమను పేరన్ నీని బుత్తెంచనా
యక్షాధీశ్వరుడీశుతో దనకు సంఖ్యంబైన తేజంబు రా
జ్య క్షోభంబుగ లంకగొన్న మన యన్యాయంబు సెప్పన్ గడా
దిక్షుద్రవ్యవసాయ హేతువగు ధీలంబూపి పంపెంపగన్” (1–41) అని.

కనుక “మున్ను మున్న అలకాపురమేర్చి ధనేశునోర్చి యక్కావలి నేరపంతమని” (4–43) కుబేరునిమీదకు పోయినాడు. ఇచట కుబేరుని మీద పోవుట కొక హేతువును రావణుడు తన బుద్ధిచేత కల్పించుకొనినాడు. కుబేరుని ఓడించుటతో నిక తానే వీరుడనన్న భావము నెలకొన్నది రావణునకు. ఇది కూడ తిక్కన్నగారు —

“వీరుండెవ్వడు నేడు లేడనుచు నుర్వీంద్రిమ్మరున్ గర్వుడు
ర్వారస్ఫార పరాక్రమక్రమకళా వైదగ్ధ్యవిస్తార మే
పారంగా ధరణీశులన్ వెదకి వీరావేశియై దుర్దమ
ప్రారంభం బొనరించుచున్ సమర సంరంభంబు శోభిల్లగాన్” (5–24)

అని వ్రాసిరి. తానే వీరుడనన్న భావమూ రావణుని ఉద్ధతప్రవృత్తిని ఎంతవరకు తీసుకొనిపోయినదనగా ధరణీపతులను వెదకి వెదకి యుద్ధమునకు పిలచి పిలచి ఊరక వినోదము కొరకు సంహరించినట్లుగా సంహరించునంతవరకు పోయినది. ఈ పద్ధతితో జయింపబడినవారే మరుత్తుడు మొదలైనవారు రావణుడు యమునిమీదకు పోవుట రెండవమెట్టు. “మానవ

హితముగోరి" నారదుడా రావణునితో ననినాడు—"దేవతలకు నవధ్యుండైన నినుబోటివాడీ మానవుల జయింప విక్రమంబును గలదే"—అని; మరియు "ఆమ్మనుజావళి నీవడచుట మెచ్చుగాదని"నాడు (5–36,38,41). ఈ మాటలు రావణునకు నచ్చినవి నారదుడు యమునిమీదకు ముందు పొమ్మని నాడు అప్పుడు రావణుడు "శుభంబులు శీఘ్రముచేత నీతి, గర్వోన్నతిగ్రాలునా జముని నుక్కడగించి క్రమంబుతోడ దక్కున్న దిశల్ జయించెద" (5–44) ననినాడు దిగధీశులను జయించుట శుభము సేతగా రావణుడు భావించినాడు. అంతే. బయలుదేరినాడు ఆ బయలుదేరుట ఆ వరుసలోనున్న వారిని జయించు కొని కొందరు స్త్రీలను చెఱపట్టి లంకకు వచ్చినాడు ఇంద్రునిమీదకు పోవుట మూడవమెట్టు రావణుడు ఇంద్రునిమీదకు పోవుటకు హేతువు మేఘనాథుడు కుంభిలవనమున మాహేశ్వరమగు యాగముచేసి ఈశ్వరుని వలన బడసిన వరసామగ్రి. రావణుడు తన రెండవ విజయము ముగించుకొని వచ్చులోపల మేఘనాథుడా యాగముచేసి వరలాభమును పొందినాడు. విజయుడై వచ్చిన రావణుడు కుమారుని వద్దకుపోయి చూచి శుక్రునితో అనినాడు.

"నగుచు (దశాననుండు) (భృగునందనుతో) నిదియేమి? యీతనిం
పొగఁ బడఁబంచి యివ్విపినభూమి నిరోధముచేసి దీన మీ
రు గనిన లాభమేమి? అమరుల్ తగు భోజ్యములెల్ల మ్రింగి మో
పుగొనుచు మిమ్ము నాలిగొనిపోయిరి వేయును నేల—" (5–134)

అని కుమారుడు యజ్ఞములు చేయుచు వనమున నున్నాడని తెలిసియే వెళ్ళినాడు రావణుడు. యజ్ఞములనగానే దేవతల ఆరాధనమైనట్లు. అది రావణున ఇష్టములేదు. అందుకనినాడు శుక్రునితో — దీన మీరు గనిన లాభ మేమి? అని. లాభము లేదన్న నిశ్చయముతో అన్నమాటలివ్వి. మీరుచేసిన ఈ యజ్ఞములవలన ఏమైనది? హాయిగ దేవతలు పొట్టలు నింపుకొని మిమ్ము వెట్టిబాగుల వారిని చేసి(ఆలిగొని) పోవుటయైనది. ఎందుకయ్యా ఇట్టి పనులు చేయుట అని శుక్రునితో అనుటవలన తన కుమారునితో గూడ అన్నట్లైనది. కాని మేఘనాథుని ఉద్దేశించి అనలేదు. అదియొక చమత్కారము. ఆర్థిక ముగను, ఆధికారికముగను కొంత దర్పముగల జమీందారి కుటుంబము

లలో నట్టి వ్యవహారముండుట మనకు తెలియును. శుక్రుడు సమాధానము చెప్పినాడు శివుడు-అర్ధాహిత నారీకమ్మగు దేవుడు

"దయ నిచ్చోటికి వచ్చి కామగతి హృద్యస్యందనంబుం తమో
మయ మాయాచరితంబు శాత్రవబలోన్మాథక్రియాదక్షుదు
ర్జయచాపంబును దివ్యబాణనిచయస్ఫారానుభావంబు న
క్షయతూణీరయుగంబు నిచ్చె పటుదోర్గర్వం బఖర్వంబుగాన్."

(5-137)

తాను చేయించిన మాహేశ్వరమగు యాగమువలని ఫలితమును చెప్పినాడు శుక్రుడు ఆ చెప్పుటలో నేను చేయించిన పని సామాన్యమైనదా? ఊరక దేవతలను మేపుటకు చేయించితి ననుకొంటివా? చూడుము. శివుడంత టివాడిచటికి వచ్చి ఇన్ని వరములిచ్చి పోయినాడు. అని తన చేయించిన పనియొక్క యౌన్నత్యమును చాటినాడు. శుక్రుడు సరేయని రావణు డప్పుడే అనినాడు-

"మనకుంపగ యింద్రుండకాడె యెల్లభంగుల తలపన్" (5-139)

అని. అనగా తన కుమారుడు ఈశ్వరునివలన పొందిన వరలాభ మునుబట్టి ఇంద్రుని జయించుటను లెక్కవేసికొనినాడు రావణుడు. తరువాత ఇంద్రుని నిజముగా నోడించినదా మేఘనాధుని తమోమయ మాయాచరిత వలననే గదా! తన కుమారుని వరలాభము నెఱిగిన తరువాత "పురంబు జొచ్చె కొడుకుందానున్" (5-141). ముందు కొడుకు తరువాత తను అన్న ట్లుగా నన్నమాట-ఇక రావణుడు మధునిపై పోవుటకు విభీషణుడు చెప్పిన కుంభీనస విషయము మూలము.నిజమునకు విభీషణుడు రావణునితో కుంభీనస విషయము చెప్పుటలో తాత్పర్యము నీ వీ విధముగా పరస్త్రీలను చెఱపట్టి తీసి కొని వచ్చుట మంచిదిగాదు. చాల నిష్ఠురమైనది. నీవేమో దిగ్జయయాత్ర లకుపోయి పరస్త్రీలను చెఱగొని తీసికొనిరమ్ము. నీవిచట లేనపుడు ఇచటి మన యాడువారిని మరొకరు తీసికొనిపోవుదురు. మొన్న మధుడు వచ్చి కుంభీనసని తీసికొనిపోయినాడు. ఈ విషయము మనకు కంటకముగా నున్నట్లే నీవు చెఱగొనివచ్చిన ఆ స్త్రీలకును, వారి పురుషులకును నుండదా-అని. రావణుడేమి చేసినాడనగా "ఏమీ మన వీడొకరుడుసొచ్చెనె" అని మధుని

మీదకు చంపుదునని బయలుదేరినాడు. తానితరుల పట్టణములమీదకు పోవచ్చును ఏమైనను చేయవచ్చును. తనమీదకెవరును రారాదు అది రావణుని అహంకార లక్షణము—

ఇంతవరకును రావణుని ఉద్యోగమునకు దైవమనుకూలముగనే యున్నది ఇక ప్రతికూలమైనది కార్తవీర్యునితోడిపోరు-పరాజయము, వాలివలన నైన యవమానము, దైవ ప్రాతికూల్యమువలన జరిగినవి పులస్త్యుని వేడికోలువలన కార్తవీర్యునిచే చెరనుండి విడువబడి లంకకు వచ్చినాడు రావణుడు.

"రావణుడివ్విధంబున పరాజయమందియు లంకలోనికిం
బోవుడు నంతయున్ మరచి భూవలయంబున తొంటియట్ల నా
నావిధ దుశ్చరిత్రము లొనర్చుచు గ్రుమ్మరి యొక్కనాడు వి
ద్రావితశత్రుభూరుహచరప్రభు వాలి నెదుర్చ వేడుకన్" (7-71)

కిష్కింధా నగరముపై నరిగెను. లంకలో ప్రవేశించిన తరువాత రావణునకు విజయములే స్మృతిలో నుండునుగాని పరాజయము లుండవన్న మాట. ఇది చాల చిత్రము. అనగా రావణుడు కార్తవీర్యునిచేత తానోడుట నొక ఓడుటగా తీసికొనలేదన్న మాట అది చెరనుండి బయటికి రాగానే దులపుకొనినాడు. అది రావణుని జీవితలక్షణమైన ఉత్సాహము. వాలికెదురుపడి పోరుటకు కించిత్తు జంకినాడు రావణుడు. జంకినవాడు వానిమీదకు పోకపోయిన నేమి పోయినది ? కాని ఊరుకొనడు. ఆ బుద్ధి ఊరకొననీయదు. ఉపాయ మాలోచించి "పిఱిందివలన మందగతిం జేరెద నేమఱియున్న యెడ పట్టెద" (7-78) నని బయలుదేరినాడు చేతుల జిలతప్ప వాలిమీదకు పోవుటకు హేతువులేదు. ఇంకను కార్తవీర్యుని మీదకు పోవుటకు యాదృచ్ఛికముగానైనను తనచేయు శివపూజ భంగమైనదను కారణము-అనగా, కార్తవీర్యునిచేత భంగము చేయబడినదను కారణమున్నదిగాని, వాలిమీదకు పోవుటకసలు కించిత్తును కారణము లేదు. అయినను పోయినాడు. వాలి యూరలేడు. దక్షిణ సముద్రపుటొడ్డున సంధ్యావందన మాచరించుకొనుచున్నాడు. రావణునకు దైవము ప్రతికూలము గదా! వాలి రావణుని రాకను గుర్తించినాడు. రావణుడు వాలిని జూచి

(ఉన్నయెడన్) మునివ్రేళుల
తిన్నని నడ నసురపతి పదిలుఁడై చేరం
గొన్నియడుగు లరిగి యడరి
అన్నగచరనాథుపై రయంబున పడియెన్". (7-82)

వాలి రావణుని చంక నింకించుకొని అటనుండి వియచ్చరుడై మిగిలిన మూడుసముద్రములలోను ముంచి కిష్కింధానగరమున తన ఉద్యానమున దించి హాస్యమాడినాడు. రావణుడు వాలితో మైత్రి చేసికొన్నాడు—

రావణుని చరిత్రకు సంబంధించిన ముఖ్యాంశములలో మొదటిది తానే వీరుడన్న భావము కలిమి ప్రవర్తించుట స్థూలముగా పరామర్శింపబడినది. రెండవది స్త్రీ సంబంధి ప్రవర్తన. వేదవతి, రంభ వీరిద్దరి యెడలనే రావణుడనుచితముగా ప్రవర్తించినాడు. వేదవతి విషయమున తాను పట్టుకొన్నంతవరకు వేనలి తెగివచ్చుటవలన ఆమె తపము పేర్మికి భయపడినాడు. రంభ విషయమునఅట్టి భయమేమియులేదు. ఆమె నేను నీకు కోడలనన్నది ఆ మాట రావణునకెక్కలేదు. ఆమెను గారించి విడిచినాడు. ఉద్ధతుడు గనుక, వేరు భయమేమియు లేదు గనుక, బలిమిదై రంభ ననుభవించినాడు. అతడెంత ఉద్ధతుడో ఈ పద్యములో నున్నది

"పగరాజు పైవచ్చి బలువిడి బరిభవిం
చిన దలంకిన పురశ్రీ విధమున
సమదద్విపము కేళి సలిపిన జాల న
లంగిన యుద్యానలక్ష్మికరణి
ఘనలులాయము సొచ్చి తన యిచ్చనాడిన
గలగిన నెత్తమ్మికొలని భంగి
గడచెట్టిదపు గాలి సుడిసిన నెఱిదప్పి
తిరిగిన మవ్వంపుదీగె మాడ్కి
మున్ను గై సేసి యలవడ్డ చెన్నుదప్పి
యెలమి బ్రియుపాలి కేగెడు లలి యడంగి
వేలుతుందమై యెంతయు విన్ననయ్యె
నసురగారించి విడిచిన నమ్మృగాక్షి" (6-75)

రావణుడెట్టివాడు? శత్రురాజు వంటివాడు. మదించిన ఏనుగు వంటి
వాడు భయంకరమైన దున్నపోతువంటివాడు. సుడిగాలివంటివాడు. రంభ
పురశ్రీ వంటిది. ఉద్యాన లక్ష్మివంటిది. నెత్తమ్మికొలని వంటిది. మవ్వపుతీగె
వంటిది. ఈ పద్యము జాగ్రత్తగా వ్రాయబడిన పద్యము-రంభ అసలు పురశ్రీ
వంటిది. పురశ్రీ యనగా పరిపాలింపబడునదియు మరియు సేవింపబడునది
యును. రంభ నలకూబరునిచేత పాలింపబడునది. మరియు వాతనిచేత సేవింప
బడునది. రంభ దేవలోకమున వేశ్య. ఆమెయందు బద్ధానురాగుడు నలకూబ
రుడు. ఆమెను సేవించుటయందే నిష్ఠకలవాడు రంభ రావణునితో అన్నది
నలకూబరుని ఉద్దేశించి "నేను లంజియంగావుడు వానితోడి తమకంబది
లంజియగాదు ప్రేమ సద్భావ మెఱుంగవైతి" అని వానితోడి తమకము-
ఆ నలకూబరుని యందలి తమకము. అనగా వానియందు తనకున్న తమ-
కమా? లేక వానికి తనమీద నున్న తమకమా? రెండునుగావచ్చును. తమ
కమనగా తత్పరభావము కలిమి రంభ నలకూబరునిచేత ఆశ్రయింపబడి
సేవింపబడుచు ఆ వాని పాలనలో నున్నది అట్టి రంభ సాలంకృతయై వాని
కడకు పోవుచున్నది. అపుడామె పురశ్రీ విధాన నున్నది. ఆమెమీదకు రావ
ణుడు శత్రురాజువలె వచ్చి మిక్కిలిగా అవమానపరిచినాడు అవమానపర
చుట (పరిభవము) అనగా నికృష్టముగా తలపోయుట. రంభ నుద్దేశించి రావ
ణుడన్నది "కులభామిని వోలె తగవున్ ఘటియించెదు వైశికంబునన్" అని.
ఇది నికృష్టభావన. నికృష్టముగా చూడబడినపుడా చూడబడినది చేతనమై
నచో తలంకిపోవును క్షోభపడి పోవునన్నమాట. రావణుని చేతబడి మొట్ట
మొదట రంభ అట్లయిపోయినది రంభ ఉద్యానలక్ష్మి వంటిది. ఉద్యానలక్ష్మి
అనగా కావలయునని చేరిచూడదగిన పెంపుడువనము నలకూబరుడామె నట్లు
చూచుకొనునన్నమాట సమదద్విపమనగా మదముతో కూడికొనిన రెండ
వయసములతో పానముచేయు జంతువు ఏనుగు. మదమనగా హర్షము. ఏను
గునకు సంతోష మెప్పుడనగా మదము కారుచున్నప్పుడు. మదము కారుట
ఏనుగున కొక మధురవ్యథ. ఏ తత్సమయమున దాని నెవరును పట్టలేరు.
అపుడు దాని లోకమే వేరు ఆ సమయమున అది ఉద్యానవనమున కేళికి
దిగినచో? ఉద్యానవనము నలగిపోవును. ఉన్నరూపు చెడిపోవును. రావణుడు
సమదద్విపమువలె కామాంధుడై బలిమిడై ఉద్యానమువంటి రంభనుబట్టి
కేళికి దిగినాడు ఆమె నలగినది, అనగా ఆమె రూపుయే మారినది. రావ

ణుని వలన రంభ అట్లయిపోయినది. రంభ నెత్తమ్మి కొలనువంటిది-పద్మాకర మువంటిది. పద్మాకరములో హంసలు తిరుగాడవచ్చును. రంభ విషయమున నలకూబరు డట్టివాడు. రావణుడు లులాయము. లుల సంశ్లేషణే-నీళ్ళలోనికి మునుగునది. అనగా మునిగినగాని తృప్తిచెందనిది అట్టి కాసారెనుము పద్మాకరము నీటిలో మునిగి యిచ్చవచ్చిన రీతి నాడినచో?_ అది కలగును అనగా కలుషమగును. మలీమసమగను రావణుడు రంభనట్లు చేసినాడు_రంభ మవ్వపుతీగె. తీగెయొక్క అందమెప్పుడుండుననగా అది యొక వృక్షము నాలంబనము చేసికొనియున్నపుడు. అది తీగెకు నెజీ_అనగా ఉచిత స్థితి. రావణుడు రంభను తన యందట్లు ప్రవర్తించమనినాడు. ఆమె అంగీకరింపలేదు. బెట్టిదపు గాలి మవ్వపు తీగెనువలె ఉచితస్థితినుండి తప్పించి తిప్పికొట్టినాడు ఈ వర్ణనమంతయు సీసపద్యము పైనాల్గుపాదముల లోనిది గీత పద్యమున తిరిగి పైన చెప్పిన నాల్గింటికిని సమాహారము చేయుచున్నాడు మున్నుగైసేసి యలవడ్డ చెన్నుదప్పి-ప్రియు పాలికేగెడు లవి అడంగి- వేఱ చందమై-యెంతయు విన్ననయ్యె-అసురగారించి విడిచిన అమ్మృగాక్షి-అసుర క్రీడించి విడిచినగాదు కారించి విడిచినది రావణుడామె వలన బొందిన సుఖమును గాక రావణునివలన ఆమె పొందినదేదో అది చెప్పుట చమత్కారము. రంభను బాధించుటయే జరిగినదిగాని రావణుడు సుఖించినదిలేదు_తాను సుఖపడుట కంటె రావణునకు కావలసిన దితరులు కష్టపడుట - అదియొక మత్సరభావము తమోగుణము ప్రకోపించినప్పటి స్థితి. ఆ సీసపద్యమును తిక్కన్నగారు మహాకవిశిల్పమున వ్రాసెను రావణుని యౌద్ధత్యమును, రంభ సుకుమారమును రెండింటిని ప్రక్క ప్రక్కగా చూపించి, చివరికైన ఫలితమును వ్యంగ్యముగా వదలి, ఆ పద్యమును మహాకవి గనుక తిక్కన్నగారు వ్రాసిరి

# పంచమోన్మేషము

## 1. కావ్యదృష్టి వైలక్షణ్యము

"అమలోదాత్త మనీష నేనుభయకావ్య ప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుడన్ కళావిదుడ—"స్వచ్ఛమును, నుదాత్తమునునైన బుద్ధి శక్తిచేత, నుభయ కావ్యముల యొక్క ప్రౌఢిని బాటించి చేయు శిల్పమున నే నారి తేరినవాడను; కళాస్వరూపమును తెలిసినవాడను—ఇది తిక్కన్నగారు తనను గురించి తాను చెప్పుకొన్న విషయము. ఉభయ కావ్యము లనగా నేమో తిక్కన్నగారు చెప్పలేదు. మరియు నాయన కుభయ కవిమిత్రుడను బిరుద మున్నది. ఈ బిరుదము విషయమున కేతన ఆంధ్ర భాషాభూషణమున ఇట్లు వివరించెను.

"అభినుతుడు మనుమ భూవిభు
సభఁ దెనుగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవి మిత్రునామము
త్రిభువనముల నెగడ మంత్రి తిక్కడుఁ దాల్చెన్."

సంస్కృతాంధ్రముల యందుగల చాతుర్యము కలిమిని నాతనికి నుభయ కవిమిత్రుడని పేరు వచ్చినదట. ఉభయకవులనగా సంస్కృతాంధ్ర కవులు. ఆ రెండు భాషలందును తిక్కన్నగారి కద్వితీయమైన పాండిత్యమును, కవితా శక్తియు నున్నందున, ఆ యా భాషలయందు పండితులును, కవులును నైన వారి కాయన మిత్రుడై ఉభయకవి మిత్రుడనబడినాడని కేతన పద్యమునుండి తాత్పర్యము గ్రహింపవచ్చును. దీనినిబట్టి తిక్కన్నగారు తనను గురించి చెప్పుకొన్న "ఉభయ కావ్యప్రౌఢి..." మొదలైనదానికి సంస్కృతాంధ్రకావ్య ములయొక్క ప్రౌఢిమ ననుసరించి చేయు కావ్యశిల్పమున నారితేరినవాడని యర్థము చెప్పవలయును. నన్నయ్య, పోతనలుకూడ "ఉభయభాషాకావ్య" "ఉభయకావ్యకరణదక్షుడ"నని చెప్పుకొనిరి. నన్నయ్యగారి వాక్యము

భాషాశబ్దము కలిమిని స్పష్టముగా సంస్కృతాంధ్రములని యర్థమగుచున్నది. పోతన్నగారి వాక్యము తిక్కన్నగారి దాని ననుసరించుచున్నదివలె నున్నది. ఏమైనను నుభయకావ్యములనగా సంస్కృతాంధ్ర కావ్యములని యర్థము చెప్పుకొనవచ్చును.

ఉభయకావ్యములనగా మార్గకావ్యములు, దేశికావ్యములనియు నర్థము చేయబడుట వినిపించుచున్నది. అపుడా రెండు కావ్యముల యొక్క ప్రౌఢిమ ననుసరించి చేయు శిల్పమున తిక్కన్నగారు పారగుడని చెప్పవల యును. అంతకుపూర్వమే నన్నెచోడుడు మార్గదేశి భేదములను పేర్కొని యున్నాడు గనుక తిక్కన్నగారి యాంతర్యమున కట్లర్థము చేయుటయు విరుద్ధము కాదు

అయినచో సంస్కృతాంధ్ర కావ్యములయందును, మార్గదేశికావ్యముల యందును ప్రత్యేకము ప్రత్యేకముగానున్న ప్రౌఢిమ యేమియను ప్రశ్నవచ్చు ను. దీనికి సమాధానము చెప్పుటయంత సులభము కాదు. తిక్కన్నగారికంటె పూర్వమున్న ఆంధ్రకావ్యాలలో వివాదాస్పదము కానిది నన్నయ్యగారి భారతమే. అందున్న సంస్కృతకావ్యేతరమైన ప్రౌఢిమయేమో చెప్పబడవల యును. నన్నిచోడదేవుని కుమారసంభవము దేశికావ్యముగా నంగీకరించి నచో నందున్న మార్గకావ్యేతరమైన ప్రౌఢిమయేమో నిరూపింపబడవలయును. అపుడా యా ప్రౌఢిమలను పాటించి తిక్కన్నగారు చేసిన శిల్పము విచారింప వలయును అదియంత సులభముగా నగునదికాదు. అందువలన నుభయ కావ్యప్రౌఢికి మరొక యర్థ మూహింపబడుచున్నది.

ఉభయకావ్యము లనగా రెండు కావ్యములు కావ్యవాఙ్మయ మంతయు ద్విధాభూతము. దృశ్యకావ్యములు, శ్రవ్యకావ్యములు. సర్వ కావ్య ప్రపంచమును నీరెండు విధములే రైయున్నది. దృశ్యముగాని, శ్రవ్యముగాని గాక కావ్యశబ్ద వాచ్యమగు గ్రంథము సృష్టిలోలేదు. కనుక నుభయకావ్యప్రౌఢి యనగా దృశ్య శ్రవ్య కావ్యప్రౌఢి యని యర్థము. అయినచో దృశ్యశ్రవ్యకావ్యములకు ప్రత్యేకమైన ప్రౌఢిమ యున్నదా యని ప్రశ్న ఉన్నది. శ్రవ్యకావ్యము, కవిచేత ప్రత్యక్షముగా సర్వవిష యములు సుష్ఠుగా వర్ణింపబడి, నిబిడబంధము కలిమిని ప్రౌఢిమకలది యగు

చున్నది దృశ్యకావ్యము, కవిచేత పాత్రముల వాచికాద్యభినయ విషయములు మాత్రమే సుష్ఠుగా చెప్పబడి నిబిడబంధము కలిమిని ప్రౌఢిమ కలది యగుచున్నది. అనగా శ్రవ్యకావ్యమున తానుగా కవి సర్వమును సాధించగల యవకాశమున్నది. దృశ్యకావ్యమున కవి తాను సాధించదలచుకొన్న దేదియైనను పాత్రముల ముఖముననే సాధింపవలయును పాత్రమునకు దృశ్యకావ్యముననున్న ప్రాధాన్యము శ్రవ్యకావ్యమునలేదు సూక్ష్మముగా దృశ్య శ్రవ్యకావ్యములకున్న భేదములివి. ఉభయ కావ్యప్రౌఢి యనగా, కవి తానుగా శ్రవ్యకావ్యమునందువలె వర్ణించి సాధించు ప్రౌఢిమ యొకటి; దృశ్యకావ్యమునందువలె పాత్రముల వాచికాద్యభినయముల మూలమున సాధించు ప్రౌఢిమ యొకటి. ఈ రెండింటిని యొకచోట, పడుగు పేకలవలె కలిపి ఉద్దిష్టార్థమును సాధించుటయేదికలదో అది శిల్పము. శిల్పమనగా పనివానితనము,

అట్లా రెండింటిని యొక ముఖమున నడిపించుటకొక్క శ్రవ్యకావ్యముననే యవకాశమున్నదిగాని దృశ్యకావ్యమున లేదు. తిక్కన్నగారు శ్రవ్యకావ్యకర్త కనుక దృశ్యకావ్యనిర్మాణలక్షణమును నాయన శ్రవ్యకావ్యనిర్మాణలక్షణముతో జోడించుట అదియొక రమణీయమైన కావ్యశిల్పము కాగలదని భావించెను. తిక్కన్నగారి యాభావ మానందవర్ధనుల కావ్యసిద్ధాంతము ననుసరించి యేర్పడినది నాట్యరసములు కావ్యరసములుగా నిరూపింపబడి, సంధి సంధ్యంగములతోడి నాటకేతివృత్తమువలెనే, కావ్యేతివృత్తము నిష్కర్షింపబడి, ఆనందవర్ధనులచేత ధ్వనిసిద్ధాంతము నెలకొల్పబడినది. నాటకముయొక్క నిర్మాణ వైలక్షణ్యమును భావించి తిక్కన్నగారు ఆనందవర్ధనుల మతముయొక్క ఆంతర్యము నెరిగి, ఉభయకావ్యప్రౌఢినిఁ బాటించు శిల్పమే కావ్యశిల్పమని రచనకుపక్రమించెను. ఆ జోడింపుయొక్క రహస్యము లెస్సగా భావించిన వాడగుటచేత, ఏతచ్ఛిల్పమున పారగుడనని చెప్పుకొనినాఁడు దాని ప్రక్కనే కళావిదుడ నన్నదున్నది కావ్యకళాస్వరూపము నాకు తెలియును. అది యిది. దీనికి మూల మమలోదాత్తమైన మనీష—అనియు నాయన చెప్పికొనెను. అనగా దృశ్య శ్రవ్య కావ్యములయొక్క నిర్మాణ వైలక్షణ్యములోని ప్రౌఢిమ నేకముఖమున పాటించి కావ్యమును నిర్మించు శిల్పవిద్యయందు, తన యుదాత్తమనీషచేత పారగత్వమును పొందినట్లుగా తిక్కన్నగా రా పద్యమున చెప్పికొనెనని యర్థము.

ఈ యర్థము తిక్కన్నగారి విమర్శకులందరును నంగీకరించి చెప్పుచున్న నాటకీయశిల్పము నందివుచ్చుకొనుచున్నది.

ఈ నిర్వచనోత్తర రామాయణము కృత్యవతరణికలో మరొక పద్యము విచారింపదగి యున్నది—

"లలిత పదహృద్య పద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలతి యలతి తునియల కా
హాల సంధించిన విధంబు నమరఁగఁజేతున్." (1-16)

లలితములైన పదములతోనున్న హృద్యములైన పద్యములతో, కథార్థము, అలతి యలతి తునియలతో కాహాల సంధింపబడిన రీతిగా, ఘటిత పూర్వాపరమై యమరియుండునట్లు చేయుదను.

తిక్కన్నగారు చెప్పిన దీనియందు ప్రాణభూతమైన విషయము కథార్థము. మరియు నది పూర్వాపరముల యందు ఘటితమై యమరి యుండుట కావ్యము కథాశ్రయము. కథార్థమనగా కావ్యపరమార్థము. కావ్యరసమని తాత్పర్యము అది కావ్యమున కథ యొక్క పూర్వాపర ములయందు ఘటితము కావలయును. అనగా కావ్యరస మా కథయొక్క పూర్వోత్తరార్థములయం దనుస్యూతముగా ప్రవాహ రూపమున నెడతెగక నుచితరమణీయముగా ఘటితము కావలయును. కథ బహుసన్నివేశ ములచేత, నలతి యలతి తునియలచేతనైన కాహాలవలె నుండును. అవన్నియు తునియలేయైనను మొత్తముమీద నొక నాదమును వాయు పూరణముచేత పుట్టించగలిగినట్లుగా నవి యమర్చబడియుండును. అట్లే కావ్యమున కథ, అనేక సన్నివేశములచేత నేకరసమున పర్యవసించునట్లుగా నిర్వహింపబడవలయును. ఏవం విధమైన కథ లలితములైన పదములతోడి పద్యముల యందుండవలయును — ఇది తిక్కన్నగారు కావ్యస్వరూపమును భావించిన తీరు. స్వరూపమనుటకంటె కావ్యాత్మ యనుట యుచితము. కారణము; కథార్థము మీద దృష్టి యధికముగా నున్నది గనుక

ఘటితపూర్వాపరమైన యథార్థమును, ఉభయకావ్యప్రౌఢి బాటించు శిల్పమార్గమున సాధించుట తిక్కన్నగారి వైలక్షణ్యము. అదియే పరమమైన కావ్యనిర్మాణ రహస్యము. ఏ తద్రహస్యము నెరిగి యెవడు కావ్య నిర్మాణము చేయునో వాడు మహాకవి. అట్టి నిర్మాణము కలది మహా కావ్యము. నా దృష్టికి భారతము, భారతమును వ్రాసిన తిక్కన్నగారుమ పూర్తిగా లక్ష్యములు. నిర్వచనోత్తరరామాయణము స్థితి వేరు

## 2. నిర్వచనోత్తర రామాయణము - నిర్మాణ కుశలత

కవయతి చాతుర్యేణ వర్ణయతీతి కవిః. చాతుర్యము చేత వర్ణించు వాడు కవి. చతురమన్న దాని భావము చాతుర్యము. చతురుడనగా- చతతే కాంక్షతే ప్రయోజన మితి చతురః-ప్రయోజనమును కాంక్షించువాడు. అనగా నొక పరమమైన ప్రయోజనము నాకాంక్షించి ఎవడు వర్ణించునో వాడు కవి వర్ణించుటయన-వర్ణ స్తుతౌ, వర్ణ్యతే చిత్రవర్ణత్వేనేతి వర్ణః- చిత్రమైయుండుట వలన స్తుతించుట. చిత్రమనగా ఆశ్చర్యము. మరియు జాగ్రత్తగా చెప్పవలసి వచ్చినచో నాశ్చర్యమును కలిగించునది. ఆశ్చర్య మనగా నాస్వాదించుటకు యోగ్యమైనది ఆస్వాదించుటకు యోగ్యకర మైనది రసము రస్యతే ఆస్వాద్యత ఇతిరసః — రస ఆస్వాదనే — ఆస్వా దింపబడునది రసము అనగా నొక పరమమైన ప్రయోజనము నాకాంక్షించి ఆస్వాదనయోగ్యమైన రసమును స్తుతించువాడు కవి యన్నమాట. రసమును స్తుతిచేయుట యనగా విభావానుభావాది సామగ్రితో దానిని పుష్కలము చేయుట. ఆ విధముగా ప్రయోజనము నాశించి రసమును ఆస్వాద్యమగు నట్లుగా నెవడు సుష్ఠుగా చేయగలడో వాడు మొట్టమొదట కవి యగు చున్నాడు. ఆనాడు ఏ తదుద్దిష్టరసమును పరిపోషించుటకొక కథ నాలంబనము చేయుచున్నాడు. అనగా ఆ కథ ద్వారా ఆ రసము ఆస్వాద్య మగునట్లు చేయుటకు పూనుకొనుచున్నాడు. ఆ పూనిక నెరవేరినచో వాడు కవి యగును. కేవలము పద్యములు వ్రాయుట మాత్రము చేయువారు నిజము మాటాడినచో కవులు కారు. కాని రససామగ్రిలోని విభావానుభావములలో ఏవేవి కొన్నింటిని తీసికొని వానిపై క్రొత్త క్రొత్త ఊహాలు చేసి పద్య ములు వ్రాయుట మొదటనుండి యున్నది. అట్లు చేయువారికి ముక్తక

కవులని పేరు. వారిలో నిర్మాణకుశలత లేదు. అనుకొన్న ఒక కేలానా రసమును విభానుభావాదుల ద్వారా పుష్టము చేసి ఆస్వాదనయోగ్యము చేయలేరు వారు. తిక్కన్నగారు నిర్వచనోత్తరరామాయణమును వ్రాసిరి. అది రెండు లఘుకావ్యముల సంపుటి యని వెనుక వ్రాయబడినది. ఆ రెండింటిని దేని కదిగా వ్యస్తముగా తీసికొని పరిశీలించిన నిర్మాణ మంత సుష్ఠుగా కనిపించుట లేదు. ముందు శ్రీరాము డగస్త్యుని అడిగిన ప్రశ్నలకు, తరువాత అగస్త్యుడు చెప్పిన కథలు పూర్తిగా సమాధానములు కావు. ఇంద్రజిత్తు లెస్సగా పొగడబడినాడు మొట్టమొదట. వాని యుద్ధకౌశలము షష్ఠాశ్వాసమున ఐదారు పద్యములలో మాత్రమే ప్రసక్తికి తేబడినది. అట్లే కుంభకర్ణుని విషయమును. హనుమజ్జన్మ వృత్తాంతమునకు ప్రసక్తి కల్పించుటలో తిక్కన్నగారు కనీసపు ఔచిత్యమైనను పాటించినట్లు కనిపించదు. కనీసమంతకు ముందు అగస్త్యుడు వాలిని గురించి చెప్పునప్పుడే హనుమంతుని పోలికయైనను తేవలసినది ఏమియు లేక, అగస్త్యుడు రావణుని చరిత్ర మంతయు చెప్పిన తరువాత శ్రీరాముడు హనుమంతుని కథకూడ చెప్పుమని అడిగినట్లును, ఆయన చెప్పినట్లును తిక్కన్నగారు వ్రాసిరి.

ఇక ఉత్తరభాగములో అశ్వమేధమునకు ప్రసక్తి కల్పించుట చాల పేలవముగా నున్నది ఈ విషయమింతకు పూర్వమే స్పృశింపబడినది. తన పట్టాభిషేకమహోత్సవమునకు వచ్చిన బంధువులను, రాజులను, మిత్రులను పంపించిన తరువాత కొంతకాలమునకు జరిగినది సీతాపరిత్యాగము. ఆ కొంతకాలము వ్యవధిని కప్పిపుచ్చుచు తరువాతి ఘట్టమునకు కథ నందీయ వలయును గదా ! అచట సీతారాముల విహారమును తిక్కన్నగారు వర్ణించిరి. ఒక్కనాటి సీతారాముల విహారచర్య వర్ణించి ఆ విధముగా చాలకాలము సుఖించిరనుట సామాన్యముగా నున్నది.

ఒక గ్రంథములో, ఒకదానితో మరొకదానికి పొత్తులేని కథలను వ్రాయుటకు సంకల్పించుటయే మంచిదికాదు. అపుడెంత ప్రయత్నముమీద వ్రాసినను అది ఏకరసాశ్రయమైన అఖండార్థముతోడి కావ్యము కాదు. తిక్కన్నగారు నిర్వచనోత్తర రామాయణము నా కాని విధముగా వ్రాసిరి.

కావ్యమున అంగరసమునకు అంగరసములు లోబడియుండవలయును. అనగా అంగములకు అంగిని మించిన పుష్టి కలుగరాదు. నిర్వచనోత్తర రామా

యణము పూర్వార్థమున రౌద్రస్ఫూర్తి గలిగిన వీర మంగి అని వెనుక మనవి చేయబడినది. రావణుద్ధతుడు. ఆ భాగమున నాయకుడు. వాని శృంగారమూ పూర్వభాగమున నున్నది. అనగా శృంగార మంగరసముగా వీరమునకు లోగి యున్నదని చెప్పుట. రావణుని పాత్రోన్మీలనమును పరిశీలించు సందర్భమున వెనుక ఈ శృంగారము ప్రసక్తి వచ్చినది. తిక్కన్నగారు రావణుని విరహాదికముగాని, ఆ స్త్రీల సౌందర్యాదికముగాని కావలయునని వర్ణించక ఒక ఉద్ధతప్రకృతి రౌద్రస్ఫూర్తిమత్తయైన వీరమున కభిముఖుడై ప్రవర్తించుటలోని హుందాతనమును, నిర్లక్ష్యభావమును పరమ రమణీయముగా పోషించినారు. అటు వేదవతి యొద్దకుగాని, ఇటు రంభ యొద్దకుగాని రావణుడు కావలయునని చేరబోలేదు. మహేశ్వరునిచేత సంభావితుడైనందున రావణుడు మహాసంరంభముతో ఈ భూమిమీద ఇచ్ఛావిహారము చేయుచున్నాడు. ఆ చేయుటలో నొకనాడు హిమవంతమునకు పోయినాడు. అక్కడ వేదవతి కనిపించినది. తత్క్షణమున కామాయత్తుడైనాడు. ఐనదే తడవుగా నామె యొద్దకు పోయి

"ఎవ్వని తనయవు ? నీ పతి
యెవ్వడు ? పేరేమి ? నీకు నీ రూపంబున్
జవ్వనము బాయ నీ తప
మెవ్విధి బాటిల్లె నకట యంతయు జెపుమా !" 5-5

అని అడిగినాడు. నీ తండ్రి ఎవడు ? ఎవడు నీ భర్త ? నీ పేరేమి ? ఇవి రావణుని ప్రశ్నలు. ఆ మొదటి రెండు ప్రశ్నలకు సమాధానము వచ్చినచో ఆమె విషయము సర్వము తెలిసినట్లే. నీ పేరేమి ? ఇది మామూలుమాట. రావణుడంత తెలివిగా మాటాడినాడు. వేదవతి చెప్పినది ఆ చెప్పుటతో తాను విష్ణ్వాసక్త యన్న సంగతి చెప్పినది. రావణు డనినాడు "లలనా విష్ణుడనంగ నెవ్వడు" (5-10) అని. ఈ మాటలలో రావణునకు కామాయత్తత లేదు. ఉద్ధతి యున్నది ఏదో విధముగా వేదవతియందు తన కాముకత నీడేర్చుకొనుట కాదు రావణునకు కావలసినది. ఆ విష్ణునికంటె తన గొప్పతనమును స్థాపించుట. ఆ విషయమున నామెకు నమ్మకము కలిగించుట. ఆమె ఇంకను విష్ణువును పొగడుచు మాటాడుచున్నది. రావణుడు

"ఎరుగవుగాక భోగములకెల్లను నెచ్చెలి జవ్వనంబ; యి
త్తరి నుడివోవకుండ నుచితంబుగ జక్కవదోయివోని క్రి
క్కిరిసిన చిన్ని చన్నుగవ యింపెసలారగ నాదు వక్షమున్
వరలు సరోవరంబున నవారణ గేలి యొనర్పు నెచ్చెలీ" 5–14

"అనుచు తగిలిచూచు"టకు పూనుకొనినాడు. ఆమె వానిని కసరికొట్టి పోవుచుండగా వేనలి పట్టుకొనినాడు. ఆమె చేతితో, ఆ పట్టుకొన్నదానికి పై భాగమున జటమీద కొట్టినది ఆ కొట్టుడు కత్తెరవలె వెండ్రుకలను అంత వరకు కత్తిరించినది. అది ఆమె తపముపేర్మియని భయపడినాడు రావణుడు. అంతే–ఇక నామె జోలి లేదు.

ఇంద్రునిమీదకు పోవుచుండగా కైలాసపర్వతమున విడిసినప్పుడు యాదృచ్ఛికముగా రంభ కనిపించినది. అంతకుపూర్వ మా వెన్నెల బయలుతో చకోరదంపతుల క్రీడలు చూచుటవలన – మలయమారుతము సోకుటవలన రావణుని మనస్సు స్త్రీసుఖమును భావించుటయందు ప్రవృత్తమైనది.

"అత్తిరి చంద్రు జూచు, మలయానిలు రాకకు స్రుక్కు, గామినీ
వృత్తము లాత్మనెక్కొలుపు, వెన్నెలగోరి రమించుచున్న యు
న్మత్త చకోరదంపతుల మచ్చికకున్ మదిమెచ్చు లోలుడై
యెత్తిన వేడ్కలన్ వెడలి యేకతమేగి దశాస్యు డొక్కెడన్" 6–57

ఈ పద్యములో అట్లు వాని మనస్సు ప్రవృత్తమైనదన్న వ్యంగ్య మున్నది. ఆ సమయమున రంభ కనిపించినది. బలవంతమైన రావణుని మనఃప్రవృత్తి రంభను బలిమిమై కవయజేసినది. రావణుని జీవితములో వాడొక స్త్రీ నిమిత్తమైన విరహాభావమును పొందియుండలేదు. వాని ప్రవృత్తి శృంగారాభిముఖము కాదు. కనుకనే వేదవతి విషయమునగాని, రంభ విషయమున గాని పొడిపొడిగానే ప్రవర్తించినాడు రావణుడు. రంభను బలిమిమై ఐనను భోగించుట యున్నది కనుక – అచట మాత్రము రావణుని మనస్సట్లగుట కనుకూలముగా తిక్కనగారు ప్రకృతి వర్ణనము చేసియున్నారు. వేదవతి విషయమున చేయులేదు. అవసరము లేదు గనుక చేయలేదు.

ఉత్తరార్థమున ధర్మవీర మంగిరసము. ఉదాత్తుడైన శ్రీరాముడు నాయకుడు. అంగములుగా శృంగారమును, కించిత్తు కరుణమును ఉన్నవి. శృంగారము సీతారాము లాలంబనముగా జరిగినది. ఆ శృంగార వర్ణనమున చెలువపిండు విహారమును ప్రత్యేకముగా వర్ణింపకుండవలసినది. సీతారాముల విషయమునను శృంగార భావాభివ్యక్తి ఉదాత్తముగా లేదు. సామాన్యముగా నున్నది మనఃప్రవృత్తుల నావిష్కరింపకుండ కేవలము చేష్టలను చెప్పుటవలన సామాన్యమైపోయినది. చేష్టలుకూడ విశేష చేష్టలు కాదు

"అల్లవె లెస్సపువ్వులని అందని గుత్తుల దిక్కు సూపి తా
నల్లనచేరి నేను నెగయన్నిను నెత్తెద గోయుమంచు భూ
వల్లభు డాదటం బొదివి వామవిలోచన నెత్తె తత్తనూ
వల్లికతోన మైపులకవర్గము కాముడు నారు వోయగన్" 8-31

ఇత్యాదులు.

ఉత్తరార్థమున నున్న కించిత్తు కరుణము రాముడు శంబూకుని వధింప నుంకించు సందర్భమున నున్నది. ఈ విషయము శ్రీరాముని పాత్రోన్మీలనము సందర్భమున స్పృశింపబడినది

ఈ నిర్వచనోత్తర రామాయణమున వర్ణనలు కొన్ని యున్నవి. నగర వర్ణనము,యుద్ధ వర్ణనము, కైలాసగిరి వర్ణనము, అంధకార వర్ణనము, చంద్ర చంద్రికా వర్ణనము, సూర్యోదయ వర్ణనము, ఉద్యానవన విహార వర్ణనము, జలక్రీడా వర్ణనము, సంభోగవర్ణనము, సుతోదయ ప్రారంభమైన గర్భాభివర్ణనము, విరహవర్ణనము - అష్టాదశ వర్ణనలు కావ్యమున నుండును గనుక అందలి పది పన్నెండు వర్ణనము లీ నిర్వచనోత్తరరామాయణమున నున్నవని చూపించుట యుద్దేశ్యము కాదు కావ్యములోనున్న కథ యొక్క గతి కా యా వర్ణము లనివార్యములై, తత్కథాగతపాత్రములా యా సందర్భములం దట్లే కావలయునన్న భావమును స్థాపించుటకు వర్ణనము లుపస్కారకములుగా నుండవలయును - తిక్కన్నగారు నగరవర్ణనము చేసినారు అది అయోధ్యానగరము. ఈ నగరవర్ణనము పూర్వ రామాయణమునకును, ఉత్తర రామాయణమునకును, రెండింటికిని పనికి వచ్చునట్లున్నది. సాధారణముగా నగరవర్ణనములో చాతుర్వర్ణ్యముల

వారిని వరుసగా వర్ణించుట తరువాత తరువాత సహజమైపోయినది తిక్కన్నగారు ముందు వైశ్య జనమును-తరువాత బ్రాహ్మణులను మాత్రమే వర్ణించిరి. క్షత్రియ శూద్రుల ప్రసక్తి పెట్టుకొనలేదు. మలయమారుత వర్ణనమును - ఉద్యాన వర్ణనమును నాల్గయిదు పద్యములలో చేసెను. కోట - అగడ్త - హర్మ్యములు-ఏనుగులు-గుఱ్ఱములు - వీని వర్ణనముకాగానే వార వనితలను వర్ణించి అటుతరువాత మిగిలినవి చేసెను. ఈ నగరవర్ణనము తరువాతి కథతో సంబంధము లేకుండ కేవలము వట్టిగా నున్నది యుద్ధ వర్ణనము సగము పుస్తకమున్నది. పూర్వభాగమంతయు యుద్ధములేగదా! ఉత్తరార్ధమునను లవణాసురునితో శత్రుఘ్నుని యుద్ధమున్నది. రావణుని రౌద్రస్ఫూర్తిమత్తమైన వీరమున కభివ్యక్తి యుద్ధమే గనుక యుద్ధవర్ణనము లా పూర్వార్థము దృష్ట్యా సముచితముగనే యున్నవి - ఇక కైలాసాద్రి, చంద్రోదయ మిత్యాదులు రావణుడు రంభ నంతగా బలవంతము చేయుటకు, వాని మనస్సంతగా పతత్రిక్రియయందు లగ్నమగుటకు నుపస్కారములుగా చేయబడినవి. కైలాసనగము చేరి రావణుడా నగమును తత్పరిసర ప్రాంతమును భావించినతీరు నాల్గు పద్యములలో నున్నది

"అరవిరి గుత్తులం బొలిచి యల్లనిగాడ్పుల దూలు నీ లతల్
దరహసితోదయంబు సవిలాసతనూవలనంబు గల్గు సుం
దరుల తెఱంగుగా పతివిధంబున నున్న రసాలపోత మీ
గిరితట భూమికిన్ సరసకేలికి వచ్చిన మాడ్కి నొప్పెడున్" 6-30

ఇత్యాది - రావణుని మనస్సు శృంగారాభిముఖముగా ప్రవృత్తిని పొందుచున్నది. సూర్యాస్తమయమైనది.

"అరుణకరబింబ మస్త శి
ఖరిపై గరమొప్పె - బహుళకస్తూరీలి
ప్తరుచిరకుచకాశ్మీర
స్ఫురితస్థాసకముచందమున నందంబై" 6-37

పశ్చిమాద్రి కుచమువలె స్ఫురించినది. సర్వము స్త్రీమయముగా నున్నట్లున్నది. చీకటి తరచైనది.

"ఇది చూడ్కి గప్పిన యంతటబోక త
క్కటి యింద్రియంబుల గప్పకున్నె" 6-39

రావణుని సర్వేంద్రియములు తమోదోషదూషితము లగుచున్నవి. కనుకనే రంభ నేను నీకు కోడలనన్నను వాని కెక్కలేదు. చంద్రోదయము కాబోవు చున్నది.

"యామినీకాంత మృగమద మలది మలయ
జమున తిలకంబు పెట్టిన చందమగుచు" (6-40) ఉన్నదట.

తరువాత రాబోవు రంభాగమనము నిది సూచించుచున్నది చంద్రోదయ మైనప్పటినుండి చకోరముల క్రీడల వర్ణనము - చంద్రికాభివర్ణనమున తిక్కన్న గారీ పద్యమును వ్రాసిరి.

"అలసత యొప్ప నల్లన రతాంతమునం బ్రియునొద్ద బాసి నె
చ్చెలికడ కేగుదెంచు సరసీరుహనేత్రవిలోచనంబులం
దలకెడు మందహాసము విధంబున సొంపున మీఱియున్న చెం
గలువలలోన నింపడరు కౌముది వేడ్కలొనర్చె చూడ్కికిన్" 6-54

ఆ వెన్నెలలు జూచి ఏవంవిధము భావించు రావణున కప్పుడు రంభ కనిపించినది. ఉచితానుచితములు విచారించక రంభపై పడినాడు. అసలే ఉద్ధతుడు. తిరస్కారమును సహింపలేనివాడు రంభ కాదుగూడదన్నచో రెచ్చిపోవువాడుగాని, వెనుకకు తగ్గి యాలోచించువాడు కాదు రావణుడు. అందువల్లనే రంభను "అసుర కారించి విడిచి" నాడని తిక్కన్నగారు వ్రాయుట. అసుర అసూన్ ప్రాణాన్ రాంతి గృహ్ణంతీతి వా - ప్రాణమును తీయువాడు. అనగా రావణుడు రంభను బలిమిమై కలియబడి ప్రాణములు తీసినట్లుగా బాధించి వదిలినాడన్నమాట - ఇందుకు రావణుని మనః ప్రవృత్తి అనుకూలముగా సన్నద్ధపడుట కంతగా చంద్ర చంద్రికాది వర్ణన రూపమున పీఠిక నేర్పరుపవలసి వచ్చినది. లేనిచో ఇంతపని జరుగుట కవకాశ ముండదు. ఆ వర్ణనమున కేవలము కొన్ని పద్యములు మాత్రమే ఉదాహరించబడినవి. మిగిలినవానిలో రావణుని ఇంద్రునిమీది దండయాత్రను సూచించుచున్నవి - రంభ రావణునిచేత వదలబడి పోయినది. రావణు డా

రాత్రిపూటనే సేనలను అమరావతిమీదకు కదలించినాడు. సూర్యోదయ మైనది.

"అంత సరోరుహాప్తుడుదయం బరుదెంచె నిశాచరుల్ పరా
క్రాంతి తగం గడంగి అమరావతి కేగిరి వారు రాత్రిమై
నెంతయు నగ్గలం బగుదు రేన్ పొడసూపెదగాక – దేవతల్
సంతసమందగా ననుచు సత్వరుడై చనుదెంచె నొక్కొ నాన్" 6–37

అంతకు పూర్వము రావణుడు కైలాసపర్వతమున దిగినప్పుడు సూర్యాస్తమయ మగుటను తిక్కన్నగారు

"అంత సహస్రపాదు డపరాచలశృంగతటంబు చేరె దు
ర్దాంతుడు దానవేంద్రు డమరప్రకరంబు జయింపబోవుచో
నెంతలు పుట్టునో యనుచు నేపడగంగ తొలంగి కాలుకొ
న్నంతయు దవ్వుగా జని భయంబడరన్ గిరిదుర్గ మెక్కెనాన్" 6–36

అని వర్ణించినారు. అప్పుడు సూర్యాస్తమయ మగుటను–సూర్యుడు రావణునకు భయపడి కాలికొద్ది పరుగెత్తి దూరముగా కొండమీద కెక్కినట్లున్నదనియు, ఇప్పుడు సూర్యోదయమగుటను రావణుడు ససేనుడు రాత్రిపూటనే అమరావతి మీదకు పోయినట్లును వ్రాసినారు.

పొడసలే నిశాచరుడు. దేవత లా సమయాన వానికి తట్టుకొనలేరు. త్వరగా సేన కనిపించినచో పగలగును; దేవతలు సంతోషింతురు – అని సత్వరుడై వచ్చినట్లు ఉత్ప్రేక్షించుట, లోకబాంధవు డంతటివాడు రావణునకు భయపడినాడని చెప్పి రావణుని యౌద్ధత్యమును పరాంకోటి కెక్కించుటను – దేవతాప్రీత్యర్థము తనకగు కష్టనష్టములు చూచుకొనకుండ ప్రవృత్తుడగు సూర్యభగవానుని లోకరక్షణపరత్వము నుగ్గడించుటను – సాధించుటయైనది.

–ద్యాన విహారాది వర్ణనము లన్నియు నిర్వచనోత్తర రామాయణ ముత్తరార్థములోనివి. జలక్రీడ, సంభోగ, గర్భచిహ్నాది వర్ణనములు సీతారాములకు సంబంధించినవి. శ్రీరాముని యొక్క ధర్మవీరమునందలి చెదరని ప్రవృత్తిని ముందుముందు నిరూపించబోవుచున్నందున దాని కుత్కర్ష

నాపాదించుటకుగాని శ్రీరాముని సీతతోడి విహారసంభోగముల నభివర్ణించుట యైనది. సీతారాములది ధర్మరతి. తత్ఫలముగా సీత గర్భవతి. సంతానార్థమే భార్యారతి రఘువంశమువారికది మరియు నియమము[1]. సీతను లోకాపవాదమునకు వెరచి ఆ వచ్చిన నడి పోగొట్టుకొనుటకుగాను త్యజించిన తరువాత ఏకాంతమున రాముడు విలపించును. అది ప్రియ భార్యావియోగక్లేశానుభావము. శ్రీరాముని గురించి వ్రాయునపు డా విషయము వ్రాయబడినది. అ శ్లోకాంతమున భార్యను తలపోసినట్లుగా వ్రాసి తిక్కన్నగారు శ్రీరాముని ధీరోదాత్తతను ఎట్లు పుష్టము చేసినదియు నచట వ్రాయబడినది.

---

1. ప్రజాయై గృహమేధినామ్ - రఘువంశము 1-7.

# అనుబంధములు

## 1. నిర్వచనోత్తరరామాయణము – భవభూతి, దిఙ్నాగుల ప్రభావము

తిక్కన్నగారికంటె పూర్వమే యుత్తరకాండ కథను నాటకములుగా వ్రాసిన వా రిరువురున్నారు. దిఙ్నాగుని కుందమాల యొకటి. భవభూతి ఉత్తరరామచరిత్రము మరియొకటి. ఈ రెండింటిని దగ్గరగా పెట్టుకొని చదివినచో కుందమాలను భవభూతి ఎంతగా అనుసరించి ఉపయోగించుకొనినదియును తెలియును[1]. అది వేరు విషయము. ఇంతకును తిక్కన్నగారు ఆ రెండు నాటకములను తాను నిర్వచనోత్తరరామాయణమున నేమైన నుపయోగించుకొనినాడా అన్నది విచారణీయము – కుందమాలలో మొదలు శంబూకవధ ప్రసక్తి లేదు[2]. శ్రీరాముడు సీతను పరిత్యజించుటకు హేతువైన పౌర జానపదులవలని మాటలను ఇదమిత్థమని రెండు నాటకములు చెప్పవు. భవభూతి మరియు దానిని గుప్తముగా నుంచును. జనపరివాద భీతియని మాత్రమే దిఙ్నాగుడు చెప్పినాడు. ఉత్తరకాండమున శ్రీరాముడు భద్రుని వార్తలడుగుటలో సీతను గురించి, భరతుని గురించి, లక్ష్మణుని గురించి, శత్రుఘ్నుని గురించి, కైకేయిని గురించి పౌరజానపదు లేమనుకొనుచున్నదియు చెప్పుమన్నట్లున్నది (43 సర్గ). తిక్కన్నగారిట్లు వ్రాయ లేదు. " మదీయ సంస్తుతులు నన్నియు జెప్పితి కీడుమాట సెప్పనగునో

---

1. ముఖ్యముగా ఉత్తరరామచరితము తృతీయాంకముతో పోల్చుకొనుచు కుందమాల చతుర్థాంకము చదివినచో తెలియును.

2. లవణాసురవధ రెండింటిలోను లేదు. ఉత్తరరామచరితమున మాత్రము నేపథ్యమున సూచింపబడినది.

కాదో నాక ననుతాపము పుట్టక యుండ నేమిగల్గిన గలయంతవట్టును చెప్పు' మన్నట్లు వ్రాసెను. భవభూతి "అర్థవాద పక్షః దోషంతు తావత్కథయ యేన ప్రతివిధీయతే" అని వ్రాసినారు. తిక్కన్నగారు వ్రాసినది భవభూతి తాత్పర్యము ననుసరించి వ్రాయబడినట్లున్నది. జనులు రాజునకు సంబంధించిన దోషముల ననుకొందురా యేమి? అనుకొనుచుందురు. వానిని చెప్పుము—అని శ్రీరాము డడిగినాడు. ఉత్తరకాండమునందువలె ఫలానా ఫలానా వారిని గురించియే లోకమనుకొనుచున్నదానిని చెప్పుమనుటకంటె అసలు రాజును గురించి అనుకొనబడు దోషమును చెప్పుమనుటలోను, అట్టి దోషములు సహజసిద్ధములగుటలోను వైపరీత్యము లేదు. ఉత్తరకాండములో శ్రీరాము డడుగుట యేమి?

లోకము వారొక్క సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న కైకేయిలను గురించి యనుకొను విషయమేనా శ్రీరామునకు కావలసినది? ఆయన రాజు రాజు విచారించుట యట్లుగాదు. భవభూతివలె విచారింపవలయును. తిక్కన్నగారు భవభూతి మార్గమును పట్టి వ్రాసిరి. తిక్కన్నగారు నిర్వచనోత్తరరామాయణమున పూర్వరామాయణ కథను వ్రాయుటకూడ భవభూతి మార్గమే కావచ్చును. భవభూతి ప్రథమాంకమున చిత్రప్రదర్శనము నెపమున పూర్వరామాయణగాథను సూచించినాడు.

సీతను రామాజ్ఞ ననుసరించి లక్ష్మణుడు వనములకు తీసికొనిపోయి ఆమెతో శ్రీరామునిలోని యూహను చెప్పుటకు ముందు బిగ్గరగా నేడ్చుచు సీతపాదములమీద పడినట్లు తిక్కన్నగారు వ్రాసినది, దిజ్నాగ్నుడు కుందమాల ప్రథమాంకమున లక్ష్మణుని విషయమున చేసిన అభినయసూచన ననుసరించి నట్లున్నది.

శంబూకుని వధించుటలో శ్రీరాముడు కొంత వెనుక ముందు లాడినట్లు తిక్కన్నగారు వ్రాసిరి. ఉత్తరకాండమున శంబూకుడు తాను ఫలానా అని చెప్పగానే ఖండించినట్లున్నది[1]. నిర్వచనోత్తరరామాయణము-దశమాశ్వాసములోని 75, 76, 77, 78, 79, 80 పద్యములు శ్రీరాముని శంబూకుని వధించుటలో నొక నిశ్చయమునకు రాలేనితనమును నిరూ

1. ఉ. కాం. - స. 76-4.

పించునవి. శ్రీరాముని విషయమున ఏవంవిధము కరుణమును భావించుటకు తిక్కన్నగారికి "రేహ స్త దక్షిణ మృతస్య శిశోర్ద్విజస్య, జీవాతవే విసృజ శూద్రమునే కృపాణాం, రామస్య గాత్రమసి నిర్భరగర్భఖిన్న, సీతా వివాసన పటోః కరుణా కుతస్తే?"[1] అన్న భవభూతి శ్లోకము తాత్పర్యము మూలము కావలయును.

ఉత్తరకాండమున లేని, నిర్వచనోత్తర రామాయణమున నున్న "భూపతి పత్నీకృత్యములకు పసిడిని సీతాప్రతిమ నొడగూర్చుకొని" యన్నది ఉత్తరరామచరితమును బట్టి కావచ్చును (కాతర్హి యజ్ఞే సహధర్మచారిణీ? హిరణ్మయీ సీతాప్రతికృతిః) అసలీ సీతాప్రతిమ విషయము జైమినీ భారతమున నున్నది గనుక ("జాతరూపంబుచే మహీజాతరూప, మమర గావించి చేయుదు యాగ మనుచు") ఈ యిరువుర కదియే మూలముగా చెప్పవలయును[2].

నిర్వచనోత్తరరామాయణము దశమాశ్వాసములోని 128, 129, 130 పద్యములనుబట్టి వాల్మీకి శ్రీరామునియందాగ్రహించి నట్లూహింప వీలగుచున్నది. ఉత్తరకాండమున వాల్మీకి శ్రీరాముని విషయమున నాగ్రహించి నట్లుగా లేదు కుందమాల నాటకమున షష్ఠాంకమున ప్రవేశించిన వాల్మీకి మాటలు కోపాభినయపూర్వకముగా దిజ్నాగుండు వ్రాసెను. బహుశః తిక్కన్నగారా నాటకమునుబట్టి స్పష్టముగా "అంతనుండియు సీతోడ నలిగియున్న వారమేము" అని వాల్మీకిచేత అనిపించి యుండవచ్చును.

తిక్కన్నగారికంటె ముందుగా వ్రాయబడిన గ్రంథములని, వాటిలోని అభిప్రాయములు రెండు మూడు నిర్వచనోత్తర రామాయణమున ప్రవేశించినవని చెప్పుటయేగాని మరొకటి గాదు. అసలు ఉత్తరరామాయణకథను వ్రాయుటలో నాటకకవులకును తిక్కన్నగారికిని దృష్టి భేదమున్నది నాటకములలో విప్రలంభము ప్రధానము కాగా నిర్వచనోత్తర రామాయణమున ధర్మవీరము ప్రధానమైనది. సీతాపరిత్యాగవిషయమును తిక్కన్నగారు విపులముగా వ్రాసినారు. నాటక కవులా విషయమును సూచించి

1. ఉ. రా. చ. 2-9.
2. జైమినీ భారతము 6-104.

వదలినారు. శ్రీరాముని విరహమును నాటకకవు లందుకొని వ్రాసినారు. తిక్కన్నగా రా విషయమును అణగద్రొక్కి శ్రీరాముని పాత్రపోషణ చేసినారు. శ్రీరాముని సతీసుతుల సమాగముమీద నాటకకవులు దృష్టిని కేంద్రీకరించినారు. నిర్వచనోత్తర రామాయణమున సతీసమాగమము లేదు. సుతులతో నైనది చాల గంభీరముగా నైనది. నాటకములలో శ్రీరాముడు పగులబడి యేడ్చుటకుగాని, మాటాడుటకుగాని ఉన్న వెసులుబాటు నిర్వచనోత్తర రామాయణమున లేదు. రసవిషయమున దృష్టులు భేదించినవి. అదే కారణము. అందువలన సూక్ష్మముగా నున్న పూర్వకవుల ప్రభావము తిక్కన్నగారిపై ఇది యని సూచింపబడినది.

## 2. ఉత్తరకాండ — తరువాతి కవులు

తిక్కన్నగారి తర్వాత నీ యుత్తరరామాయణమును తెలుగున వ్రాసినవారు ముగ్గురున్నారు. రంగనాథ రామాయణము ఉత్తరకాండమును కాచభూపతి, విఠలరాజు అనువా రిరువురును కలిసి వ్రాసిరి కంకంటి పాపరాజు ఉత్తరరామాయణమను పేర ప్రత్యేకము పద్యగ్రంథమును వ్రాసెను. శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులవారను త్తరరామాయణ కథను కావ్యముగా వ్రాసిరి.

రంగనాథరామాయణకర్తగా చెప్పబడుచున్న బుద్ధారెడ్డి కుమారులు కాచభూపతి, విఠలరాజు లిద్దరును కలిసి యుత్తరకాండమును పూర్వరామాయణము వలెనే ద్విపదలో వ్రాసిరి ఆ గ్రంథము క్రీ. శ. 1920 సం॥మున శ్రీ చెలికాని లచ్చారావుగారిచేత అముద్రితాంధ్రగ్రంథ సర్వస్వమను ప్రచురణ వరుసలో నైదవదిగా ముద్రింపబడినది. సుమారు ఆరువేల ద్విపదలతో నున్న దా గ్రంథము. శ్రీరాముని నిర్యాణ పర్యంతముగా వ్రాయబడినది. మూలగ్రంథమున ప్రక్షిప్తములుగా పేర్కొనబడిన నృగు, నిమి, ఇత్యాది కథలును నందున్నవి. ఒకవిధముగా కంకంటి పాపరాజుయొక్క ఉత్తరరామాయణము, ఈ ద్విపద ననుసరించి వ్రాయబడినట్లు కథాసందర్భములనుబట్టి చెప్పవచ్చును. అసలు రంగనాథ రామాయణ స్వభావమును బట్టి యమూలకములైన లోకమునందున్న కథలు చేర్చి వ్రాయుటయన్న

లక్షణ మీ యుత్తరకాండమున నున్నది. భద్రుడు లోకాపవాదమును శ్రీరాముని కెరిగించుటకు ముందుగా నీ ద్విపదోత్తరరామాయణమునందొక చిత్రమైన కథ యున్నది. శ్రీరాముడు, ఇతరులకు కనిపించని కామరూప ములుగల యిరువురు స్త్రీలతో నుండుట నొక రాక్షసి సీతబుద్ధి కెక్కించుటయు, ఆమె యసూయాగ్రస్తయై శ్రీరాముని యడుగుటయు మొదలుగా గల కథ యిది. ఇట్టి వింకను పరిశీలించినచో చూపించవచ్చును శ్రీ చాగంటి శేషయ్యగా రుదాహరించిన పంక్తులనుబట్టి తిక్కన్నగారి నిర్వచనోత్తర రామాయణము నా కాచభూపతి విరలరాజులు చూచియున్నట్లు కనిపించు చున్నది. ఈ యిరువురును క్రీ. శ. 1320–25 ప్రాంతమున గ్రంథరచన చేసి యుండవచ్చును.

కంకంటి పాపరాజు క్రీ. శ 1575–1632 మధ్యకాలమున నున్నవాడు. తిక్కన్నగారి నిర్వచనోత్తర రామాయణము చూచినట్లు వ్రాసికొన్నవాడు. ఈయన ఉత్తరరామాయణము వ్రాయుటకు హేతువు "రాఘవేశ్వరు చారిత్రము నెంద ఱెన్ని గతులన్ వర్ణించినం గ్రాలదే" అన్న విశ్వాసముతోడి నిశ్చయము తప్ప మరేమియు లేదు ఈ పాపరాజును తిక్కన్నగారివలెనే అయోధ్యానగర వర్ణనతోపాటు పూర్వరామాయణమును సంగ్రహముగా ప్రథమాశ్వాసమున వ్రాసినాడు. మరియు మూలగ్రంథమున నేవి ప్రక్షిప్తములని భావింపబడుచున్నవో ఆ కథలనుగూడ పాపరాజు వ్రాసెను. రావణుడు బలిమీదకు పోవుట, సూర్యలోకముపై వెడలుట, చంద్రునిమీదకు పోవుట, వాలి సుగ్రీవుల జన్మకథనము, రావణ సనత్కుమార సంవాదము, రాముడు లక్ష్మణునకు చెప్పిన నృగు, నిమి మహారాజుల కథలు,గృధ్రోలూక సంవాదము ఇత్యాదు లన్నియు కంకటి పాపరాజు తన ఉత్తరరామాయణమున వ్రాసెను ఉత్తరకాండ ప్రయోజనమును గురించిగాని, రామరావణుల చరిత్రల ఆంతర్యమును గాని పాపరాజు తానంతగా నాలోచించినట్లు కనిపించదు. రావణుడు సనత్కుమారునియొద్దకు పోయి తాత్త్వికరహస్యము లను నెరింగినట్లుగా కల్పించుట రావణుడు బుద్ధిమదగ్రగణ్యుడు సుమా; వా డజ్ఞానముతో కాముకుడై సీత నపహరింపలేదని నిరూపించుటకుగా నున్నది. పాపరాజు సంవాద మధికపారమైనను వ్రాసినాడు. సరే. తా నుత్తర రామాయణమున రావణుని ఏవం విధమైన మనఃపరిపాకము కలవాని

నిగా చిత్రించుటకు పూనుకొని చేసినచో బాగుండెడిది. అది కాదాయె. రావణుని సర్వమైన యౌద్ధత్యమును ప్రపంచించు కథలతోపాటూ సంవాదమును వ్రాయుట కేవలము విషయవివేచనము లేమిగా తోచుచున్నది. మొత్తముమీద కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము మూలమునకు వర్ణనలు చేర్చబడి చేయబడిన అనువాదగ్రంథము మూలగ్రంథమున లేని చమత్కారములును ఒండు రెండు చేసినాడు పాపరాజు శ్రీరాముడు అవతారము చాలించి వైకుంఠము చేరిన తర్వాత, శ్రీదేవి యెదుట ప్రణయ కలహము నభినయించినాడట.

"అవునవు మంచిదాన వతివా నిను నేమనవచ్చు నొంటిగా
నవని నమన్ దృజించి సభయం దుపుడిద్దర త్రోవయియ్యగా
నవమతిఁజేసి వచ్చితివ యా కలుకుందన మాత్మ నెంచినన్
దివిరికనుంగొనంగనె నీమొగమింక తలోదరీమణీ—"

ఇత్యాదిగా శ్రీరాముని ప్రణయకోపమును పాపరాజు వ్రాసినాడు. ఇట్టివి సొంతముగా చేసినాడు. పాపరాజు పూర్తిగా అటు తిక్కన్నగారిని గాని, ఇటు మూలమునుగాని ఆధారముగా చేసికొని, ఉత్తరరామాయణము వ్రాసినవాడు గాదు. స్వేచ్ఛగా వర్ణనలు చేసికొనుచు రామాయణోత్తర కాండమును తెనుగున పద్యగ్రంథముగా వ్రాసినాడు. ఈ ఉత్తర రామాయణమున అనేక కథలున్నవి. వర్ణనలున్నవి.

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులు వ్రాసిన "గోవింద రామాయణము" చాల సంక్షిప్తమైనది. మరియు నీ గోవింద రామాయణమున నున్న చిత్రమేమనగా రావణవిజయపరంపరాభివర్ణనము లేకపోవుట. నిజమునకు నుత్తరరామాయణ మనగా శ్రీరాముని రావణావధానంతర జీవన కథావిశేషముగాని రావణోదంతము కాదుగదా! ఈ విషయమైన మీమాంస వెనుక చేయబడినది. గోవిందాచార్యులవారు ఉత్తరరామచరితమనగా కేవలము శ్రీరామునకు సంబంధించిన విషయములే ఉండవలయునన్న నిష్కర్షతో గోవిందరామాయణ మట్లే వ్రాసిరి.

"భక్తిరసము పునాదిగా ప్రబలజేసి
కరుణరసకావ్యసౌధంబు గట్టువాడ"

ఈ గోవింద రామాయణమును వ్రాయుటలో ఆచార్యులవారి ఆంతర్య మిది. ఈయనగూడా పూర్వరామాయణమును వ్రాసెను ఆ వ్రాయుటలో గడుసుదనమున్నది. ఆ వ్రాసిన పదకొండుపద్యములును శ్రీరాములవారిని స్తుతించుచుండి పూర్వరామాయణగాథను వ్యక్తము చేయుచున్నవి. అందుండి యొక పద్యము——

"కావుము నీవె నాదు కడగండ్లను బాపుము నీవెయంచు సు
గ్రీవుడు వేడునంతటనె కీశవరేణ్యుని వాలిజంపి సు
గ్రీవుని యార్తి బాపిన వరిష్ఠుడు దక్షిణ రక్షకుండు స
ర్వావసరంబులందు శరణాగతులన్ మముబ్రోచుగావుతన్"

ఈ గోవింద రామాయణము అనువాదగ్రంథము కాదు. ఊరక కథను గ్రహించి వ్రాయబడిన స్వతంత్రగ్రంథము. కవి ఈ కాలము వాడగుట మూలమున నేటికాలపు పూర్వపురాణేతిహాసములందలి పురుషుల కృత్యములను విపరీతముగా భావించు లక్షణము ఆయనయందును ప్రవేశించి బుద్ధిని తాడితము చేయగా తిరిగి కావలయునని నిలద్రొక్కుకొనుచున్నట్లున్న రచన మీ గ్రంథమున నున్నది. శంబూకవధ విషయమున చూడవచ్చును. ఈ గోవింద రామాయణమున ఉత్తరకాండను నందువలె యముడు శ్రీరామునితో నిక అవతారము చాలింపుమని చెప్పుటకు మారువేషమున వచ్చి, ఏకాంతమున చెప్పుచున్నప్పుడు దుర్వాసుడు వచ్చుట, తత్ఫలితముగా లక్ష్మణుడు రామునిచే దండింపబడి పరలోకమున కేగుటయు, తరువాత శ్రీరాముని మహాప్రస్థానమును నున్నవి పునస్సంయోగాశ్వాస మన్న చివరి యాశ్వాసములో నీ విషయము లన్నియు నున్నవి ఈ గ్రంథము విహారాశ్వాసము, సీతారాముల వనవిహారముతో ప్రారంభమగుచున్నది. శ్రీరాముడు మధ్యలో సీతను త్యజించినను, వైకుంఠమున శ్రీమహావిష్ణువు పూర్తిగా లక్ష్మీసమాగమమున సుఖమున్నట్లుగా గ్రంథము మంగళాంతముగా ముగింపబడినది. మరియు నీ గ్రంథాంతపద్యము మంగళమహాశ్రీ.

శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు కేవలము శ్లోకములకు తెలుగు పద్యములు వ్రాసినారు. అది పట్టి యనువాదము. అందువలన తిక్కన్నగారి తరువాత ఉత్తర రామాయణమును వ్రాసినవారిలో ఈయనను ఇంతకు ముందు పేర్కొనలేదు. ఈయనవలెనే శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారును..

విద్వాన్ కట్టి వెంకటసుబ్బారావుగారు ఉత్తరకాండముతో సహా శ్రీమద్రామాయణమును "శ్రీ రఘురామ చరిత్రము" అను పేర సంగ్రహముగా తెనుగున కావ్యముగా వ్రాసిరి. శ్రీరాముని నిర్యాణపర్యంతముగా నున్న కథ శ్రీ సుబ్బారావుగారిచేత వ్రాయబడినది.

## 3 ఆశ్వాసాద్యంతపద్యములు

నిర్వచనోత్తర రామాయణమునందలి ఆశ్వాసాద్యంతపద్యములలో నున్న విశేషమేమనగా అవి సంబోధనాంతములుగా నుండక ప్రథమా ద్వితీయాది విభక్త్యంతములుగా నుండుట. తిక్కన్నగారికంటె పూర్వమున్నవాడుగా సిద్ధాంతీకరింపబడిన నన్నెచోడదేవుడు తన కుమారసంభవ కావ్యమున ఆశ్వాసాద్యంతపద్యములు విభక్త్యంతములుగానే వ్రాసెను నన్నయగారి భారతమునందలి ఆశ్వాసాద్యంతపద్యములు సంబోధనాంతములు. నన్నెచోడుడు నన్నయగారివలె గాక తిక్కన్నగారివలె వ్రాసెను. ముందున్న నన్నెచోడుడు తరువాతనున్న తిక్కన్నగారివలె వ్రాయుటయేమి? అనగా నన్నెచోడుడు తానొక క్రొత్త పద్ధతిని ప్రవేశపెట్టగా తిక్కన్నగారు దానిని నిర్వచనోత్తర రామాయణమున అనుసరించినాడని చెప్పుట. తరువాత తిక్కన్నగారిని బట్టి ఆశ్వాసాద్యంతపద్యములు వ్రాసినవారు కొందరున్నారు. కేతన - విన్నకోట పెద్దన-కొలవి గోపరాజు - మంచన-చిన్నయసూరి. భాస్కరుడుకూడ ఒకడున్నాడు.

శ్రీ నిడదవోలు వెంకటరావుగారు "ఉదాహరణవాఙ్మయ చరిత్ర" మున ఈ కావ్యములలో ఆశ్వాసాద్యంతపద్యములు విభక్త్యంతములుగా వ్రాయుటయు, షష్ఠ్యంతములు వ్రాయుటయు, ఉదాహరణ వాఙ్మయము యొక్క ప్రభావమునకు లోబడి యన్న యభిప్రాయమును ప్రపంచించి స్థాపించుటకు చాల యత్నించిరి. బసవోదాహరణమున కంటె ప్రాచీనమైన యుదాహరణ మొక్కటియు ఇటు తెనుగునగాని, అటు సంస్కృతమునగాని లభించినట్లు శ్రీ వెంకటరావుగారు చెప్పుటలేదు విభక్త్యంతములతో పద్యములు ప్రాచీనకాలమునుండి శాసనములలో నున్నవని శ్రీ వెంకటరావుగారు, శాసనపద్యమంజరినుండి ఉదాహరించిన శాసనస్థములు పద్యములన్నియు క్రీ. శ. 1108 తరువాతివేగాని ముందటివి కావు. నన్నెచోడుడు

అంతకంటె పూర్వమున్నవాడుగదా మరి ! అయినచో నన్నెచోడుడే ఈ రకముగా విభక్త్యంతములతో పద్యముల వ్రాయుట ప్రారంభించి యుండ వలయును. కాని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు "కావ్యాదులకన్న గ్రంథరూపమున తెలుగున తొలుత వెలువడినవి యుదాహరణములే యని చెప్పనగు" నన్నదాని విషయమున పట్టుదల చూపుచున్నారు. ఈ విషయ మున నింతకంటె చర్చ అక్కరలేదు.

తిక్కన్నగారు ఆశ్వాసాద్యంతపద్యములను విభక్త్యంతములుగా వ్రాసిరి. అసలు ఆశ్వాసాద్యంతములందు పద్యము లెందుకుండవలయును ? నేరుగా కావ్యము ప్రారంభింపబడవచ్చునుగదా ? అన్నచో ప్రారంభింప వచ్చును సంస్కృత కావ్యము లట్లే యున్నవి కదా !

తెనుగున కృతులు ఎవరికో ఒకరికి చెప్పుచున్నట్లు - అనగా వినిపించు చున్నట్లుగా - వ్రాయబడుచున్నవి. నన్నయగారు రాజరాజనరేంద్రునకు భారతము వినిపించెను. ఈ వినిపించినట్లు వ్రాయుట క్రమముగా అంకిత మిచ్చినట్లు వ్రాయుటగా మారినది. ఆ విధముగా వినిపించుచున్నప్పుడు కృతికర్త అనగా వక్త ఒక ఘట్టము (ఒక ఆశ్వాసము) ముగించి, రెండవ ఘట్టము నందుకొనులోపల "ఏమయ్యా వినుచున్నావా ? ఎట్లున్నది ? ఆఁ. ఇక తరువాత వినుము" అనుట సహజము. ఆ అనుట పద్యములుగా వ్రాయ బడినపుడు సంబోధనాంతములైనవి. మొదలీ మార్గము తెనుగులో నన్నయ గారిచేత ప్రవేశపెట్టబడుటకు కారణము ఆయన మహాభారతము విషయమున మననము చేసిచేసి యుండుట కావచ్చును. ఆ మూలభారతమే వైశంపాయ నుడు జనమేజయునకు చెప్పినట్లుగా సూతుడు శౌనకాది మహర్షులకు చెప్పి నట్లున్నది. ఒకరు చెప్పుటయు మరొకరు వినుటయు నున్నందున వినువారు తరువాత యెట్లైన దనుటయు, చెప్పునాతడు వినుమయ్యా అని సంబోధించి చెప్పుటయు సంస్కృతభారతమున అనివార్యములైనవి. ఆ గ్రంథముననున్న వక్త - శ్రోత వారిరువురి సంబంధమును ఒక కావ్యశిల్పముగా మార్చి నన్నయ్యగారు తెనుగున ప్రవేశపెట్టినట్లు కన్పించుచున్నది. తచ్ఛిల్పాభి వ్యక్తిరచనయే ఆ సంబోధనాంత ఆశ్వాసాద్యంతపద్యములు. నన్నయ గారు నాడు చేసిన ఆ శిల్పము నేటికిని అవిచ్ఛిన్నముగా సాగుచున్నది

ఐనచో నొక ప్రశ్న. మరి నన్నెచోడుడు తిక్కన్నగారు మొదలైన వారు నన్నయ్యగారి ననుసరింపక క్రొత్తమార్గ మేల త్రొక్కిరి? ఈ క్రొత్త మార్గము ను ప్రారంభించిన నన్నెచోడుడు మాత్రము అవసరముండి చేసినాడు కాక నన్నయగారికంటె భిన్న మైన తన మార్గ మొకటి ఉండవలయునని కొని, దానికి తగిన అవసరము కల్పించుకొని చేసినాడనియు చెప్పవచ్చును. నన్నెచోడు డెవరికి కథ చెప్పదలచుకొనినాడో ఆ జంగము మల్లికార్జునకు పరమేశ్వరునితో అభేదమును కల్పించి కధనము ప్రారంభించినాడు. అనగా కథ ప్రారంభమైన తరువాత వినుటకు అసలువ్యక్తి లేడు. లేనిచో నెవరిని సంబోధింపవలయును? సంబోధించుట కెవరును తన చెప్పు కథను వినుటకు నన్నెచోడుడు కల్పించుకొనలేదు గనుక ఆశ్వాసాద్యంతపద్యములు సంబోధనాంతములుగా నుండవలసిన అవసరమే లేకుండాపోయినది. దీనితో నన్నయగారి వలె వ్రాయుట కవకాశములేదని తప్పుకొనుటకు వీలైనది. మరి ఆశ్వాసాద్యంతము లెట్లు వ్రాయవలయును? అసలు వ్రాయుటుంప మానుకొనరాదా? మానుకొనవచ్చును. మానుకొనుట కంతగా యోజించి, తాను వినుపించ దలచుకొన్న తన గురువున కీశ్వరునితో నభేదమును కల్పించుట యేల? కనుక నాశ్వాసాంత పద్యములు వ్రాయుట మానుకొనరాదు. మరి యేమి చేయవలయును? ప్రతి యాశ్వాసాంతమునకు కథానాయకుడైన ఈశ్వరుని తీసికొని రాగలిగినచో నచట నాల్గుపద్యములు వ్రాయవచ్చును. అవి యాశ్వాసాంతపద్యములవలెనే యుండును. కథలోనివిగా గూడ నుండును. నన్నెచోడు డీ ఆలోచనతో ప్రతి యాశ్వాసాంతమునకు పరమేశ్వరుని తెచ్చి దానికి ప్రాధాన్యమున్నట్లు నిర్వహించినాడు. ప్రథమాశ్వాసాంతమున దక్షుడు ఈశ్వరుని ఆస్థానమునకు వచ్చి ఆయనను చూచినాడు. ఆ దక్షుడు చూచినది ఇట్టి ఈశ్వరుని అని ఒక ఐదు పద్యములు నన్నెచోడుడు వ్రాసెను అన్నియు ద్వితీయావిభక్త్యంతములు. ద్వితీయాశ్వాసము ప్రారంభము కూడ అట్లే. "అటువంటి వానిని కని" అని కథ తరువాత ప్రారంభమగును. ద్వితీయాశ్వాసము దక్షుని కరుణించి వదలిన ఈశ్వరుని వర్ణనము (ఇట్టివాడు, ఇట్టివాడు అని) తో నంతమైనది. అనగా ప్రథమావిభక్త్యంతముగా నన్నమాట ఈ విధముగా నన్నెచోడదేవుని కుమారసంభవమునందలి ద్వాదశాశ్వాసములును చూచుకొనవచ్చును. ఈ విషయమింతగా నేల వ్రాయుచున్నాననగా ఆశ్వాసాద్యంతపద్యములు విభక్త్యంతములుగా వ్రాయుటను

ప్రారంభించిన నన్నచోడదేవుడు లెస్సగానాలోచించి ప్రారంభించినాడనియు, తరువాతివారి కాయన ఆలోచనరహస్యము తెలియక క్రొత్తగా నున్నదని ఊరక అనుకరించినవారే గాని అధికప్రయోజనము సాధించినవారు కారని చెప్పుటకు - భాస్కర రామాయణమున అరణ్యకాండమునందలి ఆశ్వాసాద్యంతపద్యములు విభక్త్యంతములు (ప్రథమ-ద్వితీయ) గా నున్నవిగదా - తిక్కన్నగారు తాతగారి ననుసరించినట్లు చెప్పరాదా యేమి యనవచ్చును. చెప్పవచ్చును కాని ఆ భాస్కరరామాయణకర్త భాస్కరుడు తిక్కన్నగారి తాతగారన్నది వివాదాంశము. పైగా నంతకుపూర్వము అట్టి రచన యున్నది గాని, ఆ భాస్కరుడుగాని కనిపెట్టినది కాదు. పైగా తిక్కన్నగారు నన్నెచోడుని గ్రంథమును బాగుగా నెరిగినట్లు ఆయన భారతమే ప్రత్యక్షసాక్ష్యముగా నున్నది. అట్టిచో నీ విభక్త్యంతపద్యరచనగూడ నన్నెచోడుని బట్టియే చేసినాడని చెప్పిన సమంజసముగా నుండునని చెప్పుటయైనది పైగా వివాదము తప్పిపోయినది. నిర్వచనోత్తర రామాయణమున తిక్కన్నగారు విభక్త్యంతములుగా ఆశ్వాసాద్యంతపద్యములు వ్రాసి సాధించిన దేమియు కన్పించుటలేదు 1, 3, 6, 7, 8, 9, 10 ఆశ్వాసాంతములు ప్రథమా విభక్త్యంత పద్యములతో నున్నవి. రెండవ ఆశ్వాసాంతము ద్వితియా విభక్తి. తృతీయాశ్వాసాంతము చతుర్థి పంచమాంతము షష్ఠి. అనగా తిక్కన్నగారు నాల్గు విభక్తులు వాడుకొన్నట్లు. ఈ ఫలానా ఆశ్వాస మీ విభక్త్యంత పద్యములతో నేల ముగించవలసివచ్చినదన్న ప్రశ్నకు నిర్వచనోత్తర రామాయణమున సమాధానము రాదు. "అమ్మనుమ నృపతి కభ్యుదయమ్ముగ నే చెప్పబూని నట్టి కథకు..." అని ప్రారంభించినపుడు, ఒక్కొక్క ఆశ్వాసము (ఘట్టము) పూర్తి కాగానే ఆయనను పలుకరించినట్లుగా సంబోధనాంత పద్యములు వ్రాయవలయును. అట్లు వ్రాయక ఏవో విభక్త్యంత పద్యములు వ్రాసి ఏమి సాధించినట్లు? నన్నెచోడుడు చేసినట్లు కథానాయకునితో నభేదము కల్పించినాడా అన్నచో అది లేదు. అదియునుగాక ఈ నిర్వచనోత్తర రామాయణమున మొదటి ఏడాశ్వాసములును (దాదాపు) రావణ నాయకములు. మనుమసిద్ధికి ముందు రావణునితో నభేదము చేయవలసివచ్చును. అది తిక్కన్నగారి కిష్టము కాదుగదా! కాకపోయినను ఆయన వ్రాసిన పద్యములవలన మనుమసిద్ధికి కొంత కాలము రావణునితోను మరికొంత కాలము మరికొందరితోను తదాత్మ్యము కలిగినట్లు స్ఫురించుచున్నది. ప్రతి

ఆశ్వాసాది పద్యమును తత్పూర్వమున్న ఆశ్వాసాంత పద్యములవలె నుండును గదా! ఆ యాశ్వాసాది పద్యమే విభక్త్యంతముగా నుండునో, కథాప్రారంభములోని పద్యమును పైదానివలెనే ఉండునట్లు తిక్కన్నగారు వ్రాసిరి. అందువలన ఆ స్ఫురించుట.

ఆ. 2. భూమండన యశుడు మన్మ భూమీశుడొగిన్ (ఆశ్వాసాది)
శ్రీరామచంద్రు డిట్లు (ఆ యాశ్వాసమున కథాప్రారంభము)

ఆ. 5 ధీరునిచే మనుమ వసుమతీవల్లభుచేన్ (ఆశ్వాసాది)
శంభునిచే నివ్విధమున (ఆ యాశ్వాసమున కథాప్రారంభము)

ఆ. 6. మనుమసిద్ధి జనపాలునకున్ (ఆశ్వాసాది)
దనుజాధీశ్వరునకు (ఆ యాశ్వాసమున కథాప్రారంభము)

ఈ పైన పద్యము లేల యుదాహరింపబడినవనగా నన్నెచోడునివలె తిక్కన్నగారును ఆశ్వాసాద్యంతములందు విభక్త్యంత పద్యములు వ్రాసినారని అనుకొనుటకే పనికివచ్చునుగాని మరొక ప్రయోజనము లేదనుటకు నన్నెచోడదేవుడు చేసినది చాల తెలివిగా చేసినాడు తిక్కన్నగారట్లు చేయలేదు కేతన దశకుమార చరిత్రమున, తిక్కన్నగారు నిర్వచనోత్తర రామాయణమున ఆశ్వాసాద్యంతపద్యముల విషయమున ఏమిచేసెనో తు చ. తప్పక అదే చేసెను. మంచన కేయూరబాహు చరిత్రమున ప్రథమా (ఆ. 3) ద్వితీయా (ఆ 1,2) సంబోధనా (ఆ 4) విభక్తులంత్యములుగా ఆశ్వాసాద్యంత పద్యముల వ్రాసెను. ద్వితీయ తృతీయాశ్వాసములను, చతుర్థాశ్వాసమును ద్వితీయావిభక్త్యంత పద్యములతోను, ప్రథమావిభక్త్యంత పద్యముతోను ప్రారంభమగుచున్నవి. తరువాతి కథాప్రారంభముగూడ తిక్కన్నగారివలెనే ఆపై విభక్త్యంత మనిపించునట్లుగా వ్రాసెను అనగా మంచన, తిక్కన కేతనల ననుసరించినాడన్నమాట. తిక్కన్నగారి తర్వాత విభక్త్యంతములుగా ఆశ్వాసాద్యంతపద్యములు వ్రాసినవారిలో తెలివిగా వ్రాసికొన్నవాడు కొఱవి గోపరాజు. సింహాసనద్వాత్రింశిక యందలి ద్వాదశాశ్వాసములందు ఒక్క ద్వితీయావిభక్తినే వాడుకొనెను. ఆశ్వాసాంత మాలినీవృత్తము మాత్రము గ్రంథమునందంతటను సంబోధనాంతముగను మిగిలిన ఆశ్వాసాంతమునందలి పై రెండు పద్యములును (వృత్తములు) ప్రతి ఆశ్వాసాది

కందపద్యము ను ద్వితీయాంతములుగను వ్రాసికొనెను. ఈ వ్రాయుట తెలివిడి చేష్టగా నేల చెప్పితి ననగా అది కథాగతిలోనికి ముడించుటవలన. ఆ భోజుడా సింహాసనము నెక్కునపుడు భగవంతుని స్మరించుకొని యెక్కువాడట. ఇట్టివాడైన ఆ భగవంతుని అని చెప్పునది ఆశ్వాసాది పద్యము మనస్సులో తలంచుకొనుచు అని కథలోని పద్యము వెంటనే ప్రారంభమగును ఇట్టివాడైన ఆ భగవంతుని అని చెప్పు పద్యములే రెండవయాశ్వాసమున కంతమనను, ఒకటి ఆ తరువాతి ఆశ్వాసము ప్రారంభముననను నుండును. అందువలన ఈ గ్రంథమున ఒక ద్వితీయమే అంతమున చెప్పబడినది. మాలినీ వృత్తము సంబోధనాంతము. నన్నెచోడుడును ప్రథమా ద్వితీయా విభక్తులను రెండింటినే వాడినాడు. అవసరమును బట్టి వాడుకొనుట యనగా నట్లుండును అవసరములేనిచో నియమమును లేదు. తిక్కన్నగారు నాల్గు విభక్తులను వాడిరి. ఆయన ననుసరించి కేతనగూడ నాల్గు వాడెను. తరువాతవారును (విన్నకోట పెద్దన) అదే పద్ధతి.

తిక్కన్నగారు నిర్వచనోత్తర రామాయణమున ఆశ్వాసాంతములుగా వ్రాసిన పద్యములు మూడు—ఒక సామాన్యవృత్తము (చంపకోత్పల శార్దూల మత్తేభములు), ఒక కందము, చివరకొక విశేషవృత్తము (మాలిని). ఈ విధముగా ఆశ్వాసాంతపద్యసంఖ్యా నియతముగా వ్రాయుట నన్నయగారిలో లేదు. ఆదిపర్వము ప్రథమాశ్వాసాంతమున మాత్రమే ఒక ఉత్పలము ఒక కందము, ఒక తోటకము వరుసగా వ్రాసెను. మిగిలిన స్థలములయందు కేవలము ఒక కందము ఒక విశేషవృత్తముతో ముగించెను. నన్నెచోడుడు కుమారసంభవమున ఆశ్వాసాంతపద్యములుగా కనుపించునవి నాలుగైదున్నను చివరి మూడు మాత్రము ఒక వృత్తము, ఒక కందము, ఒక విశేష వృత్తము – ఇవి తప్పకుండ నున్నవి. తిక్కన్నగారు నిర్వచనోత్తర రామాయణమునను, భారతమునను చివరిపద్యము మాలినిగానే వ్రాసెను మొదటిదిగూడ చంపకోత్పలాది సామాన్యవృత్తములలోనిదిగానే వ్రాసెను. ఒక్క సౌప్తిక, స్త్రీపర్వములందు మాత్రము ఆశ్వాసాంత పద్యములలో మొదట మహాస్రగ్ధర, స్రగ్ధర, శిఖరిణి, మందాక్రాంత వృత్తములు వ్రాసెను. నన్నయగారివలె ఆశ్వాసాంతపద్యము లొక నియతి కొదుగకుండ పోవునట్లు కాకుండను, నన్నెచోడునివలె నాలుగైదు కాకుండను, తిక్కన్న

గారు ఆశ్వాసాంతపద్యములను మూడింటిగా నిష్కర్షించి తానట్లే ఈ నిర్వచనోత్తర రామాయణమునను, భారతమునను వ్రాసెను. తరువాత వచ్చిన సర్వాంధ్రకవులును తిక్కన్నగారివలె ఆశ్వాసాంతపద్యములు మూడు మాత్రమే వ్రాయ నారంభించిరి. చివరి విశేషవృత్తము మాత్రము మాలినీ వృత్తేతరముల నుండి విరివిగా గ్రహింపబడి వ్రాయబడినను మొదటి రెండును అనగా సామాన్యవృత్తము, కందము మాత్రము-తిక్కన్నగారి ననుసరించియే యున్నది. ఇది అపవాదములేని సిద్ధాంతముకాదు గాని, అధిక భాగము సిద్ధాంతము వంటిది

ఇక్కడ మరొక విషయము వివాదాస్పదుడైన భాస్కరుడు రామాయణము అరణ్యకాండము నందలి రెండాశ్వాసాంతములందును సరిగా ఒక సామాన్యవృత్తము, ఒక కందము, ఒక మాలినియే వ్రాసెను అయోధ్యకాండకర్త కుమార రుద్రదేవుడుగూడ ఆశ్వాసాంతము (కాండాంతము) పై విధముగనే వ్రాసెను

## 4. నిర్వచనోత్తరరామాయణ శేషము - ఏకాశ్వాసము

—జయంతి రామభట్టు

ఉత్తరకాండ కథను తిక్కన్నగారు పూర్తిగా వ్రాయలేదని, ఈ జయంతి రామభట్టు, ఆయన వ్రాయని భాగమును తాను వ్రాసెను. వ్రాసి ఏకాదశాశ్వాసముగా నిర్వచనోత్తరరామాయణమునకు కలిపెను. అట్లు కలుపదలచుకొన్నవాడు తానుగూడ ఆ ఒక్క ఆశ్వాసమును నిర్వచనముగనే వ్రాయవలయునుగదా ! రామభట్టు వ్రాయలేదు. చంపూపద్ధతిలోనే వ్రాసెను తను వ్రాసిన ఆశ్వాసమును భద్రాద్రి రామున కంకితము చేసికొనెను

తిక్కన సోమయాజి మును తెల్గున నుత్తరకాండ జెప్పి యం
దొక్కటు చప్పడయ్యె* కడుయొద్దిక నే రచియింప వేడ్కచే
నిక్కము సంస్కృతంబు విని నెమ్మది భక్తిని నేరచించితిన్
చక్కని దేవళంబు తుదస్వర్ణ (నన్) ఘటంబిడు పోల్కి దోచగనూ(న్)

---

* దొక్కటి చెప్పడయ్యె

ఈ పద్యము మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము నందున్న (D. 3) వ్రాతప్రతినుండి యెత్తి వ్రాయబడినది.

తిక్కన్నగారి నిర్వచనోత్తరరామాయణము దేవాలయమనియు, దానికీ తాను వ్రాసిన ఈ ఏకాశ్వాసము శిఖరమునందలి స్వర్ణ ఘట ప్రాయ మనియు జయంతి రామభట్టు భావన. అనగా తను వ్రాసిన దానివలన తిక్కన్నగారి గ్రంథమున కందము వచ్చుచున్నదని రామభట్టూహించు చున్నాడు.

రామభట్టు వ్రాసిన కథ ఉత్తరకాండము నందలి చివరి పండ్రెండు సర్గలలోనిది. అనగా తిక్కన్నగారు మధ్యమధ్య వ్రాయక విడనాడిన ఉత్తరకాండమునందలి కథ విషయము రామభట్టు పట్టించుకొనలేదు. రామ భట్టు వ్రాసిన కథాభాగములోని అంశము లివి — (1) కౌసల్యాదులు స్వర్గమున కేగుట. (2) యుధాజిత్తు గార్గ్యుని శ్రీరామునివద్దకు పంపుట. (3) శ్రీరాముడు భరతుని గంధర్వుల గెలిచిరా పంపుట. (4) అంగద చంద్రకేతుల పట్టాభిషేకము. (5) యముడు తాపసవేషమున వచ్చి శ్రీరామునకు బ్రహ్మసందేశము నెరింగించుట. (5A) దూర్వాసుని ఆగమనము. (6) లక్ష్మణుని శ్రీరాముడు తన దేశమునుండి బహిష్కరించుట. లక్ష్మణుడు స్వర్గమును చేరుట. (7) లక్ష్మణుని వియోగమును భరింపలేక శ్రీరాముడు భరతునకు రాజ్య మప్పగించి తాను తపమునకు పోవనెంచుట (8) భరతుడు నాకు రాజ్యమక్కరలేదు నీవెంటనే వచ్చెదననుట. పౌరులుకూడ శ్రీరాముని వెంట వచ్చుటకు సిద్ధమగుట. (9) కుశలవులకు కోసలదేశాధిపత్యమును, ఉత్తర కురుభూముల యాధిపత్యమును క్రమముగా నొసగి శ్రీరాముడు పట్టాభిషేకము చేయుట (10) కుశలవులు తమతమ రాజధానులైన కుశావతి, చిత్రపురములకు పోవుట (11) శ్రీరాముడు శత్రుఘ్నుని వద్దకు దూతను పంపుట. (12) శత్రుఘ్నుడు తన కుమారులైన సుబాహు శత్రు ఘాతులకు క్రమముగా మధుర, విదిశాపురముల యాధిపత్య మొసగి శ్రీరామునివద్దకు వచ్చుట (13) శ్రీరాముని ప్రయాణము నెరిగి సర్వ వానరులు, రాక్షసులు మొదలైనవారు వచ్చుట. (14) శ్రీరాముడు సుగ్రీవుడు తనతో వచ్చుట కంగీకరించుట. (15) జాంబవంత మైంద ద్వివిధులను హనుమంతుని భూలోకముననే ఉండుడని శ్రీరాముడు చెప్పుట.

(16) విభీషణుని శ్రీరాముడు తనతో రావలదని లంక నేలుచుండుమనుట. (17) శ్రీరాముడు భరత శత్రుఘ్నులతోడను, వారివారి భార్యలతోడను, (లక్ష్మణుని భార్యకూడ) నగరమందలివారి తోడను కలిసి సరయువు వరకు గమించుట (18) అచటనుండి శ్రీరాముడు శ్రీమన్నారాయణుడై వైకుంఠమునకు పోవుట; మిగిలినవారందను మర్త్యతనువులు సరయూ నదిలో మునిగి విడిచినవారై దివ్యవిమానములమీద స్వర్గమున కేగుట.

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందలి వ్రాత ప్రతియందు దీయబడిన సంఖ్యను బట్టి రామభట్టు వ్రాసిన ఆశ్వాసమున 206 గద్య పద్యము లున్నవి. కాని మధ్యనున్న దీర్ఘములైన నొకటి రెండు వచనములకు కూడ ప్రతినాల్గు పంక్తులకు నొక సంఖ్య వేయబడి యున్నది.

భరతుడు గంధర్వుల నోడించుట మూలమున నొక పది శ్లోకములలో (101 సర్గ) చెప్పబడియున్నది. రామభట్టు ఆ యుద్ధమును దాదాపు 50 పద్యములలో విపులముగా వర్ణించెను. మిగిలిన కథా భాగమునంతయు మూలమున నున్నట్లుగనే రామభట్టు వ్రాసెను.

శ్రీమద్రఘుకుల జలనిధి
సోమా! పరమాత్మనామ సుగుణస్తోమా!
భీమావహ దైత్యకుల వి
రామా! భద్రాద్రిధామ! రాఘవరామా!

శ్రీరాముడు చెలువంబుగ
ధారుణి పాలింపుచుండి ధర్మాన్వితుడై
సారెకు మైథిలి దలపుచు
కారుణ్యము కలిమి చెలిమి గారవ మొప్పన్—

అని ఈ విధముగా రామభట్టు గ్రంథమును ప్రారంభించెను.

“ఇది శ్రీ మద్భద్రాద్రిధామ వరప్రసాద లబ్ధకవితా గార్గేయస గోత్ర పవిత్ర జయంతి కృష్ణభట్టారక సుభద్రాంబావరతనూజ రామభట్ట ప్రణీతంబైన శ్రీమద్రామాయణం బాదికావ్యంబునను నుత్తరకాండ తిక్కన్న సోమ

యాజి రచితంబై యున్న శేషంబునంగల్గు మీదటి కథయందుల శ్రీరాములు కుశలవులకు విద్యాభ్యాసంబును, అతిరాత్ర పౌండరీక వాజపేయంబులాగి గోశత క్రతువులు గావించుటయు, భరతతనూజులకు గంధర్వపురంబులు పట్టంబు గట్టుటయు, భరతుని విజయంబును, రాము సన్నిధికి తాపసవేష ధారుండై శమనుండేకాంతంబును, లక్ష్మణ వియోగంబును, రామచంద్రుండు మహాపథంబున కుపక్రమించుటయు, భరతాద్యయోధ్యావాసులైన వారి తోనె చనుటయు, లక్ష్మణుం డనంతుండై వైకుంఠ నగరంబునకుం జనుటయు, బ్రహ్మోపదేశంబున రాఘవేశ్వరుండు నారాయణాఖ్యుం డౌటయు, భరత శత్రుఘ్నులు శంఖచక్రంబులై కొలుచుటయు, పురజన ఋక్షవానర తిర్యక్సమూహంబుల పుణ్యలోక నివాసులం జేయుటయు, నారాయణాఖ్యం బ్రవర్తిల్లి పూర్వరీతిని వైకుంఠపుర ప్రవేశంబును నను సర్వము (౦) నేకాంగశాశ్వాసము".

ఇది జయంతి రామభట్టు వ్రాసికొనిన గద్య. గద్యములో వాక్యములు సరిగా లేవు కొన్ని ముందు వెనుకలై యున్నవి.

ఈ రామభట్టు కవిత్వము సర్వసాధారణమైనది. పద్యరచనయందు కూడ పేర్కొనదగిన విశేషము కనిపించుటలేదు. తా నీ యాశ్వాసము వ్రాసి తిక్కన్నగారి నిర్వచనోత్తరరామాయణమున కేమి యందము పూర్ణమగును యని రామభట్టు భావించినాడో, అట్టి యందమీ రచనయందేమియు కని పించుటలేదు. రెండు పద్యము లుదాహరింపబడుచున్నవి.

భూపతి నన్ను దా విపినభూముల కంపిననాడు వెంబడిన్
ప్రాపయి కందమూలఫలరాసులు దెచ్చియు మమ్ము దన్పి తా
కాపరియై వసించు చను గాచుకయుండను నిద్రలేక హా !
బాపురె ! నేడు లక్ష్మణుని బాయగ జేసితి మాయ దైవమా ! 131

లక్ష్మణుని దేశమునుండి బహిష్కరించి శ్రీరాముడు విలపించుటలోని పద్య మిది.

ప్రజలలో నొక్కఁడైనను
నిజముగ దీనుండులేడు నిర్మత్సరులై
సజనానందము బొందుచు
భజియింతురు రామవిభుని పదయుగ్మంబున్. 166

శ్రీరామునివెంట మహాప్రస్థానమునకు బయలుదేరుచున్న పౌరులను గూర్చి కవి వ్రాసిన పద్యమిది.

## 5 ప్రబంధరత్నావళినుండి "తిక్కన - విజయసేనము" లోని పద్యములు

అరిమానసమ్ములు దరిగొని యేర్చు నె
వ్వని యుజ్జ్వలాకార వైభవంబు?
బుధుల లజ్ఞానతిఁ బొందునట్లుగఁజేయు
నెవ్వని పాండిత్య మెసక మెసగ?
నెట్టి మాన్యుల*నైన నెవ్వని వితరణం
బులు వంది(జనుల) చాపలమొనర్చు?
వనితాజనము మానధనముఁ గోల్పుచ్చు వి
చ్చల విడి నెవ్వాని విలసనంబు?
అట్టి విజయసేను నభిరామమూర్తి వి
ద్యా నిరూఢమతి వదాన్యవరుడు
మధుర విభ్రమైక నిధియను జగమెల్ల
నతఁడు చిత్రగుణ సమగ్రుఁడగుట.

అల్లనఁ దొంశమెత్తి శివునౌదలయేటి జలంబువుచ్చి సం
ఫుల్లతఁ జాదపీరకము పొంతనయున్న సహస్రనేత్రుఁపైఁ
జల్లి శివార్చనాకమలసంహతిఁ బ్రోక్షణ సేయునట్లు శో
భిల్లు గజాననుండు మదభీప్సిత సిద్ధికరుండు గావుతన్.

*సేవదాన్యుల

ఉత్సాహప్రభు మంత్రశక్తుల నజేయుండై పరీక్షించినన్
దిత్సావ్యగ్రుఁడు గా విగ్రహముచే దేశంబుఁ గాలంబు సం
పత్సామగ్ర్యముఁ జూపి శక్యముదెసన్ బ్రారంభియై భూ ప్రజా
వాత్సల్యార్ద్రమనస్కుఁడైన (పతి) శశ్వచ్ఛ్రీ సమేతుండగున్.

కిసలయకదళీ బిసబిం
బసుధాంశు ప్రాయమస్తు బహువిధ రూపో
ల్లసము మదముడుప నజుఁ డొక
యసమాకృతిఁ దాల్చె ననగ నంగన యొప్పెన్.

కొనియెగమన్న బంగరులు కోటుల కమ్ముదు: రమ్మబూని తె
చ్చిన సరకెంత పెద్దవెలచెప్పినఁ గొందురు తగంగ నిచ్చి; న
చ్చిన వెలతీర్చి లక్ష్మి తమచెప్పిన యట్టులచేయు సొంపు పే
ర్కొన గణుతింపరాదు; పురి కోమటులం బ్రణుతింప నొప్పదే?

గీర్వాణాచలసానువాత్మరచన క్రీడాహతంబైన న
య్యుర్వీరంధ్రమునందనంత పణరత్నోద్యత్ప్రభల్వార్చి గ్ర
క్పూర్వంబై పోదిగట్టి పేర్చిన మదిం గంబంబయుంచున్ కన
ద్గర్వోన్మీలిత నేత్రుడై మెరయు వేదండాననుం గొల్చెదన్.

పరధన పరాంగనా జన
పరిహారము పరమధర్మపథ మందురు స
త్పురుషులు మరవక వీనిం
బరికింపుము వినకుమెపుడు పైశున్యంబుల్.

మదనవశీకారమంత్ర దేవతదృష్టి
గోచరమూర్తిఁ గైకొనియె నొక్కొ?
సితకరబింబ నిస్సృత సుధాధార ని
తంబినీ రూపంబుఁదాల్చె నొక్కొ?
విధికామినీ శ్రేష్ఠవిజ్ఞాన పరసీమ
భాసురతనులీల బడసె నొక్కొ?

శృంగారనవరస శ్రీ విలాసోన్నతి
సుందరాకారంబు నొందె నొక్కొ?
కాక యొక వధూటి కడుపునఁ బుట్టిన
భామకేల యిట్టి రామణీయ
కంబు గలుగు ననుచుఁ గన్నియపై మహీ
పాలసుతుడు దృష్టి పఱపెనర్థి.

మహిమ చెడదు స్వామ్యమాత్యసుహృత్కోశ
రాష్ట్ర దుర్గబల పరాయణులకు
నీవు నిదియు నెఱిగి కావింపు సప్తాంగ
సంగ్రహంబు నీతిశాస్త్రనిపుణ!

ఈ పద్యములను గ్రంథమునఁ జేర్చుకొనుడు. పుట 182-183

పద్మంబులును వప్రపద్మగాగ ప్రతి
బింబములును తగబెరసి మెఱయఁ
గల్లోలములును రంగన్మంటపాయిత
తుండములును నటు తొట్రుపడగ
బిసములు విహరణ రస సమాగీత రసాం
తల నాగశిశువులు చెలిమిచేయఁ
బకిృయుగ్మంబులు జలకేళిలోల ని
తంబనీ స్తనముల తడబడంగ
సొంపు మీరినట్టి పెంపును గంభీర
తయును బరపు (బోవు) వేడ్కఁదగిలి జనులు
సంస్తుతింప నఖల సన్నివేశ స్థితి
నప్పురంబు పరిఖ యతిశయిల్లు.

తరుణులపిఁగుఁజన్నుగవ తాకుస మన్మథ చక్రవాక బం
ధుర గతిలీల గామినుల తోరపుటూరుల ఘట్టనంబులన్
కరివరహస్తకాండ పటుఘట్టనలన్ బరిఖాతరంగముల్
దిరుగుడువడ్డతీరములఁ దెట్టువుగట్టు సరోజరేణవుల్.

6. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రబంధమణిభూషణమున గుర్తించిన "విజయసేనము" లోని పద్యములు

"అల్లన తుండమెత్తి........." ప్రబంధ రత్నావళి లోనిదే.

అమ్మెద ననినఁ బద్మాక్షు కౌస్తుభమైన
వెలవక కొనియెడు వెరవు గలిగి
వలువ ఇచ్చెదమని వేడినఁ బులిజున్నుఁ
గమ్మ పసిండియు నమ్మఁగలిగి
యే వస్తువెంత పొద్దెందఱుఁ జనుదెంచి
యెంతటి కడిగిన నెదురుఁ గలిగి
తమ యింటలేని యర్థము లర్థపతి యింట
నైన వెదకిన లేవగుట గలిగి
తమ కులాచారవర్తనము కొఱకు
నంగడుల యొప్పనకును బేహారుమాట
గాని లాభంబునకు నాట గాదనంగ
వఱలుదురు పురవరమున వైశ్యవరులు.

ఉన్నచో గతిమాలి యునికి యిష్టంబని
గ్రిమ్మర నేర్చిన కొండలనఁగ
గాలిచేఁ దూలెడు కష్టంబు వోవగ
ఘనమైన నీలమేఘము లనంగ
వినురూపమై యున్కి వెల్లతనంబని
కడునల్లనైన దిగ్గజములనఁగ
తిమిరారి యట యని ద్యుమణితో మార్కొని
నిలిచిన యిరుల మన్నీలనంగ
దానవారినాభి దఘ్నమై వీథుల
నేరులట్లు పొంగి పారుచుండ
బవనిఁ బోయివచ్చు పరిధానకేళీ జయ
సారణములు పురము వారణములు.

సుందరీ సమితికి మందయానంబుల
యిరువులఁ గడపెడు గురువులనఁగ
మధుకర బృందంబు మదజలక్షేపణఁ
జేసి యాకర్షించు సిద్ధులనఁగ
జనుల చూడ్కికిఁ గులశైల భావంబులు
చూపియాడెడు బహురూపులనఁగ
పరవీరభటుల నుద్ధుర భీషణాకృతి
భంగుల వెరపించు గొంగలనఁగ
గతుల యొప్పును దానాంబుగంధములును
నున్నతుల యొప్పుఁ జేష్టా సముద్ధతులును
నతిశయిల్లును బురిఁబోలు పారుఁ జిత్త
రంజనా కృతులగు భద్రకుంజరములు.

ఘనసార కస్తూరికా గంధముల సన్య
గంధబంధములఁ గలిపి కలిపి
కుసుమిత వల్లికాలసిత వీధులఁజొచ్చి
చని సరోరుహముల మునిగి మునిగి
సమధికాహార్యాంగ సంగీతములతోడ
కన్నెతీగల కాటగరపి కరపి
కుముద కుట్మల కుటీ కోరకంబులు దూటి
యలిదంపతులనిద్ర తెలిపి తెలిపి
యనుదినమ్ము నప్పురాంతికమ్మున గట్టి
వాలుఁ బోలె విప్రవరుడు బోలె
నట్టు నొజ్జవోలె నచ్చిన చెలివోలె
మలయుచుండు మందమారుతంబు.

"తిక్కన్న శిల్పంపుఁదెఁనుగుతోట"

—విశ్వనాథ-కల్పవృక్షము

# ప్రథమోన్మేషము

## 1. శ్రీ మహాభారత మితిహాసము

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికులు ఇతిహాసమనియు
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ

వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁజేసె భారతంబు ఆదిపర్వము 1-31

వ్యాసుడు చేసిన భారతము, ధర్మశాస్త్రముగాను, వేదాంతముగాను, నీతిశాస్త్రముగాను, మహాకావ్యముగాను, సర్వలక్ష్యసంగ్రహముగాను, ఇతిహాసముగాను, బహుపురాణసముచ్చయముగాను లోకమున కొనియాడబడుచున్నదని నన్నయ్యగారు వ్రాసిరి. ఇన్ని లక్షణములుమకలిగి భారతమున్నది ప్రధానముగా నది యేమగునని ప్రశ్న. భారతము రసభావముల సంస్పర్శ కలది యగుటవలన - మహాకావ్యము, ఇతిహాసము, పురాణ సముచ్చయము ఈ మూడును కావచ్చును. ధర్మశాస్త్రాదుల కట్టి రసభావస్పర్శ లేదుగనుక ప్రధానముగా భారతము ధర్మశాస్త్రముగాని, వేదాంతముగాని, నీతిశాస్త్ర

మునుగాని కాదు. కాని ఆ యా లక్షణములు మాత్ర మందున్నవి. ఆ యా లక్షణములతోడి మహాభారత మితిహాసమో, మహాకావ్యమో, పురాణ సముచ్చయమో కావలయును. భారతీయాలంకారికుల కావ్య స్వరూప స్వభావ నిర్ణయములయందు, ధర్మశాస్త్ర, వేదాంతాదులు లక్షణములుగా చెప్పబడ లేదు. ఒక కథ, ఒక రసము. అది యాచితీజ్ఞానపర్యాప్తముగా నిర్వహింప బడుట - ఈ లక్షణమునే అలంకారికులు కావ్యమునకు చెప్పుచున్నారుగాని, వేదాంతము మొదలైన వాటితో కావ్య ముండవలయునని చెప్పుటలేదు. కనుక మహాభారతము ప్రధానముగా మహాకావ్యము కాదు.

ఇక పురాణసముచ్చయము - సామాన్యముగా పురాణము పంచలక్షణి. విశేషముగా దశలక్షణి. సర్గము-సృష్టి, ప్రతిసర్గము-మరీచ్యాది నవబ్రహ్మల చేత చేయబడిన సృష్టి, వంశము-సూర్యచంద్ర వంశముల యుత్పత్తి; మన్వంతరము-స్వాయంభువు మున్నగు మనువుల కాలమునందుగల ధర్మపద్ధతి, వంశానుచరితము - పూర్వవంశస్థుల సుప్రసిద్ధములగు చరిత్రముల సముదాయము- ఇట్టి పంచలక్షణములతో నున్నది పురాణ మనబడును ఈ పంచలక్షణములును నొక విధముగా భారతమునందున్నను, వీటిని మించిన మరియొక లక్షణము భారతమున కున్నది. కురుపాండవులకథ మొదటినుండి చివరిదాక వ్యాపించి యున్నది. ఆ కథయే ప్రధానము అట్టి యొక కథా ప్రాధాన్యము పురాణములయందు లక్షణముగా లేదుగనుక భారతము పురాణముగాదు. ఇక మిగిలినది ఇతిహాసము. భారత మితిహాసము కావలయును. నన్నయ్యగారా పద్యమున భారతమును గురించి చెప్పిన లక్షణముల నన్నింటిని యిముడ్చుకొనినదిగా ఇతిహాస మున్నప్పుడే భారత మితిహాసము కాగలదు. ఇతిహాస స్వరూప స్వభావములనుగూర్చి వ్రాసినప్పు డా విషయము స్పష్టము కాగలదు

తిక్కన్నగారును భారతము మహనీయేతిహాస మనియు, వినుతేతిహాస మనియు, ఇతిహాసరత్న మనియు, నిర్మలేతిహాసమనియు[2] పేర్కొనిరి. ఎఱ్ఱన్నయు "ఇమ్మహితేతిహాస"[3]మని భారతమునుగూర్చి శౌనకాదులు చెప్పి

1. "In ithihasas there is a special emphasis on the four Purusharthas and an expansion of a special heroic historic theme"- A Mahabharata Primer - P 7.

2. స్వర్గారోహణ - 1-75. 79, 85, 88.

3 హరివంశము - పూర్వభాగము - 1 47.

నట్లుగా వ్రాసెను. భారతము వ్రాసిన ముగ్గురును దానిని ఇతిహాసముగా పేర్కొనిరి. సంహిత, ఆఖ్యానము మొదలైన మరికొన్ని పేర్లతో వారు భారతమును చెప్పినప్పటికిని, ఇతిహాస మనినారని ప్రత్యేకముగా చూపింప బడుట యేలనగా భారతము ప్రధానముగా నితిహాసమగుటవలన అందు మిగిలిన యన్ని శబ్దముల యర్థమును లీనమగును. భారత మితిహాసమనుట కవిత్రయము వారి కిష్టము.

## 2. ఇతిహాస స్వరూప వివేచనము

మహాభారత మితిహాసము ఇతిహాసమన్న దొక కావ్యప్రభేదము.[1] పర్యాయ బంధము, కులకము, సర్గ బంధము – అన్న వెట్లు కావ్యభేదములో[2] అట్లే ఇతిహాసమును ఆనందవర్ధను డా కావ్యభేదములను చెప్పుచో నితిహాసమును చెప్పకపోయినను, ఆయన భారతమునుగూర్చి చెప్పిన వాక్య మితిహాస లక్షణ లక్షితమైనదే. భారతము "శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయిని" అని ఆనంద వర్ధనుడు చెప్పెను భారతమున నంగిరసము శాంతమను విషయమును ప్రపంచించు సందర్భమున నామాట చెప్పెను. ప్రస్తుత మది యట్లుంచి మొదట నింకొక విషయము విచారింపబడును. "మోక్ష లక్షణ ఏవైకః పరః పురుషార్థః శాస్త్రనయే, కావ్యనయే చ తృష్ణాక్షయ సుఖపరిపోష లక్షణః శాంతోరసః మహాభారతస్య అంగిత్వేన వివక్షిత ఇతి సుప్రతిపాదితం"[3] – భారత మున శాస్త్రము ప్రవర్తించినది. అది పరమపురుషార్థమైన మోక్షమును ప్రతి పాదించినది. భారతమున కావ్యమున్నది కావ్యము కథ నాశ్రయించుకొని యుండును కథ నాయకపురుషుని చరిత్రగా నుండును. ఆ కావ్యము తృష్ణా క్షయ సుఖ పరిపోష లక్షణమును చూపినది. అనగా భారత కథానాయకుడైన ధర్మరాజుయొక్క తృష్ణాక్షయ సుఖమును పరిపోషించినదని యర్థము తృష్ణా క్షయమనగా శమము శమ, శాంత, మోక్ష శబ్దము లొక యర్థమునే భిన్న

---

1. అప్పకవి, కవితయే కావ్య - ఇతిహాస భేదముచేత ద్వివిధమని చెప్పెను. మరియు ఇతిహాసము పురాతనవృత్తముచే నగుచున్నదని భారత మట్టిదే యనెను. అప్పకవీయము – 4 – 20.

2. ధ్వనిసారః – పుట 26.

3 ధ్వనిసారః – పుట 64.

ముఖముల చెప్పును అనగా భారతమునందలి శాస్త్రము ఏ మోక్షమును ప్రతిపాదించుచున్నదో, అందలి కథయు నందే పర్యవసించుచున్నదని యర్థము. కనుకనే భారతమున నంగిరసము శాంతమైనది ఈ మొత్తముయొక్క తాత్పర్యము ఇది. భారతమున పరమ పురుషార్థమైన మోక్షమును ప్రతిపాదించు శాస్త్రగ్రంథమున్నది, మరియు నేతచ్ఛాస్త్రమున కభిముఖమై సాగిన కావ్యగ్రంథ మున్నది అందువలన నా రెండును నొక పరమార్థము లక్ష్యముగా గలిగియున్నవి.

ఇంతకుముందు పేర్కొనబడిన శాస్త్రకావ్యములయొక్క అన్వయమే "శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయిని" అన్న వాక్యమునందు చెప్పబడినది అనగా శాస్త్రరూపముతోను నున్న గ్రంథము, కావ్యచ్ఛాయతోనున్న గ్రంథము సంబంధింపబడి మహాభారత మైనదని యర్థము అన్యోన్యస్య ముత్కర్షాపాదకములుగను, ఆధారాధేయములుగను చేయబడినదని యర్థము భారతమున ప్రవర్తించిన శాస్త్రము ధర్మరాజు చిత్తమును మోక్షాభిముఖముచేసినది అఖిలజ్ఞాతివధవలని నిర్వేదముతోడి ధర్మజుని చిత్తము, ఏతచ్ఛాస్త్రము ప్రవర్తించుట కాలంబనమై అవకాశము కల్పించినది. ఆ శాస్త్రము ప్రవర్తించుట వలని ఫలము ధర్మజునియందు ప్రకాశమునకు వచ్చినది శాస్త్రముయొక్క రూపము, కావ్యముయొక్క ఛాయ - ఈ రెండును భారతమున పరస్పరము సంబంధింపబడినవి/ కనుకనే ఆనందవర్ధనులు శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయిని అని భారతమునుగురించి చెప్పినది. శాస్త్రలక్షణ, కావ్యలక్షణము లట్లన్యోన్య మనుసంధింపబడి యుండుటయే ఇతిహాసము లక్షణము. అందువలన 'భారత మితిహాస మగుచున్నది

సరస్వతీ కంఠాభరణమున[1] భోజుడు కావ్య ప్రభేదము లారని చెప్పెను. అసలాయన బుద్ధికి తోచిన అచ్చమైన కావ్యభేదములు మూడు మాత్రమే 1. కావ్యము, 2. శాస్త్రము, 3. ఇతిహాసము ఈ పేర్కొనబడిన మూడింటి లోను, ఒక్కొక్కదానిలోని కొన్ని లక్షణములు మరొకదాని కొన్నింటి లక్షణములతో కలియుటవలన, అట్టి మిశ్రమలక్షణములతో మరి మూడు భేదము లేర్పడుచున్నవి. అవి యివి. 1 కావ్యశాస్త్రము, 2 కావ్యేతిహాసము,

1. కావ్యం శాస్త్రేతిహాసౌ చ, కావ్య శాస్త్రం తథైవచ
కావ్యేతిహాసం శాస్త్రేతి, హాస స్తదపి షడ్విధమ్. 2- కారిక 139.

3. శాస్త్రేతిహాసము. అపుడు మొత్త మూరు ప్రభేదము లగుచున్నవి. భోజు డట్లు పేర్కొనెను ఆయన ఇతిహాసమును కావ్యప్రభేదముగా పేర్కొనుటయు మరియు నది ద్విధాభూతమనుటయు మనకు కావలయును. ఇతిహాసమును ఆత డిట్లు నిర్వచించెను. "అతీతార్థ ప్రాధాన్యాత్ ఇతిహాసః"[1] ఇది కేవలము నిర్వచ నము కాదుగాని, ఆయన ఇతిహాసస్వరూపమును భావించిన తీరు. గతించిన విషయము ప్రధానముగాగలిగి ఇతిహాస ముండునని భోజుడభిప్రాయపడు చున్నాడు. అతీతమనగా చారిత్రక మైనదని యర్థ మూహింపవచ్చును.

రాజశేఖరుడు కావ్య మీమాంసయం దిట్లు వ్రాసెను "పరక్రియా పురా కల్ప ఇతిహాస గతిర్ద్విధా స్యాదేక నాయకా పూర్వా ద్వితీయా బహు నాయకా, తత్ర రామాయణం భారతం చోదాహరణే"[2] – ఇతిహాసములు రెండు విధములు రామాయణ మహాభారతములే అందుల కుదాహరణములు. రాజశేఖరుడు కావ్యప్రభేదముగా నితిహాసము నంగీకరించుచున్నాడు మరియు రామాయణభారతములు రెండును రెండు రకములైన ఇతిహాసము లను చున్నాడు

"దేవాసురా స్సంయిత్తా ఆసన్ – ఇత్యాదయః ఇతిహాసాః"[3] అని విద్యా రణ్యులు వ్రాసిరి. దేవాసురసంబంధి ఇతివృత్త మెచట నిబంధింపబడి యుండునో అది ఇతిహాస మనిరి మరియు ఇతిహాసః పురావృత్తమ్–అని అమర సింహుడు. ఇతిహ పారంపర్యోపదేశః ఆస్తే అస్మిన్నితీతిహాసః ఆస ఉపవేశనే – పారంపర్యోపదేశము దేనియందు గలదో అది ఇతిహాసము పురావృత్త మనగా పూర్వచరిత్ర నిబంధన ప్రాయమైనది.

నాట్యశాస్త్రమును వ్యాఖ్యానించుచు నభినవగుప్తుడు కర్మఫల సంబం ధము కల సర్వార్థములును రెండు ప్రత్యక్షముగా చూపబడునో అది ఇతిహాస మని చెప్పెను.

ఇంతవరకు చూపబడిన ఇతిహాసశబ్దార్థముల తాత్పర్య మిట్లు నిష్క ర్షింప వచ్చును. ఇతిహాసమున ప్రధాన కథ చారిత్రక సత్యమైనదిగా నుండ

1. సరస్వతీకంఠాభరణము. 2 – పుట 305.
2. కా. మీ - పుట 3.
3. కావ్యాలంకార సంగ్రహము – పుట 235.

వలయును. మరియు నందు కొంత శాస్త్రము ప్రవర్తించవలయును. ఆ కథకు దేవాసుర సంబంధ ముండవలయును. పారంపర్యోపదేశ క్రమము కలిగియుండ వలయును. ఆ కథా పురుషులయొక్క కర్మఫలానుభవము సర్వము ప్రత్యక్షముగా చూపబడవలయును కర్మఫలానుభవ మిహపరభేదముచేత ద్విధాభూతము గనుక, నితిహాసమున నట్లే పరలోకానుభవమును చూపబడవలయును! భారతము నందలి కథ కౌరవుల పాండవులది. వారు యుద్ధము చేసికొనిరి.

క్రీస్తుకు పూర్వము 1400 సంవత్సరముల క్రిత మా యుద్ధము జరిగి యుండునని చారిత్రకు లభిప్రాయపడుచున్నారు.[1] ఇది ఆంగ్లేయుల లెక్క. మనవారి లెక్క ప్రకార మింకను చాలకాలము ముందుగా భారతయుద్ధము జరిగినది[2] ఎప్పుడు జరిగినను నది చారిత్రకసత్యమే యగుచున్నది. అందువలన భారతము చారిత్రకసత్యమైన కథతో నితిహాస మగుచున్నది. శాంత్యనుశాసనపర్వములయందును మరియు నక్కడక్కడ శాస్త్రము భారతమున లెస్సగా ప్రవర్తించినది భారతమున ప్రధానపాత్ర నిర్వహించిన ధర్మరాజాదులు, దేవతల యంశమున బుట్టినవారు. దుర్యోధనాదులు కలి యొక్కయు, మరికొందరు రాక్షసుల నంశలతో పుట్టినారు. దైవశక్తి మూర్తీభవించిన శ్రీకృష్ణుడు భారతముతో నెడతెగని సంబంధము కలిగియున్నాడు. మరియు భారత యుద్ధమున నొకరిద్దరు రాక్షసులు పాల్గొనిరి ఆ యుద్ధమును దేవతలు సందర్శించినట్లు చెప్పబడియున్నది. కనుక నితిహాసలక్షణమైన దేవాసుర సంబంధము భారతేతిహాసమునకున్నది. భీష్ముడు ధర్మరాజున కుపదేశించిన గ్రంథ మంతయు సంవాదరూపమున పరంపరగా వచ్చుచున్నట్లే చెప్పబడినది.

1. Studies in Epics and Puranas. P 79.

2. మనవారి లెక్క ప్రకారము కలియుగము మొదలైనది క్రీ.శ. 3101 సంవత్సరమున. భారతయుద్ధము ద్వాపరాంతమున గనుక, నప్పటి కింకను కొద్ది కాలము ముందుగనే యుద్ధము జరగియుండవలయును. క్రీ. శ. 634-35 సంవత్సరమున అయ్యావళిపురమున చెక్కింపబడిన నొక శిలాశాసనమున అప్పటికి భారతయుద్ధము జరిగి 3735 సంవత్సరము లైనదని యున్నది. వరాహమిహిరుడు యుధిష్ఠిరుని రాజ్యకాలము 2526 శకసంవత్సరములకు పూర్వమని బృహత్సంహితలో వ్రాసి నాడు. చూడు : శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి ప్రసంగము-మహాభారతము - చారిత్రకత వాణి. 22-5-1959. మరియు చూడు : A Mahabharata Primer Pp. 9-29

ప్రధానకథాపురుషులైన వారి పరలోకానుభవము స్వర్గారోహణపర్వమున వర్ణించబడినది. ఈ విధముగా నితిహాసశబ్దమునకు చెప్పబడిన యర్థములన్నియు భారతముతో నన్వయించుచున్నందున భారత మితిహాసము,

మన భారతీయాలంకారికులు స్పృశించని ఇతిహాస లక్షణము మరియొకటి భారతముననున్నది అది యుద్ధము. పాశ్చాత్యులు ఇతిహాసలక్షణములలో యుద్ధమును ప్రధానముగా పేర్కొనినారు[1] ప్రాచీనులైన కావ్యభేదములలో నితిహాస మొకటిగా యూరోపియనులచేత గుర్తింపబడినది. మరియు నరిస్టాటిలునుండి ఇతిహాస కావ్య ప్రక్రియనుగూర్చి మీమాంస జరుగుచునే యున్నది. ఇతిహాసమున, ప్రధానముగా నొక సుదీర్ఘమైన కథ ధీరోదాత్త ధీరోద్ధత ప్రకృతులైన పురుషుల వీరకృత్యములతో ననుసంధింపబడి యుండవలయును. కడు దీర్ఘమైన కథ యుండుట మూలముగా నేర్పడు విసుగుదల తొలగుట కన్యములైన బహు లఘుకథలు మధ్య మధ్య ప్రధాన కథా సంబంధులుగా చెప్పబడవలయును. ఇతిహాసకథాపురుషులును, వారి కృత్యములను, దైవ శక్తి పరిపాలించుచున్న ట్లనివార్యముగా నిరూపింపబడవలయును అనగా నితిహాసములయందు దైవశక్తి కొంతవరకు ప్రత్యక్షముగా ప్రాధాన్యము వహించియుండును. ఈ యుండుట యేలనగా, నితిహాసము మానవుని యౌన్నత్యమును నిరూపించుటకును, కర్తవ్య మిట్లని బోధించుటకును విధ్యేతరములైన సర్వశక్తులును సాధ్యములని ప్రత్యక్షముగా చూపుటకును నిర్మింపబడినది. మానవుని సర్వప్రయోజనతయును విధికి లోబడియుండవలసినదేగాని, తద్వ్యతిరేకముగా నేమియు సాధించలేదని ఇతిహాసము నిరూపించును. దైవశక్తితో నితిహాసమునకు సంబంధమున్నందున, ఆ దైవము నేయే జాతు లేయే విధముగా భావించునో, ఆ యా విధము లా యా జాతుల ఇతిహాసములయందుండును. దైవమునను సరించి తాత్త్వికచింతనము. ఆ యా తాత్త్వికదృక్పథములును నితిహాసములయందుండును. అమానుషమైన శక్తియుక్తుల మధ్య మధ్య ప్రదర్శింప

1 An Epic Poem is by common consent a narrative of some length, and deals with events which have a certain grandeur and importance and come from a life of action, especially of violent action, such as war – It gives a special pleasure because its events and persons enhance our belief in the worth of human achievement and in the dignity and nobility of man. Sir C M Bowra "From Virgil To Milton".

బడుచుండును.[1] ప్రపంచమునందలి అన్ని భాషలలోని ఇతిహాసములును, ఒక సుదీర్ఘమైన కథ, యుద్ధము, ఉపాఖ్యానములు, ఆయా దేశముల మత తాత్త్విక దృక్పథములు, ఇవన్నియు పడుగు పేకలవలె కూర్చబడి నిబిడబంధము కలిగి యున్నవి. శ్రీ మహాభారత మట్టి స్థితిలోనే ఉన్నది అందువలన అది ఇతిహాస మని నిశ్చయముగా చెప్పవచ్చును. అపుడు ఇతిహాస మొకకావ్య ప్రభేదమగును.

## 3. ఇతిహాస భేదములు

రాజశేఖరుడు పరిక్రియా పురాకల్పము లను రెండితిహాసభేదములను పేర్కొనినట్లును, భోజుడు కావ్యేతిహాసము - శాస్త్రేతిహాసము లను రెండు భేదములను ఇతిహాసమువిషయమున నంగీకరించినట్లును చెప్పబడినది. ఆ యిరువుర విభజనమును రామాయణమహాభారతములను దృష్టిలో పెట్టుకొని యున్నచో రామాయణము కావ్యేతిహాసము మరియు పరిక్రియేతిహాసము కావలయును. భారతము శాస్త్రేతి హాసమును, పురాకల్పేతిహాసమును కావల యును కాని రాజశేఖరునివలె, భోజుడు స్పష్టముగా రామాయణేతి హాసమును, భారతేతి హాసమును తన విభజించిన దాని కుదాహరణముగా చెప్పలేదు. అందు వలన కావ్య, శాస్త్ర, ఇతిహాసములు రామాయణమహాభారతములకు సంబంధించినవే అని చెప్పుటకు వీలులేదు రామాయణ మహాభారతములు తప్ప మరి ఇతిహాసములు లేవు భోజుడు, ఇతిహాసము రెండు రకములనుటను బట్టియు రెండితిహాసము లుండుటను బట్టియు, రాజశేఖరు డా రెండింటిని రెండు రకములైన ఇతిహాసములని చెప్పుటను బట్టియు, భోజుడు చెప్పిన ఇతిహాస భేదము, రామాయణ మహాభారతములనే దృష్టిలో పెట్టుకొన్నది కాక తప్పదు. కాని కావ్యేతిహాసమునుగూర్చి భోజుడు మాటాడిన వైఖరినిబట్టి చూడగా నాయన దృష్టిలో రామాయణమున్నదనుట వీలుకాకున్నది. కావ్యేతి హాసో యథా, అని శిశుపాలవధకావ్యమునందలి "నసంచరిష్ణు ర్భువనాంతరేషు" అను శ్లోకము నుదాహరించి "అత్ర ప్రాగుక్తస్యైవ ఇతిహాసార్థస్య కావ్యే నాభిధానాత్ కావ్యేతిహాసోయం"[2] అని వ్రాసెను. ప్రాగుక్తమనగా అతీతార్థ

1 A Background to the study of English Literature - Pp. 28-36. And also see - A Mahabharata Primer - Chapter - IV,

2. సరస్వతీ కంఠాభరణము - పరిచ్ఛేదము 2. పుట 305.

ప్రాధాన్యాత్ అన్నది. అతీతార్థమైన శిశుపాలవధగ్రంథమున ప్రధానముగా నున్నందున నది ఇతిహాసము కావ్యాభిదానమువలన దానికి కావ్యేతిహాసమని పేరు వచ్చినది ఇది కావ్యేతిహాసమును భోజుడు వివరించిన తీరు. ఇతిహాస గతమైన నొక కథను గ్రహించి దానిని వర్ణనాదులతో పుష్టమై రసవంత మగు నట్లుగా చేసినచో నది కావ్యేతిహాసమగునని భోజుని తాత్పర్యముగా కనిపించు చున్నది ఇదియే భోజుని యర్థమైనచో దేశముననున్న కావ్యము లన్నియు కావ్యేతిహాసములు కావలసివచ్చును

ఇతిహాసములైన రామాయణ మహాభారతములనుండి గ్రహింపబడిన కథలతోడనేగదా సాధారణముగా కావ్యములన్నియు నున్నవి ? సంస్కృతమున పంచకావ్యము లన్నియు భారతమునుండి కథలను గ్రహించినవే అప్పు డన్నియు కావ్యేతిహాసములే కావలయును అయినచో కావ్యమునకును, కావ్యేతిహాసమునకును భేదముండదు. భేదము లేనప్పుడు కావ్యేతిహాస మను మరొక పేరేల సృష్టింపబడవలయునో అర్థమగుటలేదు. మొత్తముమీద భోజుడు కావ్యేతిహాసమును వివరించిన పద్ధతి తృప్తికరముగా లేదు

భోజుని విషయి మటుంచినచో రాజశేఖరుడు స్పష్టముగా రామాయణ మహాభారతముల నుద్దేశించియే సిద్ధాంతముచేసెను. కాని ఈయన చేసిన దానియం దొకరకము చిక్కుగలదు. రామాయణ మేకనాయకమనియు, భారతము బహునాయకమనియు చెప్పెను. బహునాయకముగా కావ్య ముండదు. కనుక కావ్యభేదమైన ఇతిహాసమును బహునాయకముగా నుండదు. కాని రాజశేఖరుడు స్పష్టముగా చెప్పినాడు. రాజశేఖరుని అంతర్యమిట్లూ హింప నగుచున్నది. రామాయణమునందువలె కథాగతి, ప్రధానమైన అనగా నాయకభూతుడైన యే యొకనినో అంటిపెట్టుకొని యున్నట్లు భారతమున కనిపించదు. భీమార్జునాదులతోడను, భీష్మ ద్రోణ కర్ణాదులతోడను కథ సాగు చున్నట్లుగా కనిపించును రామాయణమున లక్ష్మణాదులతో కథ సాగు చున్నట్లు కనిపించదు భీమార్జునులు ప్రతిజ్ఞలుచేసి, వాటిని సాధించుటయందు బద్ధబుద్ధులై ప్రవర్తించుటవలన, ఆయా పరిధులలో వారే నాయకులా యేమి ? అని అనిపించుటకు వీలున్నది కర్ణ, ద్రోణ, అశ్వత్థామలు కొన్ని వేళలయందు దుర్యోధనుని వెనుకకునెట్టి విజృంభించుటచేత వారివారి ప్రాధాన్యము కొట్ట వచ్చినట్లు కనిపించుచున్నది. అందువలన భారతము బహునాయకమన్న

భ్రాంతిని కలిగించుచున్నది. అట్టి భ్రాంతిని పుట్టించు ఇతిహాసము పురాకల్పమని రాజశేఖరుడు పేర్కొనియుండునని యూహింపవలయును. లేనిచో నిజముగా భారతము బహునాయకమని యంగీకరింపవలయును బహునాయకముగా కావ్యప్రక్రియ కనిపించుటలేదు. భారతమును ధర్మరాజొక్కడే నాయకుడుగా నిర్వహింపబడియున్నది. అందువలన బహునాయకమన్న భ్రాంతిని పుట్టించుటయే లక్షణముగా మన మా రాజశేఖరుని శ్లోకమున కర్థము చేయవలయును.

ఈ విషయమున నింకను నిట్లు విచారింపవలయును రామాయణము వ్యక్తి ప్రాధాన్యము కలది "కోన్వస్మి న్సాంప్రతం లోకే గుణవాన్ కశ్చవీర్యవాన్, ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః......ఏతదిచ్ఛా మ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే, మహర్షేత్వం సమర్థోసి జ్ఞాతుమేవం విధం నరమ్"[1] – ఇది రామాయణ ప్రారంభము ఆ యా లక్షణలక్షితుడైన వ్యక్తి యెవరని వాల్మీకి నారదుని యడిగినాడు నారదుడు శ్రీరామచంద్రు డట్టివాడని చెప్పినాడు. ఆ శ్రీరాముని చరిత్రయే రామాయణము. అనగా శ్రీరాముని సర్వ ఉదాత్తలక్షణములను నిరూపించు నుద్దేశముతోనైనది రామాయణము భారతము విషయము వేరు. జనమేజయుడు వ్యాసుని ఇట్లు కోరినాడు. ''కురూణాం పాండవానాంచ భవాన్ ప్రత్యక్ష దర్శివాన్, తేషాం చరిత మిచ్ఛామి కథ్యమానం త్వయాద్విజ కథం సమభవ ద్భేద స్తేషా మక్లిష్ట కర్మణాం, తచ్చయుద్ధం కథంవృత్తం భూతాంతక రణం మహత్."[2] కౌరవుల యొక్కయు, పాండవుల యొక్కయు చరిత్రనడిగినాడు జనమేజయుడు. కౌరవపాండవులు నూటైదుగురు అందులో ఎవరు ప్రధానము ? ఎవరును కాదు. అందరు నొకటియే. వారందరకు చరిత్ర సృష్టింపబడినది. యుద్ధము వలన, యుద్ధమునకు మూలము వారిలో వారికి వచ్చిన భేదము. అందువలననే "జనమేజయుడు తేషాం చరిత మిచ్ఛామి"యని వెంటనే "కథం సమభవత్ భేదః తేషాం – తచ్చయుద్ధం కథం" అనినాడు. అనగా కౌరవపాండవులలో నెవరికి ప్రాధాన్యము వచ్చినను ఆ భేదము పుట్టుటకు కావలసిన క్రియాపరత్వమున రావలయును ఆ యుద్ధమట్లగుటకు తగిన ఉద్యమక్రియాపరత్వమున రావల

1. శ్రీమద్రామాయణమ్ – సర్గ 1. శ్లో 2-5.
2. శ్రీమహాభారతే, ఆదిపర్వణి – అధ్యా 59. శ్లో 18, 19.

యును. మొదటిదాని విషయమున దుర్యోధనుడు ప్రధానమైనాడు. రెండవదాని విషయమున ధర్మరాజు ప్రధానుడైనాడు. వారు ప్రధానులైనారనుట వలన వారి వెనుక వారివంటి వారు మరికొందరున్నారనినట్లయినది. దుర్యోధనుని వెనుక శకుని, కర్ణుడు మొదలైనవారుండి కౌరవ పాండవ భేదము పుట్టుటకు కారకులైనారు. యుధిష్ఠిరుని వెనుక శ్రీకృష్ణుడు, ద్రౌపది, అర్జునుడు మొదలైనవారుండి యుద్ధమునకు సన్నాహము చేసినారు. రామాయణమున శ్రీరాముని వెనుక మరి యట్టివా డింకొకడులేడు. శ్రీరాముడు స్వయంసంపూర్ణుడు లక్ష్మణాదులు లేకపోయినను శ్రీరాముడు శ్రీరాముడుగా నుండగలడు కర్ణశకునులు మొదలైనవారు లేనిచో దుర్యోధనుడుగాని, కృష్ణార్జునులు లేనిచో ధర్మరాజుగాని ఇప్పుడున్నట్లుగా నుండియుండెడివారు కారు. శ్రీరాముని మహోదాత్తతను స్థాపించుటకు శ్రీమద్రామాయణము ప్రవర్తించినది. కౌరవ పాండవుల ప్రవృత్తిని నిరూపించి స్థాపించుటకు భారతము ప్రవర్తించినది

అందువలన రామాయణము వ్యక్తి ప్రాధాన్యము కలదిగాను, భారతము క్రియాప్రాధాన్యము కలదిగాను కనిపించుచున్నది. వ్యక్తిప్రాధాన్యము కలిగిన గ్రంథమున వ్యక్తి ప్రకాశమునకు వచ్చినట్లుగా క్రియాప్రాధాన్యము కలిగిన నొకవ్యక్తి ప్రకాశమునకు రాడు. క్రియబహుజనముల నాశ్రయించి బహుముఖములనుండును భారతము నందిట్లేయున్నది అందువలన నది బహునాయకమున్న భ్రాంతిని పుట్టించుచున్నది. రామాయణమునందట్టి భ్రాంతికాస్కారములేదు. కనుకనదియే నాయకముగా స్పష్టముగా కనిపించుచున్నది. ఈ విధముగా రాజశేఖరుని తాత్పర్యము నర్థముచేసికొనినగాని సమన్వయము కుదురుటలేదు.

ఇప్పుడు మరియొక విధముగా శంక కలుగుచున్నది రామాయణము పరిక్రియేతిహాసమని క్రియాశబ్దమును రామాయణమునందే రాజశేఖరుడుపయోగించినాడుగాని, భారతమును గూర్చి ఉపయోగించలేదు కనుక క్రియాప్రాధాన్యము రామాయణమునకే కలదా యనిపించుట కవకాశమున్నది. మొత్తముమీద పరిక్రియా, పురాకల్ప శబ్దముల కర్థము సక్రమముగా తెలియవచ్చుటలేదు. ముఖ్యముగా పరిక్రియవిషయము తెలియవచ్చుటలేదు. పరిక్రియకు పరక్రియ, వరక్రియ అని పాఠాంతరములు కనిపించుచున్నవి. శ్రీవార

కాశీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పరక్రియా పాఠముతో నా శ్లోకమునుదాహరించిరి.[1] అన్ని కావ్యమీమాంసా గ్రంథ వ్రాతప్రతులయందును పరక్రియ అనియేయున్నను పరక్రియ అనునది సముచితమైన పాఠమని కొందరభిప్రాయపడుచున్నారు.[2]

ఇతిహాసమును రాజశేఖరుడు ఉపవేదములలో కలిపి చెప్పెను. చతుర్విధమైన అర్థవాదమునందలి చివరిరెండును ఇతిహాసముగా గణింపబడుచున్నవనియు చెప్పుచున్నారు.[3] "స్తుతిర్నిందా పరకృతి పురాకల్ప ఇత్యర్థవాదః"[4] అని గౌతముడు చెప్పెను. ఒకని నొక కర్మయందు ప్రవర్తింపజేయుటకుగాని, లేక నొకని నొకకర్మనుండి మరలించుటకుగాని ప్రవర్తించు విధినిషేధరూపములైన వాక్యముల యర్థము స్తుతింపబడుట నిందింపబడుట మొదలైనదంతయు నర్థవాదమనబడును. పరకృతి, పురాకల్ప అను రెండును నితిహాసములైనచో కథారూపమున నున్న అర్థవాదములు కావలయును.

కాని న్యాయదర్శనమున, ఇతరునిచే చేయబడిన వ్యాహతవిధివచనము పరకృతి అని చెప్పబడియున్నది[5] అందుకీయబడిన ఉదాహరణమునుబట్టి చూడగా, పరస్పరము విరుద్ధముగానున్న విధివాక్యములన్నది పరకృతి యని యర్థమగుచున్నది పరకృతి ఇతిహాసమైనచో, రాజశేఖరుడు చెప్పినట్టిది రామాయణమే అగుచున్నచో, అందు పరస్పరము విరుద్ధముగానున్న విధివాక్యముల యర్థమేమున్నదో స్పష్టముగా తెలియనచ్చుటలేదు పైగా న్యాయదర్శనమున ఇతిహాసముద్వారా అనగా పురాతన కథద్వారా చెప్పబడిన విధినిషేధ వాక్యములయర్థము పురాకల్పమని చెప్పబడినది.[6] పరకృతి కిట్లితిహాసముతో సంబంధము న్యాయదర్శనమున చెప్పబడలేదు. భారతమునందు విధినిషేధవాక్యముల యర్థము బహుకథలద్వారా చెప్పబడుటయున్నది గనుక, భారతము పురాకల్ప

---

1. మహాభారత తత్త్వకథనము- ప్ర. భా. పుట 63.

2. Kavya Mimasa. Edited by the late Mr. C. D. Dalal and pandit R. A Sastry. P 134.

3. See the same page 134.

4. న్యాయదర్శనము- 2-1-64.

5. న్యాయదర్శనము - 2-1-64.

6. న్యాయదర్శనము- 2-1-64.

మనబడుట కభ్యంతరములేదు. రామాయణము విషయమే స్పష్టమగుటలేదు. ఈ విషయమింకను పర్యాలోచన చేయదగినది. భోజుడు శాస్త్రేతిహాసమును నిర్వచించినది స్పష్టముగానున్నది మరియు నది భారతమున కన్వయించుచున్నది శాస్త్రేతిహాసో యథాయని "ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ -" అను శ్లోకము నుదాహరించి "అత్ర ధర్మార్థకామమోక్షాణాం ఇతిహాస నివేశిత త్వా దయం శాస్త్రేతిహాసః"అని వివరించెను.[1] ఇతిహాసమునందు ధర్మార్థ కామమోక్షరూప చతుర్విధపురుషార్థములను నివేశింపజేసినచో అది శాస్త్రేతిహాసమగునని తాత్పర్యము శాస్త్రమనగా శాసించునది శాసింపబడునది బుద్ధి ధర్మార్థకామమోక్షములందు బుద్ధియొక్క ప్రవృత్తిని శాసించునది శాస్త్రము. ఇతిహాసమునం దట్టి శాస్త్రమునకు ప్రమేయము కలిగింపబడినచో నది శాస్త్రేతిహాసము. ఇతిహాసమున ప్రమేయమనగా, ప్రధానేతివృత్తమునకు సబలకముగానని యర్థము ప్రధానేతివృత్తము ప్రధానపురుషునిబట్టియే యుండును అతడే నాయకుడు. భారతమున నాయకుడు ధర్మరాజు. ధర్మరాజుబుద్ధి ధర్మార్థ కామమోక్షములయందు శాసింపబడుట ప్రత్యక్షముగా భారతమున నున్నందున భారతము శాస్త్రేతిహాసము రామాయణమున నిట్టి శాసనములేదు. ఏల లేదనగా శ్రీరాముడు కేవలము విష్ణువుయొక్క అవతారము ఆయన శాసనమున కతీతుడు ధర్మరాజు యమునిఅంశతో పుట్టిన మానవుడు

పరమేశ్వరుడే అయ్యును, మానవశరీరము ధరించుటవలన శ్రీరాముడు కొండొకచో రాగద్వేషములతోడి చిత్తవృత్తి కలవాడుకాగా, ఒకదేవతాంశతో పుట్టిన మానవునియందు రాగద్వేషములుండుట తప్పనిసరి రాగద్వేషములతోడి ప్రవృత్తికలవారి బుద్ధులను శాసించుటకే శాస్త్రము పుట్టినది భారతమున ప్రవర్తించిన శాస్త్ర మధికముగా ధర్మరాజు బుద్ధిని శాసించునదియే ద్రోణపర్వమున అభిమన్యుడు మరణించగా, వాని యందలి రాగముచేత, దుఃఖభరితచేతస్కుడైన ధర్మరాజు యుద్ధక్రియనుండి నివృత్తుడు కాకుండుటకుగాను, వ్యాసోపదేశ రూపమున కొంత శాస్త్రము, యుద్ధానంతరము, తనవలన నఖిలజ్ఞాతివధ జరిగినదని, రాజ్యమునొల్లక, మరణించినవారియందు రాగమును, తనయందు తాను ద్వేషమును పెంచుకొనుచున్న ధర్మరాజు చిత్తమును శాసించి, రాజ్యతంత్రములయందు ప్రవృత్తమగునట్లుగా చేయుటకు కొంత

1. సరస్వతీకంఠాభరణము- పరిచ్ఛేదము. 2. పుట 305.

శాస్త్రము-భారతమున ప్రవర్తించినది ధర్మరాజునకు పరమమైన సాధనభూతుడైన యర్జునుని చిత్తమును శాసించుటకు భీష్మపర్వమునను, అశ్వమేధపర్వమునను కొంత శాస్త్రము ప్రవర్తించినది. మరియు ధర్మరాజు నుద్దేశించి, ఆరణ్యపర్వమున శాస్త్రము ప్రవర్తించినది. ఈ యన్ని స్థలములయందును భారతమునందలి ప్రధానేతి వృత్తమునకు, అనగా నాయకునకు, ప్రత్యక్షముగను పరోక్షముగను నుపస్కారకముగనే శాస్త్రము ప్రవర్తించినది అందువలన భారతము శాస్త్రేతిహాసము. ఇది యిట్లు స్పష్టముగా తెలియవచ్చుటచేత పరిశేషన్యాయమున రామాయణము కావ్యేతిహాసమని యనుకొనవచ్చు.

రాజశేఖరుడు పెట్టిన రెండుపేళ్ళకంటె భోజుడితిహాసమును విభజించి పెట్టిన పేళ్ళు రెండును స్పష్టముగా నర్థములగుచున్నందునను, మరియునందొకటి సుష్టుగా భారతమున కన్వయించుచున్నందునను, అవి ప్రమాణముగా గ్రహింపబడుట యుచితము అపుడితిహాసము ద్విధాభూతము- 1 కావ్యేతిహాసము. 2 శాస్త్రేతిహాసము రామాయణ మహాభారతము లందుల కుదాహరణములు

పాశ్చాత్యులును ఇతిహాసమును రెండు విధములుగనే విభజించిరి- 1. Authentic Epic 2. Literary Epic[1] ఈ రెండింటికే - 1 Primary Epic 2. Secondary Epic[2] అనియు, 1. Epic of growth 2 Epic of Art అనియు మరికొందరు పెట్టిన పేర్లున్నవి

కాని పాశ్చాత్యులు చెప్పుచున్న ఆ రెండితిహాసముల లక్షణములును మన శ్రీమద్రామాయణ మహాభారతములు రెండింటికిని అన్వయించుటలేదు. పాశ్చాత్యులు చెప్పుచున్న మొదటి రకము ఇతిహాస లక్షణమిది[3]. అది పూర్తిగా నొకనిచేత నొకసారి వ్రాయబడిన గ్రంథముకాదు. కొంతకాలము వినిపించబడుచు ప్రచారమునునుండును అందువలన నందనేక విధములైన మార్పులు కాలక్రమమున గలుగుచుండును తరువాత ఎప్పుడో వ్రాయబడును. ఒకవేళ దానికొక వ్రాతప్రతియున్నను, అది ఆధారముగా వినిపింపబడుచుండుటయే

1. Sir C M. Bowra. From Virgil to Milton

2 C. S Lowis. A Preface to Paradise Lost.

3 Sir C. M Bowra C. S Lowis

దాని లక్షణము ఇట్టి లక్షణము మహాభారతమునకున్నది[1] అందు కందే ప్రమాణములున్నవి వ్యాసుడు వైశంపాయనాదులకు భారతమును చెప్పినాడు వారాయాలోకములయందు దానిని వినిపించిరి జనమేజయునకు వైశంపాయనుడు వినిపించునప్పుడు భాగతమును ఉగ్రశ్రవసుడువిని శౌనకాదులకు చెప్పెను అటు తరువాత నెప్పుడో ఎవరిచేతనో వ్రాయబడి యుండును ముందు వ్యాసుడు చెప్పిన విషయములెన్నియో, వైశంపాయనుడు చేర్చిన వెన్నియో, ఉగ్రశ్రవసుడు కల్పించిన వెన్నియో తెలియకుండ భారతమున్నది. కనుక భారత మొకని చేతిమీద వ్రాయబడినదికాదు. మరియునది వ్రాయబడక మునుపు రెండుచోట్ల వినిపింపబడినది ఇందుకు ప్రతిగా నాదిపర్వమునందున్న "త్రిభిర్వర్షైస్సదోత్థాయీ కృష్ణద్వైపాయనో మునిః మహాభారతమాఖ్యానం కృతవానిద మద్భుతమ్"[2] అను శ్లోకమును చూపి మహాభారతమును మొత్తము మూడు సంవత్సరములపాటు వ్యాసుడు వ్రాసినట్లు చెప్పి, అనేక కర్తృత్వమును, మరియు వ్రాయబడకపోవుటను నిరాకరింపవచ్చును. జనమేజయునకు భారతము వినిపింపుమని వ్యాసుడు వైశంపాయను నాజ్ఞాపించునపు డిట్లనినాడు- "కురూనాం పాండవానాం చ యథా భేదోభవత్పురా, తదస్మై సర్వమాచక్ష్వయన్మత్తః శ్రుతవానసి"[3] వ్యాసుడు శ్రుతవానసియనుచున్నాడు నావలన నీవు వినినవాడవై తివిగదా దానిని ఈ జనమేజయునకు చెప్పుమని వ్యాసుని యాజ్ఞ. మరియు త్రిభిర్వర్షై - శ్లోకమునందున్న క్రియ కృతము దానిని రచించెనని, చేసెననియే యర్థముగాని వ్రాసెనని కాదు వ్యాసుడు మూడు సంవత్సరములపాటు భారతమును శిష్యులకు చెప్పెను. వారు దానిని ప్రచారము చేసిరి భారతమునందున్న గణేశవృత్తాంతము వ్యాసుడు స్వయముగా వ్రాయలేదనుట చెప్పుచున్నది ముందు ముందది వ్రాయబడకపోవుట చేతనే పెరిగి బృహద్గ్రంథమైనదనియు విషయవిశ్వాసమును మార్పులు తట

---

1 Epic of growth, or collections of ballads of different authorship anonymous, which seem to have grown up spontaneously such as Bedwulf and Mahabharata See- New Standard Dictionary of the English Language Vol I

2. శ్రీమహాభారతే, ఆదిపర్వణి- అధ్యా 61. శ్లో 52

3. శ్రీమహాభారతే. ఆదిపర్వణి. అధ్యా 59. శ్లో 22

స్థించినవనియు, భారతమును వల్లెవేసి జ్ఞాపకమును పురస్కరించుకొని పలు చోట్ల పలుమంది వినిపించుచుండుటయే దానికి కారణమనియు డా॥ సుక్తాంకరు వ్రాసెను ఈ యీ విషయములనుబట్టి చూడగా పాశ్చాత్యులు చెప్పినట్లు మన సంస్కృత భారతము Primary Epic అగుచున్నది.

పాశ్చాత్యులు పేర్కొనిన Secondary Epic అనుదాని లక్షణ మిట్లు చెప్పబడినది ఇదివినుటకుగాక, చదువుట కుద్దేశింపబడినది. ఒకకవిచేత పూర్తిగా వ్రాయబడినది. కావ్యశిల్పరూపమైన నిబిడబంధము కలిగియుండును. మిగిలిన లక్షణములన్నియు – అనగా ధర్మము, నీతి, దైవము, అద్భుతము – ఈ మొదలైనవన్నియు Primary Epic నందెట్లుండునో, ఇందును నట్లేయుండును. మొదటి రకముగా భారతము చెప్పబడినదిగనుక నీ రెండవదైన Secondary Epic అనునది రామాయణ మనబడవలయును కాని రామాయణము కూడా కేవల మొక వాల్మీకియే వ్రాసినది కాదనియు, అదియు మొదట కుశలవుల చేత శ్రీరామునకు వినిపింపనే బడినదిగదా యనవచ్చును. నిజమే ఒకవిధముగా మహాభారతమునందున్న శాస్త్రవిషయములతోడి వైలక్షణ్యము రామాయణము నందులేదు. కావ్యము దృష్ట్యా చూచినచో రామాయణమంత నిబిడబంధము కలదికాదు భారతము ఇతిహాస లక్షణమైన నొక సుదీర్ఘమైనకథ, యుద్ధము, ధర్మసంస్థాపనము మొదలైనవి యున్నందున శ్రీమద్రామాయణ మితిహాస మగుచున్నది Secondary Epic అనుదానికి మరొక పేరైన Epic of Art అనుదాని యర్థము భారతమునకంటె రామాయణమున కన్వయించు చున్నది. అందువలన కర్తృత్వాదికములను లెక్కలోనికి తీసికొనకుండ నిర్మాణ వైదగ్ధ్యమునుబట్టి చూచినచో రామాయణము భోజుడు చెప్పినట్లు (నిజముగా చెప్పలేదు. ఊహింపబడుచున్నది) కావ్యేతిహాసమై, పాశ్చాత్యుల విభజనము ననుసరించి Epic of Arts లేక Secondary Epic కాగలదు

పాశ్చాత్యులు కావ్యేతిహాసము Primary Epic "నమూనా" మీద నిర్మింపబడునదనియు చెప్పుచున్నారు. ఆ లెక్కలో నాంధ్రమహాభారతము సంస్కృతభారతకథను గ్రహించి నిర్మింపబడినదిగా నున్నది గనుక కావ్యేతిహాసముగా దీనిని చెప్పవచ్చును అపుడు (వ్రాసినంతవరకు) నొకకవిచేత వ్రాయబడుట, కావ్యశిల్ప మధికముగా గలిగి నిబిడమైన బంధముతో నుండుట మొదలైన Epic of Art లక్షణములు ఆంధ్రభారతమునకు పట్టుచున్నవి అయి

నచో సంస్కృతరామాయణము, ఆంధ్రభారతము, ఒకజాతి గ్రంథములని యంగీకరించి నట్లగుచున్నది. కాని విద్వాంసులైన విమర్శకుల కిది సమ్మతముకాదు.

ఇంతకుపైన చూపింపబడిన ఇతిహాస సంబంధి బహ్వాంశము లొకవిధముగా సమన్వయింపబడుటలేదు. కనుక ఫలితార్థమిట్లు తేల్చి చెప్పవలసి వచ్చుచున్నది. ఇతిహాస మనునది ఒక కావ్యప్రభేదముగా భారతీయాలంకారికులును, పాశ్చాత్యులును భావించియున్నారు. మరియు ఇతిహాసము రెండు విధములని ఇరువురును విభజించి చూపిరి. ఆ విభజనమున మాత్రమే పొత్తుకుదురుటలేదు భారతీయాలంకారికవచనానుసారము భారతము శాస్త్రేతిహాసముగా నగుచున్నది మరియు పాశ్చాత్య వచనానుసారముగా Primary Epic అగుచున్నది ఒక్క రామాయణమే, వారివారి వాక్యముల ననుసరించి స్పష్టముగా కావ్యేతిహాసమనిగాని, మరియు Epic of Art అనిగాని తేల్చిచెప్పరాకున్నది. రామాయణము మాట ఎట్లున్నను భారతము మాత్రము నిస్సందేహముగా శాస్త్రేతిహాసము ఆంధ్రమహాభారతము ప్రయత్నము మీద కావ్యేతిహాసము చేయబడుచు వ్రాయబడిన శాస్త్రేతిహాసము అనగా నిచట తాత్పర్యమిది. సంస్కృతము నందున్న దానికంటె అధికమైన కావ్యనిర్మాణశిల్పమును ప్రవేశపెట్టి శాస్త్రేతిహాసమును కావ్యేతిహాసముగా నిరూపించుటయందు కవిత్రయమువారు శ్రద్ధ తీసికొనినారని మాత్రమే. ఇట్లనుట సంస్కృతభారతమునకంటె ఆంధ్రభారతము శ్రేష్ఠమైన దనుటకాదు ఆ రెండింటికీని భేదము నిర్మాణము నందున్నదని చెప్పుట మాత్రమే యగును. అందువలన ప్రస్తుతము వ్యవహారముకొరకు సంస్కృత భారతమును శాస్త్రేతిహాసమనియు, ఆంధ్రమహాభారతమును కావ్యేతిహాసమనియు అనుకొనవచ్చును. ఇక నీ గ్రంథమున నాంధ్రమహాభారత మిట్లె, ఈ దృష్టితో విమర్శింపబడును

## 4. భారతమున నాయకుడు ధర్మరాజు

"యమునంశమున బుట్టె నధిపతి ధర్మరాజుండు"[1] - కౌరవపాండవులలో నెవరెవ రేయే అంశములతో పుట్టినదియు వివరించు సందర్భమున ధర్మరాజును

1. భా ఆది. 3 - 84.

గురించి నన్నయ్యగా రట్లు వ్రాసిరి "యమునియంశమున బుట్టిన ధర్మరాజు అధిపతి. అనిలేంద్రాశ్వినుల యంశమున పుట్టిన మిగిలినవారిలో నెవడుగాని అధిపతిలేడు "కలి యంశంబున దుర్యోధనుండు పుట్టె"[1], "జగదాదిజుడగు విష్ణుదేవువంశంబున నుత్పాదిల్లె గృష్ణుడు"[2]- ఈ విధముగా నందరనుగూర్చి వ్రాసిన నన్నయ్యగా రొక్క ధర్మరాజు విషయముననే అధిపతిశబ్దము నుపయోగించుట గమనింపదగినది

అధిపతి యనగానేమి? అధి-పతి పతియనగా తన నాశ్రయించుకొని యున్న వారి రక్షణమునందుద్దేశము గలవాడై ప్రవర్తించు పురుషుడు! అధి-అవ్యయము. ఉపర్యర్థమునందున్నది. అధిపతి యనగా పీనుమిగిలిన పతి యని యర్థము. అధికారి పురుషుడని తాత్పర్యము ఏమిచేసినను అధికరించి చేయు వాడు అధికారి అధికరించి చేయుటయననేమో ధృతరాష్ట్రునితో సంజయుడు ధర్మరాజునుగురించి చెప్పినమాటలవలన తెలియగలదు. "వశీకృతచిత్తుడు ధర్మనూతి మెత్తనివులి- ఎల్లవారలు నధర్మము నీపయిఁబెట్టుసంతకున్ వినడును కానడున్ - పిదప నీకును నాకు మరల్పవచ్చునే —?"[3] చిత్తమును వశము నందుంచుకొన్నవాడై, ఇక నెవరుగాని ఆ పనినుండి తనను మరల్పరానంత పూనికతో, దానియందు ధర్మరాజు ప్రవృత్తుడగును ఆ చేయబోవుదాని విషయమై ధర్మరాజంతగా పర్యాలోచన చేయును అట్లుచేసి చేయును అధికరించి చేయుట యనగానది. అధికారిపురుషుని ప్రవృత్తి లక్షణమట్టిది.

శ్రీకృష్ణుని రాయబారము పంపుచు, వానితో ధర్మరా జిట్లనినాడు - "సిరినాకేలందునే —? గ్రాసవాసోదైన్యంబులు వచ్చునా యరయు నీచుట్టాలకుం-గావునన్."[4] ధర్మరాజు రాజ్యసంపద నెవరికొరకుగా కావలయు నను చున్నాడో ఆ వాక్యమును బట్టి తెలియుచున్నది కదా! అధిపతి లక్షణమది.

చెప్పవచ్చిన దేమనగా భారతేతిహాసమునకు నాయకుడు ధర్మరాజు ఆ విషయమును నన్నయ్యగారే ఆదిపర్వమున నిష్కర్షించి పెట్టినారు తిక్కన్నగారు నన్నయ్యగారి పథకము నట్లే తుదముట్టించెను. "ధరణికి నింక

1. భా. ఆది. 3 - 80.
2. భా. ఆది. 3 - 74.
3. భా. ఉద్యో. 2 - 14.
4. భా. ఉద్యో. 3 - 12.

నాయకుడు ధర్మతనూజుడు''[1]- శల్యుడు మరణించిన తరువాత సైన్య మట్లను కొనినట్లుగా తిక్కన్నగారు వ్రాసినారు. మరియు ''సకలధరణివలయసామ్రాజ్యమునకు నే డేను భర్తనైతి''[2]-అని కర్ణుడు మరణించిననాటిరాత్రి శ్రీకృష్ణుని ధర్మరాజనినట్లుగాగూడ తిక్కన్నగారు వ్రాసినారు ఇదంతయు తిక్కనగారును నన్నయ్యగారివలెనే భారతేతిహాసమునకు నాయకపురుషుడు ధర్మరాజను తాత్పర్యముతోడనే ఉన్నట్లు చూపుచున్నది

ఇపుడిట్లు శంకింపవచ్చును భారతమున నాయకుడు ధర్మరాజుకాదు. శ్రీకృష్ణుడు నాయకుడు ఇంకనునైనచో అర్జనుడు కావచ్చునుగాని ధర్మరాజసలుకాడు "కృష్ణార్జునోత్తమ నానాగుణకీర్తనార్థఫలమై"[3]నది భారతమనియు, మరియు నది ''ఆ నారాయణ పాండవేయగుణ మాహాత్మ్యమలజ్యోత్స్న''[4] అనియు నన్నయ్యగారే ఆదిపర్వమున చెప్పిరి. తిక్కన్నగారును ''భారత సంహితకెల్ల పుండరీకాక్షుని వాసుదేవు బ్రకటార్థముగాగని విన్నమానవుండక్షయపుణ్యలోకములయందు రమించు నిరామయస్థితి''[5] నని భారతాంతమున స్పష్టముచేసిరి అందువలన భారతమున నాయకుడు శ్రీకృష్ణుడు ఆయన లేనిచో నేమియును లేదు ఒకవేళ శ్రీకృష్ణుడుకానిచో, యుద్ధతంత్రమంతయు భుజమునవేసికొని నడిపించిన యర్జునుడు నాయకుడు కావలయును. అంతేగాని నిష్క్రియుడుగా కనిపించు ధర్మరాజు నాయకుడగుట కూడదు. మరియు మహాభారతమునకు కార్ష్ణ వేదమని యొక పేరున్నది శ్రీకృష్ణునివలన మహాభారతమునకు వేదగౌరవము వచ్చినది శ్రీవాసుదేవ పరబ్రహ్మమునే భారతము కీర్తించెను మరియు హరివంశము భారతము ననుసరించి యుత్తర భాగముగానున్నది భారత శ్రవణపఠనాదులవలని ఫలితము మోక్షముగా చెప్పబడినది ధర్మరాజు వట్టిమానవుడు నాయకుడైనచో, వాని చరిత్రమైన వానిని కీర్తించినదైన భారతమును విన్నను, చదివినను మోక్షము కలుగదు. కనుక దానికి నాయకుడు శ్రీకృష్ణపరమాత్మయే కావలయును. కానిచో

1. భా. శల్య. 1 - 305.
2. భా. కర్ణ. 3 - 394
3. భా. ఆది 1 - 65.
4. భా. ఆది. 3 - 21.
5. భా. స్వర్గ - 1 - 91.

నర్జునుడనుటవలయునేకాని ధర్మరాజనరాదు. ఇది శంక యొక్క స్వరూపము ఇక దీనికి సమాధానము వ్రాయబడును.

ఐనచో నర్జునుడైనను భారతమునకు నాయకుడు కావచ్చునుగాని శ్రీకృష్ణు డసలు కాజాలడు. శ్రీకృష్ణు డాదిజుడగు విష్ణువు యొక్క అవతారము. ఆయన అపగతఖేదుడైన పరమాత్మ. శ్రీకృష్ణుని పరమేశ్వరత్వము భారతమున నచ్చటచ్చట తిక్కన్నగారిచేతగూడ చెప్పబడినది ఒక్క ఉదాహరణము- "దైవంబన వేరొకండు గలదె – కృష్ణుండ యది" – సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పినమాటయది. శ్రీకృష్ణుని విశ్వరూప ప్రదర్శనములాయన పరమేశ్వరత్వమునకు ప్రబలనిదర్శనములు అపుడు శ్రీకృష్ణుడు జగన్నాయకుడగును. భారతమునకు మాత్రమే నాయకుడుకాడు. సృష్టికే నాయకుడు. సర్వగ్రంథములకు నాయకుడు. జగన్నాయకత్వము వేరు. ఒక సాహిత్యప్రక్రియయైన ఇతిహాసమునందలి నాయకత్వము వేరు.

భరతుడు నాయకుని నిర్వచన మిట్లు చేసెను 'వ్యసని అయికాని దుఃఖము పొందికాని పిమ్మట ఎవడు అభ్యుదయమును పొందినవాడగునో అతడే ప్రధాననాయకుడని తెలియవలయును. అనేకులకు ఒకే విధముగా వ్యసనము అభ్యుదయము- రెండును కలిగినప్పుడు ఎవని వ్యసనాభ్యుదయములు పరిపుష్టములై యుండునో అతడే నాయకుడగును'[1]. వ్యసనము కలవాడు వ్యసని వ్యసనమనగా, నేది పురుషుని శ్రేయోమార్గమునుండి తొలగించుటకు సమర్థమో, దానియందు చిత్తము సక్తమగుట యేదికలదో అది. అనగా నది యట్టిదని తెలిసియు, దానియందలి ప్రవృత్తిని నిరోధించుకొనలేనితనమునకు వ్యసమని పేరు. ధర్మరాజు వ్యసని ద్యూతమునందాతడు వ్యసని. "బలవద్వ్యసనాభిభూతుడు" అని ధర్మరాజునుద్దేశించి నన్నయ్యగారు చెప్పిరి. ద్యూతమున పరాజితుడై ధర్మరాజు తమ్ములతో నరణ్యమునకు బోవుచు తల్లికి నమస్కరించినాడు అపుడు కుంతి దుఃఖమును దిగమ్రింగుకొనుచు నిట్లన్నది- "ఇట్టి దుర్వ్యసనోపహతులైనవారి మిమ్ముజూడక ముందర సురలోకమునకేగి పాండుభూపతి పుణ్యభాగియయ్యె"[2] అని

1. నాట్యశాస్త్రము - పుట 705.

2. భా. సభా. 2-194; 2-284.

ధర్మజుని అవ్యసనమే భారతము భారతమగుటకు హేతువు. దానివలననే ధర్మరాజు దుఃఖముననుభవించినాడు. పదుమూడు సంవత్సరములపాటు పడరాని పాట్లుపడి, చివరకు యుద్ధముచేసి, రాజ్యానుభవరూప, మోక్షానుభవరూప అభ్యుదయమును ధర్మరాజు పొందినాడు అందువలన భరతుని నిర్వచనము ప్రకారము ధర్మరాజే భారతమునకు నాయకుడు. శ్రీకృష్ణుడు అపగతఖేదుడని నన్నయ్యగారు వ్రాసిరి[1] ఎవని కసలు దుఃఖాభ్యుదయములులేవో, వాడు నాయకుడగుట భరతుడంగీకరింపనిది భరతుడనగా సర్వభారతీయాలంకారికులని యర్థము కనుక భారతమునకు నాయకుడు శ్రీకృష్ణు డన్నమాట పుట్టుటకే వీలులేదు.

మరి నన్నయ్యగారు చెప్పిన కృష్ణార్జున నానాగుణకీర్తన - మొదలైన మాటల యర్థమునిట్లు సంగతము చేయవలయును. ఉపప్లావ్యమునకు ధృతరాష్ట్రునిచేత పంపబడి పోయి, కృష్ణార్జునులను చూచి, తాను తలపోసినదానిని, సంజయుడు తిరిగివచ్చి ధృతరాష్ట్రునకు కొలువులో చెప్పుచు నిట్లనినాడు—

> "ఈ యిరువురుఁ బంచినపని
> సేయుదుగఁ బె ధర్మజునకుఁ జేకురని తలం
> పే యది ? అతనిం దొడరుట
> వేయేటికి జమునిశిరము వ్రేయుటకాదే ? "[2]

ఈ యిరువురనగా కృష్ణార్జునులు ఎవరి నానాగుణకీర్తనమే భారతమునందున్నదో అట్టి కృష్ణార్జునులువారు అనగా భారతమున సర్వప్రయోజకత్వమును కృష్ణార్జునుల యందున్నది. అట్టి సర్వప్రయోజనములకు సాధనభూతులైన ఆ యిరువురును ధర్మరాజునకు చెప్పినది చేయుట కున్నారు. ధర్మరాజు తనకు కావలసినదంతయు వారిరువురివలన సాధించుకొనును. సర్వక్రియాఫలమును ధర్మరాజునయందు పర్యవసించుచున్నది. కృష్ణార్జునులయందుకాదు. వారిరువురును ధర్మరాజునకు కూర్చువారు. అంతమాత్రమే. సంజయుడు వచ్చి మాటాడిపోవుచున్నప్పుడు, అచటవారి నందరిని తానడిగినట్లుగా చెప్పుమని చెప్పుచు ధర్మరాజిట్లనినాడు—

---

1. భా. ఆది 3–74.
2. భా. ఉద్యో. 2 - 122.

దాసీదాస జనములకు
దాసీనము గాకయుండఁ దడయక యేమి
త్రాసంగమొంది శత్రుని
రాసంబొనరించి తమ్ము నరసెద ననుమీ! [1]

మిత్రాసంగము, శత్రునిరాసము కావలసినది ధర్మరాజునకు. శ్రీకృష్ణునకుకాదు. ఆయన దైవము. రాగద్వేషావేశము యొక్క లేమివలననే దైవత్వ మగుచున్నది. శత్రుత, మిత్రత, ధర్మరాజుకున్నదిగాని శ్రీకృష్ణునకు లేదు ఆయన వాసుదేవ పరబ్రహ్మము. అయన ధర్మనందునికి కలవాడు గనుక, ధర్మరాజాదులు ధర్మాత్ములు గనుక, వారియందు పక్షముగలవాడుగా కనిపించును. అంతమాత్రమే. ధర్మవిరోధియైన దుర్యోధనునియందు లోకసంగ్రహార్థమైన పగయే శ్రీకృష్ణునకున్నదిగాని, ధర్మరాజునకు దుర్యోధనుని యందున్నపగ శ్రీకృష్ణునకులేదు తనరాజ్యము నపహరించి తనను కష్టముల పాలుచేసినాడని ధర్మరాజునకు దుర్యోధనుని మీద కోపము శ్రీకృష్ణున కట్టిదిలేదు భారతమున శ్రీకృష్ణుడు చేసినదంతయు ధర్మముకొరకు ధర్మము ధర్మరాజు. కనుక ధర్మరాజుకొరకు శ్రీకృష్ణుడు ప్రవర్తించినాడు అట్లే అర్జునుడు మొదలైనవారు

ప్రతివీరుడైన దుర్యోధనుడుకూడ ధర్మరాజునందు దృష్టిని కేంద్రీకరించియే చేసినాడు. యుద్ధకాలమున ద్రోణుని దుర్యోధను డొక వరమడిగినాడు. ధర్మరాజును ప్రాణములతో పట్టుకొని తనవద్దకు తీసుకొనిరమ్మని ద్రోణు డా వరము నేల కోరితివనగా దుర్యోధను డనినాడు - "యుధిష్ఠిరు కాయంబు నొంపక తెచ్చి జూదంబాడు తెఱంగొనర్చి మగుడ నడవికి నడచిన తగిలి యతనితోడ తమ్ములు పోనంతతోన యెల్ల దొసగుమాలు". ధర్మరాజుతో తమ్ములుకలిసి పోదురని దుర్యోధనుడనుచున్నాడు. ఆయన తిరిగి జూదమాడి, ఓడిపోయి, అడవులు బట్టినను, తమ్ములుగాని, శ్రీకృష్ణుడుగాని కిమ్మనరు. ఏమనగా ధర్మరాజు సర్వాధికారి. ఆయన ఆజ్ఞకు బద్ధులు వారందరును ఆయన కెదురు చెప్పరు అది స్థితి. అందువలన ప్రాణముతో ధర్మరాజును తీసికొనిరమ్మని కోరినాడు దుర్యోధనుడు. మరల జూదమున కంగీకరించునని దుర్యోధనున కా నమ్మకమేమి? ధర్మరాజునకది వ్యసనము. అంగీకరింపవచ్చును.

---

1. భా. ఉద్యో. 1 - 368.

అందుకని దుర్యోధను డట్లనినాడు. దుర్యోధను డశ్లేల యూహింపవలయును. ధర్మరాజును చంపినచో సరిపోదా ? చంపుమని ఏలకోరలేదు ? ఆ విషయము లను తిక్కన్న గారిట్లు వ్రాసిరి-

"ఆ ధర్మసూను గయ్యంబున జంపిన
గోపించి గాండీవి కురుకులంబు
సమయించు మనమోపి సర్వపాండవులను
జంపితిమేని ( బ్రచండ చక్ర
ధార ( గౌరవకోటి తలలేఱి రాజ్యంబు
గోవిందు డీకున్నె గొంతికయిన ?
కాన యుధిష్ఠిరు ( గాయంబునొంపక
తెచ్చి జూదం బాడు తెఱగొనర్చి"[1]—

అని యీ మొదలుగా ద్రోణునితో దుర్యోధను డనినాడు. ధర్మరాజుని చంపినచో ప్రయోజనము లేదు కృష్ణార్జులు మరియు కోపించి విజృంభింతురు. అనగా ధర్మరాజు కొరకు కృష్ణార్జునులున్నారు గాని, వారికొరకు ధర్మరాజు లేడు. అందువలన భారతమునకు నాయకుడు ధర్మరాజేగాని శ్రీకృష్ణుడు గాని మరొకరుగాని కాదు. సంజయునితో శ్రీకృష్ణు డనినాడు - "ఈ సంధి కార్యం బత్యంత దుర్ఘటంబు. దీనిం ఘటియింపం జేయుట యశక్యంబని తలం చెద అయినను పాండవేయుల దగ బ్రార్థించి యందులకొక్కటయేనైనను నరుగుదెంచి కౌరవులకు బుద్ధిగా చెప్పి" చూచెద నని. భారతమున సర్వాధి కారి పురుషుడు శ్రీకృష్ణుడైనచో పాండవులను ప్రార్థించి వారి యనుమతిని తాను కౌరవులవద్దకు పోవలసిన స్థితి యుండదుగదా ! మరియు నంతకు పూర్వము ద్రుపదుడు తన పురోహితుని ధృతరాష్ట్రుని యొద్దకు పంపినది కూడ "అజాతశత్రు ననుమతి వడసి" అనియే తిక్కన్నగారు వ్రాసిరి కృష్ణార్జునుల అనుమతి ద్రుపదున కక్కరలేదన్నమాట వారధికారి పురుషులు కారు - ఇవన్నియు భారతమునకు ధర్మరాజునే నాయకునిగా సాధించుచున్నవి కృష్ణార్జు నోత్తమ నానాగుణ కీర్తనార్థమైనది వలె భారతమున్నది. వారిరువురును ధర్మరాజునకు ప్రధానములైన సాధనములు వారి మహాత్మ్యము-ప్రతాపము-

1. భా. ద్రో. 1-111.

ఎంతగా కీర్తింపబడినను అంతయు ధర్మరాజుయొక్క సాధన వైశిష్ట్యమునే స్థాపించునుగాని, భారతమునకు వారిని నాయకులుగా స్థాపించవు.

స్వర్గారోహణపర్వాంతమున తిక్కన్నగారు వ్రాసిన దాని కర్థ మిట్లు చెప్పుకొనవలయును. భారతసంహిత కంతయు ప్రకటార్థము వాసుదేవుడు. ఆ విషయమును కనినవారు, వినినవారును అక్షయపుణ్యలోకములను పొంది నిరామయస్థితి మందురని, ఫలశ్రుతిగా తిక్కన్నగారు చెప్పిరి. వాసుదేవుడు భారతమున ప్రకటార్థము. ప్రకటమనగా ప్రసిద్ధము అర్థమనగా నర్థింపబడునది. మరియు ప్రార్థింపబడునది. భారతమున ప్రసిద్ధముగా ప్రార్థింపబడుట యనగా ప్రకృష్టమైన సిద్ధి నుద్దేశించి ప్రార్థింపబడుట ధర్మరాజు తన రాజ్యము తాను తిరిగి పొందవలయునను ప్రకృష్టమైన భావముతో వాసుదేవుని ప్రార్థించెను. ఆయన దయవలన ధర్మరాజు పొందవలసినది పొందినాడు. అట్లు ధర్మరాజు పొందుట భారతమున స్పష్టముగా నున్నది. ఆ యున్నదానిని కనిగాని - అనగా చదివి తెలిసికొనిగాని, వినిగాని - అనగా చదివి తెలిసికొని చెప్పువారి మాటను విశ్వసించిగాని, పాండవుల యర్థసిద్ధికి మూలము వాసుదేవుడు గదా యని యెరిగి, వానియందు బుద్ధి లగ్నము చేసికొన్న మానవుల కక్షయపుణ్యలోకములు ప్రాప్తించునని తిక్కనగారి యా వాక్యమున కర్థము. వాసుదేవుని యందు చిత్తము లగ్నమగుటకు తగినంతగా భారతమున వాసుదేవుని మాహాత్మ్యము చెప్పబడినదని యర్థము అది భారతమునకు శ్రీకృష్ణుడు నాయకుడన్న యర్థమును చెప్పదు. ఇచట తిక్కన్నగారు వాడిన పుండరీకాక్ష వాసుదేవ శబ్దముల కర్థము, తెల్లతామరపూవుల వంటి కన్నులుగల వసుదేవుని కుమారుడనికాదు "హృదయస్థం పుండరీక మశ్నుతే వ్యాప్నోతి తత్రోపలక్షిత ఇతి పుండరీకాక్షః [1]—వసతి వాస త్యాచ్ఛాదయతి సర్వమితవా వాసుః. దీవ్యతి క్రీడతే విజిగీషతే వ్యవహారతి ద్యోతతే స్తూయతే గచ్ఛతీతివా దేవః వాసుశ్చాసౌ దేవశ్చేతి వాసుదేవః[2]" అని శ్రీమచ్ఛంకరులు చెప్పిన యర్థమును భావింపవలయును. అక్షయపుణ్యలోకములయందు నిరామయస్థితి కావలయునన్నచో నట్లే భావింపవలయును. భారతేతిహాసమునుండి పొందదగిన, పొందవలసిన ఫలమిది సుమాయని తిక్కన్నగారు చెప్పెనుగాని, ఆ పద్యమున భారత నాయకుడు

1 విష్ణు సహస్రనామ స్తోత్రము - పుట 47.

2. విష్ణు సహస్రనామ స్తోత్రము - పుట 68.

వాసుదేవ పరబ్రహ్మమని చెప్పలేదు అందువలన భారతమునకు శ్రీకృష్ణుడు నాయకుడని ఆ పద్యము సాధించదు. నాయకుడు శ్రీకృష్ణుడు కాకపోయినను, భారతము నందలి ప్రకటార్థము వాసుదేవ పరబ్రహ్మముగా నెఱిగి చిత్తము తదాయత్తము చేసినచో మోక్షము వచ్చుట కభ్యంతరములేదు.

హరివంశ భవిష్య పర్వములు పురాణములు. భారతేతిహాసములుకావు. స్వర్గారోహణపర్వముతో భారతము ముగిసినది. అంతవరకు ధర్మరాజే నాయకుడు. హరివంశము ధర్మరాజు నుద్దేశించి ప్రవర్తించినది కాదు భారతము నంతయు నుగ్రశ్రవసుడు చెప్పగా విని హరివంశము వినగోరిన శౌనకాది మహర్షు లాయనతో ననిన మాటలివ్వి –

"కౌరవ పాండవ ప్రవర గౌరవలీలలు నీవు చెప్పఁ దీ
పారెడు భంగి వింటిమి గుణాకర ! ఇంక జగత్త్రయంబునం
ధీరులు శూరులున్ విభవదీప్తులునా నుతిగన్న యాయదు
క్ష్మారమణాన్వయోత్తముల చందములున్ విన వేడుకయ్యెడున్".[1]

భారతమంతయు కౌరవ పాండవుల గౌరవముతోడనే యున్నది హరివంశము యాదవవంశమునకు సంబంధించినది. మరియు నందలి శ్రీకృష్ణుని మాహాత్మ్యమునకు సంబంధించినది "పాండవోత్తముల చరిత్ర నాకు సంతతంబు వినంగ నభీష్టమెంతయు"[2]నని రాజరాజు కోరుటచేత నన్నయ్యగారిచేత భారత ముపక్రమింపబడినది. భారతమంతయు వినిపించి జనమేజయునితో వైశంపాయను డిట్లనినాడు – "పాండవ కౌరవ విషయమైన యట్టి యితిహాసము ప నుపాఖ్యానజాత సహితమగునట్లుగా సమస్తంబు మహిత విస్తరంబుగ జెప్పితి"[3]. శౌనకాదులకు భారతకథ అంతయు చెప్పిన ఉగ్రశ్రవసుడు చివరకు "పాండవుల కీర్తి బ్రకటించుటకును, మరియుం గొందఱు జనపతులచరిత్రలు జనుల కెరిగించుటకును, దేవదేవుండగు వాసుదేవుని క్రీడావిశేషంబులు వివరించుటకును, సర్వ దేవజాతుల జన్మంబులును దదీయ సాయుజ్యంబులును దేటపఱచుటకును, సకల ధర్మంబులునుం దెలుపుటకును గాఁ బంచమవేదంబయి పరగు నిమ్మహాభారతసంహిత

1. హరివంశము. పూ. భా. 1-48.
2. భా. ఆది. 1-14.
3. భా. స్వర్గ. 1-74, 81.

(వేదవ్యాసుడు) యొనర్చె"నని చెప్పినాడు ఈ యుదాహరింపబడిన అందరి వాక్యములయందును భారతము కౌరవపాండవులకు సంబంధించిన దన్న తాత్పర్యమే ప్రధానముగా నున్నది. కౌరవపాండవులన్న రెండుపక్షముల నాశ్రయించి కథ పెరిగినది. చివరకు ఫలము ననుభవించినది ధర్మరాజు. కౌరవ పాండవుల చరిత్రను చెప్పు గ్రంథమునకు శ్రీకృష్ణుడు నాయకుడగుట పొసగనిది. యదుకుమారమాతాంన్వయోత్తముల చరిత్రమును చెప్పు హరివంశము నకు శ్రీకృష్ణుడు నాయకుడు కావచ్చునుగాని భారతమునకు కాదు. హరి వంశము పురాణమగుట మూలముగా నది శ్రీకృష్ణనాయకమని చెప్పబడదు; విష్ణుపారమ్యమును చెప్పుచున్నదనబడును.

ఇక భారతమునకు గల కార్ష్ణవేదమను దానివిషయము - కృష్ణసంబంధము కార్ష్ణము వ్యాసునకు కృష్ణద్వైపాయనుడని పేరున్నది పంచమ వేదమైన భారత మాయనచేత రచింపబడినదే గనుక, ఆయనతో సంబంధము గలది. కనుక భారతము కార్ష్ణ వేదము కాదు-వాసుదేవుడు నాబడు శ్రీకృష్ణ సంబంధముచేత నే భారతము కార్ష్ణ వేద మనబడుచున్న దన్నచో దాని యర్థమిది. భారతమునకు వేదగౌరవమును కూర్చుచున్న పర్వములు శాంతి, అనుశాసన, అశ్వమేధములు మరియు భీష్మపర్వమునందలి భగవద్గీత, శాంత్యనుశాసనపర్వములయందున్న ధర్మ ప్రపంచమంతయు, భీష్ముని ముఖమున వ్యక్తీకరింపబడినది. సూక్ష్మముగా విచారించినచో, అదంతయు శ్రీకృష్ణుని బుద్ధినుండి యభివ్యక్తమైనదియే "నాదు బుద్ధి స్ఫురణము నీ మనమునందు జొనిపితి" ఇక నీవు చెప్పుమని శ్రీకృష్ణుడు భీష్మునితో ననినాడు. ఆ మాట శ్రీకృష్ణుడనిన తర్వాత నే భీష్ముడు నోరువిప్పినాడు. అశ్వమేధపర్వమున శ్రీకృష్ణుడు స్వయముగా నర్జునునకు ధర్మతత్వ ముపదేశించినాడు - భీష్మపర్వమునందువలె భారతమునకు వేద గౌరవమే యే విషయముల కలిమిని వచ్చినదో, ఆయా విషయములు, కొంతలో శ్రీకృష్ణుని ప్రత్యక్షసంబంధము కలిగియు, కొంతలో నప్రత్యక్షసంబంధము కలిగియు నున్నవి. అందువలన భారతము కార్ష్ణ వేద మనబడి యుండవచ్చును అంతేగాని శ్రీకృష్ణుడు నాయకుడగుటవలన మాత్రముకాదు.

ఐనచో నర్జునుడైనను భారతమునకు నాయకుడు కావచ్చునని సమా ధానము ప్రారంభింపబడినది. అర్జునుడుకూడ నాయకుడు కాజాలడు. కాజాలక

పోయినను నట్లు ప్రారంభించుటలోని అంతర్యమిది - అర్జునుని పక్షమున ఫలాను భవము నొకవిధముగా సాధింపవచ్చును. భారతయుద్ధమంతయు నర్జునుని మీదగనే పోయినది. అనగా ప్రత్యక్షముగా నర్జునుడు యుద్ధతంత్రమును నిర్వహించినాడు. అ యుద్ధమునకు ఫలముగా రాజ్యము వచ్చినది. తాత్కాలికముగా నా రాజ్యమును ధర్మరాజధిపతియై పాలించినను, తరువాత అర్జునుని మనుమనికే యైనది. అర్జునుడు యుద్ధముచేసి సాధించిన రాజ్యము తరువాత తరువాత ఆయన సంతతియే యనుభవించినది. ధర్మజుని సంతాన మనుభవింప లేదు. కొద్దిపాటి వ్యవధానముతోనైనను యుద్ధమువలని ప్రధానఫల మర్జునుని రక్తముగల జీవులకే యైనది అందువలన నొకవేళ నాయకుడనినచో నర్జునుని యనవచ్చును. కాని యది పద్ధతికాదు.

కావ్యనాయకుని ఫలానుభవమునకును, ఇతిహాసనాయకుని ఫలానుభవమునకును భేదమున్నది. అర్జునుని పక్షమున చూపబడిన వాదము కొంతలో కొంత కావ్యనాయకుని ఫలానుభవము దృష్ట్యా చూపబడినది. భారత మితిహాసమగుట మూలముగా నది త్రోసిపుచ్చబడుచున్నది. కర్మఫల సంబంధము గల సర్వార్థములును ప్రత్యక్షముగా నితిహాసమున చూపబడవలయును. ఇహాపర భేదముచేత కర్మఫలము ద్విధాభూతమని ఇదివరలో చెప్పబడినది కావ్యము నాయకుని ఇహానుభవమునే చెప్పును. భారతేతిహాసమునకు నాయకు డర్జునుడైనచో స్వర్గలోకమున ధర్మరాజు అనుభవవర్ణనముకాక అర్జునుని యనుభవ వర్ణన ముండవలయును మానుషతనువుతో పరలోకమునకు పోయినది ధర్మరాజుగాని అర్జునుడు కాదు. శరీరముతో ధర్మరాజు పోయినాడు గనుకనే వాని చిత్తమున కనుభవ యోగ్యతకలిగినది. ఇతిహాసమునందలి ప్రధానపురుషులందరియొక్క కర్మఫలానుభవము ప్రత్యక్షముగా వర్ణింపబడవలయును గనుక, ముందు స్వర్గమున ప్రతివీరుడైన దుర్యోధనునియొక్కయు, తరువాత నరకమున భీమార్జునాది నాయకపక్షమువారి యొక్క యాతనాశరీరములతోడి యనుభవము, ధర్మజుని ముఖమున ప్రత్యక్షపరుపబడినది. అనగా యనుభవము కూడ ధర్మరాజునకే అయినట్లు ఆ తరువాత గంగానదిలో మునిగి లేచి మానుష తనువును త్యజించినాడు ధర్మరాజు. అప్పుడనుభవములేదు. యమునిలో నైక్యమైనాడు. అందువలన భారతమునకు ధర్మరాజే నాయకుడుగాని అర్జునుడు కాదు.

భరతుడు చెప్పినట్లుగా ధర్మరాజు వ్యసని. దుఃఖమును పొందినవాడు. మరియు నభ్యుదయమును పొందినవాడు "సర్వమును ఫలప్రాప్తి పర్యంతము ఎవనివలన నడచునో అతడు నాయకుడనబడును"[1]. మొదటినుండి చివరవరకు భారతమున సర్వము ధర్మజుని చుట్టుకొని యున్నది ఎవరెవరేమేమి చేసినను, అదంతయు ధర్మరాజు కొరకే చేసిరి. సర్వానుభవమును ధర్మరాజునకేగాని మరొకరికిలేదు

అందువలన భారత నాయకుడు, శ్రీకృష్ణుడుగాని, అర్జునుడుగాని గాక, ధర్మరాజే యగుచున్నాడు[2].

## 5. భారతమునందలి అంగిరసము శాంతము

భారతమునం దంగిరసము శాంతమ్ము. ఈ మాట పరంపరగా వచ్చుచున్నది. కొందరు వీరము భారతమున ప్రధానమనుకొనుటయు గలదు. కాని వీరము కాదు.

ఒక గ్రంథమున నున్నరసము ఫలానా అని చెప్పుట యెట్లు? అందలి వస్తువును, అనగా నితివృత్తమునుబట్టి, చెప్పవలయును ఇతివృత్తమెప్పుడును ప్రధానముగా నొక పురుషుని ఆశ్రయించుకొని యుండును. ఏది ఫలముగా నా యితివృత్తము పరసమాప్తి యగుచున్నదో, ఆ ఫల మెవని కనుభవమగుచున్నదో, వాని నాశ్రయించుకొని ఆ యితివృత్తమున్నట్లు భారతేతివృత్తము ధర్మరాజుని చుట్టుకొనియున్నదనియు, ఆయనయే నాయకుడనియు, నింతకు

1. నాట్యశాస్త్రము - పుట 856.

2. భారతమునకు నాయకుడు ధర్మరాజనియు, ఇతివృత్తాధికారియగు ధర్మజుని జీవితపరిణామము ననుసరించి, శాంత్యనుశాసన పర్వములు ప్రసక్తించుటలోని యౌచిత్యమును, దానిననుసరించి తిక్కన్నగారి రచనయు నెట్లు పరిణమించినదియు, శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావుగారు "భారతము-తిక్కన్న రచన" అను గ్రంథమున నోదాహరణముగా నిరూపించియున్నారు. చూ. పుటలు 137, 157. 162, మరియు శ్రీ పి. ఎన్. మల్లిక్ బహద్దూర్ వంటి భారతవిమర్శకులును ధర్మరాజే నాయకుడనుచున్నారు- "The hero of the Epic, Yudhistara, went to heaven in person, which Sri Krishna and Arjuna could not do". The Mahabharata P. 512.

మునుపు చెప్పబడినది. ధర్మజుని ప్రవృత్తి శాంతమున కభిముఖమై సాగినందున భారతమున నంగిరసము శాంతమగుచున్నది.

✓అసలు రసమన్నది సహృదయునిదిగాని నాయకునిదికాదు. నాయకుని యందు స్థాయిభావ ముండును. తదభిముఖములైన విభావానుభావవ్యభి చారులవలన నది పుష్టమగును. అట్లు స్థాయి పుష్టమగుకొలదియు, ఏ తద్విభాను భావాదులయందు చిత్తమును లగ్నముచేసిన సహృదయునియందు కలిగెడు ఆర్ద్రిత క్రమ పరిణతమై, అచట నాయకునకు స్థాయి పరాంకోటి కెక్కినపుడే, ఇచట సహృదయునకది ఆస్వాద్యమగును. సహృదయున కాస్వాద్యమైన భావము రసము నాయకుని యనుభవమునకైనది స్థాయి. అనగా నొకే భావము విభావానుభావాదుల నాశ్రయించుకొని పుష్టమై నాయకునియందు స్థాయిగాను, సహృదయునియందు రసముగాను పర్యవసించుచున్న దన్నమాట. నాయకునకు. శోకము స్థాయినందుకొన్నచో సహృదయునకు కరుణ మస్వాద్య మగుచున్నది నాయకునియందు రతి స్థాయికెక్కినచో సహృదయునకు శృంగార మాస్వాద్యమగుచున్నది. నాయకునియందు శమము స్థాయినందుకొనుటతో సహృదయుడు శాంతము నాస్వాదించుచున్నాడు. భారతమునం దంగిరసము శాంతము – అనగా నాయకునియందు శమము స్థాయికెక్కుచున్నది. సహృ దయుడు శాంతము నాస్వాదించుచున్నాడు

శాంతము శమస్థాయి భావాత్మకము. స్థూలముగా శమశాంతశబ్దము లోక యర్థముననే చెప్పును. ✓ఉపశమించిన దాని లక్షణము శమము✓ఉపశ మించుట యన్నది, ముందేది జృంభించునో దానికుండును. జృంభించు లక్షణము మనస్సునకున్నది. దాని జృంభణము రాగద్వేషరూపమున రెండు విధములుగా నుండును. ✓ఉపశమించుట యనగా రాగద్వేషము లుపశమించుట యమునకు శమనుడని పేరున్నది. శమనుడనగా నుపశమంపజేయువాడు శరీర ముపాధిగా నున్నంతవరకు జీవునకు రాగద్వేషము లుపశమింపవు. శరీరమునుండి జీవుని వేరుచేసి రాగద్వేషముల నుపశమింపజేయుచున్నాడు శమనుడైన యముడు. స్థూలముగా జీవుల నుపశమింపజేయువాడని శమశబ్దమున కర్థము చెప్పబడు చుండును. అపుడు రాగద్వేషములతో జీవున కభేదమని తెలియవలెను. నిజ మునకు జీవునకు రాగద్వేషములులేవు. అవి శరీరధర్మములు శరీరధర్మము నణచి ప్రకాశింపగలిగిన ఆత్మగుణముకలిమి లోకమున క్వాచిత్కము.

అట్టి జీవుడు పరమేశ్వరావతారముగా చెప్పబడును. భారతమునకు నాయకుడైన ధర్మరాజు శరీరధర్మము నతిక్రమించలేని జీవుడు అందువలన రాగద్వేషము లాయనకున్నవి. క్రమముగా నవి శమించినవి అట్లు రాగద్వేషములు శమించుట క్రమముగా భారతమున నిరూపింపబడి యున్నందున శమము ధర్మజునియందు స్థాయినందుకొన్నది. అందువలననే సహృదయునకు శాంతమాస్వాద్యమగుచున్నది.

ధర్మరాజు మహానుభావుడు గదా! అన్యాయముగా వానిమీద కచ్చగట్టి, వాని రాజ్యము నపహరించి, వానిని కష్టముల పాలుజేసినది దుర్యోధనుడు. అప్పటికిని, ధర్మరాజు యుద్ధము చేయుట కిష్టపడక, ఐదూళ్ళైనను నిమ్మని కోరినాడు. కాని వాడీయలేదు అందువలన ధర్మరాజుపట్ల ద్వేషభావమున్నదని చెప్పుట యెట్లు పొసగు ననవచ్చును. ద్వేషము లేకపోయినను రాగమున్నదిగదా! ఒక విధముగా ద్వేషమును ధర్మరాజునందున్నది. సంధియగుటకేల యత్నించినాడు? వంశక్షయమగునని కదా! వంశక్షయమగుటయందు ద్వేషమును, కాకుండుటయందు రాగమును ధర్మరాజునకున్నవి. శాంతి పర్వమున ధర్మరాజిట్లనినాడు - "ఆ దుర్జనుండు (దుర్యోధనుడు) కర్జం బెరుంగక దుర్మానంబు వాటించిన సైరించి తొలంగనైతి, రాజ్యపరిగ్రహాపరత్వంబు మచ్చిత్తంబునం గలిమిజేసి కిల్బిషంబు నత్యంతంబుగా నాచరింపవలసె"[1]. రాజ్యమును పొందుటయందు రాగరూప చిత్తవృత్తి ఏర్పడిన ధర్మరాజునకు, దాని కడ్డుపడిన దుర్యోధనునియందు ద్వేషరూప చిత్తవృత్తి కలుగుట అనివార్యము. అనివార్యమైనదియే పై వాక్యమునయందు ధర్మరాజు చెప్పుచున్నాడు. ధర్మరాజు చిత్తమున దుర్యోధనుని యందున్న ద్వేషము ఉద్యోగపర్వము మొదలు శల్యపర్వాంతము స్పష్టముగా తెలియవచ్చుచున్నది అది బహుముఖముల వ్యక్తమైనది.

దుర్యోధనుడు తొడలు విరిగి పడినప్పటినుండి ధర్మరాజునకు ద్వేషము పోయి రాగము ప్రారంభమైనది. ముఖ్యముగా స్త్రీపర్వాంతమునుండి రాగరూప చిత్తవృత్తి కలిగినది.

శాంతి పర్వమున, తన చిత్తము కోపమాఱి శోకాక్రాంతమైనదని ధర్మరాజే చెప్పినాడు. కోపమారినదనగా ద్వేషము పోయినది. శోకాక్రాంత

1. భా. శాం. 1-47.

మైనదనగా రాగపూరితమైనది ఆ ద్వేషము సర్వకౌరవ నాశనమునకు దారి తీసినట్లే, ఈ రాగము విరక్తికి దారితీసినది. రాగనిర్భరమైన ఈ శోక మెంత వరకైనదనగా - నాకు రాజ్యమక్కరలేదు - నేను కాననంబుకు జని మునిజన సకాశంబున నుండెదనని తమ్ములకు రాజ్యమప్పగించి ధర్మరాజడవులు బట్టి పోతలచు వరకైనది. మొదట ధర్మరాజు వీరుడు ఇపుడు శోకాకులుడు. అప్పుడు ద్వేషము మూలము. ఇపుడు రాగము మూలము. దానివలన యుద్ధమైనది. దీనివలన క్రమముగా మోక్షమైనది. రాగము పుట్టుటతో ద్వేషముపశమించినది మోక్షధర్మ కథనముతో రాగము నుపశమించినది. ధర్మరాజు నందా రాగద్వేషముల ఉపశమనము చూపబడినందున భారతమున నంగి రసము శాంతము. వీరమునుండి కరణము, కరుణమునుండి శాంతము. అనగా శాంతమున కవన్నియు లొంగి ఉపస్కారకములైనవని యర్థము. కరుణమునకు వీరమంగము. శాంతమునకు కరుణ మంగము. సర్వభావములును రాగ ద్వేష రూపములును, అవిశమించిన స్థితియే శమము. శమమున కింకొక పరిణామము లేదు. అందువలన శమము స్థాయిగాగల శాంతము రసరాజమైనది.

ధర్మతత్త్వప్రబోధము ముగిసిన తరువాత ధర్మరాజు స్వయముగా నిట్లనినాడు—

"మీ కారుణ్యంబున నా
శోకంబంతయును బాసె సుమనస్కత
సుశ్లోకాత్ములారా ! కలిగెన్ నాకున్[1]

ధర్మరాజునకు శోకము పోయినది. సుమనస్కత కలిగినది సుమనస్కత యనగా లెస్సగా నెరిగిన తనము. ఆ బోధవలన ధర్మరాజు తనకు సుమనస్కత కలిగిన దని చెప్పుచున్నాడు ఆ సుమనస్కత దేనికి సంబంధించినదనగా శోకమును పోగొట్టుకొనుటకు సంబంధించినది. శోకము ద్వేషమువలననైనది ద్వేషముతో నొకనిని చంపి శోకించుట యనగా వానియందు రాగము ప్రవర్తించినదన్న మాట. శోకము పోయినదనగా రాగము పోయినదని యర్థము. రాగము పోయినచో ద్వేషముండవచ్చునుగదా ? ఉండవచ్చును కాని ద్వేషమునకు హేతువు రాజ్యమునందలి రాగమే కదా ! అందువలన సర్వమునకు మూలము రాగము

1. భా. అశ్వ. 1-137.

రాగము వలననే ద్వేషమును శోకమును కలిగినవి. శోకము పోయిన దనగా రాగద్వేషములు పోయినవనియే యర్థము. కాని ధర్మరాజునకు రాగమే పోయినదిగాని, ద్వేషము పోలేదని చెప్పవచ్చును. స్వర్గమునకు పోయిన ధర్మరాజు దుర్యోధనుని జూచి "ఇతడతి లోభోపహతమానసుడు - ఏ నిట్టివాని తోడ కలసి మెలగుదునే" అనినాడు అది ద్వేషరూప చిత్తవృత్తియే గదా! ఒకచోట ద్వేషమున్న మరొకచోట రాగముండి తీరును. "ఎచట నున్నవారు భీమఫల్గునులు - నన్నచట కనుపవలయు"[1] నని ధర్మరాజనుటలో రాగమున్నది. స్వర్గమునకు వచ్చినను రాగద్వేషములు సూక్ష్మరూపమున ధర్మరాజు చిత్తము నందుండనేయున్నవి. అందుకు హేతువు శరీరముతో వచ్చుట. అవి శరీర ధర్మములు గదా! కొంతకాల మాత్మజ్ఞానము కలిమిని ధర్మరాజు రాగద్వేషముల నుపశమింపజేసికొనినాడు స్వర్గమునకువచ్చి దుర్యోధనుడు సుఖముగా నుండుటను చూచుట తోడనే అవి పైకివచ్చినవి. మానుషతనువు కలుగుట వలన వచ్చినవి. ఆకాశగంగయందు మునుగుటతో—

"వైర మాత్సర్య స్నేహ సంవాస లౌల్య
గర్వ శోకాదులైన హృద్గత వికార
ముల దొఱంగి నిర్ధూమత్వమున వెలుంగు
పావకుడు బోలె శోభిల్లె"[2]

ధర్మరాజునకు మానవతనువు పోయినది రాగద్వేషములు పోయినవి. శమము స్థాయికెక్కినది. తత్కాలమున సహృదయమున కాస్వాద్యమగుచున్న భావమే రసను అదే శాంతము. "నయత్ర దుఃఖం న సుఖం నద్వేషో నాపిమత్సరః, సమః సర్వేషు భూతేషు సశాంతః ప్రథితో రసః"[3] అని భరతుడు శాంతరస స్వరూపమును నిష్కర్షించి పెట్టెను అదే సర్వభావములు శమించుటగా భారతమున ధర్మరాజు విషయమున నిరూపింపబడినది. కనుక భారతమున స్థాయికెక్కినట్లుగా పోషింపబడిన భావము శమము. అందువలన శాంత మంగిరసమగుచున్నది.

1. భా. స్వర్గ. 1-6.
2. భా. స్వర్గ. 1-52.
3. నాట్యశాస్త్రము. పుట. 212.

## 6. ఇతిహాసమున రసస్థితి

ఇతిహాసమున కావ్యమునందువలె రసము ఎడతెగక సాంద్రముగా నుండదు మరియు పురాణమునందువలె లేకుండ నుండదు. రసమనగా నంగి రసము ఇతివృత్తము నాలంబనముగా చేసికొని సహృదయమున కాస్వాద్య మగునది రసము. వస్తువెడతెగక యున్నచో రసమును నశ్లేయుండును. ఏక వస్తువున్నను, అది మధ్యమధ్య అనేకములైన భిన్నవస్తువులతో తాడిత మగు చున్నచో రసమును నశ్లేయగును ఇతిహాసమున నితివృత్తమొకటి ప్రధానముగా నున్నను, అది బహు అన్యవిషయుములచేత తాడితమగుచుండును కావ్యేతి వృత్తమున కన్యవస్తు తాడనములేదు. కనుక రసము సాంద్రముగా నుండగలదు. పురాణము బహు వస్తు సంకలితము. ఇతిహాసమునందువలె నొక కథ యెడ తెగక పురాణమునం దాద్యంతము వ్యాపించియుండదు పురాణములు శైవ ములు కొన్ని, వైష్ణవములు మరికొన్ని. శివకేశవుల మాహాత్మ్యము నుత్కర్షించి చెప్పుటయందు తాత్పర్యము కలవిగా నవి యుండును. ఆ తాత్పర్య మేకవస్తువు వంటిదే గదా ! రసముండుట కభ్యంతర మేమనవచ్చును. తాత్పర్యమొకటియే యైనను, దానిని స్థాపించుటకు బహువస్తువుల నచట సంగతపరచుట జరుగు చున్నది వస్తువనగా కథ. వస్త్వాశ్రయము రసము బహు వస్తువులుండుట వలన బహురసములు పుట్టవలయును. ఏ కథయు రసమును పుట్టించు నుద్దేశ ముతో నచట చెప్పబడుటలేదు. శివకేశవుల యుత్కర్ష కుపస్మారకముగా ప్రతికథయు చెప్పబడుచున్నది మరియు కొన్ని పురాణము లట్టి తాత్పర్యము లేనివున్నవి. సర్గ, ప్రతిసర్గాది బహువిషయములతో నుండును బహు కథలతో నున్న పురాణములయందొక అంగిరసముండుట కాస్కారములేదు ఆ యా కథలు రసదృష్టితో చెప్పబడినవికావు గనుక, అందు రసమునకు వెదకుట కవ కాశము లేదు. కనుక పురాణములయందు రసప్రసక్తియేలేదు. ఇతిహాసమట్లు గాక నొక ప్రధానకథ కలిగియుండును మరియు దానిని చుట్టుకొని బహు విషయములుండును ఆయా విషయములచేత మధ్య మధ్య ఇతివృత్తము భంజింప బడుచుండును భంజింపబడుచు నైనను ప్రధానముగా నొక కథ ఆద్యంతముగా వ్యాపించియున్నందున దాని నాశ్రయించి రసమునునశ్లే భంజింపబడుచుండును. ఇతిహాసమున కేవల మా ప్రధాన కథా నిర్వహణ మొక్కటియేగాక మిగిలిన బహువిషయము లుండుటవలన, కావ్యకర్తవలె, ఇతిహాసకర్త రసమును సాంద్ర ముగా పోషింపలేదు.

పోషింపలేడనగా నర్థము, ఇతిహాసమన్న కావ్యప్రభేదమునందే రసపోషణమునకు, కావ్యమునందుండు వెసులుబాటులేదని.

భారత మితిహాసము. కావ్యము కాదు కావ్యేతిహాసమగుటవలన నాంధ్రభారతమున నంగిరసము సముచితముగా పోషింపబడినది కావ్యమును రచించుటకంటె ఇతిహాసమును రచించుట చాల కష్టమైన పని ఐతిహాసిక కవులు సాధారణముగా మహాకవు లనబడుచుండుటలోని రహస్యమిదియే కావ్యమున యందంగరసములు, అంగిరసమును మ్రింగునంతగా పెరుగుట కవకాశములేదు. ఇతిహాసమునయందు దా యవకాశ మెక్కువ. కావ్యమునందున్న యేకవస్తుగతమైన భిన్న సన్నివేశములయందే అంగరసముల ప్రసక్తివచ్చును. ఇతిహాసమున ప్రధాన కథ నటుంచి ఉపకథలు ప్రసక్తికి వచ్చును. కథనాశ్రయించి రసము స్థాయి కెక్కుటకున్న వీలు, సన్నివేశముల నాశ్రయించినపుడులేదు అందువలన నితిహాసకర్త జాగరితుడు గానిచో అంగరసములు, ఉపకథల మూలమున పరిపుష్టములై, అంగిని మ్రింగివేయగలవు. అనగా ప్రతి యుపకథను, సముచితమైన పరిధిలో నిర్వహించుచు, ప్రధానేతివృత్తమున కుత్కర్షాపాదకముగానుండు నంతవరకే దానిని పుష్టముచేయుచు, అంగికి లోబడియుండునట్లుగా నితిహాసకర్త జాగ్రత్త పడవలయును, కావ్యమును వ్రాయువానికింత జాగ్రత్త అక్కరలేదు. వాని వస్తువు పరిధియే తక్కువ. మరియు నది యొక్కటి మాత్రమే. ఇతిహాసము విషయము వేరు.

భారతేతిహాసమున ప్రధాన కథాగతి కుద్దీపకములుగా కొన్ని కథలు, నాయక ప్రతినాయకోత్సాహకారకములుగా కొన్నికథలు, ధర్మాధర్మనిర్ణయ తాత్పర్యనిష్ఠకలవి మరికొన్ని – ఈ విధముగా బహుకథలు ప్రసక్తించినవి ఇవన్నియు అంగియైన శాంతమును మించక లోబడియుండునట్లుగా నిర్వహింపబడవలయును. అపుడే ఇతిహాసము నిర్మింపబడినట్లు. ఒక ఉదాహరణమును చూపించినచో విషయము స్పష్టపడును. శాంతి పర్వమున నారదుడు సృంజయుని కూతురు సుకుమారిని ప్రేమించి పెండ్లిచేసికొన్నకథ యున్నది. ఆ కథను వ్రాయుటలో తిక్కన్నగారామె యౌవనదశావిశేషము నొక సీసపద్యమునను, నారదుడామెయందలి తగులువలన పొందిన మనోవ్యథ నొక కందపద్యమునను వర్ణించి ముగించెను. ఆమె యౌవనము నింకను కొన్ని పద్యములలో వర్ణింపవచ్చును. నారదుని మనోవ్యథ నింకను పెంచి వ్రాయవచ్చును. కాని తిక్కన్న

గారు వ్రాయలేదు ఏలయనగా నారదుడు సుకుమారిని ప్రేమించుట, పెండ్లి చేసికొనుట మొదలైన కథ దానికదిగా ప్రధానేతివృత్తమునకు సంబధించినది కాదు. ధర్మజుని చిత్తము దుఃఖమునుండి విముక్తము కావలయును. అగుటకు శ్రీకృష్ణుడు మొదలైనవారు యత్నించుచున్నారు.

ఇంతలో ధర్మరాజే సువర్ణష్ఠీవి చరిత్రము మరల వినవలయునని యున్న దన్నాడు అపుడు దానికి సంబంధించిన పర్వతనారదులకథ వినుమనుచు, మొదలిడి, నారదుని సుకుమారియందలి ప్రేమవిషయమును స్పృశించినాడు ధర్మరాజును కాలక్షేపపుమాటలలో బెట్టి వాని చిత్తతాపమును పొగొట్టు ప్రయత్నములో శ్రీకృష్ణుడాకథను చెప్పినాడు మహర్షియైన నారదు డొక ర్తు కను ప్రేమించి, శాపమునకోర్చియు, నామెను చేసికొన్నాడన్నది ఆశ్చర్య జనకమగు వార్తకాగా, ధర్మరాజు చిత్తము దుఃఖమునుండి తొలగి, తత్కాల మునకైనను, అన్యవ్యక్తికలదియగుట నాశించి శ్రీకృష్ణు డా కథ చెప్పినాడు. అట్టి కథలో సుకుమారి యౌవనమును, నారదుని విరహమును విపులముగా వర్ణించి ఆమె ఇట్టి సౌందర్యవతియనియు, నారదున కామెయందుగల ప్రేమాతి శయము ఇట్టిదనియు నిరూపించుట కూడదు. కనుకనే తిక్కన్నగారు నిరూ పించలేదు. ఏ కథ, ఏ సందర్భమున, ఏ తాత్పర్యముతో ప్రసక్తించుచున్నదో తెలిసి, అది ఆ తాత్పర్యమును సాధించునంతవరకే రచించుట కేవలము సంయ మముతో కూడిన పనివానితనము లక్షణము. సుకుమారి యౌవనదశను సీస పద్యమున వర్ణించుటయు పనివానితనమే. సీసపద్యము విస్తరించి విషయమును చెప్పుటకు వీలుకలది కందము కొద్ది విషయమును చెప్పుటకు వీలైనది నారదుడంతటి మహర్షికి చిత్తమును వికలము చేసిన ఆమె యౌవనసౌందర్యము యొక్క విస్తారమును తెలియజేయుటకు సీసపద్యము గ్రహింపబడినది. అంతటి యౌవనవతిని చూచిన నారదుని మనోవైకల్య లక్షణము చాల సూక్ష్మమైన దనుటకు కందము గ్రహింపబడినది సాధారణమైనకవి శృంగారము వచ్చిన దనగనే విజృంభించును. మహాకవి అవసరమును గ్రహించి, ఔచిత్యమును గుర్తించి, సంయమనముతో వ్రాయును ఇతిహాసకర్త మిక్కిలి సంయమనము గలవాడు కావలయును. కనుకనే ఇతిహాసకర్త మహాకవిశబ్దవాచ్యుడగు చున్నాడు. పైన నుదహరించిన కథలో శృంగారము ప్రసక్తించినది కాని అదుపులోపెట్టి చూపబడినది ఆ విధముగా నితిహాసమున ప్రసక్తికి వచ్చిన

సర్వకథలును నిర్వహింపబడవలయును. ఇతిహాసమును రచించుట కావ్యమును రచించుటకంటె కష్టమనగా నిది యర్థము.

వస్త్వైక్యమునుబట్టి రససాంద్రత యుండును. ఇతిహాసమున నేకవస్తువు పలుచగా పరచబడియుండును. అందువలన రసమును నంతే. కావ్యము నందున్న రససిద్ధివంటి సిద్ధి ఇతిహాసమున నుండదు. నాటకమునందున్న రస సిద్ధి ఒక విధముగా కావ్యమునందే యుండదు. ఆ లెక్కను జూచినచో ఇతి హాసము సంపూర్ణమైన రసస్పృష్టి కాజాలదు. కనుక ఇతిహాస విమర్శన మధిక ముగా, కథా కథనము, ఉపాఖ్యానములు, ప్రధాన పాత్రములు, అలంకార ములు మొదలైనవాటితోనున్న రచనయందలి యౌచిత్యము – ఈ విషయ ములమీద పోవలయును. ఇతిహాసమున ప్రధానకథ మధ్య మధ్య తెగిపోయి, మరల అందిపుచ్చుకొనబడుచుండుట మూలముగా, పరిమితమైన పరిధిలోనున్న యెడతెగని వస్తువుతోడి కావ్యమునందువలె, అంగిరసమును ధ్వన్యాత్మకముగా నిర్వహించుట కవకాశములేదు. ఏమాత్ర మవకాశమున్నను శాస్త్రము ప్రవ ర్తించుట మూలముగా, దానినుండి ప్రధానేతివృత్తమునందలి రసస్వరూపమును వేరుగా చూపుట కితిహాసకర్త రసమును వాచ్యము చేయకతప్పదు తిక్కన్న గారు రసమును తరచు వాచ్యము చేయుచుండునని చెప్పుటగలదు. కావ్యము నందది దోషమేయైనను, నితిహాసమున దోషముకాదు కనుకనే తిక్కన్న గారట్లు వ్రాయుచుండుట. రసమును శబ్దముచేత పేర్కొనినచో కనీసమపుడా భావమైనను కలుగును. భారతము ముఖ్యముగా శాస్త్రేతిహాసము వీలైనంత వరకు దానిని కావ్యేతిహాసముగా చేయుటకు కవిత్రయమువారు యత్నించిరి. అధికభాగము తిక్కన్నగారివలన సైనది

భారత మితిహాసమైనందున రససాంద్రత తక్కువగానుండును ఇతిహాసము నెట్లు వ్రాయవలయునో తిక్కన్నగారట్లు వ్రాసిరి. ఆంధ్రభారతము కావ్యేతి హాస మగుటవలన ప్రధానకథాసంబంధి యౌచిత్యము, పాత్రోన్మీలనము మొదలైనవి లెస్సగా పాటింపబడినవి మొత్తముమీద శాంత మాస్వాద్య మగునట్లుగా ప్రధానకథ నిర్వహింపబడినది.

# ద్వి తీ యో న్మే ష ము

## 1. సంస్కృతాంధ్ర భారతములను పోల్చి విమర్శించుట కవకాశములేదు

సంస్కృత భారతము ననుసరించి కవిత్రయమువారు తెనుగున భారతము వ్రాసినారనుట వలన, ఇది దానికి అనువాదమన్నట్లర్థమగుచున్నది అందువలన తెనుగు భారతమును గురించి మాటాడుటకు ముందు, కవిత్రయమువారు సంస్కృతముననున్న సర్వవిషయములను ననువదించినారా లేదా అనియు, అయన వాదమెట్లున్నదియు చెప్పవలసి వచ్చుచున్నది. పైకి చూచుట కీ పద్ధతి యుచితముగా నున్నట్లే కనిపించుచున్నదిగాని, అసలు విషయమునకు దిగినచో, నది సమంజసము కాకపోవుటయు, మరియు నసాధ్య మగుటయు తెలియగలదు.

సంస్కృత భారత మొకరిచేత, ఒకరకముగా వ్రాయబడి, ఒకచోట లేదు. అది అనేకమందిచేత, అనేక విధములుగా వ్రాయబడి, అనేక ప్రదేశముల యందున్నది. ఆ విధముగా సంస్కృత భారత మెచ్చటెచ్చట నున్నదో, అచ్చటచ్చట నున్నవన్నియు సంస్కృత భారత ప్రతులు. వీటియన్నింటియందును, స్థూలముగా కథమాత్రము సమానముగా నున్నదిగాని, మిగిలిన బహువిషయములయందు వైవిధ్యమున్నది[1]. ఇంత వైవిధ్యముతోనున్న సంస్కృత భారత ప్రతులలో నేది కవిత్రయమువారి భారతమునకు మూలముగా గ్రహింపవల

---

1 Even a cursary examination of these copies discloses the fact that, though in the main they agree as to the text of the Epic, the divergence among them as the portions of the same is palpably great; No one text agrees with another in the number of slokas it gives The sequence of the chapters is often found varied The arrangement of matter differs, frequently, in respect of even individual chapters Whose Adhyas or chapters, given in one edition, are looked for invain in the others. Pp.1,2. The Mahabharata V.V IYER.

యును ? అదియునుగాక నన్నయ్యగారు చూచిన ప్రతియే మిగిలిన ఇద్దరును చూచినారనుటను సమర్థించగల ప్రమాణమును లేదు. కవిత్రయమువారు విడివిడిగా నెవరెవరు, ఏ ప్రతి ఆధారముగా గ్రహించినారో చెప్పుటకు వీలున్నదా అనినచో నదియును లేదు.

నన్నయ్యగారనువదించిన సంస్కృత భారతప్రతిని ఫలానా అని నిర్ణయించుటకు డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు లెస్సగా శ్రమించిరి. ఏతచ్ఛ్రమకు వచ్చిన ఫలితము వారిమాటలోనే యిట్లున్నది "అందుచే నన్నయయే సంస్కృత భారతప్రతి ననుసరించియుండెనో యిదమిత్థమని చెప్పుట కవకాశము లేకపోయినది". "ఇది వారి గ్రంథము" "తొలిపలుకు"లోని వాక్యము. ఇక గ్రంథము నందిట్లు వ్రాయబడి యున్నది · "నన్నయ ప్రధానముగా దాక్షిణాత్యప్రతులనే యనుసరించినను, గొన్ని యుత్తరప్రతులనుగూడఁ దెప్పించి వానినిగూడఁ గలచుగాఁ బరిశీలించుచుండెననియు, నందుఁ దన కుచితములని తోఁచిన భాగములను, నామములను గథలను గూడ గ్రహించి తన భారతమున జొప్పించి యుండెనియు స్పష్టమగుచున్నది లేదా నన్నయ భారతమునందు వలెనే, యుత్తర దక్షిణ ప్రతులయందలి కథాక్రమముల మేళనముతో గూడిన యొక సంకీర్ణప్రతి యాతని కాలమున నుండెననియు, నదిగాని, దాని పుత్రికగాని యిప్పుడు మనకు లభ్యమగుట లేదనియు గ్రహింపవలయును. అందలి శ్లోకముల సంఖ్యనే నన్నయ పర్వసంగ్రహమున నొసంగియుండును. ఈ విషయమున మన మింకొక విధముగా నూహించుటకు గూడ నవకాశమున్నది నీలకంఠుడు తాను వ్యాఖ్యానము వ్రాయ నారంభించుటకు ముందు బహు ప్రాంతము లందలి ప్రతులు చూచి పాఠనిర్ణయము చేసికొనినట్లే నన్నయయు దన నాటికి లభ్యమగుచుండిన వివిధ ప్రాంతము లందలి భారత ప్రతులను దెప్పించి చదివి నారాయణభట్టువంటి మిత్రుల సాయమున గొన్ని ప్రతులందు మాత్రమే కానవచ్చు నధికపాఠముల యౌచిత్యానౌచిత్యములఁ జర్చించి యుచితమైన వానిని గ్రహించియు ననుచితములని తోఁచిన వానిని బరిహరించియు, నొక సమగ్రమైన భారతమును దానే కూర్చుకొనెననియు, నందలి శ్లోకముల సంఖ్యనే పర్వసంగ్రహమున నొసంగెననియు జెప్పవచ్చును. నన్నయ కాలమునకును, మన కాలమునకును నడుమ వ్యవధానము బహు శతాబ్దములుండుటచే నాతడు ప్రత్యేకముగా గూర్చుకొన్న యా ప్రతిలో గొన్ని

మార్పులు చేర్పులు చేరుట కవకాశముండిన కతమున సరిగా నాతని భారతమునకు మాతృకయని చెప్పదగిన ప్రతినిప్పుడు కనుగొనుట దుర్లభమగుచున్నదని తోచుచున్నది". ఈ విధముగా వ్రాయుచు మరియు చివరకు "నన్నయ చూచిన ప్రతి యిప్పుడుపలభ్యమానములైన ప్రతులన్నింటికంటెను భిన్నమైనదని తోచుచున్నది". "అతడు చూచిన ప్రతికాని దాని పుత్రికగాని రక్షితము కాలేదనియో, రక్షితమై ఎచ్చటనో యున్నను లభ్యము కాలేదనియో చెప్పవలసి వచ్చుచున్నది".

"ఈ విధముగా లభ్యములగుచున్న సాధనములను, ఆధారములనుబట్టి నన్నయ యనుసరించిన భారతప్రతి యెందులేదనియే నిర్ణయము చేయవలయు" నని వ్రాసిరి

శ్రీ అవధానిగారి గ్రంథమునుండి ఉదాహరింపబడిన బహు వాక్యముల వలన, కవిత్రయమువారి భారతమే యే సంస్కృత భారత ప్రతుల ననుసరించి యున్నదో తేల్చిచెప్పుట కవకాశములేదని స్పష్టమగుచున్నది. నన్నయ్యగారనుసరించిన ప్రతియేదో గుర్తించుటకు వీలు చిక్కనంత మాత్రమున తిక్కన్నగారనుసరించిన ప్రతిగూడ గుర్తించుటకు వీలులేదా యనవచ్చును. పర్వసంగ్రహము, శ్లోకసంఖ్య స్పష్టముగా వ్రాసిన నన్నయ్యగారి భారతమునకే మూలప్రతి ఫలానా అని తెలియరానప్పుడు, పర్వసంగ్రహముగాని, శ్లోకసంఖ్యగాని చెప్పని తిక్కన్నగారి భారతమునకు మూలప్రతి గుర్తింపబడుట కేవలమసాధ్యము అది పొసగదు

భండార్కరు పరిశోధనాలయమువారు, అనేక ప్రతులను సంపాదించి, ప్రామాణికమైన సంస్కృత భారత ప్రతిని సిద్ధము చేసినారుగదా! అదే కవిత్రయము వారి భారతమునకు మూలముగా భావింపరాదా యనవచ్చును. భావింపరాదు. ఏమనగా దేశము నందున్న అన్ని ప్రతులును లభించినవనివారు చెప్పుటలేదు. దొరికినంతవరకు ప్రతులను వారు సంప్రదించిరి. మరియు వారు కాశ్మీరమునందలి శారదాక్షరములలోని సంస్కృత భారతప్రతి అన్నింటికంటెను ప్రధానముగా వారు భావించి దానిని పుటకు పై భాగమున ముద్రించినారు. అట్లు వారు భావించుటకు హేతువు, అందలి శ్లోకములు లభించిన యన్ని ప్రతులయందును దాదాపుగా నుండుట, మరియు నది, అన్ని ప్రతులకంటె సంగ్రహముగా నున్నందున, ప్రక్షిప్తము లేమియు నందుండి యుండవని

యూహించుట. ఈ రెండు హేతువులను పురస్కరించుకొని దానిని ప్రమాణముగా వారు భావించినారు. మిగిలిన యన్ని ప్రతులయందలి శ్లోకములను, అవసరమున్నంతవరకు పుట యడుగుభాగమున ముద్రించినారు. ఆ విధముగా నిన్న నేడు తయారు చేయబడిన పరిశోధనాలయము వారి ప్రతి కవిత్రయము వారికి మూలము కాజాలదు మరియు వారు మూలమును నిర్ణయించుటలో మన తెలుగు భారతమును[1] ప్రమాణముగా స్వీకరించిరి.

కొంతలో కొంత తెనుగు భారతమునుబట్టి నిష్కర్షింపబడిన సంస్కృత భారత ప్రతిని, తిరిగి తెనుగునకు మూలముగా భావించుటలో నంతగా నర్థము కనిపించుటలేదు

కవిత్రయము వారు దక్షిణ దేశమువారు కనుక, వారనుసరించిన ప్రతి దాక్షిణాత్యప్రతియే అనుటకు వీలుండుటచేత, దక్షిణదేశ ప్రతులను ముఖ్యముగా సంప్రదించి శ్రీ పి. ఎన్. పి. శాస్త్రిగారు సంపాదించిన సంస్కృత భారతప్రతి, కవిత్రయము వారికి మూలముగా భావింపరాదా యేమి యన వచ్చును. నన్నయగారు, ఉత్తరదేశ ప్రతులను గూడ తెప్పించుకొని చూచి యుండవచ్చునని శ్రీ అవధానిగా రభిప్రాయపడుచున్నారు. అట్టిచో తిక్కనాదులు మాత్రము ఉత్తరదేశ ప్రతులను సంప్రదించి యుండరని యెట్లు చెప్పగలము ? అదియునుగాక కవిత్రయమువారు చూచిన ప్రతులు శ్రీ శాస్త్రిగారు చూచి సంప్రదించిన ప్రతులలో నున్నవని నమ్మకమేమియు లేదు. భండార్కరు పరిశోధనాలయమువారు ప్రచురించిన భారతమెట్లు కవిత్రయము వారికి మూలముకాదో అట్లే శ్రీ శాస్త్రిగారు సంపాదించినదియు కాదు.

సంస్కృత భారతము యొక్క స్థితిగతు లిట్లున్నందు వలన, కవిత్రయము వారు అనుసరించిన ప్రతి ఫలానా అని నిర్ణయింపరాకున్నది అట్టిచో నాంధ్ర భారతమును మూలముతో పోల్చుట అను విషయము లేదు. కాని దేశమున, ఆంధ్రభారతమున నిది యిట్లున్నదనగానే మూలమున నెట్లున్నదో చూడబడినదా అను ప్రశ్న పుట్టుచున్నది. అందుకొరకు ప్రతి ఆంధ్రభారత విమర్శకుడును

1. The Secondary testimonia comprise the Javanese Version, the Andhra Adaptation by the Telugu poets Nannaya Bhatta and his successors. Epics and Puranas Pp. 87.

విధిగా సంస్కృత భారత ప్రసక్తి తెచ్చుచున్నాడు తాను చూపించుచున్న శ్లోకములు గల సంస్కృత భారతప్రతి కవిత్రయమువారు చూచియున్నదికాక పోవచ్చునని లోపల అనిపించుకున్నను, పోల్చుట మాత్రము మానుకొన లేకున్నాడు. ఇది చాల చిత్రముగా నున్నది. నన్నయ తిక్కనల విషయమున లెస్సగా కృషిచేసిన ఇరువురు విద్వాంసుల విషయ మిచట కేవలము ఉదాహరణముకొరకు ప్రసక్తికి తీసుకొనిరాబడుచున్నది. నన్నయ్యగారి విషయమున కృషిచేసినది శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు. తిక్కన్నగారి విషయమున చేసినది శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు. నన్నయ్యగారనుసరించిన సంస్కృత భారతప్రతి విషయమున శ్రీ అవధానిగారి అభిప్రాయము ఇంతకు ముందు వారి వాక్యములలోనే చెప్పబడినది. శ్రీ రామకృష్ణయ్యగారు-"తిక్కననాటి మూలగ్రంథప్రతి యుత్తరదేశప్రతులలో ప్రాచీనములగు వానికిఁ జేరువగా నుండునని యూహింపదగియున్న"[1] దని వ్రాసినారు.

ఈ లెక్కలో తిక్కన్నగారు చూచిన ప్రతిని గుర్తించుట మరియు కష్టము. ఉత్తరదేశ ప్రతులలో, ఏవి ప్రాచీనములో, అవి యెన్నియో అవి తిక్కన్నగారి చేత యెట్లు సంపాదింపబడినవో, ప్రస్తుతము మనదేశమున నవి యేల లభ్యమగుటలేదో-ఈ మొదలైన బహువిషయములు విచారింపవలసి యున్నది అయినను తిక్కన్నగారు దక్షిణదేశపుప్రతులనువదలి, ఉత్తరదేశపుప్రతుల నేల గ్రహించియుండునో గూడ ఊహింపవలసియున్నది. ఇంతకును, ఆ యుత్తర దేశపు ప్రతియైనను ఫలానా అన్న నిష్కర్ష లేదు మరియు శ్రీ రామకృష్ణయ్య గారు[2] తిక్కన్నగారి భారతము ననుసరించి వ్రాయబడిన సంస్కృత శ్లోకములు కొన్ని సంస్కృత భారత ప్రతుల కెక్కినవనియు చెప్పుచున్నారు. ఇట్టి పరిస్థితులలో సంస్కృతమూలముతో నాంధ్ర భారతమును పోల్చుట ఎట్లు పొసగు ననిపించుచున్నదో అర్థమగుట లేదు శ్రీ అవధానిగారిట్లు వ్రాసిరి - "కవిత్రయము వారి యనువాదపద్ధతినిగూర్చి చెప్పునపుడు వారు పెక్కువిధముల మూలభారతమునకు మెఱుగుపెట్టిరని చెప్పుచుండుట విమర్శకులకుఁ బరిపాటి. తమకు దొరికిన యే సంస్కృత భారతప్రతినో పురస్కరించుకొని వారట్లు చెప్పి

---

1 ఆం భా. క. వి పుట 191.

2. ఆం. భా క. వి. పుటలు 181, 192, 197, 203, 213, 216, 221, 223, 231, 235, 242.

వేయుచుందురు. కాని యట్లు చెప్పుటకుముందు కవిత్రయము వారనుసరించిన భారతప్రతి యేదో నిర్ణయించుట మిక్కిలి యావశ్యకము. అట్లు చేయనిచో వారి యభిప్రాయముల కంతగా విలువ యీనక్కఱలేదు[1]" నన్నయగారనుస రించిన ప్రతి నిర్ణయించుట కంతగా శ్రమించి, చివరకు అది ఫలానా అని నిర్ణ యించుటకు దగిన ఆధారము లేమి, అట్టి నిర్ణయము కుదురదని సిద్ధాంతముచేసి, మరల ఇట్లు వ్రాయుట యెట్లు సందర్భపడుచున్నదో అవగతమగుటలేదు. శ్రీ రామకృష్ణయ్యగారును "తిక్కనాదుల ప్రతిభా విశేషము-కవితాకళా చాతుర్యమును దెలిసికొనవలెనన్నచో మూలగ్రంథముతో సన్నిహితముగా బోల్చి చూడవలసిన యావశ్యకత కలుగుచున్నది"[2] అని వ్రాసిరి. మూల గ్రంథము ఫలానా అని తెలియుట లేదాయె ఒకవేళ యేదేనొక ప్రతిమూల ముగా గ్రహించెదమన్నను, అందు తిక్కనాదుల రచనలు సంస్కృతీకరింపబడి చేరి లేవని నిర్ణయము లేదాయె

ఇట్టిచో మూలగ్రంథముతో సన్నిహితముగా పోల్చుట యననేమో బోధ కందుటలేదు.

పరిస్థితులిట్లున్నందున కవిత్రయము వారి భారతము దానికదిగా సంస్కృత భారతము ప్రసక్తి లేకుండ విమర్శింపబడుటయే యుచితతమమని పించుచున్నది భండార్కరు పరిశోధనాలయమువారు దేశమునందలి చాల ప్రతులను సంప్రదించి శ్లోకములను ముద్రించినారు గనుక, ఆ ప్రతి కవిత్రయము వారికి మూలమని గ్రహింపవచ్చుననుట, సంస్కృత శ్లోకమైన చాలును - అది తప్పక తెనుగునకు మూలమైయుండు ననుకొనుట వంటిది. ఇంతచేసి కవిత్ర యము వారి భారతము నా పరిశోధనాలయమువారి ప్రతితో పోల్చిన తేలునది యేమి ? కవిత్రయము వారి భారతమునకు మూలమనుకొనదగిన శ్లోకములు వివిధములైన కొన్ని ప్రతులలోనున్నవని తేలును. అనగా కవిత్రయము వారాయా ప్రతుల నన్నింటిని దగ్గరపెట్టుకొని, అందునందున సంగ్రహించి తెనుగున వ్రాసినారని తేలును. సంస్కృతములో నున్నదానిని నున్నట్లు తెనుగున చేసినపుడు, ఈ కవిత్రయము వారి భారతమును గురించి చేసెడు విమర్శన మంతయు, సంస్కృత భారతముమీది విమర్శనమే యగును ఇక కవిత్రయము

1. వ్రాతప్రతి-పుట 572.
2. ఆం భా. క. వి పుటలు 173, 174.

వారి మహాకవిత్వ మెచటనున్నది? ఇచట మధ్యవర్తిత్వమిట్లు చేయవచ్చును-సంస్కృతముతో పోల్చి, మూలమునలేని కావ్యశోభను తెనుగున నెట్లు నెలకొల్పి నారో చెప్పుటమంచిది-యని. అపుడు మూలమున కావ్యశోభలేదని తేలుచున్నది. మూలమున నిజముగా కావ్యశోభ లేదా? ఏల లేదు? ఈ విషయములకు ముందు సమాధాన మీయవలయును. అది సంస్కృత భారత విమర్శనము. అనగా తెనుగు భారతము నెవడు విమర్శించుటకు పూనుకొనినను, వాడు ముందుగా సంస్కృత భారతమును విమర్శించి తీరవలయు నన్నది సిద్ధాంతము అగుచున్నది ఒకవేళ అట్లే చేసినను, కొన్ని స్థలములయందు వ్యాసునికంటె కవిత్రయము వారు ఘనులుగాను, మరికొన్ని స్థలముల యందల్పులుగాను నున్నారనియేగదా తేలును? మనకు కావలసినది కవిత్రయము వారి కావ్య నిర్మాణ కౌశల్యముగాని, వారు వ్యాసునికంటె ఘనులా అల్పులా అనికాదు. ఒకచోట మనము కవిత్రయము వారు వ్యాసునకు మెఱుగుపెట్టినారందుము. కవిత్రయము వారిచేత మనమనుకొనినట్లుగా మెఱుగుపెట్టబడిన ఆ శ్లోకము, ఆ ఘట్టము నిజముగా వ్యాసుడు వ్రాసినది కానిచో?? మరి యింకొకచోట కవిత్రయము వారికంటె వ్యాసుడే పరమరమణీయముగా వ్రాసినాడందుము ఆ మూలము వ్యాసుని చేతగాక మరియొకనిచేత వ్రాయబడిన దైనచో??

మొదటి పద్ధతిలో నవసరముగా వ్యాసుడు తక్కువ చేయబడుచున్నాడు. రెండవ పద్ధతిలో నవసరముగా వ్యాసుడు గొప్పతన మాపాదింపబడిన వాడగు చున్నాడు వ్యాసుని తక్కువతనముగాని, గొప్పతనముగాని నిర్ణయించుట ఆంధ్రభారత విమర్శనములో చేరదు. అందువలన సంస్కృత భారతము యొక్క ప్రసక్తిలేకుండ, ఆంధ్రభారతము దానికదిగా స్వతంత్రముగా విమర్శింప బడుటయే యుచితమనిపించుచున్నది.

సంస్కృతముతో నాంధ్రభారతమును పోల్చిచెప్పుపద్ధతిలో నధికముగా వ్యాసనింద కనిపించుచున్నది. మరియు నది అనివార్యముగా కనిపించుచున్నది. డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు "నన్నయ అనువాద పద్ధతి"[1] అను శీర్షికను 128 పుటల గ్రంథము వ్రాసిరి. అందు "ఉపకథలలోని అనవసర విషయములను", "పునరుక్తులను", "ఔచిత్య శోభితములు" కాని వానిని,

---

1 వ్రాతప్రతి పుటలు 571-699

"అసభ్యమై అసహ్యముగానున్న" వానిని, "విశేషమేదియు లేకుండ విస్తరించి యున్న వానిని, ప్రధాన పాత్రముల "అనవసర విషయ దీర్ఘోపన్యాసము"లను; "అతిశయోక్తులు, ననౌచిత్యములు" అయిన వానిని, "కథాభాగ మేదియు లేక విసుగుకొల్పునట్టివిగా నుండు దీర్ఘవర్ణనము"లను, "ఆత్మశ్లాఘ"లతో నున్న వ్యక్తుల మాటలను; నన్నయ్యగారు సంగ్రహించినారనియు – "అనవసరమని తోచుటచేతను, ''భారత కథతో సంబంధము లే''కుండుటను, ''అనౌచిత్యమును తొలగించుటకు''ను, పాత్రముల ''శీలమునకు భంగము నాపాదించుచున్నందు" నను, ''అసభ్యమై యున్నందు"నను; "అసహజముగాను"న్నందుననను; ''నీచము గాను"న్నందుననను, "సహజప్రకృతికి విరుద్ధమగుటచే"తను, సభ్యతాదూరములై యున్నం"దుననను, నన్నయ్యగారొక కొన్నింటిని పూర్తిగా వదలినారనియు – ఇంకను నీ యుదాహరింపబడిన పద్ధతిలో నన్నయ్యగారు పెంపుచేసినారనియు, క్రొత్తగా కల్పించినారనియు, క్రమము మార్చినారనియు, సోదాహరణముగా మొదటి నూటమూడుపుటలలో నిరూపింపబడియున్నది. ఆ యా కారణముల వలన ఆ యా జాగ్రత్తలను నన్నయ్యగారు తీసికొనినారనుటచేత మూలభారత కర్త కట్టి జాగ్రత్తలేదని స్పష్టముగా చెప్పక చెప్పినట్లే యగుచున్నదికదా! – ఇది యుచితము–ఇది యనుచితము–ఇది యిట్లుండవలయును–అను జ్ఞానపర్యాప్త మైన నిశ్చయబుద్ధి వ్యాసునికంటె నన్నయ్యగారి కధికముగా నున్నదని చెప్పి నట్లగుచున్నది. ఆంధ్రభారతమునకంటె మూలముచిత రమణీయముగా నున్న దని చూపబడిన యుదాహరణములు పండ్రెండు మాత్రమే. సుమారొక రెండువందలవిషయములలో వ్యాసునికంటె నన్నయ్యగారు తెలివిగలవారు కాగా, ఒక పన్నెండువిషయములలో నన్నయ్యగారికంటె వ్యాసుడు బుద్ధి మంతుడు. వ్యాసుని బుద్ధిశక్తికంటె నన్నయ్యగారి బుద్ధిశక్తి గొప్పదనుట నన్నయ్యగారికే ఇష్టము కాదు. బుద్ధి బాహు విక్రమమున దుర్గమార్థజలగౌరవ భారత భారతీ సముద్రము దటియంగ నీదను విధాత్రునకైనను శక్యము కాదని నన్నయ్యగారు సంస్కృత భారతమును గూర్చి చెప్పుచున్నారుగదా! అట్టిచో ఈయన బుద్ధి మూలకర్త బుద్ధికంటె గొప్పదనుట అంత సమంజసముగా తోచదు సంస్కృతాంధ్ర భారతములలోని శ్లోకములను పద్యములను తీసికొని పోల్చుట కుపక్రమించినచో నట్లు చెప్పక తప్పదు తప్పనిసరిగా వ్యాసుని బుద్ధిశక్తిని తక్కువ వెలగట్టి చూపించవలసివచ్చుచున్న ఆ పోలిక విమర్శను త్యజించుటయే యుచితము. ఆంధ్రభారతము దాని కదిగా విమర్శింపబడుటయే సబబు.

ఇచట ఇట్లనవచ్చును. మూలభారతము వ్యాసుడు వ్రాసినది వ్రాసినట్లుగా లేదు. అందు చాల అసందర్భములు. అనౌచిత్యములు చేరినవి, నన్నయ్యగారు గాని కవిత్రయము వారుగాని వాటిని తొలగించి రచించినారు-అని. ఇది మాత్ర మేమైనది? వ్యాసుడు వ్రాసిన మూలగ్రంథము అక్షరము చేర్చుటకుగాని, మార్చుటకుగాని, వీలుగానంత నిబిడమైనది మధ్యలో వారిచేత వారిచేత చేర్చ బడినవన్నియు నసందర్భములు, అనౌచిత్యములు - అనినట్లైనది. దీనిని మరొక విధముగా నిట్లుచెప్పవచ్చును - సంస్కృత భారతమున నున్న మంచియంతయు వ్యాసునిది; చెడుఅంతయు మధ్యమధ్య చేర్చబడినది - అని దీని నంగీకరించినను శ్రీఅవధానిగారు చూపించిన యుదాహరణములనుబట్టి సంస్కృత భారతమున నధికముగా అనుచితములు, అధికప్రసంగములు, అసభ్యములు మొదలైనవి ఉన్నట్లు తెలియుచున్నది. అట్టి వానిని నన్నయ్యగారు తొలగించి వ్రాయనే వ్రాసిరి. ఇన్నింటిని పరిశీలించి మంచిగా చేసిన నన్నయ్య వ్యాసుడు మూలమున వ్రాసిన ఆ పన్నెండుస్థలములయందలి మంచిని యేల గ్రహింపలేదో ఊహింప వలసియున్నది అవి గ్రహింపబడకపోవుటవలన వ్యాసుని ఔచితీజ్ఞాన పర్యాప్తత నన్నయ్యగారికి లేనట్లే అర్థమగుచున్నది. నన్నయ్యగారాలోచించి గ్రహించి చేసిన మంచియు, అట్లు చేయనిదియు రెండును ఆయన బుద్ధిశక్తినే చెప్పుచున్నవి

అందువలన ఆంధ్రమహాభారతమును సంస్కృతముతో నిమిత్తము లేకుండ విమర్శించినను, అందున్న మంచినిబట్టియు, చెడునుబట్టియు, నన్నయ్యగారి యొక్కగాని, తిక్కన్నగారి యొక్కగాని బుద్ధిశక్తి తెలియబడును. అట్టిచో కవిత్రయము వారనుసరించిన ప్రతినిర్ణయము మొదలైన సాధ్యముగానివిష యములయందు ప్రయత్నము చేయనక్కరలేదు. తెనుగు భారతము స్వతంత్ర ముగా విమర్శింపబడిన సరిపోవును.

సంస్కృత భారతప్రతు లొక విధముగా లేకపోవుటచేతను-కవిత్రయము వారనుసరించిన ప్రతిగాని, ప్రతులుగాని, ఫలానా అని నిర్ణయించుట అసాధ్య ముగా నున్నందువలనను - మనకు దగ్గర అందుబాటులోనున్న ఏ సంస్కృత భారతప్రతినో తీసికొని పోల్చుట ప్రారంభించినచో వ్యాసనింద అనివార్యమగు చున్నందునను-ఏది వ్యాసుడు వ్రాసినదో, ఏదికాదో స్పష్టముగా తెలియరా నందునను - నిన్ననేడు దేశమున సంపాదింపబడిన సంస్కృత భారతప్రతులు కవిత్రయము వారికి మూలములని భావించుట ఉచితముగా లేనందునను-సంస్కృ

తాంధ్ర భారతములను పోల్చి చూచుట కవకాశములేదు నిరవకాశమైన పద్ధతి యనుసరణీయము కాదుగదా !

## 2. భారత విమర్శకులు

మనదేశమున నాంధ్రభారత విమర్శకులలో రెండు వర్గము లున్నవి. సంస్కృతాంధ్ర భారత విమర్శకులు కొందరు - ఆంధ్రభారత విమర్శకులు కొందరు మొదటి వర్గములో పేర్కొనదగినవారు డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు, శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు. వీరితోపాటు శ్రీ గుఱ్ఱం వెంకట సుబ్బరామయ్య మొదలైనవారు మరికొంద రుండవచ్చును. ఇక రెండవ వర్గము శ్రీభూపతి లక్ష్మీనారాయణరావుగారు, శ్రీ నండూరి బంగారయ్యగారు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులుగారు, శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, శ్రీ కాశూరి వ్యాసమూర్తిగారు మొదలైనవారు. మొదటి వర్గమువారు ఆంధ్ర మహాభారతముతో పాటు సంస్కృత భారతమునుగూడ విమర్శించుచుందురు రెండవ వర్గమువారు కేవల మాంధ్రభారతమునే విమర్శించుచుందురు అనగా మొదటివారు వ్యాసుడెంత ఉచితముగా వ్రాసినదియు, మరియు నెంత అనుచితముగా వ్రాసినదియు చెప్పుచుందురు. రెండవ వర్గమువారు మంచిగాని, చెడుగాని అదంతయు కవిత్రయము వారిదేయని చెప్పుదురు సంస్కృత భారత మున్నదిగనుక పోల్చవలసినదే అని మొదటివారనుచుందురు. ఎందుకు పోల్చనక్కరలేదో చెప్పకుండ రెండవ వర్గమువారు కేవల మాంధ్రభారతమును స్వతంత్రముగా విమర్శించుచున్నారు. శ్రీ నండూరి బంగారయ్యగారు మాత్రము "ఈ యందములో నెంత భాగము వ్యాసునిది ? ఎంత భాగము తిక్కనది ? అను ప్రశ్నతో నాకు జోక్యములేదు అవసరము వెంబడిని వారికి వాటాలు తెగకపోయినచో తిక్కనమీద వ్యాసుడుగాని, వ్యాసునిమీద తిక్కనగాని పంపకపు దావాలు తెచ్చుకొననిండు"[1] అని చమత్కరించి వదలిరి.

ఈ రెండు వర్గములవారిలో, ఏ వర్గమువారి మార్గము సుష్ఠయినదనుట కంటె, ఎవరిమార్గ మనుసరణీయ మన్నచో మృదువుగానన్నట్లగును. సంస్కృ

1. ఆంధ్రమహాభారతోపన్యాసములు. పుట 146.

తాంధ్ర భారత విమర్శకులధోరణి సోదాహరణముగా నిరూపింపబడిన తరువాత, ఏది అనుసరణీయమో స్పష్టపడును.

సంస్కృతాంధ్ర భారత విమర్శకులు, ఆంధ్రభారత మనువాదమని విశ్వసింతురు. ఆ విశ్వాసముతో సంస్కృతాంధ్ర భారతమును పోల్చుదురు తమ కందుబాటులోనున్న సంస్కృత భారతమునందలి విషయమునకును, ఆంధ్ర భారతమునందలి విషయమునకును కొన్ని (చాల) చోట్ల పోలికయేయుండదు. ఆ పోలిక లేకపోవుటను పురస్కరించుకొని, కవిత్రయమువారు మక్కికిమక్కిగా ననువదింప తలపెట్టలేదు. మూలమునందలి కథనాధారముగాగొని, రసవంతములైన ఘట్టములను వర్ణనలతో పెంచుచు కావ్యశోభ నినుమడింపజేయుచు నాంధ్ర భారతము నొక స్వతంత్రకావ్యమువలె తీర్చిదిద్దినారను నొక సిద్ధాంతమును ప్రతిపాదించెదరు మరియు "ప్రధానముగా వ్యాసమహర్షిది పౌరాణికనైతిక దృష్టి, కవిత్రయము వారిది కావ్యకళాదృష్టి"[1] అనియు చెప్పుదురు. ఆంధ్రమహాభారతము సంస్కృతమునందలి కేవలము కథ నాధారము చేసికొని వ్రాయబడిన స్వతంత్ర కావ్యమైనచో మూలముతోనేమి పోల్చిచూడవలయును ? కథాగతిని పోల్చిచూడవలయును. కాని వారట్లుచేయుటలేదు. ఇచట మూలములోని ఈ శ్లోకము కవిత్రయము వారిచేత వదలబడినది - ఇచట మూలమునకు మెఱుగుపెట్టబడినది- అని యీమొదలుగా పరిశీలించి చెప్పుచున్నారు. స్వతంత్ర కావ్యమైనచో నిట్టి పరిశీలనమున కవకాశములేదు. స్వతంత్రకావ్యమనగా నదియొక ప్రత్యేకమైనసృష్టి దానంతటనది స్వయంసంపూర్ణము. మరియు వ్యాసునిదృష్టి కవిత్రయమువారి దృష్టికంటె భిన్న మనుచున్నారుకదా ! దృష్టి భేదమైనపుడు కావ్యాత్మ విషయమే భేదముకలదియగుచున్నది రెండు భిన్నములైన ఆత్మలక్షణములు కలిగిన కావ్యములనుపోల్చి విమర్శించుట కవకాశము కలుగదు పోల్చి చూచినపుడేకదా భేదముండుట తెలియునది యనవచ్చును. నిజమే ఒకసారి పోల్చిచూడబడినది. అవిరెండును భిన్నమైన దృష్టులు కలిగిన వారిచేత నిర్మింపబడినవని తెలిసినది. దృష్టిభేదముచేత నిర్మాణమున భేదము కలుగుచున్నదని తెలిసినది. ఇక యే నిర్మాణమున కా నిర్మాణము పరస్పర నిరపేక్షముగా, ఆయా దృష్టుల ననుసరించి పరిశీలింపబడవలయును కనుక సంస్కృతాంధ్ర భారత విమర్శనమన్నది యుండుటకు వీలులేదు. సంస్కృతభారత

1. కవిత్రయ కవితావిమర్శనము. పుట 22.

విమర్శన ముండవలయును. ఆంధ్ర భారత విమర్శన ముండవలయును. అట్లుం డుట యుచితము. కనుకనే ఆంధ్ర భారతము దానికదిగా విమర్శింపబడవలయు నని చెప్పుట.

## 3. సంస్కృతాంధ్ర భారత విమర్శన స్వరూపము

సంస్కృతాంధ్ర భారత విమర్శకుల విమర్శధోరణి ఇక ఉదాహరణము లిచ్చి నిరూపింపబడుచున్నది. ఉదాహరణములు తిక్కన్నగారి భారతమునకే పరిమితములు.

1. రెండవనాటి యుద్ధమున పాండవులు క్రౌంచ వ్యూహమును పన్నిరి. అందు "చంచుత్వంబు భజించి ఫల్గునుండు గాండీవకపిధ్వజంబులు మెఱయం బొలిచి నిలచె" అని తిక్కన్నగారు వ్రాసిరి. ఆ సందర్భమున మూలము నందిట్లున్నది[1].

"ప్రభాతే సర్వ సైన్యానా మగ్రే చక్రే దనంజయమ్
ఆదిత్య పథగః కేతు స్తస్యాద్భుత మనోరమః
శాసనాత్పురుహూతస్య నిర్మితో విశ్వకర్మణా
ఇంద్రా యుధ సవర్ణాభిః పతాకాభి రలంకృతః
ఆకాశగ ఇవాకాశే గంధర్వనగరోపమః
నృత్యమాన ఇవా భాతి రథ చర్యాసు మారిష
తేన రత్న వతా పార్థ సచగాండీవ ధన్వనా
బభూవ పరమోపేతః స్వయంభూరివ భానునా"[2]

మూలమునందు అర్జునుని కపికేతనము విశేషణములతో వర్ణింపబడినది. తిక్కన్నగారా వర్ణనమంతయు వదలి గాండీవకపిధ్వజంబులు - అని ముందుగా గాండీవమును చెప్పి తరువాత కపిధ్వజమును మామూలుగా చెప్పిరి. ఇట్లు చెప్పుట యౌచిత్యశోభితముగానున్నది. యుద్ధమున గాండీవ ముపయోగ పడునుగాని, కపికేతన ముపయోగపడదు గదా ? అందువలన తిక్కన్నగారు, అనవసరముగా మూలముననున్న కపికేతనము వర్ణనమును తొలగించి, ముందుగా అవసరమైన గాండీవమును పేర్కొని, ఆ ప్రకారమున నర్జునుని శౌర్యశీలమును పోషించిరి.

---

1. భా. భీష్మ. 2-21.
2. (శ్రీ) మహాభారతే భీష్మపర్వణి. అధ్యా 50 - శ్లో 43-46.

2 ఎనమిదివనాటి యుద్ధమున కౌరవపాండవులు క్రమముగా కూర్మ శృంగాటకవ్యూహములను పన్నుకొనిరి. "కురుపితామహుండు కూర్మవ్యూహంబు దీర్చినం గనుంగొని ధర్మతనయుండు దృష్టద్యుమ్ను నాలోకించి కౌరవ వ్యూహంబు సూచితే దీనికిఁ బ్రతివ్యూహం బెయ్యది దాని సంఘటింపుమనిన నతండు శృంగాటకవ్యూహంబు వన్నె"[1] అని మాత్రమే తిక్కన్నగారు వ్రాసిరి.

మూలమున ఆయా వ్యూహములయం దెవరెవ రెచ్చటెచ్చట నిలచి నదియు విపులముగా వర్ణింపబడియున్నది. తిక్కన్నగారికి దొరికిన సంస్కృత ప్రతిలో నావ్యూహముల విపులవర్ణనలేదో, లేక బుద్ధిపూర్వకముగనే ఆయన వదలెనో చెప్పజాలము.

3 ఈశ్వర ప్రార్థితుడై బ్రహ్మకోపము నుపశమింపజేసికొనగా నావానినుండి జన్మించిన మృత్యుదేవత "ఆ జగన్నాథుల నలవోకవోలె గన్గొని దక్షిణమునకు"[2] పోయినదని తిక్కన్నగారు వ్రాసిరి. మూలము నా సందర్భమున నిట్లున్నది—

"సానిస్సృత్య తథా ఖేభ్యో దక్షిణాం దిశమాశ్రితా
స్మయమానా చ సావేక్ష్య దేవా విశ్వేశ్వరా వుభౌ"[3]

బ్రహ్మను, ఈశ్వరుని చూచుచు మృత్యుదేవత నవ్వుచు బోయినట్లు మూలమునన్నది. మూలమునందున్న నవ్వుచుబోవుటకు ప్రయోజనములేదు మరియు నంత యుచితముగా గూడ లేదు. దానిని తిక్కన్నగారు అలవోకవోలె గన్గొని యనుచు మనోజ్ఞముగా ననువదించినారు—బ్రహ్మ వద్దకు వచ్చి యేడ్చుచున్న మృత్యుదేవత మూలమున నిట్లు వర్ణింపబడినది—

"వినీయ దుఃఖ మబలా ఆత్మన్యేవ ప్రజాపతిమ్
ఉవాచ ప్రాంజలిర్భూత్వా లతేవావర్జితాపునః"[4]

మూలమునందలి యుపమానమును తిక్కన్నగారు కొద్దిగా మార్చి "గాడ్పున నల్లాడు తీగతెఱంగున"[5] అని వ్రాసిరి వంచబడిన తీవచందమున

1. భా. భీష్మ. ఆది. 3-69.
2. భా. ద్రోణ. ఆది. 2. 166.
3. శ్రీ మహాభారతే-ద్రోణపర్వణి-అధ్యా. 53-శ్లో. 19.
4. శ్రీ మహాభారతే-ద్రోణపర్వణి-అధ్యా. 54-శ్లో. 1.
5. భా. ద్రోణ. ఆది. 2-167.

మేను వంచి మృత్యుదేవత బ్రహ్మతో మాటాడినదనుటకంటె గాడ్పు నల్లాడు తీగ తెఱంగున చలించి యంజలి ఘటించి విరించితో మాటాడినదనుట యుచిత తరముగా నున్నది. తిక్కన్నగారు చేసిన కొద్ది మార్పువలన మృత్యుదేవత లోపలపడు భయము వ్యక్తమగుచున్నది ఆమెకు జీవసంహారము చేయుట ఇష్టము లేదు బ్రహ్మ చేయక తప్పదనుచున్నాడు బ్రహ్మ కెదురుచెప్పలేక, అంగీకరించుటకు నిష్టములేక, ఏమిచేయుటకును పాలుపోని మృత్యుదేవత మనస్సు యొక్క తత్కాలము నందలి స్థితిని ప్రతీయమానముచేయుచు, తిక్కన్నగారు కల్పించిన యుపమాన మెంతయు తగియున్నది

4. శాంతిపర్వమున ధర్మరాజునకు భీష్ముడు రాజధర్మముల నుపదేశించి నాడు. ఆ సందర్భమున మూలమున నొక శ్లోక మిట్లున్నది—

"యథాహి గర్భిణీ హిత్వా స్వంప్రియం మనసోనుగమ్
గర్భస్య హిత మాధత్తే తథా రాజ్ఞాప్యసంశయమ్."[1]

దానికి తిక్కన్నగా రనువాద మిట్లు చేసిరి.

"వినుగర్భిణి ప్రజ బ్రదుకున
కనురూపములైన యట్టి యాహారంబుల్
గొనుగతిఁ బతి ధరణీప్రజ
మనికికిఁ దగ నడచునది తమకిగాకెపుడున్."[2]

గర్భప్రియమును చూచుకొని మనోనుగుడైన ప్రియుని గూడ గర్భిణి త్యజించు నని లోకస్వభావము మూలమున మనోహరముగా చెప్పబడినది. తిక్కన్నగారి యనువాదమున మూలము నందున్న లోకస్వభావ ప్రకటనము లోపించినది.

5. సృంజయుని కూతురు సుకుమారి యనుదానిని నారదుడు ప్రేమించి, పర్వతుని శాపమునకోర్చి కూడ వివాహము చేసికొన్న కథ శాంతిపర్వమున నున్నది. నారదున కామెయందు తగులు కలిగిన విధము మూలమున—

"తస్యాస్తే నోపచారేణ రూపేణాప్రతిమేనచ
నారదం హ్యాచ్ఛయస్తూర్ణం సహసైవాభ్యపద్యత
వవృధేహి తతస్తస్య హృది కామో మహాత్మనః
యథా శుక్లస్య పక్షస్య ప్రవృత్తౌ చంద్రమాశ్శనైః"[3]

1. శ్రీమహాభారతే-శాంతిపర్వణి-అధ్యా. 57. శ్లో. 44.
2. భా. శాం. 2-179.
3. శ్రీమహాభారతే-శాంతిపర్వణి-అధ్యా 30-శ్లో. 17, 18.

అని యీ మాత్రముగనే చెప్పబడి యున్నది. మూలమున నతిక్రమించి తిక్కన్నగారు, ఆ సందర్భమున సహజ సుందరములుగా రెండు పద్యములు వ్రాసిరి.

అల్లదినంబున యనువు మైకొన జూచు
 నడపుకాంతికి వింత తోడపుగాగ
వెడవెడ నూగారి వింతయై యేర్పడు
 దేరని వళులలో నారు నిగుడ
నిట్టలు ద్రోచుచు నెలవుల కలమేర
 లెల్లను బిగి యెక్కి యేర్పడంగ
దెలుపును గప్పును వెలయంగ మెఱుగెక్కు
 తారకంబులఁ గఠితనము దొడర

జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికిఁ దెలుప సృంజయుని పుత్రి
మెలగు విధంబు నారదునకు దగులొనర్చె [1]

నారదుడు మదన బాణా
సారము దను బొదువ ధైర్యపార మెడలి దు
ర్వార మనోవ్యథ వంతం
గూరి క్రమంబున గృశాంగకుండయ్యె—.[2]

నారదుని మనస్సు సుకుమారియందు తగుల్కొనుట కామె అవయవసౌష్ఠవము దినదినాభివృద్ధి యగుట హేతువుగా తిక్కన్నగారు కల్పించుట సహజ మనోజ్ఞముగా నున్నది. ఆ కల్పనవలన సుకుమారిని వర్ణించుటకు తిక్కన్నగారవకాశము కల్పించుకొనిన వారైరి. క్రొత్తగా యౌవనవతియైన సుకుమారిని వర్ణించి, నారదు డామెయందు బద్ధబుద్ధి యగుటకు తగిన రసవంతమైన యుద్దీపనమును తిక్కన్నగారు కల్పించెను. మూలమున, నామె యుపచారములవలన, మంచి రూపమువలన నారదుడు మోహితుడైనాడని పొడిపొడిగా నున్నది. అందువలన

1 భా శాం. 1-248
2 భా శాం 1-249

మూలమునలేని సమగ్రత తెనుగున వచ్చినది. తరువాతి తెనుగు ప్రబంధకవులు చేసిన స్త్రీల అంగాంగవర్ణనమున కాపద్యము మూలభూతముగా కనిపించుచున్నది

6. ఆనుశాసనికమున అష్టావక్రుడు సుప్రభను వివాహమాడుటకుగాను పరీక్షింపబడిన కథ యున్నది అష్టావక్రుడు ఉత్తరదిశాసతీ సౌధమును చేరుకొని నాడు. ఆమె ఫలానా అని ఆయనకు తెలియదు. వయోరూప విలాసినీజనము వానిని స్వాగత మడిగి లోనికి తీసుకొని పోయినది అప్పుడు తిక్కన్నగారిట్లు వ్రాసిరి.

"......పరమాదరంబునం దోడ్కొని పోవునప్పుడు అప్పొలతుల యొప్పు సూడ్కులకుం జిత్తంబునకు వేడ్కలు సేయం జాలిసను లోలత్వరాహిత్యంబున నత్యుదాత్తుండగుచుం జని యభ్యంతరమందిరంబున వివిధరత్నరశ్మివిరాజితం బైన పర్యంకంబున నార్యమూర్తియు ధవళవసనాంగరాగియు రుచిరాభరణ భూషితయు ప్రౌఢవయస్కయు నగు నొక్క వనితం గని మేలయ్యెడు మనుచు నిలిచిన నయ్యిందువదన యిందు రండని పలుకుచు ప్రత్యుత్థానముచేసె"ను[1]. దీనికి మూలము నందున్న శ్లోకము లివి.

"నానారూప స్వ్యత్తతిభిః కన్యాస్సర్వా మనోహరాః
యాం యా మపశ్యత్కన్యాం వై సా సా తస్య మనోహరత్
న చ శక్తో వారయితుం మనోऽస్యాబాధా వసీదతి
తతో ధృతి స్సముత్పన్నా తస్య విప్రస్య ధీమతః
అథ తం ప్రమదాః ప్రాహు ర్భగవాన్ ప్రవిశత్వితి
సచ తాసాం సురూపాణాం తస్యైవ భవనస్యహి
కౌతూహల సమావిష్టః ప్రవివేశ గృహం ద్విజః
తత్రాపశ్యజ్జరాయుక్తా మరజోంబర ధారిణీమ్
వృద్ధాం పర్యంక మాసీనాం సర్వాభరణ భూషితామ్
స్వస్తీతి తేన చైవోక్తా సా స్త్రీ ప్రత్యవదత్తదా
ప్రత్యుత్థాయ చ తం విప్ర మాస్యతా మిత్యువాచహ"[2].

తనను తీసికొనిపోవుటకు లోపలనుండి వచ్చిన కన్యల రూపసౌభాగ్యముచేత హరింపబడుచున్న తనమనస్సును నిలుపబట్టుటకు నష్టావక్రు డశక్తుడైనట్లుగా

---

1. భా. అను. ఆ. 2.
2. శ్రీమహాభారతే-అనుశాసనపర్వణి-అధ్యా. 19-శ్లో. 68-73.

మూలమునందున్నది. అనగా స్త్రీ విషయమున నిగ్రహము కోల్పోయినవాడుగా నష్టావక్రుడు మూలమున కనిపించుచున్నాడు తిక్కన్నగారు వాని విషయమున లోలత్వరాహిత్యంబు చెప్పి, అత్యుదాత్తు డగుచు వారి ననుసరించినాడనుచు వ్రాసి, హృదయదుర్బలత రూపమైన తక్కువదనము వానియందు లేకుండజేసి, అస్ఖలిత బ్రహ్మచారియైన వాని శీలమున కుచితరీతిని మెఱుగుపెట్టెను. ఇప్పు డిట్లు లోలత్వరహితుడుగా చెప్పబడినందువలన, తరువాత కథలో నుత్తరదిశాసతి ప్రక్కలోజేరి కౌగలించుకొన్నను నాతడు వికారమును చెందలేదని చెప్పబడు విషయమున కుత్కర్షాపాదకముగా నున్నది

మూలమున నష్టావక్రుడు కౌతూహలసమావిష్టుడై గృహము ప్రవేశించి నట్లున్నది. ఆ సమయమున వానికంత కుతూహల మేలకలిగినదో సరియైన కారణము కానరానందున తిక్కన్నగా రా విషయమును వదలిరి. దానిని వదలి, అష్టావక్రుని విషయమున నత్యుదాత్తను కల్పించి, వాని పాత్రను సముచితముగా పోషించిరి అష్టావక్రుడు లోనజూచిన స్త్రీ జరాయుక్తయని, వృద్ధయని స్పష్ట ముగా నున్నది. ఆమెయే తరువాతి కథలో, వాని ప్రక్కలోజేరి కౌగిలించు కొని పరీక్షింపవలసినది. అట్టి యామెను వృద్ధగా చెప్పుట యుచితము కాదని కాబోలు తిక్కన్నగారు, ఆమె ప్రౌఢవయస్కయని మూలమును మార్చి వ్రాసి నారు. ప్రౌఢవయస్క యగుట వలననే ఆమెయే స్వయముగా నష్టావక్రుని కవ్వించి, తనను మోహింపజేయుటకు యత్నించినదని చెప్పుట సహజముగా నుండును మూలమునందున్న అసహజత్వమును తిక్కన్నగారు తొలగించి వ్రాసిరి.

7. భీష్ముడు ధర్మరాజునకు శ్రీకృష్ణ ప్రభావము నెరింగించు సందర్భ మున మూలమున విష్ణుసహస్రనామము లున్నవి తిక్కన్నగారు వాటి నన్నింటిని యనువదింపక – "విశ్వంబు, విష్ణుండు, వషట్కారుండు, భూతభవ్య, భవత్ప్రభువను నివి మొదలై రథాంగపాణి, యక్షోభ్యుండు. సర్వప్రహరణా యుధుండని యెడు నివి తుదగాగల సహస్రనామంబు లుపన్యసించి[1]" అని మాత్రమే వ్రాసి చక్కగా సంగ్రహించిరి. మూలము నందలి విష్ణుసహస్ర నామములును "విశ్వం విష్ణు ర్వషట్కారో భూతభవ్య భవత్రభుః[2] –" అని

1. భా. అను.

2 శ్రీమహాభారతే-అనుశాసనపర్వణి-అధ్యా.149- శ్లో. 15-121.

మొదలై "రథాంగపాణి రక్షోభ్య స్సర్వప్రహరణాయుధః" అనియే అంశముగు చున్నవి.

8. మౌసలపర్వమున బోయ లర్జును నోర్చి యాదవాంగనల సొమ్ముల నపహరించుకొని పోయిన తరువాత, రుక్మిణి మొదలైన శ్రీకృష్ణుని భార్యల యగ్నిప్రవేశానంతరము, దుఃఖితుడై పార్థుడు వ్యాసుని వద్దకు పోయినాడు. ఆ యర్జునుని పోయి వ్యాసునితో మాటాడుటను తిక్కన్నగారిట్లు వ్రాసిరి—

పోయి మరున్నదిపొంత యాశ్రమమున
నర్హాసనమున నేకాంత నిరతి
నాసీనుడై యున్న యమ్మహాత్ముని గని
యత్యంతభక్తి సాష్టాంగ వినతి
యాచరించిన జూచి యమ్మహానీయ వి
ద్యానిధి నేరంగ నతని బిలిచి
తన సమీపంబున నునిచి తద్వద నమ్ము
గనుగొని నిన్నెఱుగంగ రాదు

వెడ మొగంబైన దిది, యేను విజయ మెట్ట
కేల కెరిగితి నిదియేమి?[1]—

ఇదంతయు మూలమున లేదు తిక్కన్నగారు కల్పించిరి. ఆ సందర్భమున మూలశ్లోకము లీ విధముగా నున్నవి—

"ప్రవిశ న్నర్జునో రాజ న్నాశ్రమం సత్యవాదినః
దదర్శాసీన మేకాంతే మునిం సత్యవతీసుతమ్
సతమాసాద్య ధర్మజ్ఞ ముపతస్థే మహావ్రతమ్
అర్జునోఽస్మీతి నామాస్మై నివేద్యాభ్యవద త్తతః
స్వాగతం తేఽస్త్వితి ప్రాహ మునిస్సత్యవతీ సుతః
ఆస్యతామితి చోవాచ ప్రసన్నాత్మా మహామునిః
తమప్రతీతి మనసం నిశ్శ్వసంతం పునఃపునః
నిర్విణ్ణమనసం దృష్ట్వా పార్థం వ్యాసోఽబ్రవీదిదమ్[2]."

---

1. భా. మౌస.
2. శ్రీమహాభారతే-మౌసలపర్వణి-అధ్యా. 8- శ్లో. 1-4.

మూలమునందలి మొదటి రెండు పాదముల యర్థమునే తిక్కన్నగారు గ్రహించిరి. తరువాత తిక్కన్నగారి పద్ధతి వేరుగానున్నది. నమస్కరించిన యర్జునుని దగ్గరకు రమ్మనుట, వాని ముఖమును పారజూచుట, నేను నిన్ను గుర్తుపట్టజాలకపోయితి ననుట, నీ ముఖమిట్లు వాడిపోయినదేమి యనుట, ఇట్లగుటకేమి వచ్చినదనుట – ఈ మొదలుగా వ్యాసుడు అర్జునుని పలుకరించుట యెంతయు సహజముగా నున్నది వృద్ధుడైనవాడు తన మనుమనితో లోకమున మాటాడినంత సహజసుందరముగా తిక్కన్నగారు వ్రాసిరి. మూల మసహజ ముగా నున్నది

9 మహాప్రస్థానిక పర్వమున, పరీక్షితునకు రాజ్యాభిషేకముచేసి, వానిని సుభద్ర కప్పజెప్పుచు. మూలమున ధర్మరాజా మెతో నిట్లనినాడు—

"ఏష పుత్రస్యతే పుత్రః కురురాజో భవిష్యతి
యదూనాం పరిశేషశ్చ వజ్రోరాజా కృతశ్చహ
పరిక్షిద్ధాస్తినపురే శక్రప్రస్థే చ యాదవః
వజ్రోరాజా త్వయా రక్ష్యో మా చాధర్మే మనః కృథాః"[1].

సుభద్రతో ధర్మరాజా పరీక్షద్వజ్రుల విషయము నేల చెప్పెనో మూలమునలేదు. తిక్కన్నగారందుల కొక చక్కని హేతువు కల్పించిరి. "తారు గృహంబుదొలగి చనునెడ నవ్వనిత పిఱుదచనుదేకుండ, అతడు నియమించినవాడై యూరడిల్లె"[2] నని వ్రాసిరి ఈ హేతువెంతయు సముచితముగా నున్నది

10 ఇట్లే కుర్కుర విషయముగా నింద్రయుధిష్ఠిరులకైన సంవా దానంతరమున తిక్కన్నగారొక అమూలకమైన పద్యమును వ్రాసిరి—

"కావున నాకలోకపు సుఖం బటులుండగ నిమ్ము దేవ! నీ
భావము నిల్పు నాదెస గృపాభరితంబుగ సారమేయ సం
భావనసేత దోసముగ బట్టమి నాకు వరంబు నీవు వో
మ్మీ వనభూమి నుండెద సమిద్ధ తపంబున నిన్ను గొల్చుచున్[3]"

1. శ్రీమహాభారతే-మహాప్రస్థానికపర్వణి-అధ్యా. 1- శ్లో. 8, 9
2. భా. మహాప్రస్థా. 1-13.
3. భా. మహాప్రస్థా. 1-59.

ఈ పద్యమంతకు ముందు జరిగిన సంవాదమున కంతకు నుపసంహార రూపమున నెంతయు తగియుండుటయేగాక ధర్మరాజుయొక్క ఆశ్రితరక్షణమునందలి స్థిరనిశ్చయమును, ఇంద్రుని యందలి భక్తిభావమును వెల్లడిచేయుచు, వానిని శీలమును పోషించుచున్నది.

ఇంతవరకు సంస్కృతాంధ్ర భారతవిమర్శకుల విమర్శధోరణి నిరూపించుటకొరకు పది యుదాహరణములు చూపబడినవి. ఈ విధముగా నెన్నియేని యుదాహరణము తీయవచ్చును. అభిప్రాయములు చెప్పవచ్చును మఱియు తత్కాలమున నా యభిప్రాయములు సముచితములే అనుబుద్ధిని పుట్టింపనచ్చును. కాని అది అటు సంస్కృతభారతమునుగాని, ఇటు తెనుగుభారతమునుగాని విమర్శించుటకాదు. పూర్వాపరములమీద మరికొంత విచారింపబడినచో దాని కానితనము తెలియును పైన ఉదాహరింపబడిన పదియంశములే పునర్విచారము చేయబడినచో నా విషయము స్పష్టము కాగలదు

1. రెండవనాటి యుద్ధమున అర్జునుడు భీష్మునిపై విజృంభించినాడు. ఆ నాటి పోరు చూచి సిద్ధచారణులు ప్రశంసించినారు అట్టి యుద్ధము తరువాత జరుగుచున్నందున, మొదట మూలమున నర్జునుని కేతనవర్ణనము తదుపస్కారకముగా చేయబడినది. అది గంధర్వనగరోపమనియు, నభోంతరాళమున నృత్యము సేయుచున్నదివలె నున్నదనియు చెప్పబడుటవలన, అర్జునుని పరాక్రమాతిశయము భూమ్యాకాశములు పట్టుటలేదన్న స్ఫూర్తియు, మరియు నా కేతనము సిద్ధచారణులను, అర్జునునినాటి యుద్ధము చూచుటకు రండని యాహ్వానించుచున్నదివలె ఆకాశాంచలములయందు కదలాడుచున్న వస్త్రాంచలము, మూలమునందలి వర్ణనమువలన సాధింపబడుచున్నది అర్జునుడు నిత్యమును గాండీవమును ధరించియే యుండును అది అర్జునుని విషయమున విశేషము కాదు తిక్కన్నగారు గాండీవమును ముందుగా పేర్కొని సాధించినదేమియు కానరాదు. మూలకర్త కేతనమును వర్ణించి, నాటి యుద్ధమున కనుకూలమైన విశేషార్థమును సాధించెను. రచన విశేషార్థస్ఫోరకముగానే ఉండవలయును. మూలకర్తవలె ఆ సందర్భమున తిక్కన్నగారు రచన చేయలేదు. గాండీవ కపిధ్వజంబులు మెఱయ నర్జును డుండెనని వ్రాయుట వాని శౌర్యశీలమును పోషించుట కాజాలదు. సామాన్యమైన దైనందిన విషయమే వాడును తిక్కన్న గారిచేత అర్జునుని గురించి చెప్పబడినది. ఇచట మరొక విషయము తీసికొని

రాబడుచున్నది. యుద్ధమున గాండీవ ముపయోగించునుగాని, కేతన ముపయో గించదు కనుక తిక్కన్నగారు మూలమునందున్న కేతనము వర్ణనము వదలినా రని చెప్పబడినదిగదా ! మరి ద్రోణుని నాల్గవనాటి యుద్ధమున, రణరంగమునకు బయలుదేరివచ్చు అర్జునుని "చూపులు మిఱుమిట్లుగొనగ, నేపారిన వానరేంద్రు నెసంకంబున నుద్దీపితమగుపడగ భయదరూపంబున గ్రాలగా నరుడు దోతెంచె" నని అధికముగా కేతనమును వర్ణించుచు తిక్కన్నగారేల వ్రాసిరి ? ద్రోణుని నాల్గవనాటి యుద్ధమనగా నాడు సైంధవవధ జరిగినది సైంధవుని చంపబోవు నర్జునునకు కేతన ముపయోగించునని తిక్కన్న గారంతగా వర్ణించినారని చెప్పుటకు వీలులేదుకదా ? రెండవనాటి యుద్ధమున తిక్కన్నగారు మూలము నందున్నను, కేతనము, వర్ణనము త్యజించుటకు హేతువు చెప్పు నపుడీ ద్రోణుని నాల్గవనాటి యుద్ధము స్ఫురించితీరవలయును అట్లు స్ఫురించినచో నామాట చెప్పుట పడదు. ఎక్కడికక్కడ ఒక చిన్నపరిధిని నిర్మించుకొని, యౌచిత్యము—పాత్రముల శీలపోషణము పరిశీలింపబడరాదు.

2 ఎనమిదవనాటి యుద్ధమున కౌరవపాండవుల వ్యూహములను తిక్కన్నగారు వర్ణింపకపోవుటకు హేతు వాయనకు దొరికిన ప్రతిలో, అట్టి వర్ణనము లేకుండవచ్చునని, ప్రతులయందుగల వైవిధ్య మాశ్రయింపబడినది. అట్లే రెండవనాటి యుద్ధము విషయమునను కేతనవర్ణనము లేనిప్రతి తిక్కన్న గారికి దొరికి యుండునని యేల ఊహింపబడగూడదు ? మరియు తిక్కన్నగారా యెనిమిదవనాటి వ్యూహావర్ణనము బుద్ధిపూర్వకముగానే వదలినారేమో చెప్ప జాలమనబడినదేగాని, బుద్ధిపూర్వకముగా వదలి యేమి సాధించెనో చెప్పబడ లేదు. ఒకడొక పనిని బుద్ధిపూర్వకముగా చేసినాడనునది, దానివలని ప్రయోజన మునుబట్టియే నిర్ణయింపబడును. అట్టి నిర్ణయము తిక్కన్నగారి విషయమున సంస్కృతాంధ్రభారత విమర్శకుని విమర్శచేయుటలేదు.

3 మృత్యుదేవత బ్రహ్మను, ఈశ్వరుని జూచుచు నవ్వుచు పోయినదనుట యుచితముగా లేదని తిక్కన్నగా రలవోకవోలె గన్గొనుచు పోయినదని యుచి తముగా వ్రాసినారని చెప్పబడినది. అలవోకవోలె గన్గొనుట యనగానేమి ? అలవోకవోలె యన్నది క్రియావిశేషణము. దానికి—అవలీలగా, అనాయాసముగా, సవిలాసముగా, యాదృచ్ఛికముగా, దైవికముగా, అశ్రద్ధ (తో)గా, అనాదర

ముగా–అని యిన్ని యర్థము లున్నవి[1]. ఆ ప్రకరణమున సవిలాసముగా ననిగాని, అనాదరముగా ననిగాని యర్థము చెప్పవలయును. సవిలాసముగా మృత్యుదేవత వారిని కనుగొనుటను చెప్పినచో "స్మయమానా" అని యున్న మూలమునందలి యర్థమేవచ్చును అపుడు తిక్కన్నగారు మార్చిచెప్పిన యర్థమేమియులేదు. సంస్కృతాంధ్ర భారత విమర్శన మే దోషమును మూలమునందు చూపించు చున్నదో, ఆ దోషము తిక్కన్నగారి యందును వర్తించుచున్నది అనాదరము గానని చెప్పినచో, బ్రహ్మరుద్రుల యందా మృత్యుదేవత కంతగా ననాదర మెట్లు సంభవము?–మూలమునకంటె తిక్కన్నగారి మార్పునందేమి గుణమును కానవచ్చుటలేదు. మూలకర్త "స్మయమాన" యని స్పష్టముగా వ్రాసినాడు తిక్కన్నగారదియు లేదు. ఇక రెండవది – "ప్రాంజలిర్భూత్వా లతేవావర్జితా" అని మూలకర్త, ప్రాంజలి ఘటించి బ్రహ్మముందు నిలబడిన మృత్యుదేవత యెట్లున్నదో చెప్పినాడు. వంచినతీవవలె నున్నది. తిక్కన్నగారామె యెట్టి స్థితిలోనుండి అంజలి ఘటించినదియు చెప్పెను. "అక్కాంత గాడ్పున నల్లాడు తీగ తెఱంగు నంజలించియంజలి ఘటించిన"దని తిక్కన్నగారు వ్రాసిరి. తిక్కన్నగా రామె యప్పటి మనోభావము లామె శరీరాంచలముల మీదనుండి ప్రతీయ మానము లగుట నుద్దేశించినట్లు కనిపించుచున్నది. మూలకర్త, అంజలిఘటించిన తరువాతి మృత్యుదేవతాస్వరూపమును వర్ణ్యముగా జేసికొని ఉపమానమును కల్పించెను. అంజలిఘటించుట కవ్యవహితపూర్వమైన మృత్యుదేవతా స్వరూపము నుపమేయముగా నొనరించి తిక్కన్నగారు వ్రాసిరి.

వర్ణ్యవస్తువేకమే యైనను దశలు భిన్నములు. అట్టి భిన్నదశల నిరువురు వర్ణింపగా నొకదానికంటె మరొకటి యుచితమని చెప్పుట కెట్లు కుదురును? మూలకర్త వ్రాసినది దాని పరిధిలో నది బాగున్నది. తిక్కన్నగారు వ్రాసినది దీని పరిధిలో నిది బాగున్నది. అందువలన నా రెండింటిని పోల్చి తిక్కన్నగా రుచితతరముగా వ్రాసినారని చెప్పుటకు వలనుపడదు.

4. గర్భస్థమైన శిశువు యొక్క బ్రతుకుదల కనువైన యాహారమునే గర్భిణి తీసుకొనునట్లుగా, రాజైనవాడు తన రాజ్యములోని సర్వజనులయొక్క, సుఖసంతోషముల తోడియునికికి, మరియు మనికికి, అవకాశము కల్పించినవాడై

1 సూర్యనారాయణాంధ్ర నిఘంటువు–సం. 1–పుటలు. 305, 306.

ప్రవర్తింపవలయును తమకి కారాదు. ఇది తిక్కన్నగారి పద్య తాత్పర్యము. ఇందు గర్భిణి యుపమానము; రాజుపమేయము. రాజు గర్భవతియైన స్త్రీ వంటి వాడు ఆయన రాజ్యములోని జనులందరును తద్గర్భవాసగుప్తినున్న శిశువులు. శిశువు బ్రతుకు మీద గర్భిణి దృష్టిని కేంద్రీకరించినట్లుగా, రాజు ధరణిజనుల యొక్క బ్రతుకుమీద దృష్టి నుంచవలయును. ఆ యుపమానమువలన రాజునకు, ప్రజకునుగల సంబంధము యొక్క పరమోదాత్తమైన స్థితి స్ఫురించుచున్నది. ఉపమానమెప్పుడును, ఉపమేయము నుద్దీపింపజేయుటకే కల్పింపబడును. ఉపమేయమునందలి పరమార్థమును శ్రోతకుగాని పాఠకునకుగాని బుద్ధి కందిచ్చునది ఉపమానము. ఉపమాన మాధారముగా ఉపమేయము భావింప బడవలయును అంతేగాని కేవల ముపమానమును బట్టుకొని, ఇది యెంతగా లోకస్వభావమును వెల్లడించుచున్నది ? అని ఆశ్చర్యపడరాదు. ఎప్పుడును నుపమేయమునకంటె ఉపమానమునకు ప్రాధాన్యమురాదు. ఉపమాన ప్రయోజన మంతయు నది, ఉపమేయార్థమును దీప్తిమంతము చేయుటయేగాని మరొకటి కాదు కనుక తిక్కన్నగారు వ్రాసిన ఆ కందపద్యములలోని మొదటి రెండు పాదములను మించియున్న యుపమానము తరువాతి యుపమేయము కొరకని తెలియవలయును. మూలముననున్న మనోనుగుడైన ప్రియుడు – మొదలైనది ఉపమానము పరిధిలోనిదికాదు. శిశువు బ్రతుకున కనుకూలమైన యాహారమును గర్భిణి గ్రహించునన్న విషయము తిక్కన్నగారు వ్రాసినంత స్పష్టముగా మూలకర్త వ్రాయలేదు మూలకర్త లోకస్వభావమును వెల్లడించినాడని తృప్తిపడుటకా శ్లోకమందుకు ప్రవర్తించలేదు రాజధర్మమును నిరూపించుటకు ప్రవర్తించినది అచట చేయబడు సర్వరచనయు తదుత్కర్షా పాదకముగా నుండవలయును. తిక్కన్నగారట్లు వ్రాసిరి. మనోనుగుడైన ప్రియునిప్రసక్తి శృంగారరేఖాసంవలితము. అది తత్ప్రకరణమున నక్కరకురానిది దానిని తొలగించుటతోపాటు తిక్కన్న గారింకొక చిత్రమైన పనిచేసెను. తమకి కారాదని రాజును గురించి పద్యము చివర చెప్పెను. ఇది యుపమానమువలన నుపమేయమునకు దీప్తిని కలిగించుటకంటె వేరైనది గర్భిణి విషయమున చెప్పబడని తమకి కాకుండుట రాజు విషయమున చెప్పబడుటలోని ఆంతర్యమిది- గర్భిణికి శిశువు తననుండి వేరుకాదు. అనగా నామె శరీరము లోపలనే శిశు వున్నది. రాజునకు ప్రజలెంత దగ్గరివారైనను సూక్ష్మముగా విచారించినచో గర్భిణికి శిశువంత దగ్గరవారుకారు అందువలన గర్భిణి తన శిశువు బ్రతుకున

కననుకూలమైన దేనియందుగాని తమకికాదు అయినచో నామె ప్రాణము మీదికే వచ్చును. రాజు విషయమంత సూక్ష్మమైనదికాదు. రాజునకు ప్రజలు, శిశువు లనుకొనబడవలసినవారు అందువలన రాజొకచో తమకి యగుట కవకాశ మున్నది అట్లు కాకుండ జాగ్రత్తగా నుండవలయునని తిక్కన్నగారు చివర చెప్పిరి లోభము నుండి, తొందరపాటు నుండి, తనను తాను నిగ్రహించుకొన లేనివాడు తమకి. రాజట్లు కారాదు. గర్భిణి కాదు ఇది భేదము. ఉపమానోపమేయములయందలి ధర్మమును సూక్ష్మసూక్ష్మముగా పర్యాలోచనచేసి తిక్కన్నగారు వ్రాసిరి. మూలకర్త స్థూలముగా వ్రాసికొని పోయెను. తిక్కన్నగారి పద్యము నుండి పుట్టుచున్నంత యర్థము మూలమున పుట్టుటలేదు. తిక్కన్నగారి పద్యము ప్రకరణార్థమును పరమసుందరముగా భాసింపజేయుచున్నది.

5. సృంజయుని కూతురునందు నారదుని మనస్సు లగ్నమైనగను సందర్భమున తిక్కన్నగారు వ్రాసిన దానికంటె మూలమే ఉచితముగానున్నది. సుకుమారియొక్క "చరణములును, నడుము, చన్నులు, కన్నులు, జవ్వనంబు చెన్ను నివ్వటిల్లుచునికి" తెలుపుడు చేసినవని తిక్కన్నగారు వ్రాసిరి అనగా నారదున కామె పరిచర్యచేయుట ప్రారంభించిన తరువాత నామెకు యౌవనము సంప్రాప్తించినదని యర్థమగుచున్నది. నారదపర్వతులా సృంజయునితో "కొన్ని దినంబులు" అటవసియింతు మనిరి కొన్ని దినములని చెప్పబడిన కాలము నెంత విస్తరించినను, రెండు మాసములకు మించదు. ఆ రెండు నెలలలో నామె యౌవనవతి యగుటయు, నారదుని మనస్సామెయందు లగ్నమగుటయు చెప్పబడినట్లైనది. "— జవ్వనంబు చెన్ను నివ్వటిల్లుచునికి దెలుపు సృంజయుని పుత్రి మెలగు విధంబు నారదునకు తగు లొనర్చె" అని తిక్కన్నగారు వ్రాసిరి. అనగా సృంజయుని కూతురు, తన యందు క్రొత్తగా వెలిపచ్చు యౌవనదశా సౌభాగ్యముతోడి ప్రవర్తనచేత నారదుని మనస్సును నాకర్షించినది కావలయును. ఇందు నారదుని మనస్సు నాకర్షించుటకు సుకుమారి కొంత యత్నించినట్లు తోచుచున్నది ఆమె కా యౌవనదశావిర్భావమునందే, అనగా యౌవనము వచ్చుచుండగనే, నారదుని యందెందుకు మోహము కలిగినదో తిక్కన్నగారు స్పష్టముచేయలేదు. కొన్ని దినముల కాలములోనే యౌవనవతి యగుట, నారదుని చిత్తము నాకర్షించుట చెప్పిన తిక్కన్నగారి రచనకంటె మూలమే

యుచితముగా నున్నది. అంతకు పూర్వమే ఆమె యౌవనవతియైనదను విషయము మూలకర్త స్ఫురణకు వదలినాడు. ఆమె భక్తిశ్రద్ధలతో పరిచర్య చేయుటయే నారదుని కామెయందు మోహముకలుగుటకు హేతువుగా మూలకర్త చెప్పినాడు. మూలమునందున్న విషయము, అటు సృంజయుని కూతునందు దోషము లేకుండ జేయుచున్నది నారదుని విషయమునను కొంత యుదాత్తతనే చూపుచున్నది. మరి నదియునుగాక, నారదుని యెదుట శ్రీకృష్ణుడు ధర్మరాజునకు కా కథ చెప్పుచున్నాడు. ఎప్పుడో నారదుని ప్రేమించి పెండ్లి చేసికొనిన ఒకర్తుక అంగములు, శ్రీకృష్ణునిచేత వర్ణింపబడుట అంత యుచితముగా తోచుటలేదు. మూలకర్త సుకుమారి యొక్క భక్తిశ్రద్ధలే నారదున కుద్దీపనములైన వన్నట్లుగా వ్రాయుట, ఆమె అవయవసౌష్ఠవము నారదున కుద్దీపనమైనట్లుగా తిక్కన్నగారు వ్రాసిన దానికంటె శ్రేష్ఠముగా నున్నది. తిక్కన్నగారు వర్ణించినది సాధారణ విషయము. మూలకర్త వర్ణించినది విశేష విషయము. స్త్రీ యొక్క భోగ్యాంగములకు వాచ్యము చేసినంత మాత్రమున తిక్కన్నగారి రచన రసవంతము కానేరదు. తరువాతి ప్రబంధకవులు చేసిన స్త్రీల అంగాంగవర్ణనమున కా పద్యము మూలమైనంత మాత్రమున నది తత్ప్రకరణమున నుచితము కాజాలదు.

6 అష్టావక్ర, ఉత్తరదిశా సంవాదము విషయము మూలమునకంటె తిక్కన్నగారు మంచిగా వ్రాసినారని వెనుక చెప్పబడినది. సూక్ష్మముగా విచారించినచో మూలమే చమత్కారముగా నున్నది. ఆ యుత్తరదిశాసతిని గూర్చి అష్టావక్రుడు "ఇది శాపంబున ముదురు (ముదుకు) దనంబు నొందిన బృందారకసుందరి గావలయు" ననుకొనినాడు. ఈ విషయము మూలమునందును నున్నది. మొదటిరాత్రి ప్రక్కలో జేరి కామస్వభావమును గూర్చి యామె చెప్పినది విన్న తరువాత అష్టావక్రు డట్లనికొనినాడు. అష్టావక్రున కామె శాపవశమై యుండవలయునన్న ఊహ కలుగుటను విచారించినచో మూలమునందున్న చమత్కారము తెలియును. మూలకర్త ఆమె వృద్ధ యని చెప్పినాడు. ఆమెవృద్ధ యయ్యును కాముకతను ప్రదర్శింపగా నాశ్చర్యము కలిగి అష్టావక్రు డామె శాపము నొందిన బృందారకసుందరి కావలయు ననికొనినాడు. ఆమె శరీరముచేత వృద్ధగా కనిపించుచున్నది. మనస్సుచేత అట్లు కనిపించుటలేదు. శరీరము యొక్క బాహ్యలక్షణములకు, కేవలము భిన్నమైన మనోలక్షణ

ప్రపంచ మావిష్కృత మగుటవలన, ఆమె ఏదో శాపవశమున నట్లయినదని అత డూహించినాడు ఆమె నిజముగా తిక్కన్నగారు చెప్పినట్లు ప్రౌఢవయస్కయే యైనచో, ఆమెయందా కాముకత సహజమే యగుచున్నది.

అపుడష్టావక్రుని కామె శాపము నొందినది కావలయునన్న ఊహయే పుట్టుటకు వీలులేదు పుట్టినదని మాత్రము తిక్కన్నగారు వ్రాసిరి అనగా నొకచోట మూలము ననుసరించియు, మరొకచోట ననుసరింపకయు వ్రాసి పూర్వాపరవిరోధమును తిక్కన్నగారు కల్పించిరి మూలకర్త సమంజసముగా వ్రాసెను

7 విష్ణుసహస్రనామములను, తిక్కన్నగారు ముందు వెనుకలనున్న నాల్గుపేర్లను చెప్పుట చక్కగా సంగ్రహించుటకాదు. సంగ్రహించి చెప్పుట యనగా మొత్తము తాత్పర్యమును, అంతకంటె తక్కువ మాటలలో చెప్పుట. కథావస్తువే సంగ్రహించి చెప్పబడుటకు వీలున్నది. కనుక విష్ణుసహస్రనామములు సంగ్రహింపబడలేదు. ఆద్యంతములయందున్న నాల్గుపేర్లు మాత్రము పేర్కొనబడి మిగిలిన వన్నియు వదలబడినవి

వ్యాసు డర్జునుని పలుకరించినతీరు తిక్కన్నగారు వ్రాసినది ప్రశంసింపబడినది. మూల మసహజముగా నున్నదన్న ఒక వాక్యముతప్ప మూలమును గురించి మరేమియు వెనుక చెప్పబడలేదు. తరువాతిదాని విషయమున తిక్కన్నగారు కల్పించిన హేతువు మూలమున లేదని చెప్పబడినది. ఈ రెండింటి యందును ఆంధ్రభారతము గుణమే చూపబడినది. తిక్కన్నగా రమూలకముగా వ్రాసినారన్న పద్యమునందలి యర్థము మూలమునుండి ప్రతీయమానమగు నదియేగాని క్రొత్తదికాదు. అనగా మూలమున వ్యంగ్యభూతముగా నున్న దానిని తిక్కన్నగారు వాచ్యము చేసిరి. అది మూలకముకాదు. మూలమునకు వ్యాఖ్యయని చెప్పవచ్చును అందువలన ధర్మరాజు శీల మాపద్యమువలన నెంతగా పోషింపబడినదో, అదంతయు మూలనందును నట్లే పోషింపబడినది.

ఈ విధముగా పునర్విచారము చేసినచో సంస్కృతాంధ్ర భారత విమర్శకుల విమర్శధోరణి కొంత అస్తవ్యస్త మగుచున్నది మరియు నీ పునర్విచారణమున చెప్పబడిన విషయములును సముచితములుగనే కనుపించుచున్నవి ఇందేది యుచితమో యేదికాదో తేల్చి చెప్పుట కష్టము. ఇంతకును సంస్కృతాంధ్ర

భారతములను పోల్చి మాటాడుట పొసగి యుండుటలేదని మాత్రము స్పష్టమగుచున్నది. మరియు వ్యాసుని, కవిత్రయమువారిని అనివార్యముగా నొక్కొక్కసారి తక్కువచేసి చెప్పవలసి వచ్చుచున్నది అట్లు చెప్పుచున్నను, అది సంస్కృత భారతమును గురించిగాని, ఆంధ్ర భారతమును గురించినగాని సమగ్రమైన విమర్శన మగుటలేదు అందువలన సమగ్రమైన భారత విమర్శనము జరుగవలయునన్నచో సంస్కృతాంధ్ర భారతములు పరస్పర నిరపేక్షముగా విమర్శింపబడవలయును. సంస్కృతాంధ్ర భారతములకు విశేషముగా భేదము కనిపించుచున్నందున, కవిత్రయము వారిది యథానువాదముకాక, స్వతంత్రానువాదము కథానువాదము అని చెప్పవలసివచ్చుచున్నది మరియు కొన్ని శ్లోకములకు పద్యములు చిరుమార్పులతో నాంధ్రభారతమున కనిపించుచు, నక్కడి కక్కడ ఆ పద్యము లుచితము లనిపించుచున్నందున, మూలమునకు కవిత్రయమువారు మెరుగుపెట్టినారని చెప్పవలసివచ్చుచున్న కొన్ని స్థలముల యందు మూలమే యుచితముగానుండి, అట్టి కవిత్రయమువారి భారతమున కానరానందున, కవిత్రయము వారికి లభించిన ప్రతులలో నది లేకపోయి యుండవచ్చునని,సంస్కృత భారతప్రతుల వైవిధ్యము నాశ్రయింపవలసివచ్చుచున్నందున మొత్తముమీద అసమగ్రమైయున్న సంస్కృతాంధ్ర భారత విమర్శనమునకంటె "విరాటపర్వమాదిగ బహువిధముల విస్తృతిఁజెంది, ప్రకృతితత్త్వమును సుగమముఁజేసి, శాంత్యధిష్ఠితమగు స్వర్గారోహణముతో సమాప్తిఁజెందిన భారత భాగమును రచించుటలో తిక్కన్న యెట్లు తత్తత్సన్నివేశముల కనుగుణముగఁదన కవితాశిల్పము నుచితవిధమున ప్రదర్శించినదియు సహేతుకముగ నిరూ"[1] పించు ఆంధ్రభారత విమర్శనమే సమగ్రమును, నుచితమునునై కనిపించుచున్నందున, ఈ విధమైన విమర్శనమే చేయదగినదిగా నిర్ణయించుట లెస్స

ఈ ఆంధ్రమహాభారత విమర్శనమే కవిత్రయమువారి హృదయమునకు వ్యాఖ్యానము కాగలదు ఈ గ్రంథకర్త ఈ మార్గమునే అనుసరించుచున్నాడు. ఇక భారతమును కవిత్రయము వారు భావించిన తీరు, వ్రాయదలపెట్టిన రీతి నిరూపింపబడును

1. భారతము-తిక్కన రచన-పుట 203.

## 4. కవిత్రయమువారు భారతమును భావించినతీరు

జననుత కృష్ణద్వైపా
యనమునివృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్[1]

ఇది నన్నయ్యగారితో రాజరాజనిన మాట— జననుతుడైన కృష్ణ ద్వైపాయనమునివృషభునిచేత చెప్పబడిన మహాభారతము నందున్న యర్థమును తెనుగున తేట పడునట్లుగా నధికమైన ధీశక్తితో రచింపుము. సంస్కృతభారతము నందున్న యర్థమును స్పష్టముగా తెనుగున రచియింపు మనినాడు రాజరాజు. సంస్కృతభారతమును తెనుగున వ్రాయు మనలేదు. మరియు నధికమైన ధీశక్తితో రచియింపుమనినాడు. సంస్కృతమహాభారతబద్ధనిరూపితార్థము నెరుగుటకు, దానిని తెనుగున రచియించుటకు రెండింటికిని నధికమైన ధీశక్తి కావలయును అందుకు రాజరాజట్లనినాడు అనినాడని నన్నయ్యగారు వ్రాసిరి. అనగా తెనుగు భారతము, సంస్కృత భారతము నందలి మహార్థముతో రచియించుటను నన్నయ్యగారు సంకల్పించినట్లు తెలియుచున్నది

మహాభారతబద్ధ నిరూపితార్థమనగా, సంస్కృత మహాభారతముయొక్క ఆత్మ. "కావ్యస్య సారరూపతయా స్థితః సహృదయ శ్లాఘ్యః యోఽర్థః - కావ్యస్య స ఏవార్థః సారభూతః ఆత్మా"[2] కావ్యమున సారరూపమున నుండి సహృదయులచేత శ్లాఘింపబడు నర్థ మేది కలదో అదియే కావ్యముయొక్క ఆత్మ సంస్కృత భారతమున నాత్మరూపమున వ్యవస్థితి గనిన అర్థ మేది గలదో దాని నెరిగి, అది స్పష్టపడునట్లుగా తెనుగున రచియింపవలయును. రచించుట కేవలము వ్రాయుటకాదు. కేవలము వ్రాయుటకు నధికమైన ధీశక్తి అక్కఱ లేదు రచ ప్రయత్నే - రచన యందు యత్నము కనిపించుచున్నది యత్నము క్రొత్త నిర్మాణము విషయమున నుండును. సంస్కృత మహాభారతము నందున్న ఆత్మరూపమైన అర్థమును గ్రహించి, అది తెనుగున క్రొత్త నిర్మాణమువలె చేయుటను నన్నయ్యగారు సంకల్పించిన ట్లా పద్యము తెలియజేయుచున్నది -

1. భా. ఆది. 1-16.
2. ధ్వనిసారః-పుటలు 2, 3.

రాజరాజు మాట విని నన్నయ్యగా రిట్లనిరి—"బుద్ధి బాహు విక్రమమున దుర్గమార్థ జల గౌరవ భారత భారతీ సముద్రము దరియంగ నీదను విధాతృనకైనను నేరబోలునే? అయినను దేవా! నీ యనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబునం జేసి నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచించెద."[1] సంస్కృత భారతమునందు దాని యాత్మరూపమైన యర్థము దుర్గమముగా నున్నది. నీవు తదర్థ మేర్పడ వ్రాయుమనుచున్నావు ఆ యర్థము గమించుటకు చాల కష్టమైన మహాసముద్రమువంటిది. బుద్ధి యను బాహువుయొక్క శక్తిమీద నాధారపడి తదర్థ సముద్రమును పారముముట్టుట బ్రహ్మకును శక్యముగానిది; అయినను నాకు చేతనయినంతవరకు, నీ యనుమతిని, విద్వాంసుల యనుగ్రహమున, ఆ యర్థ మేర్పడునట్లుగా తెనుగున రచియించెదను—నన్నయ్యగారనిన దాని తాత్పర్యమిది నన్నయ్యగారు దుర్గమమనుచున్న యర్థము కావ్యాత్మమైన యర్థము. అనగా సంస్కృత భారతమున కావ్యాత్మమైన యర్థము - రసము - దుర్గమముగా నున్నదనియు, అట్టి దానిని తన బుద్ధిశక్తి చేత నెరిగి, ఆ రసమంతకంటె స్పష్టముగా నుండునట్లు రచయింతుననియు నన్నయ్యగారు చెప్పిరి. ఆ విధముగా నాయన రెండున్నర పర్వములు వ్రాసెను

విరాటపర్వమునుండి భారతరచనకు నుపక్రమించిన తిక్కన్నగారు నన్నయ్యగారి నుద్దేశించి యిట్లు చెప్పెను—

> ఆదరణీయసార వివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
> ష్టాదశపర్వ నిర్వహణ సంభృతమై పెనుపొందియుండ నం
> దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు వి
> ద్యాదయితుండొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్[2]

సంస్కృత భారతము వివిధార్థగతి స్ఫురణము గలిగియున్నదనియు, అందు మూడు పర్వములు నన్నయ్యగారు దక్షత కలిమిని తెనుగున నొనరించెననియు తిక్కన్నగారు చెప్పిరి. మరియు తాను "అమ్మహాకావ్యంబు నర్థంబు సంగ

1. భా. ఆది. 1-19, 20.
2. భా విరా. 1-3

తంబు సేసెద"[1] నని యుపక్రమించెను. నన్నయ్యగారికి వలెనె సంస్కృతభార తముయొక్క అర్థమునందే తిక్కన్నగారికిని దృష్టి యున్నట్లుగా స్పష్టమగు చున్నది. మరియు నా యర్థమును సంగితము చేసెదననుటచేత మూలమందు నా యర్థము సంగతమై లేదా అనిపించుచున్నది. అట్లర్థము మూలమున సంగతమై లేదుగనుకనే రాజరాజు నన్నయ్యగారిని తదర్థ మేర్పడ తెనుగున రచియింపు మని యనియుండవచ్చును ఆ యర్థ మట్లు సంగతమై లేనందుననే, అది దుర్గ మముగా నున్నదని నన్నయ్యగారి యూహ కావచ్చును. ఆ యర్థమును నా బుద్ధిచేత పర్యాలోచనచేసి సంగతపరచి రచియింతుననుటనే నన్నయ్యగారు నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచియింతునని చెప్పియుండవచ్చు ననిపించు చున్నది. అట్లు నన్నయ్యగా రా యర్థమును సంగతపరచి వ్రాసినందుననే, తిక్కన్నగా రది చూచి దక్షతతో చేయబడినదని చెప్పియుండవచ్చును. మరియు పదునైదుపర్వముల గ్రంథమును ముగించి "వ్యాసమునీంద్రుసార కరుణాతి శయంబున భారతార్థ ముద్భాసితమైన యట్టి నుతభాగ్యునకున్ జనపంక్తులు సన్నుతి వెట్టు"నని తిక్కన్నగారు వ్రాసిరి.[2] సంస్కృత భారతమునందలి యర్థ మెవనికి, వ్యాసుని దయవలన, ఉద్భాసితమగునో వానిని తరువాతి జనమం తయు కీర్తించును. ఆ యర్థము నన్నయ్యగారి కుద్భాసితమైనదని ముందు తా నాయనను కీర్తించెను. తానును నాయనవలెనె, ఆ యర్థమును సంగతము చేయుటయందే బుద్ధిని కేంద్రీకరించి వ్రాసెను అందువలన తననుగూడ తరు వాతి జనము కీర్తించును

తరువాత నెఱ్ఱాప్రెగడ వచ్చెను. ఆయన నన్నయ తిక్కనల నిరువు రను కలిపి "వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లఁగఁ జేసినట్టి యజ్ఞాసన కల్పులు"[3] అని ప్రశంసించెను వ్యాసముని వ్రాసిన మహాభారతమునందలి యర్థముల భంగులు నిక్కముగా నెరుగరామిని, నన్నయ తిక్కన లా పరమార్థ మును దర్శించి దానిని తెనుగున స్పష్టముగాచేసిన విధాతృభూతులని కీర్తిం చెను ఎఱ్ఱన అజ్ఞాసనకల్పశబ్దసంధానము, నన్నయ్యగారనిన విధాతృనకైనను నేరబోలునే అను దానిని చూచి చేసియుండవచ్చును. బ్రహ్మకుకూడ శక్యము

1. భా. విరా. 1-37
2. భా. స్వర్గ.-ప. 92.
3. నృసింహపురాణము-పీఠిక-ప 9.

కాదని చెప్పి ఆ పనిని చేసిచూపిన నన్నయ్యను బ్రహ్మకల్పుడనుట తగియే యున్నది నన్నయ్యగారు కొంత చేయగా మిగిలినదంతయు తిక్కన్నగారల్లే చేసినందున నాయనయు బ్రహ్మకల్పుడే అందువలననే ఎఱ్ఱన్నగారట్లు చెప్పిరి. మరి తన విషయము? తా నరణ్యాపర్వశేషమును పూరించినాడు గదా! "నన్నయభట్ట మహాకవీంద్రు సరస సారస్వతాంశ ప్రశస్తి తన్ను జెందు టయు—తత్కవితారీతియుఁ గొంత దోప తద్రచనయకా"[3] వ్రాసినందుర తానును బ్రహ్మ సదృశుడే యగును

సంస్కృత భారతమునందలి సారభూతమైన యర్థము నేర్పడ తెనుగున వ్రాయుమని రాజరాజనుటయు, అది చాల దుర్గమమని నన్నయ్యగారు చెప్పు టయు; ఆ యర్థమును సంగతముచేసి నేను వ్రాయుదునని తిక్కన్నగా రుపక్ర మించుటయు, నన్నయ తిక్కన లిరువురును భాసుర భారతార్థముల భంగులు నిక్క మెఱుంగరానిచో, తత్పరమార్థమును తెనుగున స్పష్టము చేసినారనియు నెఱ్ఱన చెప్పుటయు — ఈ యన్నింటినిబట్టి చూడగా సంస్కృతభారతమున కావ్యాత్మమైన యర్థము సంగతపడి లేదనియే అనిపించును. అట్లచట సంగతపడి లేకపోవుటకు రెండు కారణములు కనిపించుచున్నవి. ఒకటి సంస్కృతభారత ప్రతులలోని వైవిధ్యము - రెండు, మొత్తముమీద నా భారతము శాస్త్రేతి హాసమగుట, కావచ్చును. నన్నయ తిక్కన లిరువురును దానిని కావ్యముగా (కావ్యేతిహాసముగా) చేయు యత్నము మాత్రము పుష్కలముగా జేసిరి. అందు వలననే, కావ్యాత్మమైన యర్థమును గ్రహించి రచించుచున్నట్లును ఆ యర్థమును సంగతపరచి వ్రాయుచున్నట్లును వారిరువురును చెప్పుకొని యుండవచ్చును.

బహ్వర్థములకు నిలయమైన సంస్కృతభారతమునందలి పరమార్థమును దర్శించి, దానిని కవిత్రయమువారు, తెనుగు భారతరూపమున వ్రాసిరి. ఆ విషయమును వారే చెప్పుకొనిరి. కనుక నాంధ్ర మహాభారతము సంస్కృతమున కనువాదమనుట పుట్టుట కవకాశము కనిపించుటలేదు

ఇక్కడ నొక విషయము చెప్పవలయును. తిక్కన్నగారు, నన్నయ్య గారి భారతమును చూచి యుండకపోవుట, చూచినను నంత శ్రద్ధగా చదివి

1 భా. ఆరణ్య 7-469, 470.

యుండకపోవుట, సంభవమని యూహింపబడినది.[1] కాని ఆ యూహ నిలువనిది. ఇంతకుముందు చూపబడిన, నన్నయ్యగారిని గూర్చి తిక్కన్నగారు చెప్పిన యంశములే ఆయన నన్నయ్యగారి భారతమును బాగుగా పరిశీలించినవాడని తెలుపుచున్నవి మరియు నందు కుపబలకముగా మిక్కిలి స్పష్టమైన యుదాహరణ మొకటి గలదు. శౌనకాదులు సూతునితో నన్నట్లుగా నన్నయ్యగారొక పద్యమును వ్రాసిరి. ఆ పద్యమిది —

ఏయది హృద్య మపూర్వం
బేయది యొద్దాని వినిన నెఱుఁగ సమగ్రం
బై యుండు నఘనిబర్హణ
మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్.[2]

తిక్కన్నగారు భారతమంతయు వ్రాసి ముగించి హరిహరనాథునితో, దేవా! ఈ కథ జనమేజయుడు వైశంపాయనునివలన వినుచుండగా నుగ్రశ్రవసుడను వాడు విని, శౌనకాదులకడకేగి వారిచేత నర్చింపబడి మీ రేమి యడుగు కథ వినగోరెద రనగా వారు "ఎయ్యది హృద్యంబును నపూర్వంబును సమగ్రజ్ఞాప్రదంబును నఘనిబర్హణంబును నైనయది యక్కథ మాకు విన నిష్టంబని"[3] పలికినారు. అంత నాతడు భారతము చెప్పెను, అని చెప్పిరి. శౌనకాదులా సూతునితో నన్నమాటలు నన్నయ్యగారు వ్రాసినవే తిక్కన్నగారు వ్రాసిరి. ఆయన కందపద్యములో వ్రాయుట, ఈయన వచనముగా వ్రాయుట తప్ప మరేమియు భేదములేదు ఇక నన్నయ్యగారి భారతమును తిక్కన్నగారు చూడకపోవుటగాని, చదువక పోవుటగాని సంభవించుటకు వీలులేదు

నన్నయ్యగారి భారతము జాగ్రత్తగా చదివియే తిక్కన్నగారు రా[illegible] దక్షతతో నొనర్చిన మహితాత్ముడనియు, నాంధ్రకవిత్వ విశారదుడనియు చెప్పెను. నన్నయ తిక్కనల నిరువురను జాగ్రత్తగా పరిశీలించియే ఎఱ్ఱన అభ్యాసన కల్పులనెను. కవిత్రయమువారు భారతార్థమునందే దృష్టిపెట్టుకొని,

---

1. ఆంధ్రభారత కవితావిమర్శము-పుటలు 115-117.
2. భా. ఆది-ఆ. 1.
3. భా. స్వర్గ-ప. 77.

దానినే ఆంధ్రభారతరూపమున వ్రాసిరి. వారనువాదకులు కాదు. పరమార్థ మును గ్రహించిన నిర్మాణకుశలురు

కవిత్రయము వారి భారతరచనాదృక్పథము కొద్దిలో సూచింపబడి నది. ఆంధ్ర మహాభారత మది యొక నూతనసృష్టి దాని కదిగా స్వతంత్ర మైన యొక గ్రంథము. సంస్కృత భారత నిరపేక్షముగా, నింతకు పూర్వము చెప్పబడిన భారతవిమర్శకులలోని రెండవ వర్గమువారి మార్గమున, ఆంధ్ర భారతము విమర్శింపబడవలయును. ఇప్పు డిట్లనవచ్చును. సంస్కృత భార తముయొక్క పరమార్థమేగదా కవిత్రయమువారు స్పష్టము చేసినది? ఆ పర మార్థ మెంతవరకు స్పష్టముచేయబడినదో అని యైనను మూలముతో పోల్చి చూడవలయునుగదా? — నిజమే కాని సంస్కృతభారతప్రతులలో వైవిధ్య మున్నది—మరియు కవిత్రయమువారు చూచిన ప్రతులు మనకు తెలియవు. అందువలన నేడు మన కందుబాటులోనున్న ఏదో ప్రతిని బట్టుకొని, శ్లోకము లతో పద్యములను పోల్చి లెక్కలు గట్టుటకు మొదలిడినచో, అటు సంస్కృత భారతమునకుగాని, ఇటు ఆంధ్ర భారతమునకు గాని మేలేమియు జరుగదు. స్పష్టమైన స్థితిలో లేని సంస్కృతభారతమును నొక ప్రతిని, ఇది కవిత్రయము వారికి మూలమని రంగము మీదకు తీసికొనివచ్చుట అంత మంచిగా తోచుట లేదు ఆంధ్రభారతముయొక్క మంచిచెడ్డలు కవిత్రయమువారివేగాని, వ్యాసునివి కావనుకొనుటయే ప్రస్తుత పరిస్థితులలో చేయదగినది మరియు నింతకుమునుపే దేశమున కొందరు విమర్శకులు సంస్కృతభారత నిరపేక్ష ముగా నాంధ్రభారతమును విమర్శించి, నన్నయ తిక్కనల కవితాశక్తిని, కావ్యనిర్మాణ శిల్పమును కొంత నిరూపించిరి. అట్టి నిరూపణ కవకాశము సంస్కృత భారత ప్రతులను దెచ్చి పోల్చినప్పుడు కలుగుటలేదు అందువలన, కవిత్రయము వారి హృదయమున కనుకూలమైన కేవల మాంధ్ర భారత విమర్శ నమే చేయదగినది. మార్గదర్శకులైన పెద్దలు ముందు గలరు అదియే స్పష్టమైన ఆంధ్ర భారత విమర్శనాధ్వము

## 5. తిక్కనగారి భారతావతారిక

విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకర సంభావ్యానుభావుండు కృ

ష్ణద్వైపాయను౯ దర్శిలోకహిత నిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయము౯.

ఈ పద్య మంతయు కృష్ణద్వైపాయనునకు సంబంధించినది. మహాభారతము నాయన భారతమునకు సంబంధించినది. మొదటి మూడును కృష్ణద్వైపాయను డెట్టివాడో చెప్పునవి. చివరి మూడును ఎందుకు – ఎట్లు – ఏమి – ఆయనచేసి నాడో చెప్పునవి. కృష్ణద్వైపాయనుడు కవితావేశము కలవాడు. అది భవ్యము. మరియు నదియెట్టిదనగా విద్వత్సంస్తవనీయము పండితులచేత లెస్సగా స్తవనార్హమైనది వేత్తి సర్వం విద్వాన్ – సర్వమును నెరుగుట వలన విద్వాంసుడగుచున్నాడు పరాపరములకు సంబంధించినదై యెరుక ద్విధా భూతముగానున్నది. అద్వితీయ పరబ్రహ్మము పరము అది నిర్గుణము సగుణ బ్రహ్మము అపరము. అది కేవలము జ్ఞానమయము ఇది యుపాసనా రూపమగుట కర్మమయము. ఈ రెండింటియొక్క యెరుకయే విద్వాంసుని లక్షణము అట్టి జ్ఞానము కలిమిని కర్మలు చేయుటయే కావలసినది. అదియే విద్య[2] ప్రశస్త ములుగా పేర్కొనబడు, కావ్య విద్య–దండనీతివిద్య మొదలైన వన్నియు నా పరాపరరూపమైన విద్యలో నంతర్లీన మగునవియే వివిధవిద్యానిధి[3], మహ నీయ విద్యానిధి[4], ఈ మొదలుగా వ్యాసుని గూర్చి తిక్కన్నగారు చెప్పుట గమనింపదగినది. సమస్త విద్యాస్వరూపమైన పరమవిద్యకు నిధియగుట వలననే వ్యాసుడు విద్వత్సంస్తవనీయుడైనాడు అనగా పరాపరవిద్యావివేకముతోడి భవ్యమైన కవితావేశము కలవాడు వ్యాసుడు. అందువలననే విద్వాంసు లా కవితావేశమును సంస్తవము చేయుచున్నారు. మరియు వ్యాసుడు సర్వవిజ్ఞాన భవ్యాత్ముడు[5] కనుక నాయన కవితావేశము భవ్యమైనది విజ్ఞాన సంపద్విఖ్యా తుడు – విజ్ఞానమే సంపదగాగలిగి, అందువలన విశేషమైన ఖ్యాతిని పొందిన

---

1. భా. విరా. 1-3.
2. శ్రీ భగవద్గీత 4-19. శంకర భాష్యము మరియు భా. ఉద్యో. 2-320.
3. భా. అశ్వ. 3-155.
4. భా. మౌసల-ప. 207.
5. భా. స్వర్గ-ప. 80.

వాడు. విజ్ఞాన మనగా విశిష్టమైన జ్ఞానము. శాస్త్రతాత్పర్య భూతముగా నేర్ప డిన తెలివి జ్ఞానము, ఏతత్ జ్ఞాన మనుభవమునకగుట విజ్ఞానము జ్ఞానముయొక్క పర్యవసాన మనుభవమే అనుభవసిద్ధమగు జ్ఞానమునే జ్ఞానమనవలయును. శాస్త్ర తాత్పర్యజ్ఞానము ముందుమెట్టుగా నున్నందున దానిని కేవలము జ్ఞానమనియు, అనుభవమునకు వచ్చుట అను విశేషముగల జ్ఞానము విజ్ఞానమనియు ననబడు చున్నది. జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా - అను గీతా శ్లోక మీ విధముగనే భాష్యము చేయబడినది[1] శ్రీకృష్ణద్వైపాయనుడు సర్వశాస్త్రోక్తపదార్థ పరిజ్ఞానమును ననుభవమునకు తెచ్చుకొనిన వాడగుట వలన తిక్కన్నగారి చేత విజ్ఞానసంపద్వి ఖ్యాతుడుగా చెప్పబడినాడు - సంయముల సమూహము సంభావింపదగిన అను భావముకలవాడు వ్యాసుడు సంయములనగా సంసారోపరతులు. సర్వేంద్రియ ములను విషయముల యందు ప్రవర్తింపనీయక నుపశమింపజేసికొనినవారు. అనుభావమునకు ప్రభావము, బుద్ధినిశ్చయము, అని యర్థములు గలవు. మరియు అను పశ్చార్థం భావయతి ప్రకాశయతీ త్యనుభావః[2] అనుభావుడనగా నర్థము నెరింగించగలవాడు సంసారోపరతులైన సంయములు సంభావింపదగిన అర్థమును నెరింగించగల నిశ్చయమైన బుద్ధి లక్షణము కలవాడు వ్యాసుడు. సంయములు సంభావింపదగిన యర్థము కేవలము బ్రహ్మము విద్వాంసులకును, సంయముల కును గల భేదమిదియే వారికి లోకమున నిర్మలముగా నైనను ప్రవృత్తి యున్నది. వీరి కదియు లేదు. వ్యాసు డటువారిచేతను స్తవము చేయబడు చున్నాడు, వీరి చేతను సంభావింప బడుచున్నాడు వారు కర్మపరులైన జ్ఞానులు; వీరు కేవలము జ్ఞానులు. ఈ యిరువురకు కృష్ణద్వైపాయనుడనిన గౌరవమే అందువలన నాయన కర్మజ్ఞానముల పరమార్థము మూర్తికట్టు కొనగానైనవాడువలె నున్నాడు అట్టి కవితావేశము - ఇట్టిపరమార్థము రెండింటియొక్క యేకాకారము వ్యాసుడు ఆయన భారతము వ్రాసెను. అర్థిలోకహితనిష్ఠను బూని వ్రాసెను.

అర్థిలోక మనగా కోరుచున్న లోకము. లోకమనగా లోకులు. లోకము సుఖమును గోరుచుండును సుఖ మిహపరభేదముచేత రెండు విధములుగా కని

1. శ్రీ భగవద్గీత-6. 8 శంకర భాష్యము
2. గురుబాల ప్రబోధిక-పుట-157.

పించుచున్నది అప్పుడు ఇహపరములకు సంబంధించిన సుఖమును గోరు లోకము నకు హితమును బోధించుటయందు నిష్ఠగలవాడై వ్యాసుడు భారతమును చేసినాడని యర్థము చెప్పవలయును. అర్థిలోక మనక, లోకహితనిష్ఠను బూని యనినను నదియే యర్థము వచ్చును ఆ యిహపరసుఖములయందే ఒకదాని యందుగాని, ద్వేషముగాని, రాగముగాని బోధించక, పరమునకు ఉప స్కార మగునట్లుగా ధర్మమును బహుముఖములుగ వ్యాఖ్యానించుటచే లోకము నకు హితముచేయుట ఆ హితమునందు, ఇహలోకయాత్ర సాగుటకు కర్మము, దానిని పాలించు జ్ఞానము రెండింటికిని తుల్యప్రాధాన్య మొసగి శ్రేయమును ప్రబోధించుటయే హితముచేయుట. అట్టి లోకహితమునందు దృష్టిగలవాడు గనుకనే వ్యాసుడు వ్రాసిన భారతము ధర్మాద్వైత స్థితి బద్ధమైనది ధర్మా ద్వైతము అనగా కర్మజ్ఞానములు ఇహపర సుఖసాధనములు ధర్మశబ్దమున కర్థము కర్మయని శ్రేయాన్ స్వధర్మో విగుణః[1] – అను గీతాశ్లోకమునందలి ధర్మశబ్దమున కనివార్యముగా కర్మ అనియే అర్థము చెప్పకొనవలయును తత్ప్రకరణమున మరియొక యర్థము పుట్టదు మరియు సర్వధర్మాన్ పరిత్యజ్య అనినప్పుడు సన్న్యస్య సర్వకర్మాణీత్యేతత్ అనియే శ్రీమచ్ఛంకరులు వ్రాసిరి అందువలన ధర్మాద్వైతస్థితి అను దానియందలి ధర్మశబ్దమునకు కర్మ యని యర్థము చెప్పవచ్చును ఇక అద్వైతము – ఏది యద్వితీయమో అదియే అద్వైతము అద్వితీయము బ్రహ్మము[2] బ్రహ్మము జ్ఞానము[3] గనుక నద్వైత శబ్దమునకు జ్ఞాన మర్థమగుచున్నది ధర్మాద్వైత స్థితియనగా కర్మజ్ఞానముల యొక్క కలిమి అట్లు కర్మజ్ఞానములు రెండును భారతమున చెప్పబడినపుడే వ్యాసుడు లోకహితనిష్ఠను బూని కావించినట్లు. లోకమున నా రెండింటియందే నిష్ఠయున్నది "లోకేఽస్మిన్ ద్విధా నిష్ఠా .... జ్ఞానయోగేన . కర్మయోగేన ..."[4] అని శ్రీ భగవానుడు చెప్పెను. ఈ శ్లోకమునందు యోగశబ్దము కర్మ జ్ఞానముల ననుసరించి పురుషార్థప్రాప్తి సాధనమైన యుపాయమును చెప్పు చున్నది. ఆత్మానాత్మ వివేకానుభవమే జ్ఞానము. స్వర్గాద్యపవర్గమునకు

---

1. అధ్యా. 18–శ్లో. 47.
2. ఏకమేవ అద్వితీయం బ్రహ్మ.
3. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ–తైత్తిరీయము.
4. భగవద్గీత 3–3.

కారణభూతమైన శ్రౌతస్మార్తములు క్రియలు కర్మ వేదము పూర్వోత్తర కాండములయందు క్రమముగా కర్మజ్ఞానములతో కూడియున్నది. భారతము పంచమ వేదము లేఖ్యంబైన ఆమ్నాయమని తిక్కన్నగారు చెప్పిరి కర్మ జ్ఞానములను ప్రతిపాదించినది కానిచో భారతమునకు వేదగౌరవములేదు. అందు వలన ధర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన ఆమ్నాయమును అర్థిలోక హిత నిష్ఠనుబూని వ్యాసుడు కావించినాడనినపుడు, కర్మజ్ఞానములకు స్థితికలి గిన భారతమను పేరుగలిగిన లేఖ్యమగుట విశేషమైన వేదమును వ్యాసుడు లోకహితైకాపాదక దృష్టితో కావించినవాడనియే అర్థము చెప్పుకొనవల యును. భారతమంతయు కర్మజ్ఞానముల సముచ్చయ రూపమేకదా! ముఖ్య ముగా శాంతిత్రయ మందుకొరకే ఉన్నది

ఈ పద్యమున తిక్కన్నగారు ముందుగా వ్యాసుడెట్టివాడో చెప్పి, తరు వాత ఆయన కావించిన భారతమెట్టిదియో చెప్పెను అట్టివాడు గనుకనే అట్టి గ్రంథమును వ్రాసినా డన్న తాత్పర్యము నా పద్యమున తిక్కన్నగారు నిక్షే పించిరి. మరియు నీ పద్యము తరువాతి పద్యమున ప్రతిపాదింపబోవు నర్థమున కుపోద్ఘాతము వంటిది ఉపోద్ఘాత మనగా, ముందు ముందు చెప్పదలచుకొనిన యర్థమును బుద్ధిచేత పర్యాలోచనచేసి తదర్థసిద్ధ్యపేక్షయా ప్రారంభించి చెప్పుట యేది కలదో అది అసలు తిక్కన్నగారు చెప్పదలచుకొనిన యర్థమిది...

వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణ వర్గంబులకున్
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్[1]

వేదార్థమునకు భిన్నముగా, ఏ స్మృతిగాని, ఏ పురాణముగాని అర్థమును చెప్పు టగాని, దానిని స్థాపించుటకు పూనుకొనుటగాని, చేసినచో అవన్నియు నప్రమా ణములేయగును వేదమే ప్రమాణము. కాని యట్టిచో తిక్కన్నగారు భారతము మూదలయనుచున్నారు. మూదలయనగా నిష్కర్ష నిరూపణరూపము అట్టి వివాదములయందు, పరస్పర విరోధమును పరిహరించి విషయమును భారతము నిష్కర్షించి పెట్టునని యర్థము భారతము సంగలి తాత్త్వికవిషయములనుగూర్చి

1. భా. విరా. 1-4.

వ్రాయునప్పుడీ తిక్కన్నగారు చెప్పిన భారతముయొక్క మూడింటి లక్షణము తెలియగలదు

ఇది తిక్కన్నగారు భారతమును, తత్కర్తయైన వ్యాసుని పర్యాలోచన చేసి తెలిసికొనినతీరు నన్నయ్యగారే మార్గమున నూహించెనో తిక్కన్నగారా మార్గముననే ఊహించిరి "నిఖిలలోక హితార్థంబు దత్తావధానుండై"[1] వ్యాసుడు భారతము వ్రాసెనని నన్నయ్య చెప్పెను. అర్థిలోక హితనిష్ఠం బని కావించెనని తిక్కన్న చెప్పెను "ఐహికాముష్మిక శ్రేయం ప్రాప్తి నిమిత్త" మైనది భారతమని నన్నయ్య వ్రాసెను ధర్మాద్వైతస్థితి యది భారతమని తిక్కన్న వ్రాసెను భారతము ధర్మార్థకామమోక్షముల కత్యంత సాధన మైనదని నన్నయ్యగారనగా, తిక్కన్నగారు భారతము చతుర్విధపురుషార్థముల కును మూలమయనెను ఎట్లన నన్నయ్యవలెనే వ్రాసెను కవిత్రయమువా రెంతటి కవితాశక్తి కలిమిని కావ్యనిర్మాణ దక్షత కలవారో, అంతటి సూక్ష్మ విషయ పరిశీలనపటువైన విమర్శకబుద్ధి కలవారు మహాకవు లట్లే యుందురు.

తిక్కన్నగారి భారతావతారికలోని మరొక ప్రధానమైన విషయ మాయిన భారతరచనా సంకల్పము

> హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానారసా
> భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగాఁ
> బదియేనింటిఁ దెనుంగుబాస జన సంప్రార్థ్యంబులై పెంపుఁ దం
> దుదిముట్టన్ రచియించుటొప్పు బుధసంతోషంబు నిండారఁగన్.[2]

హృదయాహ్లాది - ఊర్జితకథోపేతము - నానారసాభ్యుదయోల్లాసి - ఈ మూడును నొక్క విరాటపర్వమునకే సంబంధించిన విశేషణములా ? కాక మొత్తము భారతమునకు సంబంధించినవా ? అను విషయము విచారింపదగి యున్నది, ఒక్క విరాటపర్వమే ఆ యా విశేషణములకు విశేష్యమైనట్లుగా నిది వరలో వ్రాయబడియున్నది. అయినచో మిగిలిన ఉద్యోగాదిపర్వములమాట యేమి ? అవి హృదయాహ్లాది మొదలైన వైశిష్ట్యము కలవికావా ? అవికూడ

1. భా ఆది. 1-66.
2. భా. విరా. 1-7.

నట్టివైనచో నొక్క విరాటపర్వముకే సంబంధించినవిగా నూహింపబడకూడదు. పదునైదు పర్వముల భారతము వ్రాయదల పెట్టుకొన్న తిక్కన్నగారు రాయా విశిష్టలక్షణములన్నియు నొక్క విరాటపర్వమునకే పరితములు చేయుటయందు తాత్పర్యము కలిగియుందురనుట సముచితముగా గనిపించుటలేదు. ఆ మూడు విశేషణములును, కేవలము విరాటపర్వమునకుగాక మొత్తము భారతమునకు సంబంధించినవే యనవలయును.

హృదయాహ్లాది - అను పద్యమునకు పైన నానుకొని "ఆదరణీయసార" అనుపద్యమున్నది దానికిపైన "అదియును" అన్న వచనమున్నది.అదియును ననగా నేది ధర్మార్థకామమోక్షస్థితికి దా మూదలయో అది అది భారతము అట్టి దానిని గూర్చి అది యును నని చెప్పబడిన పద్యములు ఆదరణీయసార - హృద యాహ్లాది అను మొదలుగా గలిగినవి కనుక నా రెండు పద్యములును మొత్తము భారతమునుగూర్చి చెప్పుచున్నవి మరియునందు మొదటిది నన్నయ్యగారు వ్రాసినదానిని చెప్పుచున్నది. రెండవది తిక్కన్నగారు వ్రాయదలచిన దానిని గూర్చి చెప్పుచున్నది. అవ్యవధానముగా, నన్నయ్య అట్లు వ్రాసెను - ఇక మిగిలిన గ్రంథమంతయు నే నిట్లు వ్రాయుటమంచిది అని తిక్కన్నగారు చెప్పి నట్లున్నది అట్టిచో నావిశేషణములు కేవలము విరాటమునకు గాక, భారతము మొత్తమునకు కాక, తిక్కన్నగారు వ్రాయదలచుకొన్న పదునేను పర్వముల కైనను సంబంధించినవియగుట వగును 'అదియును (ఆ భారతమును), ఆదర ణీయసార వివిధార్థగతి స్ఫురణంబుగల్గి (మరియు), హృదయాహ్లాది - ఊర్జిత కథోపేతంబు, నానారసాభ్యుదయోల్లాసి (యై) అష్టాదశపర్వ నిర్వహణ సం భృతమై పెనుపొందియుండ (యున్నది) అందు (ఆ భారతమునందు) ఆది దొడంగి మూడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షత (నిక) విరాటపర్వమట యుద్యోగాదులుం గూడగా పదునేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపు నందుది ముట్టన్ రచియించుటొప్పు' నని తిక్కన్నగారు ప్రారంభించిరి ఈ విధముగా సమన్వయించుకొన వచ్చును. మరియును హృదయాహ్లాది మొదలైన పద్యము నానుకొని "అని రచనా కౌతుకమున మన మలరగ-" అని మొదలైన పద్య మున్నది. అని యనగా నేమని ? విరాటాది పదునైదు పర్వములను దెనుగున వ్రాయవలయునని. అదియే రచనా కౌతుకము ఒక్క విరాటపర్వమునే

హృదయాహ్లాదిగాను, మూర్జితకథోపేతముగాను, నానారసాభ్యుదయోల్లాసిగాను వ్రాయవలయునని నదియే ఆ రచనా కౌతుకమని చెప్ప వలనుపడదుగదా ? అంతగా గొప్పదిజేసి ఒక్క విరాటమునే వ్రాయదలచుకొనినచో మిగిలిన పదు నాల్గుపర్వముల విషయము తిక్కన్నగారి కక్కరలేదు మిగిలిన పర్వములు వ్రాయక తప్పదన్న బలవంతమేమియు నాయనకున్నట్లు కనుపించుటలేదు ఆయనంతటాయనయే పదునైదుపర్వములును వ్రాయ సంకల్పించెను. మొత్తము గ్రంథమొక నిర్మాణముగా చేయదలచుకొనినవాడు కేవల మొక పర్వమును, ఒక ఆశ్వాసమును మాత్రమే గొప్పగా వ్రాయుదునని చెప్పడు అందువలన తిక్కన్నగారు విరాటపర్వమును, హృదయాహ్లాది మొదలైన విశిష్ట లక్షణములతో వ్రాసినాడనుట సబబుగాలేదు ఆయన భారతమునంతయు నట్లే వ్రాసెను

మరొక విషయము నానా రసాభ్యుదయోల్లాసి అనునది విరాటపర్వమునకు మాత్రమే అన్వయించునదిగా నేటివారొకరిద్దరు వ్రాసినట్లే, శతాబ్దము కాలము క్రిందటి ఒకాయన, అది ఉద్యోగపర్వమునకు సంబంధించినదిగా వ్రాసెను-

పొదలంజేయు ముదంబు సత్కవులకెప్డున్ సాధు శబ్దార్థసం
పద జెంపారి యశేషదోషముల మాన్పంజాలి నానారసా
భ్యుదయోల్లాసము పేర్మిగల్గి మహనీయోద్యోగపర్వంబు దో
హదముం గూర్చుచు గద్యపద్యముల హృద్యంబై రగం బెల్లెడన్.[1]

ఈయన శ్రీ కరాలపాటి రంగయ్య. క్రీ.శ. 1858 సంవత్సరమున నాంధ్ర భారతమును పరిష్కరించినవాడు అది ముద్రింపబడినది. ఆ యుద్యోగపర్వ మును గూర్చి ఆయన తన యభిప్రాయ మట్లు వ్రాసెను దీనినిట్లు దాహరిం చుటలోని యుద్దేశము, నానారసాభ్యుదయోల్లాసి మొదలైన లక్షణము లొక్క విరాటమునకే నియతముగా భావింపబడుటలేదని చూపుటయేగాని, కేవల ముద్యోగపర్వ మట్టి లక్షణము కలదియని తలచుటకాదు భారతము మొత్తము మీద నానారసాభ్యుదయోల్లాసి యగునని చెప్పుచున్న దాని కుపజలకముగా, ఆ లక్షణము విరాటమునుండి తొలగింపబడిన, నూరు సంవత్సరముల వయస్సు కలిగిన ప్రమాణము పేర్కొనబడినది అది యంతమాత్రమే.

1. తెనుగు కవుల చరిత్ర-పుట 156-శ్రీ నిడుదవోలువారిది.

హృదయాహ్లాది - మొదలైనవన్నియు విరాటమునకు సంబంధించినవిగా తోచుటకు మూల మా పద్యము నందున్న చతుర్థము - విరాటము అనునవి కావచ్చును ఏది చతుర్థమో అదియే విరాటము. ఒక దానిని చెప్పుటకు రెండు శబ్దములు వాడినట్లైనది అందువలన తిక్కన్నగారి కా పర్వమునయం దధికమైన మమకార మేదియో కలదని యూహించి, కీచకవధాది ఘట్టములయందలి రచన మనస్సును తత్కాలమున రమింపజేయునదియైయున్నందున, హృదయాహ్లాది మొదలైన లక్షణములన్నియు నా పర్వమునకే నప్పుచున్నవని తోచి, అట్లు చెప్పబడియుండవచ్చు ననిపించుచున్నది కాని పర్యాలోచనచేయగా తిక్కన గారి హృదయమునందలి తాత్పర్య మట్టిదై యుండదని స్పష్టపడుచున్నది. ఆ పద్యమునందలి చతుర్థశబ్దమేమంతవిశేషార్థము కలదిగా లేదు దానినట్లే యుంచి వరుసగా నర్థమును చెప్పుకొనినచో, హృదయమున కాహ్లాదమును గలిగించు నాల్గవదైన, ఊర్జితకథతో కూడుకొనిన, నానారసాభ్యుదయోల్లాసి యగు విరాటము, తరువాతి యుద్యోగాదులు -అని చెప్పుకొనవలయును అప్పుడా విశేషలక్షణము లన్నియు నొక్క విరాటమునకు సంబంధించినవని యనిపించును అది విశేషములేని యనిపించుట మరియు మహాకవియైన తిక్కన్నగారి హృదయమున కనుగుణముగాని యనిపించుట అందువలన చతుర్థశబ్దమును విస్మరించి, అట్టి విశేష లక్షణలక్షితమైన విరాటాది పదునైదుపర్వముల గ్రంథమనియే యర్థము చెప్పుకొనవలయును వీలైనచో నటగా నుచితమైనచో చతుర్థశబ్దమును సమర్థ శబ్దముగా మార్చుకొనుట అయినను చేయవచ్చును ఇట్టి కొద్దిపాటి మార్పులు మరియు భారతమున నక్కడక్కడ అవసరపడియున్నవి

హృదయాహ్లాది - ఊర్జిత కథోపేతము - నానారసాభ్యుదయోల్లాసి - అను మూడును భారతము నంతకును సంబంధించి యర్థవంతము లగుచున్నవి.

భారతము ఊర్జితకథోపేతము ఊర్జ శబ్దమున కర్థ ముత్సాహము మరియు బలము, వృద్ధి మొదలైన యర్థములును గలవు. ఊర్జితకథయనగా నుత్సాహగర్భమైన కథ. ఉత్సాహము వీరమునకు స్థాయి ధర్మవీర ప్రభేద మును వదలినచో, శత్రువును జయించవలయునన్న ఇచ్ఛాపూర్వకమైన ప్రవృత్తి విశేషముతోడి పురుషుల కథ ఊర్జితకథ యగును భారతమునందలి ప్రధాన మైన కౌరవపాండవులకథ ఊర్జితకథ. భారతమునం దది ప్రధానమేగాని అది కేవలముగాలేదు. దానిని చుట్టుకొని మరియు కొంత గ్రంథమున్నది.

ఆ కథ, దానిని చుట్టుకొనియున్న మరికొన్ని విషయములు - మొత్తముకలిసి భారతము. అట్టి భారత మూర్జితకథోపేతము.

భారతమునందలి ప్రధానకథ ఊర్జితకథ. సదర్థము మరియు నిట్లూహింపబడుచున్నది. ఊర్జస్విరైనది ఊర్జితము. ఊర్జస్విహితమైనది ఊర్జస్వి ఊర్జస్వియనుపేరుతో నొక రసవదలంకారమున్నది రసాభాస-భావాభాసములు ప్రవృత్తములై, అవి మరియొకదానికి సంగభూతములై నపుడు - అనగా కవిచేత నవి యట్లంగిరసోత్కర్షాపాదక సమర్థములుగా నిర్వహింపబడినపుడు. తన చేతయా అంగిర మాస్వాద్యమగుటవలన, అది అలంకారముగా చెప్పబడినది. దాని పేరు ఊర్జస్వి. ప్రకరణమునుబట్టి కొన్ని దోషములు గుణములగుటయు, గుణములు దోషములగుటయు నున్నందున రసాభాస, భావాభాసము లొకచో గుణము లగుచున్నవి అపుడవి యలంకార ప్రాయములగుచున్నవి అలంకార మెపుడును నంగమే కాని అంగికాదు కదా! ఆభాస మాత్రములుగా నుండు కొన్ని రస భావములచేత పుష్టముచేయబడిన అంగిరసము తోడికథ ఊర్జితకథ కావచ్చును. భారతమున నంగిరసము శాంతము ఆ కథయొక్క ప్రారంభము వీరములోనైనది అది కరుణమును సృష్టించి యుపశమించినది. ఆ కరుణము శాంతమునకు మూలమైనది ఇవి ముఖ్యముగా పైకి కనిపించునవి యుద్ధపర్వములయందు వివిధములైన రసభావములు స్ఫురించి తిరోధానము లగుచుండును మరియు నందలి యుపకథల యందనేక రసభావములాభాస మాత్రముననుండి అంగికుత్కర్షాపాదకములుగా నగుచున్నవి. భారతము నందు బహురసభావములు, అలంకార భూతములుగా నంగిని పోషించుచున్నవి. ఆ విధముగా భారతకథ నిర్వహింపబడినది ఉదాహరణకు విరాటపర్వము నందలి కీచకవధా ఘట్టమును తీసికొనవచ్చును ద్రౌపది నాలంబనముగా చేసికొని కీచకుడు శృంగారమును భావించినాడు. అది అభాసశృంగారము. భీమునియందు వీరము పుట్టుటకది హేతువు. తత్ఫలితముగా కీచకవధయైనది. కీచకుని చంపబడుటను విని ప్రతివీరుడైన దుర్యోధనుడు తప్పక నా చంపినవాడు భీముడు కావలయుననియు, ఆ కీచకుడు మోహించినది ద్రౌపది కావలయుననియు నూహించి, విరాటనగరమున పాండవులుండిరన్న నిర్ణయమునకువచ్చి, ఎట్లైనను వారిని కనుగొని తిరిగి అడవులకు బంపవలయునని తెన్పగా నుత్సహించినాడు. ఆ దుర్యోధనుని యుత్సాహము దక్షిణోత్తర

గోగ్రహణ రూపమున క్రియారూపము దాల్చినది రెండువిధములను దుర్యోధనుడు భగ్నమనోరథుడగుట పాండవుల యుత్సాహమునకు మూలమైనది ఆ పాండవుల యుత్సాహమే భారతయుద్ధమునకు పునాదియైనది కీచకుని విషయమున నిరూపింపబడిన శృంగార ఆభాసము పరం పరయా -క్రమశః - భారత యుద్ధమున కంగభూతమైపోయినది ప్రధానకథ. కీచకవధవలన నొక క్రొత్తమలుపు తిరిగి పుంజుకొనినది ఆ విధముగా ననేక రసభావమువలన అంగి భారతమున నిర్వహింపబడినది అందువలనను భారధకథ ఊర్జితకథ కావచ్చు ననిపించుచున్నది ఆ కథను సమాశ్రయించుకొని బహువిషయములు ప్రవర్తించినవి అందువలన భారతమూర్జిత కథోపేతమగుచున్నది

మరియు నూర్జితమనగా నుదారమైన యర్థమని మల్లి నాథసూరి వ్రాసెను[1]. ఉదార స్వభావః ఔదార్యం - ఔదార్య మనునది సాత్త్వికనాయక గుణములలో నొకటి ప్రియభాషణ పూర్వకమయిన యీవియు, శత్రుమిత్రులయందు సమతయు ఔదార్యమనంబడును-[2] అని విశ్వనాథ కవిరాజు చెప్పెను భారతము నందలి కథానాయకు డజాతశత్రువు - ధర్మరాజు ఆయన యందున్న ప్రధాన గుణము ఔదార్యముగా కనిపించుచున్నది ఆయనను చుట్టుకొనియున్న, ఆయన చరిత్రయే భారతమునందలి ప్రధానకథ అందువలనను, ఆ కథ ఊర్జితకథ కావచ్చును.

ఇక నానారససాభ్యుదయోల్లాసి – అన్ని రసముల యొక్క పుట్టుకచేత ప్రకాశమునకు వచ్చినదని యర్థము. భారతము నందన్ని రసములును పుట్టినవి వాటి పరిధిలో నవియుండి అంగిరసమునకు ప్రకాశమును గూర్చినవి భారతము నందంగి శాంతము అన్ని రసములవలన నుండియు నది యభ్యుదయమును పొంది స్ఫుటమైనది మరియు శాంతము రసరాజమగుటవలన మిగిలిన యన్ని రసములును దాని కంగభూతములే యగును. శమ రూప చిత్తవృత్తి అన్ని భావములను మించియుండునది దాని పుట్టుకకు ప్రతి రసభావమును మూలము కావచ్చును అందువలన నది నానారససాభ్యుదయోల్లాసి శాంత రసప్రధానమైన భారతము తిక్కన్నగారిచేత నానారససాభ్యుదయోల్లాసిగా చెప్పబడియుండు ననవచ్చును

1. కిరాతార్జునీయమ్-2-1
2. ఆంధ్రసాహిత్యదర్పణము-కారిక. 96-పుట 44

అట్లూర్జితకథోపేతమును, నానాగసౌఖ్యాగయోల్లాసియు నైన మహాభారతము, సహృదయులకు హృదయాహ్లాదియగుట అనివార్యము. తిక్కన్నగారు ముందుగా భారత మిట్టి ప్రయోజనము గలదని చెప్పి, తరువాత నది వేనివలన నట్లగుచున్నదో నిరూపించినట్లుగా నా పద్యములోని అందలి సౌఖ్యా యాహ్లాది మొదలైన పదములు మొత్తము భారతమునకు అన్వయించి యుండుటలోనున్న సొగసు[1] విరాటమునకు మాత్రమే అన్వయించియుండుటలో లేక పోవుటను, ఇంతవరకు చెప్పబడినరీతిగా వివరింపవలసి వచ్చినది.

ఈ యవతారికలోని మరొక విషయము — ఈ ప్రబంధ మండలి కధినాథునిగానే పురుషుని జేర్కొనువాడనో? — ఇది తిక్కన్నగారి వివక్ష. అధినాథుడైన పురుషుడు హరిహరనాథుడని తరువాత తెలియుచున్నది. కాని ప్రబంధమండలి యన నేమో సరిగా తెలియుటలేదు. మరియు తిక్కన్నగారు "ఈ దృశంబులగు పుణ్యప్రబంధములు దేవసన్నిధిం బ్రకాశించుచుండగ నొక్క యారాధన విశేషంబ"ని షష్ఠ్యంతపద్యములకు ముందు వ్రాసిరి. ప్రబంధమండలి యొకటి. పుణ్యప్రబంధములు మరియొకటి. ప్రబంధమండలిలోని ప్రబంధశబ్దము పర్వమును చెప్పుచున్నది. విరాట మట ఉద్యోగాదులం గూడిగా నైన పదునైదు భారతపర్వములను సంభావించి వెంటనే ఈ ప్రబంధమండలి యని తిక్కన్నగారు వ్రాసిరి. ఈ పదునైదు పర్వముల భాగమునకు — ఈ ప్రబంధమండలికి — ఎవని నధినాథుని జేయుదునని యాలోచన. అందువలన పర్వ ప్రబంధ శబ్దము లొక యర్థమునందే ప్రయుక్తములైనవి. మరియు నిక్కడ కృతి శబ్దము గూడ పర్వార్థమునసే తరువాతి పద్యమున నుపయోగింపబడిన ఆ కృతులే తరువాత పుణ్యప్రబంధము లనబడినవి.

ప్రబంధ శబ్దము[2] మొదటినుండియు సాహిత్యగ్రంథ సామాన్యవాచిగనే యున్నది ఇది సంస్కృతములోని విషయము దృశ్యశ్రవ్య ప్రబంధములని — కావ్యప్రబంధమని — చంపూప్రబంధమని — ఇత్యాదిగా నందు వ్యవహార మున్నది తెనుగునను నదియేస్థితి "విస్తరించెద ప్రబంధము సద్రస బంధురం

1. తిక్కనసోమయాజి-పుటలు 103-105.

2. "Journal of Sri Venkateswara Oriental Institute", Tirupati. Vol-II. No ii Pp 55-80

బుగా''[1] నని నన్నిచోడదేవుడు వ్రాసెను. కృతి - కావ్యము - ప్రబంధము - ఇవి పర్యాయపదము లుగనే నన్నిచోడుడు వాడెను నిర్వచనోత్తర రామాయణమున తిక్కన్నగారును ప్రబంధశబ్దము నట్లే వాడెను "ఈ ప్రబంధ మేముని కృతము ?"[2] అని శ్రీరాముడు వాల్మీకిరామాయణమును విని కుశలవుల నడిగెను అంత కుశలవులు "ఈ సంవర్భము వీరలు చేసినయది" అని వాల్మీకిని జూపించి చెప్పిరి. తరువాత వాల్మీకి ''మత్ప్రణీత ప్రబంధంబు మధురగేయ సహితముగ నభ్యసించిరి"[3] అని కుశలవుల నుద్దేశించి శ్రీరామునకు చెప్పెను ఈ యుదాహరణము లన్నియు ప్రబంధము సాహిత్యగ్రంథ సామాన్యమనియే చూపుచున్నవి నన్నయగారు మాత్రము ప్రబంధశబ్దమును దాని సిసలైన యర్థమునవాడెను. "సత్యవాక్ప్రబంధ శతసహస్రశ్లోకసంఖ్యమయిన దాని"[4] అని—ప్రకృష్టమైన బంధము కలది ప్రబంధము సత్యములైన వాక్కులతో ప్రకృష్టముగా బంధింపబడిన శతసహస్రశ్లోకములతో మహాభారతమున్నదని నన్నయగారు వ్రాసిన దాని యర్థము నన్నయ్యగారు గ్రంథసామాన్యవాచిగా ప్రబంధశబ్దమును వాడలేదు. నన్నిచోడదేవుడు వాడెను. తిక్కనగారును నట్లే వాడిరి. మఱియు తిక్కన్నగారు భారతమున ''ఈ ప్రబంధ మింపొనరఁ బరించి నన్ వినిన నొందు నరుం జిరసౌఖ్యసంపదల్''[5] అని కర్ణార్జునుల యుద్ధవృత్తాంతమును ప్రబంధశబ్దముచేత చెప్పెను

మనుచరిత్రాదులు ప్రబంధములనియు, ఆ గ్రంథములు రచియింపబడిన కాలము ప్రబంధయుగమనియు నొక వాడుక, ఆంధ్రవాఙ్మయచరిత్రమున కొంతకాలమునుండి యేర్పడియున్నది ఆ వాడుకనుబట్టి చూడగా, ప్రబంధ మొక కావ్య ప్రభేదముగా గుర్తింపబడినట్లు కనిపించుచున్నది. కాని కావ్యము నుండి భిన్నమైన ప్రబంధలక్షణము లివి యను నిష్కర్ష చేయబడినట్లు కానవచ్చుట లేదు. మహాకావ్యమునకు చెప్పబడిన యష్టాదశవర్ణనలే ప్రబంధమునకును చెప్పుచున్నారు. అందువలన ప్రబంధము మహాకావ్యమే యగుచున్నది అయినచో నది కావ్యయుగమనిగాని,మహాకావ్యయుగమనిగాని యనబడక ప్రబంధయుగమని

1. కుమారసంభవము. 1-48.
2. నిర్వచనోత్తర రామాయణము. 10-123.
3. ప. 136.
4. భా. ఆది. 3-9.
5. భా. కర్ణ. 3-397.

యేల యనబడవలయునో తెలియుటలేదు - శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు మాత్రము, ప్రబంధ మొక ప్రత్యేక కావ్య విశేషమనియు, దానికి సమగ్ర మైనలక్షణ మెవరును చెప్పినవారు లేరనియు, తా మా ప్రబంధనామముతో వెలువడిన గ్రంథములనన్నింటిని బరిశీలించి ఐదు ప్రబంధలక్షణములను క్రోడీకరించిరి[1]—ఏక నాయకాశ్రయమై వస్త్వైక్యము కలిగియుండుట అష్టాదశవర్ణనాత్మకమై యుండుట శృంగారము ప్రధానరసముగా నుండుట. అలంకారికమైనశైలిలో నుండుట భాషాంతరీకరణముగాక స్వతంత్రరచనయై యుండుట — ఇవి ప్రబంధ లక్షణములని వారు చెప్పిరి ఇవి కావ్యమునుండి ప్రబంధమును భిన్న ముగా నెంతవరకు చూపించుచున్న లక్షణములన్న పర్యాలోచన ప్రస్తుత మక్కరలేదు మొత్తముమీద ప్రబంధ మొక కావ్యవిశేషము. పెద్దనాదులు ప్రబంధకర్తలు ఇది విషయము

ఇక నీ ప్రబంధమును తిక్కన్నగారి భారతముతో ముడివేసి వ్రాయబడిన కొన్ని వ్రాత లిచట పరామర్శింపబడును. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగా రిట్లు వ్రాసిరి — "భారతరూపమున నీతఁడు (తిక్కన్న) రచింపఁదలఁచికొని నది ప్రబంధమండలిగాని యొక్క కృతిమాత్రము కాదనుట స్పష్టమగుచున్నది మొత్తముమీఁద . . భారత సంహితను . . . అందలి యేఘట్టమున కాఘట్టము నొక ప్రబంధముగాఁ జేయఁదలంచినట్లు కనఁబడుచున్నది విరాటపర్వ మొక ప్రత్యేక ప్రబంధ మే యనియు, నిందలి లక్షణములే తరువాతి ప్రబంధకవులకు మార్గదర్శ కములై నవనియు మన మించుక పరిశీలనాదృష్టితోఁ జూచిన గోచరమగును.... కీచకవధ మొదలుగాఁగల రసవంతములైన యా యా ఘట్టములకు రచనాకౌశలమునుబట్టి ప్రబంధములనియే పేరుపెట్టఁ దలచినట్లు కనఁ బడుచున్నది. ఇట్టి ప్రబంధమందలి నపారకృపాపరతంత్రవృత్తిమైఁ బేర్చిన దేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుటంజేసి యివి పుణ్యప్రబంధంబులైనవి''[2] - తరువాతి ప్రబంధములనగా పెద్దనాదుల గ్రంథము లనియే అనుకొనవలయును. వారికి తాము వ్రాయుచున్నవి ప్రత్యేకమైన కావ్యవిశేషములని తెలియదు కావ్య, ప్రబంధశబ్దములను పర్యాయములుగనే వా రుపయోగించిరి. ''నవీన కావ్య

1. తెలుఁగు విజ్ఞాన సర్వస్వము. పుట 608.
2. ఆంధ్రభారత కవితా విమర్శనము. పుటలు 164, 165.

రచనకు ననుకూల కథల్ దలంచి" స్వారోచిషమను సంభవమను "మహాప్రబంధ నిబంధనంబునకుఁ బ్రారంభించితి" నని పెద్దన చెప్పెను[1]. "పారిజాతాపహరణం బను మహాప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టి దనిన" అని ప్రారంభించి, "పారిజాతాపహరణ మను కావ్య మొనరిం"చినాడు నంది తిమ్మనార్యుడు.[2] పింగళి సూరన్న[3] "సరస ప్రబంధ నిబంధనంబునకు జాతకౌతూహలుం"డై "కళాపూర్ణోదయంబను మహాకావ్యంబు నిర్మింపం గడంగి" కళాపూర్ణోదయంబను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టి దనిన''అని అసలురచన కుపక్రమించెను మరియు సూరన్న[4] "ప్రభావతీప్రద్యుమ్నమను ప్రబంధ మాచరింపుచున్న'' ట్లుగా ముందుచెప్పి, చివరకు ''ఈ కావ్యమునకు మహాప్రసిద్ధి నిచ్చి గావుత లక్ష్మీశ్వరుండు " అని ముగించినాడు. రామరాజభూషణుడును[5] "ఒక్క మహాకావ్యంబు రసోచిత చమత్క్రియాకల్పభవ్యంబుగా నొనరింప బూని" "వసుచరిత్రంబను మహాప్రబంధమునకుఁ గథాక్రమ"మును జూచుకొనినాడు - ఈ యుదాహరించిన ప్రబంధయుగపు మహాకవుల వాక్యములవలన ప్రబంధ మనునది యొక కావ్యప్రక్రియయని వారికి తెలియదని తెలియుచున్నది. ఇపుడిట్లనవచ్చును. లక్ష్యములు ముందేర్పడిన తరువాతగదా లక్షణము నిర్ణయింపబడుట? నాటి పెద్దనాదులు వ్రాసిన గ్రంథములు కావ్యములకంటె కొంత వైలక్షణ్యము కలిగియున్నందున, మనము పరిశీలించుకొని వాటిని ప్రబంధములను నొక ప్రత్యేకశాఖయని యనుకొనుచున్నాము అందువలన పెద్దనాదులకీ భేదము తెలియనక్కరలేదు. తెలియదుకూడ. అయినచో కీచకవధ మొదలుగాగల రసవంతములైన ఆ యా ఘట్టములకు తిక్కన్నగారు ప్రబంధములని పేరు పెట్టదలచుట యెట్లు పొసగును? ఒక రకముగా గ్రంథమునంతయు వ్రాసిన పెద్దనాదులకే తమవి ప్రబంధములన్న జ్ఞానములేవనియు, లేకపోవుట దోషముకాదనియు తేలినపుడు, ఒక మహాకథలోని, అల్పాల్పములైన వివిధ ఘట్టములను బట్టుకొని, వాటికి ప్రబంధములని తిక్కన్నగారు పేరుపెట్ట దలచుకొనుట కుదురని విషయము. ప్రబంధ మనగా నిది యిట్లుండవలయునన్న లక్ష

1. మనుచరిత్ర. 1-10, 17
2. పారిజాతాపహరణము 1-34, 5-106.
3. కళాపూర్ణోదయము. 1-9, 16, 106.
4 ప్రభావతీప్రద్యుమ్నము. 1-5, 5-221.
5. వసుచరిత్ర. 1-12, 91.

ణము తెలిసినప్పుడుగదా దానికై యత్నించుట? విరాటపర్వమును గాని, [illegible]
రములైన ఘట్టములలో దేనికదిగా గాని, ప్రబంధముగా వేయుటకు [illegible]
గారి కేతల్లక్షణ మెట్లు తెలిసినది? నేడు మన మనుకొనుచున్న మహాభారతమును
తిక్కన్నగారు వ్రాసిన పదునైదు పర్వములు మన్ననుకొనుట [illegible]
ముగా నున్నది శ్రీ లక్ష్మీకాంతముగారు చెప్పిన ప్రబంధలక్షణము [illegible] భా
తమునందలి యే పర్వమునకును బట్టదు భారతమున [illegible]
కొక్క నాయకుడు ప్రత్యేకముగా లేడు. ప్రతి పర్వమునకును [illegible]
లేవు. ప్రతి పర్వము శృంగారరసము ప్రధానముగా కలిగిలేదు [illegible]
మైన శైలి కలిగిలేదు మొదలా యాలంకారికమైన శైలి యున్న [illegible]
మధురముగా నున్నది. వివరింపబడక దాని స్వరూపము తెలియు [illegible]
భారతమున ప్రతి పర్వమున నా శైలి యున్నదియు లేనిదియు చెప్పుటకు వీలు
లేదు. సంస్కృత భారతప్రతు లొక విధముగా లేనందున, కవిత్రయమువారు
చూచిన ప్రతి యేదో తెలియక, ఆంధ్ర భారత మొక [illegible]
విమర్శనాసౌలభ్యముకొరకు కొందరు భావించుచున్నారు గాని, [illegible]
వాదమనియే మిగిలినవా రనుకొనుచున్నారు – ఈ విధముగా [illegible]
భారతమునకు పట్టుట లేనప్పు డందలి పర్వమొక నేమ మని మనుకొను ప్రబంధ
మెట్లు కాగలదో బుద్ధి కందుటలేదు. భారతమునందన్ని పర్వములందును
వ్యాపించేయున్న కథ కౌరవ పాండవులకథ ఒక్క మౌసలపర్వమున స్థూల
దృష్టికి యాదవులకథ ప్రధానముగా నున్నట్లు కనిపించును. అదియు సూక్ష్మ
విచారణమున ప్రధానకథతో ముడివేయబడి యున్నదనియే తెలుగలదు. భారత
కథ కంతటికిని నాయకు డొక్కడు ధర్మరాజు మాత్రమే. అంగిరసము శాంతము.
ఇక భారతము ప్రబంధముగాని, ప్రబంధమండలిగాని యెట్లు కాగలదు? విరాట
పర్వము ప్రబంధమైనచో నందు నాయకు డెవరు కావలయును? కీచకవధా
ఘట్టమునకు నాయకుడుగా ననుకొనబడు భీముడు, ఉత్తరగోగ్రహణమున
నాయకుడు కాజాలడు. ఉత్తరగోగ్రహణము ఘట్టమున నాయకుడుగా నను
కొనబడు అర్జునుడు, ఉత్తరావివాహఘట్టమున నాయకుడుకాడు. ఈ విధ
ముగా నేక నాయకాశ్రయత్వ మా పర్వమునకు పట్టనేపట్టదు. మరియు
నుద్యోగపర్వమునకు నాయకు డెవరు? ఒక కథతోనున్న నొక గ్రంథమున
నాయకు డనబడువా డొక డుండునుగాని పదిమంది యుండరు. ఏ పర్వమున
కా పర్వమున, ఏ యాశ్వాసమున కా యాశ్వాసమున నాయకనిర్ణయము, రస

నిర్ణయము, వాని కవి ప్రత్యేకము చేయబడుట భారతీయాలంకారిక సంప్రదాయమునకు విరుద్ధముగా కనిపించుచున్నది. ఒక గ్రంథమునందలి సర్వ విషయములును, దాని మహార్థమున కుత్కర్షాపాదకములై రమణీయము లగునుగాని వ్యస్తముగా కావు. అట్లే మహాభారతమునందలి అన్ని పర్వములును కలిసి ఒక నిర్మాణము ఒక పర్వము ప్రబంధముగాను, మరియొక పర్వము నాటకముగాను భారతము లేదు. కావ్యరసమున దృష్టిపెట్టుకొని, కథార్థము ఘటిత పూర్వాపరమై యుండవలయునన్న సిద్ధాంతము నెరిగి, రచనాకౌతుకమున మహాభారతముయొక్క పరమార్థమును సంగతముచేయుటకు పూనుకొని తిక్కన్నగారు భారతమును వ్రాయగా, ఏ పర్వమున కాపర్వ మొక ప్రబంధమని యనుకొనుచు మనము సంతోషించుట, ఆయన హృదయమున కే మాత్రము దగ్గరగా నున్నట్లు కనిపించుటలేదు నేడు మన మనుకొనుచున్న ప్రబంధ గ్రంథములయందలి పద్యరచనకుగాని, వర్ణనలకుగాని, మూలభూతములైన పద్యములు, వర్ణనలు తిక్కన్నగారి గ్రంథమునయం దుండుట వేరు ఆయనయే తన గ్రంథమును కొన్ని ప్రబంధములుగా రచింపదలచుకొనినాడనుట వేరు. అయినను నొక గ్రంథ మొక ప్రబంధమగును గాని, కొన్ని ప్రబంధములు కాదు. ప్రబంధ మనునది యొక కావ్యప్రక్రియగా మన మనుకొనుచున్నాము గాని, తిక్కన్నగా రనుకొనలేదు. పెద్దనాదులే అనుకొనలేదుగదా! అందువలన రచనాకౌశలమునుబట్టి కీచకవధ మొదలైన రసవంతములైన ఆ యా ఘట్టములకు తిక్కన్నగారే ప్రబంధములని పేరుపెట్ట దలచినట్లు చెప్పరా దనిపించుచున్నది. అట్లే విరాటపర్వమునుగాని, మరియొక పర్వమునుగాని, ఒక ప్రత్యేకమైన ప్రబంధముగా నాయన చేయదలచినట్లుగాని, చేసెననిగాని చెప్పరాదు. ప్రబంధరచనయొక్క క్రమపరిణామమును చెప్పుచో భారతమునందున్న ప్రబంధచ్ఛాయ చూపింపవచ్చును ఏవంవిధమైన రచనకు నన్నయ్యగా రెంత దోహదము చేసిరనియు, నన్నిచోడదేవు డెంతచేసెననియు, తిక్కన్నగా రెంత చేసిరనియు, ఈ విధముగా పెద్దనాదులకు పూర్వమునందున్న సర్వకవుల గ్రంథములను పరిశీలించి చెప్పవచ్చును. అంతేగాని, భారతము నొక కృతిమాత్రముగా గాక ప్రబంధమండలిగా రచింపదలచుకొనెననిగాని, ఒకొక్క పర్వ మొక ప్రబంధ మనిగాని చెప్పుచు, తిక్కన్నగారిని గురించి, ఆయన భారతమును గురించి మాటాడుటలో సామంజస్య మున్నదనిపించదు.

మరి తిక్కన్నగారు వాడిన ప్రబంధమండలి - పుణ్యప్రబంధములు - అనువానికి అర్థమేమి చెప్పవలయునని ప్రశ్న. ఈ ప్రశ్నమునకు సమాధాన మిట్లూహింపబడుచున్నది - వైష్ణవసంప్రదాయమున ప్రబంధశబ్ద మున్నది. మరియు కొన్ని ప్రబంధములతోడి ప్రబంధమున్నది ఇవన్నియు తమిళగ్రంథములు ముఖ్యముగా శఠకోప ఆళ్వారు చెప్పిన తిరువిరుత్తము, తిరువాశిరియము, పెరియ తిరువన్దాది, తిరువాయిమొళి, అను నాలుగును ప్రబంధములు అన్నియు కలిసి దివ్యప్రబంధము దివ్యశబ్దము తిరుశబ్దము వంటిది. ఆ నాలుగు ప్రబంధములును ఋగ్యజురథర్వ సామవేదముల సారముగా నా వైష్ణవసంప్రదాయము చెప్పును [1] ఆ ప్రబంధము లన్నియు భక్తిభావశబలితములు వేదమునందలి కర్మకాండను వదలి, జ్ఞానకాండను, స్వానుభవముమీద, భగవత్కటాక్షమునకు పాత్రులైన యాళ్వార్లు, సర్వాధికారయోగ్యముగా ప్రకాశింపజేసిన ద్రావిడ గ్రంథము లా ప్రబంధములు దివ్యప్రబంధములనియు ననబడును వైష్ణవాలయములయందు, నిత్యదైవారాధనమున, ఈ ప్రబంధములను రాగ తాళ యుక్తముగా పఠించుట ముఖ్యమైనదిగా నున్నది శఠకోపుల సామవేద సారభూతమైన తిరువాయిమొళి ప్రబంధమే అన్నింటికంటెను ముఖ్యమైనది అగ్నీంద్రాది దేవతలను సామవేదము స్తుతించినట్లే, తిరువాయిమొళి పరమేశ్వరుని వివిధావతారవిశేషములను స్పృశించుచు, శ్రీరామ, కృష్ణావతారములను మిక్కిలిగా ప్రశంసించుచు, చివరకంతయు విష్ణువునందు పర్యవసించునట్లుగా జేసి స్తుతించును నామరూపరహితునిగా పరమేశ్వరుని స్తుతించుటతో ప్రారంభింపబడిన పాశురములును చివరకు విష్ణువునందు తాత్పర్యము చూపుచునే యుండును.[2] అందువలన సర్వస్తుతియు విష్ణువునందే పర్యవసించునట్లుగా జేయబడినదని చెప్పవలసి వచ్చుచున్నది

తిక్కన్నగారికంటె బహుకాలము పూర్వమునుండి ఈ వైష్ణవసంప్రదాయము దేశమున నున్నది మరియు నాయనకంటె కొంతకాలము ముందుగా శ్రీమద్రామానుజులవలన వైష్ణవము పుంజుకొని లెస్సగా వ్యాప్తమైనది. తిరుపతిక్షేత్రమును వైష్ణవముగా నిర్ణయించి శ్రీమద్రామానుజులు తదారాధన

1. Life and Teachings of Ramanuja. P 9

2. ఆంధ్ర గీర్వాణ శఠకోప సహస్రము. పుట 174-3.

విధానమును పరిష్కరించి పెట్టిరి. ప్రబంధపఠన మొక యారాధనవిశేషము. నేటికిని వైష్ణవాలయములయం దది జరుగుచునేయున్నది. తిక్కన్నగారు ప్రబంధమండలి, పుణ్యప్రబంధములు – అని యనుట ఆ వైష్ణవప్రబంధములను మనసున బెట్టుకొనియేమో ననిపించుచున్నది. అయినచో నీ భారతమునకును, ఆ ప్రబంధములకును నేమి సామ్య మని ప్రశ్న – అందుకు సమాధాన మిది. ఆ ప్రబంధములు వేదతుల్యములు మరియు వేదసారభూతములు. భారతము పంచమవేదము మరియు వేదములకు నఖిల స్మృతివాదములకు బహుపురాణ వర్గములకు వాదైన చోటులను దాముూదల. చతుర్వేదసారభూతములు ప్రబంధములుకాగా, తదర్థోపబృంహితమే భారతము. ద్రావిడప్రబంధములు భక్తిరూపమున జ్ఞానమును ప్రబోధించినవి. ఈ భారతము కర్మజ్ఞాన రూపమున బహువిధముల వేదార్థమునంతయు బోధించినది. ఆ ప్రబంధములే పరమార్థ సాధనముకొరకు వెలసినవో, ఈ భారతమును నా పరమార్థమును సాధించి పెట్టుటకే వెలసినది. ద్రావిడప్రబంధముల యన్నింటి యర్థముతోడను భారత ముండుటవలన ప్రబంధమండలి కావచ్చును. పుణ్యప్రబంధములనుట దివ్య ప్రబంధములకు దగ్గరగా నున్నది. ఈదృశంబులగు పుణ్యప్రబంధములు దేవ సన్నిధిని ప్రశంసించుటయు నొక్క యారాధన విశేషమని తిక్కన్నగా రనుట వలన దివ్యప్రబంధములు స్మృతికి దగులుచున్నవి. తత్ప్రబంధ పఠనము వైష్ణవ సంప్రదాయమున నొక యారాధన విశేషమే కదా!

ఇచట నొక ప్రశ్న నూహింపవచ్చును. తిక్కన్నగారు భారతము వ్రాయుచు, దీనిని తీసికొనిపోయి ద్రావిడప్రబంధములతో ముడిపెట్టినారని చెప్పట యేమి సొగసుగా నున్నది? అని. ఆయన యేమనుకొనెనో మనకు తెలి యదు. ఆయన హృదయ మిది కావచ్చునని ఉపనిషత్తులమీద మన మూహించు చున్నాము. శివకేశవుల యారాధనము దేశముననుండగా నాయన హరిహర నాథుని ఆరాధించెను. అందుకును కొన్ని కారణములు మన మూహించు చున్నాము. అట్లే ప్రబంధముల విషయముననను, తిక్కన్నగారి "కాలముగను అంతకు పూర్వమును శైవవైష్ణవమతములు నూతనమతావేశముతో వ్యాపిం చుచు ప్రజల మనస్సుల నేదో యొక వంకకు బలవంతముగా నాకర్షించుచుండె ననియు, అట్టి యావేశపూరిత వాతావరణమునందు తిక్కన సోమయాజి శాంతి దూతవలె యవతరించి శివకేశవులకు భేదములేదని యుద్ఘోషించుటకై

తన మహాభారతమును హరిహరనాథదేవున కంకితము సమర్పించె"[1] ననియు నూహింపబడినది. అందువలన శైవవైష్ణవములలోని వైషమ్యమునకు దూరముగా నొక సమరసభావమును నెలకొల్పుటకు తిక్కన్నగారు యత్నించినట్లు సిద్ధించుచున్నది. ఏతత్ప్రయత్నములో నొక భాగ మీ భారతమును ప్రబంధ మండలి యనుట. ఈ యనుటవలని ప్రయోజన మేమనగా, ఈ భారతమునందు వైష్ణవులకును నాదర మేర్పడును. తమ ప్రబంధములవంటిదే భారత మని వా రనుకొందురు. అనగా వైష్ణవసంప్రదాయమువారితో నొకవిధముగా తిక్కన్నగా రిట్లనినట్లు — మీ ద్రావిడ ప్రబంధములు సంగ్రహముగా వేదసారములు మరియు వేదము పూర్వభాగమైన కర్మకాండ లేనివి మీ యున్ని ప్రబంధములు కలిసి వేదార్థమును కొంత చెప్పుచున్నవి. ఈ భారతము వేదార్థము నంతయు చెప్పుచున్నది. మీ మాటలలో ననినచో నీ భారతము ప్రబంధమండలి యనవల యును అట్లే నేనందును మీరు మీ ప్రబంధములను నిత్యారాధనలో భాగముగా చేసికొనినట్లే ఈ భారతమును జేసికొనవచ్చును. ఉపాయ వైభవము భారతమునందున్నదని మీ రనుకొనుచునే యున్నారు ఈ భారత పఠనమును నారాధన విశేషమే కాగలదు అందువలననే, అంతస్సన్నిధి గల్పించుకొనిన హరిహరనాథుని యెదుట, ఆరాధనవిశేషముగా పుణ్యప్రబంధముల రూపమున నున్న ఈ భారతమును, ప్రశంసించుచున్నాను — అని ఇపు డిచట మరొక రకము ప్రశ్న పుట్టుచున్నది భారతమును ప్రబంధమండలియని, పుణ్యప్రబంధములని వైష్ణవసంప్రదాయమునందలి దివ్యప్రబంధముల మార్గమున చెప్పినచో నాయన శైవసంప్రదాయము నేమిచేసినాడు ? ఆ యిరువురకు సామరస్యము నెలకొల్పుట కదా ఆయన ధ్యేయము ? — అందుకనియే హరిహరనాథుని ఓంకారవాచ్యుడని చెప్పినాడు. శైవాగమములయందు శివుడుతప్ప మరొకడు ఓంకారవాచ్యుడు కాడనియున్నది.[2] ఓం అనునది నాదము. సృష్టియొక్క మూలారంభమునందు నాదమే ప్రకాశించినది. అది తరువాత సదాశివాది రూపములను బొందినది. ఓంకారమే శివలింగము. ఓంకార ఏవ లింగం స్యాత్ సర్వ కారణ కారణం. ఇష్ట, ప్రాణ, భావ లింగరూపాత్మక లింగారాధన మున్నది. మరియు నీ మూడింటి యందును భావలింగారాధనమే శ్రేష్ఠము సాధకుని

1. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి. పుటలు 237, 238.
1. శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి. పుట 121.

మనోబుద్ధ్యహంకారాది వృత్తు లే లింగమున లయమగుచున్నవో అది భావ లింగము. ఆ లింగమే ఓంకారము ఓంకారమే శివుడు. ఈ విధముగా శైవ సంప్రదాయమును చెప్పిన ట్లూహింపవచ్చును

ఇంతకును వైష్ణవము - శైవము రెండును భక్తి మతములు. రెండును వైదికములే. ఆగమములయందు కించిత్తుగా నవైదికత యుండవచ్చును అది వేరువిషయము ఆ యిరువురును మేము గొప్ప యనగా మేము గొప్ప యని పరస్పర వైషమ్యములు పెంచుకొనుటలో చిక్కువచ్చినదిగాని లేనిచో రెండును సామాన్యజనమున కుపాదేయములు కావలసినవే దైవభక్తి ముఖ్యలక్షణముగాగల మత మొకటి యెప్పుడును లోకసంగ్రహమునకుండనే వలయును. మానవున కొక దైవమునందు చిత్తము, భయముచేతగాని, భక్తిచేతగాని నిలిచియుండుట లోకమునకు శ్రేయము. బాహ్యలక్షణముల యొక్క మిథ్యాయోగమువలన నసలు మతమే నిందాపాత్రమగుట కూడదు [1] శైవ వైష్ణము లా విధముగా నిందాపాత్రము లగుటచేత తిక్కన్నగారు హరిహరుల విషయమున నంత తీవ్రాభినివేశము కూడదనియు, మొద లా హరిహరు లిరువురు కారనియు వైదికసంప్రదాయమును త్రవ్వి చూపెను.

కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగున్ జనా
భ్యర్చితమైన భారత మపారకృపా పరతంత్ర వృత్తిమైఁ
జేర్చిన దేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చిన భంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్ [2]

దేవదేవు డనగా దేవులకు దేవుడు కావచ్చును. శివకేశవులు దేవులు. ఆ యిరువురు యేకరూపుడు దేవదేవుడు నిజమున కా దేవులకు దేవుడైన పురుషుని నామరూపములులేవు అందువలన హరిహరనాథు డనవచ్చును. ఆయనకు భారతము నిచ్చుట సర్వసిద్ధి. నా నేర్చినభంగి చెప్పి యని తిక్కన్నగారు వ్రాసిరి ఏమి చెప్పి? భారతము చెప్పియా? శివకేశవాభేదమును జెప్పియా? రెండును గావచ్చును వరణీయుడ నయ్యెద భక్తకోటి కనుచుండుటవలన రెండవదికూడ కావచ్చు ననిపించుచున్నది శివభక్తుల యొక్కయు, విష్ణు

1. పల్నాటి వీరచరిత్ర. ద్వితీయ భూమిక. పుట 80.
2. భా. విరా. 1-28.

భక్తుల యొక్కయు మొత్తము భక్తకోటి. శివకేశవాభేదమును జెప్పి ఆ యిరుతెగల భక్తులకు వరణీయుడగుట తిక్కన్నగా రభిలషించినట్లుగా నున్నది. మరియు నట్లు శివకేశవాభేదమును నచ్చు జెప్పుట అనన్యసామాన్యాకారంబగు పరమధర్మమనియు, కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలి యాంధ్రావళి మోదముం బొరయునట్లుగ రచించెదననియు నాయన చెప్పి యుండును భారతమున శివకేశవుల యారాధనమునకు సంబంధించిన పాశుపత పాంచరాత్రముల ప్రసక్తి యున్నది మరియు శివకేశవాభేదవిషయ మున్నది. అందువలన భారత మా యిరుతెగలవారికిని ఆరాధింపదగినది యగును మరియు తాను ప్రతి యాశ్వాసాద్యంతములయందును శివకేశవాభేదమును పౌనః పున్యముగా జెప్పబూనుకొనెను కనుక నా నేర్చిన భంగిఁ జెప్పి యనినప్పు డా రెండర్థములును రావచ్చును

భారతావతారికలోని మూడు నాల్గంశము లింతవర కిచట పరామర్శింప బడినవి మిగిలినవి యవసరమునుబట్టి ఈ గ్రంథము మూడవ భాగమున పరామర్శింప బడును—ఇక భారతము విమర్శనము

# తృతీయోన్మేషము

## 1. విరాటపర్వము

సమయ సముచిత కృత్యంబు చక్కఁజేసి
పాండవులు రాజ్యమున కాసపడకమున్న
యరసి యెఱిఁగి యరణ్యంబునందుఁ దొంటి
యట్ల యిడుమలఁగుడువఁబో నడుపవలయు [1]

ఇది దుర్యోధనుని నిశ్చయబుద్ధి లక్షణము తల్లక్షణమున కనుకూలముగా గనిపించి ప్రతికూలముగా దేలిన పాండవోదంతము విరాటపర్వమున ప్రధాన విషయము అనుకూలముగా గనిపించునట్లు జేసినది కీచకుని మరణము. ప్రతికూలముగా దేల్చినది గోగ్రహణము. ప్రతినాయకుడైన దుర్యోధనుని పరమోత్సాహము భగ్నమగుటను నిరూపించినందున గోగ్రహణము ప్రధానము అందుకు హేతుభూతమైనది కీచకుని మరణము పాండవులు తనచేత, అజ్ఞాతవాస సంవత్సరము పూర్తియగులోపల, తెలియబడుదురను నుత్సాహము, దుర్యోధనుడు, విరాటుని గోవుల నపహరింపబూనుటకు మూలము గోగ్రహణము కేవలము మిష

విరాట మొకవిధముగా సంధిపర్వము. అది దుర్యోధనుని విజృంభణమునకు భరతవాక్యము పాండవుల క్రియాపరతకు నాందివాక్యము ఈ రెండింటిని నిరూపించినది గోగ్రహణము. పాండవుల క్రియాపరత, దుర్యోధనుని కెదురుతిరుగుటతో ప్రారంభమగుచున్నది ఆది సభాపర్వములయందంతయు దుర్యోధనుడే చేసినాడు పాండవులూరక తత్ఫలము ననుభవించినారు ఈ పదుమూడవసంవత్సరమున, తాము దుర్యోధనునికంట బడకుండ తప్పించుకొనవలయునన్న పూనిక, పాండవులు వానికెదురుతిరుగుట యొక్క ప్రథమ స్వరూపము ప్రధానకథయందలి సంఘర్షణ యీ పర్వమున ప్రారంభ

1. భా. విరా. 3-90.

మగుచున్నది. పాండవుల యజ్ఞాతవాస వ్రతమును భగ్నము చేయవలయునని దుర్యోధనుడు, తమ వ్రతమట్లు దుర్యోధనునిచేత కాకుండుటకు ధర్మరాజాదులు- ఎవరికి వారుగా ప్రయత్నించుటతో కథలో సంఘర్షణ పుట్టినది. పాండవు లజ్ఞాతముగా నుండవలసినవారు గనుక కేవలము స్వపరిరక్షణమునందే వారికి ప్రవృత్తి మరియునది నిష్క్రియాత్మకము. అందువలననే విరాటనగరము ప్రవేశించుటకుముందు పాండవులు తమననుసరించి అంతవరకును వచ్చుచున్న విప్రులతో "ఇక పదుమూడగు నేడు. మా కజ్ఞాతవాసంబు సలుపంగ వలయు ఇందు ధార్తరాష్ట్రులు సూతతనయ సౌబలులును జెఱుపన వేతురు. చిన్న సన్న యెఱిగిరేని జాల నెగ్గువాటిల్లు అట్లగుట మమ్మునింక నతిరహస్యవృత్తిమై నిరస్తవిఘ్నులరై చరియింపుడని యనుగ్రహింపవలయు"[1] ననినారు తాము చాల జాగ్రత్తగా నుండవలయునని పాండవులకు తెలియును అందువలన నా సంవత్సరమంతయు తమ ఉనికి సహజమైనట్లుగానే పనియు చేయరాదు దుర్యోధనుడు వేయికండ్లతో పాండవులను పసిగట్ట ప్రయత్నించును ఈవిధముగా పైకి కనిపించని చిత్రమైన ఘర్షణ ప్రధానకథయందు పుట్టినది దీని యభివ్యక్తి గోగ్రహణము మూలముననైనది. ఆ గోగ్రహణము పాండవుల పూనిక నెరవేరి దుర్యోధనుని యత్నము భగ్నమగుటను నిరూపించినది అందువలన నీ పర్వమున గోగ్రహణము ప్రధానముగా కనిపించుచున్నది

గోగ్రహణమునకు మూలమైన కీచకవధ పాండవుల పక్షమున, అజ్ఞాతవాస సంవత్సరమున సంగనాసహితముగా వారు పడిన కష్టమును చెప్పుచున్నది. అట్లే గోగ్రహణము ఫలితము పాండవపక్షమున అభిమన్యుని వివాహ రూపమున మంగళమును గూర్చినది–ఇది విరాటపర్వమున గోగ్రహణమును చుట్టుకొని, సభాపర్వాంతమున నొకవిధముగా నాగిపోయిన ప్రధానకథ తిరిగి అంది పుచ్చుకొన్న విధము

పాండవుల జాడ నెరిగి వచ్చుటకు దుర్యోధనుడు పంపిన వేగులవారు తిరిగి వచ్చినారు. పాండవులజాడ వారికి తెలియలేదు. ఆ మాట దుర్యోధనునకు జెప్పినారు అది వానికి సంతోషహేతువు గాదని వారికి

---

1- భా. విరా. 1-47.

దెలియును. "విరాటుండు పగతుండుగావున తదీయ వ్యసనం బెఱింగిం[1]" చుట తా మేకవిధముగా సంతోషవార్త చెప్పినట్లుగునని, ఆ వేగులవారు కీచకుడు చంపబడినాడని తదుదంతమును మనవిచేసిరి. వారి దృష్టిలో నదేమి యునుగాదు. వట్టి వార్త. పాండవులు కనిపించలేదన్న విచారమును, తాత్కాలికముగా కప్పిపుచ్చగల సంతోషవార్తయని వారు చెప్పిరి దానిమీద దుర్యోధనుడు విరాటనగిరమున పాండవుల యునికిని నిశ్చయించినాడు. ఆ తని నిశ్చయరూపమైన యూహను సోపపత్తికముగా ద్రోణ గాంగేయ భాను మత్సూనులతో "కార్యంబు తెగువ గాంచి" ప్రకటించినాడు. కార్యంబు తెగువ గాంచుటయనగా, పాండవులా విరాటుని నగరమున నుండియుందురని యూహించుటయు, మరియు చేయవలసిన కార్యమును యోజించి నిశ్చయించు కొని యనియు నర్థము కార్యనిశ్చయము మనస్సున జేసికొనినాడు గనుకనే దుర్యోధను డంత సోపపత్తికముగా విషయమును నిరూపించినాడు. భీష్మద్రోణ కర్ణాదులును, పాండవులానగరమున నుండి యుందురన్న తన యూహను ననుస రించి, తన నిశ్చయించిన తదనంతర కార్యమునందు ప్రవృత్తులగుట నాశించి, దుర్యోధను డా విషయమునట్లు నిరూపించినాడు. సర్వమును దుర్యోధను డను కొనినట్లె జరిగినది

"సింహాబలుఁడు భీమసేనుండు శల్యుండు
హాలధరుఁడు సమాన బలము వార
లొండొరులను గెలుచు నుత్సాహము గల
దుద్ధతులును బాహుయుద్ధపరులు

ఈ నలువుర భుజశక్తుల
తో నెనయఁగఁ జాలునట్టి దోర్బల మెందుం
గానము గావున వీరల
లోనన యొండొరుల కని గెలుపు సమకూరున్.

తక్కినవార లాతనికి దవ్వుల చోటులవారు వాయుజుం
డొక్కఁడ యింక సింహాబలు నుద్ధతి మాన్చిన మాన్చువాఁడతం
డక్కడ నిల్చెఁగావలయు నా సతి ద్రౌపదిగాగనోపు వే
ఱొక్కరుఁ డాజిఁ గీచకుల నోర్వగజాలమి మీరెఱుంగరే?

1 భా. విరా. 3-89.

గంధర్వులను నెపమ్మున
నంధ తమస గూఢవృత్తి ననిలసుతుఁడు గ
ర్వాంధమతియైన సూతు స
బాంధవముగఁ జంపెఁగాక పరులకు వశమే.

వ॥ పితామహుండుపదేశించిన లక్షణంబు లద్దేశంబున గలిగియుండు నని విందుము పాండవులు ప్రచ్ఛన్నవేషంబున విరటు ప్రోల వసియించినవారు గావలయు."[1]

ఇది దుర్యోధనుడు పాండవుల యునికిని విరాటనగరమున నూహించి నిరూపించిన విధము- "కీచకుని పుణ్యోజ్జ్వలాకృతి యగు నొక్క వనితకతమున నడురేయి గంధర్వు లతిరహస్య ప్రకారంబునఁ జంపిరి"[2] అని వేగులవారు విన్నవించినదానినిబట్టి ఆ సతి ద్రౌపదిగాగనోపునని దుర్యోధను డూహించినాడు. ఆమె విషయమున సహింపరానంతటి యనుచితముగా కీచకుడు ప్రవర్తించి యుండును అందువలన భీముడు వానిని రహస్యప్రకారమున జంపియుండును. రహస్యముగా జంపవలసిన యవసరము భీమునకేయున్నదిగాని మరొకరికిలేదు. ఎవరో స్త్రీ అయినచో అజ్ఞాతవాసము జేయుచున్న భీముడు పూనుకొనడు అందువలన నామె తప్పక ద్రౌపదియె కావలయును శల్యుడొక దేశమునకు రాజు ఆయన విరాటనగరమునకు బోయి, స్త్రీ విషయమున కీచకునితో వివాదపడి వానిని రహస్యప్రకారమున జంపియుండుట కాస్కారములేదు ఇక హలధరుడు – ఆయన మహానుభావుడు – ఒక స్త్రీ కారణముగా కీచకుని రహస్యముగా నాయన చంపియుండునను ఊహయే చేయరాదు అందువలన శల్యుని యొక్కయు, బలరాముని యొక్కయు ప్రసక్తిలేదు. ఇక మిగిలినవాడు భీముడు. కీచకుడు చంపబడిన విధానమంతయు భీముడే చంపినవాడని చెప్పుచున్నది. కనుక విరాటనగరమున భీముడు, ద్రౌపది తప్పక ఉండి యుందురు. మిగిలినవారుగూడ విరాటనగరముననే భీమునితోపాటుండి యుందురు. ఇట్లు తర్కముమీద పాండవులు విరాటనగరమునం దుండుటను నిశ్చయించి, మరియు చివరకు పితామహు డుపదేశించిన లక్షణము లన్నియు

1. భా విరా. 3-113-117.
2. భా. విరా 3-88.

విరాటనగరమున నున్నవని విందుమని, దుర్యోధనుడు తన యూహకు మరొక ప్రమాణమును జూపించినాడు భీష్ముని వాక్యము ప్రమాణముగా పేర్కొను టలో, తన నిశ్చయించిన తదనంతర కార్యమునకు, భీష్మ డెదురుచెప్పకుండ కలిసివచ్చుటను దుర్యోధనుడాశించియుండవచ్చును భీష్ముడు కలిసివచ్చినచో ద్రోణుడును వచ్చును కర్ణాదులు తనవారు. వారెప్పుడును తన కనుకూలురే

దుర్యోధనుడు తాను నిశ్చయించిన కార్యము నిట్లు వివరించెను "అతండును (విరాటుడు) ప్రతిభటుండయి భంగించుచుండుంగావున నతని పయినెత్తిపోయి. తదీయగోధనంబుల గ్రహించిన ధర్మతనయుండును దమ్ములు నడ్డపడం బఱతెంతు రయ్యవసరంబున మనము సమయభంగంబు సెప్పి వారలం గ్రమ్మఱం బండ్రెండువత్సరంబులు వనవాసంబు సలుపంబుత్త మట్లైన నప్రతి హతంబుగాఁ జతురంతభూచక్రం బాక్రమించి కీర్తనీయులమై వర్తిల్లుదము కుంతీ నందను లందులేక తక్కిన మత్స్యపతి సమస్త వస్తువులును జూఱకొంద మది యును లాభంబ యెల్లభంగుల నిప్పటికిదియె కార్యంబు మీకు నందఱకుం జూడఁ బోలునేని దీని కనురూపంబగు నుద్యోగంబు సేయుండు"[1] — ఈ దుర్యోధనుని వాక్యములయందు గమనింపవలసిన యంశములు రెండు మూడున్నవి మనము విరాటునిమీది కెత్తిపోయినచో పాండవులు తప్పక నడ్డుపడ వచ్చెదరని దుర్యోదనుడు చెప్పుచున్నాడు. పాండవులచట నొకవేళ లేకపోవుట నూహించి నాడుగాని, ఉండికూడ నడ్డుపడ రాకుండుట నూహింపలేదు. ఉన్నచో పాండవులు తప్పక వచ్చెదరను నమ్మకము వానిమాటలలో కనిపించు చున్నది ఆ కొలువులోని వారికందర కదియే విశ్వాసముగా కనిపించు చున్నది లేనిచో నెవరైనను, ఉండిరాకపోయినచో మనమేమి చేయుదమని అని యుండవలయునుగదా! ఎవరును ననలేదు- ఒక క్షణము ముందుగా పాండవులు విరాటనగరమున తప్పకయుండియుందురని నిశ్చయించిన దుర్యోధను డిప్పుడు, కుంతీనందను లచట లేకపోయినచో ననుచున్నాడేమి? కీచకుని మరణవార్త దేశమున పొక్కి తమయునికి ననుమానింప జేయునన్న ఊహతో వారచటనుండి మరొకచోటికి పోయియుండవచ్చుననుటను దుర్యోధ నుడు భావించినాడేమో? కాని అందు నిశ్చయములేదు. కనుకనే గోగ్రహణ

1. భా. విరా. 3-117

మునకు బూనుకొనినాడు. 'పాండవుల సమయభంగము జేయుటకు గోగ్రహణము సాధనము, విరాటుని గోవులుకాదు దుర్యోధనునికి కావలసినది పాండవులకు సమయభంగము జెప్పుట కావలయును. అందుకు గోగ్రహణమే మార్గము. పాండవులచట లేక ఉమ సిద్ధపడి రాక. ఉన్నచో విరాటుని గోధనమే లాభమనుకొనవలయు ననుచున్నాడు. ఈ మాటవెనుక దుర్యోధనుని అంతరంగము గోచరించుచున్నది – ఈ విధముగా నన్ని విషయములను పర్యాలోచించి ఇప్పటి యదియె కార్యంబని నిశ్చయించిపలికి, ఈ మాటగా మీకు నందరకు జూడబోలునేని దీని కనుకూలముగా సన్నాహము చేయుడనుట భీష్మాదులయొక్క పెద్దరికమును మన్నించుచున్నట్లున్న గడుసరితనము ఈ ఘట్టమున దుర్యోధనుని సూక్ష్మసూక్ష్మముగా విచారించు బుద్ధిలక్షణము తెల్లగా నిరూపింపబడినది'

దుర్యోధను డట్లు నిశ్చయించి పల్కిన వెంటనే సుశర్మ తనను విరాటుని మీది కెత్తిపోవుట కనుమతింప గోరెను భీష్మాదు లేమియు ననలేదు. దుర్యోధనుడు సుశర్మకు సరే యనెను అట్లు సుశర్మ ననుమతించుటలో దుర్యోధనుని ఆంతర్య మిది –

మున్ను సుశర్మ తాను బలముం గని గోవులబట్టు పట్టినన్
వెన్నడివచ్చు మత్స్యపృథివీపతి సేనల నెల్లఁగొంచు శా
ర్యోన్నతి సూపువాఁడయి సముద్ధతిమై నిట వేఱ కౌరవుల్
గొన్నిటిఁ బట్టఁ గయ్యమునకుం బఱతెంతురు పాండునందనుల్ [1]

ముందు సుశర్మ సైన్యముతో బోయి ఒక ప్రక్కగా గోవులను పట్టుకొనినచో విరాటుడు ససైన్యుడై సుశర్మ పైకి వచ్చును. తరువాత కౌరవులు మరొక ప్రక్కనున్న గోవులను పట్టుకొనినచో, కౌరవులనుండి గోధనమును రక్షించుకొనుటకు విరాటుడు గాని వాని సైన్యము గాని లేనందున, అనివార్యముగా పాండవులు కౌరవుల తోడి యుద్ధమునకు రావలయును. అపుడు సమయభంగము చెప్పవచ్చును – ఈ యాలోచనతో సుశర్మ ననుమతించెను దీనినుండి మరొక విషయము స్ఫురించుచున్నది. ఇంతకుముందు, పాండవు లా విరాటుని నగర

---

1. భా. విరా. 3-125.

మునసుండి కూడ తమ కడ్డుపడరాక పోయినచో నెట్లను నూహ దుర్యోధనుడు చేయలేదని చెప్పబడినది సుశర్మ తన యెత్తిపోవుట కనుమతి కోరగనే దుర్యోధనున కా యూహ వచ్చినదా యేమి యనిపించుచున్నది సుశర్మ పైకి పాండునందనులు రారన్నట్లుగా పై పద్యమున దుర్యోధనుడనుచున్నాడు ఒక్క విరాటుడే సైన్యమునెల్ల తీసికొని వచ్చునని స్పష్టముగా ననుచున్నాడు సమయ భంగమునకు భయపడి పాండవులు యుద్ధమునకు రాకపోవుట సంభవమని దుర్యోధనునకు తత్కాలమున తట్టియుండవలయును అయినచో రెండవ ప్రక్కగా కౌరవులు గోవులను పట్టుకొనినప్పుడు మాత్రము వారు యుద్ధమునకు రాకుండ కూడదా? అపుడు తప్పక వచ్చెదరని దుర్యోధనుని యూహ అంద రును నొకప్రక్కగనే పోయి గోవులను బట్టుకొనినచో విరాటుడు సైన్యసమేతుడై బయలుదేరును. విరాటుడు బోవుచున్నాడు గదా - మనమును నేల - ఈ సంవత్సరము పూర్తికాక మనము బయటపడినచో చాల కష్టమగును - అంతగా నాయనకు సాధ్యముగానప్పు డాలోచించవచ్చును లెమ్మని పాండు నందనులు యుద్ధమునకు రాకపోవచ్చును చూడి రెండు ప్రక్కలను జరిగినచో, నదియు నొక దినము ముందువెనుకలుగా జరిగినచో, ముందు విరాటు డొక ప్రక్కకు బోవును. రెండవ ప్రక్క రక్షణ లేదు ఇంతకాలముగా నాయన నాశ్రయించుకొనియుండి, చివర కాయనపై రెండు వైపులను శత్రువులెత్తిరా, నొకపక్షముతో నాయన పోరుచుండ, సమయభంగ మైనను సరే యని పాండవులా రెండవపక్షము నెదుర్కొందురు అపుడు సమయభంగ మగునని వెనుకాడరు - ఇట్లు పాండవుల మనోలక్షణమును దుర్యోధను డూహించినట్లు కనిపించుచున్నది. లేనిచో సుశర్మపై పాండవులు యుద్ధమునకు వచ్చుటను దుర్యోధనుడు చెప్పకపోవుటకు కారణము కానరాదు ఆ తరువాతి పద్యమును దుర్యోధనునకు తత్కాలమున దట్టిన, పైన చెప్పబడిన, యూహకే అనుకూలముగా నున్నది

కందువ సెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు చాడికిఁ గూడువారు మీ
రందరు వేఱ యొక్కయెడ నాజికి సేనలఁ గూర్పుఁ డెల్లవాఁ
డుం దనవారిఁ దోకొని కడున్ రభసంబునఁ గూడి వార్తకున్
ముందఱఁబోయి గోధనము ముట్టుకొనన్ వలయున్ మహోగ్రతన్.[1]

1 భా. విరా. 3-126.

ఈ పద్యమంతయు రెండవ ప్రక్కగా దాడిచేయవలసిన కౌరవుల నుద్దేశించి దుర్యోధనుడు చెప్పినది. త్రిగర్తులొకప్రక్క పోయి దాడిచేయుదురన్న విషయము మొదటి పాదమున సామాన్యముగా చెప్పబడినది. మిగిలిన మూడు పాదములయందును కౌరవులు చేయవలసిన దాడి విషయమును దుర్యోధనుని ఆవేగ మాధికారికదర్పముతో సోత్సాహముగా నున్నది. అట్లంతగా కౌరవుల దాడి విషయమును దుర్యోధనుడు నొక్కి చెప్పుటను బట్టి, తప్పక పాండవులు తమపైకి వచ్చెదరనియే వాని యుద్దేశము కాబోలయును. అయినచో నాతడు పైన చెప్పబడినట్లుగా తత్కాలమున నూహించియుండవలయును.

ఇన్ని విషయములు ముందువెనుకలుగా నాలోచించుకొనినాడు గాని, పాండవుల అజ్ఞాతవాస సంవత్సర మింకెన్నిదినము లున్నది మాత్రము దుర్యోధను డాలోచింపలేదు వాని కా యూహయే రాలేదు. వానికే గాదు – మరెవరికి గాని ఆ విషయము తట్టలేదు.

పాండురాజసుతులుఁ బాంచాలియును దమ్ము
నొరు లెఱుంగకుండఁ దిరుగవలయు
దుష్కరంపుటేఁడు తుది సేరఁబాఱె నె
వ్వరును దీనిఁ దలఁపవలను లేర.[1]

అన్ని విషయములును దుర్యోధను డూహించినట్లుగనే జరిగినవి. సుశర్మ పైకి పాండవులు వచ్చుటను మాత్రము దుర్యోధను డూహింపలేదు. అర్జునుడు తప్ప మిగిలిన నలుగురు సుశర్మతోడి యుద్ధమునకు పోయినారు.

కౌరవులతోడి యుద్ధమునకు నర్జునుడు వచ్చినాడు. అర్జునుడు కంటికి కనిపించిన తరువాత దుర్యోధనుడు, అజ్ఞాతవాససంవత్సర కాలపరిమితి విషయమై భీష్ముని యడిగినాడు. "పదుమూఁడు హాయనములు దప్పక నిన్నటి తోడన నిండె"[2] నని భీష్ముడు చెప్పినాడు. ఈ మాటతో దుర్యోధనున కనుకూలముగా కనిపించుచు వచ్చిన కథ అంతయు నొక్కసారిగా నడ్డము తిరిగినది. మఱొకనికైనచో, ఆ భీష్ముని మాట వినగానే ప్రాణములు లేచిపోయి యుండె

1 భా. విరా 3-130
2. 4-232.

డివి కాని దుర్యోధనుని విషయము వేరు. వృథాభిమానదుర్మదు డతడు. తా నే యుత్సాహముతో వచ్చినాడో అదంతయు భగ్నమైనది. తానొక పిచ్చివాడువలె నైనాడు కాని అదేమియు కనిపించనీయలేదు. పైపెచ్చు తెచ్చికోలుఉత్సాహమును ప్రదర్శించుచు, "దరహాసితవదనుండై - సమర భంగిక విక్రమనిరతి బూనుటిదియ నిశ్చయంబు" అని అర్జునునితో యుద్ధమునకు సిద్ధపడినాడు

దుర్యోధను డట్లు భీష్ముని మాట వెంట నిరుత్సాహపడకపోవుటకు వాని యభిమానముతో పాటు, భీష్ముని మాటమీద నమ్మకము లేకపోవుట కూడ కారణము కావచ్చు ననిపించుచున్నది అర్జునుని చేతిలో నోడిపోయి హస్తినా పురమునకు తిరిగిపోవుచు "నడుమ విడిసిన యెడం గర్ణ శకుని దుశ్శాసనుల దుర్మంత్రంబు వట్టి గాంగేయుని వచనంబు లప్రమాణంబులుసేసి ధర్మతనయుం డసత్యంబున కియ్యకొనమి యెఱింగి యాతని పాలికి దూతం బుత్తెంచి"[1] నాడు దుర్యోధనుడు. కర్ణాదుల దుర్మంత్రంబునవైనను, ముందు తన కా యూహ లేనిచో దుర్యోధనుడు చేయడు. అందరును కలిసి యాలోచించి భీష్ముని మాట నిజము కాదని నిర్ణయించుకొని యుందురు. మరియు దూతను ధర్మరాజు వద్దకు పంపుటలో నాయన నిజము చెప్పునను నూహతో పాటు మరియొక అర్థమును వారు తలచినట్లు కనిపించుచున్నది దూత ముఖమున దుర్యోధనుడు ధర్మరాజున కిట్లు చెప్పించినాడు.

వారి యజ్ఞాతవాస సంవత్సరంబు
నిండకుండంగ మున్న పార్థుండు బయలు
మెఱసి సమయంబు దప్పె నీ వెఱిఁగి దీని
కేది దగు నది సేయుము మేదినీశ.[2]

అజ్ఞాతవాస సంవత్సరము పూర్తియైనదా ? కాలేదా ? అయినచో నెప్పుడైనది ? అని ఈ మొదలుగా నడుగవలసి యుండగా దుర్యోధనుడు విషయమును తల్లక్రిందులు చేసినాడు. అజ్ఞాతవాస సంవత్సరము పూర్తికాకుండ అర్జునుడు

---

1 5-367.

2. భా. విరా 5-368.

మాకు కనిపించినాడు ఈ విషయమున నీ వేమి చేయవలయునో అది చేయుము ఇది దుర్యోధను డనినది. మీరు తిరిగి యడవులకు పొండని దుర్యోధను డనుట లేదు ధర్మరాజునకు మాత్రము దానివలన పునర్వనవాసమని తోచినది దుర్యోధను డట్లనక, నీ కేది తగునో అది చేయుమనుటవలన, అజ్ఞాతవాస సంవత్సరంబు పూర్తికాలేదా తిరిగి యడవులకు పోవలెను, పూర్తియైనదా అప్పుడును నీవు చేయదగినదే చేయుమనినట్లున్నది అటుగా దుర్యోధనుడు, అజ్ఞాతవాససంవత్సరము పూర్తియైనచో నీవేమి చేయదలచుచున్నావని ధర్మరాజు నడిగినట్లున్నది ఈ దూతను పంపుటలో, ధర్మరాజేమి చేయదలచు కొనినదియు తెలిసికొనుటను దుర్యోధను డుద్దేశించియుండవచ్చును. తెలిసినచో తానును తన ప్రయత్నములో నుండవచ్చును. కాని యీ దూతను పంపుట వలన దుర్యోధనున కేమియు లాభించలేదు. కాలముతో సమయోల్లంఘనములు నిండెనని మాత్రమే ధర్మరాజనినాడు. మరేమియు ననలేదు

/ఇది విరాటపర్వమునందలి ప్రధాన కథావిషయము ✓ అనగా ప్రతినాయకుని యొక్క-ఇదిగో పాండవులను కనుగొని సమయభంగము చెప్పి తిరిగి యడవులు బట్టించెద ననిన పరమోత్సాహమైన యుత్సాహము భంగింపబడిన విషయము ప్రతివీరుని యుత్సాహమెత్తి కూలవేయబడినది సమయము దప్పక పాండవుల యజ్ఞాతవాస సంవత్సరము పూర్తియైనది

గోగ్రహణమువలని ఫలితము పాండవపక్షమున నభిమన్యుని వివాహ రూపమున జరిగిన మంగళము✓ అర్జునుడే ధార్తరాష్ట్రుల నోడించి గోవులను మరలించుకొని వచ్చినాడన్న విషయము తెలిసికొనిన విరాటుడు తన కుమారుని మాటమీద ఉత్తర నర్జునున కీయబోగా నాతడు కోడలిగా స్వీకరింతు ననినాడు అందువలన నీ పర్వమున నుత్తరాభిమన్యుల వివాహము ప్రసక్తించినది /ఉద్యోగ పర్వమునుండి, ఇట్టి శుభకార్యము జరుగుట కవకాశము లేనంతగా సమర సన్నాహము లున్నవి తరువాత సమరము యుద్ధమునకు పూర్వమే అభి మన్యుని వివాహము కావలయును గనుక విరాట పర్వముననే అయినది ✓అసలు ఉత్తరాభిమన్యుల వివాహము చెప్పబడకున్నచో నేమగును? దుర్యోధనాదుల వివాహములు చెప్పబడ లేదుగదా? అభిమన్యుడు భారతమున దుర్యోధనుని కంటె ప్రధానపురుషుడు కాడుగదా? అని యీ విధముగా ప్రశ్నింపవచ్చును నిజమునకు భారతమున దుర్యోధనాదుల వివాహములు వర్ణింపబడలేదు. అభి

మన్యుడు దుర్యోధనునికంటె ప్రధానపురుషుడు కాడు అయినను వాని వివాహమును తిక్కన్నగారు వర్ణించిరి ఇందుకు హేతు విట్లూహింపవచ్చును భరతవంశము నిలిచినది అభిమన్యునివలన ప్రజాయై గృహమేధినామ్ అని సూక్తి ప్రజాతంతువు విచ్ఛిత్తి పొందకుండుటకొరకు వివాహము. దుర్యోధనాదులకు సంతానము కలిగినను వారు బ్రతికి బట్టకట్టినదిలేదు. వారి సంతానము మధ్యలో విచ్ఛిత్తిని పొందినది అందువలన వారి వివాహములకు ప్రయోజనములేదు వివాహముయొక్క ప్రయోజన మెవరియందు లేదో వారి వివాహము వర్ణింపబడుట అనవసరము కనుక దుర్యోధనాదుల వివాహములు భారతమున వర్ణింపబడలేదు. అయినచో నిపు డిట్లనవచ్చును. పాండవుల సంతానము మధ్యలో విచ్ఛిత్తి పొందినది అయినను ద్రౌపదితోడి పాండవుల వివాహము వర్ణింపబడినది. అది యెట్లు పొసగుచున్నది? - దీనికి సమాధాన మిది - ప్రధానమైన భారతకథ ద్రౌపదివలన కొంత పుట్టినది ఆమెవలన కథలో ఘర్షణ, వేగము, ఎక్కువయినవి మరియు లక్కయింట దగ్ధమైయుందురని దుర్యోధనాదులచేత ననుకొనబడు పాండవులు, నిర్భయులై వెలికి వచ్చుటకు, ధృతరాష్ట్రుడు వారిని బిలువనంపి రాజ్యమిచ్చుటకు, వారికైన ద్రుపదునితోడి చుట్టరికము కొంత కారణము. ఆ తరువాత దుర్యోధనునియొక్క పాండవుల యందలి వైరభావమును మరియు తీవ్రము జేసినది. ఐదుగురకు భార్యయై యున్న ద్రౌపది ఆమె లేనిచో కౌరవ పాండవ వైరము స్వభావ మెట్లుండి యుండెడిదో మనకు తెలియదు. ఆమెనుజూచి కౌరవు లెంతగా మత్సరభావము పెంచుకొనినది, వస్త్రాపహరణము ఘోరము జరుగుట కవకాశములేదు. తద్వైరమున నది పరమమైన యవధి. పాండవుల కష్టములును ద్రౌపదివలన మరింత దుస్సహములైనవి. పాండవులు కౌరవులతోడి యుద్ధమునకు దిగుటకు ద్రౌపది సగము కారణముగా కనిపించుచున్నది. ఇంతగా భారతమునందలి ప్రధానకథయైన కౌరవ పాండవ వైరముతో నామెకు సంబంధ ముండుట వలన, ఆమెతోడి పాండవుల వివాహము భారతమున వర్ణింపబడినది. పాండవ వంశము నిలుచుటకు నీ యుత్తరాభిమన్యుల వివాహము మూలము గనుక నిది భారతమున వర్ణింపబడినది బ్రాహ్మణవేషములతో రహస్యముగా కాలము గడుపుకొనుచున్న పాండవులు ద్రౌపదీవివాహముతోడ వెలికి వచ్చినట్లే, ఉత్తరాభిమన్యుల వివాహముతో నజ్ఞాతవాసమునుండి పాండవులు బయట పడిరి. ఉత్తరగోగ్రహణమునందలి యర్జునుని విజయప్రశంసాకాలమున

ప్రసక్తమై నిశ్చయింపబడిన యభిమన్యుని వివాహ మీ పర్వమునందలి ప్రధాన కథతో పొందుపడియున్నది. ఈ విధముగా పాండవుల అజ్ఞాతవాససంవత్సరము మంగళాంతమై ముగిసినది

కీచకవధ జరుగనిచో గోగ్రహణమే లేదు. అందువలన కీచకవధ వర్ణింపబడినది. కీచకుని మోహతీవ్రతను తిక్కన్నగారు బహుముఖముల వర్ణించిరి. అంత తీవ్రమోహమును కీచకుడు ప్రదర్శింపనిచో, సమయభంగమును లెక్కచేయక ద్రౌపది భీముని కీచకుని జంపుటకు ప్రోత్సహించియుండెడిదికాదు భీముడును పూనుకొనియుండెడివాడు కాడు అప్పటికి సమయ భంగము జరుగకుండునట్లుగా జాగ్రత్తపడియే రహస్యప్రకారమున భీముడు చంపెను ద్రౌపదియు నట్లే జాగ్రత్తపడవలయునని భీముని బోధించినది

కావున వంచన బాహిర పోవకయుండంగ
మన రిపుల బరిమార్పంగా వచ్చునేని నట్టిద నా పలవు
అటుగాక తక్కినను వలదుసుమీ[1]

ఇది ద్రౌపది భీముని బోధించినతీరు ఇది విని భీమసేను డామెతో నిట్లనినాడు.

మదమున గీచకాగ్రజుడు మార్కొని నిల్చిన వీకమై మెయిం
గదిసిననేని నప్పుడు ప్రకాశగహాస్యవిభేదబుద్ధి నా
కొదవునె? యైన నేమగుగాక యొండొకటి బోపినభంగి నిగూఢవృత్తిమై[2]
బదిలముగల్గి తిన్ననియుపాయమునం దెగజూతు నాతనిన్.

తమ రహస్యమైనయునికి బయలుపడునట్లైనచో నక్కరలేదని ద్రౌపది చివరకనినది చివరకనగా, కీచకుని నొంటిగా రాత్రికి నర్తనశాలకు రమ్మని చెప్పి వాని నొప్పించిన తరువాత నీవు కీచకుని జంపనిచో నేను బ్రతుకజాలనని యేడ్చి, భీముని అందుకు సిద్ధము చేయుచో ద్రౌపది అట్లనలేదు ఈ సంభాషణలో భీమసేనుడే సమయభంగము విషయమును స్పృశించినాడు. అంతయు సిద్ధమైన తరువాత ద్రౌపది సమయభంగమగుచో కీచకుని చంపనక్కరలేదన్నది. సాధ్యమైనంతవరకట్లు సమయభంగము కాకుండునట్లుగానే చంపెదనని భీమసేను

1. భా. విరా 2-287.
2 భా. విరా. 2-289.

డామెతో ననినాడు. భీముని ఇట్లనుట, నేనా విషయమిదివరకే నీకు జెప్పితిని- అపుడు నీవేమియు మాటాడిన దానవుకావు - ఇప్పుడు నీవునాకు చెప్పు చున్నావు - బాగుగనేయున్నది - సాధ్యమైనంతవరకట్లే ప్రయత్నించెదను - అనినట్లున్నది భీముడు మొదటినుండియు నా విషయ మాలోచించుచునే యున్నాడు అందుకే రాత్రిపూట నర్తనశాల సంకేతముచెప్పి వానిని రమ్మను మని భీము డామెకు చెప్పినాడు. అంతనుండి ద్రౌపదికిని ఆ విషయమై ఆలోచన కలిగియుండును. అందువలన చివరకు భీమునితో తానే ఆ మాటనినది ఇంతగా జాగ్రత్తపడియైనను, కీచకుని చంపు విషయమున ద్రౌపదియు భీము డును ప్రవర్తించుటకు హేతువు, కీచకుని ఉచితానుచితవివేకమును కోలు పోయిన తీవ్రమైన మోహపుటున్మాదము అందువలన తిక్కన్నగారు వాని ద్రౌపదియందలి మోహలక్షణము నమితముగా వర్ణించెను. ఆ వర్ణనమువలన, ఇక కీచకుడు చంపబడనిచో, ద్రౌపది తట్టుకొనగలుగుట కష్టమని నిరూపించు టయే ప్రయోజనము. ఆ విధముగా కీచకవధ అనివార్యమైనదని నిరూపించి, దానివలన గోగ్రహణమునకు ప్రసక్తి కల్పించి, దానినుండి ప్రధానకథా సంబంధముగా సాధించవలసిన సర్వప్రయోజనములను తిక్కన్నగారు సాధిం చిరి ఒక మహాకథలోని యవాంతరవిషయము లన్నింటిని, లెస్సగా పరిశీలించి, తదభిముఖములుగా జేసి, ప్రయోజనసిద్ధ్యపేక్షయా నిర్వహించుట, కథా రహస్యపరిజ్ఞానము గలిగిన మహాకవుల కథన శిల్పము లక్షణము. తిక్కన్నగారు మహాకవి.

పాండవుల క్రియాపరత కీ పర్వము నాందివాక్యముగా నున్నదని చెప్ప బడినది. దీని యర్థము నన్నయ్యగా రాదిపర్వమున జేసిన ఒక నిష్కర్షనుబట్టి స్పష్టపడగలదు

వనమునఁ బదియురెండేడు లజ్ఞాతవాస మొక్కేడు
జనపదంబుననుండి తపన నయ్యేండ్లు సలిపి సద్వ్రత్తు
లనఘులు మును వేడికొనక మఱి భారతాజి సేయంగ, మొనసిరి-[1]

భారతకథను సంగ్రహముగా జెప్పుచు నన్నయ్యగారు వ్రాసిన పద్యమది. /అజ్ఞాతవాస సంవత్సరమైన తరువాత పాండవులు కౌరవులతోడి యుద్ధమునకే

1. భా. ఆది. 3-19.

మొనసిరి. తమ రాజ్యము తమకిమ్మని దుర్యోధనాదులను వేడుకొనలేదు అనగా నజ్ఞాతవాసము పూర్తియైన తరువాత పాండవులు యుద్ధము చేయుటకే నిశ్చయించుకొనినారని యర్థము. ఇది నన్నయ్యగారి నిష్కర్ష. ఇది యిట్లే ఉద్యోగపర్వమున లోకాతిశాయి రమణీయముగా తిక్కన్నగారిచేత నిరూపింపబడినది ఆ యుద్ధమే పాండవుల క్రియాలక్షణము. దానికి తగిన సూచన లీ విరాటపర్వమున తిక్కన్నగారిచేత నిక్షేపింపబడినవి అందువలన పాండవుల క్రియాపరత కీ పర్వము నాందివాక్యమని చెప్పబడినది

అజ్ఞాతవాసమునకు పోబోవుచు, తమతోనున్న విప్రుల యనుమతిని తీసికొనిన తరువాత, ధర్మరాజు, తామాపదలకు విషమరగాంచు దిన మది యెప్పటికైన వచ్చునా యని డగ్గుత్తికవెత్తి దుఃఖపరవశుడు కాగా, ధౌమ్యుడు తదీయ విషాదాపనోదము సేయుచు ఇంద్రాదులు పొందిన కష్టముల నుగ్గడించి చివర నిట్లనినాడు.

వినమె యిట్లు పడిన పీఁకులు పదపడి
తమకు నగ్గమైనయట్టి జయింప
రెట్లు ప్రబలి రిపుల నీవును నాఁడు
కోర్చి భంగపాటు దీర్చికొనుము [1]

ప్రస్తుత మాపదల కోర్చికొని నీవును వారివలెనే శత్రువులను జయింపుమని ధౌమ్యుడనినాడు./ శత్రువులను జయించుటకుగా కౌరవులతోడ యుద్ధముచేసి జయించు టనియేకదా! ఆ ధౌమ్యుని "పలుకులు విని యని చిత్తమున నెఱయ దేఱి ధర్మతనూజు డనుజన్ముల దెస జూచి[2]" నాడని తిక్కన్నగారు వ్రాసిరి. యుద్ధముచేసి జయింపుమని ధౌమ్యుడనుటతో ధర్మరాజు చిత్తము నెఱయ దేఱెనా అనగా నాయనకదియే కర్తవ్యమని తోచినదన్నమాట తన తమ్ముల యూహ యెట్లున్నదో అని వారి దెస చూచియుండవచ్చును. వారియూహ తోడనే చూచెను. ఆ చూపునొక్క అర్థమును గ్రహించి భీము డిట్లనినాడు–

1. భా. విరా. 1-54.
2. భా. విరా. 1-55.

భంగదాజ్ఞాదృఢబంధ సంయమిత శుంభద్వేగమైకాక నా
డచలీలన్ మన యర్జునద్విపము క్రోధావేశదుర్దాంతద
ర్పనిలాసోద్భటభంగి నేపడరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జి
క్కువడం జేయదె యొక్క వ్రేల్మిడిని నీకున్ వేడ్క సంధిల్లగన్ [1]

నీవు వలదనుటచేత మే మాగుచున్నాముగాని, మేమెప్పుడును కౌరవులతోడి యుద్ధమునకు సిద్ధమే-అనినట్లుగా భీముడు మాటాడినాడు. ఈ భీముని మాటలు "విని ధర్మనందనుండు దెలివొందిన మొగంబుతోడ శిరఃకంపంబు సేసె[2]" నని తిక్కన్నగారు వ్రాసిరి. ధౌమ్యుని మాటవలన ధర్మరాజు చిత్తము కలకదేరినది. భీముని మాటలవలన మొగము తెలివొందినది. మఱియు ధర్మరాజు శిరఃకంపము చేసినాడు. చిత్తము కలకదేరుటయనగా అవ్యాకులమగుట. ధౌమ్యుడు శత్రువులను జయింపుమని చెప్పగానే ధర్మజుని చిత్తమవ్యాకుల మైనదనుటచేత తత్పూర్వము వ్యాకులమై యున్నదని తెలియుచున్నది. వ్యాకులమై యున్నదనగా మిక్కిలిగా చెదరిపోయి యున్నదని. "ఒకనాఁ డేమును నాపదలకు విడుమగఁగాంచి విపులం బుట్టలఁ బెట్టుకొని సుఖముండబడయుదమొకో ?[3]" - అని అంతకుముందుగా ధర్మరాజనిన మాటయందు వాని చెదరిన చిత్తము లక్షణముగ కనిపించుచున్నది. అట్లు సుఖముండుటకు శత్రువులను యుద్ధముచేసి జయించుటయేగాని మరొకటిలేదు. ఈ యభిప్రాయమునే ధౌమ్యుడు చెప్పినాడు. అందువలన ధర్మరాజు చిత్తము కుదుటబడినది. కౌరవులను నాశనము చేసి నీకు వేడ్కసంధిల్ల జేయుట అది యెంతపనియన్నట్లుగా భీముడనుటవలన ధర్మరాజు ముఖమున సంతోషమలముకొనినది. తన తమ్ములు తన యాజ్ఞకు లోబడి సిద్ధముగనే యున్నారని ధర్మరాజు సంతోషించినాడు. ఆ సంతోషముతో శిరఃకంపము చేసినాడు. నిజమే - మీరు సిద్ధముగనే యున్నారు - ఇంతవరకు నేనే మిమ్మాపితిని - ఇక ఈ సంవత్సరము దాటినచో మీయిష్టమే కాగలదు - అను ఈ యర్థముతో ధర్మరాజు శిరఃకంపము చేసినాడనిపించుచున్నది. ఈ విధముగా పాండవుల బుద్ధి విరాటనగరము ప్రవేశించుటకు ముందుగా, తరువాత జరుగవలసిన యుద్ధమును

---

1. భా. విరా. 1-56
2. భా. విరా. 1-57.
3. భా. విరా. 1-49.

గురించి యాలోచించినది/ యుద్ధమునుగూర్చిన తలపులతోనున్న పాండవుల నా "విప్రులందఱు నొక్క-మొగిన మీ తలంపునకు దైవం బనుకూలంబుగావుత"[1] మని దీవించిరి. ఈ బ్రాహ్మణుల ఆశీర్వచనమునందు, ఉద్యోగపర్వము ప్రారంభమునుండి యుద్ధమున కనుకూలమై ప్రవర్తించిన భగవంతుడైన శ్రీకృష్ణుని విషయమును నిక్షిప్తముచేసి తిక్కన్నగారు కథార్థమును సూచించుచున్నట్లు కనిపించుచున్నది.

మరియు పాండవుల యుద్ధక్రియాతత్పరమైన బుద్ధిలక్షణము గోగ్రహణ కాలమున నభివ్యక్తము చేయబడినది సుశర్మపై నెత్తిపోవు విరాటుడు ధర్మరాజును సహాయము రమ్మని పిలువలేదు ఆయన తన సైన్యమును దీసికొని తాను యుద్ధమునకు బోవుచుండగా "ధర్మతనయుం డనిలతనయ మాద్రీతనయుల నంతంతం బొడసూపి నిలువుండని నిపుణంబుగా నియోగించి తానును మత్స్యమహీవల్లభు నల్లనచేరి[2]

> ఒక ఋషిచేత నాయుధసముత్కరమెల్లను సప్రయోగ మం
> త్రకముగ నభ్యసించి సమరంబునకుం గొఱయైనవాఁడ గో
> ప్రకరములన్ మరల్చుటకు బంధులు నీవును బోవ నాకు నిం
> టికడనయున్కి పాడియె ఘటింపఁగఁ బంపు రథంబు చయ్యనన్.

అని తన విషయమును చెప్పి తనను యుద్ధమునకు దీసికొని పోగోరెను. అందుకు విరాటు డియ్యకొనగా "పవనతనయుఁ గవలంగొని సమరంబునకుఁ బోవ గోరెడు మదితో" మరియు విరాటునితో ధర్మరా జిట్లనినాడు-

> మన వలలుండు లావున బంటుతనమున
> జను లెఱుంగఁగ నడి సన్నవాఁడు
> మంచిమగండు దామగ్రంథి యసమసం
> గ్రామకేళీ గాఢకౌతుకుండు
> వినుము తంత్రీపాలుఁడును దుర్దమారాతి
> మర్దనచాతుర్య మహితభుజుఁడు

---

1. భా. విరా. 1-57.
2. భా విరా. 3-149-152.

మున్నును వీరలు మువ్వుర కడఁకల
కోలఁదు లేనెఱుఁగుదుఁ గొంత కొంత
యెక్కుఁడగునట్టి యరదంబు లిచ్చి వీరి
ననికిఁ దోకొనిపోక కార్యంబు నాకుఁ
జూడ—

ఈ విధముగా వారు యుద్ధమునకు వచ్చుటకుగూడ విరాటు డంగీకరించునట్లు ధర్మరాజు చేసినాడు దీనివలన ధర్మరాజు యొక్క మంచితనమును విరాటు డూహించి మెచ్చుకొనిన మెచ్చుకొనవచ్చును అది ప్రధానముకాదు. యుద్ధక్రియా పరమైన ధర్మజుని బుద్ధిలక్షణము తెలియవచ్చుట ప్రధానము, పాండవుల బుద్ధి యుద్ధాభిముఖమై యుండుటయే, ధర్మరాజు తానుగా కల్పించుకొని పోయి విరాటు నట్లు కోరుటకు మూలము. పాండవుల యా బుద్ధిలక్షణము ను తిక్కన్న గారు భంగ్యంతరమున చెప్పనే చెప్పిరి. విరాటుడు సుశర్మ నెదుర్కొనినాడు. యుద్ధము జరుగుచున్నది ప్రొద్దుక్రుంగినది. చీకటి పడినది తప్పనిసరిగా కొంతసేపు యుద్ధమాపి ఊరకొనవలసి వచ్చినది అపుడు చంద్రోదయ మైనది. యుద్ధము తిరిగి ప్రారంభమైనది. ఆ చంద్రోదయము ను తిక్కన్నగా రిట్లు వర్ణించిరి—

తన మనుమలు పాండుతనయు
లనిసేఁతకు వేడ్కసేయు టాత్మఁగని తమం
బున వారు మెఱయరని వ
చ్చిన క్రియ శశిపూర్వశైలశిఖరం బెక్కెన్ [1]

పగటిపూట ధర్మరాజాదులు యుద్ధము చేసినట్లు తిక్కన్నగారు వర్ణింపలేదు శత్రువులు పగలు తమ్ము గుర్తింపవచ్చునని వారు యుద్ధమున పాల్గొనక యుండక పోవచ్చును ఒకవేళ పాల్గొనినను ప్రక్కప్రక్కల నతి సామాన్యులవలె నుండియుండవచ్చును రాత్రి యైనచో విజృంభించి యుద్ధము సేయవలయు నని వారి కున్నది కాలమునుబట్టి వెనుకనుం దాడుచున్నారుగాని అనిసేతకు వేడ్కసేయుట మాత్రము వారి బుద్ధియందున్నది. అది చంద్రుడు తెలిసికొని నాడని తిక్కన్నగారు చమత్కరించిరి. పాండవుల బుద్ధి యుద్ధమున కభి

1. భా. విరా. ఆ. 4-197.

ముఖమై మరియునందు వేడ్క కలిగియున్నదని భంగ్యంతరముగా చెప్పినదైనది

దక్షిణగోగ్రహణమునకు, ధర్మరాజు తాను కల్పించుకొని పోయినట్లే, ఉత్తరగోగ్రహణమునకు నర్జునుడు తానుగా కల్పించుకొని పోయినాడు ఆ యర్జునుని పోవుటకు ద్రౌపది కొంత సహాయపడినది గవాధ్యక్షుడువచ్చి, ఉత్తరకుమారునితో కౌరవులువచ్చి గోవుల నాక్రమించినారని చెప్పి, మరలం దెచ్చుటకుం గడంగుమని ప్రార్థింపగా, భూమింజయుడు తనకు తగిన సారథి కావలయునని అట్టి వానిని తీసికొని రమ్మనినాడు అని మరియు నిట్లనినాడు-

కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజ ముఖ్యులు మత్సరియుక్తమ
స్ఫురణము సూచి పార్థునకు బుద్ధి గలంగఁగఁ బెట్టి గిట్టి యిం
గగమున నోర్చియేఁ జాలఁ గ్రిమ్మరుఁ దేరయున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరిహాసముఁ జిత్తములందు మెత్తురే[1]

ఈ యుత్తరకుమారుని మాటలు ద్రౌపది విన్నది ఆమెపోయి యర్జునునకు చెప్పినది అతడామె ముఖమున తన నుత్తరకుమారుడు పిలిపించుకొనునట్లు చేసికొనినాడు ఆ విధముగా కౌరవులతోడి యుద్ధమున నర్జునుడవకాశము కల్పించుకొని పోయినాడు ద్రౌపదిపోయి అర్జునున కేల చెప్పవలయును ? ఆమెకును యుద్ధమునందు బుద్ధియున్నది కావలయును ఉత్తరుడు కౌరవుల మీదకు పోయి పార్థుడను బుద్ధి పుట్టించు నని నాడు ఆ మాటలు వినగనే ద్రౌపది, నిజముగా పార్థుడే కౌరవులపైకి బోవుట మంచిగా నుండునని అని పించి యుండును అర్జునుడు కౌరవులను సురుమాడుట ఆమె మనస్సున తత్క్షణ మున భాసించియుండును కనుకనే అర్జునుని వద్దకుపోయి - ఇట్లని గాని యును వచ్చినది. నీవు పోవుట మంచిదని ఆమె చెప్పియుండును మెత్తురే పలుకుల జెప్పినదని తిక్కన్నగారు వ్రాసిరి. అర్జును డందుల కొడబడునట్లుగా ప్రయత్న ముతో చెప్పినదని యర్థమగుచున్నది. ఆ సమయమున నజ్ఞాతవాసమయ విష యమును వా రాలోచించినట్లు కనిపించుచున్నది కనుకనే "అతండు నజ్ఞాత వాసవత్సరం బతీతంబగుట నిరూపించి" నాడని తిక్కన్నగారు వ్రాసిరి. ఆ విధ ముగా ద్రౌపది ప్రేరణముమీద అర్జునుడును ప్రోత్సాహుడై "నీవు పోయి

1. భా. విరా. 4-11.

వారలతో నిట్లనుము మన బృహన్నలకు సారథ్యంబు సేయు సామర్థ్యంబు గలదు. తొల్లి ఖాండవదహనంబునం బాండవమధ్యమునకు సారథియై యతని చిత్తంబు వడసె. మఱియుఁ బెక్కెడలం దదీయంబగు రథంబు గడపఁ దానయై యుండు నేను నెఱుంగుదు. తత్సాహాయ్యంబునం గురుసైన్యంబుల జయింప వచ్చుటకు సంశయంబు వలవదనుము వారేమనిరేని మఱియుం దగనాడి నన్నుం బిలిపించునట్టి తెఱంగు గావింపుము" అని చెప్పి ఆమెను తన కార్యము నకు సాధనముగాఁ జేసికొనినాడు. నేను పార్థుడనునట్లుగా కౌరవుల మీదకు పోవుదునను ధోరణిలో నుత్తరుడు మాటాడినాడు ఆ మాట ద్రౌపదివలన వినియే, మన బృహన్నల వెనుక పార్థునకే సారథి అని చెప్పుమని చెప్పినా డామెతో అర్జునుడు ఆ మాటవిని భూమింజయుడు నిజముగా తనను తా నర్జును డనుకొని బృహన్నలను పిలువనంపవచ్చును ఇది అర్జునుని యూహ. ముందు కొంచెము వెనుకాడినను చివరకు నుత్తరు డట్లే చేయవలసివచ్చినది

ఇదంతయు గోగ్రహణకాలమున నభివ్యక్తమైన యుద్ధక్రియాపరమైన పాండవుల బుద్ధిలక్షణము ద్రౌపదియందు సయితము తద్బుద్ధి నిరూపింప బడినది

ఈ విరాటపర్వాంతమున మరియు చిత్రముగా కౌరవపాండవ యుద్ధము సూచింపబడినది తన నాశ్రయించుకొని ఇంతకాలముగా నున్న కంకుభట్టు మొదలైనవారు ధర్మరాజాదులైన పాండవులని తెలిసిన తరువాత విరాటు డిట్లనినాడు ∠ ధర్మజు నుద్దేశించి.

ధరణియుఁ బట్టణంబు హయదంతి రథంబులు గోవులున్ భటో
త్కరము నమాత్యవర్గమును గాఁగల రాజ్య మితండ యేలు ని
ర్భరమున నేనుఁ బుత్రులును బంధులుఁ దమ్ములుఁ గొల్చియుండెదం
గరిపురి కెత్తునట్టి పని గల్గిన నోపిన యంత సేసెదన్.[1]

విరాటుని ఈ మాటలు విని భూమింజయుడు "అది సిద్ధంబట్లు చెల్లుంగాక"[2] అనినాడు. విరాటుడు చెప్పినవి రెండు విషయములు – ఒకటి, తన రాజ్య

1 భా. విరా. 5-348.
2. వ. 350.

మంతయు ధర్మరాజేలుచుండగా తాను, తనవారును వానిని కొలిచియుండుట. రెండు, హస్తినాపురము మీద కెత్తిపోవుట గలిగినచో తనకు చేతనైన సహాయము తాను జేయుట. ఉత్తరుడది సిద్ధంబు - అట్లు చెల్లుంగాక యనినాడు ఏది సిద్ధమై యట్లు చెల్లును? తమ రాజ్యమును ధర్మరాజేలుట సిద్ధమై యట్లు చెల్లునని ఉత్తరు డనుచున్నాను కరిపురికెత్తునట్టిపని యనగా కౌరవులతోడి యుద్ధమే. పాండవులు యుద్ధము చేయుదురో చేయరో వారికి తెలియదు. అందుకే విరాటుడనినాడు "కరిపురికెత్తునట్టిపని గల్గిన—" అని. అనగా యుద్ధము సంభవించినచో ననియే గదా అర్థము-? కనుక తప్పక యుద్ధమగునని వానికి తెలియదు. అట్లే ఉత్తరునకును తెలియదు కాని, ఉత్తరుడనిన "అది సిద్ధం బట్ల చెల్లుంగాక" అను వాక్యము, వానికి తెలియకుండనే, విరాటుడనిన "కరిపురి కెత్తునట్టిపని గల్గిన" అను వాక్యమునందలి నిశ్చయరాహిత్యమును త్రోసిపుచ్చు చున్నది వలెనున్నది అనగా యుద్ధము సిద్ధమని చెప్పినట్లైనది ఈ మాట విరాటుడు గాని, ఉత్తరుడు గాని చెప్పుట లేదు. తిక్కన్నగారు చెప్పిరి ఆయన యైనను వాచ్యముగా చెప్పలేదు - ఆ తండ్రికొడుకుల సంభాషణ మట్లు ప్రకృతమున కనుగుణముగా వ్రాయుచు, దానినుండి భవిష్యదర్థమును సాధించి పెట్టెను ఈ యర్థమును సాధించవలయునన్న దృష్టి తిక్కన్నగారికి లేనిచో విరాటునిచేత "కరిపురి కెత్తునట్టిపని గల్గిన నోపినయంత సేసెద" నని యనిపించ నక్కరలేదు ఆ మాట విరాటునిచేత ననిపించి పాండవులకు యుద్ధమునకను కూలమైన సహాయసంపత్తి యేర్పడుచున్నదని సూచించుటతోపాటు, తరువాతి యుత్తరుని వాక్యమువలన యుద్ధము తప్పదన్న భావ్యర్థమును తిక్కన్నగారు నాటకకవి వలె సాధించెను.

ఈ విధముగా పాండవుల యుద్ధక్రియాపరత, ఈ పర్వ మాదిమధ్యాంత ములయందు నిరూపింపబడినది. ఆపదకోర్చి భంగపాటు దీర్చికొనుమని ధౌమ్యు డనుట, అజ్ఞాతవాసానంతరము యుద్ధముచేసి శత్రువును జయింపుమనినట్లున్నది ఆ మాటకు ధర్మజుని చిత్తము కలకదేరినదని చెప్పబడుటచేత యుద్ధము ప్రక టించుటకు ధర్మజుడు నిశ్చయించుకొనినాడని చెప్పినట్లైనది గోగ్రహణకాల మున పాండవులు తాముగా యుద్ధము చేయుట కవకాశము కల్పించుకొనినట్లు చెప్పబడుటచేత, కౌరవులతోడి యుద్ధమునకు వారు సంసిద్ధులై వేడ్కసూపు చున్నారని చెప్పినట్లైనది. సామాన్యబుద్ధితో విరాటుడనిన వాక్యము గూడ,

పాండవులు కౌరవుల మీద కెత్తిపోవుటనే చెప్పుచున్నట్లు వ్రాయుటచేత, పాండవుల యుద్ధక్రియాపరత సూచించినట్లైనది "మును వేడికొనక మఱి భారతాజి సేయంగ" పాండవులు మొనయుటను నిర్ణయించిపెట్టిన నన్నయ్యగారి పథకము తిక్కన్నగారిచేత తూచా తప్పక అనుసరింపబడినది ఉద్యోగపర్వమునుండి రంగముమీదకు వచ్చుచున్న ఏతల్లక్షణ మీ పర్వమున తత్రతత్ర సూచింపబడుటచేత ఇది పాండవుల క్రియాపరతకు నాందిగా కనిపించుచున్నదని చెప్పబడినది

మరియు నీ పర్వము దుర్యోధనుని విజృంభణమునకు భరతవాక్యమనుట లోని అంతర్యమిది - అజ్ఞాతవాసము పూర్తియైన తరువాత పాండవులు యుద్ధమునకు మొనసినట్లుగా, మొదట దుర్యోధనుడు పాండవులతో విరోధము కల్పించుకొనినాడు ఆ విషయమును నన్నయ్యగారిట్లు వ్రాసిరి—

పాండు కుమారులు పాండుభూపతి పరో
క్షంబున హాస్తిపురంబునందు
ధృతరాష్ట్రునొద్దఁ దత్సుతులతో నొక్కటఁ
బెరుగుచు భూసురవరులవలన
వేదంబులును ధనుర్వేదాది విద్యలుఁ
గఱచుచుఁ గడలేని యెఱుకఁదనరు
చున్నఁ దద్విపుల గుణోన్నతి సైపక
దుర్యోధనుండు దుష్కార్యమెత్తి
దుర్ణయమున శకుని కర్ణ దుశ్శాసనుల్
గఱపఁ బాండవులకు నలయచేయ
గడఁగె[1] —.

ఆ విధముగా పాండవుల యెడల దుర్యోధనునకు నిష్కారణ వైరము పుట్టినది ఆ వైరము మొదటిమొదటి లక్షణములు, భీముని చంపించు యత్నమునందును, వారణావతమున లక్కయింట నందర నొక్కసారిగా చంపించు యత్నము నందును ప్రతిభాసించినవి అవి పెద్దవారికి తెలియకుండునట్లు రహస్యముగా

1. భా. ఆది. 3-12.

దుర్యోధనుడు చేయించిన పనులు తరువాత మాయాదురోదరవ్యాజమున పాండవశ్రీ సమస్తము నపహరించుటకుగాను దుర్యోధనుడు చేసినది బహిరంగముగా చేసినాడు. ఈ ద్యూతమే, కౌరవపాండవ వైరముతో నైన భారతకథ కాయువుపట్టు. ద్రౌపది నవమానపరచి, అనుద్యూతమున తిరిగి ధర్మరాజు నోడించి, పాండవులనందరను నడవులకు తోలుటతో, దుర్యోధనుడు విజృంభించి, పాండవులతోడి వైరమును పెంచవలసినంతవరకు పెంచుకొనినాడు ఆది సభా పర్వములయందలి ప్రధానకథ యింతయు దుర్యోధనుని తీవ్రాభినివేశము మూలముగా రూపుగట్టుకొనినది పాండవు లరణ్యములకు బోవుటతో ప్రధానకథ ఒక విధముగా నాగిపోయినది. ఆ పదురెండేడులలో నొక్క ఘోషయాత్రయందు తప్ప కౌరవపాండవులు కలిసికొనినది లేదు. అజ్ఞాతవాసంవత్సరమున పాండవులను కనుగొనుటకు దుర్యోధనుడు లెస్సగా నుత్సహించినాడు. వాని యుత్సాహము భగ్నమైనది. దుర్యోధనుడు తానుగా పాండవుల నేమో చేయవలయునని యెత్తివచ్చుటలో చివర ఘట్టము గోగ్రహణమే. తరువాత దుర్యోధను డేమి చేసినను, పాండవులు చేయుచున్నదానిని తెలిసికొని, దానికి ప్రతిగా తాను సిద్ధమగుట తప్ప, తాను ముందుగా వెనుకటివలె చేసినదేమియు లేదు పాండవులు యుద్ధమునకు సిద్ధమగుచున్నారని తెలిసికొని తానును సిద్ధమయ్యెను[1] పాండవులు యుద్ధరంగమునకు వచ్చినారని తెలిసికొని తానును బయలుదేరెను[2] అందువలన/ఆదిపర్వమున ప్రారంభమైన, దుర్యోధను డొంటికాలిమీద పాండవులపై కెగసివచ్చుట, విరాటపర్వమునందలి గోగ్రహణముతో నంతమగుచున్నది కనుక నీ పర్వము దుర్యోధనుని విజృంభణమునకు భరతవాక్యమని చెప్పబడినది ✓

/ ఇట్లీ పర్వమున పాండవధార్తరాష్ట్రుల ప్రవృత్తివైలక్షణ్యము నిరూపింపబడుటచేత నిది సంధిపర్వముగా భావింపబడినది మరియు ప్రధానకథ ఇందనుసంధింపబడియుండుటచేతను నిది సంధిపర్వమగుచున్నది.

1. భా. ఉద్యో. 1-50.
2. 4-132.

## 2. ఉద్యోగ పర్వము

ఉద్యోగపర్వము ప్రధానముగా పాండవుల సమరోద్యోగమును వర్ణించునది అది సభాపర్వములలో కౌరవులు చేసిన దానికి ప్రతీకారముచేయ దలపెట్టిన పాండవుల యారంభశీలతను ప్రపంచించిచూపిన గ్రంథమీ యుద్యోగపర్వము. తిక్కన్నగారి అసలు భారత రచన ఈ పర్వమునుండి మొదలైనది. విరాట మొక విధముగా దీని కుపోద్ఘాతము

భారతమున నాయకపక్షము పాండవులది ప్రతిపక్షము కౌరవులది ప్రతిపక్షము వారి ఉద్ధతములైన చర్యలతో కథ ప్రారంభమైనది. నన్నయ్యగారు కథను ప్రారంభించిరి. అపుడు పాండవులు నిష్క్రియులు. అనగా కౌరవుల కెదురుతిరిగి వారేమియు చేయలేదు. తమ ప్రాణముల కపాయము రాకుండ మాత్రము వారు జాగ్రత్తపడిరి మిగిలిన కౌరవులుచేసిన చేతల నన్నింటిని అనుభవించిరి. ఇది యాది సభాపర్వములలోని విషయము అరణ్యపర్వము కథ జరుగుటకవకాశములేనిది అది పాండవధార్తరాష్ట్రులను శత్రువులుగా కథను జరుగనీయక కొంతకాలము నిలబెట్టినది విరాటము కథానుసంధాన పర్వము తిక్కన్నగారు ప్రధానకథ ననుసంధానము చేసికొని భారతరచన కుపక్రమించిరి ఉద్యోగపర్వముతో తిరిగి పాండవ ప్రాధాన్యముకలిగి, భారత కథ ప్రారంభమగుచున్నది

నన్నయ్యగారినివదిలి స్వతంత్రించి వ్రాయుటకు తిక్కన్నగారికవకాశము లేదు ప్రతిపక్షము వారి చేతలతో కథను ప్రారంభించి, కౌరవ పాండవుల జీవ లక్షణములను నిష్కర్షించిపెట్టి అయన పోయెను పునాదులుతీసి, సౌధ నిర్మాణమునకవసరమైన వస్తుసంపద లక్షణమును జెప్పి యొకడు కాలము చేయగా, తరువాత కొంతకాలమున కింకొకడు వచ్చి ఆ పునాదులమీద, ఆ సంపద లక్షణలక్షితమైన వస్తువును సంపాదించి, ఏపాటి లోకాతిశయి రమణీయమైన శిల్పముతో నా సౌధమును నిర్మించుటకు వీలగునో, ఆపాటిది నిర్మించుట వంటిది భారతమును తిక్కన్నగారు వ్రాయుట. పైకి చూచుటకిది యింతేకదా అన్నంత సులభముగా కనిపించును గాని, దిగినచో దానంత కష్టమైనది మరొకటి యుండదు. భారతకథా సౌధమునకు నన్నయ్యగారు పునాదులు తీసిరి. నిర్మాణ సాధన సామగ్రియైన పాండవుల యాత్మలక్షణములను నిరూపించిరి

ఆ సామగ్రితో నా పునాదులమీద తిక్కన్నగారు మహాభారత సౌధమును నిర్మిం చిరి అది ఆయన మహాకవిత్వ దీక్షావిధి కవధిభూతము.

పాండవులు వినయాన్వితులు. అనుజులు నల్వురును ధర్మజున కత్యను రాగము కలిమిని విధేయులు వేదవిహితంబగు యజ్ఞమహోత్సవ సర్వపావన శుభ మూర్తి ధర్మరాజు మరియు శాత్రవజైత్రతేజము కలవాడు. పరమమైన ధృతిలక్షణము కలవాడు. బహుప్రకార వచనరచనావిశారదుడు. అంతయు నెరిగి, దాని తెర గేమరక, నెరుగని యట్లుండు గూఢమైన మతిలక్షణము కలి మిని, తన నోరు లెరుగకుండ, ఒరులను తాను నమ్మినట్టుల యుండువాడు. ధర్మ స్థిరమతి నన్నయ్యగారు నిరూపించి పెట్టిన పాండవులయొక్క, ముఖ్య ముగా ధర్మరాజుయొక్క, ఆత్మ లక్షణ స్వరూపమిది [1]

ఉద్యోగపర్వమునుండి ధర్మజుని సమరోద్యోగమే విషయము అది వీర లక్షణము కలది. ధర్మరాజు నాశ్రయించుకొని ప్రధాన రసముగా భారతమున ప్రతీయమానము కావలసినది శాంతము యుద్ధము లేనిచో భారతము లేదు. అట్లని ధర్మరాజు వీరపురుషుడుగా చూపబడరాదు శాంతమున కాలంబనమైన ధర్మజునియందు, నన్నయ్యగారు నిరూపించిన వాని మనోలక్షణమునుండి, అని వార్యమైన భారతయుద్ధమునకు మూలభూతమైన ఉత్సాహరూప చిత్తవృత్తి చూపబడవలయును. అనగా ధర్మరాజు యుద్ధవీరుడు కాకుండునట్లుగా వాని యందు యుద్ధవీరలక్షణము నిక్షేపింపబడవలయును ఇంతకంటె కష్టమైన కావ్యరచన మరియొకటి లేదు. ఇట్టి స్థితిలో తిక్కన్నగా రుపక్రమించిరి ఇట్లుపక్రమించి నన్నయ్యగారు చెప్పిన ధర్మజుని గూఢమైన మతిలక్షణము ప్రధానముగా చేసి వానియందు స మ రో ద్యో గ ము ను తిక్కన్నగారు నిరూపించిరి. ఆ ధర్మజుని గూఢమైన మతిలక్షణమును తిక్కన్నగారు భావించిన తీరు - అది ఆయన మహామేధావిలక్షణములో నొక భాగమైన పరమలౌక్యము నకు పరాంకోటిస్థితి. ఉద్యోగపర్వము గొప్పతనమంతయు నేవం విధమైన లౌక్యముమీద నాధారపడియున్నది మరియు కొన్ని విశేషములుండవచ్చును. అది వేరువిషయము. తానుగా సమరోద్యోగముచేసిన ధర్మజుని 'మెత్తనిపులి'గా

---

1 భా. ఆది. 5-94, 97, 163, 6-143, 154, 156, 8-81.

నిరూపించి, వాని గూఢమైన మతిలక్షణమును వ్యాఖ్యానించిన తిక్కన్నగారికి తెలిసినంతగా నన్నయ్యగారి కవిహృదయము మరొకరికి తెలియదు. విచారిత పూర్వపర్వకథా పరమార్థబుద్ధితో తిక్కన్నగారు భారతరచనమును ప్రారంభించిరి కనుకనే మొత్తము నిర్మాణమంత మహనీయప్రభావంతమును, దివ్యమును నై అనన్యముగా నున్నది

ఈ పర్వమున మూడు రాయబారములు జరిగినవి. అవి యొకదానినుండి మరొకటిగా పుట్టినవి మొదటిది ద్రుపదపురోహితుడు కౌరవులకడకు బోవుట అందుకు మూలము బలరాముడు ఆయన దుర్యోధనునియం దొకవిధముగా పక్షముగలవాడు అభిమన్యుని వివాహానంతరము జరిగన పాండవుల కార్యాలోచనసభలో బలరాముడు లేకుండినచో ఇన్ని రాయబారములుండెడివి కావేమో? నాడాయన కలుగజేసికొనుటవలన పురోహితుని రాయబారము ప్రవర్తించినది. ఆ పురోహితునిమాటలు వినిన ధృతరాష్ట్రుడు యుద్ధమున కలికియు, విచిత్రమైన మానిసియగుటచేత సంజయుని పాండవులకడకు బంపినాడు సంజయుడు ధర్మరాజువద్దకు వచ్చి మాటాడిన సందర్భమున శ్రీకృష్ణుడు బహ్వర్థముల నాశించి తాను రాయబారిగా కౌరవులకడకు బోవుటను కల్పించుకొని పోయినాడు ఈ విధముగా నొకదానినుండి యొకటిగా నీ రాయబారములు పుట్టినవి పాండవులు యుద్ధమునకు మొనయుట ఈ పర్వమున చాల జాగ్రత్తగా నిరూపింపబడినది. సంజయ రాయబారము పూర్తియగువరకు పాండవుల సమరోద్యోగ మొకభాగము తరువాతిది మరియొకభాగము దుర్యోధనుడుగూడ సమరోద్యోగము చేసినాడుగాని, పాండవద్వేష మాతనికి క్రొత్తదికాదు గనుక ఈ పర్వమున విశేషమైనదికాదు. ఉద్యోగము స్వభావమిక నిరూపింపబడును

## పురోహితుని రాయబారము

''పాండవ కార్యార్థియై కృష్ణుండు దదీయవచనంబులు వారించి వారలం గలయంగనుంగొని యిట్లనియె''[1]—ఇది యజ్ఞాతవాస సంవత్సరానంతరము అభిమన్యుని వివాహమైన ఐదవనాడు, ఆ పెండ్లికివచ్చిన బంధుమిత్రుల సమక్షమున జరిగినది. శ్రీకృష్ణుడు పాండవ కార్యార్థి. అనగా పాండవుల కార్య

1. భా. ఉద్యో. 1-6.

మును చేయుటయందు కోరికగలవాడు. మరియు పాండవులచేత, తమ కార్యార్థమైన రాజ్యముపొందుట సిద్ధించుకొరకు అభ్యర్థింపబడినవాడును కావచ్చును తమరాజ్యమును తాము పొందు విషయమున సహాయము చేయవలసినదిగా పాండవులు శ్రీకృష్ణుని కోరియుందురు ఈ కోరుట యెప్పుడైనదియు తిక్కన్నగారు వ్రాయలేదు. బహుశః ఆ పెండ్లియైనప్పటినుండి నాటి లోపుగా జరిగిన మూడు దినములలో నైయుండవచ్చును శ్రీకృష్ణుని తమకు సహాయము చేయవలసినదిగా పాండవులుకోరుట బాగుగనే యున్నదిగాని, ఆయన ఆ పెండ్లికి వచ్చినవారియెదుట పాండవుల విషయము ప్రస్తావింపనేల? అదియు పాండవుల కోరికలోని భాగమే కావచ్చును

శ్రీకృష్ణుడా బంధుమిత్రుల సమక్షంబున నిట్లనినాడు

కుంతీతనయులు సమయము
శాంతతమై నడపి తమ భుజాబలమును దు
ర్దాంతోద్యమ శౌర్యము నెఱి
గింతుమనుచు నున్నవారు గినుకెదిఁ గదురన్ [1]

పాండవు లింతవరకును పరమశాంతులుగా నున్నారు. ఇక తమ భుజాబలమును జూపింతుమనుచున్నారు మరియు నిగ్రహించుకొనరాని, పైకెత్తిపోవుట రూపమైన, తమ శూరలక్షణమును ప్రకటింతుమనుచున్నారు. క్రోధము హృదయమున నతిశయముకాగా వారట్లనుచున్నారు – ఇది శ్రీకృష్ణుడనిన మాటల యర్థము పాండవు లిట్లనుచున్నారని శ్రీకృష్ణుడనినాడు. నిజమునకు పాండవు లప్పు డేమియు ననుటలేదు. అందువలన పాండవులట్టి తమ నిశ్చయము నంతకుమునుపే శ్రీకృష్ణునితో చెప్పియుండవలయును. పాండవులు చెప్పిన యా మాటలలో వారు యుద్ధమునకు సంసిద్ధమైయున్నట్లు స్పష్టముగా నున్నది అట్లు తాము యుద్ధము నిశ్చయించుకొనినారు గనుకనే, పెండ్లికి వచ్చిన బంధువులు తమ కనుకూలపడునట్లుగా మాటాడవలసినదని శ్రీకృష్ణుని కోరియుందురు. అందువలననే శ్రీకృష్ణుడు పాండవ కార్యార్థియై బంధుజనుల సమక్షమున తత్ప్రసంగము తీసికొనివచ్చినాడు. ఒకవేళ పాండవులు తత్పూర్వపు మూడుదినములలో శ్రీకృష్ణునితో కలసి యట్లాలోచించియుండనిచో,

1. భా. ఉద్యో. 1-13.

పాండవులు తమ శౌర్యము నెరిగింతుమనుచున్నారని శ్రీకృష్ణు డనగానే, మా యుద్దేశ్య మిదికాదని పాండవు లనియుండవలయును అనలేదు అందువలన శ్రీకృష్ణునితో కలిసి ఆలోచించి పాండవులు యుద్ధమునకు సిద్ధమైనారనియే చెప్పవలయును. ఇదియే భారతకథాప్రాయమున కనుకూలము. పర్వ సంగ్రహము చెప్పుచోగూడ "భారత రణోద్యోగులైన పాండవు లుపప్లావ్యం బున నిడియుండుటయు.... వాసుదేవ సహితులయిన పాండవుల రణప్రారంభంబు విని ధృతరాష్ట్రుండు నిద్రాహారంబులు విడిచి చింతాక్రాంతుం డగుటయు....'' అని ఉద్యోగపర్వము విషయమున నన్నయ్యగారు వ్రాసిరి పాండవుల రణోద్యోగ ముతో నుద్యోగపర్వము ప్రారంభము కావలయునను నన్నయ్యగారి మాటయే తిక్కన్నగారిచేత పాటింపబడినది.

మరియు శ్రీకృష్ణుని మాటలు విని బలరాము డొక విధముగా ననగా సాత్యకి వానిని తిరస్కరించి యిట్లనినాడు

నా మతమునఁ గార్యము సం
గ్రామము సేయుటయ—[1]

సాత్యకిమత మనగానేమి? రాజ్యభాగ మీయకపోయినను పాండవు లిష్టపడి ఊరకొనినచో గూడ సాత్యకి పోయి వారితో యుద్ధము చేయునా? సాత్యకికి ధార్తరాష్ట్రులతో నెట్లైనను యుద్ధము చేయవలసిన యవసరములేదు. తన ముఖముగా పాండవుల మతమునే సాత్యకి చెప్పినాడు. ఈసాత్యకి మాట విని "ద్రుపదుం డిదివోలు బలదేవు మాట మాటగాదు బహు విక్రమవంతుండును సహాయ సంపన్నుండును దుష్టాత్ముండును నైన దుర్యోధనుండు ప్రియవచనం బుల రాజ్యంబు పాలిచ్చుట కియ్యకొనమి సిద్ధంబు. యుద్ధంబునం గాని చక్కం బడదని పలికె"[2]నాడు సాత్యకి అట్లు యుద్ధమే కార్యమని నొక్కి చెప్పుటయు, ద్రుపదుడును బలరాముని మాటమాట కాదనుచు, యుద్ధము చేయుట తప్ప మరేమి చేసినను లాభము లేదను నిశ్చయముతో మాటాడుటయు బట్టి చూడగా, శ్రీకృష్ణుడు, సాత్యకి, ద్రుపదుడు, పాండవులు కలిసి తత్పూర్వమే

---

1 భా. ఉద్యో. 1-31.

2, భా ఉద్యో 1-33.

అన్ని విషయములు నాలోచించుకొని ఒక నిశ్చయమునకు వచ్చినట్లు కనిపించు చున్నది. ఆ నిశ్చయము యుద్ధము చేయుటయే. ఈ సన్నివేశమున నున్న చమత్కారమంతయు పాండవు లసలేమియు మాటాడకపోవుటలో నున్నది. శ్రీకృష్ణుడు మొదలైన యాప్తుల ముఖమున పాండవులు తమ కార్యమును సాధించుకొనినారు. శ్రీకృష్ణుడు పాండవ కార్యార్థియైనాడనగా, నింతగ్రంథము వెనుక జరిగి యైనాడని యర్థము.

తదీయ వచనంబులు వారించి-మొదలైన వాక్యమున్నది తదీయ వచనములనగా కృష్ణ యుధిష్ఠిరుల నుద్దేశించి తత్పరిణయసమాగతాఖిలబంధు మిత్రులు మాటాడు మాటలు. వారేమి మాటాడుచున్నారో తిక్కన్నగారు వ్రాయలేదు. బహుశః ధర్మరాజాదులు పడిన పాట్లకు సంబంధించిన కనికరపు మాటలు కావచ్చును కనికరపుమాటలు; కార్యనిశ్చయపుమాటలకంటె భిన్నములు మరియు వాటితో నయ్యెడి దేమియును లేదు-కాలక్షేపము తప్ప. అందుకని శ్రీకృష్ణుడు తదీయవచనములు వారించి తానుపక్రమించినాడు. కౌరవ పాండవుల పూర్వచరిత్రను కొద్దిగా స్పృశించి "ఈ రెండు దెఱుంగుల వారికిం బంచి కుడువందగుటయుం దలపోసి తగిన కార్యంబు సెప్ప నర్హుల రేనును నాకన్నంత సెప్పెద వినుండు"[1] అని మొదలు పెట్టినాడు. తగిన కార్యము నిశ్చయించి చెప్పుటకు మీరర్హులరు. నేనును నాకు తోచినది చెప్పెదను విను డనుట పైకి సామాన్యముగా కనిపించుచున్నది విచారించినచో నిట్లుండును. శ్రీకృష్ణుడు మీరు చెప్పగలరు-ముందు నేను చెప్పెదననుచున్నాడు. ముందుగా వారినే యేల ఏది తగిన కార్యమో చెప్పుడని కోరుటలేదు? దీని అంతర్యమిది. తనకు పాండవుల నిశ్చయము తెలియును వారికి తెలియదు. పాండవుల యిష్టమును తన యిష్టమును నొకటియే. అందువలన ముందుగా పాండవుల యిష్ట మిట్లున్నదని చెప్పి, అందుకు తన యానుకూల్యమును గూడ సూచించినచో, అది విన్న వారొకవిధముగా తమ మతమునందు బుద్ధులు ప్రసరించినవారై తమ కనుకూల పడివచ్చుట, కధికముగా వీలున్నది. ఈయుద్దేశ్యముతో శ్రీకృష్ణుడు నాకన్నంత సెప్పెదనని ముందుగా ప్రారంభించినాడు.

---

1. భా. ఉద్యో. 1-12.

కుంతీతనయులు శాంతతమై నడపి-మొదలైన వాక్యములననుసరించి మరియు నిట్లనినాడు.

"వీరి తలంపెఱిగిన గాం
ధారీ తనయుడు సుహృద్వితానముఁ గూర్చుం
బోరఁ బరిమార్తుఁ గొంచెపు
వారై యున్నేడన యని యవశ్యము కడకన్.

అఘుబలవిక్రమోదా
త్తుల్లకైనను బలము లేక దోర్గర్వముమై
గెలువగవశమె సహాయము
కలిమి ననంతంబులగు పగఱ సైన్యములన్.

కావున పాండవ పక్షము
భూవల్లభకోటి యిచటఁ బ్రోవగు నిమ్మై
నా వీరులు నీ వీరులు
దేవాసురులట్లు యనికిఁ దెగుదురు కడిమిన్

వ. ఇది యిక్కడి తెఱంగునకుఁదోఁచిన తలం పక్కడి వారి చిత్తవృత్తియెట్టి దగుట యెఱుంగ మెదిరి మతబెఱుంగక యెట్టి కార్యంబు నిశ్చయింప నెర వగునే? కావున నియ్యవసరంబునం దగిన మానిసి నందులకుం బుచ్చ వలయు. దుర్యోధనుండు వీరికి రాజ్యంబు పాలిచ్చిన మేలగుఁగాక తక్కిన నప్పటికిఁ బోలిన పని సూచుకొందము"[1]

పాండవుల తలపు దుర్యోధనునకు తెలిసినచో నాతడు యుద్ధమునకు సిద్ధపడునని శ్రీకృష్ణుడు చెప్పినాడు. పాండవుల తలపు యుద్ధము చేయవలయుననికానిచో దుర్యోధనునకు యుద్ధమున కాయత్తము కావలసిన యవసరములేదు. అందువలన శ్రీకృష్ణుడు, పాండవులు యుద్ధము చేయదలచుకొనుచున్నారని అచటి వారికి చెప్పినట్లైనది. మరియు శ్రీకృష్ణుడు ఎంతటి బలవంతులకైనను, మంచి సహాయసంపద గలిగిన శత్రువులను, కేవలము తమ భుజశక్తిమీద ఆధారపడి జయింప శక్యము కాదుకదా అనినాడు.

1, భా. ఉద్యో. 1-14...17.

అనగా, పాండవులు తమ దోశ్శక్తి వలననే ధార్తరాష్ట్రులను గెలువగలుచు న్నారు కాని సహాయము లేనిచో నెట్లు? దుర్యోధనుడు తన సుహృద్విశాల మైన మతలనందరను కూర్చుకొనగలయునని చెప్పినట్లై, ఆ బంధువులకు మీరు పాండవులకు సహాయపడవలయునని తోచునట్లు మాటాడుటయైనది వేఱనే మరియు శ్రీకృష్ణుడు - సాత్వన పాండవపక్షము రాజులందరును నిక్కముగ చేసు దురు, ఇక వీరికిని వారికిని యుద్ధమగుననిగాదు ఉపేక్షించి వచ్చిన బంధువు లందరును పాండవుల పక్షమున యుద్ధమున కనుకూలపడి వచ్చినట్లుగనే శ్రీ కృష్ణుడు మాటాడినాడు యుద్ధము నొల్లని, పాండవులకు సహాయపడరా నిష్టపడని వారున్నచో, వారు లేచి చెప్పుకొనవలసిన స్థితిని కల్పించినాడు శ్రీ కృష్ణుడు శ్రీకృష్ణుడంతటివాడు తమకందరకును కలిపికొని ఒక నిశ్చయము నకు వచ్చి మాటాడుచుండగా నెవడు కాదని యెదురు నిలబడి మాటాడ గలడు? ఒకచో నట్టివాడున్నను వాడెదురు తిరిగి మాటాడుటకు వీలు లేకుండ, ఇది పాండవపక్షమున మనము చేయుచున్న ఆలోచన, దుర్యోధను డేమనుకొను చుండెనో మనకు తెలియదు; తగిన మాటనిసి నొకని నక్కడికి పంపవలయును, దుర్యోధనుడు రాజ్యమిచ్చినచో మంచిదే; కాయనిచో నప్పుడు చేయువలసిన పని చేయుదము—అని మధ్యవర్తి మాటయు తానే మాటాడినాడు. ఇక నెవరేమను టకు నవకాశము లేనట్లుగా శ్రీకృష్ణుడు ప్రసంగము చేసినాడు. తగిన కార్యము చెప్ప మీరందరును సర్హులరనుచు, ముందుగా నేను చెప్పెదననియు నుపక్రమించి శ్రీకృష్ణుడు పాండవుల కార్యమును సాధించిన వాడైనాడు తాను ముందుపక్రమించి చెప్పుటలో శ్రీకృష్ణుడేది ఆశించెనో అది సిద్ధించినది ఆ బంధువులందరును, పాండవులు కౌరవులతో యుద్ధము చేయుటకును, తాము పాండవులకందు సహాయముచేయుటకును, అనుకూలురై కలిసి వచ్చునట్లు తెలిసి పోయినది.

ఒక్క బలరామునకు మాత్రము యుద్ధ మిష్టములేదు. కాని యెదురు చెప్పుటకు లేకుండ శ్రీకృష్ణుడు మాటాడినాడు. "ఇది యిక్కడి తెఱంగునకుం బోలిన తలంపు – " మొదలైన చివరిమాటలు శ్రీకృష్ణు డనియుండనిచో బల రామునకు తన యభిప్రాయము స్పష్టముగా జెప్పుటకు వీలయ్యేడిది కాని శ్రీకృష్ణు డా యవకాశమును నీయలేదు. ఇప్పుడు, కౌరవ పాండవులకు యుద్ధము కూడదని గట్టిగా బలరాము డనినచో, కూడునని నేనంటినా యేమని శ్రీకృష్ణు డనవచ్చును. అవసరము వచ్చినచో తానట్లనుటకు వీలుగా ప్రసంగ

మును ముగించి కూర్చుండినాడు శ్రీకృష్ణుడు. వాని అంతర్యము మాత్రము యుద్ధమే అని బలరామునకు తెలియుచున్నది. ఎదురు చెప్పుటకుమాత్రము వీలు కనిపించుటలేదు. అందుని యోజించి "ఇయ్యవసరంబునందగిన మానిసి నందు లకుం బుచ్చవలయు''నను శ్రీకృష్ణుని వాక్యముమీద తన యభిప్రాయము చెప్పుట కుపక్రమించినాడు. ఆ వాక్యము నూతగా గొనుటకందొక వెసులు బాటు బలరామునకు చిక్కినది తగిన మానిసి నెందుకు పంపవలయునో శ్రీకృష్ణుడు స్పష్టముచేయలేదు ధార్తరాష్ట్రుల ప్రయత్నము లెరిగిగచ్చుటకు పంపుటకావచ్చును. రాజ్యభాగ మడిగించుటకు రాయబారముగా పంపుట కావచ్చును బలరాము డీ రెండవయర్థము నా వాక్యమునకు జెప్పుకొనినాడు. తాను తదభిముఖముగా ప్రసంగించినాడు.

మాట పొందెఱింగి యోట మైనల్లర
చేరి కౌరవేంద్రు చిత్తవృత్తి
కనుగుణంబుగాఁగ నానతుండగుచుఁ బ్రా
ర్థించి యడుగకున్నఁ దెఱఁగు వడదు [1]

మనము వేడుకొనదగిన స్థితిలోనున్నాము. మనము పంపుమనిషి అట్లు జాగ్రత్తగా దుర్యోధనుని చిత్తము ననుసరించి తగ్గి మాటాడుచు మనకార్యము సాధించుకొని వచ్చువాడుగా నుండవలయును. ప్రార్థించుచున్న ట్లడుగవలయును. లేనిచో దుర్యోధనుడు రాజ్యమీయడు - ఇది బలరాముని తాత్పర్యము. మరియు పాండవులు దుర్యోధనుని వేడుకొనవలసిన స్థితిలో నెట్లున్నారోకూడ "అది యెట్లనిన -"[2] అని ప్రారంభించి కొంత నిరూపించి, ధార్తరాష్ట్రు లధర్మ పరులని నిందింపరాదనియు వీరలు పుచ్చిన మానిసి వినయంబుతోన ఇక్కార్యంబు దీర్చికొని రావలయుననియు తేల్చిచెప్పినాడు. జూదమాడి ధర్మరాజు తనకీస్థితి తెచ్చుకొనినాడని బలరాముడు చెప్పినదాని నెదుర్కొనుచు సాత్యకి యిట్లని నాడు

---

1. భా. ఉద్యో. '-21.
2. భా. ఉద్యో. 1-22

పలికిన చందముల్ నెఱపి పైతృకమైచను రాజ్యభాగ మి
మ్మలఁ బడయందలంచి బలముం జలమున్ నెఱపంగడంగు వీ
రులు నోరు వేఁడఁబోదురె? యరాతులు సాధుల మెత్తురే? రణం
బుల జయలక్ష్మిఁ జేకొనుటఁబోలునె యొండొక రాజధర్మముల్ [1]

వేడుకొనుట యన్నది లేదని పాండవుల పక్షమున సాత్యకి గట్టిగా చెప్పినాడు. మును వేఁడికొనక మఱి భారతాజిసేయంగ మొనసిరని పాండవుల విషయమున నన్నయ్యగారు చెప్పినమాటను సాత్యకి ముఖమున తిక్కన్నగారు చెప్పించి భారతకథార్థము ఘటితపూర్వాపరమై చనునట్లుచేసిరి మనము దుర్యోధనుని ప్రార్థించబోవ నక్కరలేదనుట సభకు సమ్మతమైనట్లుగా, అసలు దూతనుబంపి అడిగింపనే అక్కరలేదనుట అంత సమ్మతముకాదు నిజమే – ఒకనిని బంపి అడిగి చూచినచో నేమిపోయినదని సభవారనుకొనవచ్చును అందుకని సాత్యకి చివరి కిట్లనినాడు.

దైన్యము దక్కి దూత యుచితంబుగఁ బాండునృపాలుపాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న లోకసా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
న్యోన్యవిరుద్ధభాషణము లాడినఁ దత్ఫల మాతఁ డందెడున్. [2]

ఇది చాల చమత్కారమైన పద్యము. దూతను బంపి రాజ్యమడిగించుటను బలరాముడు నెలకొల్పినాడు. అదికాదని త్రోసిపుచ్చుట బాగుండదు మూర్ఖముగా నుండును. కాని బలరాముడు చెప్పినపద్ధతిలో దూతనుపంపి రాజ్యము బొందుట పాండవుల కిష్టముకాదు. అయినను దూతను పంపవలయును. బలరాముడు చెప్పినాడుగనుక పంపవలయును. పద్ధతిమార్చి పంపినచో, బలరాముని మాట తీసివేసినట్లునుగాదు. తమ యభీష్టము సిద్ధించును. ఈ అంతర్యముతో సాత్యకి మాటాడిన మాటలుగల పద్య మది. వేదపలుకులుమాని దూత గంభీరముగనే పోవలయును. తమ తండ్రిపాలు తమకిమ్మని రాజన్యవరుడైన ధర్మరాజు మంచివాడుగనుక కోరుచున్నాడని దుర్యోధనునితో ననవల

1. భా. ఉద్యో. 1-26.
2. భా. ఉద్యో. 1-32.

యును ఎవరి రాజ్యమును వారనుభవింపవలయునుగదా అని గౌరవముగా నిచ్చినాడా పుచ్చికొందము కాక తలతిరుగుడుమాటలు మాటాడినచో, ఆ మాటలఫలము నాత డనుభవించును. ఆ పద్యమునందలి సాత్యకి తాత్పర్యమిది. యుద్ధము కాకుండవలయునన్న తాత్పర్యము కాదది ద్రుపదుడు సాత్యకిని బలపరచుచు బలరాముని మాటమాటకాదనినాడు. ఇక బలరాముడు మాటాడ లేదు. మరి యెవ్వరును మాటాడలేదు ద్రుపదుడే తన మాటలను కొనసాగించుచు "ఎల్ల భంగుల సంగరంబు గాఁగల యది. ఈ సమయంబున బలంబులం గూర్చికొని పిలువందగు. రాజులంబిలిచి పుచ్చవలయు. సుయోధనుండును దోడాసపడి పుచ్చును ఉచితపరులగు నరపతులు దొలుతఁ జెప్పినవారికి సహాయత్వంబుఁ జేయంజూతురు. మనము వెసగల కాలరుల వేగంబపుచ్చి శల్య కేకయ దృష్టకేతు జరాసంధతనయ ప్రభృతులయిన భూపతులకును వారివారి బంధుమిత్రజనంబులకును నెఱింగించి పుచ్చుట కార్యంబు"[1] అనిచెప్పి చివరకు తన పురోహితుని జూపించుచు "ఇతనికి నెల్లపనులు నెఱిగించి ధృతరాష్ట్రుకడకు చతురవచనరచనఁ గఅపి పన్నుపుడు"[2] అనినాడు యుద్ధము నిశ్చయించి చెప్పిన ద్రుపదునిపలుకు లుచితములుగా నున్నవని శ్రీకృష్ణుడు వానితో నిట్లనినాడు.

పాండవార్థమై యొక్కరుఁ బనుప మీక
భరము మీ పలు కందర పలుకు మీరు
తెఱఁగు పలుపంగ మిగిలి యుద్రేకులైన
వార చెడువారు విమలవిచారవిభవ.[3]

మీ పలు కందరపలుకు – మీరు యుద్ధము కార్యమని నిశ్చయించి పలికినారు. అదియే మా యందరి పలుకును పాండవులకు తదర్థము సిద్ధించునట్లుగా మీరే యొకనిని బంపుడు మీరు పంపినమానిసిమాట విననిచో మీరు చ్పెపినది వినని యట్లేయగును. మీమాటను వినినివారు వారే చెడిపోవుదురు. మీ ఆలోచనా వైభవము చాల ఉత్తమమైనది. అట్లేచేయుడు – ఇది శ్రీకృష్ణుడు పాంచాలపతితో ననిన రీతి.

1. భా. ఉద్యో. 1-37
2 భా ఉద్యో 1-38.
3. భా. ఉద్యో. 1-44.

ఇట్లుచెప్పి శ్రీకృష్ణుడు ద్వారకకు పోయినాడు పాండవకార్యార్థియైన కృష్ణుడు తన కన్నంత చెప్పెనని చెప్పి సాధించిన పరమార్థము, పాండవులు నిశ్చయించుకొనిన యుద్ధము కార్యమని తెల్పుటతోపాటు పెండ్లికి వచ్చిన బంధువుల సహాయము పొందుట. శ్రీకృష్ణునితోపాటు "వివాహమహోత్సవంబునకువచ్చిన తక్కటిరాజులును సంగ్రామ సన్నాహంబునకై తమతమ పురంబులకుం జనిరి"[1]

ఇది పాండవుల సమరసన్నాహము శాంతి నోటి త్తి యొక మాటా మాటాడకముందే, పెండ్లి వచ్చిన బంధుమిత్రులందరును తమకు యుద్ధమున సహాయము చేయనచ్చునట్లు చేసికొనినారు అట్లు వారు తమ కనుకూలురగుట చూచుకొనియే, పెండ్లికి రాని తమ కనురక్తులైన రాజులపాలి దూతలను బంపిరి

వీరి విషయము తెలిసికొని దుర్యోధనుడును తన బంధుమిత్రగణమైన రాజలోకమును రావించుకొనినాడు

యుద్ధమునకు ముందు సిద్ధమైనది ధర్మరాజు. ఉద్యోగపర్వమునుండి భారత కథ అంతయు ధర్మరాజువలననైనది ఆదిసభాపర్వములయందు ధర్మరాజెట్లో ఉద్యోగపర్వమునుండి దుర్యోధనుడట్లు. [illegible] అయినది

తన పురోహితుని హాస్తినాపురమునకు ధర్మరాజు నచుమనిని బంపుచు, ద్రుపదుడు వానితో నిట్లు చెప్పినాడు "ఇచ్చట విరాటు కొలువుకూటంబునం బుట్టిన కృష్ణాదుల సంవాదంబు తెఱంగును మన యెఱింగినది గాన తదనురూపంబుగా పలికి పాండవులకు దేజోలాభంబుం గావించుట కర్తవ్యంబు"[2] పాండవులకు రాజ్యలాభము గావించుటను జెప్పక తేజోలాభమును గావించుటను ద్రుపదుడు చెప్పుచున్నాడు తేజోలాభము గావించినచో రాజ్యలాభము నది సాధించదు పాండవులదృష్టి ముందు పరాక్రమముమీద నున్నది కృష్ణాదులు దానినే సమర్థించిరి తన పురోహితుడు ధృతరాష్ట్రుని కొలువులో పాండవులకు తేజోలాభము కలుగునట్లుగా మాటాడవలయును. అనగా సాత్యకి చెప్పిన

1. భా ఉద్యో. 1-48
2 భా ఉద్యో. 1-60.

పద్ధతిలో మాటాడవలయును. కృష్ణాదుల సంవాద మనగా కృష్ణుడు, బల రాముడు, సాత్యకి మాటాడిన మాటలు - అందు సాత్యకి చెప్పినదే సిద్ధాంత ముగా తేలినది కనుక తదనురూపంబుగా బలుకవలయునని ద్రుపదుడు చెప్పిన దాని యర్థము సాత్యకి చెప్పిన పద్ధతిలో మాటాడుమనియే అదియునుగాక, సాత్యకి చెప్పిన దానిని సమర్థించిన తాను, మరియు నెల్లభంగుల సంగరంబు కాగల యది - కార్యం బిదియ - అని ఈ మొదలుగా మాటాడిన తాను, పురో హితునితో మెట్టమొదట "నాకుఁ గర్తవ్యమగు పని నీకుఁ జేయఁ దగవు"[1] అని చెప్పుట గమనింపదగినది. ద్రుపదున కేది కర్తవ్యము? పాండవులకు తేజో లాభముగూర్చుట కర్తవ్యము అనగా పాండవుల యభీష్టమైన యుద్ధమున కనుకూలపడుట కర్తవ్యము ఆ విషయముననే తన పురోహితునకు జెప్పి పంపి నాడు ద్రుపదుడు

మరియు ద్రుపదుడు తన పురోహితుని పైనింకొక భారము బెట్టి పంపి నాడు కరిపురమునందున్న "సమస్త జనంబుల మనంబులు నిక్కడ వ్రాలునట్టి యుపాయంబు లెన్నిగల వన్నియు నయ్యై తగవులమై నాచరించుచు, జరి యిం"[1] పవలయును సమస్తజనులనుటచేత పౌరజనము గ్రహింపబడుచున్నది. దుర్యోధనాదులను జుట్టుకొనియున్న వాతావరణమంతయు వారికి ప్రతికూల మును, మనకనుకూలమును నగునట్లు, ఏమి చేయుట నీ కుచితమనిపించునో, అందుకు తగినట్లుగా నీవు ప్రవర్తింపవలయునని ద్రుపదుడు చెప్పినాడు గురు భీష్మాదులు దుర్యోధనుని యుద్ధమున కననుకూలురుగా నగునట్లు వారివారి చిత్తముల తెలగెజిగి ప్రవర్తింపవలసినదని స్పష్టముగా చెప్పియున్నందున, సమస్త జనములని తిరిగి చెప్పుటలో ద్రుపదుడు పురమునంతయు నుద్దేశించిన ట్లూహింపవచ్చు ననిపించుచున్నది. కాక, పురమువారితో నంతగా నయ్యెడి దేమియును లేదు గనుక, ఆ వాక్యము గూడ భీష్మాదులకే సంబంధించిన దనుకొ నినను బాధలేదు. మొత్తముమీద హస్తినాపురమునందున్న వారి మనస్సుల న్నియు పాండవులకనుకూలము కావలయును. ముఖ్యముగా ధార్తరాష్ట్రుల సమరోద్యోగమునకు ప్రతికూలములు కావలయును -ఇట్లు చేసికొని వచ్చుటయే ద్రుపదుడు తన పురోహితునిపై బెట్టి పంపిన రెండవ భారము.

---

1 భా ఉద్యో 1-54.

ఇన్ని విషయములును జెప్పి ద్రుపదుడు పురోహితునితో చివర కిట్లని నాడు. "దైవగతిం జేసి నీ యొడ్డిన సూత్రంబునకు సుయోధనుం డొడంబడియె నేనియు నదియ సకలజనసమ్మతంబయిన విధంబగు దాన నజాతశత్రుండును బ్రీతుండగు. పోయిరమ్ము."[1] నీవుపోయి ఇక్కడ యనుకొనినట్లు సాత్యకి చెప్పిన పద్ధతిలో మాటాడినను సుయోధనుడొడబడి రాజ్యమిచ్చినాడా అది కేవలము దైవగతివలన నైనట్లనుకొనవలయును అదియును మంచిదే. అప్పుడు ప్రార్థించి యడుగుట అన్నది ధర్మరాజు పక్షమున పుట్టుట లేదుగనుక, అదియు తేజోలాభముగనే ధర్మరాజు సంతోషించగలడు కాన పోయిరమ్మ-అని యీ విధముగా దైన్యము దక్కి దూత యుచితంబుగ-అని మొదలుగా సాత్యకి యేమి చెప్పినాడో దానినే ద్రుపదుడు తన పురోహితునకు జెప్పిపంపినాడు

పురోహితుడు హస్తినాపురమునకు పయనమై పోయినాడు. కౌరవ సభలో నా పురోహితుడు పలికిన పలుకులను పదునొకండు గద్యపద్యములుగా తిక్కన్నగారు వ్రాసిరి అందు మొదటి రెండు పద్యములలో, కౌరవ పాండవు లెవరి రాజ్యమును వారనుభవింపదగు ననుటతోపాటుగా, పాండవులకు కౌరవులు చేసిన దురితముల నుగ్గడించుట విషయము ధృతరాష్ట్రునకు బుద్ధిసెప్ప వలసినదిగా సభను కోరుట మూడవ పద్యము

పాండవులు కౌరవులతోడి పగకు నొల్ల
రఖిల భూప్రజనాశన మగుటఁజేసి
వార లందని తలఁపంగ వలవ దధిక
ధర్మపరులైన కతమునఁ దగవు నడచె[2]

ఇది నాల్గవ పద్యము పాండవులు ధర్మాత్ములనియు, యుద్ధము జేసి కౌరవులను గెలుచుటకు శక్తులయ్యును, భూప్రజనాశన మగునని యాలోచించుచున్నారనియు చెప్పిన పద్యము ఆతరువాతి నాలుగును, ఏడక్షోహిణుల బలముతో భీమార్జునులు సులభముగా పదునొకండక్షోహిణులను జయింపగల రనుట విషయముగా గలవి ఆ పై పాండవులకున్న శ్రీకృష్ణ సహాయ మహాత్మ్యమునుగ్గడించుట. చివరి పద్యము ఫలితార్థమును తేల్చి చెప్పునది.

1. భా. ఉద్యో. 1-60.
2 భా. ఉద్యో. 1-234.

ఆదను దప్పకుండ నమ్మహాత్ముల నెమ్మిఁ
బిలువఁబంచి హితము ప్రియము రెండు
పక్షములకునగుట పాటించి తగవుమైఁ
గొంత భూమి యిచ్చి కూడి మనుఁడు[1].

ఇది చివర పద్యము ఇక నాలస్యము చేయకుండ పాండవులను బిలువనంపి వారి రాజ్యము వారికిచ్చుట, అది కౌరవులకు హితము గూర్చునదియనియు, పాండవులకు ప్రియమగుననియు, ద్రుపదపురోహితుడు చెప్పినాడు ధార్త రాష్ట్రిలు బ్రతికి బట్టకట్టు కొనదలచినచో పాండవుల రాజ్యము పాండవుల కీయవలయు నన్నట్లుగా పురోహితుడు మాటాడినాడు తమ రాజ్యమును తాము పాండవులడుగుచున్నారనిగూడ పురోహితుడనలేదు పాండవులు యుద్ధమునకు సిద్ధమైనారు ప్రజానష్టము జరుగునే అని కొంచెమాలోచించు చున్నారు. ఈసమయమందుననే మీరు వారిని బిలువనంపి రాజ్యమిచ్చుట మీకు మేలు మీరు కొంచెమింకను నాలస్యముచేసినచో ప్రజానష్టమైననుసరియే అనివారుయుద్ధ మునకు మొనసివచ్చెదరు అప్పుడు మీరేమనుకొనినను లాభములేదు. కనుక త్వరపడుడు మీమేలు మీరు చూచుకొనుట కిది యదను. దీనిని జారిపోనీయ కుడు-పురోహితుని రాయబార మీతాత్పర్యముతో నడచినది. ధార్తరాష్ట్రిలు కలిసివచ్చుట కేమాత్రమును నాస్కారములేకుండ, సాత్యకి చెప్పిన పద్ధతిలో మరియు పొంతముగా పురోహితుడు తన దూతకార్యమును నెరపినాడు

పురోహితుడు కౌరవసభలో మాటాడుటకు పూర్వమై, కౌరవ పక్షము నమన్న ప్రసిద్ధులైన భీష్మాదులనందరును, వారివారి మందిరములకు పోయి మాటాడినాడు. అట్లే దుర్యోధనుని, ధృతరాష్ట్రిని గూడ దర్శనము చేసికొని నాడు. ఉచితాలాపముల భీష్మాదులను తనకు ప్రసన్నులుగా చేసికొనినాడు. ఒక విధముగా వాతావరణము తనకనుకూలమైనది ఏవంవిధమైన అనుకూల తను కల్పించుకొని సభలో ప్రసంగించినాడు ధార్తరాష్ట్రిలు సహింపలేనిదిగా ప్రసంగము సాగినది భీష్ముడు తత్పూర్వమే ప్రసన్నుడై యుండుటవలన, ఆ పురోహితుని ప్రసంగమును-బ్రాహ్మణుని మాటలు గనుక కఠినముగా వినిపిం చుచున్నవిగాని, అసలు విషయమంతే-అని సమర్థించినాడు. ఇక కౌరవు లెవరు

---

2. భా. ఉద్యో 1-241.

గాని మాటాడుటకు వీలులేకపోయినది. మరియు భీష్ముడు "పితృధనమగు పాలుచితస్థితి వారలకి"[1]చ్చుట మేలని ధృతరాష్ట్రు సుద్దేశించి పలికినాడు

ఏరెండు కార్యములు నిర్వహించుకొని వచ్చుటకు పురోహితుడు ద్రుపదునిచేత పంపబడి పాండవుల యనుమతిని కరినగరమునకు పోయినాడో, ఆరెండింటిని ఆయన నిర్వహించినాడు

పురోహితుని రాయబారము తాత్పర్యము కౌరవుల కర్థమైనది దానితో వారు మరియు బిగిసినారు

కిరీటుఁడు గ్రుమ్మఁడుఁ దోడఁగ
బరవసమున నెత్తి విడిసి బలిమిం జగిరం
గురుపతియు వెఱచి యిచ్చునె
ధరలోఁ జక్కనగాము ? ఇట్టి యగపులు గలవే [2]

యుద్ధమునకు సిద్ధమై, ఈ పురోహితునిబంపి పాండవులు బెదరించి రాజ్యము నడుగుచున్నారు. ఇంతమాత్రమునకు కురురాజు భయపడి రాజ్యమిచ్చునని కొనినారు కాబోలును. ఆయన భయపడడు మొదలడుగు పద్ధతి అదియేనా?– ఈ విధముగా కర్ణు డెదురుతిరిగి, పాండవులయందు పక్షముగలిగి మాటాడిన భీష్మునితో ననినాడు పురోహితు నెందుకు బంపినారో అది కౌరవుల కిట్లర్థమైనది. పాండవులు యుద్ధమునకు సిద్ధమైనారన్నది కౌరవులకు స్పష్టమైనది. పురోహితుడు తన నింటియొద్ద కలిసికొనినప్పుడుగాని, సభలో పురోహితుడు ప్రసంగించినప్పుడుగాని, దుర్యోధను డేమియు మాటాడలేదు. పాండవులు పెండ్లికి వచ్చిన బంధువులతో తాముగా నేమియుననక, అంతయు కృష్ణాదుల ముఖమున తమకార్యము నిశ్చయించుకొన్న రీతి అందరచేతనగుననిపించుకొన్నట్లే, ఇట దుర్యోధనుడును తానుగా నేమియుననక కర్ణుని ముఖమున తన నిశ్చయము నెరిగించినట్లున్నది

ఈ పురోహితుని రాయబారముతో భారతాజికి పూనుకొను పాండవపక్షముయొక్క కదలిక స్పష్టముగా రంగముమీదకు వచ్చినది మేము యుద్ధ

1. భా. ఉద్యో. 1-245.
2. భా. ఉద్యో. 1-251.

మునకు సిద్ధమైనామని పాండవు లీ పురోహితుని ముఖమున కౌరవులకు దెలియ జేయుటయే దీనికి పరమార్థముగా గనిపించుచున్నది భీష్మాదుల చిత్తవృత్తు లెరిగికొనుటయు మరొక ప్రయోజనము పాండవులు మనలను బెదరించు చున్నారని కర్ణు డనినదాని యర్థము ధృతరాష్ట్రునియందు ననుమానింపదగి యున్నది ఆయన "సంభ్రమములేక" నేను మావారితో నాలోచించి తగిన మానిసిని పాండవులకడకు బంపుదును. నీవు మున్నేగుమని పురోహితుని సత్క రించి పంపినాడు

## 11. సంజయ రాయబారము

సంజయుని ధృతరాష్ట్రుడు పాండవుల వద్దకు బంపినాడు. సంజయుని బంపుచు నాతనితో ధృతరాష్ట్రు డిట్లు చెప్పెను.

"నెయ్యము వాటించి కడుం
దియ్యమెసఁగ నలుక లెల్లఁ దీఱునటులుగాఁ
గయ్యమను తలఁపు లోనుగ
నయ్యమనందనుఁడు మానునట్టి తెఱగునన్.

వ. శాంతి ప్రకారంబునం గార్యంబునడపి యొక్కటియై మనుట యొడఁ గూర్చిరమ్ము రథం బెక్కిపొమ్ము."[1]

ధర్మరాజు కోపములేనివాడు కావలయును. మరియు యుద్ధమను నాలోచన మానుకొనినవాడు కావలయును ధార్తరాష్ట్రులతో నెయ్యము వాటించి యుండుట కావలయును. ఇవన్నియు పొసగివచ్చునట్లుగా మాటాడి శాంతి ప్రకారమున కార్యమునగునట్లు చేసికొని రావలయుననిచెప్పి సంజయుని బంపి నాడు. రాజ్యభాగమిచ్చు మాటను మాత్రము ధృతరాష్ట్రు డనలేదు. సంజ యుడు మాటాడివచ్చినదానినిబట్టి వాని ముఖముగా ధృతరాష్ట్రుడు - మీరు యుద్ధమునకు దిగరాదు. దుర్యోధనాదులు దుష్టులైనను మీరు సహింపవల యును. మీరుత్తములు - అను నీ మొదలైన సత్యవచనములతో పాండవుల నుపశమింపజేయుటకు యత్నించినట్లు కనిపించుచున్నది.

---

1. భా॰ ఉద్యో. 1-271,272.

ధృతరాష్ట్రుడు పంపగా సంజయుడు ఉపప్లావ్యమునకు బోయెను. ధర్మరాజున కెంతగా యుద్ధవైముఖ్యమును కలిగింపవలయునని సంజయుడు పోయెనో, ధర్మరాజంతగా యుద్ధమున స్థిరచిత్తుడై మాటాడెను చివరకు ధర్మరాజు వంశదూషకులను, లోకకంటకులను నిర్మూలంబుగా చెఱచుట ధర్మమనియు, యుద్ధము రాజులకు ధర్మమనియు, నందువలన తాను దుర్యోధనుని ధర్మముకొరకైనను యుద్ధముచేసి వధింపక తప్పదన్నట్లుమాటాడి తన యుద్ధ నిశ్చయమును ప్రకటించినాడు. సంజయుడు వచ్చినపని కాలేదు. కాని తన వచ్చినపని అయినదనిపించుకొనియే సంజయుడు తిరిగి హాస్తినాపురమునకు పోయినాడు. ఈ సంజయుని రాయబారముననున్న చమత్కారమే అది

సంజయుడు ధర్మరాజుతో జెప్పిన అభిప్రాయములు రెండు మొదటిది మీరు యుద్ధముచేసి కౌరవులను జయింపలేరనుట రెండవది మీరు జయింపగలిగినను మీవంటి ధర్మాత్ములు హింసాత్మకమైన యుద్ధమునకు పూనుకొనరాదనుట. ధర్మరాజీ రెండింటిని పూర్వపక్షముచేసి మాటాడినాడు. సంజయుడు తన మొదటి యభిప్రాయము నీ క్రింద ఉదహరింపబడుచున్న పద్యములలో వ్యక్తము చేసినాడు

"పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుడున్ రణంబునం
దొట్టినమంట లాకొలది యోధుల సాత్యకియున్ విరాటుడుం
జుట్టపుమేరు వుగ్రరణ శోభితుఁడీ ద్రుపదుండు నిన్ను ని
ట్టట్టన వచ్చునే సురలకైనను నొల్లవుగాక చివ్వకున్.

మఱియు నక్కడ.

ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులుం
బ్రాణములా సుయోధనుని పాలివయంద్రు నిజానుజన్ము ల
క్షీణపరాక్రముల్ సుతులజేయులు బాహ్లిక సోమదత్తు లా
స్థాణునకైన నోడరు వంశంబె జయింపఁగ వారి నేరికిన్.

అధిప ! యిట్టి మీకు నన్యోన్య కలహంబు
నాకుఁజూడ మేఁనంగరాదు
రెండు పక్షములకుఁ బ్రియము హితంబును
నాత్మఁగోరువారి నడిగిచూడు."[1]

---

1. భా. ఉద్యో 1-297-300.

ఈ పద్యములయందు పాండవులు కౌరవులను జయింపలేరనుమాట పై కెందుకు కనిపించుటలేదు మీ రిట్టివారు - వా రట్టివారు కనుక నిటువంటి మీ యుభయులకు కలహము మేలనరాకున్నది. నీవింకను నామాట నమ్మనిచో నింకొకరి నడిగిచూడుము అపుడు నీకే తెలియును ఇంతే సంజయుడన్నదిగా కనిపించుచున్నది కాని తరువాత ధర్మరాజు "మును మమ్ముఁ బొగడి పదపడి యని వారల గెలువ నరిది యని పొత్తుగఁ జెప్పిన మాటకునే నొడఁబడ విను సంజయ–" "రణమున వారలన్ గెలువరాదను పల్కు లటుండనిమ్ము–"[1] అని యీ మొదలుగా సంజయున కెదురుతిరిగి కుపితుడై చెప్పినాడు కనుక నా పద్యములలో పాండవులు కౌరవులను గెలువలేరన్న తాత్పర్యము ననివార్యముగా నిమిడించి యుండవలయును విచారించినచో నా తాత్పర్య మా పద్యముల యందున్నదని బుద్ధికి తోచును కేవలము కౌరవపాండవులు యుద్ధమునకు దిగుట మంచిదికాదనియే సంజయుడు చెప్పదలచుకొనినచో, వారి వారి యుద్ధమునకు దగిన సహాయసంపత్తి నంతగా ప్రశంసింప నక్కరలేదు తత్తత్సహాయ సంపదను సంజయుడు కావలయునని పేర్కొనినాడు ముందు పాండవుల విషయము చెప్పినాడు దేవతలతోడి యుద్ధము వచ్చినను ధర్మరాజు తనకున్న సహాయసంపదతో నెదుర్కొని జయింపగలడు అనగా పాండవుల బలము దేవతలను జయింపగలిగినంతబలము. ఇక కౌరవపక్షమున నున్నవారిలో కొందరి పరాక్రమ మెప్పటికిని అనగా నెంతయుద్ధమైనను, క్షీణించుట లేక అట్లే యుండును. మరికొందరు కేవల మజేయులు వా రెవరిచేతను జయింపబడరు. మరియుకొందరు పరమశివునితోడి యుద్ధమైనను నోడిపోవుట లేనివారు ఇటువంటి వీరులతోనున్న కౌరవపక్షము నోడించుట కెవరికి శక్యమగును ? ఎవరికినికాదు. కనుక పాండవ ధార్తరాష్ట్రుల కన్యోన్య కలహము మంచిదికాదు - ఇది సంజయుడాడిన మాటల తాత్పర్యము. స్థూలముగా చెప్పబడిన ఈ తాత్పర్యమునందే పాండవులు కౌరవులను జయంపలేరన్నది స్ఫురించుచున్నది మరియు నా పద్యములందొక వ్యంగ్య చమత్కారము కనిపించుచున్నది పాండవబలము దేవతలను జయింపగలది. కౌరవబలము స్థాణుని జయింపగలిగినది. స్థాణుడనగా పరమశివుడు. ప్రశయే౽పి

---

1. భా. ఉద్యో 1-322, 325.

తిష్ఠతీతి స్థాణుః - సర్వసృష్టియు నణగిపోవుట ప్రళయము, తత్కాలము నందుకూడ సుస్థిరుడై యుండువాడు స్థాణుడు. అనగా సృష్ట్యతీతమైన శక్తి సంపదకలవాడు అట్టివాని కోడిపోని బాహ్లిక సోమదత్తులు కౌరవపక్షమున గలరు కనుక కౌరవులను జయింపగలుగుట సృష్టిలో లేనిది ఈ వాక్యము నతిశయోక్తిగా గ్రహించినను కౌరవులను జయించుట ఎవరివలనను గాదని యర్థము చేయకతప్పదు మరియును దేవతానీకము సేంద్రము సబ్రహ్మము చేయజాలని త్రిపురాసురసంహారమును పరమశివుడు చేసినాడు ఆయన పరాక్రమమట్టిది అట్టి శివునికోడిపోనివారు కౌరవపక్షమున గలరు. పాండవులు దేవతలను జయింపవచ్చును. ఈశ్వరునిముందు దేవత లల్పసత్త్వులు కనుక దేవతలను జయింపగలిగిన పాండవులు, ఈశ్వరున కెదురుపడి జయింప గలిగిన కౌరవులను జయింపగలుగుట కేవల మూహాయైనను చేయరానిది - ఇది వ్యంగ్యమర్యాదయా సంజయుడు ధర్మరాజు బుద్ధి కెక్కించిన పరమార్థము. దీని తరువాత "అధిప యిట్టి మీకు నన్యోన్యకలహము" - మొదలైన మాటలు సంజయుడు మాటాడినాడు. మీరల్పసత్త్వులు; వారధికసత్త్వులు సమానబల సంపన్నత యున్నపుడే కలహమైనను రాణించును. అదిలేని మీకు కలహము మేలని యెట్లు చెప్పనగును - అని సంజయుడు తేల్చినాడు మరియు నా పద్యమునందలి "రెండు పక్షములకుఁ బ్రియము హితంబును నాత్మఁగోరువారి నడిగి చూడు" అను సంజయుని వాక్యము, ద్రుపదపురోహితుడు కౌరవ సభలో నంతకు రెండు మూడు దినములు ముందుగా చెప్పివచ్చిన "అదను దప్పకుండ నమ్మహాత్ముల నెమ్మిఁ బిలువబంచి హితము ప్రియము రెండు పక్షములకు నగుట పాటించి తగవుమైఁ గొంత భూమియిచ్చి కూడిమనుడు" అను వాక్యమును త్రిప్పికొట్టినట్లు కనిపించుచున్నది. మీరు పురోహితుని దూతగా మా కడకు బంపినారు. సమయము మించిపోకమునుపే పాండవులను బిలువనంపి వారి రాజ్యము వారికిచ్చుట కౌరవులకు హితమును పాండవులకు ప్రియమును నగునని ఆయన అక్కడ చెప్పివచ్చినాడు. కురురాజు మీకు రాజ్యమీయడు. మీరు యుద్ధమునకు సిద్ధమైనారు. ఆ యుద్ధమున మీరేమగుదురో నేను చెప్పు చున్నాను. ఇపుడేది ఎవరికి హితమో ఏది ప్రియమో, ఆయనను తిరిగి నీవే అడిగిచూడుము - అని సంజయుడనినట్లుగా నున్నదా వాక్యము. ఇంతగా తెలిసి తెలిసి ముట్టనాడినాడు గనుకనే "మ్రొక్కెద వాసుదేవునకు ...

ఇక్కరుణాకరున్ శరణ మే నిదె వేఁడెదఁ గ్రోధ శాంతికిన్ ...అనుచుం బ్రణామ పూర్వకంబుగాఁ బాండవాగ్రజువదనంబునం జూడ్కి నిలిపి దేవా యుపశ మించుటలెస్స .... "[1] అని ప్రార్థింపవలసివచ్చినది అట్లు సంజయుడన్న యర్థము స్ఫురించుటవలననే ధర్మరాజున కంతటి యాగ్రహము కలిగినది. ధర్మరా జాగ్రహపడినాడని చెప్పక, ఆ మాట యనిన సంజయునిచేత వెంటనే అట్లు ప్రార్థింపించుటవలన, ధర్మజుని క్రోధమూహింపదగినదిగా తిక్కన్నగారు నిరూపించిరి

కౌరవుల సభలో పురోహితుడెంత యిదిగా మాటాడినాడో, సంజయుడు పాండవుల కొలువున నంతకుమించియే మాటాడినాడు కాని పురోహితుని మాటలంత వెలుసుగా సంజయునిమాటలు పై చూపునకు కనిపించవు. దానికి కారణమాయన స్వచ్ఛమైన బ్రాహ్మణుడగుట - ఈయన పరమ సౌమ్యమును పెంచుకొన్న వ్యావహారికమైన పుణ్యము కలవాడగుట. తిక్కన్నగారు మహా కావ్యనిర్మాణ దక్షుడగుటచేత పాత్రముల జీవలక్షణము ప్రకరణము ననుస రించి ప్రతీయమానమగునట్లుగా రచన చేసెను సంజయుని మాటలు పై చూపులకు సౌమ్యములుగా నుండుననుటను నిరూపించుటకు వృత్తములను గ్రహించుటవద్దనుండి తిక్కన్నగారి జాగ్రత్త కనిపించుచున్నది. పాండవ ధార్తరాష్ట్రిల బలపరాక్రమములు సంజయుడు చెప్పిన దొక్క ఉత్పలమాలా వృత్తమును గ్రహించియే యగుట గమనింపదగినది. తెలిసి చేసెడు శిల్పము లిట్లే యుండును.

సంజయుని మాటలు పైకెంత మృదువులో లోపల నంత కటువులు. ధర్మరాజు సంజయుని మించిన సౌమ్యుడు వాని మాటలయర్థము సక్రమముగా ధర్మరాజునకే తెలియును. అందువలననే సంజయుని మాటలయందలి నిగూఢమైన యర్థమును వెలికిలాగి చెప్పి ధర్మరాజు సమాధానము లిచ్చినట్లుగా తిక్కన్న గారు వ్రాయుట. సంజయుని మాటలకు ధర్మరాజునకు కోపమువచ్చినది. కౌరవులు పాండవులకొక లెక్కలోనివారు కారు పొమ్మనినాడు.

---

1 భా. ఉద్యో. 1-302, 303.

చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గర్ణుఁడున్
భూపశ్రేష్ఠుఁడుఁ దారు మున్నెరుగరే పోరెట్లుఁ గయ్యంబుల – ఆ
శాపాశంబులుచుట్టలావెటిగియుం జావేఁడి మార్కొందురు–ఇం
తేపో తమ్ముఁ గపిధ్వజప్రభల యంధీభూతులం జేయవే.

గాండీవజ్యారవం బుత్కటమై పెలుచం గ్రమ్మినన్ భీము బాహా
దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగాఁ దోఁచినన్ వే
దండద్వంగ్వంబు మాడ్కిందటిమి కవలు మాద్యద్గతిం దాఁకినం జా
కుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బిట్టుల్కి మూర్ఛిల్లకుండన్.

వ కావున

రణమున వారలన్ గెలువరాదను పల్కులటుండనిమ్ము–"[1]

ఇది కోపమువచ్చిన ధర్మరాజు మాటాడినతీరు పాండవులు కౌరవులను సుల భముగా జయింపగలరని సంజయునకు సమాధానము చెప్పిన తరువాత ధర్మ రాజు కొంత శాంతపడినవాడై మరియు సంజయునితో మునుపు వారివలన పరాభవమును పొందియు వారి దుర్గుణములను సహించితిమి ఈ విషయము నీ వెరుగని వాడవుకావు – ఇప్పుడును మేము సహించుచునే యున్నాము – అని చెప్పి చివరకిట్లనినాడు.

రండని పిలువఁ బనిచి పా
లిండని కొడుకులకుఁ జెప్పి యింద్రప్రస్థం
బొండెను వేఱొక పట్టణ
మొండెను మాకిచ్చి యనుచుటుచితముకాదే –[2]

ధృతరాష్ట్రుని నుద్దేశించి ధర్మరాజనినమాటయది మారాజ్యము మాకిచ్చి నచో మేమేల యుద్ధమునకు దిగుదుమన్నట్లుగా ధర్మరాజు మాటాడినాడు. అనగా రాజ్యమీయనిచో మేము యుద్ధముచేయుట నిశ్చయమని ధర్మరాజు తేల్చి చెప్పినట్లైనది.

---

1. భా. ఉద్యో. 1-321, 323-325.
2. భా. ఉద్యో 1–327

దీనికి సమాధానముగా సంజయుడు తన రెండవ యభిప్రాయము నిట్లు చెప్పినాడు.

పాలీక కౌరవులు దు
శ్శీలతఁ జెడఁ దలఁచిరేనిఁ జెప్పెద రుధిరా
భీలాన్నముకంటెను
మేలగు భిక్షాన్నమైన మీ నడవడికిన్[1].

ఇపుడు సంజయుడు వ్యంగ్యము నాశ్రయింపక ధర్మము నాశ్రయించి మాటాడుచున్నాడు. పాండవులను పొగడి మాటాడుచున్నాడు. మరియు మొదటినుండి ధర్మాత్ములనిపించుకొనిన మీరు చివరకీ "క్రూరకర్మాస్పదమైన తెఱగునకుఁ (యుద్ధమునకు) జొచ్చి బంధుల గురులన్ వెదకి వధియించు సౌఖ్యంబు (అట్లందరను చంపి పొందెడు రాజ్యసుఖము) అది యేటికి? ఆర్యనింద్యము (మరియు నది) అస్థిరము"[2] అని ధర్మతత్వము నాశ్రయించి మాటాడినాడు వెనుకటి తన మాటలకువలెనే ఇప్పుడును ధర్మరాజునకు కోపమువచ్చునేమో అని ఇట్లనినాడు.

అల్పులకు మ్రింగఁ జేదైన హాలహాలము
భంగిఁ బొంగెడు కోపంబు మ్రింగికొనఁగ
నీలగళునెన్ని నిన్నెన్నఁ బోలు, నట్టి
నీవు సాలినఁ గాకేల నెగడుఁ బేరు — ?[3]

ధర్మరాజునకు శివునితో సామ్యము జెప్పుచున్నాడు. శివుడు హాలహాలమును తాను మ్రింగనిచో దానివలన లోకముల కెట్టి హాని జరిగియుండెడిదో అట్టి హాని, ధర్మరాజు కోపమును మ్రింగనిచో లోకమునకు కాగలదు. లోక సంగ్రహార్థము ధర్మరాజు కోపమును దిగమ్రింగికొననలయునని సంజయుడు సూచించినాడు. ఈ మాటవలన సంజయుడు ధర్మరాజు నెంత గొప్ప చేసినాడో, అంతకంటె నెక్కువగా యుద్ధమునుండి విరమింపజేయు యత్నము

1 భా. ఉద్యో 1-329.
2. భా ఉద్యో. 1-332.
3. భా. ఉద్యో. 1-333.

చేయుచున్నాడు. ఈ రహస్యము ధర్మరాజునకు తెలియును. వెనుకటి సంజయుని మాటలవలె నివి కావని త్రోసిపుచ్చదగినవికావు. సంజయుడు హింస కూడదనుచున్నాడు. కోపము మంచిది కాదనుచున్నాడు. వెనుకటివలె చెప్ప వలసి వచ్చినచో హింసకూడును కోపము మంచిది - అని చెప్పవలయును. ఇవి ధర్మసంబంధి విషయములు. అట్లు చెప్పరాదు. కాని ధర్మరాజు సంజయుని మించినవాడు. సమాధానము చెప్పుట కిట్లుపక్రమించినాడు - "కోపంబు నివారింపందగు. అహింసయ యుత్తమధర్మంబగు. అట్లయినను వంశదూషకు లును లోకకంటకులును నగు పాపాత్ముల నిర్మూలంబుగాఁ జెఱచుట ధర్మంబని పెద్దలచేత విందుము అది యట్లుండె. సంగ్రామంబు రాజులకు ధర్మంబు - అవుంగాదని నీవ చెప్పుము "[1] సంజయుడు చెప్పినవి సామాన్యధర్మములుగా జేసి ధర్మరాజు ముందంగీకరించినాడు. వంశదూషకులను లోకకంటకులను వధించుట హింసకాదను ధర్మసూక్ష్మమును తాను ప్రతిపాదించి, వంశదూష కుడైన దుర్యోధనుని, వాని ననుసరించి యున్నవారిని చంపుట హింసకాక ధర్మమే యగుననియు కనుక సంజయుడు చెప్పినట్లుగా తన చరిత్ర హింసా కళంకితము కాబోవుటలేదనియు ధర్మరాజు సమాధానము చెప్పినాడు మరియు విశేషధర్మమైన రాజధర్మమును చూపించి యుద్ధము రాజధర్మమగునా కాదా నీవు చెప్పుమని సంజయునడుగుటగా రాజవంశములోని వాడనైన నేను - యుద్ధము నా ధర్మముగనుక చేయుదును - అని తన నిశ్చయమును స్పష్టము చేసినాడు. ఈ విధముగా ధర్మప్రపంచమును త్రవ్విచూపి, వంశదూషకులను వధించుటయు హింసయేయై అధర్మమగుననియు, రాజులకు యుద్ధము ధర్మము కాదనియు, సంజయుడన్నచో ననవలసిన స్థితిని ధర్మరాజు కల్పించినాడు. సంజయు డట్లనలేదు. అనుటకు వీలులేదు. యుద్ధమునుండి తన నిశ్చయ చిత్త వృత్తిని మరలించుటకుగాను హస్తినాపురమునుండి పంపబడి ధృతరాష్ట్రునిచేత వెరవేర్పడఁ జెప్పుచుఁబన్నఁబంచిన రథమెక్కి వచ్చిన సంజయునిచేత - యుద్ధము చేయదగినది, అది ధర్మము - అని ధర్మరాజంగీకరింపజేసినాడు. సంజయుడు వచ్చిన పనికాలేదు. మరియు ధర్మరాజు యుద్ధమునందు కృతనిశ్చయుడైనట్లు స్పష్టముగా తెలిసినది.

---

1. భా. ఉద్యో. 1-335.

తరువాత కొంత శ్రీకృష్ణుడు మాటాడినాడు. శ్రీకృష్ణుడు మాటాడి నంత సేపును సంజయుడేమియు ననక ఊరకుండెను. మధ్యలో నొక్కసారి, శ్రీకృష్ణుడు ద్రౌపదీవస్త్రాపహరణము విషయమును స్పృశించినపుడు మాత్రము "దేవా నీచిత్తంబుననిడి దీని నింత గొనియాడినఁ గర్జం బొడఁగూడునే-"[1] అను నొక్క వాక్యమును తప్ప సంజయుడు మరి మాటాడలేదు పూర్వము ధార్తరాష్ట్రులు చేసిన యెగ్గుల నుగ్గడించుచు, ధర్మజుని తాత్పర్యమునే స్థాపించుచు శ్రీకృష్ణుడు మాటాడినాడు.

శ్రీకృష్ణుని మాటలు పూర్తియైన తరువాత సంజయుడు ధర్మరాజుతో నిట్లనినాడు - "దేవా నా వచ్చిన కార్యంబు సఫలంబయ్యె"[2], ఇక పోయి వచ్చెదను - అని సంజయుడు చాల విచిత్రమైన బుద్ధిలక్షణముగల మానిసి మిక్కిలి యసాధ్యుడు. తాను వచ్చిన పనియేమి ? అయిన దేమి ? అయిన దనుచున్నాడు శ్రీకృష్ణుడు మాటాడిన దానిలో తన వచ్చిన పని యైనదనుట కనుకూలమైన దేదియో ఉండియుండవలయును. శ్రీకృష్ణుని మాటలలో, హస్తినాపురమునకు "ఏనైన నరుగుదెంచి కౌరవులకు బుద్ధిగాఁ జెప్పి"[3] చూచెదను "ఏ నీ పనికై వచ్చెద"[4] అమనొక్కటి తప్ప విశేషమైన మాట మరి యొకటిలేదు దీని నాధారముగా జేసికొని సంజయుడు తన వచ్చిన పనియై నట్లు చెప్పియుండవలయును. కాని సంజయుడు వచ్చినది శ్రీకృష్ణుడు హస్తినా పురమునకు వచ్చునట్లు చేయుటకుకాదు కాకపోయినను సంజయుడు దాని నుండి తన యర్థమును సాధించుకొనినాడు. శ్రీకృష్ణుడు తాను హస్తినా పురమునకు వచ్చి కౌరవులతో మాటాడెదననినాడు అట్లు శ్రీకృష్ణుడు మాటాడి వచ్చిన తరువాతగాని, ధర్మరాజు యుద్ధముగాని మరొకటిగాని పూని చేయుటకు వీలులేదు శ్రీకృష్ణుని మాటకు ధర్మరా జెదురు చెప్పి నీవుపోయి రానక్కరలేదు - నేను యుద్ధము ప్రకటింతును అని యనడు. అంతకు ముందుగనే "విశేషించి మాకు నితని బుద్ధియ సమస్తపురుషార్థమ్ములకు మూలం బగుట నితని వచనం బవశ్యంబు అలంఘనీయంబు" అని ధర్మరాజు శ్రీకృష్ణు

1 భా. ఉద్యో. 1-345,
2. భా. ఉద్యో. 1-361.
3. భా. ఉద్యో. 1-353
4. భా ఉద్యో. 1-360

నుద్దేశించి తనతో ననియున్నాడు కనుక శ్రీకృష్ణుడు హస్తినాపురమునకు బోయి వచ్చువరకు ధర్మరాజు యుద్ధము మానుకొనినట్లె అందువలన తాత్కాలికముగా నైనను ధర్మరాజు కయ్యపు తలపుమానినవాడగు చున్నాడు తనను ధృతరాష్ట్రుడు "కయ్యమను తలపు లోనుగ నయ్యమనందనుండు మానునట్టి తెఱగుగా శాంతి ప్రకారమున కార్యంబు నడిపి" రమ్మని బంపినాడు. కనుక తానువచ్చినపని యైనట్లెయైనది అందు కనినాడు "దేవా నా వచ్చిన కార్యంబు సఫలంబయ్యె'' నని సంజయుడు ధర్మరాజుతో మాటాడుటవలన తన వచ్చిన పనికాకపోయినను, శ్రీకృష్ణుడు కల్పించుకొనుటవలన నైనది. ఎట్లైననేమి? సంజయుడు తన వచ్చినపని యైనదనిపించుకొనినాడు. ఇక పనియైపోయినది పాండవులయొద్ద సెలవు దీసికొని హస్తినాపురమునకు బోయినాడు ఇది సంజయ రాయబారము దీనితో పాండవుల సమరోద్యోగమునందలి యొక భాగము పూర్తియైనది. సంజయుడు రాకపూర్వమంత ర్వాహినిగానున్న ధర్మజుని సమరోత్సాహము సంజయుడు వచ్చుటతో వెలికి వచ్చినది అనేకార్థముల నాశించి ఈ ధర్మజుని యుత్సాహము పురోగమనము లేని దగుటతో నగుచున్న పాండవోద్యోగము రెండవభాగము అది శ్రీకృష్ణుని రాయబారముతో ప్రారంభము

## 111. శ్రీకృష్ణరాయబారము

సంజయుడు తనను వీడ్కొని చనిన రెండవనాడు ధర్మరాజు తనవారి నందరను వెంటబెట్టుకొని శ్రీకృష్ణుని యొద్దకుపోయి "నీవు కరినగరంబున కరిగి కౌరవులతోడం దగిన మాటలాడి తెఱంగు సేయవలయునని ప్రార్థించి" నాడు. మరియు ననేక విషయము లాయనకు జెప్పి చివర కిట్లనినాడు

ఇన్ని సంకటముల నిబ్బంగి నెంతయు
నొగులు చిత్తవృత్తి నొవ్వ దీర్ప
వెజ్జవీవకావె వేయేల యేగతి
నడపఁదలంచి తదియ నాకుఁ బ్రియము.[1]

శ్రీకృష్ణుడు వైద్యుడు. ధర్మరాజు రోగి ధర్మరాజు రోగము చిత్తమునకు సంబంధించినది. చిత్తము స్థైర్యమును గోలుపోయి వివిధములైన వృత్తులకు

1 భా. ఉద్యో 3-26.

లోనైనది వృత్తియనగా నింద్రియముల ద్వారా చిత్తము విషయములయందు ప్రవర్తించి తదాకారరూపమున పరిణమించుట అనేక వృత్తులకు లోనగుట యనగా దేనియందును స్థిమితము లేకపోవుట. ధర్మజుని చిత్తము, యుద్ధము చేయకుండ దుర్యోధనునినుండి రాజ్యమును పొందుట కుదురదను విషయము నందు, యుద్ధము కులమునందలి జనసమాజమునంతయు నాశనము చేయునను విచారరూపమైన విషయమునందు, యుద్ధముకాకుండ రాజ్యమువచ్చినబాగుండు నన్న విషయమునందు, అసలు రాజ్యములేకపోయిన నేమను విషయమునందు– ఈ మొదలైన బహువిషయములయందు వర్తించి ఏ యొకదానియందును కుదురు కొనలేక, అన్నింటి చేతను తాడితమై వ్యధపడుచున్నది అంతకుముందుగా ధర్మరాజు శ్రీకృష్ణునకు జెప్పిన ననేక విషయములనుండి, ఆయన చిత్తము యొక్క రోగము నట్లూహింపవలసివచ్చుచున్నది. అట్టి చిత్తము యొక్కబాధ పోవలయుననగా నది యొక విషయమున స్థిరపడవలయును అట్లు చేయువాడు వైద్యుడు ధర్మరాజు శ్రీకృష్ణుని వైద్యుడనుచున్నాడు. అనగా తన చిత్తము నకు స్థిమితము కూర్చవలసినదిగా శ్రీకృష్ణుని కోరుచున్నాడన్నమాట. తన చిత్తమెందువలన నట్లు వ్యధపొందుచున్నదియు ధర్మరాజునకు తెలియును. ఒక విషయమున స్థిమితపడినచో నా వ్యధ పోవు న ని యు తెలియును ఏ విషయమున స్థిమితపడవలయునో మాత్రము తెలియుటలేదు. అది నిశ్చయించి తన బాధను తొలగించుమనియే ధర్మరాజు శ్రీకృష్ణుని కోరినాడు శ్రీకృష్ణు డేది నిశ్చయించిన అదియే ధర్మరాజునకు ప్రియము.

ఇన్ని సంకటములతో బాధపడవలసిన, ఇతికర్తవ్యతాబుద్ధి కుదురని స్థితి ధర్మరాజున కెప్పటినుండి కలిగినది ? ఏల కలిగినది ? ఈ విషయము విచారిం చగా నిట్లు తోచుచున్నది సంజయుడు వచ్చి వెళ్ళువరకును ధర్మరాజు బాగుగనే యున్నాడు. యుద్ధమునందు దృఢనిశ్చయము కలవాడుగనే సంజయునితో మాటాడి వానిని పంపినాడు కనుక సంజయుని పంపించిన తరువాత ధర్మరా జునకీ చిత్తము జాడ్యము వచ్చియుండవలయును సంజయుడు వెళ్ళిపోయిన తరువాత, ఇప్పుడు ధర్మరాజు శ్రీకృష్ణుని యొద్దకు వచ్చులోపల, ఇట్టి సంకట పాటును వానికి కూర్చగల సన్నివేశమేదియును జరుగలేదు కనుక సంజయుడు వచ్చి మాటాడిన సన్నివేశమే ధర్మరాజు ఈ స్థితికి కారణము కావలయును. సంజయునితో నా సన్నివేశమున ధర్మరాజు మాటాడినాడు. మరియు శ్రీకృష్ణుడు

మాటాడినాడు. సంజయునితో తాను మాటాడినంతసేపును ధర్మరాజు చాల స్థిమితము కలవాడుగనేయున్నాడుగనుక, ఇప్పటి ఈస్థితి తరువాత శ్రీకృష్ణుడు మాటాడినదానినుండి పుట్టియుండవలయును శ్రీకృష్ణుని యాడినమాటలలో విశేషముగల వాక్యమొకటి – సంజయుడు తన వచ్చిన పనియైన దనిపించుకొనుట కాస్కారమైనది – వెనుక చెప్పబడినది. మిగిలిన శ్రీకృష్ణుని మాటలన్నియు ధార్తరాష్ట్రుల యధర్మప్రవృత్తిని, ముఖ్యముగా ద్యూతవిషయికమైన యధర్మప్రవృత్తిని, తిరుగదోడి చూపి చెప్పు సాధారణ విషయముతోనున్న వియే నిరంతరము వాటిని స్మరించుచు ప్రతీకారమును యోజించుచుండుట వలననే ధర్మరాజు యుద్ధమునకు నిశ్చయించుకొనినాడు కనుక నా శ్రీకృష్ణుని మాటలనుండి ధర్మరాజు ఇప్పటి ఈస్థితి పుట్టియుండదు. అందువలన ననివార్యముగా నా శ్రీకృష్ణుని విశేషముగల వాక్యము నుండియే ధర్మరాజునకీ స్థితి కలిగియుండవలయును శ్రీకృష్ణదేవంవిధమైన విశేష వాక్యార్థమును నైదారు పద్యములయందు వివరించినాడు. అందు పరమార్థభూతమైన దీ క్రింది పద్యముగా కనుపించుచున్నది

ధృతరాష్ట్రిందును బుత్రులున్ వనము కుంతీనందనుల్ సింహముల్
మతినూహింప నసింహమైన వనమున్ మర్దింతురెందున్ వనా
వృత వృత్తంబులు గాని సింహములకున్ వేగంబ చేటొందుఁగా
న తగం బొందుట కార్యమీ యుభయము న్సంతుష్టిమై నున్కికిన్.[1]

శ్రీకృష్ణుడు తాను హస్తినాపురమునకు వచ్చి కౌరవులతో మాటాడుటకు హేతు వీ పద్యమున చెప్పుచున్నాడు. సంధిచేసికొని పొందుపడి యుండనిచో కౌరవుల కెంతనష్టమో, పాండవులకు నంతే నష్టమని సంజయునితో చెప్పినాడు. అట్లైవరును నష్టపడక తుష్టిమై నుండవలయునన్నచో, యుద్ధముగాక సంధి కర్తవ్యమన్నట్లుగా మాటడి శ్రీకృష్ణుడు "ఏ నీ పనికై వచ్చెద" ననినాడు. మొద లుపక్రమించుటయే "పాండవేయులఁ దగ ప్రార్థించి"యే నచట కరుదెంచెదనని ఉపక్రమించినాడు. ఈ విధమైన శ్రీకృష్ణుని ప్రసంగము విన్న తరువాత ధర్మజుని చిత్తము వివిధ వృత్తులకు లోనైనది. శ్రీకృష్ణునిబుద్ధి యుద్ధమునందుకంటె సంధియగుటయందు ధర్మరాజునకు కనిపించినది. మరియు నా సంధి తమ మేలు

---

1. భా ఉద్యో. 1-358.

కొరకుగూడ నగుచున్న ట్లగుపించుచున్నది ఇంతవరకు ధర్మరాజు సంధి కుదుర్చుకొను విషయమై చింతించలేదు. అందువలననే అభిమన్యుని పెండ్లియైనప్పటి నుండి తానొకసారికూడ సంధియగుటను గురించి శ్రీకృష్ణునితో ననలేదు. తాననకపోవుటను బట్టియే శ్రీ కృష్ణుడును తనతో నామాట ననియుండడు. తాను సంధికై యత్నించుట మేలని శ్రీకృష్ణునకు లోపలనున్నది పైకి తనతో ననలేదు. సంజయునితో ననినాడు తన కా విషయము తెలియవలయుననియే అన్నట్లున్నది మరియు పాండవేయులఁ దగ ప్రార్థించి నేను సంధి కుదుర్చుటకు వచ్చెదననినాడు. నిజమునకు శ్రీకృష్ణుని ఆవిషయమున ప్రార్థింపవలసినది తాను తానింతవరకా పనిచేయకపోవుట పొరపాటు కనుక నిప్పుడైనను శ్రీకృష్ణుని ప్రార్థించుట చేయదగినది — అని ఈ విధముగా, శ్రీకృష్ణుడు సంజయునితో నట్లన్నప్పటినుండియు నాలోచించియుండును యుద్ధముచేయుటకు నిశ్చయించుకొన్న ధర్మరాజు బుద్ధి, సంధిచేసికొనుటయే పాండవులకును మేలన్న శ్రీకృష్ణుని సూచనచేత బహుధా తాడితమైనది ఇక యుద్ధమువలని కష్టనష్టములు, సంధివలని మేలుకీళ్లు మొదలైన బహువిషయములయందు ధర్మజుని చిత్తము ప్రసరించి, దేనియందును కుదురు చిక్కక చాలవ్యాధపడినది సంజయుడు వెళ్ళిపోయినప్పటినుండి ధర్మరాజావిధముగా వ్యధపడి మఱునాడు శ్రీకృష్ణుని వద్దకుపోయి వానిని హాస్తినాపురమునకు బోయిరావలసినదిగా ప్రార్థించినాడు.

ధర్మరాజు శ్రీకృష్ణుని మందిరమునకు బయలుదేరుచు తనవారితో "మనము జనార్దనుపాలికిఁ జని కౌరవసభకు నతనిఁ జనుమని ప్రార్థించిన మేలు"[1] అని యనుట 'ధృతరాష్ట్రిండును బుత్రులున్ వనము' మొదలైన పద్యము నందలి యర్థమునే చెప్పుచున్నది మరియు శ్రీకృష్ణునితో "ఆపదఁ గడవం బెట్టఁగ నోపి శుభంబైన దాని నొడగూర్పను మాకీ పుట్టువునకుఁ బాండుక్ష్మాపాలుఁడు నిన్నుఁజూపి చనియె మహాత్మా .... నీకు మేము ప్రద్యుమ్నాది కుమారులతోడివారము. మమ్ము దురితంబులు పొరయకుండ నరసి రక్షింపుము – "[2] అని ఈ మొదలుగాఁ నుపక్రమించుట, తాను పొరపాటు చేసితి ననుకొనుచున్న ధర్మరాజు మనోలక్షణమున కనుగుణముగా నున్నది. మా తండ్రి మాకు లేదు.

1. భా ఉద్యో. 3-4
2. భా. ఉద్యో. 3-6,8

నీవు మాకు తండ్రివంటివాడవు నీవు నీ కుమారులైన ప్రద్యుమ్నాదులనెట్లు చూచుకొందువో మమ్ములను నట్లే చూచుకొనవలయును తండ్రి బిడ్డల తప్పులను క్షమించును ఆ తప్పులవలన దుష్టములైన ఫలములు బిడ్డలకు కాకుండ తండ్రి రక్షించును. నీవు మమ్మట్లు రక్షింపవలయును – అను నీ తాత్పర్యము తోడి మాటలు అంతకు క్రితము ధర్మరాజు తాను శ్రీకృష్ణుని సంధికై ప్రయత్నించవలసినదిగా కోరియుండకపోవుట పొరపాటని అనుకొని విచారించి యున్ననే ఔచిత్యవంతములై చెప్పగా సంగతములగును. అట్టి మనో వ్యధ ధర్మరాజునకు కలిగియుండనిచో నింత దీనముగా శ్రీకృష్ణునితో మాటాడవలసిన యవసరము కనిపించుటలేదు మరియు. శ్రీకృష్ణుడు తనకు దెలియ జేయుటకొరకే సంజయునితో నట్లని యుండునని ధర్మరాజొక ఊహచేసినాడు నిజముగా శ్రీకృష్ణుని ఆంతర్య మదివలెనే కనిపించుచున్నది కానిచో నిన్నటి వరకును మంచిగా మహారాజువలె మాటాడుచున్న ధర్మరాజు తెల్లవారుట తోడనేవచ్చి, ఇట్లు దీనుడై ప్రార్థించుటను జూచి శ్రీకృష్ణు డాశ్చర్యపడి – ఇది యేమి ? ఇంతలో నేమి వచ్చినది ? – అని ఈ ధోరణిలో ననునయించుచు నడుగవలయును. శ్రీకృష్ణుడిట్టి దేమియును జేయక "నీ పంచిన యట్లు చేయం గలవాడను ఎయ్యది తలంపు సెప్పుము ?" అని తొణకక మాటాడినాడు దీనినిబట్టి శ్రీకృష్ణుడు సంజయునితో నా మాటనుటలోని ఆంతర్యము ధర్మరాజూహించినట్లే కావలయును.

అయినచో నిచట రెండు మూడు ప్రశ్నలు పుట్టుచున్నవి. కౌరవ పాండవులకు సంధికావలయుననియు, దానికై తాను ప్రయత్నము చేయవలయుననియు నిజముగా శ్రీకృష్ణునకున్నదా ? ఉన్నచో నింతకు పూర్వమే ధర్మరాజుతో చెప్పి తానేల పూనుకొనలేదు ? పాండవకార్యార్థమై కౌరవుల వద్దకు నొకనిని బంపుమని ద్రుపదునితో చెప్పక తానేపోయి వచ్చెదనని అప్పుడే యేలనలేదు ? తగిన కార్యము చెప్ప మీరలర్హులరని, ఎవరిని చెప్పనీయక తానుపక్రమించి యుద్ధమునే నిశ్చయించి పలికి బంధుమిత్రులందరును తన నిశ్చయమున కనుకూలపడి వచ్చునట్లు చేయుటయేల ? – నిజమునకు సంధి కావలయుననిగాని, తాను దానిని సాధింపవలయుననిగాని శ్రీకృష్ణునకులేదు. కనుకనే ధర్మరాజు బుద్ధిని యుద్ధమునందేనిలిపి, అందుకు తగినట్లుగా సర్వమును సిద్ధమగు రీతిని ప్రోత్సహించినాడు. శ్రీకృష్ణుడు తాను కౌరవులయొద్దకు

రాయబారిగా పోదలచుటలోని ఆంతర్యము గ్రహింపబడినచో నన్నియు సంగత పడును. శ్రీకృష్ణుడే తన యాంతర్యమును విదురునితో నిట్లు చెప్పినాడు. "ఇట్లు నొచ్చి చెప్పకున్న నన్నదమ్ములు దమలోనం బోర కృష్ణుండు వారింపక యుపేక్షించెఁ దనచేతఁ జక్కంబడదాయని యజ్ఞులైన జనులాడుదురు"[1] కనుక వచ్చినానని చెప్పినాడు. లోకము తన మీద నెపము వెట్టకుండుటను శ్రీకృష్ణుడు చూచుకొనుచున్నాడు తనకుతాను మేలుచేసికొను యత్నము తోడి ఆంతర్యమిది ఈ తన రాయబారమువలన పాండవులకును మేలుచేయ దలచుట మరొక ఆంతర్యము యుద్ధము కాకుండ పాండవుల రాజ్యము పాండవులకు వచ్చునట్లు చేయుటకంటెను భిన్నమైన మేలది ధర్మరాజు కోరి నట్లుగా కౌరవుల వద్దకు పోవుట కంగీకరించి శ్రీకృష్ణుడు వానితో నిట్లనినాడు

"ఆ తలకు నేను జని వి
ఖ్యాతంబుగ నీదు వినియ మభివర్ణింతున్.

చెలులుం జుట్టలు దేశం
బులరాజులు వినగ నీదు పుణ్యాచరిత్రం
బులు నీవు ధర్మమార్గము
దలఁచుటయుం దెలియఁ బలికెదం గురుసభలోన్

వ దానికి దుర్యోధనుం డియ్యకొనక తెఱంగు మాలిన మాటలాడుటయుఁ తండ్రి యతని వారింపనేరమికిఁదో డుపేక్షకుం డగుటయుఁ జూచి, మీ తొల్లింటి పాట్లునుందలంచి యెల్లవారును వారిన గర్హింతురు ఇంతియకాక మనకు నొండేమి వలయును? నా యోపినంతయుఁ బెక్కు భంగుల సంధియ కావింపంజూచెదను అవ్విధంబు సిద్ధించిన మేలుగాదె? అట్లుగాక తక్కిన నచ్చోటి యుత్సాహంబు చందంబును, నందుఁ జేయంగలవారి వర్తనంబులుఁ గొలందులు నెఱింగి నీకు విజయంబగు విధంబునం జనుదెంచెద.

ఆ సుయోధను ముక్కున నావి గలుగఁ బుడమి నీ కీఁడు కావునఁ బోర కలుగు. నేను గయ్యపు శకునంబు లెన్నియేనిఁ గంటి. నీ వనుత్సాహివిగాఁగ వలదు.

---

1. భా ఉద్యో. 3-243.

వ. చతురంగ బలంబుల నాయితంబు గావించుచు దొరలం బురికొల్పు కొనుచు నాలస్యంబులేక సమరంబునకు సన్నాహంబు సేయుచుండ వలయు."[1]

కౌరవుల కొలువున దుర్యోధనునకు యుద్ధమున సహాయపడనున్న బంధుమిత్రుల యొక్క సమక్షమున, ధర్మరాజు యొక్క మంచితనమును బహుభంగుల నుగ్గడించి వచ్చుటకు శ్రీకృష్ణుడు హస్తినాపురమ్మునకు బోవుచున్నాడు దీనివలన నేమగుననగా, ధర్మరాజు మంచితనమును దుర్యోధను డంగీకరింపక మరియు సహింపక, దురుసుమాటలు మాటాడును కొడుకు నేమియుననలేక ధృతరాష్ట్రు డుపేక్షించి యూరకుండును ఆ తండ్రి కొడుకుల ఆ ప్రవర్తనను జూచినవారికి ప్రత్యక్షముగా వారి దుష్టబుద్ధి లక్షణము తెలియును. అప్పుడే ఒక్కక్షణము ముందుగా శ్రీకృష్ణుడు పాండవుల సద్గుణ ప్రపంచమును, ధర్మబుద్ధి లక్షణమును సోదాహరణముగా నిరూపించి యున్నందున, అచటి వారందరకు నేకకాలమున కౌరవ పాండవుల ప్రవృత్తులను పోల్చుకొని యాలోచించుట కవకాశము కలుగును. దుర్యోధనుని తత్కాలపు దురుసుదనము ముందు ధర్మరాజుయొక్క మంచితనము మరియు లెస్సగా ప్రకాశించును. అందువలన నందరును కౌరవులను నిందింతురు ఎల్లి యుద్ధమున సహాయము చేయగలవారందరకును దుర్యోధనునియందు సద్భావము లేకుండ పోవును. దానితో దుర్యోధనుని బలము సగము క్రుంగినట్లై యగును. అదియే పాండవులకు గావలయును శ్రీకృష్ణుడు హస్తినాపురమునకు బోయినచో నిస్సందేహముగా నది అయితీరును శ్రీకృష్ణుడు తానందుకొరకే పోవుచున్నానని ధర్మరాజుతో చెప్పినాడు. శ్రీకృష్ణునకు సంధికాదని తెలియును మరియు యుద్ధమగుటయే ఆయన అభిమతము. శ్రీకృష్ణుడు అవతారమెత్తిన పరమమైన దైవము. భగవంతు డవతారమెత్తినా డనగా దుష్టశిక్షణ చేసియో చేయించియో తీరును. శ్రీరామావతారమున స్వయముగా చేసినాడు. ఈ కృష్ణావతారమున చేయించినాడు. భగవదవతార రహస్యము తెలియని వారజ్ఞులు శ్రీకృష్ణుడు సంధిచేయుటకు యత్నించినాడు కాడని వారందురు అది భగవదపచారము. అజ్ఞానముచేతనైనను తదపచారము

1. భా. ఉద్యో 3-38...42.

లోకముచేయుట కవకాశము కలుగనీయకుండ కరుణామయుడైన భగవంతుడు, తానును సంధికై యత్నించిన వాడువలె కనిపించుటకు కొంత గ్రంథమును నడిపించినాడు. తన రాకలోని యాంతర్యమదియే అని విదురునకు చెప్పినాడు అట్లు విదురునితో చెప్పి పవ్వడించిన శ్రీకృష్ణుని గూర్చి "పాలకడలి కడలి పాటియై యొప్పు నప్పాన్పునందు శౌరి పవ్వడించె"[1] నని తిక్కన్నగారు శ్రీకృష్ణుని విష్ణులక్షణమును స్ఫురింపజేయుటలోగల విశేషమును విచారించినచో పైన చెప్పబడిన యంశములు సంగతములగును. మరియు భారతకర్త అశ్వమేధపర్వమున[2] ఉదంకునిచేత "కౌరవకులమున మిథ్యాచారుడవై త్రుంచి తకట! శక్తుడవయ్యున్ నేరమిమై నేఁ జేయవ పొందారగ" అని అనిపించి, శ్రీకృష్ణునిచేత తన భగవల్లక్షణమును "ధర్మంబు కలఁకఁగాంచి యధార్మికులం బొలియఁజేసి ధార్మికులను బేరర్మిలి రక్షింతు నుచితకర్మాచరణముల నే జగద్ధితమునకై" అని చెప్పించి, మరియు నా మునికి విశ్వరూపమును జూపి శ్రీకృష్ణుడు తాను భగవంతుడని నిరూపించుకొనినాడని వ్రాసిన దాని నిచట అనుసంధించుకొన్నచో విషయమింకను స్పష్టపడును ఈ మాటనగనే మహర్షియైన ఉదంకు డజ్ఞుడా అని శంకించగల ప్రమాదము కనిపించుచున్నది భారతకర్త తాత్పర్య మదికాదు. లోకమునకు శ్రీకృష్ణుడు చేసిన దాని అంతర్యము స్పష్టము చేయుటకొరకే ఆ సన్నివేశము కల్పింపబడినది. ఉదంకుని ఆశ్రమమున దిగకుండ శ్రీకృష్ణుడు ద్వారకకు పోయినాడని చెప్పినచో భారతకథ కేమియు నష్టములేదు. మరి యా సన్నివేశ మేల కల్పింపబడవలయు నన్నచో, పైన చెప్పిన శ్రీకృష్ణుని భగవల్లక్షణ మూహింపనేవలయును. అందువలన నుదంకుని యజ్ఞత చూపించుకొరకది యేర్పాటుచేయబడలేదు భారతమున కుదంకుని యజ్ఞానిరూపణమువలన ప్రయోజన మేమియులేదు శ్రీకృష్ణుని భగవల్లక్షణ నిరూపణమే ప్రయోజనము అదిలోకము శ్రీకృష్ణుని పైనెపము వెట్టకుండుటను సాధించును శ్రీకృష్ణుడు తానుగా కల్పించుకొని రాయబారము నెరపుటలోని మొదటి అంతర్యస్వరూపమిది రెండవది ధర్మరాజు యొక్క ధర్మబుద్ధి లక్షణమును ప్రకాశింపజేసి, దాని మూలమున దుర్యోధనుడు యుద్ధమునందు మరియు బద్ధబుద్ధి యగునట్లుచేయుట. మరియు వాని పక్షము

1 భా ఉద్యో 3-244.

2 భా ఉద్యో. 3-33, 49.

బలము తగ్గించి, ధర్మజునకు విజయము సుసాధ్యము చేయుట. కనుకనే, నేను పోయివచ్చెదను. నీవు యుద్ధమునకు సంసిద్ధుడవై యుండుము. నీ వనుత్సాహివి కారాదు. దుర్యోధనుడు రాజ్యమీయడు యుద్ధముకాక తప్పదు. ఆ లక్షణములు నాకు కనిపించుచున్నవి - అని ఈ మొదలుగా ధర్మరాజునకు శ్రీకృష్ణుడు చెప్పినాడు

యుద్ధము నొల్లక శాంతిమై మనుట నాశించి, శ్రీకృష్ణు నంతటి వానిని ప్రార్థించి కౌరవుల కడకు పంపించి, చివర క్షణమువరకు సంధియగుటకు ప్రయత్నించినాడన్న పేరు ధర్మరాజునకు రావలయునని శ్రీకృష్ణు డంతుచిక్క కుండ చేసినాడు అందుకే ధర్మరాజంతగా వ్యథపడవలసి వచ్చినది మొదటనే శ్రీకృష్ణుడు తన యాంతర్యమును జెప్పియున్నచో ధర్మరాజు యుద్ధమున కసలు అనభిముఖుడు కావచ్చును అది శ్రీకృష్ణున కిష్టముకాదు. అందువలన ముందు ధర్మజుని చిత్తవృత్తి కనుగుణముగా నంతయు యుద్ధమునకు సిద్ధము చేసినాడు. రెండుపక్షములవారును సర్వసన్నాహములు చేసికొన్న తరువాత రెండు మూడు ప్రయోజనముల నాశించి శ్రీకృష్ణుడు తాను రంగము మీదకు వచ్చినాడు. తా నాశించిన ప్రయోజనముల సిద్ధి నుద్దేశించి, సంజయునితో మాటాడుచు నప్రయత్నముగానన్న ట్లొ విశేషమైన పలుకు పలికినాడు అది ధర్మరాజు నెంత వ్యథపెట్టినదో అంతకంటె నెక్కువైన మంచి పేరు వానికి సంపాదించి పెట్టినది

అట్లు డోలాందోళిత చేతస్కతతోడి యుద్ధవైముఖ్యమును ధర్మరాజు విషయమున మరొక ప్రయోజనము నాశించి భారతకర్త కల్పించినాడు. అది కావ్యరస సంబంధి ప్రయోజనము. భారతమున ప్రధానరసము శాంతము. నాయక పురుషుని చిత్తవృత్తి ననుసరించి రసముండును. భారతమున నాయకుడు ధర్మరాజు యుద్ధము ముగిసినప్పటినుండి ధర్మజుని చిత్తవృత్తి నిర్వేద రూపమున నిరూపింపబడి శాంతమునకు తీసికొనిపోబడుచున్నది. బంధుమిత్రుల నందరను చంపితినే అను మమకారాత్మకమైన, ఆత్మద్వేషముతోడి దుఃఖరూప చిత్తవృత్తి నిర్వేదముగా పరిణమింపజేయబడినది ఆ మమకారముతోడి బంధుభావము కలిమి ధర్మజుని చిత్తమునందు యుద్ధమునకు పూర్వమే, ఈ శ్రీకృష్ణుని మాటవలన పుట్టిన వ్యథలోని భాగముగా నిక్షేపింపబడినది. ఇది క్రమముగా పుంజుకొని యుద్ధాంతమునకు పుష్టమై నిర్వేదరూపమున పరిణ

మించుటను భారతకర్త చూచుకొనినాడు. మరియు ధర్మజుని విషయమున యుద్ధవైముఖ్యమును కొంత నిరూపించుటచేత, భారతమున నంగభూతమైన వీరముయొక్క తీవ్రత అరికట్టబడినది. భారతమున యుద్ధ మనివార్యమైనది. యుద్ధమునకు మూలము వీరము. అట్లని యది ప్రధానరసము కాదు. అందు వలన దాని విజృంభణ మరికట్టబడుచుండవలయును. కావ్యమున రసము నాయకుని పక్షమున నిరూపింపబడుచుండును. పాండవపక్షము యుద్ధమునకు సిద్ధమగు వరకు ధర్మజునియం దుత్సాహము కొనసాగింపబడినది. అట్లై దానిని యుద్ధాంతము కొనసాగనిచ్చినచో వీరము లెస్సగా పుష్టమగును. శాంతరస ప్రధానమైన గ్రంథమున అంగభూతమైన వీర మట్లు పుష్టమై ఆస్వాద్యము కారాదు. అయినచో శాంత మాస్వాద్యము కాదు అంగ మంగిని మ్రింగినట్లు. కనుక భారతకర్త నాయకుడైన ధర్మజునియందు యుద్ధోత్సాహము నొక స్థితికి తీసికొనివచ్చి విచ్ఛిత్తిని కూర్చినాడు. దానితో వీరము వెనుకబట్టినది. ఇది ప్రధానరసము దృష్ట్యాచేయబడిన కావ్యశిల్పము.

శ్రీకృష్ణుడు సంజయునితో మాటాడుచు నట్లనుటవలన తా నాశించినది సిద్ధించినదిగాని, పాండవుల యందొక విధముగా యుద్ధవైముఖ్యము కలిగినది. అది తన యభీష్టము కాదు. అందువలన తానుగా వారిని యుద్ధమునకు ప్రోత్స హింపవలసిన స్థితి యేర్పడినది అందువలన కౌరవులు చేసిన దుష్టములైన పనుల నేకరువుపెట్టి యుద్ధనిశ్చయమునుండి చెదరినవారి బుద్ధులను తిరిగి యుద్ధమునందు ప్రవేశపెట్టినాడు యుద్ధమునుండి చలించి, బహువిషయ ములయందు ప్రసరించుచు, దేనియందును స్థిమితములేనిదైన ధర్మజుని చిత్త వృత్తి నొవ్వను తిరిగి యుద్ధమును నిశ్చయించి చెప్పి, శ్రీకృష్ణుడు పోగొట్టి నాడు

ఈ విధముగా ధర్మరాజుచేత ప్రార్థింపబడుటను కల్పించికొనినవాడును, వాని చిత్తమును తిరిగి యుద్ధముచేయుటయందు కుదుటపరచినవాడును నై, శ్రీకృష్ణుడు, కౌరవపాండవుల సంధికి యత్నించలేదను నెపము తనమీద లేకుండుటకొరకు, యుద్ధమునకంటె శాంతిప్రకారమున కార్యము చక్కబెట్టు కొని కలిసియుండుటను, ఇన్నికష్టము లనుభవించియు, ధర్మరాజు కోరు చున్నాడని కౌరవసభలో ప్రకటించి ధర్మజుని మంచితనమును బెంచుటకొరకు, మరియు కౌరవుల సమరసన్నాహముల స్థితిగతు లెరిగి పాండవుల కాను

కూల్యము ఘటించుకొరకు - రాయబారియై హస్తినాపురమునకు బోయినాడు. ఏమి పనిని సాధించుటకు బోయెనో దానిని సాధించుకొని తిరిగి వచ్చినాడు.

మరి శ్రీకృష్ణుడు "నా యోపినంతయుఁ బెక్కుభంగుల సంధియ కావింపం జూచెద'' నని ధర్మరాజుతో చెప్పినాడు గదా! ఆ వాక్యము సంధియగుటను శ్రీకృష్ణుడు వాంఛించుటను సాధించదా యనవచ్చును వ్యస్తముగా జూచినచో నదియట్లే యనిపించునుగాని, తత్ప్రకరణమునమంచి చూచినచో నది శ్రీకృష్ణుని నాభికుహరమునుండి త్రవ్వికొనివచ్చు నర్థమును కలిగియున్నట్లనిపించదు. శ్రీకృష్ణుడు హస్తినాపురము బోవుట కది యొక మిష. అట్లు శ్రీకృష్ణుడు కల్పించుకొనుటలోని ఆంతర్యము పైన వివరింపబడినది. ముందుగా ధర్మరాజు కొంత వ్యథాకులితచేతస్కుడైనను, శ్రీకృష్ణుడు హస్తినాపురమునకు బయలుదేరునప్పటికే, ఆతని మాటలవలన ధర్మజునకు సంధికాదు - ఇది సంధికొరకు బోవుటకాదు - అని స్పష్టముగా ననిపించినది. అట్లు స్పష్టముగా విషయము నవగతము చేసికొనియున్నవాడు గనుకనే, హస్తినాపురమునుండి తిరిగి వచ్చిన శ్రీకృష్ణుడు, అచట జరిగిన విశేషములన్నియును జెప్పి దుర్యోధనుడు "రాజ్యంబు పాలిచ్చువాఁడు గాఁడు. కౌరవులయెడ దండంబుదక్క నొండుపాయంబు లేదు. మీకుంబోలిన తెఱంగు సేయుండు''[1] అని యనగనే ధర్మరాజు తమ్ములనుజూచి "ఇంక ననుమానములేదు. అరిమర్దనమున కయ్యేడు వెరవుం జేవయును మెఱయ వెడలుఁడు గడఁకన్" - అని యుత్సాహమును ప్రకటించినాడు సంధియగుననిగాని, సంధితప్పక కావించుకొరకు శ్రీకృష్ణుడు పోవుచున్నాడనిగాని ధర్మరాజు నమ్మియున్నచో, ఆయన తిరిగి వచ్చి యిది యిట్లైనదన్నపుడు, అయ్యో! మన ప్రయత్నము వ్యర్థమైనదే - ఇపుడేమిటి చేయుట? అని విచారమును వెలిబుచ్చియుండవలయును. అదేమియు ధర్మరాజు చేయక, అంతయు తెలిసి సిద్ధముగా నున్నవాడువలె మాటాడినాడు. కనుక, శ్రీకృష్ణుని రాయబారము బోవుటలోని ఆంతర్యము, మన మూహించినదే యగుచున్నది. నా యోపినంత సంధిగావింప జూచెదనను శ్రీకృష్ణుని వాక్యము కొననాలుకమీది వాక్యము. మరియు వేదపరమార్థమునుద్దేశించిన పరమగంభీరమైన వాక్యము.

---

1. భా. ఉద్యో. 4-83.

ఇచట మరొక చమత్కారమైన విషయము చెప్పబడవలయును. తిరిగి వచ్చిన శ్రీకృష్ణుడు చెప్పినది విని సమరోత్సాహమును జూపించిన ధర్మరాజు వెంటనే "కరుణాయత్తచిత్తుండై నచ్యుతునాలోకించి" ఇట్లనినాడు—

"కురువంశము ద్రుంచుటకుం
జొరఁజాలక నామనంబు సుడివడియెడు నే
వెరవును దొరకొనదుగదే
సరసీరుహనాభ ! పొందు సంపాదింపన్.

వ నా మనంబును దమ్ముల తలంపును నీ వెఱుంగుదు. ధార్తరాష్ట్రుల చందంబును భీష్మద్రోణవిదురాదుల చిత్తంబులును నెఱింగివచ్చితి. మాకు ధర్మచ్యుతిలేకుండునట్టి కార్యంబు నిశ్చయింపుము"[1]

తాను యుద్ధమునకు నుత్సాహము జేసి, తమ్ముల నందు కాజ్ఞాపించి, శ్రీకృష్ణునితో యుద్ధమునకు నా మననస్సంగీకరించుటలేదు మన మెంత యత్నించినను సంధి కాలేదు ఇపుడు మేమేమి చేయవలయునో నీవు నిశ్చయించి చెప్పుమనుట చిత్రముగా నున్నది ఈ వైచిత్ర్యము నిచట తిక్కన్నగారు భారతమునందలి ప్రధానరసము దృష్ట్యా కల్పించిరి. నాయకుని యుత్సాహమును భంగించుట వలన అంగభూతమైన వీరరసప్రసరణము వెనుకబట్టుట మొదటిది యుద్ధాంతమున కవసరమైన, ఇతఃపూర్వము ధర్మజుని చిత్తమున నిక్షేపింపబడిన మమకారముతోడి బంధుభావము, కురువంశము ద్రుంచుటకుం జొరఁజాలక మొదలైన వాక్యముచేత పునఃనాయకునియందు వెలికి జూపి గ్రంథగౌరవమున కానుకూల్యము ఘటించుట రెండవది. ఆ కల్పన ఆ రెండు ప్రయోజనములను సాధించుచున్నది. మరియు నిందుకుపస్కారకములేయగు యుధిష్ఠిరుని ధర్మబుద్ధి లక్షణము, శ్రీకృష్ణునియందు వానికిగల భక్తిగౌరవములు, మొదలైన స్థూలాభిప్రాయములను నది సాధించుచున్నది.

శ్రీకృష్ణుడు సమరం బవశ్య కర్తవ్యంబుగా నిశ్చయించి చెప్పినాడు. అది విని ధర్మరాజు "బంధువర్గమున్ ఘోరముగా వధించుటకుఁ గోల్కొనకున్నది బుద్ధి మీరు నిర్ధారణసేయుఁడా హితము ధర్మము నయ్యేడు వృత్తమెట్టిదో"[2]

---

1. భా. ఉద్యో. 4-85...87.
2. భా. ఉద్యో. 4-90.

అని తమ్ములనుజూచి యనినాడు. ఇది, యుద్ధమునుండి తన ప్రవృత్తి నుప సంహరించుకొనుచు ధర్మరాజు, తమ్ములనందు ప్రధానముగా జేసి ప్రవేశపెట్టుటను నిరూపించుచున్నది. ప్రధానముగా యుద్ధముచేయు అర్జునుడు మొదలైన వారి యుత్సాహము వ్యక్తమగు నవకాశము కల్పింపబడుటయు, శాంతరస నాయకుడైన ధర్మజుడు యుద్ధమునుండి దూరము చేయబడుటయు, అను రెండు ప్రయోజనము లిచట సాధింపబడినవి. ధర్మరాజట్లనగా నర్జునుడింకను నాలోచన లేల ? యుద్ధమే కర్తవ్యమనినాడు ధర్మజు డంగీకరించినాడు. ఇచటినుండి సమరోత్సాహము ధర్మజునియందు కేంద్రీకరింపబడకుండునట్లు భారతకర్త జాగ్రత్త తీసికొనినాడు ఇట్లు తరువాత చేయవలసియున్నందుననే భారతకర్త సంజయుడు వచ్చిపోయిన తరువాత మొదటిసారిగా ధర్మజుని యుత్సాహమునకు విచ్ఛిత్తిని గూర్చినాడు

ధృష్టద్యుమ్నుని సేనానాయకుడుగా చేసికొని పాండవులు కౌరవులతోడి యుద్ధమునకు బయలుదేరి పోయినారు. ఇది పాండవపక్షమున జరిగిన సమరోద్యోగము స్వరూపము.

భారతయుద్ధమున రెండవపక్షము ధార్తరాష్ట్రులది అందొక్క దుర్యోధనునకు తప్ప మిగిలిన వారికెవ్వరికిగాని యుద్ధమునందు నిశ్చయబుద్ధి లేదు. దుర్యోధనుడనగా కర్ణశకుని దుశ్శాసనాదులని యర్థము. మిగిలిన వారనగా భీష్మ ద్రోణ విదుర సంజయాదులు. సంజయు డుపప్లావ్యమునుండి తిరిగి వచ్చిన తరువాత, పాండవులకు వారి రాజ్యభాగము వారి కిచ్చుట శ్రేయమని, అందరును దుర్యోధనునకు కొంత గట్టిగనే చెప్పినారు దుర్యోధనుడు వినలేదు. విదుర సంజయాదులవలని ఒత్తిడినిబడి ధృతరాష్ట్రుడుగూడ చెప్పినాడు. లాభము లేకపోయినది. పాండవులకు రాజ్యమున భాగము వెట్టకుండ యుద్ధము కాకుండుట ధృతరాష్ట్రున కిష్టము. ఆయన చాల విచిత్రమైన బుద్ధిలక్షణము గల మానిసి. ఎంతవిచిత్రమైన వాడనగా "మందబుద్ధియు లోభోపహతుండును నయి దురభిలాషంబున దుర్యోధనుండింత" చేసి చెడిపోవుచున్నాడని తెలిసియు "నేను దైవాధీనత కతంబున బిడ్డల నొత్తి చెప్పను నియమింపనుంజాల"[1] నని

1. భా. ఉద్యో. 2-198.

చెప్పుచును, పాండవులను తన "కొడుకులు జయింపనోపుదురోకో యను నాస"[1] అంతరాంతరములయందు కలిగి ప్రవర్తించునంత విచిత్రమైనవాడు.

దుర్యోధనుడు పాండవుల సన్నాహమెరిగి తన బంధుమిత్రగణమైన రాజలోకమును తనకు యుద్ధమున సహాయపడరా బిలువనంపినాడు శ్రీకృష్ణుని యొద్దకు దూతను బంపుట కంటెను తనపోవుటయే మంచిదనిపోయి సహాయ మర్థించికొని వచ్చినాడు సమయమున కపుడచటకు నర్జునుడును వచ్చినాడు అందువలన శ్రీకృష్ణుడు తన చేయు సహాయము విభజింపవలసివచ్చినది దుర్యోధనుడు నారాయణ గోపాల సైన్యము నర్జునుడు కోరుకొనునేమో అని భయ పడినాడు. అర్జునుడు శ్రీకృష్ణు నొక్కనినే సహాయముగా కోరుకొనుటతో "దాని కాత్మఁ బొంగి ధార్తరాష్ట్రుఁడు పాండవుల నపహరించి కొనినయటకాగ దలచి"[2] కొనినాడు పాండవులను తాను జయింపగలడనియే వానికి నమ్మకము పాండవపక్షమునకు సహాయముగాబోవు శల్యుని మార్గమధ్యమున తన కనుకూలపడి వచ్చునట్లుగా దుర్యోధనుడు చేసిన ప్రయత్నము వాని పరమమైన పూనికలక్షణమునకు నిదర్శనము.

ఏవంవిధమైన యుద్ధోత్సాహముగల దుర్యోధనుడు, భీష్మాదుల మాటలు విని, తండ్రి మధ్య మధ్య ప్రకటించు భయమును జూచి – పాండవులకు రాజ్యమిచ్చుట కవకాశములేదు ; పైపెచ్చు భీష్మాదులను తిరస్కరించి, కర్ణ దుశ్శాసనుల బలముతో తాను పాండవులను జయింపవలెనని ప్రకటించుట వాని స్వభావమునకు తగియున్నది. వినినను వినకపోయినను దుర్యోధనున కందరును తమకు దోచినట్లు చెప్పి చూచినారు గాని వ్యాసుడు మాత్ర మొక్కమాటయు దుర్యోధనునకు చెప్పలేదు బుద్ధిసెప్పిన వినియెడు ప్రౌడగాడు"[3] అని వ్యాసునకు తెలియును వ్యాసునంతవానికి వీడు చెప్పిన మాట విన డనిపించిన దుర్యోధను డింక నెవరిమాట వినును ? అందువలన నెవరేమి చెప్పినను వాని బుద్ధి పాండవులతోడి యుద్ధమునుండి చలింపలేదు.

---

1. భా. ఉద్యో. 2-256.
2. భా. ఉద్యో. 1-77.
3. భా స్త్రీ. 1-79.

శ్రీకృష్ణుడు వచ్చినపుడు కొందరు జమదగ్ని, కణ్వుడు మొదలైన మహర్షులు కల్పించుకొని దుర్యోధనునకు బుద్ధిసెప్పగా వారితో నిట్లనినాడు –

"మునులార నన్నువిధి యే
మని మును పుట్టించె నట్టులయ్యెడుఁ గాకే
వినఁ జవిగాని పలుకులకుఁ
బనిగలదే యుడుగు డింక బహుభాషణముల్".[1]

శ్రీకృష్ణుడు చెప్పినాడు. అంతటివానితో దుర్యోధను డిట్లనినాడు –

ఏమును వారుఁ బంచికొని యేలుట గల్గదు పల్కకుండు మిం
కేమియు వాడిసూది మొనయించుక మోపినయంత మాత్రయున్
భూమియొనర్చి పాండునృపపుత్రుల కిత్తునె? యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబుగొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్[2].

ఇది దుర్యోధనుని యొక్క అచంచలమైన బుద్ధిలక్షణమున కవధిభూతము. ఇక వానితో నెవరు మాటాడి యేమి ప్రయోజనము ?

పాండవుల విషయమున దుర్యోధనుని వైర మాదిపర్వముననే స్థిరపడి పోయినది

ఉపాంశువధఁ జేసి మధ్యము మదోద్ధతుం జంపి ని
స్స పత్నముగ ధర్మనందను నశక్తు బంధించి యే
న పాండవముగా సముద్రవలయాఖిలక్షోణి మ
త్కృపాణపటుశక్తి నత్యధికకీర్తినై యేలెదన్[3].

"అని యిట్లు పాపబుద్ధియందుఁ గృతనిశ్చయుండై" నాడని దుర్యోధనుని విషయమచటనే పరిష్కరింపబడినది అట్టి నిశ్చయము దుర్యోధనునకు గలిగినది కూడ కలుగకూడని వయస్సున. అనగా తన వయస్సునుమించి యూహించి నిశ్చయించుకొనినాడు. అందుకు తగిన యత్నములు నాటినుండి పుష్కలముగా చేసినాడు. అందువలన దుర్యోధనుని పాండవులయందలి వైరభావమంతగా పునాదులచేత

1. భా. ఉద్యో. 3-326.
2. భా. ఉద్యో. 3-363.
3. భా. ఆది 5-168.

పటువైనది. అప్పుడు కొన్నిపనులు రహస్యముగా జేయవలసివచ్చినవి కొన్ని తండ్రికి జెప్పి చేయవలసివచ్చినవి ఇపుడు దుర్యోధనుడు మరియు పెద్దవాడై స్థిరపడి పోయినాడు. పదుమూడు సంవత్సరములు మహారాజువలె రాజ్యమును బాలించినాడు రాజ్యము తనదే యనిపించుకొనినాడు. పాండవులకు రాజ్యమున భాగము తనను కాదని యెవ్వరును ఈయలేని స్థితికి తాను చేరుకొనినాడు మొదటినుండియు తనకు పాండవులతోనున్న విరోధమది యట్లే యున్నది. మరియు పెరిగినది కనుక యుద్ధమునకే సిద్ధమైనాడు దుర్యోధనుడు

పాండవులవలె క్రొత్తగా పగదీర్చుకొను పూనిక కౌరవపక్షమున నేడు లేదు. అందువలన విశేషములేదు. పగదీర్చుకొనుట కిపుడు పూనిక చేయుచున్నది పాండవులు గనుక విశేషమంతయు వారి పక్షముననే కలదు యుద్ధమునకు ధర్మరాజు సిద్ధమగుటలో విశేషమున్నది కాని దుర్యోధను డగుటలోలేదు పాండవులు యుద్ధభూమికి వచ్చినారని తెలిసినది. దుర్యోధనాదులు ద్రోణాది మహావీరులను బిలిపించి వారిని యక్షోహిణీనాయకులుగా చేసినాడు. వారిని తీసికొని భీష్మునివద్దకు బోయి సర్వసేనాధిపత్యము వహింపవలసినదిగా ప్రార్థించినాడు. భీష్ము డంగీకరించినాడు కౌరవపక్షమును యుద్ధభూమికి చేరుకొనినది.

# చతుర్థోన్మేషము

## 1. అర్జున విషాదము

పాండవ ధార్తరాష్ట్రులు తమ తమ కటకములతో కురుక్షేత్రమున నెదు రెదురుగా నిలిచిరి ఇక యుద్ధము మొదలగుటయే ఆలస్యము ఉభయ సైన్యముల నడిమినేల నిలిచి రథము మీదనుండి కౌరవులను పార్థుడు పారజూచినాడు. మరియు తమవారిని జూచినాడు. ఉభయపక్షములను బంధువులును శిష్టులును నుండుట కనిపించినది. అర్జునునకు పరమకృపావేశమెత్తినది. అత్యంతము విషాదము కలిగినది. పరపక్షమునందలి బంధువులను చంపుచు, స్వపక్షమునందలి బంధువులు చంపబడుచుండుటను జూచుచు, యుద్ధమున ప్రవర్తించుటకు నర్జునుని మనస్సంగీకరించినది కాదు. వాని శరీరము కంపించినది. గాండీవము చేతినుండి జారిపోయినది. ఇందరను చంపి పొందెడు నా రాజ్యసుఖము లేకపోయిన నే మనిపించినది. వానికి మరియు నిందరను జంపి కులధర్మము లడచి నరక కూపముల బడనేల యనిపించినది. శోకసంవిగ్నమానసుడును, విషాద్గవిహ్వాలుడును, పరమకరుణాభరితుడును నైనాడు పాండవమధ్యముడు. తన యా స్థితి శ్రీకృష్ణుని యెదుట ప్రదర్శించినాడు. అది చూచి యర్జునునితో శ్రీకృష్ణ డిట్లనినాడు

> దెప్పరపుఁజోట నీకీ
> యొప్పని విధమెచటనుండి యొదవెను ? వినుమీ
> చొప్ప వివేకుల యది యిది
> దప్పించును సద్గతియు, నుదాత్తయశంబున్.[1]

అర్జునున కప్పుడు కలిగిన యా స్థితి యొప్పనిది. ఆ స్థలము దెప్పరమైన దగుట చేత నా స్థితి కూడనిది. దెప్పరమనగా నాపత్కరము, మరియు విషమము. కౌరవపాండవుల మధ్యగల లావాదేవీలు యుద్ధభూమికి వచ్చి పరిష్కరించుకొన

---

1. భా. భీష్మ. 1-190.

వలసినంత విషమించినవి అందుకని యుద్ధభూమికి వచ్చిరి. కనుక నది విషమపు చోటు. ప్రాణాంతకమగుచోటు అంతగా నాపత్కరమైన స్థలమిది అట్టిచోట తదనుకూలముగాని కేవల మనుచితమును ప్రదర్శించినా డర్జునుడు. అది తగని దని చెప్పి శ్రీకృష్ణుడు ఎచటనుండి యొదవెను అని ప్రశ్నించుచున్నాడు. అది యొక విధముగా ప్రశ్నకాదు ఇంతవరకు బాగుగనే యుంటివే - యుద్ధమున కుత్సాహము చేసినావు కదా - కౌరవసైన్యమును భీష్ముని సేనా నాయకత్వమున జూచి ధర్మరాజు కొంచెము జంకినట్లు మాటాడగా నింతకు ముందుగనే వానిని ప్రోత్సహించుచు నీవు మాటాడితివికదా - ఇంతలో నింత మార్పేల నీలో కలిగినది - ఇది మంచి కాదు - మానుకొనుము - అని ఈ మొదలైన అనునయమును గర్భమునం దిముడ్చుకొనిన వాక్యమది మరియు శ్రీకృష్ణుడనినాడు. ఈ చొప్ప వివేకులయది. అర్జునుడు పొందిన యా స్థితి యవివెకియైనవాడు పొందవలసినది. అర్జును డవివేకి యైనాడు. అవివేకమనగా ఉచితానుచితము తెలియని, కార్యాకార్యజ్ఞానము లేనితనమని సామాన్యార్థము ఇది యొప్పని విధమనుటలో గతార్థమగుచునే యున్నది. మరొకవిశేషార్థము నుద్దేశించి ఆ శబ్దము ప్రయోగింపబడినట్లు కనుపించుచున్నది ప్రకృతి పురుషయోః విభాగేన జ్ఞానం వివేకం - ప్రకృతినుండి పురుషుని వేరుగా నెరుగుట యేదికలదో అది వివేకము. ప్రకృతి మాయ పురుషు డాత్మ. మాయాతీతముగా నాత్మపదార్థము నెరుగుట వివేకము. ఆత్మజ్ఞానములేక మాయాపిహితుడై జీవుడు వానికి యుద్ధరంగమున నందరును బంధువులుగా కనిపించుచున్నారు. వారిని చంపవలసివచ్చినదని దుఃఖించుచున్నాడు. తాను చంపుట కుద్యమించుచున్నానను బుద్ధితో వెనుకాడుచున్నాడు. అహంకార మమకారములమధ్యపడి యర్జునజీవుడు కొట్టుమిట్టాడుచున్నాడు. అది యవివేకి లక్షణము. అట్టి యర్జునునకు శ్రీకృష్ణుడు, ఆత్మనకు బాధ్యబాధకత్వములు లేకునుకిని పరమజ్ఞానమునకు కారణములగు వాక్యములచేత బోధించి - తాను చంపుట లేదు, బంధువులు చచ్చుటలేదు; అసలు చంపుట, చంపబడుటయే సృష్టిలో లేదు; ఇది యంతయు నజ్ఞానము - అను నీ మొదలైన నిశ్చయమును వానికి కలిగించి, తిరిగి యుద్ధమునందు ప్రవేశపెట్టబోవుచున్నాడు. ఆ బోధవలన నర్జునునకు వివేకముకలిగినది. వివేకి కాబోవుచున్న యర్జునుని యందు ముందుగా నవివేకత్వము చెప్పబడి తరువాతి వాని స్థితిని సూచించుచున్నది. వివేకి కాబోవు

చున్నాడనగా నప్పటివర కాతడు వివేకి కాదా యేమియని శంకింపగల అవ కాశమున్నది. అట్లనుటలో నర్థమదికాదు. అర్జునుడు మొదటినుండియు వివేకియే కావచ్చును. తత్కాలమున నవివేక మావరించినది శ్రీకృష్ణుని బోధవలన నదిపోయి తిరిగి వివేకియగుచున్నా డర్జునుడు. శ్రీకృష్ణుని యుపదేశానంతరము వివేకి యగుట తత్పూర్వము వివేకియై యున్నదానికంటె శ్రేష్ఠమైన స్థితి. వివేకి కాబోవుచున్నాడనగా నట్టిస్థితిని చేరబోవుచున్నాడని యర్థము అందు కనియే తిక్కన్నగారు శ్రీకృష్ణుడు తన బోధవలన నర్జునుని "వివేకంబునకుం జేవ గలిగించి'' నాడని చివరకు వ్రాసిరి. అనగా వాని తత్పూర్వపు వివేకితకు శ్రైష్ఠ్యము కూర్చినాడని యర్థము అర్జునుని చిత్తము వివేకమున స్థిరపడుట కొరకుగాన వివేకము నిందింపబడినది సద్గతి తప్పుట – యశోనాశనమగుట – ఈ రెండును నవివేకము వలని ఫలితములు ఆ రెండును దూరము చేసికొనవలసి నవి అట్టి రెండును దేనివలన సంప్రాప్తములగుచున్నవో, ఆ యవివేకమును త్యజింపవలయు వివేకమును గ్రహించినచో నవివేకము దానంతట నదియే రూపము లేనిదై పోవును అందుకొరకది యట్లు నిందింపబడినది. శ్రీకృష్ణుడు కిరీటియందలి యవివేకమును నిందించి దానిని త్రోసిపుచ్చుటకు ప్రవర్తింపజేసిన వివేకమే శ్రీమద్భగవద్గీత అది బ్రహ్మవిద్య

యుద్ధరంగమునకు, సిద్ధమైవచ్చిన యర్జునున కా విషాదము కలుగుట యేమి ? శ్రీకృష్ణుడా బ్రహ్మవిద్య నుపదేశించుటయేమి ? ప్రధానరసమైన శాంతమునకు ననుకూలమైన పరమజ్ఞానవిషయమును యుద్ధమునకు ముందు ప్రవేశపెట్టి, యుద్ధరసములకు వ్యవధానము కల్పించి అంగరసముల యంగత్వ మును నిష్కర్షించుట నాశించి, భారతకర్త తత్సన్నివేశమును కల్పించెను యుద్ధమున కుత్సాహము చేసివచ్చిన కౌరవపాండవు లట్లే యుద్ధము చేసికొను టను వర్ణించినచో యుద్ధరసము లనివార్యముగా ప్రతీయమానమగును. అయి నచో ప్రధానరసమునకు దెబ్బతగిలినట్లే అది కూడదు. అందుకని సంగ్రామి కోత్సాహమునకు, సమరమునకును, సమరాంగణమున వ్యవధానము కల్పింపబడి నది అట్లు యుద్ధరసముల ప్రతీతి నరికట్టుట తోపాటు భారతకర్త ప్రధానరస మైన శాంతము నుజ్జ్వలముగా ప్రవేశపెట్టెను. వ్యవధానము కథలో దానికదిగా పుట్టినట్లుండవలయును. కనుక యుద్ధమున ప్రధానపురుషుడైన యర్జునునకు, కౌరవపక్షమున బంధువులున్నారను మమకారము పైకొనివచ్చినట్లు చూపింప

బడినది సహజసుందరముగా కనిపించు కల్పన యది. దానిమీద అర్జునునియందు శోకము నిరూపింపబడినది అదియు సహజమన్నట్లుగా కనిపించునదియే. వీరమున కనుకూలమైన శోకముతోడి యనుత్సాహము, యుద్ధసంబంధి ప్రధానపురుషుని యందు కనిపించుటతో యుద్ధరస ప్రతీతి విచ్ఛిన్నమై పోయినది కాని యుద్ధము జరుగవలయును వాని యందుత్సాహము పునఃకల్పింపబడవలయును. ఆ ప్రయత్నములో శాంతరసానుకూలమైన సామగ్రి ప్రవేశపెట్టబడినది కేవలముగా శాంతము కేవలజ్ఞానరూపము. అది నిష్క్రియము. అర్జునుడు క్రియాభిముఖుడు కావలయును కేవలజ్ఞానమువలన కాదు. కానిచో యుద్ధములేదు యుద్ధము కావలయును కనుక జ్ఞానముతో పాటు కర్మ చెప్పబడినది. ఫలాభిసంధిరహితమైన కర్మయే కర్మయనియు, అది జ్ఞానమునకంటె భిన్నము కాదనియు, లోకసంగ్రహము కొరకట్టి కర్మ ఆచరింపబడనేవలయుననియు సమన్వయము చేసి శాంతానుకూలమైన సామగ్రి ప్రవేశపెట్టబడినది. దానివలన నర్జును డుత్సాహియైనాడు. కాని యది యుద్ధరంగమునకు రాకపూర్వమున్న, కౌరవులను నాశనముచేయవలయునన్న, ద్వేషముతోడి యుత్సాహముకాదు నేను నిమిత్తమాత్రుడను. అంతయు కర్మపరిపాకమును బట్టి జరిగిపోవును. లోక సంగ్రహము కొరకు నిమిత్తమాత్రముగా నిలుచుట ధర్మము. ధర్మము గనుక నిలువవలయును – అను ఈ విధమైన ఉత్సాహమది. దానివలన యుద్ధమునకు యుద్ధమును జరిగినది. అది వీరలక్షణము కలది కాకుండను బోయినది. భారతకర్తకు కావలసినదియే యది ప్రధానరసమును దృష్టియందుంచుకొని, ఉల్బణము నరికట్టుచు నంగరసములను సంయోజనపరుచు ప్రయత్నము భారతమున పుష్కలముగా నున్నది. అందీ యర్జునవిషాద ఘట్ట కల్పన మొకటి

శాస్త్రేతిహాసమున నెంత శాస్త్ర మెచట ప్రవర్తించినను ఇబ్బందిలేదు కాని, కావ్యేతిహాసమున కథాగతి నాపి శాస్త్రము మిక్కిలిగా ప్రవర్తింపరాదు. ఇచట కథకు ప్రాధాన్యము. కథయెంతవర కాగుట కథకు ప్రయోజనమో, ఆ యాగిన మేరలోనే శాస్త్రము, కథ కుపస్కారకముగా ప్రవర్తించును ఇచట శాస్త్రముపసంహరింపబడును. అచట శాస్త్రముకొరకు కథ ఆపబడును. ఒకచోట శాస్త్రముకొరకు కథ. మరొకచోట కథకొరకు శాస్త్రము ఇది శాస్త్రేతిహాస కావ్యేతిహాస వైలక్షణ్యము.

ఆంధ్రమహాభారతము కావ్యేతిహాసమగుటవలన కథ నటు నిలబెట్టి పదు నెనిమిది యధ్యాయముల భగవద్గీత ప్రవర్తించదు అర్జునవిషాదరూపమున యుద్ధకథ ప్రధానరసము దృష్ట్యా ఛిన్నము చేయబడినది. ప్రయోజనము దానితో సాధింపబడినది. తిరిగి కథానుసంధానము జరుగుట కెంత శాస్త్రమవ సరమో అంతవరకే కావ్యేతిహాసకర్త గ్రహించును కథ ఆగి అందిపుచ్చుకొన్న ట్లుండవలయును. ఆ యందిపుచ్చుకొనుటలో శాస్త్రము సహాయపడినట్లుండ వలయును అట్లుండగలందులకై తిక్కన్నగారు భగవద్గీతాపరమార్థము, అవ సరమున్నంత మేరలో, కథాగతి కనుకూలపడుచున్నట్లు నిరూపించిరి. యుద్ధము చేయజాలనన్న అర్జునునితో కథ ఆగినది తిరిగి యుద్ధగున కభిముఖుడగుటతో కథాగతి ప్రారంభమగుచున్నది అర్జునుడు యుద్ధాభిముఖుడగుట శాస్త్రోపదే శము వలన. కథ, శాస్త్రము రెండును కలిసి సాగవలయును. అర్జునుని బుద్ధి యుద్ధము చేయుటయందు కుదురుకొనుటతో నాగిన కథ అందిపుచ్చుకొన్నట్ల గును. ఇక శాస్త్రముతో నిమిత్తములేదు. ఆగిన కథ అందుకొనుటకు సాగుట శాస్త్రముతో కలిసి సాగును. ఈ విషయమును తిక్కన్నగారొక రెండు శబ్దము లను ప్రయోగించి నిరూపించి వదలిరి

అర్జునుని విషాదవిహ్వలత చెప్పబడిన మొదటి యెనిమిది పద్యముల తరువాత కృష్ణార్జున సంవాదరూపమున నలుబదిపద్యము లున్నవి. శాస్త్ర మందు ప్రవర్తించినది. దానివలన నర్జునుడు యుద్ధముచేయుట కెక్కిరావల యును అందుమొదటి పంద్రెండు గద్యపద్యముల యనంతరము, అర్జును నుద్దే శించి విజయుడనియు, ఆ తరువాతి పదుమూడు గద్యపద్యముల యనంతరము గాండీవి యనియు తిక్కన్నగారు ప్రయోగించిరి. భీష్మపర్వమున గీతార్థోప దేశము ప్రవర్తించిన ఆ మేరలో నా రెండు శబ్దములును విపులార్థవంత ములుగా కనిపించుచున్నవి. స్వకర్మావలంబనము వదలదగమి తెలియుటకు వలయు వాక్యములు శ్రీకృష్ణుడు పెక్కు లుపన్యసింపగా తిరిగి వికల్పించి యడుగు నర్జునుడు విజయుడనబడినాడు. "ఎట్టివారికైన నెదిరిన బోర జయంబు గొనుట విజయుడ"[1]ను పేరు కలిగినది. యుద్ధమున కెదురై ఎవరు వచ్చినను వారి నోడించి విజయముగొనుట, అది యొక వ్రతముగా పాలించు

1. భా. విరా. 4-141.

చున్నందున విజయు డనబడినాడు. కౌరవులు యుద్ధమున కెదురై వచ్చిరి. వారితో యుద్ధముచేసి విజయము గొనుటకు మనస్సంగీకరింపక వెనుకాడినాడు. విజయాభిధానము దెబ్బతిన్నది. దానితోపాటు శోకాకులుడై వడవడ వడంకి గాండివమును జారవిడిచినాడు శ్రీకృష్ణుని యుపదేశము మొదలైన కొంత సేపటికి విషాద ముపశమించినవాడై మధ్య మధ్య వికల్పించి యడుగుచు యుద్ధమునయందు బుద్ధి ప్రసరించినవాడైనాడు. ఎట్టివారినైన నెదిరినవారి విషయమున వెనుకాడుట కూడదను బుద్ధిలక్షణము కలవాడైనాడు కౌరవ పక్షమున నందరును బంధువులే, శిష్టులే అను మమకారాదులు లేనివాడైనాడు. అట్టి యర్జునుడు విజయుడని తిక్కన్నగారిచేత చెప్పబడెను. యుద్ధముచేయుట కంగీకరింపని యర్జునుడు శాస్త్రోపదేశమువలన యుద్ధమున బుద్ధి ప్రసరించిన వాడైనాడు శాస్త్రోపదేశము ననుసరించి జరిగిన కథాగతి యది. తరువాత మరియు నుపదేశించి శ్రీకృష్ణుడు విశ్వరూపమును చూపించి నిమిత్తమాత్రమ్ముగ మ్ముమ్ము లెమ్ము రాజ్యమ్ము గైకొనుమని ప్రోత్సహింపగా గాండీవియైనా డర్జునుడు. ఆ విశ్వరూపమును జూచినందున కలిగిన సంభ్రమముతోనున్న యర్జునుడు గాండీవి యని చెప్పబడినాడు ఆ విశ్వరూపమును సందర్శించుటతో యుద్ధమున కృత నిశ్చయ బుద్ధియై జారిపోయిన గాండీవమును చేతికి తీసికొనినాడన్నమాట. గాండీవము కలవాడగుట నర్జునుడు గాండీవి యనబడుచున్నాడు.

అమరాహీంద్ర వియచ్చరాదుల కజేయం బప్రధృష్యం బభే
ద్యము, వజ్రస్థిర మన్యసాధనభిదాదక్షంబునై సర్వలో
కమనోజ్ఞంబయి దివ్యమై వెలుగు నగ్గాండీవమన్ చాపర
త్నము నిచ్చెన్ వరుణుండు పార్థునకు నుద్యద్వీర్యమోద్భాసిక్రన్.[1]

నన్నయ్యగారు చెప్పిన ఈ గాండీవలక్షణముల ననుసంధించుకొని, శ్రీకృష్ణుని ఉపదేశమువలన విజయభావాత్మకుడై, మరియు పరమేశ్వరుని విశ్వరూపమును జూచి విచ్ఛిన్న సర్వసంశయుడైన అర్జునుని గాండీవితనము నుపలక్షించినచో, యుద్ధమున కృతనిశ్చయుడైన యర్జునుడు, అమరాహీంద్రాదుల కజేయుడు వలె, అప్రధృష్యుడువలె నున్నాడు. మరియు నభేద్యుడువలె, వజ్రస్థిరుడువలె నున్నాడు. మరి యే యితర సాధనముచేతను సాధ్యుడు కానివాడువలెనున్నాడు-

1. భా. ఆది. 8-253.

అర్జునుడు గాండీవి యగుటతో ఆగినకథ అందుకొనినది. కథ అందుకొను వరకే శాస్త్రము కనుకనే తిక్కన్నగారా తరువాత శాస్త్రోపదేశమును శ్రీకృష్ణుని విశ్వరూపముతోపా టుపసంహరించిరి మరియు తత్ప్రకరణమున నన్న ధనంజయాది శబ్దముల యర్థము పైన చూపింపబడిన రెండు శబ్దముల యర్థములో లీనమగుటవలన ప్రత్యేకము చెప్పనక్కరలేదు. తిక్కన్నగారు కావ్యేతిహాసమున శాస్త్రము నెట్లు కథాగతికొరకు కుపయోగించిరో చూపుట కా వివరణము చేయబడినది ప్రకరణ వ్యతిరిక్తము కాకుండ, కథార్థమున కుత్కార్షాపాదకమై, చెప్పబడిన యర్థమునకు మూలభూతములైన శబ్దములు కవిచేత తెలిసి ప్రయోగింపబడినవనియే యనుకొనుట లెస్స — ఇది యర్జున విషాదము విషయము ఇక యుద్ధము.

## 2. సమరము

భీష్మ ద్రోణ కర్ణ శల్య సౌప్తిక పర్వములు ప్రధానముగా యుద్ధపర్వములు. యుద్ధవర్ణనమనగనే వీరానుప్రాణితములైన రౌద్రము — బీభత్సము — భయానకము మొదలైన రసనిష్యందిభావములు బాహుళ్యముమీద అనివార్యముగా పోషింపబడవలయును. ప్రధానరసము వీరమైనచో నట్లు చేయవచ్చును కాని భారతమున వీరమున కా స్థితిలేదు. ఒక్క వీరమునకేకాదు. మరి యేరసము నకును నా స్థితిలేదు. కనుక యుద్ధపర్వములయందున్న వీరాదులుగాని, మిగిలినచోట్ల గల శృంగారాదులుగాని, ప్రధానరసమైన శాంతము వీగిపోనట్లుగా, అంగప్రాయములుగనే నిరూపింపబడవలయును భారతమున వీరమునకును, మిగిలిన రసములకును చాల భేరమున్నది. అయిదు పర్వముల యుద్ధ వర్ణన మున్నందున వీరాదులు సులభముగా రసములై ప్రతీయమానములు కాగలవు. అయినచో ప్రధానరసము దెబ్బతినును. భీష్మద్రోణ కర్ణార్జునాది పదిపదునైదుమంది కురుపాండవవీరుల నాలంబనోద్దీపనములుగా, పదునెనిమిది దినములపాటు జరిగిన, ఒక యుగాంతమహాయుద్ధమును, యుద్ధరసములు రసములుగా మూర్తిగట్టుకొనకుండ — అట్లని సూర్తియేలేకుండ చేయబడక — మొత్తముమీద శాంతమున కంగభూతముగా సర్వమును నిర్వహించి చూపుట సామాన్యమైన విషయముకాదు. తిక్కన్నగారు భారతయుద్ధము నంతయును నట్లు నిర్వహించి చూపిరి. అది ఆయన కావ్యరసమును కొనియాడు కవిత్వ

త త్త్వనిరతిశయానుభావానందభరితాంతఃకరణము యొక్క నిత్యజాగరితమైనలక్షణమున కుపలక్షణము.

తరుణుల కుచములపై రతి
పరవశులై యొఱగు పతుల పగిది సమరసం
భరితశ్రమమున నిద్రిం
చిరి కరికుంభములఁ జెంది చెన్నుగ జోదుల్.[1]

అర్జునుడు సైంధవుని వధించిననాటి రాత్రికూడ యుద్ధము కొనసాగింపబడినది. చంద్రోదయమగువరకు నర్జునుని హెచ్చరికను పురస్కరించుకొని కొంతసేపు ఉభయసైన్యములును యుద్ధమునుండి విరమించుకొని విశ్రమించినవి. ఆ సందర్భమున తిక్కన్నగారా పద్యమును వ్రాసిరి. అది కేవలము కౌరవ సైన్యము విషయము చెప్పు పద్యము యుద్ధము చేసిచేసియున్న శ్రమమువలన కౌరవసైన్యము కరికుంభము లూతగా వ్రాలి సొమ్మగొని నిద్రించినది. ఆ దృశ్య మెట్లున్నదనగా రతిచేయుటవలని పారవశ్యమున పురుషులు ఆ తమ తరుణుల కుచములపై నట్లే యొరిగి కన్నులు మూసికొన్నట్లున్నది – ఉపమానోపమేయములలో నెప్పుడును నుపమేయమే ప్రధానము ఉపమేయము ఉపమానము చేత దీప్తిమంతము కావలయును కౌరవసైన్య మిచట ఉపమేయము ఆ సైన్యము కరికుంభములమీద నొరిగి నిద్రించిన దనుటచేత రెండు విషయములు చెప్పబడినవి. ఖండితములైన యేనుగుల యొక్క కుంభస్థలము లా రణరంగమున నంత విరివిగా పడియున్న వనునది యొకటి. బ్రతికియున్న యేనుగుల మీదనున్న వీరు లట్లె యొరిగి నిద్రించినారనియు చెప్పవచ్చును కాని యపుడు కౌరవసేన అంతయు నేనుగులపైనుండియే యుద్ధము చేసినదా యేమన్న శంకకలుగును. దానిని త్రోసిపుచ్చుటకు ఖండింపబడి పడియున్న కుంభస్థలము లని చెప్పబడినది. సైన్యమంతయు నా కుంభస్థలములపై వ్రాలి నిద్రించిన దనుటచేత నలంకారముగా నతిశయోక్తి ప్రవర్తించి రణరంగము నొక బీభత్స దృశ్యముగా చూపుట యగుచున్నది. జుగుప్సావహమైన తత్సన్నివేశమున సైన్యము సుఖముగా నిద్రించిన దనుటచేత, దాని యుద్ధముచేసిన తీవ్రలక్షణము తెలియుచున్నది ఇది రెండవది రౌద్రభయానకమైన యుద్ధభూమిని, ప్రాణ

1. ఆం. ద్రోణ 5-273.

ములకు తెగించి పోరిన సైన్యముయొక్క తీవ్రోత్సాహమును చెప్పి, తత్త దనుకూల రసాదులను స్ఫురింపజేయుట కా పద్యము వ్రాయబడినది. ఇది యుపమేయము విషయము ఇంక ఉపమానమున్నది. అది, రసాదుల స్ఫురణ మునకు ననుకూలముగా వాచ్యమైన విషయము నలంకరించి, రసాదుల వ్యంగ్య దీప్తికి సహాయపడవలయును. అయినచో నా పద్యమునం దుపమాన మట్లు న్నదా ? తరుణులు - కుచములు - రతి - రతిపరవశులైన పతులు - ఈ మొదలైన శృంగార సామగ్రి ఉపమానముగా నున్నది వట్టి శృంగారము కాదు. సంభోగశృంగారము. ఇది యుద్ధరసములకు కేవలము విరోధి. అయ్యును యుద్ధరసభావముల కలంకారముగా వాడబడినది. విభావానుభావసామగ్రీ సమగ్రమైన సంభోగశృంగారము రసవదలంకారముగా ప్రవేశపెట్టబడినది. అర్థాలంకారమునకును రసవదలంకారమునకును భేదమున్నది ఉపమేయము యొక్క దీప్తికి అర్థాలంకార ముపయోగింపబడును ఉపమేయముయొక్క అతిశయము నరికట్టుటకు రసవదలంకారము ప్రయోగింపబడును. అనగా వర్ణ్య వస్తువు వర్ణింపబడవలసియుండి, దానినుండి వ్యంగ్యముగా స్ఫురించు రసాదుల యథాతథమైన స్థితి కవి కిష్టము కానిచో రసవదలంకారమును ప్రయో గించును. కవికిష్టము కాకపోవుటయనగా కావ్యమునందలి ప్రధానరసము దృష్ట్యా అన్నమాట. ఇచట నిట్లు వివరించుట యవసరము - ద్రోణుని నాలవ నాటి యుద్ధము చాల తీవ్రమైనది. అంతటి యుద్ధము ఆ పదునెనిమిది దిన ములలో మరి జరుగలేదు అర్జునుని ప్రాణము విషయమై ధర్మరాజానాడు భయపడినంతగా మరెప్పుడును భయపడలేదు. కౌరవసైన్య మానాడు సైంధ వుని అర్జునుడు చంపకుండ నెంత యత్నము చేయవలయునో అంత యత్నమును చేసినది అర్జును డతితీవ్రుడై సైంధవుని వధించి తీరవలయునని ప్రతిజ్ఞ పట్టిన వాడు కౌరవుల యత్నము నంతయు భగ్నముచేసి అర్జునుడు సైంధవుని చంపుటతో కౌరవసేనాపతి ద్రోణుడు మరియు తన పూనిక నెరవేరకపోవుటచేత క్రోధముతో విజృంభించినాడు. దానివలన రాత్రిపూట కూటయుద్ధము జరిగినది. అంతటి తీవ్రయుద్ధము చంద్రోదయమగువరకు కొంచెముసేపాగినది. అచట తిక్కన్నగారు సంభోగశృంగారము నలంకారముగా ప్రవేశపెట్టిరి విరోధిరసమునకు ప్రసక్తి కల్పించుటచేత, తత్ప్రకరణమున ప్రతీయమానము కావలసిన యుద్ధరసములు పలుచన చేయబడి, తదతిశయస్ఫూర్తి అరికట్టబడినది

మరియు సహృదయుల బుద్ధిని సులభముగా నాకర్షించు సంభోగశృంగారమును ప్రవేశపెట్టుటచేత, యుద్ధరసము లాస్వాద్యములగుట త్రోసిపుచ్చబడినది. యుద్ధ రసము లాస్వాద్యములు కాకుండ జాగ్రత్తపడుటయే, శాంతరస ప్రధానమైన భారతమువంటి మహేతిహాసమున కవిచేయగలిగినది. లోకాతిశాయి రచనా శిల్పముతో తిక్కన్నగా రాపని చేసిరి. రసవదలంకారముయొక్క వినియోగ రహస్యము నాశ్రయించి, దాని ప్రయోగముద్వారా యుద్ధముయొక్క తావన్మాత్రస్ఫురణమును కలిగించుచు, దానిని పెంచక, ప్రధానరసము వీగిపోకుండ చూచుకొనుచు యుద్ధపర్వములను రచించిరి. యుద్ధవర్ణనమున నాయన పోయిన శిల్పమార్గములలో నిదియొకటి. ఇందుకు మరొక ఉదా హరణము చూపబడును.

భీష్ముని యెనిమిదవనాటి యుద్ధమైపోయినది. యుద్ధభూమిని వర్ణింప వలయును. అపుడు తిక్కన్నగారొక గీతపద్యమును వ్రాసిరి. ఆ పద్య మిట్లున్నది.

ధరణి నెత్తుటఁదోఁగి యాభరణకాయ
శస్త్రఖండ జాలంబులఁ జాల నొప్పె -
పలుచకాకుండ కుంకుమమలఁది పెక్కు
తెఱఁగు తొడవులు దొడిగిన తెఱవపోలె[1].

ఇందు మొదటి రెండు పాదములును ఉపమేయమైన యుద్ధభూమియొక్క యథాతథమైన వర్ణనము. చివరరెండు పాదములును ఉపమానము మరియు శృంగారాత్మకము. యుద్ధభూమి రక్తముతో తడిసిపోయినది. మరియు ఖండింపబడిన సైనికులయొక్క ఆభరణములతోడి మొండెము లందంతటను పడియున్నవి వాచ్యమైన ఈ విషయము బీభత్సమును, భయానకమును వ్యంగ్యముగా స్ఫురింపజేయుచున్నది.ఆస్ఫూర్తి అల్లె కొనసాగకుండ నరికట్టుటకు శృంగారాత్మకమైన ఉపమానము వెంటనే ప్రవేశపెట్టబడినది ఈ యుపమానము వలన స్ఫురించిన రసభావ ముపశమింపజేయబడినది ఉపశమింపజేయుట నశింపజేయుటకాదు; అదుపులో పెట్టబడుట భావశాంతి అంతర్యమిల్లె కని పించుచున్నది. అనుభావములచేత పుష్టముచేయబడుటకు వీలుండి చేయబడ

1. భా. భీష్మ. 3–162.

రాని భావము ప్రధానముగా చెప్పబడవలసివచ్చినచో నీ శాంతిమార్గ మనుస రింపబడును. కేవలము భావము తావన్మాత్రముగా చర్వణమున కుద్దేశింపబడి నపు డదియే పద్ధతి భీష్ముని యెనిమిదవనాటి యుద్ధమున చాలమంది యోధులు మరణించినారు. భూమిర క్తసి క్తమైనది. భయావహాముగా నున్నది అనగా యుద్ధమంత తీవ్రముగా జరిగినది. ఈ మాత్రము భావము హృదయసంవాది యగుట చాలును. దానియందు మనస్సు లగ్నమై అట్లై రమించుట భారతమున కూడదు. మొదటినుండి ఆనాటి యుద్ధవర్ణనమును చదువుకొనుచు వచ్చుచున్న సహృదయపారకున కా గీతపద్యము మొదటి రెండు పాదములవలన, నాటి యుద్ధతీవ్రత బుద్ధికందియబడినది మనస్సందు స్థిరపడకుండ వెంటనే శృంగా రాత్మకమైన ఉపమానము చూపింపబడి, వానిచిత్తము దీనిమీద కాకర్షింప బడినది ఇక ఉపమేయము నెంతగా భావింపవలయునన్నను. ఉపమానము ద్వారా మాత్రమే భావించునట్లు చేయబడినది రక్తసిక్తమైన యుద్ధభూమి యని చిత్తమునందనుకొనగనె పలుచకాకుండ కుంకుమమలదుకొనిన స్త్రీచిత్తము నందవకాశము కల్పించుకొనుచున్నది దానినుండి చిత్తము యుద్ధభూమియందు కేంద్రీకరింపబడుటలేదు. కనుక తదనుయాయి రసభావము లాస్వాద్యము లెంతగింజుకొనిననుగావు. భారతకర్త యుద్దేశము నెరవేరినది రసస్థితికి పోనీయకుండ స్ఫూర్తిమాత్రపర్యవసితములుగా రసనిష్యంది భావములను నిర్వహించి చూపుటయనగా నట్లుండును

ద్రోణపర్వమునందలి పద్యమునకును దీనికినిగల భేదమేమి ? అచట ముందుపమానము ప్రయోగింపబడినది ఇచట ముందుపమేయము చెప్ప బడినది. మరియు నట ఉపమానము సంభోగశృంగారసామగ్రిసమగ్రము. ఇట కాదు. అచట కేవలము శృంగారరసమలంకారముగా చేయబడినది ఇచట శృంగారవిభావ మొకటి అలంకారముగా చేయబడినది. అచట అలంకారము వలన నుపమేయముయొక్క సాంద్రత తగ్గింపబడినది ఇచట ఉపమేయము నందు భావశాంతి చెప్పబడినది ఈ భేదకల్పనముసందున్న చమత్కార మిట్లూ హింపదగియున్నది. ద్రోణుని నాలవనాటి యుద్ధము భీష్ముని యెనిమిదవనాటి యుద్ధమునకంటె చాల తీవ్రమైనది. అందువలన నచట ముందుగా సహృదయుల బుద్ధిని, తరుణుల కుచములపై - ఈ మొదలైన ఉపమానముమీద కాకర్షించుట జరుగుచున్నది. అనగా సహృదయుల చిత్తమును యుద్ధరసభావములనుండి

పూ_ర్తిగా తొలగించి. తద్విరోధిరసమున ప్రవేశపెట్టి, అపుడు తద్రసభావములను చి_త్తమునకందిచ్చుట యగుచున్నది. శృంగారాత్మకమైన అలంకారదర్పణముద్వారా సహృదయుడు యుద్ధరసభావములను దర్శింపవలసినస్థితి యేర్పడినది. అవి స్ఫురించుచున్నవి. లెస్సగా చర్వణమునకు వచ్చుటలేదు. అదియే తిక్కన్నగారికి యుద్ధపర్వములను చదువు సహృదయపాఠకునియందు కావలసినస్థితి. భీష్మపర్వమునందలి యుద్ధమంత తీవ్రమైనది కనుక ముందుగా నుపమేయమే సహృదయుని చి_త్తమున కందీయబడినది. కాని చి_త్తమందు లగ్నము కాకుండ తొలగింపబడినది. ఆచట యుద్ధము బలవంతముగనుక ముందు సహృదయుల చి_త్తమందు ప్రవేశింపకుండ జాగ్ర_త్తపడి యుపమానమును తిక్కన్నగారు చూపించిరి ఇచట అంతబలవంతముకాదు గనుక ప్రవేశించిన చి_త్తము సులభముగా తొలగింపబడగలదు. అందువలననే తిక్కన్నగా రుపమానమును తరువాత ప్రయోగించుట. యుద్ధరసములు కేవలము స్ఫురించుటను మించి మరేమియు కాకుండ, శాంతమునకు భంగములేకుండ యుద్ధపర్వములను రచించుటలో తిక్కన్నగారవలంబించిన మార్గములలో నీ విరోధిరసములను, అలంకారములను సంయోజనపరచుట యొక పద్ధతి.

తిక్కన్నగారవలంబించిన మరొకటి ప్రధానకథానుస్యూతిరక్షణము. కథాబీజము ఆద్యంతములుగా వ్యాపించియుండుటను జూచుకొనుటయే కథానుస్యూతిని రక్షించుటయగును. ఇచట, ఈ భారతయుద్ధమున కేది మూలభూతమో అది, మరియు దాని నాశ్రయించుకొనిన చిలవలు పలపలు, మొ_త్తముకలిసి కథాబీజమగుచున్నది. పాండవులయందలి దుర్యోధనుని అకారణ ద్వేషముతోడి లుబ్ధబుద్ధియు, ధృతరాష్ట్రుని తదుపేక్షయు, ఈ యుద్ధమునకు మూలభూతమైన విషయము లాక్షాగృహదహనము, దుర్ద్యూతము, ద్రౌపదీవస్త్రాపహరణము మొదలైనవి దాని ననుసరించిన చిలవలు పలవలు. ఆ మొ_త్తము బీజముయొక్క పరిణామ మీ యుద్ధము ఆ బీజము మధ్య మధ్య ఈ యుద్ధపర్వములయం దనుసంధింపబడుటచేత కథానుస్యూతిరక్షింపబడినదగును మధ్యలో నొకపదుమూడు సంవత్సరము లొకవిధముగా ప్రధానకథ ఆగిపోయినది. ఉద్యోగపర్వమునుండి తిరిగి ప్రారంభమైనది. ఈ యుద్ధమునకది యుపోద్ఘాతమగుటచేత కథాబీజమునందే తిక్కన్నగారు తిరుగతోడిరి. సంజయునితో శ్రీకృష్ణుడు మాటాడినదంతయు, కౌరవపాండవ వైరబీజమునకు

పుష్పోద్గమప్రాయమైన దుర్ద్యూతము విషయమే అచట కథానుస్యూతిని రక్షించుచు, ఇందువలన యుద్ధమగునని చెప్పినట్లున్నది యుద్ధము జరుగు దినములయందును తిక్కన్నగారా కథానుస్యూతిని కాపాడిరి. అట్లు కాపాడుటలో తిక్కన్నగారనేక ప్రయోజనములను సాధించిరి. పాండవవీరుల వీరాలాపములుగను నది యుపయోగించినది కౌరవవీరులయందది వారి యనుత్సాహమును సూచించునదియై దుర్యోధనుని పరాజయమునకు భూమికగను నుపయోగించినది. మరియు ముఖ్యముగా యుద్ధరసభావముల విజృంభణము నరికట్టుటకది యుపయోగించినది. ఇట్లు బహ్వర్థసాధనముగా కథాబీజమును తిక్కన్నగారు యుద్ధపర్వములయం దుపయోగించిరి కొన్ని యుదాహరణములు చూపబడును

పైఁబడిపోయెఁగాక ధృతరాష్ట్రుఁడు గన్నదియేమి ? ఆ సభం
దావలదన్నఁ గీడుడుగదా పతిలేఁడనబడ్డకాంత నే
డీవుగనుంగొనంగఁ బతి యే త్తెఱనొప్పెఁ బతుల్ విజృంభిత
శ్రీ విలసిల్లు కామినులు సేడ్పడి రిట్లపతిత్వదీనతన్.[1]

దుశ్శాసనుని చంపుచు భీముడు వానితో నన్నమాటలవ్వి ఉరముప్రచ్చి రక్తము పానము సేయుటయైనది అనగా దుశ్శాసనుడు చచ్చిపోయినట్లె లెక్క అంత వానిని వదలి కౌరవసేనమీదికి భీముడుపోయి వారిని తోలి తిరిగి దుశ్శాసనుని వద్దకు వచ్చినాడు. వాడు చచ్చిపోయినాడని తెలియును. ఉరము ప్రచ్చినను, ఇంకను కొనప్రాణ మెచటనైనను నున్నదేమోఅను అనుమానము తోడి భయమా భీముని తిరిగివచ్చుటకు హేతువుకావచ్చును. చచ్చిపోయియుండుట నిశ్చయమని తెలియును. అనుమానము వేధించుచున్నది అందువలన నా క్రిందపడియున్నవాని కాలు పట్టుకొనినాడు. కొనప్రాణమున్నచో కదలిక తెలియును గదా అన్నట్లు. వాడు నిజముగా చచ్చినవాడు గనుక కదలలేదు భీముడు తనలోపలి యనుమానమును, తన ధైర్యసారముచేత, వీరాలాపములచేత లేనట్లు చేసికొనినాడు. ఆ చేసికొనుటయే వాని మాటాడుట. చచ్చినవానితో నాడిన మాటలవ్వి ముందుగా వానికాలు పట్టుకొని భీముడిట్లనినాడు—

1. భా కర్ణ. 3-224.

ఏమిర ! పసులని యార్వవు ?
నీ మాటలు నిలువబడియెనె పసరమ ! మి
మ్మేము మగుడ నిదె యార్చెద
మీ మాటకు మాఱుపల్కు రెవ్వరుఁ గంటే.

నెట్టన యగ్గినం దగునె నీళ్లను ద్రోయుటయున్ విషాన్నముం
బెట్టుటయున్ మహోభుజగభీషణదంష్ట్రిలపాలు సేతయున్
చుట్టలుఁ బెద్దలుం జెలులు జూడ సభన్ నెఱిమాలి యమ్మెయిం
దిట్టున కోర్చుటెందుఁగలదే విను గెల్వరె జూద మెవ్వరున్.[1]

ఇట్లని మరల కౌరవులమీదికిబోయి మరల దుశ్శాసనునివద్దకు వచ్చి వైెవడి పోయెగాక మొదలైన మాటలు మాటాడినాడు. ముందనినమాటలు కథా బీజమును స్పృశించుచు భీముని క్రోధము నభివ్యక్తము చేయుచున్నవి. రెండవ సారి యనిన – ధృతరాష్ట్రుడు కొడుకులనుగాదని చెప్పలేకపోయినాడు గాని వానికేమి లాభించినది ? తానేమి శక్తిలేనివాడు కాడుగదా ! చెప్పగలిగి యుండి, చెప్పవలసిన బాధ్యతయుండియు చెప్పలేదు. చివరకేమైనది ? కొడు కులు లేకుండ బోవుచున్నారు. ఓరీ ! దుశ్శాసనా ! ఆనాడు సభలో వస్త్రము లొలువబడి, యవమానింపబడి మరియు పతిలేదనబడిన ద్రౌపది, నేడీవిధముగా నీ యెదుట విజృంభించి పూనిక నెరవేర్చి పరాక్రమించిన భర్తకలిగి ప్రకా శించుచున్నదిరా ! నాడు భర్తలయొక్క విజృంభించిన యైశ్వర్యముతో ప్రకా శించిన కాంతలు నేడు నిజముగా భర్తలులేని వారగుచు నిట్లు దైన్యమునకు పాల్పడినారు – అను ఈ మొదలైన భీముని తాత్పర్యము కథాబీజమును వ్యాఖ్యానించి చూపుచున్నది. అంతకు క్షణము ముందుగా భీముడు చేసిన రక్తపానము మొదలైన వాటివలన భాసించిన రౌద్రము – బీభత్సములనుండి సహృదయ పాఠకుల బుద్ధితొలగింపబడి ఆదిపర్వములోని విషయములయందు, సభాపర్వమునందు ప్రవేశపెట్టబడుచున్నది మరియు భీముడు చచ్చిపోయిన వాని వద్దకు రెండపర్యాయము లటుపోయి ఇటువచ్చి వాని నుద్దేశించి మాటాడి నట్లు వ్రాయబడుటచేత కించిత్తు హాస్యము ప్రతీయమానమగుచున్నది. రౌద్ర మునకు హాస్యము విరోధి. కథానుస్యూతిరక్షణము పేర ముందు తత్సన్ని

1. భా. కర్ణ. 3-221, 222.

వేశమునుండి సహృదయుల చిత్తము తొలగింపబడి క్రమముగా హాస్యమునందు ప్రవేశపెట్టబడుట మూలమున రౌద్రముయొక్క అతిశయము తగ్గింపబడినది. ఎక్కడ యుద్ధరసభావము లాస్వాదనయోగ్యములగు ననిపించునో, అక్కడ వెంటనే అన్యవిషయమును ప్రవేశపెట్టి తదాస్వాదన మరికట్టుటయు, మరియు తరువాత చిత్తమందు ప్రసరించుటకు తద్విరోధిరసమును మార్గముగా చేసిపెట్టుటయు జరిగినది. ఇదంతయు కథాబీజము నాశ్రయించి జరుపబడినది

ద్రోణుని నాలవనాటి యుద్ధమున దుర్యోధను డొక అద్భుతమైన కవచమును ధరించి సైంధవుని వధింపబోవు అర్జునునకు నడ్డముగా వచ్చినాడు. "నే డొక్క యద్భుతంబు సూపెద. ఇక్కవచధారణంబుచేత రక్షితుండవై యతనిం (కిరీటిని) దలపడుము కృష్ణుండును సమస్త జనంబులు వెఱంగుపడం దదీయ శరంబులు నీ తనువు దాకకుండ గలయవి"[1] అని చెప్పి ద్రోణుడిచ్చిన కవచమది. అది భేదింపబడదు దానితో నెంతకాలమైనను నల్లే యుద్ధము చేయవచ్చును అట్టి కవచమును ధరించి దుర్యోధను డర్జునున కెదురువచ్చినాడు అంతకు ముందుగనే శ్రీకృష్ణుడు గుఱ్ఱములకు నీళులు కావలయు ననగా నర్జునుడు "ధరదివ్యాస్త్రహతిం బగిల్చి కొలనుత్పాదించి వే దానికిన్శరజాలంబుల నిల్లుగట్టి"నది అదియొక యద్భుత విషయము కౌరవసేనకు దానిని జూచి భయమును, నాశ్చర్యమును కలిగినవి. వెంటనే దుర్యోధను డీ కవచముతో నర్జును నెదుర్కొనినాడు ఇదియు నద్భుతాపాదకమైనదియే వెంట వెంటనే అద్భుతము కొనసాగింపబడి వర్ణింపబడినచో నది రసముగా పరిణమించితీరును. అందువలన నా రెండద్భుత సన్నివేశములకును కించిత్తు వ్యవధానము కల్పింపబడినది. ఆ వచ్చు దుర్యోధనుని జూచి శ్రీకృష్ణు డర్జునునితో నిట్లనినాడు

ఈతఁడు మీకు నాపదలకెల్లను మూలము ధర్మపుత్రు దు
ర్ద్యూతమునం బరాభవము నొందఁగఁ జేసిన పాపనిశ్చయుం
డా తరుణీలలామమున కమ్మెయి భంగమొనర్చె వీఁడు నీ
చేతుల లావెఱుంగఁడు విశిష్టశుభంబిది నీకు ఫల్గునా [2]

శ్రీకృష్ణుని ఈ మాటలవలన సాధింపబడిన ప్రయోజనములలో నొకటి దుర్యోధనుని వధించుటయందు పార్థుని యుత్సాహము ప్రేరేపించుట. నిజమున

1. భా. ద్రోణ. 3-116.
2. భా. ద్రోణ. 3-183.

కానాడు ప్రోత్సహింపవలసిన స్థితిలో లే డర్జునుడు. అయినను శ్రీకృష్ణుడు దుర్యోధనుడు చేసిన పూర్వపు మెగ్గులను స్మృతికి దెచ్చుచున్నాడు ఈ పద్యము ప్రధానముగా రెండద్భుత సన్నివేశములకు వ్యవధానము కల్పించుటకే వ్రాయబడినది ఏమనగా నా శ్రీకృష్ణుని యా మాటల కర్జును డిట్లనినాడు.

ద్రౌపది వడ్డ బన్నము లుదగ్రత మేదినిఁ బెద్దకాల మి
చ్ఛాపరతంత్రుఁడై తన వంశంబుగఁ జేసిన వీని గర్వముం
గోపము వెంపదే మనము గుందగఁజేయదె యింత సెప్ప నే
లా పోరిగొందు నీతనిఁ జలంబు బలంబును నీవు మెచ్చగాన్.[1]

ఇంత నీవు చెప్ప నేల యని శ్రీకృష్ణునితో నర్జునుడనుచున్నాడు. కనుక శ్రీకృష్ణుడర్జునుని ప్రోత్సహింపవలసిన అవసరమచటలేదు. అందువలన వ్యవధానము కొరకే ఆ పద్యము వ్రాయబడినది. అర్జునుని ఉత్సాహపరచుట అనుషంగిక ప్రయోజనము కావచ్చును. అర్జునుడు తిరిగి వీరాలాపములు పలుకుటతో వాని యుత్సాహము ప్రతీయమానమగు చున్నది అర్జునుడు ప్రయోగించిన ప్రదరములన్నియు దుర్యోధను నేమియును జేయజాలక వాని కవచము దాకి మిట్టిపడుటతో నద్భుతము కలుగుచున్నది దానికి శ్రీకృష్ణునియందు విస్మయము కలుగుట చెప్పబడినదికూడ మరియు నర్జును డుత్సహించి నిఖిలకవచ నిర్భేదన శీలమైన దివ్యశరము దుర్యోధనునిపై ప్రయోగింపగా నది దుర్యోధనుని తాకకుండ మధ్యలో నశ్వత్థామచేత సర్వాస్త్రఘాతియైన శరమున దునుమబడుట మరియు నద్భుతము. అంత నర్జునుని ఉత్సాహము తిరోధానమైనది. అయ్యును పార్థునిచేత ప్రయోగింపబడిన నారసములు దుర్యోధనుని కరతలముల దాకి, కవచము నిష్ఫలమనుబుద్ధి పుట్టి ఆతడు దానిని బుచ్చివైచుటతో సన్నివేశము హాస్యముగా మార్చబడినది. ఇట్లు యుద్ధమునకనుకూలమైన భావము దేనిని నిలువనీయక, ఒక దానిచేత మరొకటి తిరోధానమైనట్లు చెప్పి, చివరకు హాస్యమునందు పర్యవసించునట్లు చేయబడుటచేత యుద్ధరస ప్రతీతి అరికట్టబడినది. కథాబీజమును మధ్యలో చూపించుటయు తదర్థమే.

కర్ణుని రథచక్రము భూమియందు క్రుంగిపోవుచున్నది అపుడు కర్ణుడర్జునునితో నీ చక్రము "నెత్తెద నంతకు నేయకుండు మేను భూమిస్థుడ నీవు

---

1. భా. ద్రోణ 3-188.

రథస్థుండ వియ్యేఁడఁ దగవగు నేయకునికి"[1] అనినాడు. కర్ణుడు యుద్ధధర్మ మును సూచించినాడు. అపుడు శ్రీకృష్ణుడు కర్ణునితో నిట్లనినాడు.

గొంతియు నందఱు గొడుకులు సుప్తులై
యుండంగ లక్కయిల్ మండఁజేసి
కపటంపు జూదంబు ఘటియించి ధర్మాత్ముఁ
డగు ధర్మసుతు సిరి యపహరించి
యంతఁబోవక ద్రుపదాత్మజఁ దెచ్చి స
భాస్థలి నమ్మెయి భంగపఱిచి
యమ్మహాత్ములఁ జంప నడవికి ఘోషయా
త్రావిధి నెపమున దాడివెట్టి
బాలు నభిమన్యు నొక్కని బహురథికులఁ
బనిచి చంపించె మీ సుయోధనుఁడు దలఁపఁ
గాని యిప్పాపముల కాదికర్త వీవ
యిన్ని యెడలను నీ పాడి యెందుబోయె ?[2]

ఇచట శ్రీకృష్ణుని మాటలుగా కథాబీజము వేర ప్రయోజనము నాశించి స్పృశింపబడినది. అభిమన్యుని చంపబడిన విషయము కథాబీజములోనిది కాదు. పరిణామమైన యుద్ధములోనిది. మూడు దినముల క్రితము జరిగినది. అట్టిది కథాబీజముతో కలుపబడి చెప్పబడుటచేత దాని మొత్తము ప్రయోజనము, కేవల కథానుస్యూతిరక్షణము గాని, యుద్ధరసభావముల పుంజుకొనుట నరి కట్టుటగాని కాక. వేరైనదిగా తోచుచున్నది కర్ణుడు యుద్ధధర్మమును పేర్కొని అర్జునుని వేయవద్దనగా నర్జును డాగినాడు. ధర్మము కాకపోయినను కర్ణుని మీద బాణములు ప్రయోగించి చంపుమని శ్రీకృష్ణుడర్జునునితో నన రాదు. కాని అర్జునున కా బుద్ధిపుట్టి ఆ సమయముననే విజృంభించి వానిని వధింప వలయును. ఈ దీనిని సాధించుటకు కౌరవుల యధర్మప్రవృత్తిని మొదటి నుండి మొన్నటి యభిమన్యుని వధించినంతవరకు శ్రీకృష్ణుడు పేర్కొని దాని కంతయు కర్ణుడే మూలకర్తయని చెప్పినాడు వెనుక జరిగిన అన్నింటికంటె

1. భా. కర్ణ. 3-351.
2. భా. కర్ణ. 3-356.

అభిమన్యుడు వధింపబడిన విషయ మర్జునుని క్రోధమును మరియు నతిశయింప జేయునది అట్లు పెరుసగా కర్ణుడు మూలముగా కౌరవులు చేసిన యధర్మపు బనులను చెప్పి, అర్జునునకు నధర్మపరుల విషయమున ధర్మము పాటింప నక్కర లేదను తాత్పర్యమును సూచించి, మరియు వాని క్రోధమును బెంచి, కర్ణుని వధించుట కప్పుడే ప్రేరేపించుట శ్రీకృష్ణుని ఆంతర్యము. అనగా కర్ణవధ కెంతగా నర్జునుని సిద్ధము చేయవలయునో అంతగా చేయుట కట కథాబీజము స్పృశింపబడినదని యర్థము కనుకనే తిక్కన్నగారు వెంటనే ఇట్లు వ్రాసిరి "అని యిట్లు కృష్ణుండు గర్ణుతో నాడు మాటలఁ దోడ్తోడం బెరిఁగిన యర్జునంజయు మనంబు రోషానలంబు రోమకూపంబులఁ బటు జ్వాలారూపంబుల వెడలుట యతివిస్మయప్రదంబై" తోచినదనియు, దానితో "నయ్యుగ్రమూర్తి సము దగ్రపరాక్రమంబున పటుబాణాసారంబు" కర్ణునిపై "గురిసి" నాడనియు వ్రాసిరి.[1] కర్ణుడు చేసిన ధర్మసూచనవలన నర్జును డాగినాడు గనుకనే, శ్రీకృష్ణుని మాటలవెంట వాని క్రోధానలము పెరిగి, ధర్మాధర్మవిచారశూన్యముగా జేసి కర్ణవధ కానుకూల్యము ఘటించుట పొసగుచున్నది. తత్పూర్వము కర్ణార్జునులయుద్ధము తీవ్రాభిరామముగా జరిగినది. ఇక కర్ణవధ జరుగబోవు చున్నది. ఈ రెండింటి మధ్య కథాబీజమును ప్రవర్తింప జేసి, మరియు దానిని జరుగబోవు కర్ణవధ కనుకూలముగా నిరూపించుట జరిగినది. కర్ణార్జునుల తీవ్ర యుద్ధమున వ్యవధానము కల్పింపబడుటకు కథాబీజ ముపయోగపడుట అనుషంగికము. కాక ప్రధానమనుకొనినను బాధలేదు తత్ప్రకరణమున కుచిత మైన అన్యప్రయోజనము నది లెస్సగా సాధించుచున్నది ఇది సూచించుటకే మొదట కథాబీజముయొక్క ప్రయోజన మిచట వేరైనదిగా దోచుచున్న దని చెప్పబడినది.

ఈ పద్ధతిలో నీ కథానుస్యూతిరక్షణము మరియు జరుపబడిన తావుల నుదాహరింపవచ్చును. ద్వైపాయనహ్రదమున దాగిన దుర్యోధనుడు వెలికి వచ్చుటకు ధర్మరాజు మాటాడిన మాటలు - తొడలు విరుగగొట్టబడి పడి పోయిన దుర్యోధనుడు, నన్ను పాండవు లధర్మముగా జయించుటకు నీవు కార ణమని శ్రీకృష్ణునితో ననగా నపుడు కృష్ణుడు మాటాడిన మాటలు - సహదే

---

1. భా. కర్ణ. 3-357.

వుడు శకునితో పోరి వానిని సంహరించుచో నాడిన దుర్ద్యూతమును గూర్చిన మాటలు – మొదలైనవన్నియు నిందు కుదాహరణములే. మొత్తముమీద చూడగా నొక్క నకులుడే పాండవులందరలోను కథాబీజము నెత్తి వేర్కొనని వాడుగా కనిపించుచున్నాడు – ఇదంతయు పాండవపక్షమున కథాబీజమును చూపుట.

కౌరవపక్షమున నీ కథానుస్యూతిని రక్షించుటవలన దుర్యోధనుని పరాజయమునకు భూమిక నేర్పాటు చేయుట అగుచున్నదని వెనుక చెప్పబడినది. కౌరవసేనానాయకుల యొక్కయు, సేనయొక్కయు, యుద్ధమునందలి అనభిముఖత్వమును, మరియు పాండవులయందలి యనురక్తిని, ఎడనెడ సూచించుచు, తత్పక్షమునం దుత్సాహము యొక్క లేమిని నిరూపించుటకు తిక్కన్నగారీ కథాబీజము నాశ్రయించి పనిచేసిరి. భీష్ముని యెనిమిదవనాటి యుద్ధమున భీముడు లెస్సగా విజృంభించి సునాభుడు మొదలైన నేడెనిమిదిమంది కురుకుమారులను హతమార్చినాడు. సేనానాయకుడైన భీష్ముడు భీముని నేమియు చేయలేదు. సోదరులు భీముని చేతిలోపడి గతాసువులగుటకు శోకించిన దుర్యోధనుడు భీష్ముని తూలనాడి పలికినాడు. అపుడు భీష్ముడిట్లని నాడు

ఇది మున్న యేను ద్రోణుడు
విదురుండును జెప్పినదియ విననప్పుడు బె
ట్టిదులగు పాండుతనూజుల
కెదురై నిర్జింపవశమె యీశునకైనన్[1].

మన కుమారులలోన నయ్యనిలతనయు
జారికగపడువాని నెవ్వారికైనఁ
గావఁ దలకొన శక్యంబు గాదు మనకు
నడలఁ బనిలేదు దీనికి నధిపతనయ[2].

భీముడు మనవారలను జంపుచుండగా నూరక చూచుచుంటివి. నీకు శోకము లేదు. రోషములేదు – అని దుర్యోధనుడనగా నెదురు శోకించుచు భీష్ముడనిన

1. భా. భీష్మ. 3-79.
2. భా. భీష్మ. 3-80.

మాటలవి. మొదటి పద్యము కథాబీజమును స్పృశించుచున్నది. రెండవ పద్యము చిత్రముగా దుర్యోధనుడును, దుశ్శాసనుడును భీముని చేతిలో పడుటను, అపుడెవరును వారిని రక్షించలేకపోవుటను సూచించుచున్నది మేము చెప్పినది వినక నీవు నీ యిష్టము వచ్చినట్లు చేసితివి. ఇపు డనుభవమునకు వచ్చినది. శోకించి లాభములేదు. అనుభవింపుము ఇంతటితో నేమైనది ? ఇంకను కురుకుమారులున్నారు. ఈ మిగిలియున్న నిన్ను నీ తమ్ములను మాత్ర మెవడు భీముని చేతిలో పడకుండ రక్షింపగలడు ? అదియు నీవే యనుభవింపవలయును. అనుభవింపక తప్పదని తెలిసియు దాని కడలుట మంచిదికాదు; ఊరకొనుము - ఈ తాత్పర్యముతో మాటాడుచున్న భీష్ముని సేనానాయకుడిగా జేసికొని యుద్ధము చేయుటను బెట్టుకొనినాడు దుర్యోధనుడు పాండవులను మనము జయింపలేము, నీవు సబాంధవముగా మరణింపక తప్పదు - అను నిశ్చయమును దుర్యోధనునకు సూచించినాడు భీష్ముడు అట్టి నిశ్చయము గలిగిన భీష్ముని చేయు యుద్ధము కేవలమాభాస యగుచున్నది యుద్ధమున తీవ్రత లేదు తీవ్రత లేని యుద్ధమున రసభావములు పుంజుకొనవు భారతమువంటి గ్రంథమున కదియే కావలయును

మరియు ద్రోణుని నాల్గవనాటి యుద్ధమున సాత్యకిచేత దుశ్శాసనుడు మొదలుగా గలిగిన యోధగణములు పెల్లగింపబడినవి. అపుడు దుశ్శాసనుడు ద్రోణుడున్న దిక్కుగా పరుగెత్తినాడు. ఆ పరుగెత్తి వచ్చిన దుశ్శాసనునితో ద్రోణుడిట్లనినాడు

"ఏమి ? యువరాజ విభునకు
సేమమె ? సైంధవుని నేమి సేసె నరుఁడు ? నీ
వేమిటి కిట్లీ రథిక
స్తోమముతో విఱిగితి ? ఎందుఁజొచ్చెద వింకన్ ?

అటుకులు దిన్నట్లగు నే
కడుపునఁ గుట్టెత్తినపుడు ? గడు బలిచితినాఁ
డోడ లెఱుఁగక పాండుసుతుల
నుడిగి మడుఁగవఱసె నిప్పుడొక సాత్యకిచేన్.

మఱచితె యా సభన్ భువనమాన్య గుణోత్తర యాజ్ఞసేని నీ
పఱచిన పాటు ? పాండవులఁ బల్కిన పల్కులు ? నాటి క్రొవ్వు నే

డైఱయును నెందుఁబోయె ? రణధీరుల వారల నల్గఁజేసి సి
గ్గఱి తుది నిట్టు లైతి తగునక్కట తియ్యనగావె ప్రాణముల్."[1]

మరియు కొంచెము తరువాత ద్రోణునతిక్రమించి భీముడు కౌరవసేనను చొచ్చుకొని పోయినాడు సాత్యకివలన, భీమునివలన తన సైన్యము నష్ట పడుటను జూచి దుర్యోధనుడు ద్రోణునియొద్దకు బోయి మొరవెట్టికొనినాడు. అపుడు వానితో ద్రోణు డిట్లనినాడు.

మును శకుని బుద్ధిమై గెలి
చిన యది యస్థిరపు గెలుపు సెడ కీ జూదం
బున వెడలజూటు సూవే
మన వెరవును లావుకలిమి మనుజాధీశా![2]

మరియు సైంధవుడు మరణించిన పరువాత దుర్యోధను డుత్సాహరహిత చిత్తుడై ద్రోణుని వద్దకు పోయి మనగతి యిట్లగుచున్న దేమన్నట్లు మాటాడగా వానితో ద్రోణుడిట్లనినాడు

"భూరమణ విదురుఁ డమ్మెయి
వారింపఁగ నతులపుణ్యవతిఁ గృష్ణను మీ
వారెల్లఁ జూడఁ బఱచిన
క్రూరపుఁ బాపపు ఫలంబు గుడుపకయున్నె.
ఆసభ నీవును మీ దు
శ్శాసనుడును గర్ణుఁడును బ్రశస్తచరిత్రో
ద్భాసితులగు పాండవులకుఁ
జేసిన కీ డెల్లభంగిఁ జెరుపదె మిమ్మున్.
అన్ని విధంబులం బఱిచినైయెనను నక్కటికంబులేక వా
రి న్నెఱిమాలి కానలఁ జరింపగఁ బంచినఁ బోయివచ్చి య
య్యన్నయుఁ దమ్ములుం దమకు నయ్యసగంబిల వేఁడి కాన కి
ట్లున్నను వారి మార్కొనుటకోర్చితి నేనొక బ్రాహ్మణుండనే."[3]

---

1 భా. ద్రోణ 4-88, 89...91.
2. భా. ద్రోణ. 4-165.
3. భా. ద్రోణ. 5-30...32.

ద్రోణుని మాటలు మరియు నెత్తిపొడుపుమాటలుగా నున్నవి కౌరవుల యుద్ధము పూనికను తేలికజేసి హాస్యాస్పదముగా జూపించుచున్నవి. ఇట్టి యాంతర్యములుగల సేనానాయకులు చేయు యుద్ధ మెంత తీవ్రాభిరామముగా వర్ణింపబడినను, దాని తేలికదనము దాని జీవలక్షణమై కనిపించుచునే ఉండును సహృదయ పాఠకుడు పూర్వాపరములను పర్యాలోచన చేయుచునేగదా చదువుకొనును ? వానికి యుద్ధరసభావములు తావన్మాత్రములుగనే స్ఫురించి తిరోధానము లగుచుండును. కనుక తదనుభవము వానికి కలుగుటలేదు దాని వలన ప్రధానరసమైన శాంతమునకు వాని చిత్త మనుకూలముగా నుంచినట్లే యగుచున్నది. యుద్ధపర్వములనట్లు దాటవేసికొని పోవుటతో భారతకర్త తన చేయవలసినది తాను చేసినవాడగు చున్నాడు

ఒక్క కౌరవసేనానాయకుల విషయమేకాదు. కౌరవ సైనికుల విషయమును నట్లే చూపించబడినది. భీముడు సునాభాదులను జంపుటను జూచి కౌరవపక్షమున సహాయము చేయవచ్చిన రాజు లందరును "నాడు సభనాడి నంతయు నేఁడ చేయునట్టు లున్నాడు మొనతల ననిలసుతుఁడు. విదురు పలుకులు దలకూడె వేయునేల ?"[1] అని యనుకొనినారు. మరియు భీష్ముని తొమ్మిదవనాటి యుద్ధమున కౌరవసైనికులు "ధృతరాష్ట్రుడును బుత్రులు నతిలోభంబునఁ బ్రజాక్షయము సేసిరి. ధర్మతనూజు గెలువవచ్చునె ? మతిలేరై రింక నేటి మాటలు మనకున్"[2] అని వగచినట్లుగా చెప్పబడియున్నది ఈ విధముగా ప్రధాన కథాబీజము కౌరవసేనానాయకులయొక్కయు, సైనికులయు, సహాయము చేయవచ్చిన వారి యొక్కయు ముఖములనుండి వెలికి తీసికొనిరాబడి యుద్ధరసములు మాటిమాటికి నడుపులో నుంచబడినవి.

మరియు చిత్రమైన విషయ మేమనగా, చివరకు దుర్యోధనుని ముఖమునకూడ కథాబీజము చూపింపబడి, తత్ఫలానుభవమున కాతడు సిద్ధమగుట నిరూపింపబడినది కర్ణుడు చనిపోయినాడు. కృపాచార్యు డా రాత్రి దుర్యోధనుని చేరి, ఇకనైనను ధర్మరాజుతో సంధిచేసికొనుట శ్రేయమని బోధించినాడు. అపుడు దుర్యోధనుడు వానితో నిట్లు చెప్పినాడు.

---

1. భా. భీష్మ. 3-74.
2. భా. భీష్మ. 3-227.

కపటంపు జూదంబు ఘటియించి రాజ్యంబు
గొని ధర్మజుని మది గుందఁజేసి
సభ కేకవస్త్ర రజస్వల నమ్మెయిఁ
బాంచాలి ముందలవట్టి యీడ్చి
సందిసేయఁగ బూని శౌరి యేతెంచిన
నవ్విధంబున కప్రియం బొనర్చి
పలువురుగూడి సౌభద్రునొక్కని బాలుఁ
గిట్టి యత్తెఱగున గీటడంచి
నేడు దుశ్శాసనుని బొమ్మునెత్తు రనిల
సుతుఁడు మదమునఁ ద్రావుటసూచి కొఱత
ప్రతిన దీర్చు నతండని భయముఁ బొంది
పొందుగోరిన నదియేల పొసగుఁ జెపుమ-?[1]

ప్రతినాయకుడును, ఈ యింత యుద్ధమునకును సర్వకారణ కారణుడునునైన దుర్యోధనుడు తన చేసిన దానిని స్మరించి తన వీగిపోవుటను నిశ్చయించుకొని ప్రవృత్తుడగుచున్న ట్లీ పద్యము చెప్పుచున్నది సైంధవవధనాడే దుర్యోధనునకు తన విజయాశ నశించుట చూపబడినది ఆనాడు భీముడు కౌరవసేనలను ప్రవేశించి శత్రుంజయ, శత్రుసహాది కురుకుమారులను బిలుకుమార్చుటతో "దుర్యోధనుండు దన మనంబున జూదంబునప్పుడు విదురుండు సెప్పినట్లయగుచున్నదని విషాదంబునొంది యాసభ నమ్మెయిఁ బాండవులం బలికిన పాపఫలం బనుభవించె"[2] నని తిక్కన్నగారు వ్రాసిరి

ఈ విధముగా ప్రధాన కథానుస్యూతిని రక్షించు పేరుతో, కౌరవపాండవుల మనోలక్షణములను నభివ్యక్తము చేయుచున్నట్లుగా, యుద్ధము తీవ్రత నరికట్టె తదనుయాయి రసభావములు పుష్టముకాకుండ చేయుటతోపాటు మరికొన్ని ఆనుషంగిక ప్రయోజనములను సాధించుచు తిక్కన్నగారు యుద్ధపర్వములను నిర్వహించిరి

---

1. భా. శల్య. 1-66
2. భా. ద్రోణ. 4-226.

## i. యుద్ధ కథనము

యుద్ధరసములు పుష్టములై ఆస్వాద్యములు కాకుండునట్లు చేయుటకు, యుద్ధకథాకథనమును లెస్సగా నుపయోగపడినది. ఇది ద్వివిధాభూతముగా నున్నది. సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పుటయొకటి. వైశంపాయనుడు జనమేజయునకు చెప్పుట మరియొకటి. ఈ రెండింటివలనను యుద్ధవర్ణన మాపబడి అన్యవిషయములు ప్రసక్తించుటకు వీలుకలిగినది. సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పుచో నధికముగా, దుర్యోధనుని చేష్టలు దలచి ధృతరాష్ట్రుడు దుఃఖించుట, సంజయుడు నీవలననే అయినదని వానిని మర్మములు తాకనాడుట రూపమున కథాబీజమే స్పృశింపబడినది. ధృతరాష్ట్రు డెప్పుడును దోషమంతయు తన కుమారులయందు కర్ణశకునులయందు చూపించుచుండును. ద్రోణుని నాల్గవనాటి యుద్ధము ప్రారంభించుటకు ముందు సంజయుడు పాండవశిబిరములోని సన్నాహమును జెప్పుచుండగా ధృతరాష్ట్రు డిట్లనివాడు.

నేను ద్రోణుండు భీష్ముండు బూని చెప్ప
శౌరి మాటలు మీరాజు సరకుగొనడ
సంధిగానీక కర్ణుండు సౌబలుండు
దుస్ససేనుండు నందఱ ద్రుంచికొనిరి [1]

దీనికి సంజయుడిచ్చిన సమాధానమిది—

అధిప ! చెప్పెద నీకు నంతయు నివ్విలా
పము గతజలసేతుబంధనంబు.
మాయజూదము మున్ను మాన్పవ. పదపడి
సంధి గావింపవ. సకలజనులు
నిను లుబ్ధుడు - నధర్మనిరతుండు - నని దూఱు
దురు. దూఱ కే లుండుదురు నరేంద్ర!
పాండుఁ డవ్విధమునఁ బాలించె రాజ్యంబు
పాండవు లెక్కుడు ప్రబ్బియశము

1. భా. ద్రోణ. 3-24.

లాభమును భరతాన్వయోల్లాస మెసగఁ
దగ నొనర్చిరి. వారలఁ దగు నె వారి
తండ్రిపాలైన సిరివాపఁ దనయుమీఁదఁ
బెట్టెదేల ? నీ దుర్నీతి ముట్టవచ్చె [1]

ఈ విధముగా ధృతరాష్ట్రుడు యుద్ధము వినుచు మధ్యమధ్య వాపోవుటయు సంజయుడు తగినట్లుగా సమాధానము చెప్పుటయు జరుగుచుండును. సహృదయ పాఠకులబుద్ధి యుద్ధమును వదలి ఈ విషయములయందు ప్రవర్తించుచుండుట వలన యుద్ధరసభావము లెడనెడ విచ్ఛిన్నములు చేయబడిన వగుచున్నవి మరియు కొన్నిచోట్ల నీ సంజయుని సమాధానములు ధృతరాష్ట్రునియందు కొరడాదెబ్బలగుచు, చమత్కారులై తళతళలు పోవుచుండును. భీష్ముని యారవనాటి యుద్ధమును వినుచు ధృతరాష్ట్రుడు తన సహజమైన ధోరణిలో పశ్చాత్తాప దుఃఖమును ప్రకటించగా సంజయు డిట్లనినాడు.

నీ తనూభవుండు నెఱిగుఱి యెఱుఁగమి
యెఱిఁగి యెఱిఁగి యతని నేల చెప్ప ?
మన యుపేక్షవలన వినునాఁటి జూదంబు
నేఁడు గయ్యమయ్యె నృపవరేణ్య. [2]

నీ చేసిన యుపేక్షయని మర్మములు తాకునట్లు నిందాగర్భముగా ననుటకు మన యుపేక్షయనుటలోని 'మన' అనుదాని యర్థమును లోకము నెరిగి భావించినచో నందలి చమత్కృతి భాసించును తచ్ఛబ్దమునందు వెటకారము నేటికిని లోకమున నిలిచియున్నది మరియింకొకటి చూపింపబడుచున్నది పదునాల్గవనాటి యుద్ధకథనమున ధృతరాష్ట్రుడు వాపోవుటయు సంజయుడు సమాధానము చెప్పుటయు నిట్లు వ్రాయబడియున్నది.

"పులికిఁ బసులు వాఱినక్రియ
నలవుఁ జలము సిగ్గువిడిచి యట్లొక్కని కో
ట్లల కోర్వక విఱిగిన పు
త్రుల నేమని వీఁదు నేను రోయక యింకన్.

---

1 భా ద్రోణ 3-29.

2 భా భీష్మ. 2-355.

అనుడు నతఁడవ్విభున కి
ట్లని నీవును నగ్రసుతుఁడు నవినయములు సే
సినఁ బాటిల్లిన యాపద
వినకుండఁగ వశమె ?

మీఁదుఁ విను తెలియంగాన్."[1]

సాత్యకి నొక్కని నెదుర్కొనలేక పారిపోయిన కుమారుల విషయము చెప్ప బడుచుండగా ధృతరాష్ట్రుడట్లు దుఃఖించియనినాడు. వినగూడని విషయములు వినవలసిన దుర్గతి పట్టినదిగదా అనియే ధృతరాష్ట్రుని తాత్పర్యము. ఏమని వింటుననగా నేమి సంతోషవిషయమని విందు నన్న ధృతరాష్ట్రుని దుఃఖముతోడి నిరుత్సాహమే యర్థముగాని, ఎట్లు వినగలను ? నేను వినును - అని యర్థము కాదు. కాని, సంజయుడు కాని యర్థమునే దానికిచెప్పి వినకపోవుట నీ వశమా ! విను మికను జెప్పెద ననినాడు. అది ధృతరాష్ట్రుని, మరి మెదలుటకు వీలులేని మూలకునెట్టి సూటిగా బొడుచుటకాని మరియొకటికాదు. ధృత రాష్ట్రున కది యెంతబాధకరమో పాఠకునకది యంత చమత్కారకారిగా నున్నది. ఒక సాత్యకి ఏక కాలమున క్రూరాస్త్రమొకటి ప్రయోగించి గాంధా రేశుని చాపమును, కురువంశాగ్రణిసూతుకంఠమును త్రెంచినాడని చెప్పబడిన పరమాద్భుత విషయమునందుకంటె, ఈ సంజయుడు ధృతరాష్ట్రుని ప్రతారించి పలుకుటలోని చమత్కారమునందును, ధృతరాష్ట్రుని అసహాయ స్థితియందును, పాఠకునిబుద్ధి యధికముగా రమించుచున్నది. యుద్ధరస భావములు వెనుక బట్టినవి ఆ దినము యుద్ధము వినుచునే మరికొంత సేపైన తరువాత ధృత రాష్ట్రుడు యథాప్రకారముగా దుర్యోధనుని నిందించుచు దుఃఖించినాడు. అపుడు సంజయుడు "విషమెత్తి క్రోలి యది యంగము నారటవెట్ట నమ్యూలం గిని సినయట్ల మీదపరికింపక యమ్మెయి నీవు పాండునందనులకుఁ జెట్టవై హృదయ తాపము వచ్చినఁ బల్కెదొండులన్ - ఊరక బవరంబు తెఱంగు వినుము"[2] అనినాడు 'ఊరక' శబ్దముయొక్క అర్థము నెంతభావించిన అంత చమత్కా రము పుట్టును. ఆ శబ్ద మట్టిది. నోరుమూసికొని బుద్ధితో చెప్పినది వినుము - అని చెప్పుట ఆ వాక్యమునకు సామాన్యార్థము చెప్పుట. దానిపై చమ

1 భా. ద్రోణ 4-80, 81
2. భా. ద్రోణ 4-209, 210

త్కారము భావ్యము. ఇట్లీ యుద్ధకథనమున నీ సంజయ ధృతరాష్ట్రుల మధ్య మధ్య సంవాదమున పుట్టు చమత్కారము సహృదయుల బుద్ధికి విషయమై, యుద్ధరసభావముల యొక్క యెడతెగనితనము లేకుండ చేయుచున్నది - యుద్ధపర్వములయందు తదనుయాయి రసోల్బణము కలుగకుండను, మరియు సహృదయుల చిత్తము అన్యవిషయములయందు ప్రవర్తించుచుండుటకును, ఈ కథాకథన ముపయోగింపబడినది

యుద్ధమును వినుచు జనమేజయు డడిగినది ప్రధానమైన దొక్కటియే భీమదుర్యోధనుల గదాయుద్ధమును జూచుటకు బలరాముడు తీవ్రయానమున నేతెంచినాడని వైశంపాయనుడు, సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పినట్లు జనమేజయునకు చెప్పగా నది విని జనమేజయుడు "బలదేవుండు తీర్థయాత్ర నిర్వర్తించిన తెఱంగును, నతని కాలోన నచటి కేఁగుదేర సమకూరిన విధంబును వివరించి చెప్పుమని"[1] కోరగా వైశంపాయును డాయా విషయములు చెప్పినాడు. ప్రభాసాది బహుపుణ్యతీర్థములను సందర్శించి వృద్ధకన్యాశ్రమమున బలరాముడు శల్యుని మరణము విని, తరువాత భీమదుర్యోధనుల ద్వంద్వ యుద్ధము జరుగబోవుచున్నదని నారదునివలన విని, శిష్యుల యుద్ధము జూచుట కతిశీఘ్రయానమున నచటకు వచ్చెనని చెప్పినాడు. ఈ బలరాముని తీర్థ యాత్రాభివర్ణన మెనుబదియారుగద్యపద్యములలో కొంత విపులముగనే వర్ణింపబడినది బలరాముని ప్రసక్తి తీసికొనిరాబడినది సరిగా భీమదుర్యోధనులు" తలపడువారై వీరోద్రేకంబునం జేసి యతిలోకంబగు నవష్టంభంబున విజృంభించి యొండొరుల నవలోకించిరి"[2] అని చెప్పబడిన తరువాత. అనగా భీమదుర్యోధను లొండురులను దాకబోవువరకును జెప్పి ఇక తాకుచున్నారని, ఒకవిధముగా సన్నివేశము నుచ్చస్థితికి తీసికొనివచ్చి, దాని నంతటితో నాపి అన్యవిషయము ప్రవేశపెట్టబడినట్లు. అది తీర్థమాహాత్మ్యాభివర్ణన విషయము. భీమదుర్యోధనుల గదాయుద్ధము మొత్తము భారతయుద్ధమునకు శిఖరభూత మైనది. ప్రతివీరుడైన దుర్యోధను డొంటరిగా వానిని తొడలువిరుగ బొడుతు నని ప్రతిజ్ఞచేసిన భీమునితో తలపడవలసి వచ్చిన యుద్ధమది మరియు ధర్మ

1. భా. శల్య. 2-144
2 భా. శల్య 2-138.

రాజు చేసిన సమయమునుబట్టి ఆ భీమదుర్యోధనుల యుద్ధము కౌరవులకుగాని పాండవులకుగాని విజయమును దేల్చివేయగలది అందువలనను నా యిరువుర యుద్ధము తీవ్రతమమైనది అంత తీవ్రమైన యుద్ధము ప్రారంభమగుచున్న దన్నంతవరకు జెప్పి, ప్రారంభించకుండ నాపబడి అచట తీర్థమహాత్మ్యమునకు ప్రసక్తి కల్పింపబడినది. అది కేవలము యుద్ధరసభావములకు ప్రతికూలమైనది. మరియు శాంతమున కనుకూలమైనది భారతమునందలి ప్రధానరసము కనుకూలమైన విషయమును ప్రవేశపెట్టి భీమదుర్యోధనులయొక్క యుద్ధతీవ్రత అరికట్టబడినది అంతకు పూర్వము చెప్పబడిన భీమదుర్యోధనుల పరస్పరాధిక్షేపములవలన వారి యుత్సాహము మంచిగా జూపబడినది. అది యంతటితో నాపబడినది. అనగా పాఠకులయొక్క భీమదుర్యోధనుల గదాయుద్ధమునందలి యౌత్సుక్యమును భారతకర్త కావలయునని దెబ్బతీయుచున్నాడు. తత్ప్రయత్నమే తీర్థమాహాత్మ్యాభివర్ణనము యుద్ధరసభావముల కున్ముఖములగుచున్న చిత్తములు, అన్యవిషయమునందు ప్రవేశపెట్టబడినవి. అది ప్రధానరసమున కనుకూలమైన విషయము. ఇదంతయు యుద్ధరసభావములు పుష్పములై యాస్వాద్యములు కాకుండజేయు ప్రయత్నమే ఇంత తీర్థమాహాత్మ్యాభివర్ణనమైన తరువాత సహృదయుల చిత్తము లిందుండి తిరిగి, అప్పుడు వర్ణింపబడు యుద్ధమునందు ప్రవేశింపవలయును. అది మరల నొక క్రొత్తప్రయత్నము మొత్తముమీద యుద్ధరసభావము లాస్వాద్యములు గాకుండజేయు భారతకర్త కృతార్థుడగుచున్నాడు. జనమేజయుని ప్రశ్న ఆధారముగా జనమేజయుడు చెప్పినట్లుగా తీర్థయాత్రాభివర్ణనము, భీమదుర్యోధనులయొక్క యుద్ధము తీవ్రత ఆస్వాద్యముకాకుండ నరికట్టబడినది

వైశంపాయనుని కథనమువలనను నొక ప్రయోజనము సాధింపబడియున్నందున యుద్ధకథనము ద్విధాభూతమని చెప్పబడినదిగాని సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పుటయే ప్రధానకథనము ఆ సంజయుడు చెప్పుచో మధ్యమధ్య ప్రవర్తించు అన్యవిషయములు చూపబడినవి మరియు నా సంజయుడు యుద్ధభూమినుండి ధృతరాష్ట్రుని వద్దకువచ్చు సందర్భమునను, ఉపక్రమించుటకు ముందును, ఆ యిరువుర శోకసంతప్తత వర్ణింపబడును. సంజయుడు వచ్చి ముందుగా సేనానాయకుల మరణమును చెప్పును. ధృతరాష్ట్రుడు దుఃఖించును ఈవిధముగా యుద్ధకథనము కరుణనాదముతో మొదలగుచుండుటకూడ,

దాని యుల్బణము నరికట్టుచున్నది భీష్ముడు పడిన తరువాత హాస్తినాపురము నకు వచ్చుచునే సంజయుడు ధృతరాష్ట్రు "నృపాలునడుగులంబడి భీష్మపాటు సెప్పుచు నడలి కరుణనాదమెసగ నాక్రందించినాడు శల్యదుర్యోధనులు మరణించిన తరువాత సంజయు డూర్ధ్వబాహుడై యేడ్చుకొనుచు హాస్తినా పురమునకు వచ్చినట్లు చెప్పబడినది. ధృతరాష్ట్రుడందరి మరణములకు నని వార్యముగా దుఃఖింపవలయును ఈ మొదలైన శోకాత్మకమైన కథనము యుద్ధరస భావముల పుష్టిని చాలవరకు తగ్గించుచున్నది.

ఇందు పేర్కొనదగిన మరియొకటి ప్రతిదిన సమరావసాన సమరప్రారంభముల మధ్య కౌరవపాండవ శిబిరములయందు జరిగెడు వృత్తాంతకథనము. కౌరవపక్షమున వృత్తాంతము దుర్యోధనుని పరాజయమున కనుకూలమైన అనుత్సాహవాతావరణమును సృష్టించునది. దుర్యోధను డెవరిని గాఢముగా నమ్ముకొని యుద్ధమున ప్రవర్తించెనో అట్టి కర్ణుడుకూడ పాండవులను జయించుట కుదురనివిషయమను నెరుకకలవాడుగా నిచట చూపబడుట గమనింపదగినది. భీష్ముడు యుద్ధము చాలించి శరతల్పగతుడైన తరువాత కర్ణుడు భీష్ముని వద్దకు వచ్చి నమస్కరించి యుద్ధముసేయుట కనుమతింపవలసినదని కోరగా భీష్ముడు పాండవు లజయ్యులనిచెప్పి వారితో విరోధము మానుకొనుమనినాడు. అపుడు కర్ణు డిట్లనినాడు

"వారుమహాబలుల్ హరియు వారికిఁ బ్రాపుగలండు వారలం
బోర జయింప రామియును బుద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ
ప్మారమణుండు సేయు తగుమన్నన లెల్లఁ దలంచి చూచినన్
భూరివివేక ! యే విడిచిపోవుట ధర్మమె ? వీరకర్మమే ?

మాటలు పెక్కులాడి యనుమానము లేక సభం గడంగి ప
ల్మాటుఁ బరాభవించితిఁ జలంబునఁ బాండవకోటి కెప్పుడుం
జేటు దలంచి యే బలువుసేసితి వైరము నాకు నింక నీ
వీటికి వారి వీటికిని వెక్కసమయ్యెడు కయ్యమొప్పగున్.

దైవాధీనము సర్వమున్ మనమతిం దప్పింపగా వచ్చునే
నీ వింకన్ నను నొండు వల్కక పరానీకంబుపై బంపు మ
త్సేవాధర్మము నిర్వహించెద ...."[1]

ఇట్టి యాంతర్యము గలిగ యుద్ధమునకు దిగినవాడు కర్ణుడు. ఉద్యోగపర్వమున భేదోపాయమును మనస్సున బెట్టుకొని శ్రీకృష్ణు డేకాంతమున మాటాడినప్పుడును కర్ణుడు "గెలుపయ్యెధిష్ఠిరునకునుగల దెఱుగుదు" అనినాడు. తత్కాలమున శ్రీకృష్ణుని తప్పించుకొను కట్లు కర్ణు డనియుండవచ్చునను కొనినను భీష్మునితో మాటాడిన సందర్భమట్టిదికాదు. స్పష్టముగా కర్ణుని ఆంతర్యమును చూపించుచున్నది. కౌరవవీరులందరును మనము పాండవులను జయింపలేమన్న దృఢవిశ్వాసముతో యుద్ధముచేయువారే. అట్టి యుద్ధమునకు తీవ్రత యెక్కడనుండి వచ్చును ? భీష్మద్రోణుల విషయమిచట ప్రత్యేకముగా నుదాహరింప నక్కర లేదు. యుద్ధము జరుగుచున్నపుడును వారి వారి యాంతర్యములు తెలియజేయబడుచునేయున్నవి. ఒక చమత్కారమైన విషయమేమనగా – ఎనిమిదవనాడు యుద్ధమైపోయినది దుర్యోధనుడు కర్ణుని బిలువనంపుకొని వానితో మాటాడినాడు. ఇక యుద్ధమునుండి భీష్ముని విరమింపజేయుమని కర్ణుడు చెప్పినాడు కర్ణుడువచ్చి తనకు విజయమును గూర్చు నన్న తలంపుతో దుర్యోధనుడప్పుడే బయలుదేరి భీష్మునివద్దకుబోయి యిట్లనినాడు–

నిను మున్నెంతయు నమ్మి పాండవుల యున్మేషంబు నేఁ జీరికిం
గొన నీ పోరెడు చందముల్ దెలియఁ బెక్కుల్ సూచితిం జేరి చే
రి నయం బిచ్చుచు నొంప నూల్కొనక వారిం బట్టి పాలార్చెదు ఒం
డన నేరం గురుముఖ్య ! యింక నిట నీ వాలంబు సాలింపవే–

అనిమొన దేవదానవులకైనను మార్కొనరాదు నిన్ను నే
డెనిమిది నాళ్ళులయ్యె సమయింపవు నొంపవు సవ్యసాచి న
ప్పని యటులుండనిమ్ము నినుఁ బ్రార్థన సేసెద నింతవట్టు నా
చనవునఁ బోవనిచ్చి నృపసత్తమ ! పోరికిఁ గర్ణుఁ బంపవే–[2]

భీష్మనంతటివానిని, నీ వలన లాభము కనిపించుటలేదు – యుద్ధమునుండి విరమించుకొనుము – నీవు మానుకున్నచో కర్ణుడైనను యుద్ధమునకు వచ్చును – నీ వలన నుభయభ్రష్టుడనగుచున్నాను – అను తాత్పర్యము నెదురుపడి

---

1. భా భీష్మ 3-446, 448, 449
2. భా భీష్మ. 3-170, 171.

సూచించుటయే విశేషవిషయము. దానికి భీష్ముడు మనసున నొచ్చుకొని అర్జునుని పరాక్రమమును వర్ణించుచు "గాండీవిని గెలువరాదు శిఖండిని జంపంగ నాకుఁ గాదు" ఇతరులను సంహరించెదను ఈ మాట నీకిదివరకే చెప్పితిని నీవు పాండవులను సంహరింపుము నేను మిగిలినవారి సైన్యమును చంపుదును అర్ధరాత్రిపూట వచ్చి నన్ను నిందించిన నీకు విజయము వచ్చునా ? – అని ఎంత సేపును సిగ్గే మాటాడును గాని, సరే యుద్ధమునుండి విరమించుకొందును లెమ్మని మాత్రమనలేదు దుర్యోధనుడు బయటపడి పిచ్చివాడుగా జేయబడినాడు. సేనానాయకులయందు ప్రభువునకు విశ్వాసములేదు ప్రభువునకు కూర్చుటయందు సేనాపతుల కిష్టములేదు. విశ్వాసములేని ప్రభువు, ఇష్టములేని సైన్యముతో కొనసాగించెడు యుద్ధముగా రూపుగట్టుకొనుట కుదురును. దుర్యోధనుడువచ్చి మాటాడిన సన్నివేశమట్లు తేలికగా చమత్కారకారిగా నిరూపింపబడుటతో భారతకర్త యుద్దేశము నెరవేరినది

పదమూడవనాటి యుద్ధము ముగిసిన తరువాత పాండవ శిబిరములయందు జరిగిన సంరంభము చాల పెద్దది. అభిమన్యుని మరణమునకు ధర్మరాజాదుల దుఃఖమచట వర్ణింపబడినది. శోకమోహాములవలని అనభిభూతత్వము వీరలక్షణము. అది తొలగింపబడిన సన్నివేశమది. మరియు సుభద్రాద్రౌపదుల దుఃఖముగూడ వర్ణింపబడి కరుణాస్పదముగా చూపబడినది. దీని తరువాత అర్జునుని ప్రతిజ్ఞ అది మరల వీరలక్షణముకలది. అర్జునుని ప్రతిన వినిన సైంధవుని తత్తరపాటును సూచించు "ఏ నొకరుండనే తనకు నెగ్గొనరించితి ? నేలనాపయింబూనినవాఁడు ఫల్గునుఁడు పోరవధింపగ" అను వాని మాటలు, మరియు "పెదవులు దడుపుచుఁ గాళ్లున్ గుదివడవడకు"[1] చున్నాడను వాని స్థితివర్ణనము, కొంత హాస్యకారిగా నున్నది. ఆ తరువాతి యర్జునుని స్వప్న వృత్తాంతమది యద్భుతాపాదకము మొదట వ్యాసుడువచ్చి ధర్మజునకు బోధించిన విషయమంతయు ప్రధానరసమైన శాంతమున కనుకూలమైనది. ఈ విధముగా నా శిబిరగత వృత్తాంతకథనము, బహు అన్యవిషయముల పొలిమేరలో సహృదయుల చిత్తములకు ప్రవృత్తి కలిగించుచున్నది. యుద్ధరస భావములనుండి పెడగా తీసికొని పోబడినది సహృదయులచిత్తము.

1. భా ద్రోణ. 2-288, 292.

ఇట్లు బహువిధములైన జాగ్రత్తలతో, ప్రధానరసమును దృష్టియందుంచుకొని, యుద్ధరసభావములు పుష్టములై ఆస్వాద్యములు కాకుండ, తావన్మాత్రములై స్ఫురించునట్లుగా, యుద్ధపర్వము లైదింటిని తిక్కన్నగారు నిర్వహించిరి భారతమున యుద్ధపర్వములు రక్తిగట్టుచున్నవనగా నర్థమదియే ప్రతిచిన్న విషయమును, కావ్యరసము దృష్ట్యా నిర్వహించుట నిత్యజాగరితమైన అంతఃకరణముగల మహాకవి లక్షణముగాని మరొకటిగాదు. ఇక తిక్కన్నగారు కేవలము కురుపాండవవీరుల యుద్ధమును వర్ణించిన రెండు మూడు పద్ధతులు చూపింపబడును-

## 11. ప్రధానవీరులు యుద్ధవర్ణనము పద్ధతి

కౌరవపక్షమున ప్రధానవీరులు భీష్మద్రోణకర్ణశల్యాశ్వత్థామలు సేనాపతులును, దుర్యోధనుడు మొదలైనవారును. పాండవపక్షమున నర్జునుడు, భీముడు, ధర్మరాజు క్రమముగా యుద్ధమున పాల్గొనిన ప్రధానవీరులు. ఆ యీ వీరెదురుపడి చేసికొనిన యుద్ధమే ప్రధానయుద్ధము. ఏతద్యుద్ధమును తిక్కన్నగారు వర్ణించినతీరు స్థూలముగా నిట చూపబడును

భీష్మార్జునులు రెండవనాటి యుద్ధమున తీవ్రముగా నెదుర్కొనిరి. వారి యుద్ధమును జూచి చారణ సిద్ధ గంధర్వాదు లిట్లనుకొనిరని తిక్కన్నగారు వ్రాసిరి

ఒండొరు చండవిక్రమము లోర్తురు వీరలకాక వీరితో
నొండొకరుండు మార్కొనగనోపునె ? పూనిక్రుతాంతుఁడైన నా
ఖండలుడైన - నివ్విధపుఁ గయ్యము లెక్కడనైనఁ గంటిమే-
పాండవ కౌరవోత్తముల బాహువిలాసము లిట్టు లుండునే.[1]

భీష్మార్జునులలో నెక్కువతక్కువలు లేవు వారొకరికొకరు తీసిపోకుండ యుద్ధము చేయుదురు. తిక్కన్నగారు భీష్మార్జునుల యుద్ధము నెంతసేపెచట వర్ణించినను నల్లె యుండును. మొదటినాడును వారియువుర యుద్ధమున్నది. అచట తిక్కన్నగారిట్లు వ్రాసిరి

1 భా భీష్మ. 2-47.

కొఱవియుఁ గొఱవియు దాఁకిన
తెఱఁగున నర్జునుఁడు సురనదీసూనుఁడుఁ జా
పఱు వొగడఁ దాఁకుటయు ని
ద్దఱ దిక్కుల సైన్యములును దలపడియె వడిన్.[1]

ఇది భీష్మార్జునుల యుద్ధము వర్ణనముతీరు.

ద్రోణార్జునుల యుద్ధమది యింకొక విధముగా నుండును. ఒకరికొకరు తీసిపోనితన మచటనుకలదు. మరియు విశేషమున్నది. పదునైదవనాటి ఉదయమున ద్రోణార్జునులు గట్టిగా తాకి యుద్ధము చేసికొనిరి. దేవతలా యుద్ధమును ప్రశంసించిరి.

హరుఁడు వినోదార్థముగా
నిరుమేనయి రణమొనర్చె నింతియకా కి
ప్పరుసున నక్కజమగు సం
గర మొసరింపంగ నొరులఁ గంటిమె యెందున్.[2]

ఈ సుర ఖచర విద్యాధర ప్రశంసపరకును భీష్మార్జునుల యుద్ధమెట్లో ద్రోణార్జునుల యుద్ధమును నట్లే ఆ తరువాత ద్రోణుడు బ్రహ్మాస్త్రమును సంధించినాడు.

క్షితియున్ పర్వతకోటియున్ వడఁకె నగ్నిచ్ఛాయ లయ్యెన్ దిశల్
చతురంభోనిధులుంగలంగె భయలోలంబయ్యె దేవ వ్రజం
బతిసంక్షోభము నొందె నొక్క మొగి సైన్యద్వంద్వమున్ ద్రోణు డు
ద్ధతి బ్రహ్మాస్త్రము మౌర్వితో నియత మంత్రస్ఫూర్తి సంధించినన్[3]

ఇంత కల్లోలమును జరిగించు బ్రహ్మాస్త్రమును ద్రోణుడు పార్థునిపై ప్రయోగించినాడు. దేవతలకు నతిలోకమయిన భయిమును కలిగించిన ఆ యస్త్రమును పార్థుడు సులభముగా మరలించినాడు.

---

1. భా భీష్మ 1-288
2. భా ద్రోణ 5-295.
3. భా ద్రోణ. 5-297.

"అంతరంగంబునం దొక యింతయేని
యలుకు లేక తనర్చి బ్రహ్మాస్త్రమునన
వేడుకకు మరలించిన విధము దోప
నద్భుతంబుగ నారించె నర్జునుండు.

ఇత్తెఱంగున గెలుపోటమియు లేక నయ్యిరువురు బోరు"[1]

సలిపినారని తిక్కన్నగారు వ్రాసినను ద్రోణుని మించిన నర్జునుని మహాప్రతాపము ప్రతీయమానమగుచునే యున్నది. బ్రహ్మాస్త్రానుసంధానముయొక్క ప్రళయార్భటిని మత్తేభవృత్తమున విపులముగా జూపించి, అది అర్జునునకొక లెక్కలోనిది కాదన్నట్లుగా నొకగీతపద్యమున దాని నాతడు వారించిన తీరు చెప్పబడుట సూక్ష్మముగా నర్జునుని పైచేయిని సూచించుటయే కావలయుననిపించుచున్నది. భీష్మార్జునుల యుద్ధమున అర్జునుని పైచేయిని ఊహించుట కాస్కారమేలేదు భీష్ముని యుద్ధకౌశల మట్టిది

పదునేడవనాటి యుద్ధమున కర్ణార్జును లెదుర్కొనిరి కర్ణార్జునుల యుద్ధమును తిక్కన్నగారు విపులముగా వర్ణించిచూపిరి. స్వల్పములైన అవాంతర విషయములతో కర్ణపర్వము తృతీయాశ్వాసమున 277వ పద్యమునుండి 363వ పద్యమువరకు వారి యుద్ధమే వర్ణింపబడినది. ఇంత దీర్ఘముగా వర్ణింపబడిన ఇద్దరు వీరుల యుద్ధము భారతమున నింకొకటిలేదు. ఈ యిరువురును తుల్య బలపరాక్రమములు గలవారుగనే యుద్ధము చేయుదురు కాని వీరన్యోన్య జయార్థులు భీష్మద్రోణు లర్జునుని జయించుటకుగా యుద్ధము చేయలేదు. భీష్ముడు దేవతలు మెచ్చుకొనున ట్లర్జునునకు తీసిపోక యుద్ధము చేయును. ఆయన మహాస్త్రము లేమియు ప్రయోగింపడు ద్రోణుని స్థితి వేరు ఆయనకు మధ్య మధ్య మిక్కిలిగా కోపము వచ్చుచుండును భీష్ముని శాంతము బ్రాహ్మణుడైన ద్రోణునకులేదు. అందువలన నెడనెడ మంత్రపూతములైన యస్త్రములను సంధించును అర్జునుడు వాటి నెదుర్కొనినచో ద్రోణునకు చింత యుండదు. కర్ణుడట్లుగాదు. అర్జునుని జయించుట వానికి కావలయును. అనగా వానిని జయింపవలయునన్న ఆశాభావమును లెస్సగా పెంచుకొనినాడు అందువలన కర్ణునియందు పూనిక యెక్కువ ఏ యస్త్ర శస్త్రములనుగాని

1. భా. ద్రోణ 5-299, 300.

అర్జునుపై విడిచినప్పుడును, దానితో నాతడు తెనుగుననియే కర్ణు డూహించును ఆ మాట మధ్య మధ్య పైకనియే వాటిని ప్రయోగించును. భీష్మద్రోణుల యుద్ధ మిట్లుండదు. కనుకనే తిక్కన్నగారు కర్ణార్జునుల యుద్ధమును కేవల మస్త్రశస్త్రప్రయోగ పురస్కృతముగా విపులముగా వర్ణించిరి తన యుద్ధమును కురురాజు మెచ్చుకొనుట కర్ణునకు సంతోషమైన విషయముగాని దేవతలు మెచ్చుకొనుటకాదు ఒకచో కురురాజు మెచ్చుకొనుటకూడ కాదు. తన తీవ్రత ముందర్జును డేమియు కాకుండ పోవలయును. కర్ణుని యుద్ధమంతయు నా దృష్టితో వర్ణింపబడినది.

శల్యార్జునుల కెప్పుడును గట్టియుద్ధము కలిగినట్లు కనిపించుటలేదు అశ్వత్థామ పదునేడవనాడే అర్జునుని కొంత తీవ్రముగా నెదుర్కొనినాడు. అతని దొక విచిత్రమైనబుద్ధి. తనకు తెలియకుండ తాను విక్రమించగలవాడు ప్రతాప ప్రదర్శనమునందును ప్రభువిశ్వాసమునందును కొంత నిశ్చయబుద్ధికలవాడు. అందువలన వాని యుద్ధముకూడ తిక్కన్నగారు కొద్దిపరిధిలో కర్ణుని యుద్ధమును వలెనే వర్ణించిరి.

భీష్మునితో పేర్కొనదగిన యుద్ధము భీముడుగాని ధర్మరాజుగాని చేయ లేదు.

ద్రోణునితో యుద్ధము చేయవలసిన పరిస్థితి భీమునకు పదునాల్గవనాడు సంభవించినది. అది చాల చిత్రమైనది. సైంధవవధ జరుగవలసిన దినమది. అర్జునునకు సహాయముగా భీముని పొమ్మని ధర్మరాజు చెప్పినాడు. కౌరవ సేనాముఖమున ద్రోణుడున్నాడు. వాని నోడించిగాని కౌరవుల మొగ్గరము లోనికి ప్రవేశించుటకు వీలులేదు. ఆ వ్యూహమట్లు పన్నబడినది. అర్జును డంతకు ముందు ద్రోణునకు ప్రదక్షిణముచేసి తప్పుకొని లోన ప్రవేశించినాడు. భీముడట్లు తొలగ ద్రోసికొనిపోవు స్వభావముకలవాడు గాడు. ద్రోణునిమీద గదను విసరి కొట్టినాడు. భీముని యా గద వ్రేటును తప్పించుకొనుచు మరొక రథమునకు లంఘించినాడు ద్రోణుడు. అటనుండి శరములు పరంపరగా భీమునిపై ప్రయోగింప ప్రారంభించినాడు. ద్రోణుని శరప్రయోగముముందు భీము డెందుకు పనికివచ్చును గనుక ? అప్పుడు తిక్కన్నగారు భీముడుచేసిన యుద్ధము నిట్లు వర్ణించిరి.

"అరదము డిగ్గి యప్పుడు శరావళి కోర్చి మొగంబు వాంచి స
త్వరుఁడయి వానపైఁ గురియ వంచిన మస్తక మొప్పఁ బోవు సుం
దర వృషభంబు లీలఁ జని దర్పమెలర్పగ నొక్కచే నొగల్
వెరవునఁ బట్టి తేరు ప్రజ విస్మయ మందగ వీచి వైచినన్.

సుగ్గునూచమైన నగ్గురుఁ డొండొక
యరద మెక్కి యల్ల నరిగె"—[1]

అట్లుచేసి భీముడు కౌరవులమైన ప్రవేశించినాడు నిజమునకు భీముడు ద్రోణునితో చేసిన యుద్ధమేమియునులేదు. భీముని స్వభావమున కనుగుణముగా వాని చేసినపని యథాతథముగ చెప్పబడినది ద్రోణునితో భీముడు చేయగలిగిన యుద్ధమదియే.

ద్రోణధర్మజు లిరువురును నొకటి రెండు పర్యాయము లెదుర్కొనిరి. వీరి యుద్ధమున తీవ్రతయుండదు ధర్మరాజును ప్రాణముతోపట్టి యొసగుటకు దుర్యోధనునకు మాట ఇచ్చిన తరువాతనే ద్రోణుడు వాని నెదుర్కొనినాడు. ద్రోణుడు సేనాపతియైననాటి సాయంసమరమున ధర్మజునితో యుద్ధము కలిగినది కాని ధర్మరాజు యుద్ధము చేసినట్లుగాక వాని చక్రరక్షకుడు సుకుమారుఁడు ద్రోణునెదుర్కొనినట్లు చెప్పబడినది ఆ తరువాత యుగంధరుడు ద్రోణుని మీదకు వచ్చుట, వాని చచ్చుటతో కేకయపతులు, పాంచాలనాథుడు - సింహసేన వ్యాఘ్రదత్తులు మొదలైన యోధులు ద్రోణునిపై విరుచుకొనిపడినారు. ద్రోణుడు వారితోడనే యుద్ధము చేయవలసివచ్చినది. ధర్మరాజుమీద వానికి దృష్టియేలేదు చివరకు తిరిగి ధర్మరాజు పైకివచ్చుచుండగా నర్జును డడ్డుపడినాడు. ద్రోణార్జునుల యుద్ధముతో నాడు ప్రొద్దుగ్రుంకినది పేరుకు మాత్రము ద్రోణుడు ధర్మజుని మీదకు వచ్చినట్లు. ధర్మరాజు ద్రోణునితో చేసిన యుద్ధమేమియులేదు మరియింకొకసారి, మూడుదినముల తరువాత, ద్రోణధర్మజులకు యుద్ధము సంభవించినది. ఇచట మాత్ర మా యిరువురయుద్ధము కొంత వర్ణింపబడినది దాని ముగింపు మాత్రము చాల చమత్కారముగా చేయబడినది ముందు కొంతసేపు తీవ్రముగా యుద్ధము జరిగినది ద్రోణునకు మిక్కిలిగా కోపము వచ్చినది. అప్పటినుండి వారి యుద్ధమునిట్లు తిక్కన్నగారు వర్ణించిరి.

1 భా. ద్రోణ. 4-154, 155.

ధర్మతనయుఁ రథ్యంబుల ధరణి గూల్చి
ధనువు గేతువుఁ దునుమాడి తనువు నొంప
ఆత డరదంబు డిగ్గి నిరాయుధుండు
నూర్ధ్వబాహుండునై యూరకుండె

కనుఁగొని గురుఁ డవ్విభు నే
యను బోడువను జేతులాడ కట పార్శ్వములం
దన చూడ్కిఁ బడిన హయరథ
మనుజద్విపసముదయముల మడియించెన్.

పోనీఁడు పొదువుఁ గుంతీ
సూనుని గురుఁ డనుచుమండఁ జూపఱగము ల
మ్మానవపతి యతిరయమునఁ
దా నెక్కెం బాటి పిన్నతమ్ముని రథమున్."[1]

ద్రోణుని యుద్ధతీవ్రతకు దట్టుకొనజాలక ధర్మరాజు రథము దిగిఁ ఊర్ధ్వ బాహుడై యూరకుండుట, వానిని జూచి ద్రోణుడు జాలిపడి, ఇక నేయుటకు చేతులాడక ప్రక్కలనున్నవారి మీదకు బోవుట, ఆ సందుజూచికొని ధర్మరాజు పరువెత్తి సహదేవుని రథమెక్కి తొలగిపోవుట — మొదలైన విషయవర్ణనము వలన, చివరకా యుద్ధము తేలికగా నెగురగొట్టబడి హాస్యమున కాస్పదముగా చేయబడిన దగుచున్నది ద్రోణుడు ధర్మరాజు నెందుకును గాకుండ జేసి వదలి నాడు. అయినను ద్రోణుడు వాని విషయమున నంత పట్టింపు గలవాడుకాడు అందువలన యుద్ధము తీవ్రముగా నుండదు.

కర్ణునితో భీముడునుఁ ధర్మరాజును మధ్య మధ్య తలపడినారు. కర్ణుడు కుంతికొక వరమిచ్చియున్నాడు అందువలన నర్జునుని తప్ప మిగిలిన పాండవుల ప్రాణమున కాతడు తెగడు పదునాల్గవనాటి యుద్ధమున కర్ణుడు భీముని లెస్సగా నొప్పించి, మరియు వింటికోపున పొట్టమీద పొడిచి నిందించి వదలినాడు పదు నేడవనాటి యుద్ధమున కర్ణుడు ధర్మరాజు నెదుర్కొని శరీరముతోపాటు మన స్సునుగూడ నొప్పించి వదలినాడు.

---

1 భా. ద్రోణ 3-245...247

శల్యునకు ధర్మరాజునకు నైన యుద్ధము పదునెనిమిదవనాటియుద్ధమే ముఖ్యమైనది. శల్యధర్మనందనుల యుద్ధమని దానికి పేరేకాని భీముడే అధికముగా ధర్మజునకు బదులు యుద్ధము చేసినాడు మరియు సాత్యకి ధృష్టద్యుమ్నులు చేసినారు. శల్య ధర్మనందను లిరువురును యుద్ధముచేసిన కొద్దికాలముకూడ తిక్కన్నగారు వర్ణింపక, దేవతలును, ఉభయసైన్యములలోని జనములును, వారి యుద్ధమును జూచి యేమనుకొనినదియు వ్రాసి, ఆ మాటల వలన యుద్ధ మూహింపబడునట్లుగా చేసిరి. ధర్మరాజు శల్యునిమీద శక్తిని ప్రయోగించునపుడుకూడ, వాని భక్తిభావముతోడి హృదయమే ఆవిష్కరింపబడినది గాని క్రోధోత్సాహము లేమియు చూపబడలేదు ధర్మరాజు శాంతరసనాయకుడగుటవలన వానియం దెచటగాని యుద్ధోత్సాహము నిరూపింపబడకుండ తిక్కన్నగారు చిత్రముగా వాని యుద్ధము లక్షణమును జూపించిరి. శల్యుడు ధర్మరాజు చేతిలోగాని మరణింపనందున, పూనికతో ధర్మరాజు యుద్ధమున నిలువబడవలసివచ్చినది అప్పటికిని భక్తిభావముతోడి యుత్సాహమే వానియందు చూపబడినది. ప్రధానరసము దృష్ట్యా అది అట్లె చూపబడవలయును.

కౌరవపక్షమునవాడైన యశ్వత్థామ శివతేజముచేత నావేశింపబడి సుప్తులను చంపుట యుద్ధము క్రిందికిరాదు. అదియొక ఊచకోత.

ప్రతివీరుడైన దుర్యోధనుని మూడవనాటి యుద్ధమున భీము డెదుర్కొని మొదటిసారిగా మూర్ఛపోగొట్టినాడు అది ముందు జరుగబోవు దానికి సూచన కావచ్చును. భీమదుర్యోధనులు ప్రధానముగా నెదుర్కొనినది పదునెనిమిదవ నాడు అదంతయు గదాయుద్ధము భీము డానాడును, పదునొకండవనాడును శల్యునితో గదాయుద్ధము చేసినాడు భీమదుర్యోధనుల గదాయుద్ధము శల్యభీముల గదాయుద్ధమువలెనే ఉన్నను, సహజముగా గల తీవ్రత ననుసరించి కొంత విపులముగా వర్ణింపబడినది.

యుద్ధవర్ణనమును విమర్శించి చూపుటకుగల యవకాశము చాలతక్కువ. ఊరక విషయము విషయముగా మాత్రమే చెప్పుట యగుచుండును. భారత యుద్ధమున ప్రధానవీరుల విషయము గనుక కొద్దిగా సూచింపబడినది ప్రధాన వీరు లితరులతో యుద్ధము చేయుటయనియు, అప్రధానులు ప్రాధాన్యముగల

వారితో యుద్ధముచేయుట యనియు, నింకను వింగడించి చూపవచ్చును. అట్లు చేయుట గ్రంథము పెంచుట. ఏమనగా మాటలు భేదమేగాని అసలు విషయమంతయు నొక విధమైనదియే వాడు వాని నైదుమార్గణముల గొట్టెను. వీనిని వాడు మూడు నిశితసాయకముల నొప్పించెను ఒకడొక బాణమున నొకని సూతుని గుఱ్ఱములను చంపెను. వేరొకడు శరమరివోయుచుండగా వాని కరము నెదుటివాడు తునిమెను - ఈ విధముగా నెంతసేపైనను యుద్ధమును వర్ణింపవచ్చును భారతయుద్ధమంతయు నిట్లె యున్నది

ప్రధానవీరులు పరస్పర మెదుర్కొనిన ఘట్టములు కొన్ని పైన ఉదాహరింపబడినవి ఆయాచోట్ల తప్ప వారింకొకచోట నెదురుపడలేదా యనవచ్చును లేదని యేమియులేదు ఉదాహరణార్థము కొంతలోకొంత పేర్కొనదగినవి కొన్ని చూపబడినవి అంత మాత్రమే.

## 111 వ్యూహములు

భారతయుద్ధమునకు సంబంధించి ప్రస్తావింపబడవలసిన మరొక యంశ మున్నది అది వ్యూహముల పన్నకము భారతయుద్ధమున వ్యూహముల ప్రయోజనము మొదలైన విశేషాంశముల నొకచో శ్రీ ఖండవల్లి లక్ష్మీ రంజనముగారు వ్రాసిరి [1] మరియు శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిగారును "భారతయుద్ధమున వ్యూహనిర్మాణమే అత్యద్భుతమైనది. అతిప్రధానమైనది. ఇది సంస్కృతభారతమునకంటె నాంధ్రభారతమున వివిధ విచిత్ర విన్యాస ములతో వర్ణింపబడినది తిక్కన సోమయాజి మహాసేనానియై పెక్కు యుద్ధ రంగముల స్వయముగా ఖాల్గొని యుండుటచే నీ యుద్ధరంగము నిట్లు తీర్చి దిద్దెనో యనిపించును-"[2] అని వ్రాసిరి యుద్ధపర్వములను బరిశీలించిన మీదట, భిన్నములైన వ్యూహముల ననుసరించి యుద్ధముగూడ భిన్నముగా వర్ణింపబడి నట్లనిపించుటలేదు. మరియు నొకటి రెండు వ్యూహములు తప్ప మిగిలిన వంతగా ప్రయోజనకారులైనట్లుగా తోచుటలేదు. సంస్కృతభారతమును మించి వ్యూహము లీ యాంధ్రభారతమున చిత్ర విచిత్ర విన్యాసములతో వర్ణింపబడిన వను విషయమును విచార్యముగా కనిపించుచున్నది.

---

1 The Vyuhas in Mahabharata and their significance.

2. ఆంధ్రమహాభారతోపన్యాసములు-పుటలు 179, 180.

మొత్తము పదునెనిమిది దినములు జరిగిన భారతయుద్ధమున, ఒకటి, మూడు, ఐదా రేడెనిమిది, పదునొకండు, పన్నెండు, పదునారు దినములందు మాత్రమే కౌరవపాండవు లిరువురును వ్యూహములు పన్నుకొన్నది నాలుగు, పది, పదునైదు దినములం దసలు వ్యూహములులేవు తొమ్మిది, పదమూడు, పదునాల్గు, పదునెనిమిది దినము లందొక్క కౌరవులే వ్యూహములు పన్ను కొనిరి పాండవులు కేవలము రెండవనాడు, పదునేడవనాడు వ్యూహములను పన్నిరి ఈ యిన్ని దినములందును పన్నబడిన వ్యూహములు – మానుష – అచల–క్రౌంచ – గరుడ – అర్ధేందు – మకర – శ్యేన – మండల– వజ్ర–కూర్మ- శృంగాటక – సర్వతోభద్ర – శకట – మండలార్ధ – చక్ర – సూచీ – దుర్జయ నామకములు. క్రౌంచవ్యూహము రెండవనాడు పదునొకండవనాడు పాండవుల చేతను, ఆరవనాడు కౌరవులచేతను పన్నబడినది మూడవనాడు మరియు పన్నెండవనాడు కౌరవులు గరుడవ్యూహమును తీర్చిరి మకరవ్యూహమును నైదవనాడు పదునారవనాడు కౌరవులును, ఆరవనాడు పాండవులును పన్నిరి. అర్ధేందువ్యూహ మొక్క పాండవులచేతనే మూడవనాడును మరియు పదునారవ నాడును పన్నబడినది. చక్రశకటవ్యూహములు పదునొకండు, పదుమూడు పదునాల్గు దినములయందు కౌరవులు పన్నుకొనిరి తొమ్మిదవనాడును పదు నెనిమిదవనాడును సర్వతోభద్రవ్యూహము కౌరవులచేత పన్నబడినది – క్రౌంచమకరవ్యూహములు రెండు మాత్రమే కౌరవపాండవు లుభయులును పన్నిన వ్యూహములు.

క్రౌంచవ్యూహమునుగూర్చి (శ్రీ) లక్ష్మీరంజనముగారి వ్యాసమున నిట్లు వ్రాయబడియున్నది – The krauncha is the heron. It has a powerful beak and long legs Therefore Arjuna with Sikhandi was placed in the beak, opposite to Bhishma.... On this day the Kauravas fled before Arjuna" (Page 10). క్రౌంచవ్యూహమున చుంచుత్వంబు భజించియుండువాడు చాల గట్టివాడు కావలయుననియు, అట్టివానిచేత శత్రుసేనలు సులభముగా చిందరవందర చేయబడగలవనియు పై వాక్యము తాత్పర్యమును మనమూహింపవచ్చును రెండవనాటి యుద్ధమున చుంచుత్వంబు భజించు అర్జునుడు కౌరవసేనలను కల చిన మాట నిజమేగాని, ఆరవనాడు భీష్ముడు, పాండవుల మకరవ్యూహమునకు

"ప్రతివ్యూహం బూహించి క్రౌంచ వ్యూహంబమర్చి యందు జంచువునం దాను గురుసహాయుండై నిలిచి"[1] న వాడయ్యెను, తాను శత్రువులను పిలుకుమార్చ కుండుట యటుంచి, భీముడు కురుకుమారులను నురుమాడుటనుగూడ వారించ లేకపోయినాడు రెండవనాటి యుద్ధమున నర్జునరూపమున నున్న క్రౌంచపక్షి ముక్కు బలవతి యైనట్లుగా నారవనాడు భీష్ముని రూపముననున్న క్రౌంచము ముక్కు బలవతికాదు. ఇపు డిట్లనవచ్చును భీష్ముడు చాల గట్టివాడే. క్రౌంచ వ్యూహమున చంచుత్వంబు భజించిన వానికి లెస్సగా విజృంభించుటకు వీలున్నది కాని భీష్మునకు పాండవులయందు వాత్సల్య మధికముగనుక విజృంభింపలేదు. అయినచో కౌరవుల పక్షమున వ్యూహరచనకు ప్రయోజనము లేకనే పోవు చున్నది అదియునుగాక ద్రోణుని మొదటినాటి యుద్ధమున పాండవులు క్రౌంచ వ్యూహమును పన్నుకొనిరి. అందగ్రభాగమున నర్జునుడేయున్నాడు అగ్ర భాగమనగా ముక్కనియేగదా అర్థము నిజమున కానాటి యుద్ధమంతయు ధర్మ జునియొక్క ఉత్సాహమును చుట్టుకొని యున్నది ఆనాడు చివరకు ద్రోణుడు తన సూతునితో "చలమేది కౌరవసైన్యముల్ వాఱెడు ధర్మనందనుని యుద్ధండవృత్తిఁ గంటె? యీతని దాఁకి గర్వంబు మాన్పక నిలిచిన నిమ్మూకఁ నిలుచునెట్లు?" అని యనినాడు ఆనాడు ధర్మరాజు చంచుత్వంబు భజించి లేడు నడుమ నున్నాడు. కాని వాని యుద్ధతియట్లున్నది. "ధర్మజుం డురవడించి నాడని, కౌంతేయముఖ్యుండు కౌరవసంఘంబు కలంచినాడని, కౌంతేయాగ్ర జుండు కడంచి యురవడించినాడని,"[3] ఆనాడు ధర్మజుని గురించి చెప్పబడి యున్నది మరియు చిత్రమైన విషయమేమనగా నర్జునుని విజృంభణ మానాడే మియును చెప్పబడలేదు చిట్టచివరకు ద్రోణుడు ధర్మజుని తాకగా నర్జునుడు వచ్చి యడ్డుపడినాడని మాత్రము చెప్పబడినది అంతకుమించి యర్జునుని ప్రసక్తి ఆనాటి యుద్ధమున పేర్కొనదగినట్లుగాలేదు ఇట్టి యన్నింటినిబట్టి చూడగా నీ వ్యూహముయొక్క ప్రయోజనమునందు దృష్టియుంచి, చంచు త్వంబు భజించినవాని యేపును వర్ణించుటను తిక్కన్నగారు పెట్టుకొనినట్లు చెప్పుటకవకాశము కన్పించుటలేదు.

---

1. భా. భీష్మ. 2-344
2. భా. ద్రోణ. 1-199.
3. భా ద్రోణ. 1-148, 193, 198.

ఇంకను గరుడవ్యూహము పొసగియున్నది. మూడవనాటి యుద్ధమున భీష్ముడు గరుడవ్యూహమును పన్ని తా నగ్రభాగము నిలిచి తెస్సగా విక్రమించి నాడు. ఆనాటి భీష్ముని తీవ్రతకు శ్రీకృష్ణుడు చక్రము పట్టుకొని రంగమునకు దిగవలసివచ్చినది. మరియు పన్నెండవనాడు ద్రోణుడు గరుడవ్యూహమును పన్ని తానగ్రభాగమున నిలిచి గట్టిగా యుద్ధము చేసినాడు. నాటి ద్రోణుని యుద్ధము ను వినుచున్న "ధృతరాష్ట్రుం డచ్చెరువడి యిట్లు పేర్చిన యాచార్యు శౌర్యభుజవీర్యంబులు సైరింప నక్కడ నెవ్వరు లేరై రిగదే—"[1] అని సంజ యునితో ననినాడు. ఇట్లు గరుడవ్యూహము భీష్మద్రోణులచేత పన్నబడి శత్రు వుల నుచితరీతిని నాశనము చేయుటకు వారు విక్రమించుట కనుకూలపడి నట్లుగా తిక్కన్నగారు వ్రాసినారుగాని క్రౌంచవ్యూహము విషయమున నిట్టి సమతను కాపాడలేదు

మరియు నర్ధేందువ్యూహముతో మూడవనాడు పాండవులు భీష్ముని నెదుర్కొనలేక పోయిరి పదునారవనాడదియే వ్యూహముతో కర్ణుని నెదు ర్కొని నాటికి విజయము దమదే అనిపించుకోగలిగిరి. ఆ పదునారవనాడు కర్ణుడు మకరవ్యూహమున నిలిచినాడు. ఐదవనాటి యుద్ధమున మకరవ్యూహ మును పన్నిన భీష్ముడు కర్ణునివలె కాలేదు. ఆరవనాడు పాండవులు మకర వ్యూహముతో కౌరవులను నాటి కోడించిరి ఒక మకరవ్యూహము కర్ణు నోడించినది భీష్ము నోడించలేదు. పాండవులకు విజయమును గూర్చినది. ఈ రకముగానున్న భారతమున వ్యూహముల ప్రయోజన మిదమిత్థమని నిర్ణయింప రాకున్నది వ్యూహములసలు నిష్ప్రయోజనము లనుట ఉద్దేశముకాదు భార తమున ఫలానా వ్యూహము ఫలానా ప్రయోజనముతో సర్వత్ర చెప్పబడినదని చూపించుట కాస్కారము లేదనుట ఉద్దేశము

వ్యూహప్రయోజన మెట్లు నిర్ధారణ చేయరాకున్నదో అట్లే ఆ యా వ్యూహములనుబట్టి యుద్ధవర్ణనమున వైవిధ్యమున్నట్లును చెప్పుటకులేదు శ్రీశేషశాస్త్రిగారు చెప్పినట్లే ఆంధ్రభారతమున వ్యూహరచనావిధాన మేమియు విచిత్రముగా వర్ణింపబడియున్నట్లు కానవచ్చుటలేదు. ఏడవనాటి యుద్ధమునందు కౌరవపాండవులు పన్నిన మండల వజ్రవ్యూహములలో మూల

1. భా. ద్రోణ 1-300.

మున మండలవ్యూహము కొంత విపులముగా వర్ణింపబడియున్నను[1] తిక్కన్న గారు "అందు నడుమ నరనాథుం డొప్పియుండెఁ దమ్ములుఁ జేయంగల దొర లును సూరెలనిలిచిరి'' అని మాత్రమే వ్రాసిరి ఎనిమిదవనాటి కూర్మ శృంగాటక వ్యూహములు మూలమున విపులముగా చెప్పబడినవి[2] తిక్కన్నగారూరక వారా యా వ్యూహములు పన్నుకొనినారని వదలిరి పద్మవ్యూహము విష యమును నిట్లే మూలమున విపులముగా వర్ణింపబడియున్ననను[3] తిక్కన్నగా రొకటి రెండు వాక్యములలో ముగించిరి. విషయమిట్లున్నపుడు మూలమును మించి చిత్రవిచిత్ర విన్యాసముతో నాంధ్ర భారతమున, తిక్కన్న సోమయాజి మహాసేనానియై పెక్కు యుద్ధరంగముల స్వయముగా బాల్గొనియుండుటచే నేదియో చేసినట్లనుమానించుట కవకాశములేదు వ్యూహములనుబట్టి యుద్ధ వర్ణనమున వైవిధ్యమునులేదు అయినను నీ విషయమింకను బరిశోధించుట లెస్స - ఇదంతయు ప్రధానమైన భారతయుద్ధము విషయము

## IV. రెండు కొద్దిపాటి యుద్ధములు

భారతమునయందీ ప్రధానయుద్ధమునకు ముందు వెనుకలుగా నర్జున ప్రాధాన్యము గలిగిన రెండు కొద్దిపాటి యుద్ధములున్నవి. ఒకటి విరాటపర్వ మున నుత్తరగోగ్రహణకాలమున కౌరవులతో నర్జునుడు చేసినది రెండవది యశ్వమేధపర్వమున ధర్మజుని యజ్ఞాశ్వము వెంటపోవుచు గుఱ్ఱము నడ్డగించిన సైందార్గురు రాజకుమారులతో నర్జునుడు చేసిన యుద్ధము. నిజమున కా రెండును పెద్ద చెప్పుకొనదగిన యుద్ధములుకావు.

విరాటపర్వమున దుర్యోధనుడు యుద్ధము చేయవలయునని వచ్చినవాడు కాడు. మరియు గోవులకొరకును వచ్చినవాడును కాడు. పాండవుల అజ్ఞాతవాస వ్రతమును భంగము చేయవలయునని వచ్చినాడు. అర్జునుడు కనిపించగనే భీష్ముడు అజ్ఞాతవాస సంవత్సరము పూర్తియైనదని చెప్పినాడు దుర్యోధనుడు నిరుత్సాహపడియు నభిమానముకొరకు యుద్ధమునకు దిగినాడు. భీష్మాదు లెవ్వరికి గాని నర్జునునితో నంతగా యుద్ధము చేయవలయుననిలేదు. దుర్యో

1. శ్రీమహాభారతే-భీష్మపర్వణి. అధ్యా. 82. శ్లో. 12-21.
2. శ్రీమహాభారతే-భీష్మపర్వణి. అధ్యా. 88. శ్లో. 2-22.
3. శ్రీమహాభారతే-ద్రోణపర్వణి. అధ్యా 34. శ్లో. 13-24.

ధనునివలన కష్టములపాలయి, పూనిక నెరవేర్చుకొన్న యుత్సాహము క్రోధము కలవాడగుటచేతను, గోవులను మరలించుకొని పోవుట యన్న ఆనుషంగిక ప్రయోజనము ముఖ్యముగా గలవాడగుటచేతను, అర్జునుడే విజృంభించి యుద్ధముచేసినాడు. కర్ణున కర్జునుడన్న ద్వేషము రక్తవిష్టమై యున్నట్లున్న గుణము కనుక నాత డెదుర్కొనినాడు. అది కొద్దిగా వర్ణింపబడినది. భీష్మద్రోణాశ్వత్థామాదులు విడివిడిగా నర్జునునితో పోరినట్లుగా వర్ణింపబడినదిగాని, అందరును కలిసి వాని నెదుర్కొనినట్లు చెప్పబడలేదు ఉత్తరగోగ్రహణ యుద్ధము నందరును నర్జునునిచేత నెదుర్కొనబడువారేగాని, వాని నెదుర్కొను వాడొక్కడును లేడు కేవల మర్జునుని పరాక్రమమే కొంత సూచింపబడినది ఎంతయైనను నొంటిచేతితో చేయబడు చప్పుడువలెనే అర్జునుని యుద్ధమున్నది

అశ్వమేధపర్వమునందలి యుద్ధము, చేయవలయునని మనస్సునలేక చేసిన యుద్ధము. ముందుగనే ధర్మరాజు ఎవరితోడను యుద్ధము చేయక సాయముమీద, మైత్రిపాటించి వ్యవహారము చక్కబెట్టుకొని రమ్మని చెప్పి పంపినాడు. గుఱ్ఱము వెంటబోవు నర్జునుని ప్రయత్నమంతయు నదియే. అనివార్యముగా కొందరతో యుద్ధము చేయవలసివచ్చినది అది వారిని భయపెట్టి అనుకూలముగా చేసికొనుటకు చేసిన యుద్ధమేగాని మరొకటి గాదు.

గుఱ్ఱము నడ్డగింపవచ్చిన వారందరితోడను ధర్మరాజు తనను బంపుచు చెప్పిన మాటలు చెప్పి యుద్ధము లేకుండ జూచుకొనుచున్నను, కొందరా మాటలను పెడచెవులను బెట్టిరి వారితో యుద్ధము తప్పనిసరియైనది సూర్యవర్మాదులతో మొదట నట్టి యుద్ధమైనది. సూర్యవర్మ తమ్ముడు ధృతవర్ముడు అర్జునుని చేతి గాండీవమును జారగొట్టినాడు. చివరకు వారి నర్జును డోడించినాడు ఆ తరువాత వజ్రదత్తునితో యుద్ధము చేయవలసివచ్చినది వజ్రదత్తుడు భగదత్తుని కుమారుడు. వానితో యుద్ధము నాల్గుదినములు పట్టినది అర్జును డల్పకోపసుందరుడై వాని నోడించినాడు ఆపైనైనది సైంధవులతో యుద్ధము. ఒకసారివారు పైబడగా నర్జునుడు తట్టుకొనలేకపోయినాడు గాండీవము చేతినుండి జారిపోయినది. నెమ్మదిగా తేరుకొని అర్జునుడు వారిని తక్కువచేసినాడు అంతలో దుశ్శలాదేవివచ్చి అర్జునునకు తన మనుమని జూపించి యేడ్చినది. ఆడకూయి అర్జునునకు జాలిపుట్టించినది. యుద్ధము చాలించి యశ్వమును తోలుకొని పోయినాడు. బభ్రువాహనుని మాత్ర మర్జునుడు తనతో యుద్ధము

చేయ రప్పించుకొనినాడు జరాసంధుని మనుమడు యజ్ఞాశ్వమును బట్టుకొనగా స్వల్పయుద్ధమైనది శకుని పుత్రునితోగూడ నామమాత్రమే యుద్ధమైనది.

బభ్రువాహనుడు చిత్రాంగదయం దర్జునునకు బుట్టినకుమారుడు. వాడు విక్రమింపకవచ్చి నమస్కరించగా రాజకుమారుడు యజ్ఞాశ్వమున కడ్డమువచ్చి పట్టుకొని తేజమును జూపవలయును గాని మెత్తబాటు జూపుట తగదని యర్జునుడనగా నాతడు చిన్నబుచ్చుకొనిపోయి ఉలూపి ప్రేరణమున తిరిగి యుద్ధమునకు వచ్చినాడు ఆ యుద్ధమున తండ్రికొడుకు లేకకాలమున మూర్ఛపోయినారు. కొంతసేపటికి బభ్రువాహనుడు తేరుకొనినాడుగాని అర్జునుడు తేరుకొనలేదు. చిత్రాంగదయొక్కయు, బభ్రువాహనునియొక్క యు దుఃఖించుటను జూచి ఉలూపి అర్జునుని సంజీవమణి ప్రభావమున పునర్జీవితుని జేసినది.

అర్జునుడు కుమారుని నిందించి తనతో యుద్ధముచేయ రమ్మనుట రాజ ధర్మ ముపదేశించు లక్షణముగా కనిపించుచునే యున్నది ఉలూపి బభ్రు వాహనుని యుద్ధముచేయబో ప్రోత్సహించుటకొక కారణము నామెయే చెప్పినది. శిఖండి నడ్డము పెట్టుకొని భీష్ముని తెగటార్చిన పాపమున కర్జును డనుభవించవలసిన నరకదుఃఖము, బభ్రువాహనునిచేత యుద్ధమున పడగొట్టబడి నచో బోవునని వసువు లామె తండ్రితో చెప్పినారట. అందుకొరకామె బభ్రు వాహనుని నర్జునితో యుద్ధముచేయ ప్రోత్సహించినదట అర్జునునకు నరకవాసము లేకుండజేయుట కా ఉలూపి చాల ప్రయత్నము చేసినది. ఆమె చెప్పినదాని ప్రకార మర్జునుడు బభ్రువాహనునిచేత యుద్ధమున కూల్చబడినాడు గనుక నరక వాసము లేనివాడు కావలయును. కాని స్వర్గారోహణపర్వమున భీమాదులతో పాటర్జునుడును కొంతకాలము నరకవాసము చేసినట్లు చెప్పబడియున్నది. (ప. 28). ఉలూపి మాటనిలువ బడుటలేదు - అదియట్లుండె

విరాటపర్వమునందలి యుద్ధ మర్జునుని యుత్సాహమును ప్రకటించునది యై భారతయుద్ధమున నర్జునుని పరాక్రమించుట కొక విధముగా నాంది రూపమున నున్నది. అశ్వమేధపర్వమునందలి స్థితి భిన్నమైనది. చిత్తము శాంత మైయున్నది. మరియు నర్జునుని పరాక్రమముయొక్క క్షీణదశకు నాంది రూపముననున్నది. అల్పసత్త్వులయిన వారిచేతిలో నోడిపోవుస్థితి యిట సూచింప

బడినది. గాండీవము చేతిలో నిలువబట్టుకొనలేనిస్థితి కల్పింపబడినది. మౌసల పర్వమున నర్జునుడు బోయలనుండి యాదవాంగనలను రక్షింపలేకపోవుట కీ యశ్వమేధమునందలి యుద్ధవిషయము భూమికాప్రాయముగానున్నది. ఇది చివరదశకు మొదలు. కనుకనే తిక్కన్నగారీ యుద్ధవర్ణనము చాల తక్కువ గాను మరియు తేలికగాను చేసిరి.

ఈ విధముగా నీ రెండు కొద్దిపాటి యుద్ధములును అర్జున ప్రాధాన్యము గలిగి, భారతయుద్ధమునకు ముందు వెనుకల యందుండి ఒక విధముగా దాని కుపోద్ఘాతోపసంహారములవలె కనిపించుచున్నవి

# పంచమోన్మేషము

## 1. శాంతిత్రయము

భారతమునందలి శాంత్యనుశాసనాశ్వమేధపర్వములు శాంతి త్రయ మను ప్రసిద్ధితోనున్నవి. ఇందు ప్రధానమైనకథ యేమియులేదు ధర్మజుని చిత్తమును కుదుటపెట్టుటకు ప్రవర్తించిన ధర్మతత్త్వ విషయములతో నీ పర్వము లున్నవి. ముఖ్యముగా శాంత్యనుశాసనములు. మొదలు యుద్ధమైపోయి నప్పటినుండియు కథ కేవల మేకపక్షము నాశ్రయించుకొనినదై కొనసాగి నందున తీవ్రతలేదు. కనుక నీ శాంతిత్రయమునందుగాని, తరువాతి ఆశ్రమ వాసచతుష్టయమునందుగాని సాధారణముగా కథను నడిపించుకొనిపోవుటయే తిక్కన్నగారు చేసినది విశేషమైన శిల్ప ప్రదర్శనమున కవకాశముకాని, అవ సరముకాని లేనిపర్వము లివి.

శాంతిపర్వము మనశ్శాంతి ప్రదము. అనుశాసనపర్వము విధినిషేధము లతో కర్మను ప్రతిపాదించినది అశ్వమేధము కర్మను యజ్ఞముగా-ననగా నదియు నొక తపముగా నిరూపించినది మనశ్శాంతి జ్ఞానమువలన కలుగును. కర్మమునందు ప్రవృత్తి ధర్మనిర్ణయము ననుసరించి జరుగును ధర్మబద్ధమైన కర్మయే యజ్ఞము జ్ఞానమువలన ధర్మముయొక్క స్వరూపము సుష్ఠుగా తెలియును ధర్మస్వరూప మెరిగిన తరువాతి కర్మపరత యజ్ఞలక్షణము కలది యగును. యజ్ఞము ద్రవ్యజ్ఞానపూర్వకమై ద్వివిధాభూతము ద్రవ్యయజ్ఞ మధ్వ రము. అధ్వరమనగా వైదికమార్గము నిచ్చునది యర్థము. వైదికమార్గమనగా జ్ఞానమే అనగా ద్రవ్యయజ్ఞము చిత్తశుద్ధిప్రదమై జ్ఞానమునకు హేతువగు చున్నది మరి జ్ఞానయజ్ఞమేమనగా జ్ఞానముద్వారా యః=ఎవడు జ్ఞ=తెలియ దగినవాడో వానిని తెలిసికొనుట జ్ఞానయజ్ఞము. లేక జ్ఞానము ద్వారా ఎవడు తెలిసికొనుచున్నాడో అని కూడ చెప్పవచ్చును. తెలిసికొనుట యాత్మస్వరూ పమునే. అట్లాత్మను తెలిసికొనుటకు ప్రవర్తించు మార్గమే యజ్ఞము. ఆ మార్గము ద్రవ్యరూపమునను, జ్ఞానరూపమునను నున్నది. మరియు జ్ఞానయజ్ఞ

మనగా కర్మఫలాభిసంధిరహితమైన కర్మపరత యనియు చెప్పవచ్చును. అది లోక సంగ్రహణార్థము. ఏది శ్రేష్ఠుడైనవాడాచరించునో దానిని మిగిలిన సామాన్యులాచరింతురు.

ధర్మరాజు ప్రజాపాలన చేయవలసినవాడు. అట్టి ధర్మరాజు యుద్ధమైనప్పటినుండియు, నిర్వేదమునుపొంది రాజ్యభార నిర్వహణాదికమునందు వైముఖ్యమును ప్రదర్శించినాడు. యుద్ధమువలని బంధుమరణ శోకము స్త్రీపర్వమున స్థాయికెక్కినది దాని ప్రభావమంతయు ధర్మరాజుమీదనే పడినది స్త్రీపర్వము విషయ మంగరసములనుగూర్చి చెప్పుచు వచ్చును కనుక నిట వ్రాయబడలేదు. ఆ శోకముచేత వ్యాకులితేంద్రియుడై ధర్మరాజు నాకు రాజ్యమే అక్కరలేదనగా నందరును నన్నిమాటలు చెప్పి సింహాసన మెక్కించినారు అయినను వాని చిత్తము నందలి శోకము పోలేదు అపుడు శ్రీకృష్ణుడు భీష్మునివద్దకు తీసికొనివచ్చి "శోకోపహత బహుశ్రుతుండగు నితండు తెలివొందునట్లుగా ధర్మార్థసమాధి యుక్తంబులగు నుక్తివిశేషంబుల ననుగ్రహింపవలయునని చెప్పగా భీష్ముడు ధర్మజున కుపదేశము చేసినాడు. ఈ యుపదేశమంతయు ధర్మజుని ప్రవృత్తిమార్గమును పట్టించుటకే ప్రవర్తించినది ఇచట ప్రవృత్తియనగా ఫలాభిసంధిరహితమైన ప్రవృత్తియని యర్థము అట్లు ధర్మరాజు ప్రవర్తించినగాని లోకము వానిననుసరించి నడుచుకొనదు. అందువలన ధర్మరాజు చిత్తమునందు శాంతినిలయము చేయబడి, ధర్మాధర్మములయందు ప్రవృత్తినివృత్తులను నిష్కర్షించి, తచ్చిత్తమును యజ్ఞాత్మకమైనదిగా నందు ప్రవేశపెట్టబడుట నాశించి ఈ శాంతిత్రయము భారతమున ప్రవర్తించినది.

ధర్మరాజు చిత్తము శాంతిని కోల్పోవుటకు ప్రధానకారణము యుద్ధము కనుకనే శాంతిపర్వమున మునుముందు భీష్ముడు రాజధర్మస్వరూప మిట్టిదని బోధించినాడు రాజనీతి దండనీతి గర్భము. యుద్ధము దండనీతియందలిది ఆ ధర్మము నుపదేశించుటగా భీష్ముడు, క్షత్రియధర్మము యుద్ధము చేయుటయే అనియు, కనుక చేసిన యుద్ధమునుగూర్చి విచారింప నక్కరలేదనియు ధర్మరాజునకు తోచునట్లుగా చేసినాడు. యుద్ధము రాజధర్మమే అయినను, అనగా ధర్మజుని బుద్ధి యుద్ధముచేసిన విషయమున స్థిమితపడినను, ఆ యుద్ధమున మరణించిన వారందరును కావలసినవారగుటచేత శోకము మాత్రము వాని చిత్తమును వదలలేదు. ఆ శోకమునపనయించుటకు మోక్షధర్మ కథనమును

భీష్ముడు చేసినాడు మోక్షధర్మమంతయు - దేహాత్మ భ్రాంతి మంచిదికాదు - వీడు బంధువు వీడు శత్రువు అను నిది దేహము నాశ్రయించినది - దేహము శాశ్వతముకాదు, ఆత్మ శాశ్వతము - అది యేకము - తదతిరిక్తముగా మరొకటి లేదు గనుక దానిని చంపుటకు మరొకటి యుండుటకే వీలులేదు - ఆ యాత్మ స్వరూపమును తెలిసికొన్నవానికి దుఃఖములేదు - అది తెలియబడుటకు సర్వ విషయములయందును నిర్మమత్వ ముండవలయును సంసారమున మమకారము జ్ఞానమున కాటంకము. కనుక సంసారరూపమైన బాంధవ్యమునందు మమకార ముండరాదు మమకారమే దుఃఖమునకు మూలము - అను ఈ మొదలైన వాక్యార్థములనే బహువిధముల ప్రపంచించి చూపును. సాంఖ్యయోగాదు లన్నియు నీ మోక్షధర్మములోనివిగనే ప్రవర్తించినవి ఇదంతయు ధర్మరాజు శోకము నపనయించుటకొరకైనది

ఈ మోక్షధర్మ విషయమంతయు నివృత్తి మార్గము ఈ విషయము బుద్ధికెక్కినపుడు శోకము నశించునుగాని విరక్తి పుట్టును. శాశ్వతముకాని, అజ్ఞానాత్మకమైన సంసారమునబడి కర్మలు చేయుచు వాటి ఫలము లనుభవించు టకు తిరిగి తిరిగి పుట్టుచు దుఃఖమునేల పొందవలయును ? ఈ సంసారమును త్యజించుటయే మేలు కనుక రాజ్యపాలనాది కార్యములయందు ప్రవర్తింప కూడదను చిత్తవృత్తి ధర్మజునియందు బయలుదేరుట నరికట్టుటకొరకు, వేదము ధర్మము నిట్లు చెప్పినది. మానవు లీయీ విధములుగా కర్మలుచేసి మోక్షమును పొందవలయును. స్వధర్మానుష్ఠానమును వదలరాదు అది పాప హేతువు కనుక స్వధర్మమును తప్పక చేయవలయును. రాజు సర్వధర్మములను నిలబెట్టుటయే ధర్మముగా గలవాడు. అందుకొరకే రాజు సృష్టింపబడినాడు - వేద ప్రతిపాదితమైన ధర్మస్వరూపమిట్టిది - అని బహుముఖముల భీష్ముడు ధర్మ రాజున కుపదేశించినాడు. ఈ యుపదేశమంతయు ననుశాసన రూపమున ప్రవర్తించినది

ఆత్మజ్ఞానముకలిగి, ధర్మస్వరూపము తెలిసినవాడు, కర్మచేయవలయును. ఆ కర్మయజ్ఞమగును వేదవ్యాసుడు, శ్రీకృష్ణుడు ధర్మరాజుచేత నశ్వమేధ యజ్ఞము చేయించినారు. ఈ యుదంతమంతయు నశ్వమేధపర్వమునందున్నది - ఇది స్థూలముగా శాంతిత్రయము యొక్క వైలక్షణ్యము. భారతేతిహాస నాయ

కుడైన ధర్మజుని చిత్తమును సంస్కరించుకొరకు ప్రవర్తించిన గ్రంథము శాంతిత్రయము

గురులను బంధుమిత్రులను క్రూరశరంబుల గూల్చి నుగ్రతన్
నరుల ననేకకోటుల రణంబున దా దెగటార్చెగాన యి
క్కురుపతి నీ సమక్షమునకుం గదియం బయిలోడెడుం గృపా
విరహిత కార్యకర్మరుడు వీడని యాడుదొాయన్ తలంపునన్.

శ్రీకృష్ణుడు 'ధర్మరాజు నుద్దేశించి భీష్మునితో నన్నమాటలవి నన్నేమి యడుగ దలచెనో ధర్మరాజడుగుగాక యనినాడు భీష్ముడు ధర్మరాజు మాటాడలేదు. అపుడు శ్రీకృష్ణుడు పై విధముగా ననినాడు అనగా ధర్మరాజుయొక్క శోకమోహములు భీష్మున కెదురుపడి మాటాడలేనంత దైన్యమును కూర్చిన వన్నమాట. శ్రీకృష్ణు డా పద్యమున వెలిబుచ్చిన ధర్మరాజుయొక్క ఆంతర్యము, ధర్మజుని అప్పటి మనస్థితిని చెప్పుచున్నది. ఇంతమందిని చంపి, ఈ రక్తపుకూటి కాశపడి, ఇంత నైచ్యమున కొడిగట్టిన తానెట్లు తాతగారితో మాటాడవలయునో బోధపడని లజ్జాభిమానములతోకూడిన కుంచుకపోయిన స్థితిలో ధర్మరాజున్నాడు ఆ స్థితిలక్షణము శ్రీకృష్ణునిచేత వ్యక్తీకరింపబడినది. ఆ శ్రీకృష్ణుని చెప్పిన దానిమీద భీష్ముడే ధర్మరాజు యుద్ధముచేయుట పరమ ధర్మమని చెప్పగా, నపుడు కృతాంజలియై ధర్మరాజు భీష్ముని సమీపించినాడు

ధర్మవిదులు రాజు ధర్మస్వరూపుఁగాఁ
జెప్ప విందుఁ దద్విశేషవృత్తి
భరముగాఁ దలంతు నరవర ! చెప్పవే
మున్ను రాజధర్మముల తెఱంగు

ఇవి ధర్మరాజు భీష్మునితో నన్నమాటలు. రాజు ధర్మస్వరూపుడని చెప్పబడినది. నేను వినినాను. కాని తద్ధర్మము భారముగా ననిపించుచున్నది ఆ యనిపించుట పోవునట్లుగా రాజధర్మముల యాంతర్యమును నాకు వివరించి చెప్పుము – ఇది ధర్మరాజడిగినది. భీష్ముడు చెప్పుట ప్రారంభించినాడు ధర్మరాజు మధ్యమధ్య ప్రశ్నించుచుండుటయు, భీష్ముడు చెప్పుటయుగా శాంతిపర్వము తృతీయాశ్వాసాంతము వరకు జరిగినది రాజధర్మము లన్నియు విశదములైనవి ఆ తరువాత ధర్మరాజు "నాకు సకలభూజన పరమహిత ధర్మముఁ దెలుపు" మని యడిగి

నాడు మరియు నది యుత్తమముగా నుండవలయుననినాడు. అనగా నంతకు పూర్వము చెప్పబడిన ధర్మములకంటె, సర్వజనులకు హితమైనదియు, ఉత్తమమైనదియునైన ధర్మము నడిగినట్లు అంతకు పూర్వము చెప్పబడినవి అధికముగా రాజధర్మములే. రాజధర్మములు సర్వజన హితములుకావు పైగా నది కేవలము ప్రవృత్తి ధర్మము మోక్షము పరమపురుషార్థము దానిని ప్రతిపాదించు ధర్మమే యుత్తమము. అందువలన ధర్మరాజట్లడిగినాడు రాజధర్మములు సమర ధర్మసముపేతములగుట మూలముగా నా యుద్ధవిషయము ధర్మరాజునకు స్వధర్మమని బోధపడినను బంధుమరణ శోకమట్లే యున్నది. ఇట్టి శోకరూపములైన ఈ రాజధర్మముల కేమిగాని యుత్తమధర్మము చెప్పుమన్నట్లుగా ధర్మరాజడిగినాడు. ఈ ధర్మజుని చిత్తవృత్తి ననుసరించియే చతుర్థాశ్వాసము ప్రారింభింపబడినది

భీష్ముడుత్తమధర్మము, ఆత్మ మోక్షావలంబియైన ధర్మమని సేనజిత్తు విషయముతో మొదలుపెట్టినాడు. సేనజిత్తు పుత్రశోకార్తుడు. వానికి తదాప్తుడైన విప్రుడిట్లు బోధించినాడని విషయము సాగినది ధర్మజుని చిత్తము పుత్ర మిత్రాదుల మరణమును స్మరించుచు, దుఃఖాక్రాంతమై యున్నది. అట్టి ధర్మరాజుత్తమ ధర్మమనగా "సేనజిత్తుండను రాజు పుత్రశోకార్తుండై యున్నయెడ" అని మొదలిడుట, ఇప్పటి నీ స్థితి యిదియే సుమాయని భీష్ముడన్నట్లున్నది. మరియు నా విప్రుడా సేనజిత్తుతో నిట్లనినాడని -

ఇదియేమి శోకమున వం
దెదు ? పుట్టినవారికెల్ల తెరు వారయగా
నిదియె భవత్సుతుఁ డొకనికె ?
వదలు వనట మూఢునట్లు వనరందగునే-

అని యనుట కేవలము ధర్మరాజు నుద్దేశించి యనినట్లున్నది. అట్లున్నదని యనుట యేలనగా నా విప్రుడు పింగళయను వేశ్య యుదంతము నిట్లు చెప్పినాడని చెప్పి "నీవును నందలి తాత్పర్యం బనుసంధించి శాంతి నొందు''మని భీష్ముడు ధర్మరాజుతో ననినాడు. ఆ తాత్పర్య మేమనగా తృష్ణాక్షయము. మరణించినవారిమీద నింకను నాశపెట్టుకొని దుఃఖపడుట మానుకొనవలయును. రాజధర్మములు విన్న తరువాతి ధర్మజుని చిత్తము శోకాక్రాంతమైనదని

యూహించుట భీష్ముని అ వాక్యమును బట్టియే. ఈ విధముగా ధర్మజుని చిత్తము శోకవ్యాకులతనుండి తేరుకొని శాంతిసదనమగుట నుద్దేశించి తరువాతి గ్రంథము ప్రవర్తించినది. సాంఖ్యయోగములు, భగవద్భక్తి, యోగసిద్ధుడైన శుకుని వృత్తాంతము మొదలైన బహువిషయములతో గ్రంథము నడచినది.

భీష్ముడు చెప్పిన విషయము లన్నియు విని ధర్మరాజిట్లనినాడు

అనఘ నాదగు చిత్తమునకు శమంబు గా
వించుటకై నీవు వివిధ విశద
భంగుల పరమకృపానిరతుండవై
సకల ధర్మోపదేశములు జేసి
తిమ్మెయిఁ జెప్పగా నించుకయేనియు
శమము లేకున్నది చలముకొని య
నేక బంధుల వధియించితి నది యొక్క
తలయు నీ కలిగిన దారుణత్వ
మొక్కతలయునైన యుగ్రకర్మంబులు
చిత్తవృత్తిఁ గగిలి యుత్తలంబు
జేయ శాంతియెట్లు సిద్ధించు మునిమాన
నీయ యింక యేమి సేయువాడ ! అను 1-3.

ఈ యానుశాసనికము ప్రారంభమున ధర్మరాజే తన దుఃఖోద్విగ్నతను వ్యక్తీకరించినాడు అందుకు భీష్ముడు "వధియింపగా మనుజుడు కర్తగాడు; నీ విందరను వధియించితినే అని దుఃఖపడ నక్కరలేదు పడగూడదు. ఎవరికర్మము ననుసరించి వారు పోవుదురు ఈ మరణించిన వారందరును నట్లు పోయిన వారే "కారు దుర్యోధనుడు నీవు కారణములు బాంధవుల రణమరణ సంప్రాప్తికి వారు తమతమ కర్మముల్ కారణముగ నిట్లయి రేల శోకంబు నీకు?" అనునీ మొదలైన వాక్యములు గౌతమీలుబ్ధకభుజంగ మృత్యుకాల సంవాదమును వినిపించి చెప్పి ఈ ఇతిహాసంబు తాత్పర్యంబు మనంబునం బట్టుకొలిపి యీ పుట్టిన కలంకం దొలంగ శమంబున సుఖవికమ్ము" అనినాడు. భీష్ముని ఈ మాటలు విన్నతరువాత, కర్మననుసరించి మృత్యువుకలుగుచున్నదికదా ! కర్మము గృహస్థాశ్రమము ధర్మముకదా ! మృత్యువును జయించవలయు

నన్నచో గృహస్థవృత్తిని వదలుటయే మార్గము నాకీ రాజ్యము, ఈ గృహస్థ వృత్తి ఇవన్నియును మృత్యుముఖమున పడుటకు మార్గములు నాకివి యక్కర లేదు నే నడవులకు పోవుదును - ఈ మొదలైన వాక్యముల యర్థము భీష్మునకు విన్నవించవలయునని ధర్మరాజున కనిపించినది. అనిపించినదేగాని అనలేదు ఏల ననలేదనగా నంతకు మునుపొకసారి రాజధర్మములు వినుచున్నపుడు ధర్మ రాజా మాట యనగా "ఇది జాడ్యముగాక నృపాల ధర్మమే" అని భీష్ముడు మందలించినాడు. అందువలన ప్రకృతమున ధర్మరాజనలేదు అనినచో ధర్మ జున కట్లనిపించినదని యెట్లు తెలియుననగా భీష్ముడెవరికర్మ ననుసరించి వారికి మృత్యువగునన్న పిదప "గృహస్థధర్మమునయందు జరించి నరుండు మృత్యు సంజనితభయంబు వాపికొనజాలునో ? జాలడో ? అని ధర్మరాజడిగినాడు ఈ ప్రశ్ననుబట్టి ధర్మరాజు హృదయగతార్థ మూహింపబడుచున్నది. ధర్మరాజు లోపలి యూహ యది కానిచో మృత్యువు కథ విన్న వెంటనే ఈ ప్రశ్న పుట్టు టకు వీలులేదు ప్రశ్నపుట్టినది ఆ యూహచేయబడినది భారతమున నీ పర్వ ముల యందన్ని విషయములు సంగతపడి యనుస్యూతముగా నున్నవా యన్న ప్రశ్నలేదు. విషయము సంగతపడుచున్నంతవరకు నర్థము చెప్పనేవలయును

ఆనుశాసనికము గృహస్థాశ్రమవిషయముతో ప్రారంభమైనట్లు చెప్ప వచ్చును. ఆ శ్రమము లన్నింటికిని అది ఆశ్రయణీయము గనుక దానితో మొదలై సర్వవర్ణాశ్రమ ధర్మములును నా పర్వమున చెప్పబడినవి. మరియు సర్వవర్ణాశ్రమ సామాన్యధర్మములు, సాచారములు చెప్పబడినవి. భీష్మా చార్యుని నిర్యాణముతో ఆనుశాసనికము ముగిసినది. భీష్ముని మరణించుట, తిరిగి ధర్మరాజునకు తాను కారణముగా జరగిన యుద్ధము, అందు మరణించిన బంధువ్రాతము- ఈ మొదలైన వన్నియు యథాప్రకారము స్మృతికి వచ్చినవి. ఈ భీష్ముని మరణమునకు తానే కారణమైనట్లును, అట్లే సర్వజ్ఞాతి వధకును తానే మూలభూతుడైనట్లును, ధర్మరాజున కనిపించి చిత్తము పునఃశోక సంతప్తమైనది. కాని ఈ శోకమునకును పూర్వశోకమునకును భేదమున్నది భీష్ముని మొగముజూచి మాటాడుటకు నోరాడని యంత శోకము మొట్ట మొదట. బంధుమరణమువలని శోకము నపనయించగల యుత్తమధర్మమును బోధించుమను శోకము తరువాత ఇంతగా నీవు బోధించినను చిత్తమునకు శాంతి కలుగక ఆ దుర్యోధనుడును నేనును కలసి ఇంత దారుణము చేసినా

మనియే అనిపించుచున్నదన్న శోకము మరియు తరువాత. ఈ మూడురకముల శోకమునకును, అంతస్థులుగా భేదము కనిపించుచున్నది. ఇదంతయు పూర్వ శోకము భీష్మనిర్యాణానంతరము ధర్మరాజుయొక్క శోకస్వరూపము లక్షణ మింకను భిన్నముగా నున్నది "సాత్యవతేయు మొగంబు గనుంగొని దేవా! భవదీయ దయా ప్రేమంబులు నాపై నెప్పుడు నత్యంత గాఢంబులైయుండు. నన్ను బెక్కుభంగుల రక్షించితిరి. ఇటమీద వనంబున కరుగ ననుజ్ఞ యిచ్చుట నాకుం బ్రియమ్ము అరుగని యట్లయినం బితామహాకర్ణులం జంపించిన క్రూర కర్మునకు శాంతియెట్లు గలుగు? అమ్మహాకల్మషం బేమిటం బాయు? అయ్యను ష్ఠానంబు విధియింపుడు" (భా. అశ్వ. 1-11). ఇది ధర్మరాజు వ్యాసునితో నన్నవిధము. ఈ రాజ్యము నా కక్కరలేదు నేనడవులకు బోయి తపస్సుచేసికొని చేసిన పాపముకు నశింపజేసికొందును. అందుకు మీరు నన్నునుమ తింపవలయును మీరు కాదుకూడదన్నచో మీ మాట కెదురుతిరుగను కాని మీరు నాకొక విషయమును చెప్పవలయును. నేను పితామహ, సోదరుల క్రూరుడై చంపించితిని అది యొక మహాకల్మషమువలె నాకు శాంతిలేనట్లు చేయుచున్నది అది కల్మషమన్నబుద్ధి నాకు పోవలయును అందుకు నేనేమి చేయవలయునో అది చెప్పుడు. అది చేసి విగతకల్మషుడనై రాజ్యము చేయుదును. మీరట్టిది చెప్పి నాచేత చేయించినచో చాలును అడవులకే పోవలయునన్న పట్టుదలలేదు నాకు కావలసినది చిత్తశాంతి నేను పాపపంకిలుడను కానన్న నిశ్చయము ఇది మీరు నా కనుగ్రహింపుడు - ఈ చెప్పబడిన దంతయు ధర్మ రాజు యొక్క ఆంతర్యము ఇది యిప్పటి ధర్మజుని చిత్తము నందలి శోక స్వరూపము. యుద్ధము చేయుటయే దోషమనుకొన్న ధర్మరాజు, రాజధర్మ ములను విని, స్వధర్మమును చేసితినని సమాధానపడినాడు బంధువులందరును బోయినారు గదా యను శోకముతోడి ధర్మరాజు, మోక్షధర్మములు విని, ఎవరును నెవరికిని గారు, ఒకరినొక రేమియు చేయలేరు, అంతయు కర్మయే చేయునని, ఆ శోకము నొక విధముగా దిగ్రమింగికొనినాడు దర్మాధర్మ స్వరూప స్వభావ మంతయు విని, ధర్మకర్మ శాంతిప్రదము గనుక, మధ్యమధ్య, నెంతగా సమాధానపడజూచినను పడనీయక స్మృతికి వచ్చు బంధువుల వధవలని భయమునుండి విముక్తుడగుటకు తగిన కర్మము నుపదేశించి తనను శోకముక్తుని చేయవలసినదిగా కోరినాడు ధర్మరాజు. శోకము నిరస్తమగుటలోని క్రమ పరిణతి యది.

ధర్మజుని చిత్తమున శోకము నిరస్తమగుచున్నది పూర్తిగా నైనదిలేదు. ధర్మరాజడిగిన ప్రశ్నలోని అంతర్యమును వ్యాసుడు గ్రహించి ఇట్లనినాడు

నిష్ఠించి యిబ్భంగి నీ కేము సెప్పిన
వాక్యంబు లెల్లను వరద గాఁ సి
పోయెనే ? నీ దగు బుద్ధియిం తొప్పదో
గాక - మర్త్యుడు గాడు కర్త-యీశ్వ
రుని నియోగమున మేలును గీడు నొనరించు
గాన నీ మది బాపకర్మశంక
గలిగె నేనియును యాగముల దానంబుల
నది వాపికొనరాదె ? యశ్వమేధ

మధిక దక్షిణాన్వితముగ ననఘ ! చేయు
మంతతో భవదీయ చిత్తానుతాప
మంతయును బాయు రఘురాముఁనట్లు బూరు
భరతులను బోలె దానతత్పరుడ వగుమ   ఆను 1-12.

ఈశ్వరుడే అన్నియును చేయును నీ వేమియు చేసినవాడవు కావు. ఇంతవరకు మేము (భీష్మాదులతో కలిపి) నీకు చెప్పిన దంతయు విని తిరిగి దుఃఖింతువేమి ? దుఃఖింపకుము - ఈ మొదలైన వ్యాసుని వాక్యము లోకానుభవశాలియైన వయస్సు చెల్లినవాడు, వాత్సల్యానురాగములతో, బాధ్యతతో, దుఃఖితుడగుచున్న పిన్నవాని నోదార్చి యోదార్చి, సూక్ష్మరూపమైన విసుగుదలతో చివరకిక తమాయించుకొనుము- అల్లే దుఃఖము పెంచుకొన్నచో పెరుగును - ఊరకొనుము - అని కసరిచెప్పి నట్లున్నవి ఆ కసరుటలో వాత్సాల్యాతిశయమే యున్నది. అదిలోకము స్వభావము, మరియు వ్యాసుడు నీకు పాపకర్మ శంక కలిగెనేని యజ్ఞము చేయుమనినాడు. పాపశంక నీ కుండవలసిన యవసరము లేదు. ఉన్నచో నశ్వమేధము చేయుమని ధర్మరాజుతో వ్యాసుడు చెప్పినాడు.

వ్యాసుడధిక దక్షిణాన్వితముగా నశ్వమేధమును చేయుమనుటతో ధర్మజుని చిత్తమందు కున్ముఖమైనది. అయినదికాని అధిక దక్షిణాన్వితముగ చేయుట యెట్లాయని శంకించినది. ఆ తన శంకను ధర్మరాజు వ్యాసునితో ననినాడు. దానిమీద మరుత్తుని యజ్ఞధనము ఫలానా చోట కలదనియు, దానిని తెచ్చి

చేయుమనియు, మరియు మరుత్తుని యజ్ఞవైభవము ప్రవర్తించిన విధమును వ్యాసుడు చెప్పినాడు. "కృతయుగమున దండనీతి ప్రవర్తకుండగు మనువునకు ప్రజానియను తనయుం డుదయించె వానికి...." అని ప్రారంభించి, ఆ సంతతి లోనివాడు మరుత్తుడనుటవలన, రాజు దండనీతియందు వర్తించవలయును. పూర్వమునుండియు నిదియే ధర్మము నీవును పూర్వరాజుల మార్గము ననుస రింపవలయును అదియే ధర్మము. మరుత్తుడంత పట్టుదలతో నశ్వమేధము చేసి నాడు. నీవును నట్లే చేసి కృతకృత్యుడవగుము - అను నీ తాత్పర్యముతో ధర్మరాజును ప్రబోధించుటగా నా కథయందు వ్యాసుని ఆంతర్యము గోచరించు చున్నది

ఇంతయు విని తెలివితెచ్చుకొన్న వాడైనను ధర్మరాజునకు బంధువిషయ శోక మంతరాంతరములలో రేఖామాత్రముగ నుండనేయున్నది. శ్రీకృష్ణుడు దానిని గూడ తొలగించుట ధర్మరాజు నుద్దేశించి యిట్లనినాడు.

కర్మానుష్ఠానంబును
నిర్మలముగ నడపఁ బడదు నీచే వినుమో
ధర్మ తనూభవ వగయును
నిర్మూలము సేయ విది మనీషకలిమియే. అశ్వ. 1-109.

ఈ మొదలుగా శ్రీకృష్ణుడాడిన మనస్తాపోపశమనవచనములు వినిన తరువాత ధర్మరాజున కిక దుఃఖములేదు. శాంతుడనైతినని మరియు వ్యాసుడు చెప్పిన ఆ ధనమును తెచ్చి యశ్వమేధము చేయుదుననినాడు. తదనంతరము వ్యాసుడు తపోవనమునకు పోయెను శ్రీకృష్ణు డింకను తరువాత ద్వారకానగరమునకు బోయెను

కాలము గడుచుచున్నది. ధర్మరాజు రాజ్యమును పాలించుచున్నాడు. రాజప్రాసాదములయందు ప్రసంగాధీనమై యభిమన్యుని విషయము వచ్చు టయు, నుత్తర విలపించుటయు, నామె నోదార్చుటయుగా కాలము గడచు చున్నది అశ్వమేధము మాటకొంత వెనుకపట్టినది. అప్పుడు మరల వేద వ్యాసుడువచ్చి తగినమాటలాడి వారల వగ మాన్చి అశ్వమేధవిషయవిధులు ప్రసంగించి వేగము పూనుకొనుడని బోధించి ధర్మరాజాదులచేత సరే అనిపించి

నాడు తరువాత ధర్మరాజు తమ్ముంలతో కలసిపోయి మరుత్తుని యజ్ఞధనమును తెచ్చి యశ్వమేధము చేసినాడు. అలోలుపత్వ గుణవిశాల బుద్ధిశాలివై ఫలాభి సంధిలేక, అశ్వమేధము[1] చేయుమని శ్రీకృష్ణుడు వెనుక మనస్తాపోపశమము చేయునపుడే ధర్మరాజునకు చెప్పినాడు ధర్మరాజశ్వమేధము నట్లే చేసినాడు

ఈ మూడు పర్వములయందును ధర్మజుని శోకచిత్తత శాంతాభిముఖ ముగా పరిణమించుట రెండుమూడంతరవులుగా చూపబడినదని యింతకు పూర్వము చెప్పబడినది ధర్మరాజు సింహాసనమధిష్ఠించుటకు పూర్వము, యుద్ధా నంతరము, వ్యాసార్జునాదులచేత బోధింపబడినపుడు "చిత్తంబు కలంకదేరి కౌంతేయాగ్రజుండు రాజ్యభార నిర్వహణోత్సాహము"[2] కలవాడై నాడని కవి చేత చెప్పబడినది భీష్మోపదేశము ముగిసిన తరువాత "ధర్మజుఁడు తెలివొందె భవదుపదేశామృతంబున"[3] అని వ్యాసుడు భీష్మునితో చెప్పినాడు భీష్మ నిర్యాణానంతరము శ్రీకృష్ణుడు, వ్యాసుడు అశ్వమేధమునందు చిత్తమును ప్రవర్తింపజేసిన తరువాత ధర్మరాజు "మీ కారుణ్యంబున నా శోకంబంతయును బాసె సుమనస్కత కలిగె"[4] నని తానుగా చెప్పినాడు ఇది శాంతిత్రయమున ధర్మజుని శోకము క్రమముగా నుపశమించిన విధము లక్షణము

భారతకథానాయకుడైన ధర్మరాజును చుట్టుకొని శాంత్యనుశాస నాశ్వమేధము లెట్లు ప్రవర్తించినవో స్థూలముగా చెప్పబడినది. అశ్వమేధము నందలి మరి రెండు విషయము లిచట పేర్కొనబడవలసియున్నవి. ఒకటి పరీక్షి తుని జననము రెండు శ్రీకృష్ణుడు పార్థునకుజేసిన తత్త్వోపదేశము భారత గ్రంథము ననుసరించి చెప్పినచో పరీక్షితుని జననమే తరువాత చెప్పబడవలయును. కాని ప్రయోజనము ననుసరించి ముందు చెప్పబడినది భారతకథ, అశ్వమేధము ముగిసినప్పటినుండియు, ధర్మరాజాదుల పరలోకాభిగమనమున కనువైన చిత్త పరిపాకము ననుసరించి నడచినది ధర్మరాజు తరువాత హస్తినాపుర సింహా సనమునకు వారసుడు పరీక్షిత్తు కనుక నాతని పుట్టుటకు ప్రాధాన్యమున్నది మరియు నాతడు చచ్చిపుట్టి బ్రతికినవాడు అశ్వమేధ మిక ప్రారంభింపబడు

1. భా. అశ్వ. 1-134.
2. భా. శాంతి. 1-345.
3. భా. అను. 5-440.
4. భా. అశ్వ. 1-137

ననగా పరీక్షితుడు పుట్టినాడు మృతుడై పుట్టినాడు. శ్రీకృష్ణుడు బ్రతికించి నాడు పరీక్షిత్తు జన్మించినాడు గనుకనే ధర్మరాజాదుల చిత్తము రాజ్య భారము విషయమున దుఃఖము పెట్టుకొనక మోహాభిముఖ మగుటకు వీలు చిక్కినది. పరీక్షిత్తు జన్మించిన సన్నివేశము దానికదిగా కొద్దిపరిధిలో కరుణ గర్భము ఇక శ్రీకృష్ణుని తత్త్వోపదేశము విషయము శాంత్యనుశాసనముల యందు చెప్పబడిన సాంఖ్యయోగముల విషయమే ఇందును కలదు యుద్ధము ప్రారంభమున వినినది మనసునకు పట్టలేదని అర్జునుడు తిరిగి తత్త్వము నుపదే శింపుమనగా శ్రీకృష్ణుడు చేసిన బోధయది. యుద్ధప్రారంభమున చేయబడిన గీతోపదేశమునకు ఫలము పార్థుడు యుద్ధమున ప్రవృత్తుడగుట మరి యీ యశ్వమేధమునందలి తత్త్వోపదేశము ప్రయోజన మంతగా స్పష్టమై కని పించుటలేదు. మౌసలపర్వమున శ్రీకృష్ణాదుల నిర్యాణానంతరము బ్రతికి దుఃఖించెడి యాదవుల నూరార్చి వారికి రక్షణకల్పించుటను నర్జునుడుచేసినాడు. ఆ చేయుటలోని మనోబలము లక్షణ మీ శ్రీకృష్ణుని తత్త్వోపదేశము ననుసరించి యేర్పడినదని యూహింపవచ్చునేమో !

ఇంతవరకు శాంతిత్రయమునందలి ప్రధానకథాసంబంధి వైశిష్ట్యము కొంత సూచింపబడినది ఆయా పర్వములయందలి తాత్త్వికవిషయ పరిశీలనము ప్రత్యేకముగా చేయబడుచున్నది గనుక నిచట ఆ విషయము లుపేక్షింపబడినవి. శాంత్యనుశాసనపర్వములయందు ధర్మరాజును ప్రబోధించుచు భీష్ముడు చెప్పిన చిన్నచిన్న కథలు, సంవాదములు చాలయున్నవి. విషయము విశదమై స్పష్టపడుట కుదాహరణార్థము చెప్పబడిన కథలవి ఆ కథల యొక్క, సంవాద ముల యొక్క తాత్పర్యము విశేషించి వివరింపనక్కరలేదు అవన్నియు వివర ణాత్మకములుగనే వ్రాయబడినవి వాటినిగూర్చి యొక్క విషయము మాత్ర మిచట చెప్పవలయును.

కొన్ని కథాసంవాదములు పశుపక్ష్యాదు లాధారముగా ప్రవర్తించినవి. కుక్కుర నీచత్వముందెలుపు కథ, మూషిక మార్జాల సంవాదము, కపోతా ఖ్యానము, నాడీజంఘునికథ - ఈ మొదలైన పెన్నియు నట్టివి. మరికొన్ని దేవ తలు, పూర్వరాజన్యులు, మునులు, ఆధారముగా నడచినవి బృహస్పతి మను సంవాదము, ఇంద్రప్రహ్లాద సంవాదము, జనక పంచశిఖాచార్య సంవాదము, నారద నారాయణ సంవాదము - ఈ మొదలైనవన్నియు నిట్టివి. వీని యిట్టి

నిర్మాణపద్ధతిని పట్టి యీ విధముగా నూహింపవచ్చును - పశుపక్ష్యాదు లాధారముగా నడచినవాని యాంతర్యము ద్వివిధముగా గనిపించుచున్నది దుష్టమైన చిత్తలక్షణమును నిరూపించు సందర్భమున పురుషనామములను గ్రహింపక నన్యాపదేశముగా చెప్పగలచుట యొక విధము. పరమోత్తమమైన ధార్మిక బుద్ధి పశుపక్ష్యాదులయందున్నట్లు నిరూపించుటచేత మానవు లావిషయమున కడు శ్రద్ధాళువులు కావలయునన్న యుపదేశము మరొకవిధము దేవతలు, మునులు, పూర్వరాజన్యులును నాధారముగా ప్రవర్తించినవి సంప్రదాయమును నిలబెట్టుచున్నవి ఉపనిషత్సంప్రదాయమది. ఉపనిషత్తులయందు నచికేతుడు, యముడు, వరుణుడు, భృగువు మొదలైన వారి సంవాదములున్నవి. మరియు పూర్వ మీ విషయమును ఫలానా ఇరువు రీ విధముగా చర్చించుకొనినారనియు, ఒకరి కింకొక రిట్లుపదేశించి నారనియు భారతమున చెప్పబడుట వలన ధర్మజుని చిత్తము సంప్రదాయ మార్గమున బరమార్థమునందు లగ్నమగుట కెక్కువగా నవకాశము కలిగినది. సాధారణముగా తాత్త్వికవిషయము లన్నియు సంవాదరూపమున నుపదేశాత్మకములుగా చెప్పబడుటలోని ఆంతర్యమిదియే కావలయును. ఇది ఆయా కథాసంవాదముల నిర్మాణపద్ధతికి సంబంధించిన సామాన్యమైన ఊహ అంతమాత్రమే. ఇక నాశ్రమవాస చతుష్టయము విషయముకూడ కొద్దిలో విచారింపబడును.

## 2. ఆశ్రమవాస చతుష్టయము

అశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణము లను నాలుగు పర్వములమీదను వ్యాపించియున్న కథ, అశ్వమేధము ముగిసినప్పటినుండి పాండవుల స్వర్గారోహణ పర్యంతము జరిగిన భారతకథ. ఆశ్రమవాసము ముఖ్యముగా ధృతరాష్ట్రునియొక్కయు, కుంతీ గాంధారులయొక్కయు, ఇహలోకయాత్రను చాలించుటను చెప్పచున్నది మౌసలము శ్రీకృష్ణుడు, బలరాముడు మొదలైన యాదవుల పరలోకప్రాప్తిని చెప్పనది. మహాప్రస్థానికము ధర్మరాజాదుల పరలోకాభిగమనమును చెప్పనది. స్వర్గారోహణము స్వర్గమున ధర్మజుని అంతఃప్రవృత్తిలక్షణము వాని యనుభవరూపమున వ్యక్తముచేసి, తదంతఃకరణము పరిశుద్ధముగా నొనర్చి, వాని మోక్షమును పొందుటను చెప్పనది. ఈ నాల్గింటియందును స్వర్గారోహణము కేవల మిహలోకమున జరిగినది కాని కథతోనున్నది. మహాప్రస్థానికము నందలి కథ ఇహపరములకు వంతెన

రూపముననున్నది. అనగా నిహమున మొదలై పరమున నంతమగుచున్నది. ఇక మౌసలము, ఆశ్రమవాసము రెండును ఇహలోకమున జరిగిన కథను చెప్పునవి. ఈ పర్వములయందలి కథ యట్లు జరిగిన తరువాతనే పాండవులు మహాప్రస్థానమునకు బయలుదేరినది అనగా పాండవుల మహాప్రస్థానమున కీరెండు పర్వములును మూలభూత ములగుచున్నవని యర్థము.

అశ్వమేధము చేసినప్పటినుండియు ధర్మజుని చిత్తమత్యంత హర్షవతియై పితృపితామహక్రమ ప్రాప్తంబైన సామ్రాజ్యభార నిర్వహణమున ననుకూలముగా ప్రవర్తించుచున్నది. మహాధ్వర ప్రముఖధర్మకార్యధుర్యుడును, సముపాసితార్యుడును మరియు దయావిధేయుడునునైన ధర్మరాజు ధృతరాష్ట్రుని మిక్కిలిగా గౌరవించుచు రాజ్యముచేయ మొదలిడినాడు. ధర్మజుని తమ్ములందరును నన్నగారి ననుసరించుచుండిరి ధృతరాష్ట్రుడా ధర్మరాజువలన నిజాత్మజువలనికంటెను ప్రియమందినాడు. ధర్మరాజట్లు ప్రవర్తించినాడు. మధ్యమధ్య అన్నగారు వినకుండ భీముడా ధృతరాష్ట్రునిగూర్చి ఆయన వినునట్లుగా నేమో అనుచుండును భీముడు సమీపమునకు వచ్చినాడనగనే ధృతరాష్ట్రునకు తన మరణించిన కొడుకులు స్మృతికివత్తురు ఈ భీముని యొక్కయు ధృతరాష్ట్రుని యొక్కయు ప్రవృత్తి అత్యంతము గూఢమైనది. ధర్మరాజేమో అట్లు. వీరిట్లు. కాలము గడుచుచున్నది పదునైదు సంవత్సరములట్లే గడచినవి.

ఇక నగరమునసుండి, భీముడు తన సమీపవర్తియై నోటికివచ్చిన దనుటయు, తాను తన కొడుకులను దలచి దుఃఖించుటయు, రెండును ధృతరాష్ట్రునకు దుర్భరములై అడవులకుబోయి తపము చేసికొనుచు ప్రాణములు వదలుట శ్రేయమని నిశ్చయించుకొనినాడు ఆ తన నిశ్చయమును ధృతరాష్ట్రుడొకనాడు ధర్మరాజునకు చెప్పినాడు నే నడవులకుపోదునని ధృతరాష్ట్రు డనుట ధర్మజుని చిత్తమును శోకమయము చేసినది అనగా కొంతకాలముగా శోకము నెరుగని ధర్మజుని చిత్తము పునః శోకాక్రాంతమైనది. శోకమునుండి విరక్తిపుట్టును. ధర్మరాజు రాజ్యసుఖాదికమును త్యజించి పరలోకాభిగమనము చేయుటయం దిహసుఖములయందలి విరక్తిభావమున్నది. అది బీజప్రాయముగా, నీ ఆశ్రమవాస పర్వమున ధృతరాష్ట్రుడడవికి పోవుదునన్నపుడు, ధర్మజునియందు చూపబడినది. వ్యాసుడువచ్చి అనుమతింపవలసినదిగా చెప్పినపుడు ధర్మరాజు సరే యనినాడు. ధృతరాష్ట్రుడు గాంధారీసహితుడు బయలుదేరుటయు, వారి ననుసరించి కుంతి

ప్రయాణమగుటయు మొదలైన సన్నివేశమంతయు ధర్మజునియందు శోకరూప చిత్తవృత్తిని మిక్కిలిగా పెంచినది. వెనుకటివలె, అనగా శాంతిపర్వమునందు వలె, ధర్మజు శోకాకులతను పోగొట్టు ప్రయత్న మెవరిచేతను, ఈ ఆశ్రమవాస పర్వమున చేయబడలేదు ఈ శోక ముపశమింపజేయబడకుండుటయే తరువాతి కథకు కావలయును అందువలన భారతకర్త శ్రీకృష్ణునిగాని మరొకరినిగాని ప్రవేశపెట్టి వారిచేత ధర్మజుని శోకమును త్రోసిపుచ్చు ప్రయత్నమును చేయ లేదు. అందువలన ధర్మజుని యందా శోకమట్లే యున్నది. తరువాత కొంతకాల మునకు ధృతరాష్ట్రాదులు మరణించుటతోనది మరియు స్థాయికెక్కినది. నార దుడువచ్చి ధృతరాష్ట్రుడిట్లయినాడనగనే ధర్మరాజు "బాహులెత్తి యెలుగు సెలగ" నేడ్చినాడని తిక్కన్నగారు వ్రాసిరి. మరియు "తమ్ము లడలుగదిరి యేడ్చి రవ్వార్త నంతఃపురమున రోదనార్తవము లెసఁగ"

> విని పౌరజన సమూహము
> లనయంబును వనటమునిగి హాహారవముల్
> వినువీధిముట్ట రోదన
> మొనరిచె నవ్వేళఁ గరుణ ముత్కటమయ్యెన్.

ఈ విధముగా నా సన్నివేశమును శోకస్థాయిగా తిక్కన్నగారు నిరూపించిరి. అనగా నాశ్రమవాసపర్వమున ధర్మజుని చిత్తమును శోకాక్రాంతము చేయునట్టి కథ వర్ణింపబడినది ఇట్లే మౌసలపర్వమును

కాని భారతము మొత్తముమీద మౌసలపర్వమున కొక వైలక్షణ్య మున్నది అది యాదవుల కథతోనున్నది భారతము భరతవంశములోని కౌర వుల యొక్కయు పాండవులయొక్కయు చరిత్ర. యాదవులు భరతవంశము లోనివారుకారు మరి వారి కథ ప్రధానముగాగల మౌసలపర్వము భారతేతి హాసమున నేల ప్రసక్తికి రావలయును? అక్కరలేదు. కాని వచ్చినది అదియే వైలక్షణ్యము. కణ్వ, నారద, గాధినందనులయొక్క శాపము కారణముగా సాంబుని కడుపున ముసలము పుట్టినది. అది హేతువుగా యాదవవంశము నశిం చినది. ద్వారక సముద్రములో కలసిపోయినది. తత్పూర్వమే బలరామ శ్రీకృ ష్ణులు నిర్యాణము చెందిరి ద్వారక సముద్రములో మునిగిపోవుటకు కొంచెము ముందుగా నర్జునుడు యాదవాంగనలను చాలకష్టముమీద నొడ్డుకు చేర్చెను- ఈ మొదలైన యంశములు ప్రధానముగా గలిగినది మౌసలపర్వము.

ఈ పర్వము శ్రీకృష్ణుని భగవదవతారలక్ష్యమును చిత్రముగా నిరూపించుచున్నది. భగవంతుడవతరించి రెండుపనులు చేయును. ఒకటి ధర్మమును రక్షించుట. రెం డధర్మము నణచుట ఇదియే శిష్టరక్షణమనియు, దుష్టశిక్షణమనియు చెప్పబడును శ్రీకృష్ణుడు భగవదవతారము భగవదవతారమనగా నేమియులేదు కాలముయొక్క పరమార్థభూతమైన లక్షణమును సంపూర్ణముగా నెరిగియుండుటయే. అట్టివానికి శోకమోహములుండవు. ఉన్నట్లు కొండొకచో చెప్పబడినచో నది లోకము బుద్ధిని రసార్ద్రిముచేసి యాకర్షించుటకు - అనగా లోకము భగవదాయత్తమైన చిత్తముకలదిగా చేయబడుటకొరకు శ్రీకృష్ణుని విషయమున శోకమోహములు లేవు. అంతయు లీలయే కాలస్వరూపము నెరిగిన లీలయది భారతమున శ్రీకృష్ణునిలీల రెండు విధములుగా చెప్పబడినది ఒకటి అర్జునుడు సాధనముగా శ్రీకృష్ణుడు దుష్టులను శిక్షించుట భగవంతుడెప్పుడును నేమియుచేయడు. కాని అంతయు నాయనవలననే జరుగుచుండును అదియొక వైచిత్రి. భారతయుద్ధ మంతయు నట్టివైచిత్ర్యముకలదియే రెండు, దుష్టులైన యాదవులు వారిదుష్టత్వమున వారు నశించు వరకు నుపేక్షించి యుండుట ఈ లీలయే మౌసలపర్వమున నున్నది అనగా యాదవుల దుష్టబుద్ధి లక్షణమెట్టిదియో, దాని పర్యవసానమెట్టిదో మౌసలపర్వమునందలి కథ నిరూపించుచున్నది. సాంబుని మునులు శపించిన విషయమువిన్న శ్రీకృష్ణు నుద్దేశించి తిక్కన్నగారు వ్రాసినపద్యమును చూచినచో పైన చెప్పబడిన విషయముల కుపపత్తి కనిపించును ఆ పద్యమిది (11)–

> విని కాలవేది యగు న
> వ్వనజాక్షుఁడు నియతినగు నవస్థకుఁ దలపం
> జన దన్యథాత్వకరణం
> బని యూహించుచు నుపేక్ష యాత్మ నొలయగన్.

యాదవులందరును శ్రీకృష్ణసహితులై సముద్రతీరమునకు పోయిరి అపుడు ఉద్ధవుడు తన తపోగమనాభిలాషను శ్రీకృష్ణున కెరింగించెను. శ్రీకృష్ణుడు వలదనలేదు ఆ విషయమును తిక్కన్నగారిట్లు వ్రాసిరి (ప 33)—

> వెలువడి లీల నేఁగి మును వేడ్కనొనర్చిన మేటి చప్పరం
> బుల నెలమిన్ మహార్ణవము పొంత వసించిన నుద్ధవుండు, దా

నలఘుతపం బొనర్చుటకునై విపినంబున కేగువాడుగాఁ
బలికిన దాని కొండొకఁడు బల్కడ కృష్ణుడు కాలవేదితన్.

సముద్రము తీరమున బాగుగా త్రాగి మత్తులైన యాదవులు కలహమునకు దిగిరి మాటమీద మాటగా పెరిగినది కలహము. సాత్యకి కృతవర్మ తల నఱకుటతో కయ్యము మొదలైనది మరియు సాత్యకి భోజకులము వారలమీద గవిసెను దానితో తత్సన్నివేశమొక తీవ్రరూపము దాల్చినది. అపుడు తిక్కన్న గారు శ్రీకృష్ణు నుద్దేశించి యిట్లు వ్రాసిరి (ప. 50)—

కవిసినఁ జూచి యాఁగుటకుఁ గా నలినాక్షుడు వోవునంత నా
హవఖరులైన భోజులును నంధకవీరులు నొక్కడై దెసల్
సెవుడువడంగ నార్చి యతిశీఘ్రత సాత్యకిఁ జుట్టుముట్టి ర
ప్డు విమలబోధుఁడా వారి కడుం గనలొందియు కాలవేదితన్

తమ్ముఁ గాచునట్టి సముదగ్రత
గైకొన నొల్లడయ్యె (51).

ఈ మొదలైన పద్యములను విచారించినచో శ్రీకృష్ణుని భగవదవతార లక్షణము స్పష్టముగా తెలియును. మరియు యాదవులందరును సమసిపోయిన తరువాత బలరాముడు కూడ పరమపదమును ప్రాపించిన పిదప శ్రీకృష్ణుడు "సకలలోక పాలనకు భూలోకంబునందు దాఁ బుట్టంగవలసిన యట్టి మేటి పనులెల్లఁ దీఱుట మనమున దలపోసి తను విముక్తికి నిమిత్తంబు దలఁచి" (80) నాడని తిక్కన్న గారు వ్రాసినది శ్రీకృష్ణుని లీలావతారవిశేషమును విశదము చేయుచున్నది. అట్టి భగవంతుడైన శ్రీకృష్ణు డుపేక్షవహించి యాదవవంశనాశనమును జరిపించుట మౌసలపర్వమున వర్ణింపబడియుండుటయే ఆ పర్వమునందలి వైచిత్రి. అది శ్రీకృష్ణుని రెండవ లీలావిశేషము. కనుకనే తిక్కన్నగారు దీనిని పృథక్కరించి చూపించుకొరకు ఆ పర్వమును నిర్వచనము[1] గా వ్రాసిరి. మిగిలిన భార

1. మౌసలపర్వమున 34 సంఖ్యతో "అంత బలుండునుం బోవ నిశ్చయించి చెప్పిన" అని ఒక్కగానొక్క వచన మున్నది దాని అవసరమేమియు నచటలేదు. అందువలన దానిని తొలగించవచ్చును. అపుడు పర్వము నిర్వచనమగును. వ్రాతప్రతులయందది కానిపించుటలేదని అధోజ్ఞాపిక వ్రాయబడియున్నది కూడ.

తమునంతయు చంపూపద్ధతిలో వ్రాసి, ఈ యొక్క పర్వమును కేవలము పద్యములలో వ్రాయుట, ఆ విశేషలక్షణమును స్ఫురింపజేయదలచుకొనుటయే కావలయును.

ఇట్లు యాదవవంశనాశనమును చెప్పు పర్వము శ్రీకృష్ణుని భగవదవతారలక్షణమును నిరూపించిన నిరూపించినది కావచ్చును. ఆ భగవల్లక్షణము, ఆ యాదవవంశక్షయము ప్రధానమైన భారతకథతో నెట్లు సంబంధించి యున్నదో విచారింపబడవలయును గదా!

భారత మాదిపర్వమున కురుపాండవ వీరులతోపాటు శ్రీకృష్ణుడు మొదలైన వారి ప్రాదుర్భావమును చెప్పబడినది (ఆది 3-74, 75, 76). ప్రధానముగా నెవరి పుట్టుకల నే దేవతాంశములనుండి ఇతిహాసము చెప్పునో, తిరిగి వారియా దేహము చాలించి తదంశమున లీనమగుటయు చెప్పును. ప్రధానముగా శ్రీకృష్ణుడు విష్ణుదేవుని అంశమునుండి యాదవవంశమున బుట్టినాడని చెప్పబడినాడు. అందువలన వాని నిర్యాణమునుకూడ భారతము చెప్పవలయును. భారతయుద్ధమునయందు దుష్టులను శిక్షించుటతోపాటు, యాదవవంశక్షయము కూడ సాధింపబడినగాని శ్రీకృష్ణుడవతారము చాలించుటకు వీలులేదు శ్రీకృష్ణుని అవతారము చాలించుటను భారతము చెప్పవలయును. అందువలన యదువంశక్షయవృత్తాంతముకూడ భారతమున చెప్పబడినవి. అదియునుగాక బలరాముని యొక్కయు, రుక్మిణి ప్రద్యుమ్నుడు మొదలైనవారి ప్రాదుర్భవము కూడ భారతమాదిపర్వమున శ్రీకృష్ణునితోపాటు చెప్పబడియున్నది. అందువలనకూడ యాదవవంశక్షయము భారతమున చెప్పబడవలసివచ్చినది. సముద్రతీరమున యాదవులలో కలహము పెరుగుటకు ప్రద్యుమ్నుడును నొక కారణముగా నందువలననే చెప్పబడినాడు. రుక్మిణి మొదలైనవారి అగ్నిప్రవేశము కూడ మౌసలపర్వమున చెప్పుటలోని ఆంతర్యమాదిపర్వమున నామె ప్రాదుర్భావము చెప్పబడియుండుటయే.

ఈ విధముగా మౌసలపర్వము భారతమున ప్రవర్తింపవలసియేయున్నది. మరియు శ్రీకృష్ణనిర్యాణానంతరము బ్రతికియున్న యాదవుల కథతో నర్జుననకు సంబంధమున్నది. ఆ సంబంధమే అర్జునుడు తాను నిర్వీర్యుడై పోయి నట్లు తెలిసికొనుట కవకాశము కల్పించినది. యాదవాంగనలను బోయలనుండి

అర్జునుడు రక్షించలేక పోయినాడుగదా! అస్త్రప్రయోగము చేయదలచు కొనగా మంత్రములు బుద్ధికి తోచలేదు. అది దైవవిరోధమువలన నగుచున్నదని యర్జును డనుకొనినాడు మంత్రముల జోలిపెట్టుకొనక ప్రకృతి మార్గణములను ప్రయోగింపగా నవియును వ్యర్థములే అయినవి దానితో నర్జునుని చిత్తము ముందాశ్చర్యచకితమై శోకమున కగ్గమైనది. అందువలననే రుక్మిణి మొదలైన వారికి సర్వాప్రకారాగ్నివిధి యొనర్చిన పిదప నర్జునుడు వేదవ్యాసుని ఆశ్రమ మునకు పోయినాడు. ఒక ప్రక్క బంధుజనులైన యాదవు లున్మత్తులై పర స్పరము తెగనఱకికొనుట, మరొక ప్రక్క తన కత్యంతము కూర్చు శ్రీకృష్ణుడు తనువు చాలించి పోవుట, ఇంకొక ప్రక్క తన బాహువులయందుదగ్రత నశించి పోవుట, అస్త్రనికర మంత్రతంత్రములు సంస్మృతిని బొందకపోవుట-ఇవన్నియు నర్జునుని శోకమునకు హేతువులు. అందువలన నర్జునుడు వ్యాసుని సందర్శించి "ఇంకిట యే నేమిసేయువాడ-" అని యడిగినాడు. వ్యాసుడు శ్రీకృష్ణుని విష్ణుత్వమును ప్రవచించి చివర కర్జునునితో నిట్లనినాడు.

కాలమూలంబు సర్వంబుఁగాన దీని
కొండు తలఁపులు దక్కి మీరుత్తమంపు
గతికిఁ జనుఁడు నిశ్చింత వికారతనులు
విడిచి యార్యజనంబులు వినుతిసేయ (222)

ధర్మరాజాదులు మహాప్రస్థానమునకు బయలుదేరుట కీ వ్యాసుని యుపదేశ మత్యంత మనుకూలమైనది అర్జునుడు తన పోయివచ్చిన విషయము ధర్మరాజు నకు చెప్పిన తరువాతనే ఆయన బయలుదేరినాడు ఇట్లు మౌసలపర్వమునందలి కథ తుదిభాగ మర్జునునితో సంబంధించి చెప్పబడియున్నందునను, దానివలన తరువాతికథ కానుకూల్య మేర్పడుటవలనను, భారతమున మౌసలపర్వము ప్రవర్తింపనేవలయును. అనగా పాండవుల మహాప్రస్థానమునకు ప్రేరకముగా నీ పర్వము నిర్వహింపబడి ప్రధానకథతో సంబంధము కలదియైనది.

ఆశ్రమవాసమునుండి దుఃఖాక్రాంతమైయున్న ధర్మజుని చిత్తము విరక్తి మార్గమున కుదురుకొని చివరకీ యాదవవంశక్షయమువలనను, శ్రీకృష్ణుని నిర్యాణమువలనను, వ్యాసుని హితోపదేశమువలనను, ఇక నిహజీవితము పనికిరాదన్న నిశ్చయములో మహాప్రస్థానమున కభిముఖమై సాగినది. అర్జునుడు సత్యవతీ తనూభవుని హితవచనము లేమాదిరిగా నున్నవనగనే-

" . ....యుధిష్ఠిరుఁడు ప్రస్థానంబు
నకు మది డొలయ నన్నరునితోడ
నఖిల భూతంబుల సెనఘ పాకంబుఁ
బొందించుఁ గాలుండు మదీయబుద్ధి
కర్మసంత్యాగ కలనంబు కార్యమిప్పు
డను వినిశ్చయ మొందె నీ మనము నరయ
నిదియె మేలుగఁ గనుచున్కి విదితమయ్యెనాకు-".

మహాప్రస్థానికము - 4.

అనినాడు. అంతవరకు దుఃఖమనుభూయమానమగుచున్నను కర్మసంత్యాగ కల నము కార్యమను నిశ్చయము కలుగలేదు. ఈ దేహముతో నున్నంతకాలము నేదో విధముగ కర్మయన్నది లేకుండదు కర్మత్యాగమనగా దేహమును త్యజించుటయే అనగా నిహమున మనుటనుండి తప్పుకొనుటయే. అట్లు తప్పు కొనుటయే కార్యమని ధర్మరాజునకు వ్యాసుని హితోపదేశము పార్థునివలన విన్నతరువాత నిశ్చయమైనది. అర్జునుని యుద్దేశమును నదియె. మిగిలినవారిని బిలిచి ధర్మరాజామాటయే చెప్పినాడు అందరును సరే యనిరి. పరీక్షిత్తునకు రాజ్య మప్పగించి పాండవులు యోగబలమున ప్రస్థానయాత్రకు పూనుకొనిరి. పాండవుల మహాప్రస్థానమున కాశ్రమవాస, మౌసలపర్వములు రెండును మూల భూతములగుచున్నవని మొదట చెప్పబడిన వాక్యార్థము కొంత వివరింపబడినది.

ఇక మహాప్రస్థానిక (ఇంద్రదర్శనమై నప్పటినుండి) స్వర్గారోహణపర్వ ములయందు యోగమెడలియు శరీరపతనముగాని ధర్మజుని అంతఃకరణ లక్ష ణము చూపబడినది అది కేవలము ధర్మరాజునకు సంబంధించినదిగమక వాని పాత్రోన్మీలనము పరిశీలింపబడుటలో నా విషయము విచారింపబడును.

# షష్ఠోన్మేషము

## ఉపకథలు

భారతమున ప్రధాన కథతోపాటు మధ్య మధ్య ప్రసక్తికి వచ్చిన ఉపకథలు చాల యున్నవి. శాంత్యనుశాసనపర్వములయందు భీష్మోపదేశము మొదలైనప్పటినుండి కేవలము ధర్మజుని బుద్ధిని శిక్షించుటకుగాను కర్మజ్ఞాన విషయాత్మకములు దృష్టాంతములుగా చెప్పబడిన కథాసంవాదములతో కలిపి చూచినచో నుపకథల సంఖ్య చాల పెద్దదిగా కనిపించును. భీష్మోపదేశముతోడి శాంత్యనుశాసనములయందు కొనసాగిన ప్రధానకథ యేమియులేదు ముఖ్యముగా నవి ధర్మతత్త్వవిషయ ప్రతిపాదక పర్వములు. అందువలన ప్రధాన కథాగతి కుపస్కారకములైన ఇతరములగు కథలే ఇట ఉపకథలుగా గ్రహింపబడుచున్నవి. మరియు భారతకథ వినుచున్నది జనమేయుడడుగుటయు, వైశంపాయనుడు చెప్పుటయుగా ప్రసక్తములైనవియు నిట గ్రహింపబడుచున్నవి ప్రధాన కథాగతి కుపస్కారకములనగా తత్కథ యెవరిని చుట్టుకొని యున్నదో వారి మనస్సులు సంతుష్టములై ముందు కర్తవ్యములయందు ప్రవృత్తములగుట కుపస్కారకములని యర్థము. అట్టి కథల విషయ మిచట పరామర్శింపబడును. ముఖ్యముగా కథలయొక్క అంతర్యములు చెప్పబడి, అవి ప్రధానకథాపురుషుల చిత్తముల నెట్లు సంస్కరించుటకు ననుకూలపడినవో చూపబడును.

### 1. పురందర విజయోపాఖ్యానము

ఇది తిక్కన్నగారి భారతమునందలి మొదటి ఉపకథ. శల్యుడు ధర్మరాజునకు చెప్పినది. దుర్యోధనుడు మార్గమధ్యమున తన నెట్లు సేవించి కాంచి ప్రార్థించినదియు, దానికి తానియ్యకొనినదియు, చెప్పి శల్యుడు ధర్మరాజున కుజ్జ్వలమైన భవిష్యత్తు కలదని దృష్టాంతముగా నీ కథను సభాముఖమున చెప్పినాడు. కథ నంతయును జెప్పి చివరకు దాని తాత్పర్యమును శల్యుడే యిట్లు నిరూపించినాడు.

కౌరవనాథుఁడా నహుషుకై వడి నాశముఁ బొందు వాసవ
శ్రీరమణీయుఁడై జయము సేకొని ధర్మజుఁ డంబురాశివే
లారశనాసముజ్జ్వలవిలాసమనోహరమేదినీవధూ
సార సమగ్రభోగముల సన్నుతి కెక్కెడుఁ దాను తమ్ములున్.[1]

ధర్మజుని కష్టముల పాలగుట దేవేంద్రుని కష్టముల పాలగుటవంటిది. నహుషుడు తాత్కాలికముగా వెలిగిపోవుట వంటిది దుర్యోధను డొక పదుమూడు సంవత్సరములపాటు పాండవులకు లేకుండజేసి రాజ్యము సర్వాధికారియై అనుభవించుట. నహుషుడు స్వర్గభ్రష్టుడైనాడు. దుర్యోధనుడు రాజ్యభ్రష్టుడు కాకతప్పదు. పురందరుడు తిరిగి తన విభవమును తాను పొందినట్లుగా ధర్మరాజు విజయియై రాజ్యాధిపతి కాగలడు— ఈ విధముగా నీ శల్యునిచేత చెప్పబడిన కథ, ధర్మజునకు మరియు వాని పక్షమున యుద్ధమున సహాయము చేయుటకు వచ్చిన రాజలోకమునకును విజయమునందు బుద్ధిని రమింపజేయుచున్నది. దుర్యోధనునకు సహాయము చేయబోవుచున్న శల్యుడు ధర్మరాజు తప్పక జయించుననియు, దుర్యోధను డోడిపోవుననియు చెప్పుట పాండవపక్షమునకొక పెద్ద యుత్సాహము నిచ్చుట. మరియు ధర్మరాజునకు కావలసిన దగ్గర చుట్టమును, పెద్దవాడును నగుటచే శల్యుడు, వాని విజయాభ్యుదయము నాకాంక్షించుచు నాశీర్వచన పూర్వకముగా నుత్సాహపరుచుట యగును. మరియు నంతకు ముందుగా తాను ధర్మజున కిచ్చినమాట – నిరాకరించి పలికి కర్ణుని చిత్తమునకు కలత పుట్టించి పార్థుని రక్షించుట – కు బద్ధుడై ప్రవర్తించగల తన చిత్తవృత్తి రూపమైన నిశ్చయమును సభాముఖమున ధర్మజున కెరుకపరుచుట కావచ్చును.

ఇట్టి యీ పురందర విజయోపాఖ్యానమును తిక్కన్నగారు తొంబది యేడు గద్యపద్యములలో వ్రాసిరి. రెండు విషయముల నాశ్రయించుకొని ఈ కథ యున్నది ప్రభుత్వ సంపదచెడి దేవేంద్రుడు నిషధాచలమున దాగికొనపోవుట మొదటిది. స్వర్గ పరిభ్రష్టుడై నహుషుడు దుర్గతికి పోవుట రెండవది ఇంద్రుని ప్రభుత్వ సంపద చెడిపోవుటను చెప్పు రచనమునుమించి రెండింతలుగా నున్నది నహుషుని స్వర్గభ్రష్టతను చెప్పుటకైన రచన. అనగా నింద్రుండెంత సులభముగా సంపద చెడినవాడయినాడో, నహుషుడు భ్రష్టుడగుట అంత

1. భా. ఉద్యో. 1-210.

సులభముగా కాలేదన్నమాట. కేవలము స్థూలదృష్టికి కనిపించు గద్యపద్యముల సంఖ్యారూపితమైన రచన చేతనావిషయమును తిక్కన్నగారు బుద్ధికి గమ్యము చేయుచున్నట్లు కనిపించుచున్నది ధర్మరాజు రాజ్యము కోలుపోయినంత సులభముగా తిరిగి దుర్యోధనునినుండి సంపాదింపలేకపోయినాడుగదా! దృష్టాంతముగా చెప్పబడిన ఉపకథ స్థూలమైన రచన చేతనే ప్రధాన కథా విషయమును స్ఫురింపజేయుట దానికదిగా నొక విశేషము. నహుషుని భ్రష్టమై పోవుటకు ప్రధానకారణము శచీదేవిని చూడరాని విధమున నాతడు చూచుట. ద్రౌపదీవస్త్రాపహారణమును దుర్యోధనుడు చేయించి, తన రమ్యపృథూరుతలంబు నెక్కఁగా రమ్మని ఆమెకు సన్నసేసియుండినచో, భారతకథా స్వరూప మెట్టిదిగా నుండెడిదో దైవమునకు దెలియును. శచీదేవి - బృహస్పతి వలన రక్షింపబడినది. ద్రౌపది శ్రీకృష్ణునిచేత రక్షింపబడినది. పురుషుల యెదుట తిరుగని రాణివాసపు టింతి ద్రౌపది, సభకు గొనిరాబడుటకు హేతు వామె లావణ్యము. మరియు నది ధార్తరాష్ట్రుల భార్యలకు వెక్కసము గూర్చగలిగి నంతదగుట. నన్నయ్యగా రిట్లు వ్రాసిరి

అఖిల లావణ్య పుంజంబు నబ్జభవుఁడు
మెలఁతగా దీనియందు నిర్మించెనొక్కొ
కాని నాఁడిట్టి కాంతి యేకాంతలందు
నేల లేదని సామర్ష హృదయలయిరి.[1]

ద్రౌపదిని జూచిన కౌరవాంగనల స్థితియది. నహుషుడు శచీదేవిని తనవద్దకు బిలువనంపుటకు హేతువును తిక్కన్నగా రిట్లు వ్రాసిరి.

మహిత లావణ్యమున నసమాన యనఁగ
జనిన పౌలోమి యా నహుషునకు నయన
మార్గ గోచర యగుటయు మదన బాణ
భిన్నహృదయుఁడై ధృతిబాయఁబెట్టి యతడు [2]

ద్రౌపది లావణ్యము స్త్రీలు గనుక ధార్తరాష్ట్రుల భార్యల కమర్షమును హృదయములయందు కలిగించినది శచీదేవి లావణ్యము పురుషుడు గనుక

1. భా. సభా. 2-160.
2. భా. ఉద్యో. 1-149.

నహుషునకు హృదయమును భిన్నము చేసినది. అందువలననే భ్రష్టుడగుట సంభవించినది. అట్లే ద్రౌపది లావణ్యమునుజూచి యెవరెవరేమి చేసిరో వారును భ్రష్టులగుదురు. ఈ విధముగా ప్రధాన కథావిషయమును సూచించునదిగా నీ ఉపకథ వ్రాయబడినది. దుర్యోధనుడు నహుషుడుగాను, ధర్మరాజింద్రుడుగాను తిక్కన్నగారే వాచ్యము చేసిరి అందువలన ద్రౌపది శచీదేవిగా నగుట కభ్యంతరములేదు మరియు తిక్కన్నగారు శచీదేవియందు, నన్నయ్యగారు ద్రౌపదియందు చూపించిన శరీరకాంతినే ప్రధానముగా చూపించుట పై యూహ కత్యంత మనుకూలముగా నున్నది. శచీదేవి, బృహస్పతి, దేవతలు, ఋషులు, ఇందర పూనికవలన దేవేంద్రుడు తిరిగి స్వర్గలోకమున సింహాసన మధిష్ఠించినాడు ద్రౌపది - శ్రీకృష్ణుడు - తన తమ్ములు - ఆప్తులు - ఇందర పూనికవలన ధర్మరాజు హస్తినాపురమున సింహాసన మధిష్ఠింప నున్నాడు ఈ విధముగా ప్రధానకథ నంతయును ముందు వెనుకలమీద, దృష్టాంతముగా చెప్పబడిన ఈ కథ సూచించుచు, పాండవులకు సమరోత్సాహమును కలిగించి విజయమునందు బుద్ధిని రమింపజేయుచున్నది.

## 2 అంబోపాఖ్యానము

భీష్మునిచేత దుర్యోధనునకు చెప్పబడిన కథ యిది. శిఖండిని మాత్రము తాను చంపనని భీష్ముడు దుర్యోధనునితో ననినాడు. మీ రేల శిఖండిని వధింపరని దుర్యోధను డడిగినాడు దాని కొక పెద్ద కథయున్నదని భీష్ముడు ప్రారంభించినాడు ఆయన చెప్పిన ఆ కథ అంబ కథ

కౌరవ పాండవులు యుద్ధమునకు నిశ్చయించుకొని సిద్ధపడిన సమయమది. దుర్యోధనుడు కౌరవసేనాసమూహమునకు భీష్ముని సేనాపతిగా నభిషేకించినాడు. ఇక భీష్ముడు తన సేనను కురుక్షేత్రమునకు నడిపించుకొని పోవుటయే తరువాయి ఆ సమయమున నీ కథ చెప్పబడినది.

భీష్ముడు కథను విపులముగా చెప్పినాడు. ఈ కథను వివరించుటలో భీష్ముని ఆంతర్యము రెండు విధములుగా నూహింపబడుచున్నది. ఒకటి తన పరాక్రమమునందు దుర్యోధనునకు నిశ్చయాశ్చర్యబుద్ధిని పుట్టించి యుద్ధమున కుత్సాహపరుచుట. రెండవది శిఖండిచేత నే నెట్లును తెగక తప్పదు - అట్టి నన్ను నమ్ముకొని, సేనాపతిని చేసి యుద్ధమునకు పూనుకొనుచున్నావు - నీకు

విజయము లభించదు – ముఖ్యముగా నా వలన నీ కయ్యేడి దేమియునులేదు – అని దుర్యోధనునకు తెలియజెప్పుట ఈ రెండును కేవలము విరుద్ధములుగా కనిపించుచున్న ఊహాలు ఒక కథ విరుద్ధములైన రెండాంతర్యములతో నుండ గలదా అన్నచో లక్షణముగా నుండగలదు. ఈ కథ అట్లే యున్నది.

ఇందున్న ప్రధానాంశములు రెండు భీష్మునకు పరశురామునితోనైన యుద్ధము మొదటిది అంబ భీష్ముని వధించుటకు చేసిన యత్నము రెండవది. అంబకు దైవ మనుకూలము చేసినది. అందువలన భీష్ముడు వధింపబడుట అని వార్యము. అంబచేసిన యత్నము పరిష్కరింపబడినట్లుగా, భీష్మునకు పరశు రామునితోనైన యుద్ధమునకు పరిష్కారములేదు ఇరువదిమూడు దినములుగా వా యిరువురును యుద్ధముచేసిరి. పరశురాముని భీష్ముడు జయించినదిలేదు ముందు భీష్ముని పరశురాముడు మూర్ఛపోగొట్టినాడు. తరువాతి దినమున పరశు రామునిపై నేయుటకు భీష్ముడు మోహనాస్త్రము నావాహనము చేయగా నారదుడువచ్చి గురునకు నవమానము సేయుట కూడదని వారించినాడు యుద్ధ మట్లు సమాప్తమైనది. భీష్ముడా యస్త్రమును వదలినచో పరశురాము డేమి చేసెడివాడో మనకు తెలియదు. అందువలన భీష్ముడు స్పష్టముగా పరశు రాము నోడించినాడని చెప్పుటకు వీలులేదు. ఓడించగలడనుట మాత్రము చెప్ప బడినది. ఇది భీష్ముని పరాక్రమము నీ కథ చెప్పినవిధము. అనగా భీష్ముడు తన పరాక్రమ విషయమును దుర్యోధనుని ఊహకు వదలినాడని చెప్పవలయును. అంబచేసిన యత్నము విషయము వేరు ఆమె ఈశ్వరుని "భీష్ముని నాకుఁ జంపగా దొరకొనునట్లుగ (వరము) నొసగుము" అని కోరినది. ఈశ్వరు "డట్ల కాకయని యనుగ్రహించి"నాడు. మరియు శివుడు ద్రుపదున కిట్లు వర మిచ్చినాడు.

కూఁతురై పుట్టి పదపడి కొడుకుఁదనము
గాంచి భీష్ముని నాజి రంగమునఁ జంపు
నట్టి యుజ్జ్వలా పత్యంబు పుట్టు నీకుఁ
దప్ప దిది యని—

ఆ విధముగా రుద్రుని వరము ప్రభావమువలన ద్రుపదునియందు అంబ పుట్టినది. పుట్టి పురుషుడుగానయి శిఖండి యనబడినది. కనుక శిఖండిచేత భీష్ముడు వధింప బడుట తప్పక జరిగితీరును. ఇది ఈ యంశమునకు తుది పరిష్కారము. ఈ విష

యమును భీష్ముడు దుర్యోధనునకు స్పష్టముగా చెప్పినట్లే అయినది. తన పరా క్రమము నూహించుకొనుమనినట్లుగా తను మరణించుట నూహించుకొననీయ లేదు. భీష్ముడు తను మరణించుట తథ్యమనియు, తన పరాక్రమ మూహా విషయమనియు దుర్యోధనునకు నీ కథవలన చెప్పదలచినట్లు స్పష్టమగుచున్నది. ఇందువలననే భీష్ముని ఆంతర్యము రెండు విధములుగా నూహింపబడుచున్నదని చెప్పినది

ఈ కథ మొత్తము తాత్పర్యము నిట్లు చెప్పవచ్చును - నేను పరా క్రమము కలవాడనే కాని పరిస్థితి యిట్లున్నది ముందుగనే విషయమంతయు నీకు చెప్పుచున్నాను యుదమున శిఖండిపై పరాక్రమింపని నన్ను నీవు నిందించి ప్రయోజనములేదు నేను నా వ్రతమును భగ్నము చేసికొన్నను ప్రయోజనము సాధించుటకు నా కవకాశములేదు ఇక నీ యిష్టము మన వంశము నిలుపుటకు నేను చేసిన పనివలన నిట్టి స్థితి నా కేర్పడినది. నీవు సర్వ నాశనకారియగు యుద్ధము ను సృష్టించినావు. ఇపుడేమని యేమి లాభముగనుక. సరే కానిమ్ము. నేను నా వ్రతమును పాలింతును - అను నీ మొదలైన తన ఆంతర్యమును భీష్ముడు దుర్యోధనున కెరుకపరుచుట కీ కథ నింత విపులముగా యుద్ధమునకు ముందు చెప్పి నా డనిపించుచున్నది.

అంబోపాఖ్యానము కథన మంతయు నైపోయిన తరువాత దుర్యోధనుని గురించి తిక్కన్నగా రిట్లు వ్రాసిరి.

అని చెప్పిన దేవవ్రతు
వినుత వచనములు విభుండు విని తన చిత్తం
బున నొక్కింత వగచి యీ
తనికి మగతనంబు పూన్కి దగునని పలికెన్.

కథ విని దుర్యోధనుడు మనస్సున ఖేదపడినాడు. పైకి భీష్ముని పౌరుషమును ప్రశంసించి పలికినాడు దుర్యోధనుని మనస్సునకును పలుకునకును వైరుధ్య మున్నది కథ వినుటను చేసిన బుద్ధిమంతునియందు, దాని ననుసరించి రెండు విరుద్ధభావముల యనుభూతి కలిగినదనగా నా కథయం దట్టి లక్షణము లుండనే వలయును అనగా నా కథ అట్లు చెప్పబడియుండవలయును కనుకనే కథ చెప్పిన భీష్ముని ఆంతర్యము కేవలము విరుద్ధములుగా కనిపించు

రెండు ఊహాలతో నున్నదని మొదట చెప్పబడినది. దుర్యోధనుని ఖేదము శిఖండి విషయమును పురస్కరించుకొనినది కావలయును. ఈ మొత్తము కథాతాత్పర్య మాదిగనే ముందు మనస్సునకు తట్టినది కాని దుర్యోధనుని యభిమాన లక్షణము, దుర్మద లక్షణము, దానియందు చిత్తమును నిలువనీయ లేదు. అందువలన నది యొక్కొంత వగచుటగా తిక్కన్నగారిచేత చెప్పబడినది తరువాత భీష్ముని పరశురామునితో చేసిన యుద్ధమును పురస్కరించుకొని వాని మగటిమిని ప్రశంసించి పలికినాడు. ఆ పలుకుట చుట్టుప్రక్కలనున్నవారి కొరకుగా కనిపించుచున్నది 'ఈతనికి' అని భీష్ముని చూపి ఇతరులకు చెప్పి నట్లున్నదా పద్యము చివర వాక్యము తనకు తోచిన కథాతాత్పర్యమున తాను తన బుద్ధి నెట్లు నిలుపుకొనలేదో, అట్లే తన కొలువునగలవారి చిత్తములు కూడ శిఖండి విషయమున నిలువకుండునట్లు దుర్యోధనుడు భీష్ముని ప్రతాప మును పైకి చెప్పి ప్రశంసించినాడు అట్లుత్సాహమును ప్రదర్శించినాడు. అది వాని మనోలక్షణమున కనుగుణముగా నున్నది

అసలీ కథారహస్యము నిట్లు నిష్కర్షింపవలయును. ఇందు శిఖండి విషయమే ప్రధానముగాని పరశురామునితో భీష్ముని యుద్ధముచేయుట ప్రధానముకాదు శిఖండిని చంపమికి హేతువేమని దుర్యోధను డడిగినాడు. దానికి సమాధానముగా భీష్ము డీ కథను జెప్పినాడు. కనుక వక్తకును, శ్రోత కును కావలసినది శిఖండిని చంపమని సాధించిచూపు విషయము. అందు భీష్ముని పరాక్రమమును చెప్పు పరశురామునితోడి యుద్ధ మనివార్యముగా ప్రసక్తించి నది భీష్మునకు తన పరాక్రమమును సూచించు తాత్పర్య ముండనక్కరలేదు. కాని ఇరువదిమూడుదినముల పూర్తియుద్ధము గనుక కొంత విపులముగా వర్ణించి చెప్పి భీష్ముడు తనకు తెలిసిగాని తెలియకుండగాని తన పరాక్రమమును స్ఫురించునట్లు చేసినాడు. శిఖండి విషయమును స్పష్టముగా చెప్పు భీష్మునకు, తనయం దాశపెట్టుకొనవద్దని దుర్యోధనునకు సూచించు తాత్పర్య ముండునను టకు వీలున్నది. ఎనిమిదవనాటి యుద్ధము ముగిసిన తరువాత రాత్రిపూట దుర్యోధనుడు తనను నిందించి పలుకగా భీష్ము డిట్లనినాడు

గాండీవి గెలువరాదు శి
ఖండిని జంపంగ నాకుఁ గాదు వినుము న
న్నొండు మగలు మార్కొనినం
జెండుదు నుగ్రముగ మున్న చెప్పితి నీకున్.

ఇతరు లెదురుపడినచో నుగ్రముగ చెండుదునని భీష్ముడు చెప్పనక్కరలేదు అందరను చంపుటకొరకే తనను దుర్యోధనుడు సేనానాయకుడుగా జేసికొని నాడు. అందువలన మున్ను చెప్పితి నన్నది శిఖండి విషయమే కావలయును అదియే ఈ అంబోపాఖ్యానమున చెప్పబడినది గాండీవి గెలువరాదన్నది, ఈ కథను చెప్పుటకు ముందుగా పాండవవీరులయం దతిరథ మహారథులను నిరూపించి చెప్పుచో భీష్ముడు తా ననిన "నరుడీ మానము వాడనంగ వశమే నా కంత వారెందు నెవ్వరు లేరింకను బుట్టరు" అను మాటను గుర్తుకు దెచ్చుట కావచ్చును కనుక నంబోపాఖ్యానమును చెప్పుటలో భీష్ముని అంతర్యము తనయం దాశ పెట్టుకొనవద్దని దుర్యోధనునకు సూచించుట యని చెప్పవచ్చును కాని దుర్యోధను డది గ్రహించియు బుద్ధిని దానియందు నిలుపక పరశురాముని తోడి యుద్ధమున నిలిపి భీష్ముని మగటిమిని చూచుకొని యుత్సహించినాడు అందువలన నీ కథను వ్రాయుటలో తిక్కన్నగారు రెండు ప్రయోజనములను మనస్సున బెట్టుకొనినట్లు తోచుచున్నది లేనిచో ముప్పది గద్యపద్యములలో భీష్ముడు పరశురామునితో చేసిన యుద్ధమును వర్ణించి చూపనక్కరలేదు దుర్యోధను డుత్సహించుట కది యాధారముగా చూపబడినది అట్లు యుద్ధము వర్ణింపబడనిచో భీష్ముని మగతనంబు పూనికను తగునని దుర్యోధను డనుటకు వీలులేదు ఆ మాట నాత డననిచో ననగా నా యుద్ధము వర్ణింపబడనిచో, అంబోపాఖ్యానమును విని దుర్యోధనుడు వగచినా డనియే చెప్పవలసివచ్చును యుద్ధమునకు సిద్ధమైన ప్రతి వీరునియందు, యుద్ధము మొదలు కాబోవు చున్నపు డుత్సాహమునకు బదులు వగపు చెప్పబడినట్లగును దాని వలన ప్రయోజనములేదు. ఇపుడు వగపు కొద్దికా గలిగినను దానిని లెక్కచేయని తనము దుర్యోధనునియందు చూపబడినది అది వాని జీవలక్షణమున కూల ముగా నున్నది. మరియు కథయం దంత ప్రధానముగా భీష్ముని తాత్పర్యము గాని వాని ప్రతాపమును దుర్యోధనుడు గ్రహించి యుత్సహించుటయు వాని బుద్ధిలక్షణమును లెస్సగా నిరూపించుచున్నది. ఇట్లీ కథను నిర్వహించి తిక్కన్న గారు భీష్ముని పక్షమున నొక తాత్పర్యమును, దుర్యోధనుని పక్షమున మరొక తాత్పర్యమును సాధించి ప్రధాన కథాగతితో ననుసంధించిరి.

## 3 మృత్యుదేవతాఖ్యానము

అభిమన్యుని మరణమువలన శోకదీనుడైన ధర్మరాజునకు వ్యాసుడు చెప్పిన కథ యిది. పుత్రమరణ శోకాతురుడైన అకంపనునకు నారదుడు చెప్పి

వాని సంతాపమును తొలగించినాడని, ఆ కథ నిట్లు వ్యాసుడు చెప్పినాడు మృత్యుదేవతాస్వరూపము జ్ఞానమునుబోధించి, చిత్తము దుఃఖమును బొరయకుండ చేయుట ఈ కథయందలి రహస్యము. లోభ క్రోధాదులవలననే శరీర వికృతినిబొంది జీవరాశి మరణించును అందువలన నొకరిచే నొకరు చంపబడినట్లనుకొనరాదు. కర్మగతి ననుసరించి మరణము సంభవించును మొదట మృత్యుదేవత తానీ విధముగా ప్రాణులను సంహరింపనని బ్రహ్మతో గట్టిగా చెప్పినది చివరకు బ్రహ్మ నీవు నిమిత్తమాత్రముగ నుండుము చాలును రోగాది బహుకారణములు జనములను చంపును, అధర్మము నీవు చేసినట్లేమియు నుండదు - అని మృత్యుదేవత ననుగ్రహించినాడు. ఇది వ్యాసుడు చెప్పిన మృత్యుదేవతాకథా తాత్పర్యము. ధర్మజుని యుద్ధమునుండి దుఃఖముచేత విరమించకుండునట్లుగా చేయుటకు చెప్పబడిన కథయిది. అభిమన్యుని మరణమునకు తానే కారణమనియు, అట్టి కొడుకు పోయిన తరువాత ఈ రాజ్యము తన కెందుకనియు, ఈ మొదలుగా ధర్మరాజు దుఃఖించుచున్నాడు అట్టివానిలో మృత్యువు స్వరూపమిది - ఎవని మరణమునకు వాడే కారణముగాని మరొకడు కాడు - అజ్ఞానముచేత దుఃఖించి ప్రయోజనములేదు - కనుక నీ కుమారుని విషయమున దుఃఖము పెట్టుకొనకుము - పెట్టుకొని ప్రయోజనములేదు - అని బోధించుటకు ప్రవర్తించిన దీ కథ అట్లు వెంటనే వ్యాసుడువచ్చి చెప్పుటలోని ఆంతర్యము ధర్మరాజు చిత్తము యుద్ధమునుండి విముఖము కాకుండచేయుట కావచ్చును దీని తరువాతి సువర్ణష్ఠీవి చరిత్రమును నీ విధమైన తాత్పర్యముతోడనే వ్రాయబడినది. ఆ కథ వేరుగా మరొకచో చెప్పబడవలసి యున్నందున నిట చెప్పుటలేదు.

## 4. త్రిపురాసుర వృత్తాంతము

ఇది దుర్యోధనుడు శల్యునకు చెప్పినది కర్ణుని రెండవనాటి యుద్ధము మొదలగుటకు ముందు, కర్ణునకు సారథ్యము చేయవలసినదిగా శల్యుని దుర్యోధనుడు ప్రార్థించినాడు కర్ణుడు శూద్రుడనియు, అట్టివానికి మూర్ధాభిషిక్తుడైన తాను సూతకృత్యము చేయుట కూడదనియు శల్యుడు నిరాకరించినాడు. మరియు నట్లడుగుట తన నవమానించుట యనియు నిశ్చయించి పలికి శల్యుడు మండిపడినాడు. వాని ననునయించుచు దుర్యోధను డీ వృత్తాంతమును చెప్పినాడు. దుర్యోధనునకు శల్యుడు కర్ణునకు సారథ్యము చేయుట కావలయును.

ఈ కథ చెప్పి దానిని దుర్యోధనుడు సాధించుకొనినాడు. శల్యు డుపచార ప్రియుడు వానిని కొంచె ముబ్బవేసినచో సులభముగా స్వాధీనము కాగలడు. ఆ విషయము దుర్యోధనున కనుభవపూర్వకముగా తెలియును నెమ్మదిగా శల్యుని యొద్దకుచేరి దుర్యోధనుడిట్లనినాడు – "నా యభిప్రాయంబు వినుము ధనంజయునకు రథిః గుణంబులం గర్ణుండు మిక్కిలి కృష్ణునకు నశ్వహృదయ జ్ఞానంబున నీ వధికుండవు. ధనంజయునకుఁ బ్రతివీరుంగా మనము కర్ణుంజాలించితిమి. అది కృష్ణుండు సెల్లనీకునికింజేసి కృష్ణువర్తనంబునకుఁ బ్రతివిధానం బాచరింప నిన్నుంగోరితిని ఇంతపని నీకుందక్క నొరులకు శక్యంబగునే ?"[1] ఈ మాటలతో శల్యు డుబ్బిపోయి ముదితహృదయుడై వెంటనే దుర్యోధనునితో నిట్లనినాడు.

నను( గృష్ణుకంటె నధికుం
డని యిమ్మనుజేంద్రకోటి యాకర్ణింపం
గొనియాడితి విమలయశో
ఘనుఁడగు కర్ణునకు రథము గడపెద నధిపా.[2]

సాంత్వనస్వరమున మధురాతురవిన్యాసముగా దుర్యోధనుడాడిన మాటలు శల్యునియందు లెస్సగా పనిచేసినవి. మరియు దుర్యోధనుడు "మాద్రపతి మనం బురియాడునో యని శంకించి యతనితో మరియు"[3] నీ త్రిపురాసుర వృత్తాంతమును చెప్పినాడు సారథియొక్క గొప్పతనమును సూచించుకథ యిది.

త్రిపురాసురవధ కుద్యమించిన పరమశివుని రథము తోలుటకు బ్రహ్మ యంగీకరించినాడు ఆ బ్రహ్మసారథియైన విషయమును స్ఫుటముగా ప్రకాశింపజేయుచు దుర్యోధనుడు కథను చెప్పినాడు. "సారథ్యంబాచరించు పురుషుండు ఖలసత్త్వఁబుల రథికునకు నధికుండు గావలసియుండు.......నేర్పును లావు గల్గినన్ సారథి పోరులన్ రథికసత్త్వముఁ దా గెలిపించు ..."[4] అను నీ మొదలైన కథాసందర్భమున ప్రసక్తికి వచ్చిన మాటలతో దుర్యోధనుడు "లోక హితా

1 భా. కర్ణ. 1-252.
2. భా. కర్ణ. 1-253.
3. భా. కర్ణ. 1-257.
4. భా. కర్ణ. 1-288, 289.

ర్థంబుగా నప్పరమేష్ఠి శివునకు సారథ్యం బొనర్చించె నీవు నట్లపోలెఁ గౌరవ రక్షణార్థంబుగా రాధేయరథంబు గడపుము ఇక్కర్ణునకు నక్కిరీటికిఁ గృష్ణునకున్ బలశౌర్యంబుల నెక్కుడయిన వాడవు ....... ఇక్కార్యంబాచరించి నన్ను రక్షింపుమని ప్రార్థించి"[1]నాడు మరియు దుర్యోధనుడు, పరశురాము డీశ్వరుని వలన దివ్యాస్త్రములు పొందుటయును, అవన్నియు కర్ణున కాయన ఇచ్చుట యును చెప్పి, కర్ణుడు హీనకులజాతుడయినచో పరశురాము డాదరించునా యేమి? అని కర్ణుని యుత్తమకుల సంజాతత్వమునుగూడ అనుమానముమీద నిర్ధరించి పలికి, చివరకు మరల "సారథి రథికునకు నధికుండు గావలయునను నీతి నీవు ప్రసన్నుండవగుటం జేసి నాకు సిద్ధించె"[2] నని చెప్పి ముగించినాడు.

శల్యుని మానసికమైన బలహీనత నెరిగిన దుర్యోధనుడు, కర్ణున కాతడు సారథియగుట కంగీకరింప జేయుటకై మాటలతో నుబ్బించుచు చేసిన ప్రయత్న మీ త్రిపురాసురసంహారముపృత్తాంత కథనము.

శల్యుడు ప్రధానకథాపురుషుడుకాడు వాని చిత్తము కర్ణసారథ్యమున కున్ముఖమగుట దానికదిగా స్వయంసంపూర్ణమైన ప్రయోజనముకాదు. "మద్ర నాథు నాకు సారథిగాఁగ నొనర్పవలయు. గెలుతు నన్నరు నలవు మెఱయ"[3] అని ఆనాడు కర్ణుడు దుర్యోధనుని కోరినాడు. కర్ణుడు నరుని గెలుచుటయే దుర్యోధనునకు కావలసినది. అందువలన శల్యుడు సారథియైనచో కర్ణుడు పార్థునోర్చి తనకు విజయముకూర్చును గదాయని దుర్యోధనుడు శల్యునందు కంగీకరింపజేయుట కతంగా యత్నించినాడు ఆయత్నమున ప్రధానమైనభాగమే యీ కథాకథనము. శల్యు డంగీకరించుటతో దుర్యోధనుని యొక్క చిత్త ముత్సాహప్రవృత్తికలదియైనది దుర్యోధనుడు కథాప్రధానపురుషులలోనొకడు. మరియు ముఖ్యుడైన ప్రతివీరుడు అట్టివాడు తాను సంతుష్టుడై తన చిత్తము ముందు కర్తవ్యమునందు ప్రవర్తించుటకు తానే మరొకరి చిత్తము ననుసరించి మాటాడి వాని నుత్తేజపరచవలసివచ్చుట విశేషము కార్యమును సాధించుట యందలి దుర్యోధనుని బుద్ధియొక్క తీవ్రమైన సూక్ష్మలక్షణ మిచటచిత్రముగా చూపబడినది.

---

1. భా. కర్ణ. 1-294.
2. భా. కర్ణ. 1-307.
3. భా. కర్ణ. 1-238.

## 5. బలరాముని తీర్థయాత్రాకథనము

కురుపాండవులు యుద్ధము చేసికొనుట యను నిష్ఠురత వినజాలక తీర్థయాత్రలకనిపోయిన బలరామదేవు డేయే తీర్థములను సందర్శించినాడని జనమేజయు డడుగగా వైశంపాయనుడుచెప్పిన విషయమిది. ప్రభాస–చమసోద్భేదన–ఉదపాన–వినశన–భూమిక–గంధర్వ – గర్గస్రోత – శంఖ – నైర్గిసక–నాగదన్వ తీర్థములయొక్కయు, సరస్వతీ – సప్తసారస్వత – ఔశన – పృథూదక – బకాశ్రమ – యయాత – సోమ – అగ్ని – కౌబేర తీర్థములయొక్కయు; బదరిపాచన – ఇంద్ర – రామ – యామున – ఆదిత్య – వసిష్ఠ–వృద్ధకన్యాశ్రమ – శమంతపంచక తీర్థములయొక్కయు; క్లుప్తమైన మాహాత్మ్యము నభివర్ణించుచు వైశంపాయను డాయా చోట్ల తిరిగి బలరాముడు వచ్చినాడని చెప్పినాడు. పక్షము పక్షమునకును సంక్షయ ప్రవర్ధనములు చంద్రునకుసంభవించినకథ–మంకణ మహామునికథ – కుమారస్వామి జన్మకథ – ప్రభావతి యను మునికన్యకథ – వృద్ధకన్యకథ – మొదలైన కథ లాయా తీర్థమహాత్మ్యములను చెప్పునవి ఇందు చెప్పబడినవి. ఈ తీర్థయాత్రాకథన మే సందర్భమున భారతమున ప్రసక్తికివచ్చిన దియు, దానివలననేమి ప్రయోజనము ప్రధాన కథావిషయమున సాధింపబడిన దియు భారతయుద్ధమును గురించి వ్రాయుచో చెప్పబడినది

## 6. సుద్యుమ్నుని కథ

యుద్ధానంతరము ధర్మరాజు బంధు మరణదుఃఖ వివశుడై, తనకిక రాజ్యమక్కరలేదనియు, పడవులకు బోవుదుననియు, మొదలుగాగలిగిన మాటలు మాటాడుచున్నపుడు, వాని బుద్ధిని రాజ్యభారవహనమున శాసించువాడయి వ్యాసుడు చెప్పినకథ యిది సుష్ఠుగా దండనక్రియానిపుణుడై నరాజు తొల్లింటి సుద్యుమ్నునివలె, అపవర్గమును బడసి సుఖించునని వ్యాసుడు బోధించగా ధర్మరాజు వాని ఉదంతము విపులముగా చెప్పవలసినదని కోరినాడు వ్యాసుడు చెప్పినాడు నిజమునికిది సుద్యుమ్నునికథకాదు శంఖలిఖితులకథ. లిఖితుని చేసిన నేరమునకు కుచితరీతిని సుద్యుమ్నుడు దండనము విధించుట ఈ కథలోని విషయము. దీనితాత్పర్యమును చివరకువ్యాసుడిట్లు తిరిగి ధర్మజునకు బోధించినాడు.

జననత! నీవునుం దగ ప్రజాపరిరక్షణ మాచరింపు నీ
యనుజుని మాట వేదవచనార్థ నిరూఢము. రాజనీతిదం

డనమునఁగాని యెొండున నొడంబడ దెన్నఁడు నార్యకోటి యం
దును వగ దక్కు మేలు మిలఁ దుష్టిగఁ జేయుము మేటి జన్నముల్.[1]

తత్పూర్వము పార్థుడు మొదలైన వారును ధర్మరాజునకు దండనీతి పరమధర్మ మని చెప్పుచునే వచ్చుచున్నారు ధర్మరాజు సింహాసన మధిష్ఠించుటకు ముందు వ్యాసుడు వానికి వివేకము కలిగించి శోకము నపనయించుటకు చెప్పిన కథ యిది ధర్మరాజభిషేకమునకు నంగీకరించినాడు.

## 7. పరశురాముని వృత్తాంతము

ధర్మరాజు రాజ్యాభిషేకము చేసికొనినాడు గాని వాని మనస్సుకుదుట పడలేదు బంధుమరణ శోకసంతప్తుడగుచు నట్లే కుమిలిపోవుచున్నాడు భీష్ముని చేత లెస్సగా ధర్మజునకు ధర్మతత్త్వోపదేశము చేయించి శోకమోహాగ్రస్తతను తొలగించుటకు శ్రీకృష్ణుడు భీష్ముని వద్దకు తీసికొని పోవుచు మార్గమధ్యమున ధర్మజునకీ పరశురాముని వృత్తాంతమును చెప్పినాడు

శ్రీకృష్ణుడే పరశురాముని ప్రసక్తిని ముందు తీసికొనివచ్చినాడు. ధర్మరాజు, భీమార్జున నకులసహదేవులు, సాత్యకి శ్రీకృష్ణుడు-అందరును రథముల మీద భీష్ముని వద్దకు పోవుచున్నారు. కురుక్షేత్రము దరియు సమయమున ధర్మజునితో శ్రీకృష్ణుడిట్లనినాడు

దూరమున నైదు మడువులు దోఁచుచున్న
యవి నరేశ్వర! మును వీనియందుఁగాదె
పరశురాముండు సేసెఁ దర్పణము నృపుల
రక్తమున భూరితర పితృభక్తి వెలయ.[2]

క్షితి నెందుం జరియించి భూపతుల నిశ్శేషంబుగా నేక విం
శతి వారంబులు ద్రుంచి యాతఁడు దుదిన్ శాంతత్వముం బొందె సు
వ్రతుఁడై —

1. భా. శాంతి. 1-172.
2. భా. శాంతి. 2-65.

శ్రీకృష్ణు డిట్లనగా—

నావుడు నమ్మహీశుఁ డతఁ డీ క్రౌర్యంబు సేయంగ నే
ల తొడంగెన్ నృపు లెట్లు గల్గిరిల యెల్లం గైకొనం గ్రమ్మఱన్ ?[1]

అని ధర్మరాజు శ్రీకృష్ణుని ప్రశ్నించినాడు. ఈ సంవాదము చాల చమత్కార ముగా నున్నది. ఇరువదియొక్క పర్యాయము భూతలముననున్న రాజుల నందరను వెదకి వెదకి చంపిన పరశురాముడు సువ్రతుడై చివరకు శాంతిని పొందినాడని శ్రీకృష్ణుడు ముందు ధర్మరాజుతో నేల తానుగా కల్పించుకొని చెప్పవలయును ? ఇచట శ్రీకృష్ణుడు వ్యంగ్యమర్యాదయా ధర్మరాజును బోధించుచున్నాడు. అవసరమువచ్చి రక్తపాతమునకు దిగినవాడు సువ్రత పరుడై శాంతత్వమును పొందవచ్చును పరశురాము డట్లే పొందినాడు దృష్టాంతముగా శ్రీకృష్ణుడు చెప్పిన విషయమిది ధర్మరాజుకూడ అవసరము వచ్చినది గనుకనే పదునెనిమిది యక్షౌహిణుల సైన్యమును తెగటార్చిన యుద్ధ మున ప్రవర్తించినాడు. యుద్ధము ముగిసినప్పటినుండియు ధర్మరాజును దుఃఖము పట్టుకొన్నది ఇంత పాపకర్మమునుచేసిన తనకు గతులు లేవన్నట్లుగా దుఃఖించుచున్నాడు. సువ్రతుడై శాంతత్వమును పొందవచ్చును పరశు రాముడు చేసిన దానికై దుఃఖింపలేదు సువ్రతపరుడై శాంతత్వమును పొంది నాడు. ధర్మరాజును నదియే చేయదగినది ఈ విషయమును శ్రీకృష్ణు డా దృష్టాంతమునకు ప్రసక్తి కల్పించి సూచించినాడు. ధర్మరాజీ సూచన నందు కొనలేదు పరశురాము డంత క్రూరకర్మ నేలచేసినాడని యడిగినాడు ఇది ధర్మజుని అంతర్యమునుబట్టి యిచ్చు ప్రశ్న తిరిగి రాజు లెట్లు కలిగిరి యన్నది సాధారణమైన ప్రశ్న ధర్మజుని బుద్ధి ముందు పరశురాముని క్రూరకర్మము నందు ప్రవర్తించినది. ఆయన చివరకు సువ్రతుడై శాంతుడైన విషయము వానికి పట్టలేదు. తా నఖిల జ్ఞాతులను వధించి చేయకూడని క్రూరకర్మను చేసినట్లనుకొని బాధపడుచున్నవాడు గనుక, పరశురాముడు రాజులను చంపి నదియు నట్లే ధర్మరాజున కనిపించినది. తా నెందుల కిట్టి క్రౌర్యమునకు దిగినాడో తనకు తెలియును పరశురామునకును నేల దిగవలసి వచ్చినది ? ముందా విషయమును తెలిసికొనవలయునని ధర్మరాజు శ్రీకృష్ణుని అడిగినాడు. శ్రీకృష్ణుడు, పరశురాముడు శాంతత్వమును బొందె సువ్రతుడై, అను విషయ

1. భా. శాంతి. 2-66.

మును ప్రధానముగా ధర్మజుని బుద్ధి కెక్కింపదలచి ప్రారంభించినాడుకాగా, ధర్మరాజు దానిని వదలి పరశురాముని క్రూరకర్మము విషయమున బుద్ధిని ప్రసరింపఁజేసినాడు— ఇది పరశురాముని కథ చెప్పబడుటకు సిద్ధమైన పూర్వ రంగము

ఇచట కథకు రెండు ముఖములు చూపబడినవి ధర్మరాజు బుద్ధి యొక దానియందున్నది. శ్రీకృష్ణుడు మరియొకదానిని వాని బుద్ధికి విషయము చేయ వలయునని చూచుచున్నాడు మరి కథయొక్క కథనమే ముఖముగా సాగ వలయును? ప్రధానత యున్నది ధర్మరాజునకు గనుక తదనుకూలముగనే సాగవలయును. కాని శ్రీకృష్ణుని తాత్పర్యము ధర్మజుని బుద్ధిని సంస్కరించు టకు నుద్దేశించుచున్నది. కనుక ధర్మరా జడిగినదానికే సమాధానము చెప్పబడు చున్నట్లుండవలయును మరియు నది శ్రీకృష్ణుని తాత్పర్యమును సాధింప వలయును. ఏవం విధముగా నీకథను చెప్పుటయందు శిల్పము చూపింపబడ వలయును. తచ్ఛిల్పమును తిక్కన్నగారు సుష్ఠుగా నిందు చూపిరి.

ధర్మరా జడిగిన, పరశురాము డేల క్రౌర్యమునకు దిగినాడను ప్రశ్నకు సమాధానము - కార్తవీర్యార్జునుని కొడుకులు, జమదగ్నిగాని పరశురాముడు గాని లేనపు డాశ్రమమున ప్రవేశించి హోమధేనువును వత్సమును తోలుకొని పోవుటతో మొదలుపెట్టి, మరియు తరువాత వారు కుపితులై వచ్చి జమదగ్ని శిరము తునిమినారనియు చెప్పి అందువలన పరశురాముడు క్రోధోద్దీపితుడై రాజులందరను వధించినాడని చెప్పిన సరిపోవును. కాని తిక్కన్నగా రిట్లు చెప్పలేదు పరశురాముని జన్మరహస్యమును ముందువ్రాసిరి మరియు కార్త వీర్యుని కుమారులు సబలాటోపాత్ములు, అవినీతులై యేల పుట్టవలసి వచ్చినదో మిత్రావరుణనందను శాపమును స్పృశించి చెప్పిరి రహస్య మంతయు నిట్లుగా నా రెండు విషయములను చెప్పుచు కథ ప్రారంభించుటలో నున్నది.

పరశురాము డంతటి క్రూరకర్మమున ప్రవర్తింపవలసి వచ్చుట దైవ ఘటన అది ఋచీకుడు కల్పించిన చరుయుగము సత్యవతియు, ఆమె తల్లియు, అజ్ఞానమున తారుమారుచేసి ఉపయోగించుకొనుట రూపమున మొదలైనది. క్షత్రియాంతకుడైన కొడుకు జన్మించు చరువును సత్యవతి ఉపయోగించుకొని నది. తరువాత తెలిసి యామె భర్తను ప్రార్థింపగా నా ఋచీకుడు పుత్రుడు గాక పౌత్రుడట్టివాడగున ట్లనుగ్రహించినాడు. పౌత్రుడుగా పరశురాముడు

బుట్టినాడు అతడు క్షత్రియాంతకరుడు కావలయును. దైవమట్లు సంకల్పించి నది కానిచో ఋచీకుడు స్పష్టముగా నిది యిట్టిది మరియు నిది యిట్టిదియని ఆ చరుయుగము నేర్పరించి, ఇది మీ తల్లికిమ్ము, ఇది నీవు వాడుకొనుము, అని సత్యవతికి చెప్పినాడుకదా! ఉపయోగకాలంబున నా తల్లికూతుంద్ర మధ్య నవి వ్యత్యస్తము లేల కావలయును? పరశురాము డా విధముగా బుట్టిన వాడు. కారణజన్ముడు ఆ చరువులు వ్యత్యస్తములు కాకుండినచో కథ యే రూపముగా నుండెడిదో మనకు తెలియదు ఇక కార్తవీర్యార్జునుడు – ఆయన చాల మంచివాడు. నయాన్వితశూరుడు ధర్మార్జన లోలబుద్ధి. అగ్నిదేవు డాహారము కావలయునని కోరగా గిరినగరారణ్య గ్రామ ఖర్వటాదు లతనికి నుపయోగించుకొనుమని యిచ్చినాడు ఆ యగ్ని వసిష్ఠుని యాశ్రమమునుగూడ కాల్చినాడు. జనపదనులనుగూడ సహస్రబాహుడు కృశానున కాహారముగా నొసగుట, వాని ధర్మార్జన లోలబుద్ధిని చెప్పుచున్నను, అది యొక విధముగా దోషము కావచ్చును అగ్నికట్లనుమతి యిచ్చి వాని కండగా నిలిచినందున వసిష్ఠుడు శపించినాడు. ఆ శాప ఫలముగా వాని కవినీతులైన కుమారులు పుట్టినారు వారి వలననే మొదట పరశురామునిచేత వాని బాహువులు నఱక బడినవి దానితో వారి యవినీతి మరియు పెరిగినది జమదగ్నిని కుత్తుక కోసి నారు. ఇక పరశురాముడు క్షత్రియ సూదనుడైనాడు పరశురాము డెట్లు కారణజన్ముడో కార్తవీర్యార్జునుని కొడుకులును నట్లే కారణజన్ములు. వా రుభ యులును క్షత్రియవంశ నాశనమునకు విధివశమున పుట్టినారు వారివలన నా పని కావలయును లౌకికముగా చూచినచో పరశురాముడు క్షత్రియుల నందరను చంపినవాడు వానికి ప్రేరణ కలిగించుటకు సమర్థమైన దుర్మార్గ మును ప్రదర్శించినది కార్తవీర్యుని కొడుకులు. పారమార్థికముగా వా రుభ యులును నిమిత్తమాత్రులు.

ధర్మరాజు జ్ఞాతివధ చేసినాడు అందుకు హేతువు దుర్యోధనుని లుబ్ధ బుద్ధి మరియు ధర్మజుని కోపము ఇది లోకము విషయము. పరమార్థ మిది కాదు. భూభారమును తగ్గించుటకు దైవసంకల్పముచేత భారతయుద్ధము ప్రవర్తించినది. ధర్మజుని కోపముగాని, దుర్యోధనుని లోభముగాని నిమిత్త మాత్రములు. మూలకారణములు వెదకినచో దుర్యోధనాదుల జన్మరహస్య ములయందు వెదకవలయును. అందువలన నా యుద్ధమునకు ధర్మరాజు తాను

కారణమని, అంతయు తనవలననే అయినదని విచారించుట కూడదు. పరశు రాముడుచేసిన క్రౌర్యము పరశురామున కెంత చెందునో, ధర్మరాజు చేసినది ధర్మరాజున కంతే చెందును. ఈ విధముగా శ్రీకృష్ణుడు ధర్మరాజు బుద్ధిని సంస్కరింప దలచుటయే, పరశురాముని జన్మరహస్యమును చెప్పుచు కథను ప్రారంభించుటలోని ఆంతర్యముగా తోచుచున్నది

ఇక ధర్మరాజడిగిన రెండో ప్రశ్న యున్నది. తిరిగి రాజులెట్లు కలిగిరి ? అనునది. మరియు శ్రీకృష్ణుడు పరశురాముని కథ, సువ్రతుడై శాంతత్వమును బొందినా డనుటను ప్రధానముగా చూపించుట కుపక్రమించినాడు. అది యట్లే యున్నది. ధర్మరాజుని రెండవ ప్రశ్న కిచ్చు సమాధానమున నిది సాధింపబడ వలయును. అందువలన, పరశురాము డశ్వమేధము చేయుటయు, తాను రాజు లను జంపి యాక్రమించిన భూమినంతయు కశ్యపున కిచ్చుటయు, ఆయన దానిని బ్రాహ్మణుల కిచ్చుటయు, రాజుచేత పాలింపబడుట లేనందున భూమి యం దధర్మము పెరిగి అనర్థములు పుట్టుటయు మొదలుగా కథ ప్రారంభ మైనది ఇది తిరిగి రాజు లెట్లు కలిగినదియు చెప్పబడుటకు భూమికా ప్రాయము శ్రీకృష్ణుని ఆంతర్య మిందు సాధింపబడినది పరశురాముడుచేసిన సువ్రత మశ్వమేధముచేసి భూమినంతయు కశ్యపునకు దానమిచ్చుట. నేల నిఃక్షత్రము చేసిన పరశురాముడు శోకదీనుడు కాలేదు. సువ్రతుడైనాడు. అశ్వమేధము చేసినాడు ఆయనకు రాజ్యమునందు మమత్వబుద్ధిలేదు మరియు బ్రాహ్మణుడు గనుక రాజ్యార్హతలేదు భూమిని త్యాగముచేసి శాంతుడై చనినాడు. ధర్మరాజు అశ్వమేధముచేసి సువ్రతుడై శాంతుడు కావలయును శోకాకులతను బోగొట్టుకొనవలయును ధర్మరాజు రాజు గనుక పరిపాలన చేయుట ధర్మము పరశురామునివలె భూమిని త్యజించి పోవుటకు వీలుకాదు. రాజుచేత సక్రమముగా పాలింపబడక భూమి యెట్టి యనర్థములకు పాలు గావలసివచ్చినదో చెప్పబడుట, ధర్మరాజు బుద్ధిని రాజ్యతంత్రములయందు ప్రవర్తింప జేయుటకొరకు కావలయును. బంధుమరణశోకమును వదలి, యశ్వ మేధముచేసి, తన రాజధర్మమున తాను నిలిచి సక్రమముగా భూమినేలుట వలయునన్న తాత్పర్యమును శ్రీకృష్ణుడు చమత్కారముగా ధర్మజునకు బోధించినాడు — మరియు భూమి కశ్యపుని ప్రార్థించి, పరశురాముని చేతిలో పడనివారిని కొందరను చూపి, వారు తనను పాలించునట్లుగా వరము కోరు

కొనినందున, తత్ఫలముగా తిరిగి రాజులు కలిగిరను ధర్మరాజు ప్రశ్నకు చెప్ప బడిన సమాధానమునందును శ్రీకృష్ణుని తాత్పర్యము ప్రసరించుచు నేయున్నది. "ఉత్తమ క్షత్రియులు దండనీతి ప్రయోగంబునంజేసి ధర్మంబు రక్షించి తన్ను సురక్షితం జేయువారుగా వరంబు" కోరినది భూదేవి. ఇది వినిన ధర్మరాజునకు, తానుత్తమ క్షత్రియుడన్న స్పృహ, తాను దండనీతి ప్రయోగమున ధర్మ మును రక్షించుట భూదేవిని రక్షించుటయే అగును - అది వలయును - అను విషయమున చిత్తము తత్కాలమునందైనను ప్రసరింపవలయును. దుఃఖరూప చిత్తవృత్తిపోయి రాజధర్మమునందు ధర్మజుని చిత్తము ప్రసరించుటయు ప్రవృత్తమగుటయు శ్రీకృష్ణునకు కావలయును శ్రీకృష్ణున కనగా భారత కథకని యర్థము. తత్కథార్థమును, ఈ పరశురాముని వృత్తాంతము చెప్పబడి కొంత సాధించినది ముఖ్యముగా ఈ సాధించునట్టి యూహతో ఈ వృత్తాంతము ప్రవేశపెట్టినది. తదనుగుణముగా నిది నిర్వహింపబడినది

పరశురాముని వృత్తాంతమును ముగించిన శ్రీకృష్ణుడు ధర్మరాజుతో నిట్లనినాడు

అప్పరుసునఁ బెరిగిన నృపు  
లిప్పుడు భారతరణోపహృతులై పలువుర్  
గుప్పలు కొనఁబడి రనికిం  
దప్పిన వాఁడొకఁ డొకండ ధరనంతంతన్

వ నీ వడిగిన పూర్వవృత్తాంతంబు చిత్తాయత్తంబుగా నెఱింగించితి. ఈ ఉపసంహార వాక్యములయందు శ్రీకృష్ణుడు. తాను పరశురాముని వృత్తాంత మును ప్రసక్తికిదెచ్చుటలోని ఆంతర్యమును, తదనుగుణమైనతన కథాకథనమును సూచించుచున్నట్లు కనిపించుచున్నది. అప్పరుసున బెరిగిన నృపులనగా నట్లు పరశురాముడు చేసిన తరువాత పెరిగిన రాజులని యర్థము వా రందరును భారతరణమున మరణించిరి. భారతరణము ధర్మరాజు నాయకుడుగా జరిగి నది ఒకసారి పరశురాముడు రాజుల నందరను సంహరించినాడు మరొకసారి ధర్మరాజు సంహరించినాడు పరశురాముడు చేయుట కేది కారణమో ధర్మ రాజు చేయుటకును నదియే కారణము అప్పుడు చెదరిపోయి యొకరిద్దరు మిగిలినట్లుగా నిప్పుడును నక్కడక్కడ నొక్కడుగా నుండవచ్చును ఆ పద్య మును చెప్పుటలో పరశురాముడు చేసిన దానితో ధర్మరాజుని చేసినది పోల్చి

చెప్పుట కనిపించుచున్నది అందువలన పరశురామునివలెనే సువ్రతుడై ధర్మ రాజు శాంతత్వమును బొందుట నాశించియే ఈ వృత్తాంతము ప్రవర్తింపజేయ బడియుండుట పరమవిషయము మరియు శ్రీకృష్ణుడు నీవడిగినది చిత్తా యత్తంబుగా నెరింగించితి ననుచున్నాడు ధర్మజుని-చిత్తము-ఆయత్తము-కాన్-చిత్త మాయత్త మగునట్లుగా కథ చెప్పబడినదని యర్థము అనగా తచ్చిత్త సంస్కారము నుద్దేశించి కథాకథనము జరిగినది ఆయత్తమనగా సిద్ధమని చెప్పవచ్చును. జాగరూకమని చెప్పవచ్చును. అపుడు, ధర్మజుని చిత్తము శోకమోహములను వదలి రాజ్యతంత్ర నిర్వహణమునకు సిద్ధమగు నట్లుగా అనగా సిద్ధమగుటనుకోరి, ఈ కథ చెప్పబడినదని యర్థము. మరియు ధర్మజుని చిత్తము బంధుమరణ శోకమోహముల వలన ప్రమాదమును బొంద నిది యగునట్లుగా చేయుట కీ కథ చెప్పబడినది — ఈ రెండర్థముల పరమార్థ మును నొకటియే

భీష్మునిచేత ధర్మ తత్త్వోపదేశము చేయించి ధర్మరాజును శాంతుడుగా నొనరించు పూనికతో తీసికొనిపోవుచున్న శ్రీకృష్ణుడు మార్గమధ్యమున నీ వృత్తాంతమును ప్రసక్తికి తీసికొనివచ్చి చెప్పుట, తన చేయదలచుకొనిన దానికి భూమికాప్రాయముగానున్నది. కదార్థము ఘటితపూర్వాపరమై సంగతపడి యుండు నట్లుచేయు తిక్కన్నగారి నిర్వహణ శిల్పమిందు నాన్యతోదర్శనీయ ముగానున్నది శ్రీకృష్ణునిచేత కథనట్లుపసంహరింపించుట, తన కావలయునని చేసి చూపిన కథన శిల్పమును తిక్కన్నగారు సూచించుచున్నట్లు కనిపించు చున్నది.

## 8. మరుత్తుని యజ్ఞకథ

భీష్ముడు స్వర్గమును గురించిపోయినాడు ధర్మరాజునకు తిరిగి దుఃఖము పట్టుకొన్నది. ఈ దుఃఖము లక్షణము వేరు. తనచేసిన కల్మషమును బోగొట్టగల అనుష్ఠానమును విధింపవలసినదిగా ధర్మరాజు వ్యాసుని కోరినాడు ఆయన అశ్వ మేధము నధిక దక్షిణాన్వితముగా జేయుమని చెప్పినాడు ధర్మరాజు తనవద్ద తగిన ధనము లేదనినాడు మరుత్తుని యజ్ఞమున ప్రతిగృహీతులైన బ్రాహ్మ ణులు మోసికొని పోలేక హిమాలయ ప్రాంతమున భూమిలో పూడ్చిపెట్టినా రనియు, అ పూడ్చిపెట్టబడిన బంగారమును త్రవ్వికొని వచ్చి యజ్ఞముచేయు

మనియు వ్యాసుడు చెప్పినాడు మరుత్తుడంత బంగారము నెట్లుపార్జించెనని ధర్మరాజడిగినాడు. వ్యాసుడు మరుత్తుని యజ్ఞకథను జెప్పినాడు.

ధర్మరాజడిగిన నొక్క ప్రశ్నమాధారముగా తొంబది గద్యపద్యములలో సవిస్తర మధురముగా నీ కథ వ్యాసునిచేత చెప్పబడినది. ధర్మజుని చిత్తమశ్వమేధయజ్ఞమును చేయుటయందు బద్ధమైన ప్రవృత్తికలదిగా చేయబడుటయే దీని పరమార్థము తదర్థ సాధనమున కాధర్మజుని ప్రశ్నమాధారము దాని నుండి యింతకథ చిత్రముగా పుట్టింపబడినది సంవర్తునితో కలిసి, హిమవంతము నుత్తరభాగముననున్న ముంజవంతమను పర్వతమునకుబోయి, అచట శివాసహాయుడుగా విహరించుచుండు శివుని ప్రార్థించి తత్ప్రసాదమున బంగారమును నసంఖ్యముగా మోపులుగట్టి తెచ్చుకొని మరుత్తుడు యజ్ఞముచేసినాడు. అయన కంత బంగారమట్లు శివుని కరుణవలన లభించినది ఇది ధర్మరాజడిగిన దానికి సమాధానము. దీనినుండి కథ మొత్తము పుట్టింపబడవలయును. సంవర్తుడెవరు? ఆయన బృహస్పతి తమ్ముడు. మరుత్తున కాయనతో నేమి సంబంధము? తన యజ్ఞమున కాయనను మరుత్తు డుపద్రష్టగా వరించెను. బృహస్పతి యుండగా మరుత్తుడు సంవర్తుని నేల వరించెను? బృహస్పతి అంగీకరింపలేదు. ఏల? దేవేంద్రుని మాటమీద దేవేంద్రుడేల బృహస్పతిని వలదనెను? మరుత్తుడు తనను జీరికి జేకొనడు, అందువలన మరుత్తునిపై దేవేంద్రునకు కోపము కనుక బృహస్పతిని వలదనెను. మరుత్తుడు దేవేంద్రుని లెక్కజేయనియంత గొప్పవాడా? అవును ఆయనవంశమే అంతగొప్పది. మరి దేవేంద్రునకు భయపడి బృహస్పతి మరుత్తున కుపద్రష్టగా నుండుట కంగీకరింపనిచో నాయన తమ్ముడు సంవర్తు డెట్లంగీకరించినాడు? ఆ యన్నాదమ్ములకు సరిపడదు ఆ విరోధమువలన సంవర్తుడంగీకరించినాడు మరి బృహస్పతి - ఇంద్రుడు దాని కూరకొనిరా? మరుత్తుడు యజ్ఞము ప్రారంభించువరకును వారికా విషయము తెలియదు సంవర్తు డుపద్రష్టయగునని వారూహింపలేదు. అందుకు కారణమాయన కాశీనగరమున పిచ్చివాడుగా తిరుగుచుండుట. తనకుప్రదష్టయగుటను మరుత్తు డెట్లొప్పుకొనినాడు? నారదుడు సంవర్తుని గొప్పతనమును చెప్పి నీవు పోయి ప్రార్థింపుమని మరుత్తునకుపదేశించినాడు ఆ విధముగా మరుత్తుడు సంవర్తుని నుపద్రష్టగా వరించినాడు ఆయనయే బంగారమును సమకూర్చి యజ్ఞము చేయించినాడు. ఈ విధముగా ధర్మరాజునకు చెప్పబడిన సమాధానము స్వయం సంపూర్ణమగు

టకు వ్యాసుడు కథను విస్తరించినాడు తిక్కన్నగారీ కథనంతయును వరుసగనే వ్రాసిరి ప్రధానముగా చెప్పబడవలసినది ధర్మరాజు ప్రశ్నమునకు సమాధానము. దానిని చుట్టుకొని పెద్దకథ చెప్పబడినది ఆ సమాధానము కథ కెట్లు మూలమగుచున్నదో చూపుటకొరకుగా నిచట ముందా సమాధానము వ్రాయబడి, దానినుండి పరంపరగాబుట్టు ప్రశ్నలు చూపబడినవి తత్తత్సమాధానముల మొత్తము కథయగుచున్నట్లు స్పష్టము చేయబడినది.

మరుత్తుని వంశమెంత గొప్పదో చెప్పుటకుముందు కొంతకథ, దేవేంద్రుని మీద కచ్చగట్టిన వాని యజ్ఞమును నిర్విఘ్నముగా కొనసాగించిన సంవర్తుని గొప్పతనమునకు నిదర్శనముగా యజ్ఞము సుప్రయోగమైన కొంతకథ, పైన చూపింపబడిన కథావిషయమునకు ముందు వెనుకల ననుసంధింప బడియుండి మొత్తము వెరసి మరుత్తుని యజ్ఞకథ యగుచున్నది ధర్మజుని ప్రశ్న మొక్కటి ఆధారముగా చెప్పబడిన ఇంతకథ మరికొన్ని ప్రయోజనములను సాధించు చున్నదివలె తోచుచున్నది

"కృతయుగంబున దండనీతి ప్రవర్తకుండగు మనువునకుఁ బ్రజాని యను తనయుం డుదయించె నతనికి......" ఈ విధముగా మరుత్తుని వంశము మూల పురుషునినుండి చెప్పుటగా నీ యజ్ఞకథ ప్రారంభింపబడినది. మరుత్తుని తాత కరంధముని గొప్పతనముచెప్పి అసలువానికథ మొదలు పెట్టబడినది. దేవేంద్రుని లెక్కజేయనితనము మరుత్తునియందు చూపించుటకుగా మనువునుండి వంశ క్రమము చెప్పబడినది మరియు కరంధముని గొప్పతపశ్శక్తి నిరూపింపబడినది దండనీతి ప్రవర్తకుడైన మనువువంశమున బుట్టిన మరుత్తుని కంత శక్తి ఆ వంశమున పుట్టుటచేత వచ్చినది ఆ వంశము దండనీతి ప్రవర్తకము. ధర్మరాజున కంతకు బూర్వమునుండి దండనీతి ప్రవర్తకత్వము కర్తవ్యముగా బోధింపబడు చున్నది ధర్మజుని బుద్ధియందు స్థిరముగా నెలకొనలేదు. మధ్యమధ్య చలించు చున్నది. అట్లు చలింపకుండ జేయుట నుద్దేశించి మరుత్తుని కథను వ్యాసు డా విధముగా ప్రారంభించినాడు దండనీతిమాహాత్మ్యమును వ్యంగ్య మర్యాదయా ధర్మజుని బుద్ధి కెక్కించు ప్రయత్నమందు పుష్కలముగా స్ఫురించుచున్నది.

సంవర్తుడెంత గొప్పవాడనగా తన తపశ్శక్తిచేత, తనమంత్రశక్తి చేత అగ్నీంద్రాదులకు వెరపు పుట్టించినవాడు మరుత్తుని యజ్ఞమును విఘ్నము

చేయవలయునని మరియు సంవర్తునకు మరుత్తునకు భేదము పుట్టింపవలయునని దేవేంద్రు డగ్నినిపంపినాడు. అగ్ని మరుత్తునివద్దకువచ్చి నీకుపద్రష్టగా బృహస్పతి రాగలడు. సంవర్తుని వదలుకొనుము దేవేంద్రుడీ విషయము నీతో చెప్పుటకు నన్ను బంపినాడనినాడు. ఈయనుట సంవర్తునియెదుట. మరుత్తుడు ససేమిరా అంగీకరింపలేదు అగ్ని యింకను మాటాడుచున్నాడు. అపుడు సంవర్తుడు కృశానునితోనిట్లనినాడు-"ఇట్టిగతి నీవింకాడిన మద్దారుణదృష్టిని నినుగాల్తు"[1]ను. దృష్టిప్రసారణ మాత్రముచేత నగ్నిని కాల్చగలంత తీవ్రతపశ్శక్తి సంపన్నుడు సంవర్తుడు. నిజముగా తనను కాల్చునని అగ్ని భయపడినాడు. ఇంద్రుడు మరి యింకొకసారిపోయి మాటాడి చూడుమని యనగా నగ్ని "ఇంక వచ్చిన దారు ణేక్షణ దగ్ధుగావింతుఁ జుమ్మి యని విపులకోపమూర్తియై పలికె సంవర్తుడు. కావున వెఱతు నేనటపోవ. వేఱొకండు బోవుగాక"[2] అనినాడు ఇది అగ్ని యొక్క సంవర్తునకు భయపడిన లక్షణమేకదా! ఆశ్చర్యకరమైన విషయము. సంవర్తుని మహాత్మ్యమట్టిది యజ్ఞమునంత విఘ్నము చేయుటకు యత్నించిన దేవేంద్రుని హావిర్భాగమును గైకొనుట కాహ్వానించి తనమంత్ర బలిమిచేత రప్పించినాడు సంవర్తుడు దేవేంద్రుడు రాకతప్పినదికాదు. వచ్చి నేను ప్రీతిని పొందితినని చెప్పవలసిన వాడైనాడు మరుత్తుని యజ్ఞము సుప్రయోగముగా చెల్లినది—ఈ కథ. ధర్మజుని బుద్ధి అశ్వమేధమునందు లెస్సగా ప్రవర్తించుటకు, మరియు మరుత్తునివలె పూనికతో నెరవేర్చవలయునన్న నిశ్చయము కుదురు టకు, ఉపద్రష్ట యెట్టివాడు కావలయునో తెలియుటకు, వ్యాసుడు చెప్పినాడు

ఈ కథ వినిన ధర్మరాజు "బంధువిషయ శోకంబునం గ్రమ్మఱం దెలివి నొందయు నొందక ధూమంబు వొదలిన యనలంబునుంబోలె"[3] నున్నాడని తిక్కన్నగారు వ్రాసిరి. ధర్మజుని చిత్తము లెస్సగా సంస్కృతమైనది అది అగ్నివలె తేజోవంతమైనది. అనగా జ్ఞానవంతమైనది బంధుమరణశోక మూరక ధూమమువలె పైపైన వ్యాపించుచున్నది అనగా వ్యాసుడు ధర్మరాజు చిత్తము నెట్లు సంస్కరించుట నుద్దేశించి యింతకథ చెప్పినాడో ఆ యుద్దేశము చాలవరకు నెరవేరినదన్నమాట తరువాత శ్రీకృష్ణుడు కొద్దిగా నుపదేశించి

---

1. భా. అశ్వ. 1-78.
2. భా. అశ్వ. 1-83.
3. భా. అశ్వ. 1-107.

నాడు దానితో నాపై పొగ కొంచెమును బోయినది ధర్మజుని చిత్తము స్థిమితపడినది అనగా రాజ్యతంత్రములయందు ప్రవర్తించుటకు నిశ్చయమైనది. దండనీతిని ప్రవర్తింపజేయు సుక్షత్రియులాచరించు నశ్వమేధమున కున్ముఖమైనది. చివరకు ధర్మరాజని వాడు– ''భవత్ప్రసాదంబునం గందువ గనిన కనకమ్ము మిమ్ముం బురస్కరించుకొని పోయి చేకొనంగలవాడ''[1]ను — అని. ఇది వ్యాసునితో నన్న మాట మరుత్తుడు సంవర్తుని పురస్కరించుకొనిపోయి బంగారమును దెచ్చుకొన్నట్లుగా ధర్మరాజు వ్యాసుని కలుపుకొని పోవుటను చెప్పచున్నట్లున్నాడు. మరుత్తునివలె తానును యజ్ఞముచేయుటకు నిశ్చయించుకొనినట్లు. వ్యాసు డే ఆంతర్యముతో కథను చెప్పినాడో అది సంపూర్ణముగా ధర్మరాజునందు ఫలించినది. యజ్ఞమున ధర్మజున కుపద్రష్టలలో వ్యాసుడే మొదటివాడు–ఇది మరుత్తుని యజ్ఞకథయొక్క పర్యవసానము

## 9. నకులోపాఖ్యానము

జనమేజయు డడుగగా వైశంపాయనుడు చెప్పినకథ యిది. ఈ నకులో దంతమును పెనవేసికొని ప్రసక్తములైనవి సక్తుప్రస్థునికథ. అగ్యస్త మహర్షి ద్వాదశవార్షిక యజ్ఞకథ, జమదగ్నికి పితృదేవతల వలననైన శాపకథ కనుక నకులోపాఖ్యాన మనగా నివన్నియు నగుచున్నవి. సక్తుప్రస్థునికథ, అగస్త్యుని కథ అవాంతరవిషయములు. మధ్యలో నుదాహరణార్థముగా వచ్చినవి.

ధర్మజుని చేసిన అశ్వమేధము సుప్రయోగమై చెల్లినదని విన్న జనమేజయుడు వైశంపాయనునితో నిట్లనినాడు.

అనఘ! మత్పితామహుని యశ్వమేధయా
గంబు సమయమునఁ గరంబు విస్మ
యంబుఁజేయఁ జాలు నట్టిది యేమేనిఁ
గలిగెనేని వినఁగ వలతుఁజెపుమ.[2]

ఇందుకు సమాధానముగా నాయన నకుల మొకడు బిలమునుండి వెలికివచ్చి, ధర్మజు నశ్వమేధము నాక్షేపించి, ఆ తన యాక్షేపము సత్యమని ఋజువుచేయు

---

1. భా అశ్వ 1–138.
2 భా. అశ్వ. 4–213.

టకుగాను సక్తుప్రస్థుని యుదంతము చెప్పినదనియు నెరంగించినాడు దానిమీద జనమేజయుడు తిరిగి వేదవ్యాసాది మహర్షుల చిత్తమున కెక్కునట్లుగా నిర్వ హింపబడిన తన పితామహుని యజ్ఞము నానకుల మట్లాక్షేపించుటలోని సామం జస్యమేమని యడిగినాడు అందుకు సమాధానముగా దేవేంద్రుని యజ్ఞము విషయము, అగస్త్యుని విషయము వైశంపాయనుడు చెప్పినాడు అంత హింసా రహితమైన యాగమే మహితయాగముగా బుద్ధిచేత నిశ్చయించుకొని జనమే జయుడు, ఆ నకులము నిజముగా నకులమై యుండదు - ఎవరో అహీనబోధ ఘను డట్లాడియుండు ననిపించుచున్నది - చెప్పదగునేని చెప్పుమనగా జమదగ్ని పితృదేవతల వలన నకుల మగునట్లుగా శపింపబడిన కథను వైశంపాయనుడు చెప్పినాడు. ఈ చెప్పబడినదంతయు నకులోపాఖ్యాన మన్నది ప్రసక్తికి వచ్చిన విధము ఇంత యుపాఖ్యానమునకును పశుయజ్ఞమునకంటె తపోయజ్ఞము శ్రేష్ఠమైనదని నిరూపించుటయే తాత్పర్యము విశేషకథనశిల్పము ముఖమున గాక సాధారణముగా నా తాత్పర్యమును తిక్కన్నగారు నిరూపించిరి. ఈ నకులోదంతమునంతకును మొగలు జమదగ్నికైన శాపకథ అది చిత్రముగా వ్రాయబడినది. ఏది ప్రధానమో అందే కవి సృష్టిని కేంద్రీకరించును.

జమదగ్ని పితృకార్యమును సంకల్పించినాడు అందుకొరకుగాను హోమ ధేనువును పిదికి ఆ పాలపాత్రనొకచో నుంచినాడు. క్రోధాధిదైవముసాకార వృత్తివచ్చి ఆ పాలకుండను గూల్చినది దానికి జమదగ్ని మిన్నకుండెను ఆయ నను పరీక్షింపవలయుననియే క్రోధాధిదైవ మాపని చేసినది. ఆ పరీక్షలో జమ దగ్ని నెగ్గినాడు పితృకార్యము వికలమైనది పితాళ్ళకు కోపము వచ్చినది. జమదగ్నికి పొడసూపి "నీవు శ్రాద్ధంబునకు సంకల్పించియుండి తద్వైకల్యంబు పుట్టిన నూరకుండితి. అని పలికి-ముంగివై పుట్టుమని శపించి"[1]నారు. ఈ వాక్య రచనలో నొక విశేషమున్నది నీవు శ్రాద్ధంబు సంకల్పించి .... ఊరకుండితి. ఇది ప్రశ్నవలె కనిపించని వాక్యము కాని ప్రశ్నయే సాధారణ పరిస్థితులలో ప్రశ్న అట్లుండదు ఎదుటి మానిసి చేసినది మనము తెలిసి, దానికి నతనిని బద్ధుని చేయుటకుగాను నిలువదీసి మాటాడుచో మనము మాటాడుట యట్లుండును. నీవిది చేసితివి-అవునా ? అను మన యర్థమును ప్రశ్నారూపమునలేని వాక్య మున నెదుటివాని బుద్ధికెక్కునట్లు మనమందుము. అట్లనుచు నొక్కొక్క

---

1. భా. అశ్వ 4-282.

శబ్దముమీద మనము ప్రయోగించు కాకువునుబట్టి, మనచూచు వైఖరినిబట్టి, వీనికిది నిశ్చయముగా తెలిసినది– నా చేత నవుననుపించుట కిట్లడుగుచున్నాడు – అని ఎదుటి వానికి బోధపడును. అవుననుట కొక భయముతో నిష్టముకాక, కాదనుటకు ధైర్యము చాలక వాడట్లే ఊరకుండును. అది వాని యంగీకార ముగా మనము గ్రహింతుము. లోకమునందలి యీ స్థితికి ప్రతిబింబముగానున్నది. జమదగ్నిని పితృదేవతలు కని మాటాడుట నీవు శ్రాద్ధంబునకు...ఊరకుండితి– అను మొదటి వాక్యము నీవిది యిట్లుచేసితివి–అవునా అను నర్థముతో నున్నది. జమదగ్ని మాటాడలేదు. జమదగ్ని మాటాడక నిలిచిన తరువాత పితృదేవతలు శపించిరి. అనగా నా మొదటి వాక్యమని క్షణము కాలమాగి జమదగ్ని ఎదురు మాటాడకపోగా పితృదేవతలు శపించిరి. లోకమున నిట్టి పరిస్థితిలో మనమును నచ్చముగా నట్లే ఎదుటివానినొక మూలకు నెట్టి సూటిగాపలికి క్షణకాలమూర కుందుము. అని పలికి ముంగివై పుట్టుమని శపించిరని తిక్కన్నగారు రెండవ వాక్యము మొదలుపెట్టుటలో వారు క్షణమాగి ముంగివై పుట్టుమనినా రన్న విషయమును చిత్రముగా తెలియజేసిరి.

ఈ శాపవచనములయందలి వైచిత్రి, మిగిలిన కథాసందర్భముల యందలి శాపవచనములతో పోల్చి చూచికొనినచో స్పష్టముగా తెలియును. గాంధారి యాదవకులమును శపించినది. అచట తిక్కన్నగారువ్రాసిన గాంధారి యనిన వాక్యమిట్లున్నది. "ఉత్తమ జ్ఞాతులఁ దమలోన సంగరమునఁ బొలియఁ జేసితిగాన పొలియుదు రన్యోన్య ఘాతుకులై భవజ్ఞాతి జనులు, నీవును దప్పక నేఁడాదిగా ముప్పదాఱగునేఁడైన యద్దినమున నరయ దిక్కెవ్వరును లేని యగ్గ లంపుఁ గుత్సితంపుఁ దెఱంగున గూలువాఁడవు"[1] శ్రీకృష్ణునితో పలికిన వాక్య మిది. ఇట్లు చేసితివిగాన నీ వట్లగుదువు–ఇందు వ్యవధానము లేదు. కణ్వాదులు వృష్ణికుమారులను శపించినదియు చూడవచ్చును. సాధారణముగా శాపవచనము లన్నియు నిట్లే యుండును. పితృదేవతల శాపవాక్యముల రచనలో విశేష మున్నది లోకము నెరిగి దాని నూహింపవలయును.

పితృదేవతలట్లు శపించిన తరువాత జమదగ్ని "వారలకు దండప్రణా మంబుసేసి తపస్వికి నలుగం దగదని యపరాధంబు గనియును గ్రోధాధిదైవం

1. భా. స్త్రీ. 2-160.

బునకు నలుగనైతి - తప్పు సైచి నన్ను దయఁజూచి శాపమోక్షము ననుగ్ర హింపుడు''[1] అని ప్రార్థించినాడు. దాన ''వారు దెలివినొంది విదగ్ధ విప్ర సమూహంబొడంబడునట్టి యుచితవాక్యంబుల నీ వెన్నఁడేని మహాధర్మంబు గీఁడని యాడితి నాడు నీకు శాపమోక్షంబగునని నిర్దేశించిరి''[2]. ఈ పితాళ్ళ యొక్క శాపమోక్షానుగ్రహ స్వరూపము చిత్రముగానున్నది. ఒక మహాధర్మ మును ధర్మము కాదని విదగ్ధులైన విప్రసమూహము అంగీకరించునట్లుగా మాటాడవలయును. మహాపండితులైన బ్రాహ్మణులచేత పరమమైన ధర్మము నొకదానిని కాదని అంగీకరింపజేయుట పొసగునా? పొసగవలయును. అపుడే శాప మోక్షణము. ఈ శాపమోక్షణము రహస్యము జమదగ్ని పితృదేవతలను ప్రార్థించుటలో నున్నది. తాను తపస్వి. క్రోధము పడరాదు. కనుక నపరాధము గనియును నలుగలేదు. ఈ విధముగా తాను చేసినదానిని సమర్థించుకొనుచు జమదగ్ని ప్రార్థించినాడు. ఇచట జమదగ్ని యభిప్రాయమిది. పితృకార్యము సంకల్పించి అది కండ్లముందు వికలము చేయబడగా నూరకుండుట దోషమే. కాని నేను తపస్విని గనుక క్రోధమును చంపుకొనవలయును. చంపుకొంటిని. ప్రస్తుతపు నా ధర్మమున నేను నిలువద్రొక్కుకొనుటచేత అది మీ యందు దోషమును చేసినట్లైనది. పితృకర్మ చేయుట యెంత ధర్మమో తపస్వికి క్రోధము లేకపోవుటయు నంతే ధర్మముగదా! నే నధర్మము చేయుటలో ధర్మము నాశ్రయించియే యున్నాను కాన నాకీ శాపమునకు మోక్షము ననుగ్రహింపుడు. ఈ జమదగ్ని ఆంతర్యమైన ధర్మాధర్మ మీమాంస పితాళ్ళకు వాని మాటవలన స్ఫురించినది. కనుక తెలివినొందినారు. అనగా క్రోధము శమించినవారై జ్ఞానమూర్తులైన ట్లర్థము. ఇపుడు పితాళ్ళ కొక ఇరకాటము వచ్చినది. పితృకర్మ చేయుట - తపస్వి శాంతుడగుట - రెండును ధర్మములే. జమదగ్ని రెండవది ధర్మముగా చూపించుచున్న ట్లవగాహన మగుచున్నది. అది కాదనుటకు వీలుకానిది. కాని పితృకర్మ వదలదగిన ధర్మమని వా రంగీక రింపరాదు. అందువలన జమదగ్ని ధర్మము నాచరింపనివాడే. కాని వాని వాద మును బలవంతమే. కనుక శాపమోక్షము ననుగ్రహింపవలయును. ఈ విధ ముగా వారు ఇరుకునపడిరి. అందువలన వా రట్లు శాపమోక్షము ననుగ్ర

---

1. భా. అశ్వ. 4-282, 283.
2. భా. అశ్వ. 4-284.

హించిరి రెండు ధర్మములు విరోధులై ఏకకాలమున నిర్వహింపబడవలసి రాగా నీవు మాకిష్టముగాని ధర్మమును నిర్వహించి, మాకిష్టమైనదానిని త్యజించినావు మరియు నీవు చేసినది మా చేత నంగీకరింపజేయుటకు ప్రార్థించు చున్నవాడువలె యత్నించినావు మేముకాదు విదగ్ధులైన విప్రు లంగీకరింప వలయును. ఒక పరమధర్మమును, మరొక ధర్మమును చూపి దానిని కాదని వారిని అంగీకరింపజేయుము. అపుడు శాపమునుండి నీవు విముక్తుడ వగుదువు- పితృదేవత లిట్లు జమదగ్ని ననుగ్రహించుచున్నట్లే మరియు నిరుకున బెట్టిరి

అట్టి శాపమును - దాని మోక్షమును పితృదేవతలవలన పొందిన జమదగ్ని నకులమైనాడు ధర్మరాజుచేసిన యశ్వమేధమును ''సక్తుప్రస్థ నలఘు ధర్మము నేమియు బోలదీయది'' అని, ఆ యజ్ఞమున సంతృప్తులైన విప్రజన సమూహాము నెదుట నకులమైన జమదగ్ని యనినాడు. ఆ విప్రు లాశ్చర్యపడి అది యెట్లని అడిగినారు. నకులము సక్తుప్రస్థుని యుదంతము చెప్పినది ధర్మరాజు చేసిన ఈ మహా ధర్మకార్య మట్టిది కాదని నిరూపించుటకు ప్రత్యక్ష ప్రమాణముగా తన కనకమయమైన శరీర పార్శ్వమును చూపినది విదగ్ధులైన ఆ విప్రుల కేమియు ననరాకపోయినది నకులమునకు శాపమోక్షమైనది. సక్తుప్రస్థుడు చేసిన ఉంఛవృత్తిలోడి యతిథిపూజ హింసలవలేశమైననులేని ధర్మకార్యము. అది తపోయజ్ఞము ధర్మరాజు చేసిన యశ్వమేధము హింసాయుతమైన వస్తుయజ్ఞము ఇదియు నదియు రెండును వైదికములే కాని దీనికంటె అది శ్రేష్ఠము. అనగా నీ రెండు వైదికధర్మములలోను శ్రైష్ఠ్యమైనది తపోయజ్ఞము పితృదేవతల విషయమున పితృకర్మకంటె క్రోధ త్యాగము శ్రేష్ఠమని జమదగ్ని చెప్పినట్లుగనే ఇచట ఈ యశ్వమేధమహాధ్వర నిర్వహణ రూపమైన ధర్మమునకంటె అతిథి సంతర్పణ పూర్వకమైన తపోయజ్ఞము శ్రేష్ఠమైన ధర్మమని జమదగ్ని చెప్పినాడు. జమదగ్ని చెప్పినది సమంజసముగా నున్నది మరియు నందుకు ప్రమాణముగా నకులము సక్తుప్రస్థుని యాశ్రమమున నా పేల పిండి సోకుటవలన, ఆ యతిథిని పాదములు కడిగిన జలములు సోకుటవలన తన మస్తకము శరీరమునందలి యొక భాగము కనకమయములైనవని చూపి, రెండవ భాగమును నట్లే కనకమయము చేసికొనవలయునని ధర్మరాజు నశ్వమేధమునకు వచ్చితిననియు, లాభము కనిపించలేదనియు, నందువలన నీ ధర్మజుని ధర్మకార్య మా బ్రాహ్మణుని యలఘుధర్మమునకంటె తక్కువయనియు చెప్పినది

ఆ విప్రులకు నకులముచూపి చెప్పిన ఈ ధర్మవిషయము సత్యమనియే బుద్ధికి తోచినది కనుకనే వారేమియు ననజాలకపోయిరి అశ్వమేధమువంటి మహాధర్మమును పరమధర్మముకాదని విదగ్ధులైన విప్రులొడంబడునట్లుగా నకుల మాడినదైనది పితాళ్ళ వచనము ప్రకారము శాపమునకు మోక్షము కలిగినది

పశుయజ్ఞమునకంటె తపోయజ్ఞముయొక్క యెక్కువ తనమును నిరూపించుటకీ నకులోపాఖ్యానము భారతమున ప్రవర్తించినది. సక్తుప్రస్థుని యుదంతము నకుల ముదాహరించినది దేవతాపక్షపాతమున నుపరిచరవసువు ఇంద్రుని యజ్ఞము సందర్భమున పశువిశసనము కర్తవ్యమని మునుల కెదురు తిరిగి మాటాడినందున అధఃపాతమును ప్రాపించినట్లు వైశంపాయనుడు జనమేజయునకు చెప్పుటలోని యుద్దేశముకూడ తపోయజ్ఞముయొక్క శ్రేష్ఠత్వమును నిరూపించుటయే పతన్నిగూపణానుకూలమైనదియే అగస్త్యుని ద్వాదశ వార్షిక సత్రవము విషయమును. అశ్వమేధ పర్వము ద్వితీయాశ్వాసముననున్న అధ్వర్యునకును యతికిని జరిగిన సంవాద మీ తాత్పర్యమునే చెప్పుచున్నది "పశుయజ్ఞమునకంటె ననఘ తపోయజ్ఞనిరూఢి మేలు" అను నచటి తాత్పర్యమే పర్వాంతమున మరియు స్థాపింపబడినది. ఈ యుపకథ భారతమునందలి ప్రధానకథాపురుషుల చిత్తవృత్తులకుగాని, కథాగతికినిగాని సంబంధించినది కాదు అయినను నొక ధర్మసూక్ష్మమును భారతము మొత్తమున కాంతర్యముగా నున్నదానిని నిరూపించునది యగుటచేత నిచట గ్రహింపబడినది ఇంతకు పూర్వము పరామర్శింపబడిన ఉపకథలవంటిది కాదిది.

## పునరుక్తములు

ఈ శీర్షికను పరామర్శింపబడు కథలు రెండు రకములుగా నుండును. తిక్కన్నగారిచేత విరాట మాదిగాగల పదునైదుపర్వములలో తిరిగి వ్రాయబడిన కథ లొకరకము నన్నయ్యగారిచేత వ్రాయబడి మరల తిక్కన్నగారిచేత వ్రాయబడిన కథ లింకొకరకము భారతమున తాత్త్వికవిషయ కథనమునగల పునరుక్తి కిచట ప్రసక్తిలేదు.

## 1. వృత్ర కథ

పురందర విజయోపాఖ్యానమను పేర ఉద్యోగ పర్వమున శల్యుడు ధర్మ రాజునకు చెప్పిన కథలో వృత్రవధ యున్నది. అక్కడ వినిన ధర్మరాజే తిరిగి శాంతిపర్వమున "నతండును (వృత్రుడు) ఆఖండలుండును ఖండనంబు సేసిన తెఱంగెఱింగింపవే"[1] అని భీష్ము నడిగినాడు ఆయన చెప్పినాడు. వృత్రుడు సనత్కుమారునివలన తాత్త్విక వచనములు విని ప్రాణములు విడిచి విష్ణుని పొందెనని పితామహుడు చెప్పగా ధర్మరాజాతనికి నింద్రునితోనైన యుద్ధ మెట్లని యడిగినాడు. ఆ ప్రకరణమున ప్రధానము తత్త్వోపదేశము. వృత్రుని జ్ఞానాతిశయమును వినిన ధర్మరాజు, వానికి నింద్రునితోనైన యుద్ధమును గురించి యడిగినాడు.

ఉద్యోగపర్వమునందలి కథకును శాంతిపర్వమునందలి కథకును భేద మున్నది. అచట దేవేంద్రుని పట్టుకొని వృత్రుడు మ్రింగినాడు. శాంతిపర్వమున యుద్ధమున నింద్రుని మూర్ఛాయత్తుని చేసినాడు దేవతలు వృత్రున కావులింత వచ్చునట్లు చేయగా నింద్రుడు ఉద్యోగపర్వమున వెలికివచ్చినాడు. వసిష్ఠుడు రథంతర సామశక్తినిచేసి శాంతిలో నింద్రుని మూర్ఛను తొలగించినాడు వృత్ర వధోపాయ మచట విష్ణుని ముఖమున నడచినది శివముఖముగా శాంతియందు నడచినది. శివజ్వర మా వృత్రు నావేశింపగా నింద్రుడు వజ్రమున నాతని వధించి నాడు. ఆ వజ్రమున విష్ణుడున్నాడు. ఆ యుండుట ప్రధానముకాదు. శివ జ్వరము ప్రధానము. వృత్రవధానంతరమున తనను వెన్నంటిన బ్రహ్మహత్యా దోషమును తొలగించుకొనుటకు దేవేంద్రుడుచేసిన ప్రయత్న ముద్యోగపర్వమున లేదు. శాంతిపర్వమున బ్రహ్మకడకేగి ప్రార్థింపగా నాయన దానికొక మార్గము చేసి తొలగించినట్లున్నది. ఆ మార్గ ముద్యోగమున విశ్వరూపుడైన త్రిశీర్షుని చంపి రహస్యముగా నింద్రుడు బ్రహ్మహత్యను పోగొట్టుకొనునట్టిది.

## 2. సువర్ణష్ఠీవి కథ

సృంజయుని కొడుకు సువర్ణష్ఠీవి జననమరణాదులను చుట్టు కొనియున్న కథ ద్రోణపర్వమున నున్నది. శాంతిపర్వమున తిరిగి ఆ కథయే కొంత శ్రీకృష్ణునిచేతను మరికొంత నారదునిచేతను ధర్మరాజునకు

1. భా. శాంతి. 5-422.

చెప్పబడినది. ద్రోణపర్వమున వ్యాసుడు చెప్పగా ధర్మరాజే వినినాడు. ద్రోణ పర్వమునందలి తత్కథా తాత్పర్యమిది. మృతులకొరకు శోకింపరాదు. మహా మహా వారందరును మరణించినారు. అది యెవరికిని తప్పదు ఒకవేళ సువర్ణ ష్ఠీవివలె దుర్మరణముచెంది నరకమున బడినచో వానికొరకు శోకించుటలో నర్థమున్నది. అందువలననే సృంజయునకు నారదుడు సువర్ణష్ఠీవిని బ్రతికించి యిచ్చినాడు. యుద్ధమున మహావీరుడుగా శత్రునాశనముచేసి వీరమరణము నందిన అభిమన్యునికొరకు శోకింపరాదు. అతడు స్వర్గమున నున్నాడు. వానిని తిరిగి దుఃఖబహుళమైన ఈ లోకమునకు తేనవసరములేదు. కనుక వానికొరకు శోకించుట కూడదు - ఈ తాత్పర్యమును బోధించుటకై వ్యాసుడా కథను, అభిమన్యుని మరణానంతరము ధర్మరాజునకు ద్రోణపర్వమున చెప్పినాడు. ఆ కథయే తిరిగి శాంతిపర్వమున చెప్పబడినదనగా నదియే తాత్పర్యము కావల యును. కాని భిన్నప్రకరణములయందా కథ చెప్పబడినది. శాంతిపర్వమున బహుబంధుమరణశోకప్రహతవివేకుడైన ధర్మజుని తేర్చుటకుగాను కృష్ణ కృష్ణ ద్వైపాయన నారద దేవల దేవస్థానవ్యాదులు పెక్కండ్ర వచనములు ప్రవర్తిం చినవి. ఆ వచనములలోనిదే ఈ సువర్ణష్ఠీవికథయును బహుబంధువధవలని పాతకమున కలిగిన ధర్మజుని తేర్చుట కీకథ షోడశమహారాజులకథలవలె నుపకరింపదు. అంతటి మహాచక్రవర్తులే కాలగర్భమున కలిసిపోగా నీచే నీ భారతయుద్ధమున మరణించినవారి లెక్కయేమి యని నచ్చచెప్పుట షోడశ మహారాజుల విషయకథన మాంతర్యము కావచ్చును. మరి సువర్ణష్ఠీవి కథ యట్టిదికాదు. అయినను చెప్పబడినది.

సూక్ష్మముగా విచారించినచో శాంతిపర్వమునందలి కథ సువర్ణష్ఠీవిది కాదు. అది పర్వతనారదుల కథ వారివారి చిత్తవృత్తులలోని యెగుడు దిగుళ్ళను మరియు వారి మాహాత్మ్యమును, ఆశ్చర్యకరరేఖాసంవలితముగా చెప్పబడిన కథ. శాంతిపర్వమున ధర్మజుని బుద్ధి బంధుమరణశోకవిషయము నుండి అన్యత్ర ప్రవర్తించుట కావలయును. అనగా విరక్తిని పొందిన చిత్తము రక్తియందు ప్రవర్తింపవలయును ఆశ్చర్యాది భావములు రాగరంజితములు. శ్రీకృష్ణుని సువర్ణష్ఠీవికథ సువ్యక్తముగా చెప్పుమని ధర్మరాజడిగినాడు. విని నదియయినను వినవలతును జెప్పుమనినాడు. ఆయన అడిగినదే చెప్పినట్లుగా చెప్పుచు, ఎదురుగానున్న నారదునియందు ధర్మరాజున కద్భుతాశ్చర్యములు

కలిగించి ఆ మహాత్ముని సృంజయునకు చెప్పిన నీతివాక్యములయందు చిత్తమును నిలువరించుటకును, ముఖ్యముగా ధర్మజుని చిత్తము తాత్కాలికముగానైనను శోకవిషయమునుండి మరలించుటకును శ్రీకృష్ణునిచేత కథ చెప్పబడినది. అందువలననే సుకుమారీనారదపర్వతులతో కథాప్రారంభము జరిగినది ద్రోణపర్వమున లేని సుకుమారీనారదుల ప్రణయవృత్తాంత కథనము శాంతిపర్వమున నుండుటయే ప్రధానమైన విషయము నారదాది మహర్షుల చిత్తవృత్తి విశేషములయందు ధర్మజుని బుద్ధి అద్భుతాశ్చర్యముల ననుభవింపజేయు తాత్పర్యముతోడనే శ్రీకృష్ణుడట్లు ప్రారంభించినట్లు తోచుచున్నది. అసలు సువర్ణష్ఠీవికథను నారదుని చేతనే చివరకు శ్రీకృష్ణుడు చెప్పించుటను బట్టి పై విధముగా శ్రీకృష్ణుని ఆంతర్యము నూహింపవలసివచ్చుచున్నది

శాంతిపర్వమున శ్రీకృష్ణుడు ''నీకు నాడు కృష్ణద్వైపాయనుండు సుకుమారువృత్తాంతంబు నధీనమగుటంజేసి తద్వ్యాపారంబు సెప్పెఁ బర్వతునిం జెప్పండు. కాని పర్వతుండును సహకారి. యత్తెఱం గాకర్ణింపుము''-అని ధర్మరాజునకుచెప్పి ప్రారంభించినాడు పర్వతుడు సహకారి యనగా దేనికి ? సువర్ణష్ఠీవి వృత్తాంతము నారదుని అధీనమగుటకు కావలయును. సువర్ణష్ఠీవి వృత్తాంత మనగా వాని పుట్టుట-చచ్చుట-మరలపుట్టివచ్చుట ఇత్యాదులు. ఈ యన్నింటికిని నారదునకు పర్వతుడు సహకారి, ముందు నారదుడు సుకుమారుని ప్రేమించి పెండ్లిచేసికొనిన కథ చెప్పబడినది అందుకూడ పర్వతుని ప్రసక్తి యున్నది. నారదుడు తాను సుకుమారియందు లగ్నచిత్తుడైన విషయము పర్వతునకు చెప్పలేదు అందువలన పాణిగ్రహణానంతరము వానరవదనుడవగుమని నారదుని శపించినాడు అయినను నారదుడామెను వివాహము చేసికొనినాడు.

> శాప ప్రాప్తికి నోర్చి తానడిగిన యా చంద్రాస్య నన్నారదుం
> డా పృథ్వీపతి యీఁ బ్రియంబున వివాహంబయ్యె.[1]

తాను తన ఋషిత్వమును కోలుపోయి, మరియు తన యాకారమునే కోలుపోయి మర్కటాననుడగుటను సహించుటకంటె, సృంజయుని పుత్రిని వివాహము కాకుండ బ్రతికియుండుటను సహింపగలుగుట నారదునకు కష్టమైపోయినదన్నమాట. నారదున కా సుకుమారియందంతగా చిత్తము కామమో

1. భా. శాంతి. 1-254, 1-245.

హితమైనది తానడిగి నారదునంతటి బ్రహ్మర్షి ఒకరాజు వద్దకుపోయి నీ కూతు నందు చిత్తము లగ్నమైనది-ఆమె లేక నేను బ్రతుకలేననిచెప్పి, నాకామెను భార్యగా నిమ్మని బయటపడి యడుగుట- అది తన బ్రహ్మర్షిత్వమును చేజేతుల కోలుపోవుట నారదుడు దానికిష్టపడి శాపప్రాప్తికినోర్చి ఆమెను వివాహము చేసికొనుట పరమాద్భుతమును, పరమాశ్చర్యమును నైన విషయము ధర్మజున కేవంవిధమైన చిత్తవృత్తిని కలిగించుటకే శ్రీకృష్ణుడా కథను చెప్పినాడు నార దుని మోహాతీవ్రత నిరూపింపబడుటకును పర్వతుడు సహకారి

నారదుడు సుకుమారిని పరిణయమైన తరువాత పర్వతుని నొకచో కలిసి కొనినాడు. అచట ఇరువురును తమతమ శాపవచనముల నుపసంహరించుకొని నారు. ఆ తరువాత కొంతకాలము సృంజయునివద్దయుండి, గమనేచ్ఛపుట్టగా నా రాజునకొక ఉపకారము చేయదలచి కుమారునొకని అనుగ్రహించినారు అ కుమారుడే సువర్ణష్ఠీవి వానిని అల్పాయుర్దాయము కలవాడగుగాక యని పర్వ తుడు శపించినాడు. సృంజయుడు దుఃఖింపగా నారదుడు, ఆ కుమారుని మర ణమునుండి నేను కాపాడుదునని చెప్పినాడు సృంజయునకు పుత్రునొసగినది నారదుడుగా కనిపించుచున్నది కనిపించుచున్నదనుట యేలనగా "అనిమిష లను మిగులు తనయునిఁ బడయంగ వలచియుండు దట్టివాని గనుము-అంటిమి"[1] అని నారదుడు ధర్మరాజునకు చెప్పినాడు దీనినిబట్టి పర్వతనారదు లిరువురును వరమిచ్చినట్లు తెలియుచున్నది. కాని పర్వతు డక్కుమారుండు దీర్ఘాయు రువే తుండు గాకుండుననినాడు. ఇరువురును కలిసి వరమిచ్చినపుడట్లనుట పర్వతుని విషయమున నంతగా పొసగుటలేదు. కనుక పర్వతుని ప్రక్కనబెట్టుకొని నార దుడే సృంజయునికట్టి వరము ప్రసాదించియుండునని తోచుచున్నది ఆ తోచు టయే కనిపించుట పర్వతుడేల శపింపవలయుననగా నతడు ఇంద్రతేజోరతుఁడా యత్తచిత్తుడగుటవలన. అనిమిషులను మిగులుటయనగా నింద్రుని మిగులుటయే యగును అట్టి కుమారుడు కావలయునను ఇచ్ఛ సృంజయున కంతరాంతరముల యందున్నది. పైకనలేదు అది గ్రహించి నారదుడట్లే అనుగ్రహించినాడు పర్వతునకు సృంజయుని కుమారుడు దేవేంద్రుని మిగిలి వెలుగుట ఇష్టముకాదు కనుక నా కుమారు డల్పాయుర్దాయము కలవాడుగా పలికినాడు నారదుడు తాను వరమిచ్చినవాడు గనుక తనమాట నిలబెట్టుకొనుటకుగా నా కుమారుని

1. భా. శాంతి 1-248.

మరణమును నేను మరల్తునని నాడు. సువర్ణష్ఠీవి వృత్తాంతము నారదుని యధీన మని చెప్పబడుటచేత సృంజయునకు వరమిచ్చినది నారదుడొక్కడే అనుట సమంజసముగానుండును. పర్వతుని వచనము ప్రకారమా కుమారుడు దొంగలచేత నొకసారి చంపబడినాడు నారదుడు బ్రతికించినాడు దేవేంద్రుని వజ్రముచేత మరొకసారి మరణించినాడు నారదుడు మరల బ్రతికించినాడు. చచ్చినవానిని తిరిగి బ్రతికించుట విశేషము. సువర్ణష్ఠీవి చరిత్రలోని వైచిత్ర్యమదియే. అది నారదుని యధీనము. అందుకు పర్వతుడు సహకారి–ఈ విధముగా శాంతి పర్వమునందలి కథ పర్వతనారదుల ప్రాధాన్యముతో నడచినది,

ద్రోణపర్వమున సృంజయుడే నారదుని తనకొక కుమారుని ప్రసాదింప వలసినదిగా కోరినాడు. ఈ శాంతిపర్వమున నారదుడే సృంజయుని అంతర్యము నెరిగి తదనుగుణముగా వరము ననుగ్రహించినాడు ద్రోణపర్వమున కుమారుని అంచితగుణుని, రూపసిని కోరి మరియు సృంజయుడు "అక్కుమారుండును మూత్రపురీషలాలాశ్రుస్వేదంబులు సువర్ణంబు లగునట్టివాడు గావలయు"[1] నని ప్రార్థించినాడు. ఈ కోరిక చాల విడ్డూరముగా నున్నది. సృంజయు డిట్టి కోరికను గోరుటలోగల రహస్యము బుద్ధికందుటలేదు. శాంతిపర్వమునను సువర్ణము విషయము ప్రసక్తికి వచ్చినది. కాని సందర్భము వేరు. పర్వతుడు కుమారుని అల్పాయుర్దాయు డగునని శపింపగా, దుఃఖించు సృంజయుని నోదార్చుచు నారదుడే "అక్కుమారుడు నిజ నిష్ఠీవనాదులు సువర్ణమయంబు లగుటం జేసి సువర్ణష్ఠీవి యనంబరగు బ్రమోదంబునొందు"[2] మనినాడు. పరమాశ్చర్యకరమైన విషయమును వరముగా నిచ్చి సృంజయుని దుఃఖరూప చిత్తవృత్తిని తొలగించినాడు నారదుడు. ఈ శాంతిపర్వముననున్న సామంజస్యము ద్రోణపర్వమున సృంజయుడే ఆ వరమట్లు కోరుటలోలేదు

## 3. మృత్యుదేవత కథ

ద్రోణపర్వమున అభిమన్యు మరణ దుఃఖ వికలమనస్కుడైన ధర్మరాజునకు మృత్యుదేవతాఖ్యానమును వ్యాసుడు చెప్పినాడు అదియే తిరిగి శాంతిపర్వమున భీష్మునిచేత చెప్పబడినది. భీష్ముడు చెప్పినదంతయు విని చివరకు

---

1. భా. ద్రోణ. 2-191.
2. భా. శాంతి. 1-261.

ధర్మరాజి ట్లనినాడు— "తొల్లియు నిదివింటి నా దత్యంత శోకాక్రాంతుం డనగుట నవ్వినికి రిత్తవోయె. నేడీ యుపాఖ్యానంబున యర్థంబు పరిజ్ఞాతం బయ్యె"[1] ఈ కథార్థ మచట పరిజ్ఞాతము కాలేదనియు నీ శాంతిపర్వమున నైన దనియు ధర్మరాజు చెప్పుచున్నాడు. తిరిగి చెప్పబడుటలోని ప్రయోజన మది యన్నమాట అనగా తాను తన బంధుమిత్రుల మరణమునకు కర్తకాడనియు, వారివారి కర్మపరిపాకమునుబట్టి యుద్ధమున శరీరత్యాగము చేసి చనినా రనియు నొక నిశ్చయజ్ఞానము కలుగుటయే మృత్యుదేవతాఖ్యానము నర్థము పరిజ్ఞాతమగుట.

ద్రోణపర్వమునందలి కథకును శాంతిపర్వమునందలి కథకును నీషద్భేద మున్నది. హిమశైలమునయందు తపము చేయుచున్న మృత్యుదేవతవద్దకు వచ్చి బ్రహ్మ మాటాడినాడు. ఎట్టకేలకు వాని చెప్పినట్లు ప్రాణాపహారిణి యగుట కంగీకరించి, ద్రోణపర్వమున, నొక విన్నపమని లోభక్రోధాదులు జంతువుల శరీరములను వికృతి బొందించునట్లుగా ననుగ్రహింపుమని మృత్యువు బ్రహ్మను ప్రార్థించినట్లున్నది. శాంతిపర్వమున మృత్యు వా విషయము నడుగ కుండగనే బ్రహ్మ తనంతతా ననుగ్రహించినట్లున్నది. మరియు శాంతిపర్వమున యందు బ్రహ్మ మృత్యువుతో నన్నట్లుగా—

పురుషుండును నంగనయు నపుంసకుండు
నగుము పుత్రిక ! పురుషుని నంగనను న
పుంసకునిఁ జంపు వేళలఁ బొందకుండు
పాపమును నిది ధర్మమై పరగునీకు.[2]

అను పద్యమున్నది. ఈ యర్థము ద్రోణపర్వమునలేదు. స్వల్పములైన నీ రెండు భేదములు తప్ప మిగిలిన కథ రెండు పర్వములయందును నొక విధముగనే యున్నది.

కర్ణుని శాపవృత్తాంత కథనము కర్ణపర్వము ద్వితీయాశ్వాసమునందును, శాంతిపర్వము ప్రథమాశ్వాసమునందును గలదు. రెండుపర్వములయందును పరశురామునివలనను, బ్రాహ్మణునివలనను కర్ణునకు వచ్చిన శాపములే చెప్ప

---

1. భా. శాంతి. 5-215.
2. భా. శాంతి. 5-212.

బడినవి. కర్ణపర్వమున కర్ణుడే శల్యునకు తన శాపముల విషయము చెప్పినాడు శాంతిపర్వమున నారదుడు ధర్మరాజునకు చెప్పినాడు

శల్యుడు కర్ణునకు సారథియై వాని మనస్సును వికలము చేయుటకుగాను హంసకాకముల కథవంటి మర్మములు ఛేదించు మాటలు మాటాడుచు కృష్ణార్జునుల తేజోబలముల పెంపు నగ్గింపగా కర్ణుడా విషయము తనకు తెలియుననుచు మరియు తనకు కలిగిన శాపముల విషయమును చెప్పినాడు ''అచ్చటి మహీపతులు విన''గా కర్ణుడా శాప విషయమును చెప్పుటలోని యర్థమును శల్యుని ముఖమున తిక్కన్నగారిట్లు నిష్కర్ష చేసిరి- ''తా నర్జునుచేతం జచ్చుట నిర్ణయించె ......జనులు తన మీదం జాలమి వెట్టకుండుటకుం గాదె జామదగ్న్య బ్రాహ్మణుల శాపంబులు భూపాలురు విన నుగ్గడించె''ను

శాంతిపర్వమున నారదుని ధర్మరాజిట్లడిగినాడు - ''అమ్మార్తండ నందను రథచక్రంబు భూమిం గ్రుంగుటకు కారణం బెద్ది ? దానిని, అప్వీరుండు పరశురామునిచేత శప్తుండయిన తెఱంగును వెటింగింపవలయు''[1]ను- అని. ధర్మజునకు కర్ణుని రథచక్రము భూమిని క్రుంగుట తెలియును. దానికి కారణము తెలియదు పరశురామునివలన కర్ణునకు శాపము వచ్చినట్లు తెలియును. ఆ శాపమేమియో తెలియదు మరియు నెందుకు వచ్చినదో తెలియదు — ఈ విషయము ధర్మరాజు నారదుని అడిగినదానినిబట్టి మన మూహింపవచ్చును కర్ణుని రథచక్రము భూమిని క్రుంగుట యుద్ధభూమిని జరిగినది గనుక — ఆ సమయమున నే అర్జునుడు వానిని చంపినాడు గనుక — ధర్మరాజున కా విషయము తెలియవచ్చును అందుకు కారణము తెలియకపోవచ్చును అందువలన నా విషయమును నారదుని చెప్పుమని యడుగుట సమంజసముగనే యున్నది పరశురామునివలన కర్ణున కొక శాపము ఎప్పుడు వచ్చినదియు ధర్మరాజున కెట్లు తెలిసినదో విచారింపవలసియున్నది

పరశురాముడు తన తొడనుపధానముగా చేసికొని నిద్రించుచున్నపుడు, తన తొడను తొలిచిన కీటకమును గురించి కర్ణుడు ''అర్జున హితంబుగోరి యింద్రుం డమ్మునీంద్రునకు నన్ను తేటపఱిచి యతనిం గోపింపజేయువాడై కీటతనువుదాల్చి యట్లు చేసెంగానోపు''[1]నని అనుకొనినాడు శాంతిపర్వమున

---

1. భా. శాంతి. 1-15.

నా కీటమును గురించి నారదుడు మరొక రకముగా చెప్పినాడు. భృగుపత్ని నపహరించిన గ్రస్తుండను రక్కసు డట్లు కీటముగా శపింపబడినాడు పరశు రాముని విలోకనమువలన వానికి శాపమోక్షము చెప్పబడినది. అందువలన నా కీటరూపమును పొందిన గ్రస్తుడే కర్ణుని తొడ తొలిచినాడు — ఇది నారదుడు చెప్పినది

## 4. కర్ణుని జన్మవృత్తాంతము

కర్ణుని జన్మవృత్తాంతము ఉద్యోగపర్వమున, భీష్మపర్వమున, స్త్రీ పర్వమున, శాంతిపర్వమున, ఆశ్రమవాసపర్వమున ప్రస్తావింపబడినది శ్రీకృష్ణుని రాయబారము విఫలమై, ఆయన తనతో చెప్పి పాండవులగద్దకు పోయిన తరువాత "కర్ణునకుం బుట్టువు తెలిపి సహోదర స్నేహం బావహించెద"[2]నని యూహించి కుంతి కర్ణుని భాగీరథీ తీరమున కలిసికొని తాను వానికి తల్లియగుట చెప్పినది సూర్యమండలమునుండి నిజమనుమాట కర్ణునకు వినిపించినది భీష్ముడు యుద్ధమునుండి విరమించి అంపశయ్య నెక్కిన తరువాత, యుద్ధము చేయబోవుట కనుమతింపవలసినదిగా కర్ణుడుపోయి ప్రార్థించినపుడు భీష్ముడు వానితో నీవు ఫలానా అని చెప్పినాడు. స్త్రీపర్వమున తిలోదక ప్రధానవేళ కుంతియే కర్ణుడు తన పెద్దకొడుకని చెప్పినది. మరియు యుద్ధమునకు ముందు తాను కర్ణుని కలిసికొని పాండవుల కలియరమ్మని బోధించుటయు చెప్పినది. ఈ విషయము శాంతిపర్వమున ధర్మరాజు దుఃఖించుచు నాడిన మాటలవలన తెలియుచున్నది శాంతిపర్వమున నారదుడు తిరిగి కర్ణుని జన్మవృత్తాంతముతో కలిపి వానికి గలిగిన శాపముల విషయమును చెప్పెను. ఆశ్రమవాస పర్వమున కుంతియే వ్యాసునకు చెప్పినది.

ఈ ఆశ్రమవాసమునందలి కుంతికథనములోని విశేషమిది సూర్యుని సమాగమము భాగీరథీతీరమునకాక మేడమీదనే జరిగినది జనకముఖబంధు చిత్తవంచనము నడపి గూఢమందిరాంతరమున కుంతి కొడుకును కనినది కని యేటిలో నిడినది. ఈ విశేష విషయ మిచటతప్ప మరెచ్చటను తిక్కన్నగారు వ్రాయలేదు స్త్రీపర్వమున నీ ప్రసక్తిలేదు ఉద్యోగపర్వమునకూడ "కుంతి

1. భా. కర్ణ. 2-89.
2. భా. ఉద్యో. 4-58

భోజునింట కన్నియనాడు భాస్కరుని రావించితి''[1] అను కుంతి వచనమునుబట్టి, వివాహము కాకమునుపు కన్యగా కుంతి భోజునివద్ద నున్నపుడనియే అర్థమూహ కందుచున్నదిగాని, తన మందిరమున సూర్యసమాగమమైన ట్లర్థముగా నామె యనుట అనుమానముగా నున్నది జనకముఖబంధువంచనాదికము విషయ మచట లేనేలేదు

ఆశ్రమవాసమున కుంతి తాను కర్ణుని కనినది వ్యాసునకు చెప్పి చివర కిట్లనినది. ''మీ కనిన యది దివ్య బోధంబున నత్తెఱఁగు. అంతరంగమునఁ గొని కాలును—

పాపమయ్యెఁ గాకుండె నప్పని దలంచి
యళుకుచుండుదు మద్భయ మపనయింపుఁ
డతుల కరుణ— ఇది నాకు సద్వరము—''[2]

నేను కర్ణుని నెట్లు కనినదియు మీరు దివ్యబోధ ఘనులు గనుక నేను చెప్పక మునుపును మీకు తెలియును అయినను నేను చెప్పితిని. నాయంతరంగమును నది కాల్చుచుండును. పాపమో, పుణ్యమో జరిగినది దానివలన నాకు తలపునకు వచ్చినపుడెల్లను, పై ప్రాణములు పైనబోవుట కుద్యమించుచున్నంతగా భయము-అది భయమును కాదు; ఏదియో వేదన కలుగుచుండును. దానినుండి దయదలచి నన్ను రక్షింపగోరుచున్నాను నాకదియే వరముగా ప్రసాదింపుడు- ఈ మొదలైన తాత్పర్యముతో కుంతి మాటాడినది ఆమె కర్ణుని తన కనిన విధమంతయు చెప్పి దాని వలని యళుకునుండి బయటపడుట నుద్దేశించినది అంత్యదశకువచ్చిన కుంతి తన చిన్నతనమున చేసినపని పుణ్యముగాని పాపముగాని దాని నేమియు దాచక పరమేశ్వర స్వరూపుడైన వ్యాసునకు మరియు మామగారికిచెప్పి పాపక్షాళనము చేసికొనుటను తలచినది. అందుకొరకే ఆమె అంతయు చెప్పినది. చివరకదియే వ్యాసుని వరముగా కోరినది

చెప్పుటకు వీలుగాని విషయము చెప్పవలసి వచ్చినది. వయస్సువచ్చి అన్నియునుడిగినస్థితిలోనున్నను కుంతి తన చిన్నతనపు చిలిపిచేష్టను మామగారికి చెప్పవలసి వచ్చుట చాల ఇబ్బందియైన విషయము "దండప్రణామంబు సేసి చేతులు

---

1. భా. ఉద్యో. 4-59.
2. భా. ఆశ్రమ. 2-104, 105.

మోడ్చి లజ్జాసహితంబగు నంతరంగంబుతో వినయ నమ్రయగుచు "[1] కుంతి కథనము ప్రారంభించినదని తిక్కన్నగారు వ్రాసిరి అంతటి కుంతీ మహాదేవి ఎంతగా కుంచుకొనిపోయినదో ఆ వాక్యమునుబట్టి ఊహింపవచ్చును అతఃపూర్వము ఉదకప్రదానవేళ కర్ణుడు తన కొడుకని కుంతి యెల్లవారు వినగ చెప్పినది అచట అంతరంగము లజ్జాసహితముగా లేదు మనస్సునందలి అడలు పెల్లున కన్నీరు మొగమున క్రమ్ముకొనినదే కాని అంతరంగమున లజ్జకలుగలేదు ఇపుడు కలిగినది. పాపనాశనము చేసికొనుటకు నంతయు చెప్పవలయును అనగా సూర్యుని ఆహ్వానించి ఏకాంతమున తాను వానితో మాటాడినదికూడ చెప్పవలయును. అది చెప్పుటకును కుంతి తలపెట్టినది గనుక అంతరంగము లజ్జాసహితమైనది అందువలన మనిషి కుంచుకపోయినది ఇతర పర్వములయందు కుంతి చెప్పుటకును నిచట చెప్పుటకునుగల భేద మిది సూర్యుని ఆహ్వానించినప్పటి యేకాంతసంభాషణమును తిక్కన్నగారు వ్రాసిరి అంతయు సాధారణమైనదే. పరమచమత్కారమైన వాక్యమొకటి యున్నది కుంతి మంత్రబలమునకు సూర్యుడు మూర్త్యంతరముగైకొని, ఆమె అశ్చర్యమగ్నచిత్త యగునట్లుగా నెదుట నిలబడినాడు నిలబడిన సూర్యుడు "అడుగు మిచ్చెద వరంబనిన, వడంకుచుఁ గేలు మొగిడ్చి పొండేల యిచట"[2] అని కుంతి యనినదట. ఎందుకు నన్ను పిలిచితివో ఆ పని చెప్పుము చేసెదనని సూర్యుడనినాడు ఆమె వడంకిపోయినది. పొండు–ఏల–ఇచట–ఇదియొక విచిత్రమైన వాక్యము పొండి, ఏమిటిక్కడ ? – లోకమునందలి వాక్యమది కుంతి కిదియొక అపూర్వపరిచితమైన యనుభవము లోపల నరమునుఒట్టుకొని కొర్కెయున్నది క్రొత్తయగుటచేత గుండె కొట్టుకొనుచున్నది తనవారెవరైన చూచిపోదురో అను భయము పుట్టుచున్నది. ఏమియుతోచని స్థితి యది పొండేల యిచట–అనినది ఏమిటి చెప్పినది ? ఏమియులేదు అయినను ఇక్కడ ఈ మేడమీద ఏమిటా మాటలు? పొమ్ము దయయుంచి వెంటనే పొమ్ము మా బంధుజనము చూడగలదు నీకు నమస్కారము చేయుదును. త్వరగా పొమ్ము. ఈ మొదలైన వాక్యములచేత ఏ యర్థము ప్రతీయమానమై బుద్ధిని తాడితము చేయగలదో, ఆ యర్థమంతయు తిక్కన్నగారు వ్రాసిన ఆ పొండేల యిచట అను నొక్క వాక్యమునందున్నది

1. భా. ఆశ్రమ. 2-94.
2. భా. ఆశ్రమ. 2-101.

చిన్నతనపు కుంతిని భావించినచో నా వాక్యమునందలి చమత్కారము ప్రకాశించును. తిక్కన్నగారిట్టి శృంగారసంబంధి భావములు విచిత్రముగా లోకమునందెట్లో అట్లే కావ్యమున వ్రాయుదురు భీమునితో ద్రౌపది కీచకుడు తనను "అడిగినా"డని చెప్పినట్లు తిక్కన్నగారు వ్రాసిరి. నేటికిని అడుగుట ఆ యర్థమున దేశమున వాడబడుచున్నది.

ఆశ్రమవాసమున కుంతి ఆ విధముగా తన చేసిన సర్వమును వ్యాసున కెరింగించి పాపక్షాళనము చేసికొన్నది. తిరిగి కర్ణుని జన్మకథ చెప్పబడుటవలన ప్రయోజనమదిగనే కనిపించుచున్నది

## 5,6 గరుడోపాఖ్యానము, ఉదంకోపాఖ్యానము

నన్నయ తిక్కన్నలు-ఇరువురును వ్రాసిన కథలు ముఖ్యముగా రెండు. ఆదిపర్వమున ఉదంకునికథ, గరుడునికథ రెండున్నవి తిక్కన్నగా రశ్వమేధపర్వమున నుదంకునికథను, అనుశాసనికమున గరుడునికథను వ్రాసిరి శ్రీకృష్ణుని ఉదంకుడనుముని శపించుట కుద్యుక్తుడైనాడనగా భారతకథ వినుచున్న జనమేజయుడు "మునీంద్రా యుపేంద్రుని శపించుటకు నుత్సహించిన యుదంకుడేమి విధంబు తపంబున నమ్మహానుభావంబునొందె నెఱిగింపవే"[1] అని ప్రార్థింపగా వైశంపాయనుడు చెప్పినాడు తత్ప్రకరణమున ఉదంకునికథ సమంజసముగా ప్రసక్తమైనట్లు కనిపించుచున్నది. గరుడోపాఖ్యానమును చెప్పవలసినదిగా ధర్మరాజు భీష్ముని కోరుటలో నిట్టి సామంజస్యము స్థూలదృష్టికి కనిపించదు. శ్రీకృష్ణుడే విష్ణువనియు విష్ణునెఱుగు టధికవిమలబోధమనియు వ్యాసుడు శల్యున కొకసారి బోధించినాడనియు భీష్ముడు చెప్పిన వెంటనే ధర్మరాజు "గరుత్మంతుడు మహానుభావుండని విందు నవ్విహంగవిభుని వృత్తాంతంబు తెఱంగెఱుంగ వినవలతు వివరింపవే"[2] అనినాడు తత్పూర్వము చెప్పబడిన విషయానుసరణముగా ధర్మరాజుప్రశ్న పుట్టుటలేదు. హఠాత్తుగా పుట్టినట్లున్నది. ఉదంకునికథలో ననగా నది ప్రసక్తించుటలోగల సామంజస్యము గరుడోపాఖ్యానము ప్రసక్తించుటలో కనిపించుటలేదు. గాలిలో పుట్టి వచ్చినట్లున్నది ఇది స్థూలదృష్టి విషయము. సూక్ష్మముగా విచారించిచో నా కథ పొసగియుండుటలోని రహస్యము తెలియును.

1. భా. అశ్వ. 3-71.
2. భా. అను. 1-166.

ఎదుటనున్న శ్రీకృష్ణుని విష్ణువని భీష్ముడు చెప్పినట్లుకాగా ధర్మరాజు గరుత్మంతుని మహానుభావ లక్షణమేదియో చెప్పుమని కోరినాడు ఈ కోరుటలో ధర్మజుని ఆంతర్యమిది గరుత్మంతునికూడ విష్ణువే అని విందును నీవు కృష్ణుని విష్ణుత్వమును చెప్పినావు మరి గరుత్మంతుని విష్ణుత్వలక్షణముగూడ చెప్పుము-అని ధర్మరాజడిగినట్లు. గరుత్మంతుండు మహానుభావుండని విందుననగా నర్థమది ధర్మజుని ఈ యర్థము తత్కథాప్రారంభమునను, కథాంతమునను భీష్ముని చేత నెలకొల్పబడినది ధర్మరాజు తననట్లు గరుత్మంతుని వృత్తాంతము చెప్పవలసి నదిగా కోరినవెంటనే భీష్ముడు "అచ్యుతునాలోకించి యా సుపర్ణుండు నీవకా వినియుండుదుం జెప్పెద"[1] నని నట్లును దాన శ్రీకృష్ణుడు వికచవదనుడై అట్ల చేయు మిక్కురుపతికోర్కి దీర్చుట కర్తవ్యమని పలికినట్లును తిక్కన్నగారు వ్రాసిరి కథాంతమున నింద్రుని వాక్యముగా భీష్ముడు "ఇతండు సాక్షా ద్విష్ణుండు"[2] అని గరుత్మంతుని గూర్చి చెప్పెను ధర్మరాజేమి మనస్సున బెట్టు కొని గరుత్మంతుని విషయమును ప్రసక్తికి తెచ్చినాడో, అ వాని మనస్సుననున్న దానిని స్పష్టము చేయుటకే భీష్ముడు చెప్పెదననినాడు. శ్రీకృష్ణుడదియే కర్త వ్యమని పలికినాడు భీష్ముడు కథనట్లే చెప్పి ముగించినాడు కథను పూర్వా పరములమీద పర్యాలోచనచేసి విచారించినచో నీవిధముగా గరుడుని విష్ణుత్వ మను మహానుభావలక్షణము నాధారముగా చేసికొని అనుశాసనికమున నీకథ ప్రవర్తించిదనియు, ధర్మరాజు ప్రశ్న ప్రకరణము ననుసరించియే పుట్టినదనియు తెలియగలదు

తిక్కన్నగారిచేత వ్రాయబడిన రెండు కథలును నన్నయ్యగారి కథల కంటె కొంతకొంత భిన్నముగానున్నవి ముందా భేదములిచట సూచింపబడును తరువాత తిక్కన్నగారి కథానిర్వహణము శిల్పము వ్రాయబడును

ప్రస్తుతగ్రంథ ప్రాధాన్య వివక్షదృష్ట్యా గరుడోపాఖ్యానము విషయము ప్రథమమున వ్రాయబడుచున్నది - పుట్టి వినతను శపించి మోక్షమును చెప్పి వెంటనే సూర్యరథసూతుడుగా ననూరుడైన అరుణు డాదిపర్వమునయందువలె అనుశాసనికమున పోడు. గరుత్మంతుడు పుట్టినదాక నేనూరేండ్లపాటు తల్లివద్దనే

1 భా. అను. 1-166.

2. భా. అను. 1-269.

యుండి తదనంతరము రవిపరిచర్యాసుఖము నెదగోరి పోయినాడు గరుత్మంతుడు పుట్టుచునే తల్లిని వదలిపోయి బ్రహ్మకడ సిద్ధసాధ్యగణముల ముద్దుముచ్చటలతో పెరిగిన ట్లానుశాసనికమునను్నది. అనగా నన్నయ్యగారి వలె గరుత్మంతుడు కద్రువ చెప్పినపనులు చేయుచు, ఆ పాపములను వీపున కెక్కించుకొని త్రిప్పుచు, తన తల్లికినివలెనే తానును కద్రువకు దాస్యము చేసి నట్లు తిక్కన్నగారు వ్రాయలేదు అసలు తిక్కన్నగారి భారతమున వినత కద్రువకు దాసియైనది గరుత్మంతుడు పుట్టి బ్రహ్మవద్దకు పోయిన తరువాత వినత దాసియైన తరువాతనే గరుత్మంతుడు పుట్టినందువలన, నాదిపర్వమున నారదుడు గరుత్మంతునితో నీ తల్లి దాసిగానున్నదని చెప్పినదని నన్నయ్య గారు వ్రాయవలసిన అవసరములేదు. ఆ యవసరము తిక్కన్నగారి కథకున్నది. కనుక నాయన వ్రాసెను నారదుని మాటమీద తనతల్లి దాస్యవిముక్తికై కద్రువనాశ్రయించి ఆమె చెప్పినది గనుక అమృతాహరణార్థము బయలు దేరి నాడు *గరుత్మంతుడు. అందువలన నానుశాసనికమున నాదిపర్వమునందువలె వినత కుమారుని దీవించుటగాని, నిషాదగణము నాహారముగా గొనుమనిగాని చెప్పుట పొసగలేదు గజకచ్ఛపములను గరుత్మంతున కాహారముగా కశ్యపుడు నిర్దేశించుటను నన్నయ తిక్కన్న లిరువురును చెప్పిరిగాని వాటి పూర్వజన్మ విషయకథనమున మాత్రము భేదించిరి. నన్నయ్యగారు వసులోభమున పరస్పర మలిగి శపించుకొన్న సోదరులు విభావసువు, సుప్రతీకుడు-అని వ్రాయగా తిక్కన్నగారు మధుకైటభులను దనుజేంద్రులే అట్లయి పుట్టినారని వ్రాసిరి. అమృతముకొరకెగసి దేవలోకమునకుబోయి - ఆ యమృతమును చుట్టుకొని యున్న మంటలనుచూచి తన రెక్కలు కాలుననుకొని గరుత్మంతుడు బ్రహ్మ వద్దకుపోయి తనచేయదలచిన పనియు, తనకు కలిగిన భయమును చెప్పినాడు. ఆ పితామహుడు వెన్న అధికముగా పడవేసినచో మంటలు శమించునని ఉపా యము చెప్పినాడు. గరుత్మంతుడట్లుచేసి అమృతమును గొనిపోవుచుండగా నింద్రుడు ససైన్యుడై వచ్చి వజ్రాయుధమును ప్రయోగించినాడు అది గరు డుని నేమియు చేయజాలినది కాకపోగా నింద్రుడూరక మదమణి తిరిగి పోయి నాడు. ఇది తిక్కన్నగారు వ్రాసినకథ సురలనోడించి అమృతమును దెచ్చు గరుడునకు శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమయి తనకు వాహనము కమ్మని కోరినట్లును, ఆ తరువాత దేవేంద్రుడు వజ్రాయుధమును గరుడునిపై ప్రయో గించినట్లును, అది వాని నేమియు చేయజాలనందునను, మరియు గరుడుడు

దానిని గౌరవించుటచేతను, ఇంద్రుడు వానిని మెచ్చుకొని వానితో మైత్రిచేసి కొన్నట్లును నన్నయ్యగారు వ్రాసిరి నన్నయ్యగారు పాములమృతము నుపయోగింపక మునుపే ఇంద్రుడువచ్చి దానిని తీసికొని పోయినట్లు వ్రాయగా, తిక్కన్నగారు గరుత్మంతుడే అమృతమును తిరిగి తీసికొనిపోయి దేవేంద్రునకిచ్చినట్లు వ్రాసిరి ఆదిపర్వమున కాద్రవేయులతో మాటాడి తన తల్లి దాస్యమునుబాపు యత్నమును గరుడుడు చేసినాడు. అనుశాసనికమున కద్రువతో మాటాడి చేసినాడు మరియు నానుశాసనికమున శ్రీకృష్ణుడు ప్రత్యక్షమగుట, వాహనము కమ్మనుట మొదలైన విషయమాదిపర్వమునందువలె ఈ కథలో నా విషయము లేదుగాని, ఆ పర్వముననే కొంచెము తరువాత, ఇంద్రునినుండి అమృతమును గొనిపోవుచుండగా నా విషయము జరిగినట్లే గరుత్మంతుడు హిమగిరి మునులతో చెప్పినట్లు తిక్కన్నగారు వ్రాసిరి –ఇవి ప్రధానముగా నన్నయ తిక్కన లిరువురును వ్రాసిన గరుత్మంతుని కథలోనున్న భేదములు.

ఇక ఉదంకోపాఖ్యానము అశ్వమేధపర్వమున నుదంకుని గురువు పేరు గౌతముడు. పైలుడుకాదు. గౌతముని భార్యపేరు అహల్య. పైలునకు భార్యకలదు పేరు లేదు. గౌతముడు తన కూతు నుదంకునకిచ్చి పెండ్లి చేసినాడు. ఆదిపర్వమున పైలునకు కూతురులేదు. మొద లుదంకునకు పెండ్లియే లేదు ఆదిపర్వమున నుదంకుడు పౌష్యుని వద్దకుపోయినాడు అశ్వమేధమున సౌదాసుని వద్దకుపోయినాడు సౌదాసునకున్న అసురభావాదికము లాపౌష్యునకులేవు కుండలముల కొరకు బయలుదేరి పోవుచున్న ఉదంకుడు వృషభ గోమయ భక్షణము చేయుట ఆదిపర్వమునందువలె అశ్వమేధమునలేదు. మరియు తరువాతి శాపముల ప్రసక్తియులేదు. ఆదిపర్వమున కుండలములుగొని తక్షకుడు పాతాళమార్గము పట్టగా నుదంకుడు వానిని వెన్నంటి పాతాళమునకు బోయినట్లున్నది అనుశాసనమున నొక ముఖకాష్ఠముతో నుదంకుడు భూమిని త్రవ్వి ప్రారంభించుటయు, గీర్వాణవిభుడు విప్రుడై వచ్చి ఉదంకుడు పాతాళమునకు పోవుటకు సాయమొనర్చుటయు మొదలుగాగల విషయములున్నవి. ఆదిపర్వమునందువలెనాగపతులనునుదంకుడు స్తుతించుటఅశ్వమేధమునలేదు అశ్వముమీదనెక్కివచ్చిన పురుషు డాదిపర్వమున నుదంకునకు హితముపదేశింపగా, నీ యశ్వమేధ పర్వమున నశ్వమే తన అపానమునూదినచో కుండలములు వచ్చునట్లు చేయుదునని ఉదంకునితో ననినది. ఆ పనిచేయగా ధూమ మా నాగలోకమంతయు

వ్యాపించినది ఆదిపర్వమున దహనార్చులు వ్యాపించినట్లున్నది కుండలములు తీసికొని దివ్యపురుషుడిచ్చిన హయము నెక్కి ఉదంకుడు గురువుగారి వద్దకు వచ్చినట్లు నన్నయ్యగారు వ్రాసిరి దివ్యపురుషుడు - హయము - మొదలైన విషయములు తిక్కన్నగారు వ్రాయలేదు. గురుపత్నికి కుండలములిచ్చిన తరువాత నుదంకుడు త్రోవలో తన కనుభవములకైన విషయములను గురించి గురువు నడుగుటయు నాయన చెప్పుటయు నాదిపర్వమున నున్నది. అశ్వమేధమున నదేమియులేదు - ఇవి ప్రధానముగా నన్నయ తిక్కన్న లిరువురును వ్రాసిన ఉదంకుని కథలోని భేదములు

ఆదిపర్వమునందలి గరుడోపాఖ్యానము పాములకు తల్లి వలననైన శాప కథను పురస్కరించుకొని యున్నది అనుశాసనికమునందలి కథయట్టిదికాదు గరుత్మంతుని మహానుభావ లక్షణమును - అనగా విష్ణుత్వమును - చెప్పుకథ యిది తిక్కన్నగారు వ్రాసినకథ దానికదిగా స్వతంత్రమైనది నన్నయ్యగారు దానిని మరొకదాని కుత్కర్షాపాదకముగా చేసి వ్రాసిరి కనుక నా కథను వ్రాయుటలో నన్నయ తిక్కన్న లిరువురకును పోలికయేలేదు కథయొకటన్న సామ్యము తప్ప కథనశిల్పమున పోలికయేలేదు.

గరుత్మంతుని మహానుభావమంతయు వాని బలముమీద నున్నది శారీరకమైన గొప్పబలము - దానికి తగినట్లుండు ఉద్ధతమైన మనోలక్షణము - కార్యకారిత - ఈ మొదలైన అంశముల మీద నానుశాసనికమున గరుడునికథ నిర్మింపబడియున్నది.

జననిం బాసి జనించు నప్డ తన యిచ్చం బక్షినాథుండునుం
జని పద్మోద్భవ కల్పితంబులగు భోజ్యంబుల్ శరీరంబువ
ర్ధన మొందింపగ సిద్ధసాధ్య గణముల్ దన్ ముద్దుసేయంగఁ గ్రీ
డనలోలత్వమునం జరించుఁ బరితుష్టస్వాంతుఁడై యెల్లెడన్ [1]

గరుత్మంతున కంతటి బలము కలుగుటకు హేతువు బ్రహ్మచేత కల్పింపబడిన ఆహారము లన్నట్లుగా తిక్కన్నగారు వ్రాసిరి. ఆ విధముగా తిని యిష్టమువచ్చినట్లు తిరుగు గరుత్మంతున కొకనాడు నారదుడు తల్లి దాస్యము చేయుచున్న విషయ మెరింగించినాడు. దానితో కోపమును వగపును నేక కాలమున గరుడుని

1. భా. అను. 1-179.

చిత్తము నలుముకొన్నవి కద్రువయిట్లు చేసినదాయని కోపము, తల్లి కిట్టియవస్థ వాటిల్లినదికదా యని వగపు కలిగియుండవచ్చును. వెంటనే తల్లివద్దకు వచ్చినాడు. మాటయెద్దియుం జెప్పక ప్రణుతి చేసినాడు. దుఃఖముయొక్క అతిశయముచేత నోటివెంట మాట రాలేదు. తరువాత కద్రువవద్దకు పోయి తన తల్లి దాస్యము పోవునట్లు అనుగ్రహింపుమనినాడు. అపుడామె వానితో నిట్లన్నది. మొగంబు ముఱకటించుకొనుచు ననినది

బలవంతుండవు నేర్పుచందములఁ జెప్పంజాలి యీ రిత్తప
ల్కులఁ దేర్పం బనిలేదు తల్లికి మదింగూర్తేని వేపోయి లో
కులు నిన్నుం బ్రణుతింపఁ దెమ్మమృతమున్ ఘోరంపు దాస్యంబునే
దొలగం బెట్టెద మీక నంతమగు సంతోషంబు సంధిల్లగన్.[1]

నీవు బలవంతుడవు. నేర్పుగా మాటాడ నేర్తునుగదా యని మాటాడుచున్నావు. ఈ శుష్కప్రియములవలన పనికాదు. నిజముగా నీ తల్లి దాస్యము పోగొట్టుకొను విషయమున నీకంత పట్టుదలయే యున్నచో వేగిరముగాబోయి నలుగురును మెచ్చుకొనునట్లుగా నమృతమును దెమ్ము అపుడు నేను మీ తల్లి దాస్యమును తొలగబెట్టెదను – ఈ మాటలన్నియు కద్రువ మొగము ముఱకటించుకొనుచుననినది. కోపమును వెటకారమును సూచించునట్లుగా ముఖమును అనగా కండ్లను మూతిని త్రిప్పుచు, చేతులు జారలువైచుచు, తానధికురాలనుకొనుగడుసరియైన స్త్రీ, ఎదుటివారిని తృణప్రాయముగాచేసి మాటాడుట యేది కలదో అది ముఱకటించుకొనుచు మాటాడుట కద్రువ గరుత్మంతునితో ముఖమునట్లు త్రిప్పుచు మాటాడినదన్నమాట. ఆమె గరుత్మంతుని నీవు నేర్పుగా మాటాడుచున్నావులే అనినది. గరుడుడాడిన నేర్పుమాటలు "తారితారివగగందుచు" పలికిన "నీ చెలియల్ చరించు నివ్వరవుడవుం జరిత్రమున వచ్చునె నీ కొకపేర్మి యీ సతిం గరుణ యెలర్పగా విడువ గౌరవసంపద జేయునెంతయు.... నీకును నేను బుత్రుడన నెమ్మిఁ దగన్ నను జూచియైనఁ దల్లీ కృపసేత పెద్దయును లెస్స. యధర్మము ధర్మమన్వగల్ నాకవి యేల? . "[2] అను నీ మొదలైన పలుకులు గావలయును. కద్రువ మాటకారి. గరుడుని మాటలలోని నేర్పు

---

1. ఖా. అను. 1-212.
2. ఖా. అను. 1-209, 210.

నెరిగినది అందుకనినది నీ నేర్పు మాటలతో పనిలేదని గరుత్మంతుడు మరియు మాటకారి. వాని మాటలు ముందు ప్రయోజనమును సాధించలేదు. ఇంద్రుని జయించి అమృతము తేక తప్పినదికాదు. తెచ్చి కద్రువముందు పెట్టి చూపించి, తల్లి చెఱవాపికొని, ఆ యమృతభాండమునక్లే తాను తీసికొని యెడముగా పోయి ఆమెతో నిట్లనినాడు ఆమె తనను వెఱగుపడి చూచుచుండగా ననినాడు.

జననీ! నీవమృతంబు దెమ్మనిన యా సత్యోక్తి వాటించి యేఁ
జని నానావిధకర్మ కర్మఠుడనై సాధించి వేతెచ్చితిన్
విను నా నీ యెడబాటుసెల్లె జనులన్ విన్పించితిన్ తెల్లగా
వినతం దోడ్కొని పోయెదన్ మనమునన్ విభ్రాంతి లేకుండుమీ.[2]

ఇంతకు పూర్వము కద్రువచెప్పిన "బలవంతుడవు నేర్పుచందముల–" మొదలుగా గలిగిన మాటలలో నామె యమృతమును దెచ్చి నాకిమ్ము – అని యనలేదు తెమ్ము అని మాత్రమే అనినది తెమ్మనుటవేరు తెచ్చి యిమ్మనుటవేరు. గరుత్మంతుడీ సూక్ష్మార్థమును లాగి మాటాడుచున్నాడు ఈ పద్యమునందలి గరుడుని మాటలు, ఆ పద్యమునందలి కద్రువ ముఱకటించుకొనుచు నాడిన మాటలకు సమాధానములు, తొందరగా పోయి అమృతమును తెమ్మన్నది కద్రువ. తొందరగనే తెచ్చితి ననినాడు గరుడుడు ఆమె లోకులు నిన్ను నుతించునట్లుగా నమృతము తెమ్మనినది. జనములచేతనే నమృతము తెచ్చితినను విషయము విన్పించితిననినాడు గరుడుడు ఆమె మీ దాస్యమును నే తొలగ బెట్టెదననినది గరుత్మంతుడు వినతను తీసికొని పోవుచున్నాననినాడు. చివరకు మీకు సంతోషముగా చేయుదుననినది కద్రువ. గరుడుడు చివరకు, నా చేసిన ఈ పనివలన, నా అనిన ఈ మాటలవలన నీవు విభ్రాంతి నందకుండు మనినాడు. ఈ విధముగా మిగిలిన అంశములను సంగతపరచుకొనవచ్చును. 'తల్లికి మదిం గూర్తేని–' అని వెనుక కద్రువ యనినది ఆ మాట సాధారణముగా వినత విషయమును చెప్పునది. విశేషముగా కద్రువ విషయమును చెప్పగలదు. అంతకు ముందుగా గరుత్మంతుడు నీకును నేను బుత్రుడన తల్లీ యనినాడు కద్రువ నుద్దేశించి. ఆ తరువాత కద్రువ తల్లికి మదిం గూర్తేని అని యనినది. నీ తల్లి

1. భా. ఆను. 1-263.

నైన నాకు మదిం గూర్తేని అనియునగును. అందుకనియే గరుడు డమృతమును తెచ్చిన తరువాత అనిన మాటలుగానున్న పై పద్యము జననీ అని మొదలగు చున్నది. బలవంతుండవు అను కద్రువ మాటకు బదులుగా గరుత్మంతుడు చెప్పిన నానావిధకర్మరుడనై సాధించితినన్నమాట చూచుకొనవచ్చును.

తిక్కన్నగారా కద్రువ యన్న మాటలను, ఈ గరుడుడు పలికిన పలుకులను, ఒక్క వృత్తమును గ్రహించి వ్రాసి దానికి దీటుగా నిది సమాధానము సుమాయని సూచించినట్లు కనిపించుచున్నది హెచ్చుతగ్గులు లేకుండ పోటీలు పడినట్లు సమానాంతరముగా సాగు భావములను కూర్చుచో ఛందము విషయమునను తిక్కన్నగారు జాగ్రత్తపడుట భారతమున మరియు తత్ర తత్ర కలదు భీష్మపర్వమున భీష్ముడు శరతల్పగతుడైన తరువాత శిబిరములకు తిరిగివచ్చు శ్రీకృష్ణ యుధిష్ఠిరులు పరస్పరము వ్యంగ్యముగా ప్రశంసించు కొనుటయు కించిత్తెత్తిపొడుచుకొనుటగా సాగించిన సంభాషణమును తిక్కన్నగారు రెండు కందపద్యములలో వ్రాసిరి. సంజయరాయబారమునందలి పెట్టనికోట-ద్రోణుడు భీష్ముడున్ - అను రెండు ఉత్పలమాలావృత్తములును నీ పద్ధతి లోనివే ఇదంతయు చెప్పుట యేలనగా నానుశాసనికమునం దా వృత్తములు రెండును మత్తేభములగుట కాకతాళీయముకాదనియు తిక్కన్నగారట్లు తెలిసియే వ్రాయుదురనియు చెప్పుటకు మరియు తిక్కన్నగారా గరుడుని మాటాడిన పద్యము క్రింద "అని ధర్మస్థితితోన మాట వెర వేపారం బల్కి నేర్పునకున్ లోకము మెచ్చ"గా గరుడుడు వోయినాడని వ్రాసిరి. అనగా పైన గరుడు డాడిన మాటలలో వెరవు-నేర్పు కలవని తిక్కన్నగారు వ్యాఖ్యానించి చెప్పినట్లయినది. వెరవనగా నుపాయము. మరియు చమత్కారమైన తర్కముతోడి యుక్తి. నీ వమృతము తెమ్మంటివి - నేను తెచ్చితిని అని చూపించి అనుభవమున కందనీయకపోవుట యుక్తికదా మరి. ఈ విధముగా తిక్కన్నగారా పద్యమునంతయు తెలిసితెలిసి కూర్చినపుడు మత్తేభవృత్తము కాకతాళీయము కాజాలదు. అసలు తిక్కన్నగారీ కథనంతయును మత్తేభవృత్త బాహుళ్యము మీద నడిపించిరి. అనగా నీ కథ తద్వృత్తముయొక్క గత్యౌచిత్యముమీద ఉద్దిష్టార్థమున కభిముఖముగా నడపబడినది.

వీరానుప్రాణితమైన భావమును మత్తేభముగాని శార్దూలముగాని తమ గతి విశేషమువలన సుష్ఠుగా నభివ్యక్తము చేయగలవు. మహాబలవంతుడైన గరు

త్మంతుని మహానుభావలక్షణ మా బలము మీద చూపబడినది. అనగా గరుడుని వీరానుప్రాణితమైన ఉద్ధతస్వభావ మీ అనుశాసనమున చూపబడినట్లు. ఇదొక అవాంతరమైన కథ గనుక రసభావములతో పెంచి వర్ణించుటకు వీలులేదు దాని ఆంతర్యము మాత్రము సహృదయుల బుద్ధిని తాడితము చేయవలయును. అందుకొరకు తిక్కనగారిచట మత్తేభవృత్తము విరివిగా నుపయోగించి దానిని సూచించిరి మొత్తము గరుడోపాఖ్యానమున నెనిమిది మత్తేభవృత్తము లున్నవి ఊరకచూచినచో నెనిమిది అదియొక పెద్దసంఖ్య కాదు. కాని భారతము నందుపయోగింపబడిన మత్తేభవృత్తముల సంఖ్యనెరిగి చూచినచో నెనిమిది చాల పెద్దసంఖ్య మొత్తము గరుడోపాఖ్యానము ఎనుబదినాల్గు గద్య పద్యములు. అందెనిమిది మత్తేభములు అనగా ప్రతి పదింటికి నొక మత్తేభ వృత్తము వ్రాయబడినట్లు ఈ విధమైన వినియోగము భారతమునందు మరియొక యే ఉపకథయందునులేదు. అందువలన నీ కథయందలి మత్తేభములు కాకతాళీయములనిగాని, నిష్ప్రయోజనములనిగాని అనుటకు వీలులేదు. 'అని ధర్మస్థితితోన మాటవెరవు-' అని యెనిమిదవ మత్తేభవృత్తమును వ్రాసిన వెంటనే "ఇవ్విధంబున నౌచిత్యంబు సంస్తుత్యంబుగా నమృతం బమృతాశనపతికి నొసంగి" గరుడుడు చనినాడని తిక్కన్నగారు వ్రాసిరి. ఇవ్విధంబున నన్నది మొదట గరుడుడు చేసిన దానికి చెప్పినదానికి నన్వయించును తరువాత కవి చేసిన మత్తేభవృత్తరచనా రూపశిల్పమున కన్వయించును. అనగా నన్వయించుకొనవచ్చును. ఇవ్విధంబున నౌచిత్యంబు సంస్తుత్యంబుగా ననగా, ఈ పైన చెప్పబడినట్లుగా మత్తేభవృత్తముయొక్క గతివిశేషము నాశ్రయించుకొని గరుడుని మహానుభావత్వమును స్తుతింపదగిన యౌచిత్యముతో చెప్పుటయని భావింపవచ్చును.

ఈ గరుడోపాఖ్యానము నందలి యెనిమిది మత్తేభములలో మొదటిది పుట్టిన గరుడుడు వెంటనే బ్రహ్మకడకు బోవుటను చెప్పునది. రెండవది ముఱక టించుకొనుచు కద్రువ మాటాడిన మాటలను చెప్పునది. అమృతము దెచ్చెదనన్న పుత్రుని యుత్సాహమునకు పొంగిపోయిన కశ్యపుని గూర్చినది మూడవది. నాల్గవది గరుడుడు దేవలోకమున కెగయుటను చెప్పునది. గజకచ్ఛపములను గరుత్మంతుడు చేజిక్కించుకొనుటను చెప్పునదైదవది. ఆరవపద్యమున దేవేంద్రుడు గరుడునిపైకి నెత్తి వజ్రము వేయుట విషయము. అమృతమును గొనివచ్చి

కద్రువకుచూపి యెడ కలుగబోయి ఆమె వెరగుపడుచుండగా గరుడాడిన మాటలను చెప్పునది యేడవ పద్యము. తల్లి దాస్యమునువాపి అమృతమును తిరిగి గరుడుడు దేవేంద్రున కిచ్చినాడను విషయమును చెప్పునది చివరపద్యము. ఇందారు పద్యములు గరుడుని వీరానుప్రాణితమైన జీవలక్షణమున కను కూలములుగా వ్రాయబడినవి. రెండు తదుత్కర్షను పెంచుటకు వ్రాయబడినవి. కద్రువ మాటాడిన పద్యమును, దేవేంద్రుడు గరుడుని పైకివచ్చుటను చెప్పుపద్యమును నట్టివి. కద్రువ ముఱకటించుకొని మాటాడుటయే గరుత్మంతుడు విజృంభించుటకు ప్రబలమైన హేతువు దేవేంద్రుడు యుద్ధమునకు వచ్చుట మత్తేభ వృత్తమున చెప్పుటచేత నాతని ఉత్సాహముతోడి గరుడుని లెక్కచేయని తనము ప్రతీయమానమగుచున్నది. అట్లువచ్చినవాడు వజ్రము నిరుపయోగము కాగా "చేయునదిలేక వెరగుపాటునను మ్రాన్పడుచుం బోయె గ్రమ్మఱి" అని పర్యవసానము చూపింపబడుటచేత, దేవేంద్రునిమించిన గరుడుని యుత్సాహమునకు బలమునకు నుత్కర్ష చేకూర్చినట్లైనది ఇచట నింద్రుని విషయమున తిక్కన్నగారు వ్రాసిన వాక్యమును కొంచెము సూక్ష్మముగా విచారించినచో తదుత్కర్ష లక్షణమింకను స్పష్టముగా నుండును దేవేంద్రుని విషయమున వెఱగు పడుట - మ్రాన్పడుట రెండును చెప్పబడినవి సాధారణముగా మ్రాన్పడుట వెఱగు పడుటలో గతార్థము కాగలదు. కాని తిక్కన్నగారట్లు చేయలేదు. గరుడు డమృతమును గొని ఆకసమున కెగసినాడని వినినప్పుడే ఇంద్రున కాశ్చర్యము కలిగినది ముందు యద్ధమున గరుడుని బలపరాక్రమములకు నా యాశ్చర్యము మరియు వృద్ధియైనది. ఆ యాశ్చర్యము దేవేంద్రుని మ్రాన్పడుటను చేయలేదు చివరకు వజ్రమాతని నేమియును చేయజాలక తిరిగి వచ్చుటతో మరియు నాశ్చర్యముతోపాటు దేవేంద్రుడు మ్రాన్పడవలసి వచ్చినది. అనగా నిశ్చేష్టుడైనాడు. నిశ్చేష్టుడైనా డనగా యుద్ధము విరమించుకొనినాడని యర్థము. అనగా గరుత్మంతుని బలపరాక్రమములు దేవేంద్రున కాశ్చర్యములగుటతోపాటు వానిని నిశ్చేష్టుని చేసినవన్నమాట. ఇకనీ చెప్పబడినది గరుత్మంతున కెట్లుత్కర్షను గూర్చుచున్నదో ఊహింపవచ్చును. "నిర్జరనాయకుడును-వెఱగు పాటునను - మ్రాన్పడుచును (౦) - బోయె గ్రమ్మఱి" అని తిక్కన్నగారు సముచ్చయమున కావృత్తిని గూర్చుచు వాక్యము వ్రాయుటనుబట్టి విచారించి నచో పై వివరణ మూహాకందుచున్నది.

మిగిలిన పద్యము లన్నియు పుట్టినది మొదలుగా నమృతము తిరిగి దేవేంద్రున కిచ్చువరకుగల గరుడుని వీరానుప్రాణితమైన జీవలక్షణమును నిరూపించు నవియే. తిక్కన్నగారు గరుడుని మహానుభావలక్షితమైన కథను వృత్తౌచిత్యము మీద నిరూపించిరి. ఇదొక రకము కథాకథనశిల్పము

ఇక ఉదంకుని కథ. భారతము భూలోకమున మొదటి సారిగా వినబడిన సందర్భము జనమేజయుని ఉపసంహృత సర్పయాగము. ఆ సర్పయాగమును జనమేజయుడు చేయుటకు మూల ముదంకుడు కనుక నాదిపర్వమున వాని కథ వ్రాయబడినది. కనుక జనమేజయునకు సర్పయాగబుద్ధి పుట్టించగల సామర్థ్య మును నిరూపించునదిగా నాదిపర్వమునందలి కథ యుండును. ఆశ్వమేధ పర్వమునందలి కథాలక్షణము వేరు శ్రీకృష్ణునంతవానిని శపించుట కుద్యుక్తు డగుటకు తగిన సామర్థ్య ముదంకునకు కలిగిన విధము నిరూపింపబడుట ఇచట ముఖ్యము. ప్రతీకారవాంఛాసమృద్ధమైన అంతఃకరణముతోడి తీవ్రప్రవృత్తి ఆదిపర్వమున నన్నయ్యగారిచేత ఉదంకునియందు నిరూపింపబడినది. అదియే సర్పయాగము చేయించుటకు హేతువు. అశ్వమేధపర్వమున శాంతశమదమాది లక్షణమైన అంతఃకరణముతోడి గురుభక్తి విషయముగానైన తపఃప్రవృత్తి ఉదంకునియందు తిక్కన్నగారిచేత నిరూపింపబడినది. అట్టి తపశ్శక్తి సంపన్న తయే మరియు వృద్ధమై శ్రీకృష్ణుని శపింప నుద్యమించగలంతయైనది అందు వలననే తిక్కన్నగారు వ్రాసిన కథలో ఉదంకుడు రాజును శపించుట – నాగ కులమున దివ్యపురుషుడు ప్రత్యక్షము కాగా ''ఇన్నాగకులంబెల్ల నాకు వశం బగునట్టుల ననుగ్రహింపుమనుట'' – ఈ మొదలైన విషయములులేవు అవ న్నియు తీవ్రస్వభావమును ప్రతీకార వాంఛను పరిపుష్టముచేసి చూపించునవి. అవి నన్నయ్యగారి కవసరములు. తిక్కన్నగారికథకవి ఉత్కర్షాపాదకములు గావు. కనుకనే వ్రాయబడలేదు తిక్కన్నగారు ముఖ్యముగా నిరూపించినది ఉదంకుని గురుశుశ్రూషాపరత.

ఉదంకునితోపాటు గౌతమునివద్ద చాలమంది చదువుకొనినారు. అంద రును చదువైపోయినదని గౌతముడు పంపించినాడుగాని ఉదంకుని మాత్రము పంపలేదు. ఆ యుదంకున కెంతకాల మీ గురుకుల వాసమన్న ఊహాయేలేదు. గురువు విషయమున వినా వాని చిత్తమున కసలు ప్రవృత్తియేలేదు. అందు కనియే ఆ గురువునకు వానిని వదలవలయుననిలేదు. అందరవంటివాడు కాదు

గదామరి! చాలకాల మల్లే గడచినది ఒకనాడు నెరిసిన తనతల వెంట్రుకల జట, నెత్తిమీది కట్టెలమోపు నెత్తి పడవేయుటలో, దానితోపాటూడివచ్చి కనిపించగా నవుడుదంకునకు తన వయఃపరిపాక మెరుగనైనది అప్పటివరకు తాను – తన వయస్సు – వయస్సు ననుసరించి కలిగెడు శరీరపరిణామమును పురస్కరించుకొని యేర్పడు ఇంద్రియవికారము – ఈ మొదలైన వేమియు నా యుదంకుని బుద్ధి కందలేదు వాని గురుశుశ్రూషాపరత యట్టిది ఆ తెల్లని తలవెంట్రుక కనిపించుటతో వాని కాయా విషయములన్నియు నొక్కసారిగా తోచియుండవచ్చును అపుడాత డేమియు చేయలేదు ఒక్కసారి పెద్దగా నేడ్చినాడు ఏడ్చుట యనగా నిష్క్రియాపరమైన దుఃఖరూప చిత్తవృత్తి నభివ్యక్తముచేయుట. తన వయస్సు మొదలైనవి బుద్ధి కందినను గురువుగారి నుండి సెలవుతీసికొని పోవుట నాతడు తలచినట్లు లేదు. ఏల యేడ్చుచున్నా వని గురువుగా రడిగిరి. ఉదంకు డిట్లు చెప్పెను. "శిష్యులందఱపై గల కరుణ మీకుఁ బెద్దకాలమేని మునివరేణ్య! నా వలన లేద దాని కుమ్మలింప కెట్టు లుండవచ్చు?"[1] మీ కింకను నా మీద దయరాలేదు గనుక నేడ్చుచున్నాను గురుదయకు పాత్రుడుగాని శిష్యుడు ఏడ్వక చేయునది యేమిగలదు? అటు గురుదయకు పాత్రుడుగాక – ఇటు ఏడ్వక – ఇక శిష్యుడుంట యెట్లు? – ఇది ఉదంకుని సమాధానము తాత్పర్యము గురుదయా విశేషమునకు పాత్ర మగుట తనకు పట్టలేదని యేడ్చుచున్నాడుగాని, ఉదంకుడు, పెండ్లి పేరంట ములు లేక తన వయస్సంతయు చెల్లిపోవుచున్నదని యేడ్వలేదు. కాని గురువా శిష్యుని మాటలవలన నా యర్థమును గ్రహించి "ఎలప్రాయ మిచ్చితిని నీ కలఘుమతీ! యిచ్చెదను మదాత్మజ నుల్లంబలరగ బెండిలిగమ్మని పలికి"[2] నాడు. నిజమున కా ఉదంకునకు పెండ్లి పేరంటములమీద బుద్ధిలేనిచో గురువుగా రాత్మజ నిత్తురనగా కిమ్మనకుండ చేసికొనినా డేమి యనవచ్చును. ఉదంకునకట్టి యూహాలేదని గట్టిగా చెప్పలేము. వాని యేడ్చుచు చెప్పిన సమాధాన మునం దా యర్థ మున్నదనుట కంతగా వీలులేదు ఉండవచ్చును. ఉన్నదో లేదో తెలియదు. గురువు వ్యాఖ్యానించినట్లు మాటాడినాడు శిష్యు డంగీక రించినాడు. అందువలన రేఖామాత్రముగా నాతని యేడ్చిన యేడ్పులో నా

1. భా అశ్వ. 3-74.
2. భా. అశ్వ. 3-76.

యూహ ఉన్నదన్నను దోషములేదుగాని స్పష్టముగా నది వాని ముఖతః వెలికి రానందున గురుదయకు పాత్రమగుటయే వానికి కావలసినదని చెప్పబడినది గురువు దయ కా విధముగా పాత్రమైనా డుదంకుడు.

గురువు తన కూతు నిచ్చెదనని చెప్పుటలో నుదంకుని మహాత్మ్యము నుగ్గడించినాడు. "నీ తేజంబు సహింపగ నీ తామరసాక్షిదక్క నెవ్వరికి తపస్విసుతా! శక్యముగాదు. ఇది చేతోగతిఁ జూచి"[1] యే నీకు నా కూతు నిచ్చుచున్నా నని నాడు గౌతముడు. తపస్విసుతుడనగా తపస్సుచేత నత్యధికుడైనవాడు. మరియు తపస్సుచేతనైన సంతోషాతిశయము కలవాడు. మరియు తపస్సుచేత కల్మష రహితుడైనవాడు. ఉదంకునిగూర్చి గౌతముని యభిప్రాయ మట్టిది- నీ విషయ మును నేను నా అంతఃకరణమున పరిశీలించుచుందును నీవు నా యందు మాపు గురుభక్తికి తగవు సిద్ధించుటకై నా కూతు నిచ్చుచున్నాను, గ్రహింపుమని గురువుచేత ననిపించుకొనిన ఉదంకుని గురుభక్తి కేవల మూహింపదగినదిగాని వ్రాయదగినదికాదు ఉదంకుని గురుభక్తి అంత గొప్పది ఆయన తపస్సే అది

మిత్రసహునివద్దకు పోయి తన వచ్చినపని చెప్పుటయందును - సాధించుట యందును, విప్రరూపమున వచ్చిన దేవేంద్రునితో తన నిశ్చయము చెప్పుట యందును, ఉదంకుని గురుభక్తి, శాంతశమదమాది లక్షణమైన అంతఃకరణమే తిక్కన్నగారిచేత చెప్పబడినది మిత్రసహుడు నా కాహార యోగ్యమైన కాల మున వచ్చితివిగాన నిన్ను తిందుననగా నుదంకుడు "మద్గురుకార్య మాచరించి వచ్చెద మగుడ నవశ్యంబు. నా మాట ననృతంబుసొరదు నా కోరుకోర్కి నీవ తీర్తని కృతనిశ్చయత్వంబున నరుగుదెంచినవాడ"[2] ననినాడు ఈ యుదం కుని యాడిన మాటలలోని మెత్తందనముతోడి వినయము, పౌష్యుతో నాది పర్వమున మాటాడిన ఉదంకుని మాటలు స్మృతికి తగిలినచో తెలియును అచట కథ కది వలయును ఇచటి కథాలక్షణము వేరు. ఉదంకుడొక కొయ్య కోలను తీసికొని భూమిన త్రవ్వ నారంభించినాడు అట్లు త్రవ్వి పాతాళమునకు బోయి తక్షకు డెత్తుకొనిపోయిన కుండలములు తేవలయునని వాని యూహ. ఇంద్రుడు బ్రాహ్మణుడుగా వచ్చి వారించినాడు. అపు డుదంకుడు వానితో నిట్లనినాడు.

---

1. భా. అశ్వ. 3-77.
2. భా. అశ్వ. 3-93.

పాతాళంబున నున్నను
వే తెత్తుం గుండలములు విను మప్పని నా
చేతంగాకున్న నసు
వ్రాతము విడువబడు నిది ధ్రువంబు—.[1]

ఆదిపర్వమునయందలి ఉదంకు డెన్నడును ప్రాణములు విడుతునను నూహాచేయ లేదు ఇతరుల ప్రాణములు తీయవలయు నన్న తీవ్రత యే వానియందున్నది వానిప్రవృత్తి యట్టిది వీనిప్రవృత్తి యిట్టిది. తిక్కన్నగారువ్రాసిన ఉదంకునికథ ఏవం విధమైన చిత్రమహానీయత కలిగియున్నది

పూర్వాపరములను పర్యాలోచన చేయకుండ, ఇంతవరకును తిక్కన్న గారు వ్రాసిన ఉదంకునికథయందలి యౌచిత్యము తత్ప్రదేశమునకు పరిమితము చేయబడి విచారింపబడినది. పూర్వాపరములను విచారించినచో నాది పర్వమునందలి యుదంకు డీ యశ్వమేధమునందలి ఉదంకుడు కాడనుట సముచితముగా తోచును అదియెట్లో ఇక వ్రాయబడును.

భారతయుద్ధమైపోయిన తరువాత ధర్మరాజింకను నశ్వమేధము చేయకముందు, శ్రీకృష్ణుని శపింపగలిగి నంత తపశ్శక్తిసంపన్నుడుదంకుడు. అనగా నప్పటికింకను జనమేజయుని తండ్రియైన పరీక్షిత్తుకూడ పుట్టలేదు. పరీక్షిత్తుని కుమారుని వద్దకుపోయి, తనకు పాములు చేసిన అపకారమునకు ప్రతిగా సర్పయాగము చేయుమని బోధించినవాడు - ఆదిపర్వము నందలి ఉదంకుడు. అనగా నప్పటికింకను చిన్నతనమున తనకు పాములు చేసిన అపకారస్మృతి తొలగలేదన్నమాట. ఇంతకాలము తపస్సు చేసినను క్రోధము చావలేదు అట్టి క్రోధము చావని ఉదంకుడు తనను దర్శింపవచ్చిన శ్రీకృష్ణునితో "మిథ్యాచారుడవై కౌరవకులమును త్రుంచితి"వి గాన నిన్ను శపింతునని పూనుకొనుట, వానితో శ్రీకృష్ణుడు పెద్ద ప్రసంగముచేసి విశ్వరూపమును చూపి వానికి తన దోషము లేమిని ఋజువు చేయుట - మొదలైనవి అంత సమంజసముగాలేవు సాధారణుడైన క్రోధమును జయించని తపస్సుగల మునిని సందర్శించుటకు శ్రీకృష్ణుడు పోవుటయు నంత లెస్సగా లేదు. కనక నశ్వమేధపర్వమునందలి ఉదంకుడు వేరు వాడు

1. భా. అశ్వ. 3-107.

కావలయును "శాపోన్ముఖమగు మన్మానసము మగిడించెద"నని శ్రీకృష్ణునితో నశ్వమేధమున నుదంకుడనినాడు చిత్తము నా విధముగా స్వాయత్తము చేసి కొనిన మహాయోగి అశ్వమేధమునందలి ఉదంకుడు ఇంత ఉదాత్తమైన స్థితిలో జనమేజయుని తాతల కాలమునందున్న ఉదంకుడే, జనమేజయుని కాలమున కింకను పెద్దవాడై అపుడు ప్రతీకారము చేయుటకు ప్రవర్తించినాడనుట కేవల మసందర్భముగా కనిపించుచున్నది. ఉదంకుడు వృద్ధుడై వృద్ధుడై తపశ్శక్తిని పెంచుకొనుటకు బదులు మతిపటుత్వమును కోలుపోయి, క్రోధవశుడై చిన్నతనమున పాములు తనకు చేసిన అపకారమునకు ప్రతి జనమేజయునిచేత చేయించుటకు పూనికొనియుండవచ్చు నని చెప్ప జూచుట, ఒక మహర్షి పట్ల కేవల మవిచారమూలకమైన హేతువును సృష్టించుట యగునని పించుచున్నది. నన్నయ్యగారు "ఉదంకుం డనేక కాలంబు దపంబు సేసె నట్టి యుదంకుండు తనకు చేసిన యపకారంబునకుం బ్రతీకారంబు సేయంజింతించి యొక్కనాడు జనమేజయు పాలికింబోయి"[1] నాడని వ్రాసిన వాక్యమునందలి 'అనేక కాలంబు దపంబు సేసె' అను దానిని పట్టుకొని పై విధముగానూహించుటయు నంత సమంజసముగా తోచుట లేదు. అందువలన నాదిపర్వమునందలి ఉదంకుడును, అశ్వమేధమునందలి ఉదంకుడును వేరువేరని అనుకొనుటయే ఉచితముగా తోచుచున్నది ఇరువురు నొకరే అనుటకు రెండు కథ లెంత అనుకూలముగా నున్నవో, కారనుటకును నంతే అనుకూలముగా నున్నవి అదియునుగాక జనమేజయుడే వైశంపాయనుని అడిగినాడు - ఉదంకుని విషయము చెప్పుమని ఉదంకుని పేరు వినగానే సహజముగా - ఇంతకుపూర్వము నా వద్దకు వచ్చి సర్పయాగము చేయుమని నన్ను బోధించిన ఉదంకుడేనా యేమి ఆ ఉదంకుడు ? అని జనమేజయు డనియుండ వలసినది. అనలేదు అన్నచో విషయము స్పష్టముగా నుండెడిది ఇంతకును ఉదంకు లిరువురా ? ఒకరా ? అన్నది సందేహము ఇరువురగుట ఉచితమని యూహ. ఇంతకంటె తేల్చి చెప్పగలిగిన దేమియును లేదు.

---

1. భా. ఆది. 1-120.

# సప్తమోన్మేషము

## 1. వర్ణన స్వరూపము

ఒక వస్తువునకు సంబంధించిన సూక్ష్మాతిసూక్ష్మములైన బహ్వాంశములు వ్యస్తములై అవ్యవధానముగా పేర్కొనబడి, ఆ వస్తువున కుత్కర్షాపాదకము లైనచో నపు డది వర్ణింపబడినట్లు. అనగా నొక వస్తువుయొక్క సమగ్ర స్ఫూర్తిని తత్సంబంధి బహ్వంశములచేత కలుగుచేయ ప్రయత్న మేది కలదో అది వర్ణనము. సమగ్రస్ఫూర్తియనగా తత్కాలమునయందా ఫలానా వస్తు వెంతగా స్ఫూర్తిమతియగుట యవసరమో అంతగా నగుట అందుచేతనే తత్సమగ్రస్ఫూర్త్యపేక్షయా తతుద్దీప్తిసంపాదనపటువులు బహ్వాంశము లొకచో సమకూర్చుట వర్ణించుట యనబడుచున్నది కవికర్మ కావ్యము. కవయతి - వర్ణయతి - వర్ణించువాడు కవి కావ్యమంతయు వర్ణనమే కావ్యమునందలి కథార్థము ప్రధాన వస్తువు. దానికి సంబంధించి తదుత్కర్షా పాదకములైన బహ్వాంశములు కూర్పబడి మొత్తముమీద కావ్యమగుచున్నది కనుక కావ్యము మొత్తము వర్ణింపబడియే అగుచున్నది.

కాని వర్ణనమన్నది సాధారణముగా నీ యర్థమున దేశమున గ్రహింప బడుటలేదు సూర్యోదయము - చంద్రోదయము - ఉద్యానవనము - స్త్రీలు - ఈ మొదలైన విషయముల వర్ణనమే వర్ణన మనుకొనబడుచున్నది దీనికి హేతువు కావ్య మష్టాదశవర్ణనాసహితమన్న ఆలంకారిక ప్రవచనముయొక్క బలము కావచ్చును సాధారణముగా మరియు నధికముగా నష్టాదశవర్ణన ములకు నాలంబనములుగా పేర్కొనబడిన వస్తువుల వర్ణనమే వర్ణనమని భావింప బడుచుండుటను గమనించినచో పై హేతువు సత్యమున కెంత దగ్గరగా నున్న దియు తెలియును అందువలననే సాహిత్యవిమర్శనమునందును, ఋతువర్ణ నము- సముద్రవర్ణనము - సూర్యోదయ సూర్యాస్తమయాది వర్ణనములు మొద లైనవి వ్యస్తములుగా తీసి చూపించి ప్రశంసించుట అలవాటయిపోయినది. యథార్థమున కవిమాత్రమే కాదు వర్ణనలు. కావ్యమున ప్రత్యంశమునను అనంత ముఖమైన వర్ణనము పరివ్యాప్తమై యున్నది

కావ్యమున వర్ణన మంతయు స్థూలముగా రెండు రకములని చెప్ప వచ్చును స్థూలముగా ననుట యేలనగా సూక్ష్మవిచారణము చేసినచో వర్ణనము బహువిధముల నుండును. కవికర్మ అంతయును వర్ణనమేకదా! జడచేతన వస్తు విభాగముచేత కావ్యమునందలి వర్ణనము ద్విధాభూతము. ఇందొక్కొక్కటి తిరిగి రెండు రకములు – అంతర్వర్ణనమని మరియు బాహ్యవర్ణనమని. చేతనవస్తువులు కథలోని పాత్రములు. జడములు ప్రకృతిస్థలములైన సూర్యోదయాదులు కావ్యమునందు కవి జడమును చేతనమున కుద్దీప్తిహేతువగు నట్లుగా వినియోగించుకొనును.

జడముయొక్క వర్ణన మంతయు కవి ఆపాదించు గుణవిశేషముతో కూడియుండును ముఖ్యముగా నంతర్వర్ణన మట్లుండును ప్రకృతిస్థములైన జడవస్తువులు వానికవిగా నిర్గుణములు. అవి సౌందర్యవంతము లగుటయు కాకపోవుటయు కూడలేదు. మానవుని హృదయసంవాదిలక్షణమువలన నవి అన్నియు కలవగుచున్నవి అనగా గుణవంతములగుచున్నవి. సామాన్య మానవుని హృదయసంవాది లక్షణమునకంటె కవియైనవాని హృదయసంవాది లక్షణము నిస్సందేహముగా శక్తిమంతము. అందువలన ప్రకృతి మొత్తము కవియొక్క భావనావ్యాపారమునకు విషయమై అనంతకోటిగుణములతో ప్రత్యక్షమగుచున్నది మరియు నాకవులలో హృదయసంవాదిరూపమైన అనుభవమును, భావనావ్యాపారరూపవ్యవసాయము లక్షణముగాగల బుద్ధియైన నైశిత్యమును తరతమభేదములతో నుండును. కావ్యములోని ప్రధాన వస్తువుయొక్క నిర్వహణమున కనుగుణముగా సర్వమును పూర్వాపరములమీద పర్యాలోచనచేసి వర్ణించి కూర్చువాడు అచ్చమైన శిల్పియై మహాకవి యగుచున్నాడు. చాలమంది కవులలో హృదయసంవాదిలక్షణమునకంటె భావనవ్యాపారరూపవ్యవసాయలక్షణమైన బుద్ధి తక్కువస్థితిలో నుండును. అట్టిచో ప్రకృతి గతానేక వస్తువులయందు గుణాధానము చేసికొని కేవలము హృదయము రమించును ఏతద్రమణమే మూలముగా చేయబడిన వర్ణనములు వ్యస్తముగా రమణీయములైనంత కావ్యమున కావ్యార్థము దృష్ట్యా చూచినపుడు కావు. అనగా అంగాంగిసంబంధ దూరమైన వర్ణనమన్నమాట యది. మరియు కొన్ని కృతులయందు ప్రకృతివర్ణనములు తత్తత్ప్రకరణ విరుద్ధముగా గూడ నుండుట కలదు. అది ఇంకను పెద్ద దోషము. నిర్గుణమైన దానియందు గుణమును కల్పించినచో నది యవసరమును తీర్చునదిగా నుండవలయును.

ప్రకృతి సమస్తమును మానవునకు సుఖమో దుఃఖమో కలిగించునదిగా భావింపబడును ఇచట అనుభవమును పొందుట కలిగిన జీవసముదాయము నంతకును మానవుడు ప్రతీకగా చెప్పబడుచున్నాడు. ఒక చిత్రకారుడు కేవల మెడారి నొకదానిని చిత్రించినాడు అందొంటరిగా నొకడెవడో ఒక స్థితిలో నున్నట్లుగూడ చిత్రించును ఆ మానవుని చిత్రించకపోయిననేమి ? వాని యనుభవముమీద ఆ యెడారి లక్షణ మాధారపడి యున్నది. అందువలన నట్లు చిత్రించినాడు. అనగా ప్రకృతి మానవుని యనుభవమునుబట్టి సగుణముగా చూపబడుచున్నదని యర్థము. అట్లే కావ్యములయందును ప్రకృతి వర్ణింపబడును కావ్యమున ప్రధానకథాపురుషు లున్నారు. ఆ వర్ణింపబడు ప్రకృతి సమస్తమును, ఆ ప్రధానకథాపురుషుల యొక్క సుఖదుఃఖములమీద ప్రతిభాసించి ప్రకరణము ననుసరించి తదుద్దీప్తి హేతువు కావలయును. అపుడే అది శిల్పము సొగసంతయు ప్రయోజనములో నున్నది ప్రకృతి యందముగా వర్ణింపబడినదనగా సప్రయోజనముగా వర్ణింపబడినదని యర్థము కావ్యమున ప్రకృతివర్ణన మిట్లుండవలయుననుట మహానిష్కర్షయైన సిద్ధాంతము మహాకవుల కావ్యములయందును తత్రతత్ర నిష్ప్రయోజనములైన ప్రకృతి వర్ణన లుండును దీనినిబట్టి హృదయ సంవాది లక్షణముయొక్క బలము నూహించుకొనవచ్చును అది కవితాశక్తి యొక్క విజృంభణము ఒక విధముగా నది అనాగరక లక్షణము కావ్యశిల్పమర్యాద నతిక్రమించిన లక్షణమది అతిక్రమింపకుండుట నాగరక లక్షణము మానవుడు నాగరకబుద్ధి కలవాడగుటచేత లోపల లోపల పుట్టుచున్న అనేకములైన ఊహలను వెలికి రానిచ్చుటలేదు ఏలనగా నవి సంఘముయొక్క సుష్ఠయిన వ్యవస్థను తారుమారుచేయునవిగనుక. అట్లే కవితాశక్తి యొక్క విజృంభణమును, సంఘవ్యవస్థవంటి కావ్యశిల్పమర్యాద ననుసరించి నాగరకబుద్ధి కలిగిన కవి అరికట్టుకొనును అరికట్టుకొనవలయును ఒకడు మహాకవి యగుటకు కావలసిన లక్షవిషయములలో మొదటిది ఏవం విధమైన నాగరకబుద్ధి క్షేమేంద్రుడు దానినే ఔచిత్యమనెను ఫలితార్థ మిది – జడమునందు చేతనతను కవి తన ఊహాశక్తిచేత, భావనచేత ప్రాదుర్భవింపజేసి తత్సర్వమును, కావ్యార్థమైన చేతనవస్తుతత్త్వమున కుద్దీప్తి హేతువుగా నిర్వహించుట మహోన్నతమైన కావ్యశిల్పము ఏతన్మహాశిల్పము నందెవని బుద్ధి యధికముగా ప్రసరించునో నతడు మహాకవిశబ్దవాచ్యుడు.

అట్టి వానియం దెపుడేని కావ్యశిల్పము నతిక్రమించి కవితాశక్తి విజృంభించి నచో నది మహర్షికైన తపోభంగము వంటిది.

ఇంతవరకు కావ్యమునందలి జడవస్తువర్ణనమునకు సంబంధించిన విష యము చెప్పబడినది చేతనవస్త్వాశ్రయమైన అంతర్బహిర్వర్ణనముల విషయము కథాగతములైన పాత్రములకు సంబంధించినది గనుక పాత్రోన్మీలనము పర్యా లోచించబడు సందర్భమునను, అంగరసముల యౌచిత్యము విచారింపబడు నప్పు డును చెప్పబడును.

తిక్కన్నగారి భారతమున ప్రకృతి వర్ణనము లధికముగా లేవు. అసలు భారతము నా యా వర్ణనల కంతగా నవకాశములేదు ఒకటి రెండు చోట్ల ఉద్యానవన, విరహాది వర్ణన లున్నవి. అవి అంగరసముల విషయమునందు చేర్చి చెప్పబడును. ఋతువర్ణనములు తిక్కన్నగారి భారతమున లేవు ఉన్న యుద్ధ వర్ణనము విషయము ప్రత్యేకముగా వ్రాయబడినది సూర్యోదయ సూర్యాస్త మయాది వర్ణనములే కొద్ది పరిధిలో తిక్కన్నగారు వర్ణించిరి ఇచట ప్రకృతి వర్ణన లనగా నవియే ప్రధానకథార్థము దృష్ట్యా మరియు ప్రకరణము దృష్ట్యా ఆ యా వర్ణనముల యౌచిత్యము విచారింపబడును కావ్యశిల్పము దృష్ట్యా కవితాశక్తి విలువ చూపబడును

## 2. ప్రకృతి వర్ణనలు

ఎత్తిన వేడ్క కంధరము లెత్తి మొగంబులు సాచి చూపులం
జిత్తములున్ నిగిడ్చి తమ చెందెడు నిక్కలు రోసి యింపు ద
ళ్కొత్తఁగ నొక్కచో నొకటి నొక్కటిగాంచి యెలర్చు కాయ్వులం
జిత్తజు కేళిఁ దేలె విలసిల్లుచుఁ జక్కవదోయి వేకువన్.[1]

సంజయుడుపప్లావ్యమునుండి తిరిగి వచ్చినాడు అచటి విశేషము లన్నియు రేవు కొలువులో పదిమంది యెదుట చెప్పెదనని ధృతరాష్ట్రునితో "ధర్మరాజు మెత్తని పులి. ఎల్లవారలు నధర్మము నీపయి పెట్టునంతకున్ వినడును కాన డున్. పిదప నీకును నాకు మరల్ప వచ్చునే"[2] అని వెళ్ళిపోయినాడు. ఇక

1. భా. ఉద్యో. 2-109.
2. భా. ఉద్యో. 2-14.

ధృతరాష్ట్రునకా రాత్రి కంటికి కునుకురాలేదు. విదురుని పిలిపించుకొనినాడు. మరియు సనత్సుజాతుని రప్పించుకొనినాడు ఆ సనత్సుజాతునివలన హృదయ పుష్కరకలితంబులగు పరతత్త్వము ను ప్రసాదించునట్టి గూఢోక్తులు ధృత రాష్ట్రు డనుగ్రహింపబడుచుండగా తెల్లవారుజామైనది. అయినదని సూచించు టకు పై పద్యము తిక్కన్నగారిచేత వ్రాయబడినది. ఆ పద్యమున తిర్యక్కు లైన చక్రవాక దంపతులయొక్క తెల్లవారుజామునందలి సంభోగవిషయము చెప్పబడినది తెల్లవారుజామున సృష్టిలో జరుగు క్రియాకలాపములు లక్ష. అందులో నొక్కటి చక్రవాక దంపతుల రతి దానిని వెలికితీసి యేల చెప్ప వలయును? తెల్లవారుజా మైనదని చెప్పుటకు తద్రతివిషయము తప్ప మరొకటి లేదా?

అసలా రాత్రి ధృతరాష్ట్రున కేల నిదురపట్టలేదో విచారించినచో విషయ మింకను స్పష్టపడును. ధృతరాష్ట్రుని మనస్సంతయు ధర్మరాజాదుల విషయమై తీవ్రముగా పర్యాలోచించుచున్నది. రాజ్యమున భాగము పెట్టకుండ వారిని సమాధానపరిచి వచ్చుటకు సంజయుని పంపినాడు. వచ్చినవాడు వా రేమనిన దియు చెప్పకుండ ధృతరాష్ట్రుని నిందించి మరియు భయపెట్టి పోయినాడు ధృతరాష్ట్రున కింకేమియు పాలుపోలేదు పాండవు లేమనినారో? సంజయు డాడిన రెండు మూడు మాటలనుబట్టి వ్యవహార మనుకూల పడిరాలేదని అని పించుచున్నది. అంతయు స్పష్టముగా చెప్పినవాడు కాడాయె సంజయుడు. త్వరగా తెల్లవార వలయును. సంజయునివలన పాండవులవిషయమంతయు వినవలయును - ఈ మొదలైన ఆరాటము ధృతరాష్ట్రుని చిత్తమునందున్నది. అందువలన నిద్ర పట్టలేదు ఒంటరిగా నుండి ఆ యారాటమును భరించలేక విదురుని పిలిపించుకొని, తన స్థితిని చెప్పుచు వానితో నిట్లనినాడు—"ధర్మ సుతుమాట చొప్పెవ్విధంబో యెఱుగ కునికిఁ జేసి చింతిల్లితి ఓపు దీవు. తెలియఁ జెప్పి నా యలమట మలగఁజేయ"[1] - మనము సంజయునిద్వారా చెప్పి పంపిన దానికి ధర్మరాజేమనియుండునో నాకు సరిగా తెలియరాలేదు సంజయుడు చెప్పలేదు. రేపు చెప్పెద ననినాడు నీవు ధర్మరాజేమనియుండు ననుకొను చున్నావు? నీ వూహింపగలవు. ఊహించి నాకు చెప్పుము - ఇది ధృత రాష్ట్రుడు విదురుని పిలిపించుకొని చెప్పినదాని తాత్పర్యము. ధృతరాష్ట్రుని

1. భా. ఉద్యో. 2-23.

మనస్సంతయు ధర్మరాజును చుట్టకొనియున్నది అందువలన నిదురపట్టలేదు. విదురుడు నెమ్మదిగా ప్రారంభించి ధర్మరాజునకు రాజ్యమిచ్చుట మంచిదని బోధించుటకు పూనుకొనినాడు ధృతరాష్ట్రున కదియే యిష్టము కానిది. విదురుని రాకవలన వాని స్థితి మరియు దుర్భరమైనది అందుకని ధృతరాష్ట్రుడు తెలివిగా సరే నీవు చెప్పినట్లే చేయుదునుగాని ఇక నాకు పరమార్థవిషయము గురించి చెప్పుమనినాడు. పరమార్థవిషయమైనచో పాండవుల సంగతి రాదు. అందుకని ధృతరాష్ట్రు డది కోరినాడు విదురు డందుకు నేను కాదని సనత్సుజాతుని రప్పించినాడు. సనత్సుజాతుడు పరతత్త్వమునుగూర్చి చెప్పుటయు ధృతరాష్ట్రుడు వినుటయు జరుగుచుండగా తెల్లవారుజామైనది త్వరగా తెల్లవారుటను కోరుకొనుచున్న ధృతరాష్ట్రునకు రాత్రి కాలక్షేపమగుటకు విదురుడు, సనత్సుజాతుడు ననుకూలపడినారు. ఏవం విధమైన మనోలక్షణముతో ధృతరాష్ట్రు డుండగా తెల్లవారుజామైనది చక్రవాకముల సంభోగశృంగారముతోనైనది ఆ ధృతరాష్ట్రుని మనస్థితికిని - వేకువ అట్టిదగుటకును నేమి సంబంధము ? ఆ పద్యమునకు బదులుగా నచట నీ క్రింది పంక్తులు వ్రాయవచ్చును

"తమ పాసిన కందువలు రోసి యెత్తిన మెడలును బచరించిన చూడ్కులు వేడ్కలం గ్రందైన డెందంబులుం గలిగి మెలంగుచు నొండొంటి బిట్టుగాంచి యొదవు సమ్మదంబునం బొదలు మేనులు బెరయించి పరమానందంబునం జొక్కుచు జక్కవలు గలసి సొలసి నలిరేగి చెలంగుచు"[1] — నున్నవి.

ఈ వచన పంక్తులకును, ఎత్తిన వేడ కంధరములని మొదలైన పై పద్యమునకును వచనము - పద్యము - అను భేదముతప్ప మరి యర్థము నందేమియు భేదము లేదు. రెండింటియందు వేకువజామునందలి చక్రవాకముల సంభోగమే వర్ణింపబడినది. తిక్కన్నగారీ వచనమును విరాటపర్వమున వ్రాసిరి. తాను బ్రతికియుండవలయునన్నచో కీచకుడు చంపబడనేవలయునని ద్రౌపది ఆ రాత్రి భీమునితో గట్టిగా చెప్పినది. భీముడు సరే కీచకుని చంపుదుననినాడు. ద్రౌపది వచ్చి పడుకొన్నది. ఆమెకు నిదుర పట్టలేదు ద్రౌపది నట్లు పంపించి అచట భీముడు పండుకొనినాడు. వానికిని నిదుర పట్టలేదు. తెల్లవార వచ్చినది.

---

1. భా. విరా. 2-240.

ఆ తెల్లవారుటను తిక్కన్నగారు చక్రవాకముల సంభోగశృంగారముతో సూచించిరి.

ద్రౌపదికి నిదుర యేల పట్టలేదు ? తన బ్రతుకు నట్లు బజారున బెట్టిన పరమదుర్మార్గుడు కీచకుడు. వాని చావును తాను చూచితీరవలయును. అందులకు భీమునితో నాలోచించినది. ఇరువురును నొక పన్నకము పన్నినారు. అందులో కీచకుడు పడవలయును పడినచో చచ్చును తన చౌరవ చేసికొని మాటాడుటద్వారా కీచకు నా యురికి లాగవలయును తెల్లవారగనే తానందుకు పూనుకొనవలయును. ఆ పూనికను గురించిన లక్షయూహాలు ద్రౌపది మనస్సు నావరించియుండుటవలన నామెకు నిదురపట్టలేదు. ద్రౌపది కీచకునితో నెట్లు మాటాడి నర్తనశాల కొంటరిగా వచ్చుట కొప్పించునో యేమో ! ఎట్లో ఆమె చేయును. అర్ధరాత్రమున మరి యెవ్వరును చూడకుండ కీచకుని తాను హతమార్పవలయును. చీకటిలో తనను వాడు ద్రౌపదియని దగ్గరకు చేరునట్లుగా తాను నటింపవలయును వాడు చేయిజారిపోయినచో చాల ఇబ్బంది కలుగును. కనుక వానిని నేర్పుగా చంపవలయును – ఈ మొదలైన ఆలోచనలతో భీమునకు నిదురపట్టలేదు. భీముని మనస్సంతయు కీచకుని వధించు విషయమున పర్యాప్తమైయున్నది. ద్రౌపది మనస్సట్లున్నది. తత్కాలము నందలి ద్రౌపదీభీముల మనోలక్షణమునకును, అప్పటి వేకువ చక్రవాకముల సంభోగముతో వర్ణింపబడుటకును నేమి సంబంధము ?

ప్రస్తుత మీ విషయ మిట్లుంచి తిక్కన్నగారు వ్రాసిన రెండు సూర్యాస్తమయములను చెప్పు పద్యముల విషయ మిచట వ్రాయబడుచున్నది.

సోమాన్వయ ప్రదీపకుఁ
డీ మెయిఁ దేజోవిశేష మెసకం బెసగం
గా మెఱయుట గనుగొని సి
గ్గై మఱవడు మాడ్కిఁ గ్రుంకె నర్కుండంతన్.[1]

తాన స్తశిఖరి మఱువడఁ
బోని యపుడు పాండురాజపుత్రవిరా

1. భా. భీష్మ. 1-299.

త్సేన పొడవడఁగు నను కృప
నో నలినాప్తుండు గ్రుంకె నుర్వీనాథా![1]

ఈ రెండు పద్యములును భీష్మపర్వములోనివి యుద్ధము మొదటిదినమైపోవుటను చెప్పునది పై పద్యము రెండవది యుద్ధము నవమదివసము సమాప్తమగుటను చెప్పు పద్యము. భీష్ముని తేజోవిశేషముముందు తానాగలేక, వెలవెలబోవు చున్న తన యాస్థితికి తానే సిగ్గుపడి సూర్యుడు మొగము చాటుచేసికొన బోయినట్లుగా మొదటి పద్యమున సూర్యు డస్తమించుట ఊహింపబడినది. రెండవ పద్యమున తానిక అస్తశిఖరిని చాటుచేసికొని తన వెలుగు ప్రసరించుట నరికట్టనిచో భీష్ముని చేతిలో పాండురాజకుమారు లన్యాయమై పోవుదురన్న దయకలిమిని సూర్యు డస్తమించినట్లుగా నూహింపబడినది. ఈ రెండు పద్యములయందును సూర్యాస్తమయము తత్ప్రకరణమునందలి ప్రధానకథాపురుషుల తత్కాలపు స్థితి కుద్దీపకముగా చేయబడినది

మొదటినాడు భీష్ముడు యుద్ధరంగమున నపరసూర్యుడువలె వెలిగి పోయినాడు అనగా నంత తీవ్రప్రతాపముతో నున్నాడు. సూర్యుడు తన వేడిమిగల కిరణములచేత సమస్తసృష్టిని తపింపజేసినట్లుగా భీష్ముడు నాటి యుద్ధమున తన నిశితములైన బాణములచేత పాండవ సైన్యమునంతను మిక్కిలిగా తపింపజేసినాడు. మరియు భీష్మునిలోనున్న విశేష మేమనగా చంద్రవంశమున పుట్టి సూర్యుడై వెలిగిపోవుట అందువలన సూర్యుడు సిగ్గుపడినాడు సూర్యుడు సిగ్గుపడవలసినంత తేజోవిశేషము భీష్ముని యందానాడు వెలికి వచ్చినది - ఈ ఊహాసామాగ్రి అంతయు నాటి భీష్ముని యుద్ధముయొక్క తీవ్రతమ స్థితిని వ్యంజింపజేయుచున్నది తత్ప్రకరణమున భీష్ముని యుద్ధమే ప్రధాన విషయము తదుత్కర్షాపాదకముగా సూర్యాస్తమయము చెప్పబడినది భీష్ముని ఆ మొదటినాటి యుద్ధము తీవ్రత యెంతవరకుపోయినదనగా, ఆ రాత్రి ధర్మరాజు తానిక భీష్ముని బలదర్పమహోగ్రతకు తట్టుకొనజాలనని వెఱగంది, శ్రీకృష్ణునితో, యుద్ధము మానుకొని అడవులకు బోవుదునని చెప్పు వరకు పోయినది. సూర్యు డంతటివాడు భీష్ముని తేజోవిశేషమునకు సిగ్గుపడ వలసిరాగా, ధర్మరాజు భీష్మునిగని భయపడుటలో నాశ్చర్య మేమున్నది

1. భా. భీష్మ. 3-270.

గనుక ? యుద్ధమున సర్వనాశనముచేసి యైనను రాజ్యము సంపాదించుటకు పూనిన ధర్మరాజు వెఱగంది వెనుకంజవేయుట అన్నింటికంటెను ప్రధానమైన విషయము. ఆయనయేకదా కథానాయకుడు ? అందుకని. అట్టి ధర్మజుని వెఱగుపాటునకు భీష్ముని యుద్ధతీవ్రత హేతువు. ఆ తీవ్రత సూర్యాస్తమయ విషయమున చేయబడిన ఊహావలన లెస్సగా ప్రతీయమాన మగుచున్నది. అనగా ధర్మరాజు వెఱగుపడుటను సూర్యాస్తమయ విషయమున చేయబడిన ఊహ సమర్థించుచున్నది. ధర్మరాజు యుద్ధమున వెనుకంజవేయుట శాంతరస ప్రధానమైన భారతమున కనుకూలమైన విషయమే భీష్మపర్వము ప్రథమాశ్వాసాంతమున నొక్క కందపద్యమున చేయబడిన సూర్యాస్తమయ వర్ణనము, మహాభారత నాయకుడైన ధర్మరాజును పురస్కరించుకొని స్థాయికెక్కిన కావ్యరసమైన శాంతమునకు పరంపరగా ననుకూలమైన దన్నమాట రసస్వరూప మెరిగిన, నిర్మాణదక్షుడైన మహాకవి యట్టి వర్ణన చేయును. తిక్కన్నగారు చేసిరి

ఇక రెండవ పద్యము. తొమ్మిదవనాటి యుద్ధమునను భీష్ముడు పరమ తీవ్రుడుగనే ఉన్నాడు. ఆ యుద్ధము పదిదినములలో శ్రీకృష్ణుడు చక్రము తీసికొని భీష్ముని సంహరింతునని పూనికచేయుట రెండవసారిగా జరిగిన రోజది. యుద్ధము మూడవనాడల్లే శ్రీకృష్ణుడు భీష్మునిపైకి పోయినాడు. తొమ్మిదవ నాడును భీష్ముని తీవ్రతను చెప్పుటయే ప్రధానమైనను సూర్యాస్తమయ వర్ణనమున పాండవుల ప్రసక్తి తేబడినది పాండవుల ప్రసక్తితో భీష్ముని తీవ్రత నిరూపింపబడినది మొదటిపద్యమున లేని పాండవుల ప్రసక్తి ఇచట యేల ఉండవలయును ? ఏదో ప్రయోజనముండవలయును. భీష్ముడు పదిదినములు యుద్ధము చేసినాడు పది సూర్యాస్తమయములైనవి. పైన ఉదాహరింపబడిన ఆ రెండుపద్యములయందు తప్ప మరియొకచోట సూర్యాస్తమయము కథా సంబంధి పురుషుల తత్కాలపు స్థితితో జోడించి చెప్పబడలేదు

'పాండురాజపుత్రవిరాజత్సేన వొడవడగునను కృపతో సూర్యుడస్తమించినాడని ఊహింపబడినది విరాజత్సేన అనగా ప్రకాశించుచున్న సేన విక్రమించుచున్న సేనయని యర్థము. ప్రకాశింప తగినసేన అని కూడ చెప్పవచ్చునేమో ! అంతవరకు విక్రమించుచునేయున్నది. ఇక విక్రమించలేని స్థితి వచ్చుచున్నదని సూర్యుడస్తమించినాడు. కాక విక్రమింప తగిన – వలసిన సేన ఇట్లై

పోవుచున్నదే అని కూడ సూర్యుడస్తమించియుండవచ్చును. మొత్తము మీద పాండవసేన విక్రమించి యెదిరిని నాశనముచేయుట సూర్యుని అభిలాషమన్నట్లుగా చెప్పబడినది కృపాలక్షణమట్టి అభిలాషయే కావలయును. సూర్యునకు కృపయేమి ? కవిచేత నాపాదింపబడినది.

ఆ నాటి రాత్రి ధర్మరాజు చేత ప్రార్థింపబడి భీష్ముడు పాండవుల యందలి ప్రీతిచేత తాను యుద్ధమునుండి విరమించుటకు వారు చేయవలసిన దానిని బోధించి మరునాడు యుద్ధము చాలించినాడు. తనవలన పాండవసేనా బలము రూపుమాసిపోగలదని భీష్మునకు తెలియును. కాని పాండవులయందు కృపయున్నది. అందువలననే భీష్ముడు లెస్సగా విక్రమించుటలేదు. అయినను పాండవసేన నాశనమయిపోవుచున్నది పాండవులు జయించుట భీష్మున కిష్టము తాను యుద్ధమునుండి తొలగినగాని పాండవుల సేన విక్రమింప లేదు. అందువలన తన చాలించు రహస్యమును ధర్మరాజునకు చెప్పినాడు.

మొదటినాటి యుద్ధావసానమున భీష్ముడు తేజోవిరాజితుడైన సూర్యుడు సిగ్గుపడుట మొదలైనది అతిశయోక్తిగా తీసివేసినచో భీష్ముడు సూర్యుడుగా రూపించబడినాడని యర్థమగును తొమ్మిదవనాటి యుద్ధావసానమున సూర్యుడు పాండవుల యందలి దయచేత నస్తగిరిమాటునకు బోయినాడని చెప్పబడినది ఆ యూహ తద్రూపుడైన భీష్ముడు పాండవులయందలి దయ చేత ఆ రాత్రికి ధర్మరాజుచేత ప్రార్థింపబడి యుద్ధమునుండి విరమించుకొనుటను వ్యంజింపజేయుచున్నది నిజముగా పాండవులయందు దయచూపినది భీష్ముడు. అది సూర్యునియం దాపాదింపబడినది. దీని మొత్తము తాత్పర్యమిది. భీష్ముడు సూర్యునివంటి ప్రతాపోష్ణము కలవాడు తానింక యుద్ధమునుండి విరమించినచో పాండురాజపుత్రులయొక్క విరాజత్సేన రూపుమాసిపోవును. అది కూడదు-అని తొలగినాడు. అది యెట్లున్నదనగా పాండవులయందలి దయచేత సూర్యుడు తన వెలుగు నరికట్టుకొని అస్తమించినా డన్నట్లున్నది. సూర్యాస్తమయమైనచో యుద్ధము ముగిసినట్లు. సేన సుఖముగా విశ్రాంతి తీసికొనుటకు సమయము సమకూడినట్లు. భీష్ముడు యుద్ధము చాలించినచో పాండవ సేనకంతయు విశ్రాంతి సమయమే. తరువాతకూడ ఎనిమిదిదినములపాటు యుద్ధము జరిగినది అయినను పాండవుల కా యుద్ధ మంత భారము కాదు. భీష్ముని తీవ్రతవంటి తీవ్రత తరువాతి కౌరవసేనావీరులలో లేదు. భీష్మునకు పాండవులయందున్నంత కృప మరి యే కౌరవపక్షమునందలి వీరునకును లేదు.

పాండవుల యందు జాలిపడి సూర్యుడ స్తమించుట ఆ పదునెనిమిది దినముల యుద్ధములో నొక్క తొమ్మిదవనాడు మాత్రమే చెప్పబడినది. మిగిలిన సూర్యాస్తమయము లన్నియు సామాన్యముగనే జరిగినవి. భారతయుద్ధమున అనన్యమైన భీష్ముని ప్రతాపమును, మరియు వాని పాండవులయందలి దయను రెండింటిని క్రమముగా సూర్యునియందు, వాని అస్తమించుటయందు రూపించి రెండు కందపద్యములు వ్రాసి తిక్కన్నగారు కథార్థమును ప్రకరణౌచిత్యము మీద సాధించినారు. వర్ణమునందలి యౌచిత్యమనగా నట్లుండుట. అది కావ్య శిల్పము

మొట్టమొదట చూపబడిన వేకువజామునందలి చక్రవాకముల సంభోగ వర్ణనమునందలి యౌచిత్యము నిప్పు డూహింపవలయును అది వ్యస్తమైన కవితాశక్తి. అది కథాగతికి సంబంధించి తదుత్కర్షాపాదకముగా లేదు. అనగా కావ్యములయందు ప్రయోజనరహితమైన వర్ణనము కొంత, సప్రయోజనమైన వర్ణనము కొంత ఉండునని తేలినది. ప్రయోజనరహితముగా మందుడును ప్రవర్తింపడుకదా ! మరి మహాకవి యేల ప్రవర్తించును ? ధీమంతులకును ప్రమాదము సంభవించుట అంగీకరింపబడినందున మహాకవులును ప్రయోజన రహితముగా మధ్యమధ్య వర్ణనలు చేయుటకు పాల్పడుదురు. ఆ పాల్పడుట తపోభంగము వంటిది. కేవలము వర్ణనము కవితా శక్తికి సంబంధించినది అది ప్రయోజన సహితముగా చేయబడుట అన్నది కావ్యశిల్పమునకు సంబంధించి నది. కావ్య ప్రౌఢిబాటించు శిల్పమున పారగుడైన తిక్కన్నగారి విషయము ననే కావ్యశిల్పము యొక్క అదుపులోనుండి వెలివడి కవితాశక్తి విజృంభింపగా నిక తక్కిన సామాన్యకవుల విషయమేమి చెప్పవలయును ?

కావ్యమున దోషములు రెండు రకములుగా సంభవించునని ధ్వన్యాచార్యులు చెప్పిరి. అవ్యుత్పత్తి కృతములు కొన్ని. అశక్తికృతములు మరి కొన్ని. మరియు నాయన యొక మాట చెప్పెను. అవ్యుత్పత్తికృతము శక్తి తిరస్కృతము – అని. ఇచట శక్తి యనగా కవితాశక్తి యని యర్థము. వ్యుత్పత్తియనగా కావ్యశిల్పము లేక కావ్యనిర్మాణ దక్షత యని యర్థము. కావ్యనిర్మాణ దక్షతయొక్క లేమిని కదాచిత్తుగా కవితాశక్తి వెలికి తెలియ నీయకుండ కాపాడును. అనగా నర్థమిది. ఒక మహాప్రతిభావంతు డొక విషయ మును వర్ణించినాడు. ఆ వర్ణనము గ్రంథము మధ్యనున్నది. నిజమునకది అచట

నుండ నక్కర లేదు ఉన్నది. పరంపరగా నా కావ్యమును చదువుకొనుచున్న వారందరును, ఆ వర్ణనము నందలి చమత్కారము నాస్వాదించుచునే పోవుచున్నారు. అది యచటనుండ రానిదని యెవరు ననుకొనుట లేదు ఒక వేళ దాని నెవడైనను నిష్ప్రయోజనమెనదని గుర్తించినను తత్కాలమున మాత్ర మందరివలనే చమత్కారము ననుభవించుచున్నాడు అనగా నా వర్ణన మవ్యుత్పత్తి కృతమయ్యును శక్తి తిరస్కృత మగుచున్నది. అనగా కవితాశక్తి కావ్యశిల్పమునందలి లోపమును కప్పిపెట్టుచున్న దన్నమాట. ఎంతవరకట్లు కప్పిపెట్టి కాపాడగలదు ? ఎంతవరకు పాఠకులు రసభావాదిమయ కావ్యస్వరూప పరిజ్ఞాన నైపుణ్యముకల సహృదయులు కారో అంతవరకును కాపాడగలదు అనగా నచ్చమెన సహృదయుడు కావ్యశిల్పమును చూచుగాని కేవలము కవితాశక్తిని చూడడన్నమాట అపుడు అవ్యుత్పత్తికృతము దోషము దోషముగా బయటపడును కనుక కావ్యశిల్పమునకు ననగా కావ్యనిర్మాణ దక్షతకు లోబడియే కవితాశక్తి ఉండవలయును ముక్తకములు వ్రాసికొను వానికి కవితాశక్తి ఒక్కటి ఉపకరించినట్లుగా కావ్యము వ్రాయువాని కుపకరింపదు తిక్కన్నగారు చేసిన చక్రవాకదంపతుల సంభోగవర్ణనము, కవితాశక్తిచేత మహనీయముగా నున్నది కావ్యశిల్పము చేతలేదు సూర్యాస్తమయ వర్ణనము కావ్యశిల్పముచేత చిత్రమహనీయముగా నున్నది. కవితాశక్తి చేత లేదు. తిక్కన్నగారు ముక్తకకవి కాదు ఒక మహాకథ గలిగిన కావ్యేతిహాసమును నిర్వహించుచున్న కావ్యకుశలుడు అందువలన నాయన వర్ణనా నైపుణ్యమునకు నా రెండుపద్యములు నుదాహరణము లైనట్లుగా నా ఉత్పలమాలకాదు. మరియు నా వచన పంక్తులుకావు. అదియునుగాక తత్ప్రకరణముల యందలి కథాపురుషులైన ధృతరాష్ట్రుని యొక్కయు, ద్రౌపదీభీముల యొక్కయు తత్కాలమునందలి చిత్తవృత్తుల కనుకూలముగాని వర్ణన యది ప్రకరణౌచిత్యమును కోలుపోయిన మహనీయమైన కవితాశక్తికంటె, ప్రకరణౌచిత్యమును పోషించుచు కావ్యశిల్పమున నంతర్భవించుచున్న కవితాశక్తి శ్రేష్ఠమైనది పరమనాగరక గౌరవలక్షణలక్షిత మది.

కావ్యశిల్పము దృష్ట్యా ప్రకృతివర్ణన మెట్లుండునో చూపుటకింతవరకు వ్రాయబడనది ఇక తిక్కన్నగారి భారతము నందున్న మిగిలిన స్థలము అందలి ప్రకృతి వర్ణనము విచారింపబడును. ఇచట ప్రకృతివర్ణన లనగా

సూర్యోదయ సూర్యాస్తమయము లనియే మొదట చెప్పబడినది. సూర్యోదయ వర్ణనమనగా వేకువనుండి సూర్యోదయమువరకు. సూర్యాస్తమయవర్ణన మనగా చంద్రోదయమువరకు.

తిక్కన్నగారు భారతమున సూర్యోదయాదికమును వర్ణించిన తావుల కంటె సూచించి వదలిన తావు లధికముగా నున్నవి అనగా వర్ణించుటకు వీల యినపుడెల్లను ఆయన వర్ణింపలేదు చాలకొద్దిచోట్ల వర్ణించెను. కథాగతి కవసర మైన కాలగతిని సూచించుటకు సూర్యోదయ సూర్యాస్తమయాదు లైనవని మాత్రమే చాలచోట్ల చెప్పెను యుద్ధము జరిగిన దినములయందు దాకాలగతిని సూచింపక తప్పదు ప్రతిదినము యుద్ధము ప్రారంభమగుటయు, సమాప్త మగుటయు చెప్పబడవలయునుగదా! అందుకని కాలగతి తప్పక సూచింప బడనే వలయును. ఆ యుద్ధపుదినములను వదలినచో నిక సూర్యోదయాదులు చెప్పబడిన తావు లై దారింటికి మించిలేవు ఇవియును విరాటోద్యోగముల యందే యున్నవి ఒకటి రెండు శాంతిపర్వమున నున్నవి ముందట్టి సూచనల అవసరము విచారింపబడును

విరాటపర్వమున సూర్యోదయము వర్ణింపబడినది. కీచకుని చంపు విష యము నా రాత్రి ద్రౌపదీభీములాలోచించిరి. తెల్లవారిన తరువాత కథను నడిపించుటకు సమర్థమైన విషయ మా రాత్రి జరిగినది అందువలన తెల్లవారిన దని చెప్పుట కథ నడచుట కవసరము కనుక సూర్యోదయమును తిక్కన్నగారు చెప్పిరి. మరియు, ఉపకీచకులను గూడ చంపి భీముడు ద్రౌపదిని విడిపింపగా నామె సచేలస్నానము చేసి నగరము ప్రవేశించుటకు ముందుగా సూర్యోదయ మైనట్లుగా నింకొకసారి విరాటపర్వమున సూచింపబడినది దీనివలన నుపకీచకుల వధయు సూర్యోదయాత్పూర్వమే రాత్రి సమయముననే భీముడు నిర్వహించి నాడనినది స్పష్టముచేయబడనది. మరియు సూర్యోదయమైన తరువాత ద్రౌపది రాజవీధిని నగరము ప్రవేశించుటవలన నామెను చూచి పురముజనము భయసంభ్రమము లనుభవించినట్లు చెప్పుటకు వీలైనది ఇది చెప్పబడినందున కీచకోపకీచకులవధ పురమున నప్పుడే వ్యాపించి యెట్లుడికించినదో అది వ్యంగ్య భూతమగుచున్నది. సూర్యాస్తమయమును విరాటపర్వమున రెండుసారులు చెప్పబడినది. ఏ రాత్రి కీచకుడు చంపబడినాడో ఆ రాత్రి యేర్పడుటకైన సూర్యాస్తమయము మొదటిది. కీచకుడు చంపబడుట ప్రధానము. అది రాత్రి

పూటనే జరుగవలయును కీచకుని చంపుటకు పన్నకము పన్నిన ద్రౌపదీభీము లకును సూర్యాస్తమయము కావలయును ద్రౌపదిని సంకేతస్థలమున కలిసి కొనుట కారాటపడుచున్న కీచకునకు సూర్యాస్తమయము కావలయును తెలిసి చంపువాడు, తెలియక చంపబడువాడు, ఇరువురును సూర్యాస్తమయ మున దృష్టికలవారే అందువలన కవి సూర్యాస్తమయమును చెప్పితీరవల యును రెండవ సూర్యాస్తమయము దక్షిణగోగ్రహణము యుద్ధము నాటిది ఆ యుద్ధము సూర్యాస్తమయముతో నాగలేదు ఒకవేళ యుద్ధమంతటితో ముగిసినను అందుకు హేతువుగా సూర్యాస్తమయమును సూచింపనే వలయును యుద్ధము రాత్రిపూట కొనసాగినది గనుక చంద్రోయమును చెప్పబడవలసియే యున్నది. తిక్కన్నగారు చంద్రోదయము నొక పద్యమున వర్ణించిరి.

ఉద్యోగపర్వమున సూర్యోదయ మొక్కచోట వర్ణింపబడినది. మరి రెండుచోట్ల సూచింపబడినది. సూర్యాస్తమయమును మూడుచోట్ల సూచింప బడినది ఈ పర్వమున వర్ణింపబడిన సూర్యోదయము విషయము మొదటనే వ్రాయబడినది సంజయు డుపప్లావ్యమునుండి తిరిగి వచ్చిన నాటిరాత్రి తెల్ల వారుటకైన సూర్యోదయ మది ప్రధానగతి నిర్ణయ మొకవిధముగా చేతిలో నున్న ధృతరాష్ట్రునకు త్వరగా తెల్లవారుట కావలసిన స్థితియది. ధర్మజుని చిత్తమెట్లున్నదియు తెలిసికొనుట ఆయనకు కావలయును. తెల్లవారిన కాని సంజయుడు చెప్పడు కనుక తెల్లవారవలయును అచట సూర్యోదయము చెప్పబడుట కథకు చాల యవసరము

భీష్మ ద్రోణ కర్ణ శల్య సౌప్తికపర్వములం దొక్క శల్యపర్వమున తప్ప మిగిలిన ఏ పర్వములయందుగాని సూర్యోదయము వర్ణింపబడలేదు ఊరక సూచింపబడినది. భీష్మపర్వమునందు సూర్యాస్తమయము ప్రధానకథాపురు షుల తత్కాలపు స్థితిలో జోడించి వర్ణింపబడిన రెండు కందపద్యముల విషయ మిదివరలో వ్రాయబడినది మిగిలిన భీష్మపర్వమునందలి సూర్యాస్తమయము లూరక కాలమును సూచించునవియే. ద్రోణపర్వమున చంద్రోదయవర్ణన మున్నది ఐదు దినములు ద్రోణుడు యుద్ధముచేసినాడు నాల్గవనాడు సైంధ వుని అర్జునుడు సంహరించినాడు దానితో దుర్యోధను డుత్సాహరహితమైన చిత్తవృత్తి కలవాడై ద్రోణుని నిందించినాడు. అందుకు ద్రోణుడు సుయో ధనుని కినిసి ఆ రాత్రి యుద్ధము కొనసాగించినాడు. కొంతసేపు దీపములు

పెట్టుకొని యుద్ధము చేసికొనిరి. తరువాత నర్జునుని మాటమీద చంద్రోదయ మగువరకు నుభయసేనలును యుద్ధ మాపినవి చంద్రోదయమైనది తిరిగి యుద్ధము మొదలైనది. అట్లా నాల్గవనాటి రాత్రి తిరిగి యుద్ధము ప్రారంభ మగుటకు ముందైన చంద్రోదయమును తిక్కన్నగారు వర్ణించిరి యుద్ధము తిరిగి మొదలగుటకు చంద్రోదయ సూచన మవసరము. కర్ణపర్వమున నొక్కచో సూర్యాస్తమయము కథతో జోడించి చెప్పబడినది. శల్యపర్వమున సూర్యోదయ మట్లే కథార్థము ననుసరించి వర్ణింపబడినది యుద్ధము మొదలగుటకు ముందు సూర్యోదయ సూచన చేయవలయునుగదా! సౌప్తికపర్వమున సూర్యాస్తమయము తత్ప్రకరణమునందలి ప్రధానపురుషులతో జోడించి చెప్ప బడినది. సౌప్తికపర్వమునందలి అశ్వత్థామవిజృంభణము రాత్రిపూటనే గనుక సూర్యాస్తమయము చెప్పబడుట కథ కవసరము

శాంతిపర్వమున ధర్మరాజునకు ధర్మతత్త్వోపదేశము చేయుటకు శ్రీకృష్ణుని మాటమీద భీష్ము డంగీకరించినాడు ఆనాడు పాండవులు భీష్ముని రేపు వచ్చెదమని వీడ్కొని హాస్తినాపురమునకు వచ్చుచుండగా చంద్రోదయమైనదని తిక్కన్నగారు వర్ణించిరి. తత్పూర్వ మూరక సూర్యాస్తమయము సూచింప బడినది. ఇక మిగిలిన నొకటి రెండు చోట్లను సూచనలేగాని వర్ణనలు లేవు.

మొత్తముమీద భారతమున తిక్కన్నగారిచేత చేయబడిన సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనములున్న తావులు ప్రధానకథావిషయములను పురస్కరించుకొని తప్పక కాలము సూచింపబడ వలసినవియే. కావ్యశిల్పము దృష్ట్యా ఆయన చేసిన వర్ణనముల విషయ మిచట పరామర్శింపబడును.

> ద్రుపద నందన పరిభవ దుఃఖమునకు
> నుల్లమున దురపిల్లుచునున్న సరసి
> వేడి నిట్టూరుపో యన వెడలెఁ గ్రొత్త
> తావి మూతులు విచ్చు నెత్తమ్మి విరుల.[1]

ఇది విరాటపర్వమునందలి ప్రభాతకాల వర్ణనములోని మొదటి పద్యము. తెల్లవారి సూర్యోదయము కాబోవుచున్నది పద్మములు సరస్సున మూతులు విచ్చుచున్నవి. ఆ విచ్చుకొనుచున్న పద్మములనుండి తావి వెలికివచ్చుచున్నది.

---

1. భా. విరా. 2-236.

ద్రౌపది యనుభవించెడు నవమానదుఃఖమును చూడలేక మరి తానేమియును చేయలేక లోపల లోపల ఖేదపడుచున్న సరిసి వేడి నిట్టూర్పు విడుచుచున్నట్లున్నది. ఆ సరస్సులోని పద్మములనుండి తావి వెలికివచ్చుట – ఇది తిక్కన్నగారు వ్రాసిన దాని తాత్పర్యము చేతనత సరస్సునం దాపాదింపబడినది మరియు సరసి యని స్త్రీలింగశబ్దముతో దానిని చెప్పుటచేత దానియందు స్త్రీత్వము స్ఫురింపజేయబడినది. సరస్సు అను స్త్రీ ద్రౌపది దుఃఖమునుచూచి దుఃఖపడుచున్నది ద్రౌపది దుఃఖము ఒక దుర్మార్గుడైన పురుషుని అనుచిత ప్రవర్తనవలననైన అవమానదుఃఖము సాధారణ స్త్రీ జనమునకే అట్టి అవమానము జరుగుట దుఃఖహేతువు ఉత్తమజాతి స్త్రీవిషయమున నిక చెప్పనక్కరలేదు. ద్రౌపది ఉత్తమజాతి స్త్రీ. ఆ జాతిదైన సరస్సు అను స్త్రీకి ఆ దుఃఖము తీవ్రత తెలియును అందుకే ద్రౌపది పరిభవభవ దుఃఖమునకు తాను దురపిల్లుచున్నది. దురపిల్లుచు నొక వేడి నిట్టూర్పు విడిచినది ఆ నిశ్వాసవాయువు పద్మగంధి. సుగంధినిశ్వాస ముత్తమస్త్రీలయందుండును సరసి యట్టిది-ఈ విధముగా ప్రకృతియందు గుణాధానము చేసి తిక్కన్నగారు నిదురపట్టక వేదనపడుచున్న ద్రౌపది అంతఃకరణము లక్షణము నావిష్కరించిరి అప్పటి ద్రౌపది యొక్క దుఃఖతీవ్రత యెట్టిదనగా తెలిసిచో జడములుకూడ ద్రవించి పోవునంతటిది వర్ణనము వర్ణనము కొరకు చేయబడలేదు. కథకొరకు చేయబడినది. ఇది కావ్యశిల్పము ఈ పద్యము తరువాతి రచన అంతయు కేవల కవితాశక్తితో నున్నది

విరాటపర్వముననున్న సూర్యాస్తమయ వర్ణనలలో మొదటి దానికంటె రెండవది మట్టసముగా నున్నది మూడు కందపద్యములలో వర్ణనమైపోయినది సూర్యుడస్తమించినాడని చెప్పిన పద్యమునకంటె నందు చంద్రు డుదయించినాడనుట చెప్పిన పద్యము పరమోదాత్తముగా నున్నది. పగలు ప్రొద్దంతయు విరాటునకు సుశర్మతో యుద్ధమైనది. యుద్ధమొక కొలికికి రాలేదు. ధర్మరాజాదులు పగలు యుద్ధమున పాల్గొనలేదు. అల్లే ప్రొద్దు గ్రుంకినది. చీకటిపడినది. చంద్రోదయమైనది. తదుదయమును తిక్కన్నగారిట్లు వ్రాసిరి.

తన మనుమలు పాండు తనయు
లనిసేతకు వేడ్కసేయు టాత్మగని తమం

నది మొత్తముమీద ధర్మరాజు అశ్వత్థామ యను కుంజరము చచ్చినదని చెప్పి ఒక విధముగా నన్నృతమాడినవాడే అయినాడు. కుంజర మనుమాట వినిపించు నట్లనకపోవుట అది వేరు విషయము వానినోటి వెంట వెలికి అశ్వత్థామ సచ్చె ననుటతో పాటుగా నేనుగనికూడ వచ్చినది. దానిని తన యాత్మతృప్తి కొరకు ధర్మరాజు వెలికి తెచ్చినాడు ఆత్మతృప్తి కొరకనగా నన్నృతమునకు భయపడి యన్నమాటయే ఈ సందర్భమున చిత్రముగా ధర్మజుని చిత్తము నకు-సమరోత్సాహము నందు, తద్విరోధిభావమునందు, ఏకకాలమున ప్రవృత్తి చూపింపబడినది చివరకు వెలికివచ్చిన సమరోత్సాహమున కంటె ధర్మజుని యందు నణచబడిన అధర్మ భీరుతయే ప్రకాశమునకు వచ్చినది అధర్మ భీరుత పరమధర్మమైన మోక్షమున కనుకూల భావము. ప్రధానరసమున కనుకూల ప్రతికూల భావముల నేకకాలమున ధర్మజుని చిత్తమునందు వినివేశింపజేసి, ప్రతికూలభావ మనుకూలభావము నణచినట్లు చూపించుచు లెస్సగా ప్రకా శింపజేయుట పరమరమణీయముగా నున్నది, ధర్మజునియొక్క శాంతరస ప్రధానమైన భారతనాయకునితనము చిత్రముగా పరిపోషింపబడినది

కర్ణవధనాడు ధర్మజుని సమరోత్సాహము మరియొక మార్గమున చూపింపబడినది కర్ణుని చంపకుండ కృష్ణార్జునులు ధర్మరాజు యోగక్షేమ ములు విచారించి పోవుటకు యుద్ధము మధ్యలో శిబిరమునకు వచ్చినారు. అంతకు మునుపే ధర్మరాజు కర్ణునిచేత బాగుగా దెబ్బలు తిని ప్రాణములు దక్కించుకొని శిబిరమునకు పారిపోయి వచ్చినాడు కర్ణుని చంపియే వారు తన వద్దకు వచ్చినారని ధర్మరాజనుకొనినాడు. అనుకొని తన పడినపాటు విస్మరించు కొని వారిని ప్రశంసించుట ప్రారంభించినాడు. అపు డర్జునుడు కర్ణు నింకను చంప లేదని, నీ యోగక్షేమములు విచారించి పోవచ్చినామని చెప్పినాడు కర్ణుడు బ్రతికి యున్నాడను మాట ధర్మరాజును తల్లక్రిందులు జేసినది. ఆ కర్ణుని మీది క్రోధ మర్జునునిమీదగా పోయినది తత్క్రోధమునందలి అంతర్యము విజయము సాధించవలయునన్న పూనికయే ధర్మరా జర్జునుని అనిన మాటలన్నియు నొక యెత్తు-ఈ క్రింది పద్యమొక్కటియు నొక యెత్తు.

గొంతి కడుపునందుఁ గొడుకుఁజూలై నీవు
దోపకుండవైతి. తోచినట్టి

పిండ మెడలినైన్ బిదప దిగంబడ
దయ్యె. నింత వుట్ట దట్టులైన.[1]

నీవు పురుషుడవై కుంతీదేవి కడుపున పడకుండవలసినది. ఒకవేళ కడుపున పడి నను తరువాత పిండము జారిపోయి యుండవలసినది. అట్లయియున్నచో నివు డిట్లయ్యెడిదికాదు ధర్మరాజన్న మూడు వాక్యములివ్వి—ఇపుడేమైనది ? కర్ణుని చేతిలో తాను దెబ్బలు తినినాడు. కర్ణుడింకను బ్రతికియున్నాడు. కర్ణుని చంప కుండ నర్జునుడున్నాడు ఇది యిపుడైనది. అర్జునుడు పుట్టియుండకపోయినచో నా స్థితి వచ్చియుండెడిది కాదని ధర్మరాజనుచున్నాడు. అనగా కర్ణునిప్రసక్తి తనకుండెడిదికాదు. దుర్యోధనునితో విరోధమే యుండెడిదికాదు. అర్జునుడుం డుటవలన కర్ణునిచంపుదునని అనుటవలన తాను యుద్ధమునకు దిగినాడు. ధర్మ రాజు తానట్లు కర్ణుని చేతిలో నా డట్లవమానింపబడి శిబిరముల కేలపారిపోయి వచ్చినాడనగా నర్జునుడు వానిని చంపునుగదా యను నమ్మకముతో వచ్చి నాడు. కాని యర్జునుడు కర్ణుని సంహరింపకుండ వచ్చినాడు కర్ణుని మరణ రూపమున నాటికి విజయమును సాధించవలయు నను కొనుచున్న ధర్మజుని ఉత్సాహము అర్జునుడామాట చెప్పుటతో నధఃపతనమైనది. అందువలన తదుత్సా హము క్రోధముగా మారినది. సాధారణముగా ధర్మరాజునకు కోపమురాదు. వచ్చినచో నది యంత తీవ్రముగానుండును. ఉద్యోగపర్వమున సంజయుని మాటల కొకసారి ధర్మజునకు కోపము వచ్చినది. కర్ణుని జన్మము విషయము చెప్పక దాచి అంత యుద్ధము కల్పించి తనచేత సర్వబంధునాశనము చేయించిన దని శాంతిపర్వమున కుంతిమీద కోపము వచ్చినది ఆ కోపమున స్త్రీ జనము నంతకు కలిపి యొక శాపము పెట్టినాడు. కుంతివిషయమున వచ్చిన కోపము శోకతీవ్రతనుండి వచ్చిన కోపము దీనిని వదలినచో సంజయుని మీద వచ్చిన కోపమును, అర్జునుని మీద వచ్చిన కోపమును రెండును ధర్మజుని సమరోత్సా మును చుట్టుకొన్నవియే భారతము మొత్తముమీద ధర్మరాజునకు కోపము వచ్చిన దీ మూడు సందర్భములయందే.

కర్ణుడసలు కిరీటచేత చంపబడినాడా ? ధర్మరాజు కోపముచేత చంపబడి నాడా ? ధర్మజుని క్రోధమే కర్ణుని సంహరించినట్లు కనిపించుచున్నది ధర్మజ

---

1. భా. కర్ణ. 3-66.

డంతటి తీవ్రక్రోధమును వెలిగ్రక్కినాడు గనుకనే అర్జునుడు "ఎల్లభంగుల నేడు రాధం బుత్రరహితం జేసెద గాదేని గొంతియైన యట్టిద యగుంగాక"[1] అని తెగించిపోయి కర్ణునెదుర్కొనినాడు అంతగా నర్జునుడు తెగించి విజృంభించినాడు గనుకనే కర్ణుడానాడు సంహరింపబడినాడు కర్ణసంహారానంతరము తిరిగి వచ్చిన శ్రీకృష్ణుడు ధర్మరాజుతో మాటాడినమాట లీ పైయూహ కనుకూలముగా నున్నవి శ్రీకృష్ణు డిట్లనినాడు.

భువనము లన్నియు నొక్కట
గవిసియు కర్ణు పరిమార్పగా నోపునె భూ
ధవ ! భవదీయ క్రోధా
గ్ని విహతుఁడై క్రాగె గాక నిక్కంబరయన్.[2]

ధర్మజుని సమరోత్సాహము క్రోధరూపమున పరిణమించి అర్జునుని ముఖముగా కర్ణుని సంహరించినది

శల్యసంహారమునకు పూనుకొనిన ధర్మరాజు తన తమ్ములను దొరలను చేరబిలిచి యిట్లు చెప్పినాడు.

"....... ....... ....... ... ....... ....... ....... ....... ఏను శత్రుసై
న్యమథనకల్యు శల్యు తెగటార్చెద. నాకిది కృత్య మీ సము
ద్యమ మనివార్యమై నెగడునట్టి తెఱంగు వినుండు చెప్పెదన్.[3]

శల్యుడు శత్రుసైన్యమథనకల్యుడు. వానిని ధర్మరాజు తెగటార్పబోవుచున్నాడు అది తనకృత్యము. అదియొక సముద్యమము అది వారింపబడక కొనసాగవలయును అందుకు తగిన మార్గమిది యని ధర్మరాజు తనవారితో చెప్పినాడు. శల్యసంహారము జరిగినచో నిక దుర్యోధనునకు సేనాపతికాదగినవాడు లేడు దుర్యోధనుడు యుద్ధము నిక సాగించలేడు అపుడు తనకు విజయము. ఇదంతయు ధర్మజుని సమరోత్సాహము లక్షణము శల్యుని వధించు సమయమునకు ధర్మజుని చిత్తము భగవంతునియందలి భక్తితాత్పర్యమున ప్రవృత్తి కలది

1. భా. కర్ణ. 3-96.
2. భా. కర్ణ. 3-387.
3. భా. శల్య. 1-234.

రైయేనది భగవద్భక్తి యుద్ధవీరమునకు సంబంధించినదికాదు అది శాంతమున కనుకూలమైన భావము అనగా ధర్మజుని చిత్తము శాంతరసానుకూలమైన భావమున ప్రవర్తించినదగుచు సమరవిజయము నుపలక్షించుచున్నదగుచున్నది భగవంతుడైన హృషీకేశుని చిత్తమున నిలిపి ధర్మరాజిట్లు ప్రార్థించినాడు

నీ దెస నాదు చిత్తమున నెక్కొనియుండెడు భక్తి భద్రసం
పాదిని గావుటచ్చెరువె? భక్తజనాభిమతప్రదాన వి
ద్యాదయితత్వమేర్పడ జయం బొడగూర్పుము దేవ సంశ్రితాం
హోదళనంబు నీకు వ్రత ముల్లము నా పయి నిల్పు మిత్తఱిన్ [1]

ఏవం విధమైన భక్తిభావముతో సముత్సుకుడై ధర్మరాజు శల్యుని సంహరించినాడు.

దుర్యోధనుడు ద్వైపాయనహ్రదమున నొక క్షుద్రవిద్యవలన జలము లను శరీరము నోకకుండునట్లుగా జేసికొని దాగియున్నాడన్న విషయమును తెలిసికొని ధర్మరాజచటకు బయలుదేరిపోవుటను తిక్కన్నగారిట్లు వ్రాసిరి.

తురగఖురపుట రథనేమి కరిపదాతి
ఘటనంబుల నేల గ్రక్కదల శంఖ
ప్రణవ నిస్సాణకాహళ రణన మెల్ల
దెసలఁ బరగంగ వచ్చె నద్దెసకు నధిప [2]

ధర్మజుని సమరోత్సాహ మింకెట్లు వర్ణింపబడవలయును? అనిలసుతుని వేటకాఱులా దుర్యోధనుని విషయమాచూకి చెప్పుటయే ఆలస్యముగా బయలుదేరినాడు ధర్మరాజు ఉద్దామగమనమున బయలుదేరినాడట. ఉద్దాముని యొక్క గమన విశేషముతో బయలుదేరినాడని యర్థము. ఉద్దాముడనగా భయమును కలిగించువాడు మరియు గర్వగంభీరుడు దుర్యోధనుడు పారిపోయి నీళ్ళలో దాగికొనినాడని తెలిసికొన్న ధర్మరాజేతాదృశగుణగణ గరిష్ఠుడుగానై బయలుదేరినాడని యర్థము నిస్సహాయుడైన పరమశత్రువు మీద కట్టివాడు బయలు

1. భా. శల్య. 1-275.
2. భా. శల్య 2-42.

వెడలుట ఎంతగా పట్టపగ్గములు లేకుండునో తిక్కన్నగా రా పద్యమున నర్థము చేత మాత్రమే కాకుండ, పద్యమును నడిపించుటచేత కూడ స్పష్టము చేసినారు ఆ ధర్మజుని రాకను గుర్తించిన కృపకృతవర్మాశ్వత్థాములు దుర్యోధనునితో "ధరణీనాయక ! పాండుపుత్రులు సముద్దామోద్ధతిన్ వీరె వచ్చిరి[1]...." అని చెప్పినారు మహారథులైన కృపకృతవర్మాశ్వత్థామలకే. ధర్మజుని యావచ్చు కలకలము విన్నమాత్రమున నది ఉద్దామోద్ధతి యనిపించినది ఉద్దామగమనమున బయలుదేరిన ధర్మరాజు దుర్యోధనుని సమీపించువరకు మరియు నుద్ధతుడై నాడన్నది వ్యంగ్యమర్యాదయా తెలియుచున్నది. ఉద్ధతియనగా గట్టిదెబ్బ యని యర్థమున్నది ఉద్ధతుడన్నపుడు గట్టిదెబ్బ కొట్టగలవాడని చెప్పవచ్చునేమో ? అట్లు వచ్చిన ధర్మరాజు దుర్యోధనుని యభిమానము మీద లాగి కొట్టియే కదా వానిని నీళ్ళలోనుండి వెలికిరాలాగినది ?

ధర్మరాజు దుర్యోధనునితో మాటాడిన తీరు చూడగా మొదటినుండియు బాహాటముగా యుద్ధమునందు నిశ్చయబుద్ధి కలిగి, పాండవులతో వైరమును పెంచుకొన్న దుర్యోధనునకంటె, ధర్మరాజే ప్రబలమైన నిశ్చయబుద్ధి కలవాడుగను, వైరము కలవాడుగను కనిపించుచున్నాడు. ధర్మరాజు దుర్యోధనునితో నిట్లనినాడు.

> భయముం బాయగఁద్రోచి వీరగుణముం బాటించి సంగ్రామని
> శ్చయ బుద్ధిం దలకొల్పి పౌరుషముమైఁ జావొండె గెల్పొండెఁ గా
> క యధీరత్వము నాకు నీడె యని వీఁకంజేర్చి వేతాకు మెం
> తయుఁ జేరయ్యెడు రమ్ము లెమ్ము దిగినన్ దైన్యమ్ము వచ్చుంజుమీ.[2]

ధర్మరాజు దుర్యోధనుని ప్రబోధించుచున్నను మరొక ప్రక్కమే మెట్లు విక్రమించుచున్నామో నీవు చూచియైనను వీరుడవై యుద్ధమునకు నాయితము గమ్మని చూపి చెప్పుచున్నట్లున్న వీ ధర్మజుని మాటలు. అంతకుముందు ధర్మరాజింకొక మాటకూడ యనినాడు.

> అంభోగర్భము సొచ్చి పాండుసుత బాహాగర్వ దుర్వారసం
> రంభం బోర్వక డాఁగియుండె నటె రారా జిస్సిరో-చచ్చుచో

1. భా. శల్య. 2-44.
2. భా. శల్య. 2-61.

గాంభీర్యంబును ధైర్యమున్ విడిచి దోర్గర్వంబు బెండయ్యెనే
శుంభన్మానము దూలెఁగా కని జనస్తోమంబు నిందింపదే-[1]

దుర్యోధనుని నిందించుచు పాండుసుతుల బాహాగర్వముయొక్క దుర్వార మైన సంరంభము తరువాత జనములచేత పేర్కొనబడునని ధర్మరాజు తాత్పర్యముగా తెలియవచ్చుచున్నది. జనముచేత చెప్పుకొనబడునది పాండవుల సమరోత్సాహమేకదా! పాండవులనగా ధర్మరాజనియే యర్థము అందువలననే దుర్యోధనునిమించి ధర్మజుని రణోత్సాహము కనిపించుచున్నదనుట. ఇందుకు ఉపబలకముగా మరియొక ఉదాహరణము చూపబడును దుర్యోధనుడు నీళ్ళలో నుండియే ధర్మరాజుతో నాకిక యుద్ధమక్కరలేదు- ఈ రాజ్యము నీ కిచ్చితిని- తీసికొనుము- నేనడవులకు బోయి తపస్సుచేసికొందును- అనినాడు ఆ మాటకు ధర్మరాజు ప్రతిగా నిట్లనినాడు

నాకు ధర యిచ్చితేనియును
నిను పొరిగొన కే విడువ.[2]

నా రాజ్యము నాకు నీవిచ్చినను నిన్నుమాత్రము చంపకుండ ప్రాణముతో పోనీయనని ధర్మరాజనుటకంటె వాని విషయమున సమరోత్సాహమును చూపుటకు మరొక ఉదాహరణమేమి కావలయును ?

భీమునిచేత దుర్యోధనుని పడగొట్టించిన తరువాతి క్షణమునుండి ధర్మజుని సమరోత్సాహ ముపశమించినది ఉపశమించుటతోపాటు శోకరూపచిత్త వృత్తి బయలు దేరినది. దీనిచేత పూర్వపు చిత్తవృత్తి పిహితమైపోయినది ఇక బంధుభావను-ధర్మచింతన-ఇత్యాదు లుబికివచ్చినవి. దుర్యోధనుని నేలమీద పడిన వానిని వామపాదమున భీముడు శిరమును తన్నినాడు మరియు వెనుకటి దుర్యోధనుడు చేసిన ఎగ్గుల నుగ్గడించి నిందించుచు వాని శిరమును కాల దన్నినాడు. అపుడు ధర్మరాజు విషయమును తిక్కన్నగారిట్లు వ్రాసిరి.

"మును దన్నుట నెమ్మన మెరియు తదగ్రజుం డమర్షముతోడ హర్షావేశ లఘుచారిత్రుండగు నమ్మారుత పుత్రున కిట్లనియె.

---

1. భా. శల్య. 2-58.
2. భా. శల్య. 2-76.

తల యదియేల తన్నెద వధర్మమునొందుట కాత్మరోయఁగా
వలవదె రాజరాజ నుజవర్గముఁ దక్కిన బంధుకోటియుం
గల పరివారముం దెగిన గౌరవమొందగఁ బోరి సంగర
స్థలమునఁ బడ్డ నీతులవ చందముచేఁత జనంబు మెచ్చునే ?[1]''

మొదటిసారి భీముడు దుర్యోధనుని తల దన్నినపుడే ధర్మజుని మనస్సు కలక్కుమన్నది అయినను భీమునపుడు వారించుచు నిందింపలేదు. రెండవసారి నిందించినపుడు నిందించుచు మాటాడినాడు. దీని రహస్యమేమి ? ఇట్లు కావచ్చును. దుర్యోధనునియందు ధర్మరాజునకు విపరీతమైన ఆగ్రహమున్నది ఎట్లును వానిని చంపక విడువరాదను పట్టుదల యొకటియున్నది ధర్మరాజట్టి బిగిమీద మున్నపుడు భీముడు దుర్యోధనుని తొడలు విరుగగొట్టి శిరము దన్నినాడు భీముడుద్రేకము నాపుకొనలేక ఆ పని చేసినాడు లెమ్మని ధర్మరా జనుకొనినాడు. మరియు ధర్మజుని చిత్త మప్పటికి సమరోత్సాహమునుండి వైదొలగి ప్రసన్నము కాలేదు. బంధుభావము చిత్తమునార్ద్రము చేయలేదు అందువలన మొదటిసారి భీముడు తన్నినపుడు కొద్దిగా మనస్సు చివుక్కుమనినది గాని ధర్మరాజేమియు మాటాడలేదు. మరల రెండవసారి భీముడట్లు చేయునప్పటికి ధర్మజుని చిత్తము తేరుకొనినది అపు డమర్షవతియైనది. అమర్షమనగా కోపమని సామాన్యార్థము. భీముడు చేసినదానికి ధర్మజునకు కోపము వచ్చినదని చెప్పవచ్చును నమర్షణ మమర్షః మృషసహనే-ఓర్చుకొనలేని తన మమర్షము. మొదటిసారి భీముడు తన్నినపుడు ధర్మజుని మన స్సెరిసినది అట్లు నెమ్మెవ మెరియుటను ధర్మరాజు భీముడు రెండవసారి తన్నుటతో నోర్చుకొనలేనివాడయినాడు ఎరియుట యనగా మండుట మొదటిసారి భీముడుచేసిన యా పనికే మనస్సు భగ్గుమన్నది అనగా నగ్నిసోకినట్లయినది ఆ యగ్నిసోకువంటి బాధనపుడోర్చికొనినాడు గాని రెండవసారి భీముడు చేయుటతో నోర్చుకొనలేకపోయినాడు అపుడు తలయది యేల తన్నెద వధర్మమను నీ మొదలైన మాటలతో భీముని మందలించినాడు. ఇక ధర్మజునిబుద్ధి ధర్మనిరతియందు-బంధుభావమునందు ప్రవర్తించుట మొదలైనది. అట్లుపడియున్న దుర్యోధనుని చూచి బాష్పాకుల లోచనుడై ధర్మజుడిట్లు దుఃఖించినట్లుగా తిక్కన్నగారు వ్రాసిరి.

---

1. భా. శల్య. 286-288.

విధి ప్రతికూలుఁడై వేరంబు పుట్టించి
మాకు నీవును మేము నీకు నలిగి
ఇతరేతర ద్రోహమతిఁ దెగి యింతలు
సేయుట గావించె నీ యధర్మ
పరతయు లోభంబు బాల్యంబు మదమును
నిన్ను నింతకుఁ దెచ్చె నీ కతమున
నాకు బాంధవులకు నాశంబు వాటిల్లె
ధృతరాష్ట్ర కోడండ్రు తీవ్రశోక

కారి యయిన వైధవ్యంబు కారణముగ
నన్ను నిందింతు రను వచనములు మొదలు
గాగ బహువిలాపంబులఁ గరుణ మావ
హిల్ల దురపిల్లె నుల్లంబు తల్లడిల్ల.[1]

ఈ విధముగా దుర్యోధనుని పతనానంతరము ధర్మజుని చిత్తము దైన్యమున కును ప్రబలమైన శోకమునకును నాస్పదమైనది దుర్యోధనుని భంగపాటును జూచి పాండవులలో దుఃఖించినది ధర్మరాజొక్కఁడే మరి యెవ్వరుగాని కంట తడిపెట్టలేదు దుర్యోధనుని విషయమున నీ దుఃఖించుటయే ధర్మరాజు యొక్క నిర్వేదమునకు ప్రారంభము.

యుద్ధము మొదలగుటకు మునుపు సన్నాహసందర్భమున ధర్మజుని యుద్ధమునందలి ప్రవృత్తి చాలవరకు గూఢముగా చూపింపబడినది భీష్ముని పతనము వరకు వాని యుత్సాహము వెనుకపట్టుట చూపింపబడినది. ఆ తరు వాత తదుత్సాహము రెండు మూడు మార్గముల చూపింపబడి మరియు నంగి రనమునకు లోబడియుండుట నిరూపింపబడినది. దుర్యోధనుడు పడిపోయి నప్పటినుండి అంగిరసానుకూలమైన భావములే వాని విషయమున చెప్ప బడినవి

మొదట రణోత్సాహము ధర్మరాజునకు కలిగించినది దుర్యోధనుడు. చివ రకు నిర్వేదము పుట్టించినది దుర్యోధనుడు. తన లోభబుద్ధిచేత, అపాండవము

1. భా. శల్య. 2-291.

చేసి సమస్తరాజ్యము తానే ఏలుటకుగాను చేసిన చేయగూడని సర్వప్రయత్న ములచేత దుర్యోధనుడు ధర్మజునకు సమరోత్సాహము కలిగించినాడు తమ్ములు-బంధువులు-మిత్రులు-అందరను యుద్ధరంగమునకు బలిచేసి, నిస్సహాయుడై కేవల మభిమానమును పట్టుకొని ప్రాణములను లెక్కచేయక భీమునితో పోరుటకు వచ్చి, అధర్మయుద్ధమున వానిచే తొడలు విరగగొట్టబడుటచేత మరియు నధర్మముగా వాని వామపాదమున శిరము తన్నబడిన వాడగుటచేత, ధర్మరాజునకు నిర్వేదము పుట్టించినాడు ఏ యుద్ధమెవడు కారణముగా ధర్మరాజు చేయవలసి వచ్చినదో, ఆ యుద్ధమువలని ఫలానుభవమును ధర్మజునకు వాని నుండియే సంప్రాప్తమగుట చిత్రమైన విషయము. భారతయుద్ధమువలని ఫలము రాజ్యసుఖానుభవము కాదు శోకానుభవము. ఏవంవిధమైన అనుభవము ధర్మరాజునకు దుర్యోధనుడు పడినప్పటినుండి మొదలైనది పడిపోయిన తననువదలి పాండవులు పోబోవుటకు ముందు దుర్యోధనుడు వారి నుద్దేశించి శ్రీకృష్ణునితో నిట్లనినాడు- "ఏనెట్టి వాడనైన నాకేమి? మీరింకఁ బశ్చాత్తాపదుఃఖితులగుచు నుందురుగాక''. ధర్మరాజట్లే తరువాత బ్రతికినాడు

యుద్ధము ముగిసినప్పటినుండి అనగా ఉపపాండవులు గూడ అశ్వత్థామ చేత చంపబడి నప్పటినుండి ధర్మజుని చిత్తము కేవలము శోకమునందే ప్రవృత్తి కలది గాంధారి కడుపు శోకము మరియు ధర్మజుని తత్ప్రవృత్తికి నుద్దీపక మైనది. ఉదకప్రదానవేళ కర్ణుడు కన కగ్రజుడని కుంతివలన విన్నప్పటినుండి ధర్మజుని శోకమింకను నధికమై రాజ్యభోగములయందు విరక్తిని పుట్టించినది. కర్ణుని చావుతోపాటు - అభిమన్యుని చావు - గురువధ - మొదలైన వన్నియు కలిసి ధర్మజునకు నిర్వేదమును పెంచినవి తాను జ్ఞాతివధచేసి రాజ్యమును గ్రహించినాడు. ఆ పరిగ్రహదోషము పరిగ్రహత్యాగమునగాని పోదని, రాజ్యము తన కక్కరలేదని, దానిని తమ్ములకు వదలి తా నడవులకుబోయి తపోవృత్తి నుండుటకు నిశ్చయించుకొని తద్రూపమున పరిదేవనము చేసినాడు. శోకము సర్వచిత్తవృత్తులను నశింపజేయునది శోకము జ్ఞానమువలన నశించును. అందువలననే ముందు కృష్ణ కృష్ణద్వైపాయన నారద దేవలాదులు పెక్కు విధముల ధర్మవాక్యము లుపన్యసించి ధర్మజుని శోకమును కొంత తగ్గించి రాజ్యాభిషేకమున కంగీకరించునట్లు చేసినారు అయినను ధర్మజుని శోకము తుదిముట్టలేదు. భీష్మోపదేశమువలన నది పూర్తిగా నశించినది. అనగా రాగద్వేషములయందు

ధర్మజుని చిత్తమునకు ప్రవృత్తిలేకుండనయినది. ధృతరాష్ట్రుని విషయమున రాగమును, వాని వనవాసగమన సందర్భమున కొంత శోకమును ధర్మజునియందు ప్రతీయమానములైనవి. అది అచ్చమైన పితృభక్తి లక్షణముగా ననుకొన దగినది ధర్మరాజు తనను తాను వాటినుండికూడ నిగ్రహించుకొనినాడు.

ధృతరాష్ట్రుని విషయమున ధర్మరాజు పితృభక్తి చూపుట రాజ్యాభిషేకమైనప్పటినుండి మొదలైనది. తాను రాజ్యాభిషేకము నెందు కంగీకరించినాడో ధర్మరాజే యిట్లు చెప్పినాడు

జ్ఞాతి వధమట్లు సేసియు
నీతనిఁ గొల్చుటకుఁ గాఁగ నీ గృహధర్మో
పేతత్వముఁ బొరసితి భూ
భూతికి మనకు విభుఁ డీ ప్రభువ మఱవకుఁడీ![1]

ధర్మరాజు రాజై ధృతరాష్ట్రుడే రాజన్నట్లుగా వర్తించినాడు తన కొడుకు మరణించినాడని విని ధృతరాష్ట్రుడు "నిచ్చలు భక్తిమై వచ్చి గారవింప నింకెవ్వరుగలరు నాకు"[2] అని విలపించినాడు. ధర్మరాజందుకు నేనున్నా నన్నట్లుగా ధృతరాష్ట్రుని మన్నించినాడు ఆశ్రమవాసపర్వమున నా తండ్రి కొడుకుల అన్యోన్యమును తిక్కన్నగారిట్లు వ్రాసిరి—

..............................

...... పాండునందను లాంబికేయు
నెడ భక్తి వినయంబు లెసగ వర్తింతు
రతని యోగక్షేమ మరసి యెపుడు
తత్సమీపమ్మునఁ దగనిల్చి తమకు నె
య్యది యైన నెఱిగించు నట్లుగాగ
నుందురు. విదుర యుయుత్సు సంజయులు దా
రును నిత్యమును వచ్చి వినతిఁజేసి

1. భా. శాంతి. 1-377.
2. భా॰ శల్య. 1-18.

కొలిచి కూర్చుండి యాన్నృపు నలఘుకార్య
విధము లేర్పడ నడిగి యవ్విభుని చెప్పి
నట్ల చేయుదు రతడును నాదరంబు
గాఢ వత్సలత్వంబును గలిగియుండు.[1]

ధర్మరాజు తానట్లు ప్రవర్తించుచు తనవా రట్లు వర్తించినట్లు చేసినాడు మరియు ధర్మరాజు తనను గొలువవచ్చిన రాజులందరును ముందు ధృతరాష్ట్రుని గొలుచునట్లుగా చేసినాడు. అందువలన నాతడు నిజాత్మజు వలనకంటె ధర్మరాజు వలన నధికప్రియమును బొందినాడు ధర్మజుని పితృగౌరవము ధృతరాష్ట్రుడు తన కాశ్రమవాసమున కనుమతి నిమ్మని కోరినపుడు లెస్సగా నభివ్యక్తమైనది.

తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దైవము నా కరయంగ నీవ భూ
వల్లభ ! నీవు కానన నివాసము గోరి చనంగ నెట్టులే
నుల్లమువట్టి హస్తిపురి నుండగనేర్తు ? యుయుత్సు పెంపు శో
భిల్లగ రాజు చేయు నిను బ్రీతి యెలర్పగ గొల్చివచ్చెదన్.[2]

అని ధర్మరాజు మరియు నిట్లనినాడు.

నీవు రాజవుగాక నీ కేను రాజనే
గురుని మహారాజు కురువరేణ్యు
నిటు సేయుమని పంప నే నొడయుండనే-?[3]

తరువాత వ్యాసుడువచ్చి ధర్మజునితో నిక ధృతరాష్ట్రుని తపోవనములకు పోనిమ్మని చెప్పినాడు ధర్మరాజంగీకరించినాడు. తానాశ్రమవాసమునకు పోబోవుముందు ధృతరాష్ట్రుడు రాజనీతివాక్యములు కొన్నిచెప్పి ధర్మరాజుతో ఈ విషయము లిదివరలో భీష్ముడు మొదలైన వారి వలన నీవు వినినవియే అయినను నాకు నీయందున్న ప్రీతివలన నీ నాల్గువాక్యములు చెప్పినా నని నాడు. అందుకు ధర్మరా జిట్లనినాడు

1. భా ఆశ్రమ. 1-3.
2. భా. ఆశ్రమ. 1-32.
3. భా. ఆశ్రమ. 1-34.

అపగాసుతుఁడు లే డబ్జనాభుఁ
డాత్మ పురంబునకరిగె వాత్సల్యత
నీవు దక్కఁగ నాకు హితముసెప్ప
నొడయుఁడెవ్వఁడు ? భవదుపదిష్టపథమున
నిష్టమై నడచెద.[1]

ధృతరాష్ట్రునియందు ధర్మరాజునకున్న పితృగౌరవము లక్షణమట్టిది.- ధృతరాష్ట్రుడు గాంధారీసహితుడు వనములకు బయలుదేరినాడు. నగరు వెడలినాడు నగరనగా రాజప్రాసాదము అనగా ధృతరాష్ట్రుడు తన మహారాజ సౌధము తల వాకిలి గడపదాటినాడు అంతకు పూర్వమాయన ఆ గడవ దాటలేదు ఆనాడు దాటినాడు ధర్మరాజుయొక్క అప్పటిస్థితిని తిక్కన్నగారిట్లు వర్ణించిరి.

పాండవాగ్రజు డక్కురుభర్తవలను
శోకదీనుఁడై తప్పక చూచి యేడ్చి
హా మహారాజ ముఖ్య యెం దరిగె దనుచు
నొడలు కంపింప జదికిల బడియె నధిప.[2]

ధర్మరాజునకు తెలియును ధృతరాష్ట్రుడెచటకు పోవుచున్నదియును. తెలిసియే హామహారాజ ! యెందరిగెద వనచు నేడ్చినాడు మమ్మువదలి పోవుచున్నావు గదా అను దుఃఖముతోడి మాటయది ధృతరాష్ట్రుని యందలి ధర్మరాజు యొక్క ప్రేమానురాగ-భక్తి గౌరవ దయాదాక్షిణ్యాది బంధుసంబంధములైన బహుభావము లావర్తములగుచు వెలికి వాగ్రూపమున నట్లు వచ్చినవి- ఇదంతయు ధర్మజుని నిర్వేదానంతరపు ధృతరాష్ట్రునియందలి పితృగౌరవము లక్షణము

ధర్మజుని స్వర్గారోహణ మది చాల చిత్రముగా నిరూపింపబడినది. పరీక్షితునకు పట్టాభిషేకము చేసి సుభద్రకు వాని నొప్పి చెప్పి సానుజుడు, సభార్యుడు ధర్మరాజు మహాప్రస్థానమునకు బయలుదేరినాడు. అందరును యోగశక్తికలవారే ఆ యోగశక్తిచేత భేదములేకుండ మేరు సమీపమువరకు నంద

1 భా. ఆశ్రమ 1-80
2. భా. ఆశ్రమ. 1-140.

రును పోయినారు ఆ యోగశక్తి ఎవరి కెప్పుడు సడలునో వారి శరీరమప్పుడు పతనమగును ముందు ద్రౌపదికట్లయినది. తరువాత సహదేవాదులకు నట్లే యైనది. ధర్మరాజు మాత్రమా యోగ మెడలకుండ పోవుచున్నాడు యోగ మనగా చిత్తమునకు విషయములయందు ప్రవృత్తిలేకుండ నిరోధించుకొను టయే కదా! అందువలననే ద్రౌపది మొదలైనవారి మరణముల విషయమున ధర్మజుని చిత్తము దుఃఖమును పొందలేదు. ధర్మరాజట్లు తన చిత్తమును నిరోధించుకొనినాడు ధర్మజుని యా చిత్తము లక్షణమును ద్రౌపది మొదలైన వారు మరణించినపుడెల్లను తిక్కన్నగారు జాగ్రత్తగా స్పృశించిరి. ద్రౌపది మరణించినది. "ధైర్యస్థైర్యముఁన వికృతిలేని" వాడై ధర్మరాజు నడచెను సహదేవుడు మరణించినాడు ధర్మరా "జుపేక్షా నిరూఢబుద్ధి" యై ముందుకు సాగినాడు. నకులుడు మరణించినాడు. "ధృతిసారం బూది" ధర్మరాజు సాగి పోయినాడు అర్జునుడు మరణించినాడు. ధర్మజుడు "తాల్మిజేసి బద్ధానిర తాత్ముడై యరిగి" నాడు భీముడు మరణించినాడు "ధైర్యసారోదారుడును, నిశ్చయమహితుడునయి" ధర్మరాజు చనినాడు ఇదంతయు నుత్కృటమైన దృఢయోగ సేవనము లక్షణము ఇంద్రుడు రథము తీసికొని ధర్మరాజున కెదురుగా వచ్చినాడు. ఇక చిత్తవికారము మొదలైనది అనగా నింద్రదర్శనముతో ధర్మజునకు యోగము సడలినది. కాని ధర్మజునకు శరీరపతనము జరుగలేదు. బహుశః అది ఇంద్రుని మహిమ కావచ్చును ఇంద్రదర్శనముతో వాని యోగ మెడలినదని యేమి గుర్తునవచ్చును. ఇంద్రుడు వానిని తన దివ్యరథ మెక్కుమనినాడు అపుడు ధర్మరా జిట్లనినాడు

> తోడంబుట్టువు లందఱుం బడిన యా దుఃఖంబు చిత్తంబు సం
> పీడం బెట్టెడు సౌకుమార్యవతి డప్పిం గూలెఁ బాంచాలి వార్
> తోడై వచ్చిరి వారులేక యిట మీతో రాను వారెల్లనా
> తోడం గూడగ వచ్చునట్లుగ కృపాధుర్యాత్మ కావింపవే.[1]

తమ్ములును భార్యయు మరణించిన తత్కాలమున ధర్మజున కేమి యనిపించి నట్లులేదు. దుఃఖమురేఖ పొలుపుగూడ వాని చిత్తమున కనిపించలేదు ఇంద్రుని యెదుట నిప్పుడు తనవారి మరణమువలన దుఃఖము చిత్తమును పీడించుచున్న

1. భా. మహాప్రస్థానిక 1-50

దనుచున్నాడు. అంతవరకు ధర్మరాజు తన చిత్తమా దుఃఖము విషయమున ప్రవృత్తిని పొందకుండ నిరోధించుకొని యుండవలయును. ఇంద్రదర్శన మగుటతో వాని చిత్తము వానిచేత నిరోధింపబడుటను నిరాకరించి దుఃఖ విషయమున ప్రవృత్తమైయుండవలయును. లేనిచో నింద్రునితో నట్లనుట పొసగదు. ఆ తరువాత వారందరును స్వర్గమును ముందుగనే చేరుకొనినారని దేవేంద్రుడు చెప్పగా ధర్మజు డా రథమునెక్కి (సారమేయముతో కూడ-అనగా ధర్ముడు ప్రత్యక్షమైన తరువాత) స్వర్గమును చేరుకొనినాడు యోగమెడలిన చిత్తముతోడనే ధర్మరాజు స్వర్గమున కాలుపెట్టినాడు తమ్ములను, భార్యను మొదలుగా గలిగిన బంధువ్రాతమును చూడ వలయునన్న కోరిక పుట్టినది. మొట్ట మొదట స్వర్గమును సుయోధనుడు కనిపించినాడు. సుయోధనుడన్నచో ధర్మరాజుయొక్క అంతరాంతములో నెట్లున్నదో స్వర్గమున నపుడాడిన మాటలు విన్నచో తెలియగలదు.

ఇతఁ డతిలోభోపహాత మానసుఁడు దీర్ఘ
దర్శిగాఁ డితని కతమునఁ జేసి
నిఖిల దేశంబుల యఖిల నృపాలురఁ
ద్రుంగిరి దంతి తురంగ సహిత
ముగ. అనవద్యాంగి విగతకల్మష ధర్మ
చారిణి సాధ్విఁ బాంచాలి నార్య
జనములు నను గొన సభలోన నవమాన
పెట్టిన తులువ.ఏ నిట్టి వాని

తోడఁ గలసి మెలఁగుదునె? మహితాత్మకు
లార! యెచటనున్న వారు భీమ
ఫల్గునులును గవలుఁ బాంచాలియును నన్ను
నచటి కనుపవలయు — —.[1]

ఇంతకు పూర్వ మాశ్రమవాసపర్వమున ధృతరాష్ట్రునితో ధర్మరాజాడిన మాటలు స్మృతియందిపుడున్నచో వాని జీవలక్షణము రహస్యము తెలిసిపోవును. అప్పటి వాని మాట లిట్లున్నవి.

1. భా. స్వర్గ. 1-5.

దుర్యోధనాదుల దుష్కృతములు
నా మదిలో నిల్ప నేమును వారును
విధి మోహమున నైన విరసభావ
మావహిల్లినఁ బుట్టె నంతలు పనులు [1]

ధర్మజుని యా యీ మాటలకు పోలికయే లేదు. ధర్మరాజు వశీకృతచిత్తుడని సంజయు డుద్యోగపర్వమున చెప్పినదాని రహస్యమిచట పర్యాలోచన చేయ వలసియున్నదేమో ? మరియు నీ సందర్భమున ధర్మరాజు నుద్దేశించి అశ్వత్థామ చెప్పిన "అంతర్మద దుష్టుడు" అనుమాట కూడ స్మృతికి తగులవచ్చును. ధర్మ రాజుయొక్క వశీకృతచిత్తత, ఇంద్రదర్శన మైనప్పటినుండి మరియు స్వర్గ మున చేరినప్పటినుండి తొలగినట్లు స్పష్టముగానున్నది వశీకృతచిత్తు డనగా స్వాధీనముననుంచుకొన్న చిత్తముయొక్క ప్రవృత్తిలక్షణము కలవాడు. ఆశ్రమ వాసమునందలి మాటలా లక్షణముతో మాటాడిన మాటలు కావలయును స్వర్గ మున నొకసారి ధర్మరాజునకు చిత్తము తన వశము దప్పి ప్రవర్తించుట తోచి అదియొక క్రొత్త యనుభూతికాగా దిక్కుతోచక వ్యాకులపడినాడు. అచట తిక్కన్నగారు చిత్రముగా వ్రాసిరి—

అని యగ్గలపుఁ జింత మునిగి కలంక మ
నోవికారము నాకు నావహిల్లఁ
గతమేమి యొకొ ? ఇది ఘనమాయయో–? కల
గనుటయో–? యరయ నిక్కంబొ–? చిత్త
విభ్రాంతిఁ జేసి వివేకింపనేర రా
దయ్యెడు నని పరమాకులేంద్రియుఁడు
శోక దుఃఖమయుఁడునై కొండొక
ప్రొద్దూరకుండి సద్బుద్ధిఁ దలచి
యలుక యింద్రుపై బొడమిన......[2]

తన తమ్ములు భార్య మొదలైనవారు నరకమున నుండుటను, దుర్యోధనుడు స్వర్గమున మహారాజువలె నుండుటను చూచిన ధర్మరాజున కగ్గలపుచింత కలిగి నది అపుడు తనను నిగ్రహించుకొని యేమిది ? నాకీ మనోవికార మేమి ? ఇది మాయయా? కలయా? నిజమా? దేనిని విచారించుకొనుటకును చిత్తము వశము

1. భా. ఆశ్రమ 1–34.
1. భా. స్వర్గ. 1–27.

దప్పియున్నదే! అని దుఃఖమున పొందినాడు. కొంచెము స్థిమితము చిక్కించుకొని విచారించగా నింద్రునిమీద కోపము వచ్చినది అనగా చిత్తము తనవశము గాకుండ చేసిన దా యింద్రు డన్న జ్ఞానము కలిగినదన్నమాట. ఇంద్రుడు ధర్మజుని చిత్తమును వాని వశమునుండి యేల తప్పించినాడు? రెండు విధములుగా నూహింపవగుచున్నది ఒకటి–వాని అంతర్యము బట్టబయలై మనస్సు సర్వకల్మషములనుండి క్షాళితము చేయబడుట కావచ్చును రెండు–ఇతిహాసనాయకుని పరలోకానుభవమును చూపించుటకొరకు కావచ్చును. ఈ రెండును నొకదాని యొక్క ఇరుమొగములు మాత్రమే. స్వర్గమునను నరకమునను ధర్మజుని అనుభవమును ప్రదర్శించుటకు కానిచో వానిని శరీరముతో స్వర్గమునకు తీసికొనిపో నక్కరలేదు అందరవలెనే శరీరమును త్యజించిపోయిన సరిపోవును స్వర్గమున మనోవికృతులుండవు. అచట జీవుల కీ స్థూలదేహములుండవు వికృతులు దేహధర్మములు దుర్యోధనుడు శరీరమును త్యజించి స్వర్గమునకు బోయినాడు ధర్మరాజు కనిపించినపు డచట వాని కేమియు ననిపించ లేదు శరీరముతోనున్నాడు గనుక ధర్మరాజు వీడున్నచోట నేనుండ ననినాడు

చిత్తమును వశము దప్పించి శరీరముతో ధర్మరాజు స్వర్గమునకు తీసికొనిపోవుట, ఇతిహాస నాయకునియందు కర్మఫలానుభవము, ఇహపరముల యందు రెండును నిరూపించుటగాక మరొక ప్రయోజనము కనిపించుటలేదు. స్వర్గమున ధర్మరాజనుభవించిన దుఃఖమది దైవవిహితముగా దేవేంద్రుడు చెప్పినాడు. తరువాత ధర్మునిచేత ప్రబోధింపబడి ధర్మరాజాకాశనదీపావనసలిలముల మునిగి లేచినాడు

మానుషతనువు నమ్మాత్రన విడిచి ది
వ్యంబగు మహితదేహంబు దాల్చి
వైరమత్సర స్నేహసంవాస లౌల్య
గర్వ శోకాదులైన హృద్గత వికార
ములు దొఱంగి నిర్ధూమత్వమున వెలుంగు
పావకుడు బోలె శోభిల్లె —[1].

ఇది ధర్మజుని, భారతనాయకుని, పాత్రమును తిక్కన్నగారు క్రమోన్మీలనము చేసి చూపిన విధము

---

1. భా. స్వర్గ. 1-52.

నెరవేరుచున్నది. భీముడు దానికి లోబడినవాడే - అర్జునుడును నంతే కర్ణపర్వమున ధర్మరాజుతో నాతడిట్లనినాడు-"వినుము సత్యంబ పలికెద తనువు ప్రాణములును నీ సొమ్ముగా మది దలంతు నేను నాదు వృత్తంబు భవదధీనంబు". ఇక నర్జునునకు స్వతంత్రప్రవృత్తి యేమున్నది ? సైంధవుని చంపుదునని ప్రతిజ్ఞ చేయుట అది ధర్మరాజు ఇష్టమును తన యిష్టానుసారముగా సాధించిపెట్టుట. సైంధవుడు రేపే చంపబడవలయునని ధర్మరాజునకులేదు అర్జునుడు రేపేచంపుదునని ప్రతిజ్ఞచేసినాడు. మొత్తముమీద సైంధవునిచచ్చుట ధర్మరాజున కిష్టము అది అర్జునుడు తనయిష్టముమీద రేపే చేయుదుననినాడు అది విశేషముకాదు.

ద్రౌపది యున్నది ఆమెవలన ప్రధాన కథలోని సంఘర్షణ కొంత తీవ్రమైనది అనగా కథాసంబంధియైన తీవ్రమైన కదలిక కొకదానికి నామె సాధనమైనది ధర్మరాజు ద్రౌపదినిగూడ జూదమున నొడ్డి ఓడినాడు ఆమె నవమానించుటకు దుర్యోధనుడు కొలువునకు పిలిపించినాడు నేను రానని ఆమె అనలేదు "దుర్యోధను దుశ్చేష్టితంబునకు ధర్మరాజు సమ్మతంబునకు వెఱచి" ఆమె సభకు వచ్చినట్లుగా నన్నయ్యగారు వ్రాసిరి వెఱచి వచ్చినదనగా లోపల యిష్టములేదు, అయినను వచ్చినదని యర్థము స్వతంత్రప్రవృత్తి యున్నచో రావలసిన అవసరములేదు కదా ! శ్రీకృష్ణుడు సంధిచేసికొని వచ్చుటకుగాను హస్తినాపురమునకు పోవుచుండగా ధర్మరాజాదుల నతిక్రమించి వీరనారివలె యుద్ధమే కావలయునని మాటాడినది కదా యని యనవచ్చును. ఆమె అప్పుడు చేసిన దేమనగా పెద్దగా నేడ్చినది భర్తల యశక్తతను పేర్కొనుచు తీసివేతగా మాటాడినది తన యాభిజాత్యము నుగ్గడించినది దుర్యోధనుడు సంధి కంగీకరింపడనినది అయినను నాకేమి తెలియునులే-మీకు తోచినట్లు మీ మంచితనమును నిలబెట్టుకొనుడు - నాదేమున్నది-అని యెత్తిపొడుచుటగా మాటాడినది అంతేగాని ఈ సంధి బేరములు మన కక్కరలేదు-నీవుపోవద్దు-అని ఆమె శ్రీకృష్ణునితో ననలేదు ఉద్యోగపర్వము తృతీయాశ్వాసమున ద్రౌపది మాటలుగా తిక్కన్నగారు వ్రాసిన ఏకాధికశతతమ సంఖ్యనుండి అష్టాదశాధిక శతతమ సంఖ్యవరకు గల గద్యపద్యములను నెమ్మది మీద చూచినచో నామె యేమన్నదియు తెలియును ఆమెకు లోపల సంధియగుట కిష్టములేదు పైకి మాత్ర మా మాటనలేదు ఏలయనగా ధర్మరాజు సంధికోరుచున్నాడని ఆమెకు ననిపించినది ధర్మరాజునకు వ్యతిరేకముగా మాటాడరాదు కాని అవుకొనలేదు

స్త్రీ ప్రకృత్యనుగుణమైన మాటలు మాటాడినది చేష్టలు చేసినది. ప్రకృతి పాత్రముల విషయము తరువాత వ్రాయబడును ద్రౌపది వీరనారికాదు కాజాలదు శాంతరసప్రధానమైన భారతమునందలి ప్రధాన కథాగతి కొకటి రెండుచోట్ల ఆమె సాధనమైనది ఉద్యోగపర్వమున ద్రౌపది మాటాడిన మాటలు "గురువంపురాజసపు బెట్టిదపుం దగుమాటలు."[1] గర్వముతోడి రజోగుణ ప్రధానములైన క్రౌర్యపు మాటలివ్వి క్రౌర్యపు మాటలనగా నితరులను వ్యధ పెట్టు మాటలు ఆనాడు ద్రౌపది తమనుగురించి అట్లు మాటాడుట వలన పాండవులు వ్యధపడినారన్న మాట. నాటి మాట లట్లున్న వని చెప్పినది భీముడు. వీరమును స్ఫురింపజేయు లక్షణమా మాటలలో లేదు ఇంకను నొక విధముగా సౌప్తికపర్వమున అశ్వత్థామయొక్క శిరోరత్నము నిచ్చించి పలికిన ద్రౌపది మాటలే నిష్కర్షగానున్నవి అచట ధర్మరాజుతో నిట్లనినది

వాయుసుతుఁ బనిచి నేఁడటు
సేయింపక తక్కితేనిఁ జెప్పెద విను మేఁ
బ్రాయోపవేశమున నీ
కాయ ముపేక్షింతు జుమ్ము కౌరవనాథా![1]

ఇచట నిశ్చయము నొకదానిని వెలిబుచ్చుచున్నది ఉద్యోగపర్వమున మాట లక్షణము వేరు అచటను నిచటను ప్రకృత్యనుగుణమైన సామాన్యవిషయమే ఆవిష్కరింపబడినది సౌప్తికపర్వమున నామె మాటవలన కథ కొంత ముందుకు సాగినది అనగా పాండవు లశ్వత్థామ వెంటపడుట యన్నమాట

కుంతి. ఈమె రెండు చెప్పుకోదగిన పనులు చేసినది శ్రీకృష్ణునిచేత పాండవులకు వీరులుగా, రాజకుమారులుగా బ్రతుకుడని చెప్పిపంపినది ఇది యొక పని. ధర్మరాజును మాటాడనీయకుండ సమాధానపెట్టి ధృతరాష్ట్ర గాంధారులతో పాటుగా నాశ్రమవాసమునకు పోయినది. ఇది రెండవ పని ఇవి రెండును రాజమాతప్రకృతిలోని లక్షణములు క్షత్రియకాంతల మనో ద్రవ్య స్వరూపమట్లే యుండును ధర్మరాజాదులకామె తల్లియగుట సామాన్య మైన విశేషము ఇక నామెవలన జరిగిన కథ యేమియులేదు చేతికి చిక్కినను అర్జునునితప్ప మిగిలినవారిని కర్ణుడు చంపకపోవుట ఆమెవలన జరిగినదిగదా

1. భా. సౌప్తి. 2-92

అనవచ్చును సంజయుడుండుటవలన భారతయుద్ధము ధృతరాష్ట్రునకు వినిపింప బడినదిగదా అనియుననవచ్చును. ప్రతిజీవి యేదో కించిత్తు ప్రయోజనము సాధించుటకొరకే పుట్టును మరియు కావ్యమున నెవరును నిరర్థకముగా ప్రసక్తికి రారు. కుంతి వలన నా ప్రయోజనము సాధింపబడినమాట మాత్రము వాస్తవము. ఆమె ఆ విధముగా ధర్మరాజు ఇచ్ఛను సాధించిపెట్టినది అంతే.

గాంధారి పాండవుల రాజ్యము పాండవులకిమ్మని దుర్యోధనునకు చెప్పినదిగాని ఆతడు వినలేదు చివరకు యుద్ధానంతరము కడుపుశోకమునకు తట్టుకొనలేక ధర్మరాజును శపించుట కుద్యమించినది వ్యాసునిచేత వారింపబడినది. కౌరవవంశము నప్పటికి బ్రతికియున్న వృద్ధ ఆమెయేగనుక, మరియు యుద్ధమున మరణించినవాడు తనకు దగ్గరవారగుటచేత పేరుపేర పేర్కొని యేడ్చినది. ఆ యేడ్పు ప్రధానకథారసమున కొక విధముగా ననుకూలమైనది.

సూతకులమునకు చెందిన తన కంగరాజ్యమిచ్చి గౌరవించి మైత్రినెరపినాడని దుర్యోధనునియందు కర్ణున కపరిమితమైన విశ్వాసము , మరియు తన పరాక్రమమునందు తనకు కొంత నమ్మకనున్నది దుర్యోధనుడు పాండవులను ద్వేషించును కనుక తానును ద్వేషించును పాండవులలో నర్జునుడు పరాక్రమవంతుడు కావున వానితో మత్సరము తరువాత తాను కుంతి కొడుకను విషయము తెలిసినది తెలిసియు పాండవులతో చేరక దుర్యోధనునియం దచంచలమైన స్వామిభక్తిని ప్రదర్శించుటయే కర్ణుని గొప్పతనము దుర్యోధనుడు పాండవులతో వైరము పెట్టుకొనుటకు హేతువు కర్ణుని అండయేఅని అప్పుడప్పుడు వినబడుచుండును దుర్యోధనుడు కర్ణుని నెరుగకపూర్వమే శకుని దుశ్శాసనులతో విచారించి అపాండవముచేయ నిశ్చయించుకొనినాడు పాండవులతో వైరము దుర్యోధనుడు స్వయముగానే పెట్టుకొనినాడు తరువాత కర్ణుడు తనకు మిత్రుడగుటచేత పాండవులను సులభముగా రూపుమాపవచ్చునని దుర్యోధను డనుకొనినాడు. అందుకనియే వానిని తనకు మిత్రుడుగా నుండుమని కోరినాడు కర్ణునివలన జరిగిన దంతమాత్రమే దీనివలన ధర్మరాజు కొంతబడినాడు మరియు కర్ణునిలోని విశేషమేమనగా బ్రతికియుండి యుద్ధముచేసి దుర్యోధనునకు కూర్చిన సంతోషమునకంటె, చచ్చి ధర్మరాజునకు కూర్చిన దుఃఖ మధికము

1. భా. సౌప్తి. 2-33.

ఈ విధముగా భీమార్జునాదులు ప్రధానకథాగతికి ననుకూలపడినారు. మరియు ధర్మరాజాదులకు లెస్సగా సాధనములై ఉపయోగపడినారు నాయక సహాయకులనవచ్చును పాత్రోన్మీలనమన్నది వారియందు మృగ్యము వారు పాత్రములుకారు నాయక ప్రతినాయకులకు సహాయకులు. అంతమాత్రమే

ప్రకృతిపాత్రముల విశేష విషయము తరువాత వ్రాయబడునని చెప్ప బడినది ప్రకృతియనగా స్వభావము అది స్త్రీ పురుషులయందే ప్రవర్తించును మరియు భావములు క్షణక్షణ దశావిపరిణామముకలవి అనగా నీ స్త్రీ పురుషుల ప్రకృతు లిట్లే యుండునన్న నిష్కర్ష చేయుటకు వీలుకాదు అందువలననే భరతుడు ఉత్తమ మధ్య మాధమములని మూడు విధములుగా స్త్రీ పురుషుల ప్రకృతులను స్థూలముగా పేర్కొనెను అధమప్రకృతిని విడిచి మిగిలిన రెండింటిని అధారముగాచేసికొని ధీరోదాత్తాది చతుర్విధనాయకులను భరతుడు చెప్పెను. సుఖదుఃఖరూపములైన సర్వభావములును, ఆ యా ప్రకృతులను పురస్కరించుకొని వివిధముగా నుండును అనగా ప్రకృతి స్త్రీ పురుషులదివేరు పురుషులలో ధీరోధాత్త ధీరశాంతాదులది వేరు అట్లే స్త్రీల యందును దివ్య కాంతల ప్రకృతులు వేరు మరియు కులాంగనలది వేరు గణికలది వేరు ఈ విధముగా ప్రకృతులు బహువిధములు మరియు నందు దశాభేదముండును. అందువలన ప్రకృతివిషయమున నిర్ధారణచేయుటకు వీలులేదు తత్తత్ప్రకరణములను బట్టి గ్రహింపవలయును కావ్యమున యందు ప్రసక్తికివచ్చిన వ్యక్తులందరును వారివారి ప్రకృతుల కనుకుణముగా మాటాడుట, పనులుచేయుట వర్ణింపబడును అది ప్రకృతౌచిత్యము అది జాగ్రత్తగా కవిచేత నిరూపింపబడనే వలయును. ఉన్మీలనరూపమైన పాత్రపోషణము ప్రకృతౌచిత్యమును నిముడ్చుకొని మరియు దానిని మించి యున్నది

ఉద్యోగపర్వమున మాటాడిన ద్రౌపది ముందు స్త్రీ; తరువాత క్షత్రియ కాంత మరియు శత్రువులచేత పరాభవింపబడినట్టిది ఇవన్నియు నామె ప్రకృతిని రూపొందించిన లక్షణములు ఆమె పెద్దగా నేడ్చినది అది స్త్రీ స్వభావము తనను తాను గొప్పగా చెప్పుకొన్నది అది క్షత్రియకాంతయై మరియు యజ్ఞవేదికనుండి పుట్టి ఒక మహారాజుకు భార్యయైన దాని స్వభావము తననుతాను తిట్టుకొన్నది. అది–ఉద్ధతుడును, ఉత్తముడునునైన భర్తకెదురు చెప్పలేని, కొంచెము గడుసరియైన కులకాంత స్వభావము ఈ విధముగా నుద్యోగపర్వ

మున ద్రౌపది మాటాడినమాట లామె ప్రకృతిలక్షణమును చూపించుచున్నవి. అనగా నచట ప్రకృతౌచిత్యమును పాటించి తిక్కన్నగారు వ్రాసినారని యర్థము

స్త్రీపర్వమున పొలికలనికి వచ్చిన గాంధారి పుత్రమరణదుఃఖముతో భీముని నుద్దేశించి యిట్లన్నది

అంధులకు నూతకోలగ నకట యొకని
నైన నిలుపక నూర్వుర నదయవృత్తి
ద్రుంగితి అందెవ్వడేనియు మీకు నెగ్గు
లాచరింపని వాడు లేడయ్యెనయ్య ?

ఒక్కరుని నీవు సంపక
తక్కిన నంతటనె ప్రతిన దప్పునె ? విభవం
బెక్కగ మీయన్న నతండెక్కటి
రాజ్యంబు సేయ నీడె కుమారా !

నిజ తనూజుల మరణమునకు తాపము నొందుచున్న గాంధారి చిత్తము వాగ్రూపమున నట్లభివ్యక్తమైనది వృద్ధులము-అంధులమునైన మాకు నీయవ సానకాలమున నూతకోలగ నుండుటకైన నొక్కని దక్కనీయక పోయితివి కదా ! మా నూర్గురుకొడుకులలో మీ కపకారము చేయని వాడొక్కడుకూడ లేడాయెనా ? ఆ యొక్కరుని నీవు చంపక వదలినంతమాత్రమున వాడు మీ యన్నను రాజ్య మేలనీయడని భయపడితివా ?- ఇవి గాంధారి భీమునితో నన్న మాటలు. నీవు నిర్దయుడవై అందరును కాజేసితివికదా అని గాంధారి భీముని అంతస్సత్త్వమునకు మొఱపెట్టుకొన్నది. తన కొడుకులు దుర్మార్గము చేసినారని ఆమెకు తెలియును అందువలన భీముడు చంపినాడనియు తెలియును. కుమారులుచేసిన దుర్మార్గముయొక్క తెలిసినతనము, మరియు వారందర మరణము వలని దుఃఖానుభవము ఈ రెండును తత్కాలమునందలి గాంధారి ప్రకృతి లక్షణములు. తన కుమారులను చంపినది పరాయివారెవరో కాదు. తన మఱది కుమారులు. ఈ కుటుంబపరిస్థితులలోనైన శోకతీవ్రతను నంతకంటె వ్యక్తీకరించుట కవకాశములేదు. గాంధారిమాటలలో తన కుమారులను దండింప రాదను విషయములేదు. దండనము మరియు తీవ్రమైనదనియే ఆమె మొఱ.

మీకపకారము చేసినారు కనుక చంపినారు బాగుగనే ఉన్నది కాని అందరను చంపుట అన్యాయము ఎవరో మరియు దుర్మార్గము చేసిన ప్రధానపురుషు లను నలుగురైదుగురను చంపిన చంపవచ్చును అది యెట్లో సహింపవచ్చును అట్లు కాక మునుముపెట్టి ఒక్కడుకూడ మిగులకుండునట్లుగా పురుగు నేరివేసి నట్లు చంపివేయుట యేమి యుచితమయ్యా అను నీ తాత్పర్యముతో గాంధారి మొఱ పెట్టుకొన్నది ఇదంతయు నామె ప్రకృతి నావిష్కరించుట నూర్గురు కొడుకులును బోయినారని ధృతరాష్ట్రుడును నేడ్చినాడు. కాని గాంధారి దుఃఖమువంటిది కాదాతని దుఃఖము. ఇక పాండవులు తన నవమానింతురని ఆయన యేడ్పు చివరదశలో నాధారముగా నొక్కండుకూడ మిగుల లేదే అని గాంధారి యేడ్పు పురుష స్త్రీ ప్రకృతులలోని భేదమది ఈ విధముగా ప్రకృతుల నుచితరీతిని నిరూపించుట అది తత్తత్ప్రకరణములవరకే పరిమితము ముందు వెనుకలతో దానికి సంబంధములేదు కనుకనే తన్మాత్రముగా కావ్య ములయందు ప్రసక్తికివచ్చిన పురుషులనుగూర్చి వ్రాయుట దానికదిగా పాత్రో న్మీలనములోని భాగముకాదు

స్వభావము నుచితముగా నిరూపించుట ప్రకృతిని ప్రకటించుట. వివేక శాలితను నిరూపించుట పాత్రనున్మీలనము చేయుట. పాత్రోన్మీలనమున ప్రకృతి అంతర్భవించును అనగా ప్రకృతు లభివ్యక్తముచేయబడి కావ్యమున ప్రసక్తికి వచ్చిన పురుషులందరును పాత్రములుకారు. పాత్రముల ప్రకృతులుకూడ నభి వ్యక్తము చేయబడును. వివేకశాలితయనగా నిది యిట్లు కావలయునన్న పర మమైన ఇచ్ఛారూపచిత్తవృత్తి అది పాత్రలక్షణము కనుకనే పాత్రలచేత లకు, ననుభూతులకు నొక సామరస్య ముండునని చెప్పబడినది వివేకశాలిత తోడి పురుషుల చేష్టానుభూతులయందు వారి వారి ప్రకృతులును ప్రకాశము నకు రావచ్చును. పాత్రోన్మీలనమున ప్రకృతి అంతర్భవించు ననగా నర్థమిదియే

కావ్యమున పాత్రములు కాని వారి విషయమున ముఖ్యముగా ప్రకృతి ప్రకటింపబడుచుండును పాత్రములయందు ప్రకృతితోపాటు వారివారి చేష్టాను భూతులయందలి సామరస్యము నిరూపింపబడును. కొద్దిలో చెప్పబడిన ప్రకృతి పాత్రముల విశేషవిషయమిది.

పాత్రోన్మీలనమును పరిశీలించుట యనగా తత్సంబంధి అంతర్బహిర్వర్ణన ములను విచారించుట. అంతర్వర్ణనమనగా సత్వవిషయ వర్ణనము. ఈ వర్ణ

నము రెండు విధముల జరుగును. పాత్రవాచికము ద్వారా ఒక విధముగను, కవివాచికము ద్వారా మరొక విధముగను జరుగును బహిర్వర్ణనము కూడ రెండువిధములు అన్యపాత్రముల వాచికముద్వారా ఒకటి, మరియు కవివాచికముద్వారా రెండవది ముఖ్యముగా బహిర్వర్ణనము కవిచేత జడముల విషయము ననుసరింపబడును చేతనులైన పాత్రముల స్థూలాకృతి విశేషమును రూపము కట్టించుటకు కవి బహిర్వర్ణనము చేయును పాత్రోన్మీలన విషయ విచారమున గణింపదగినది అంతర్వర్ణనమే అది అంతశ్చేతనవృత్తికి సంబంధించినది గనుక చాలముఖ్యమైనది

భారతమున పాత్రములు ధృతరాష్ట్రుడు, దుర్యోధనుడు, ధర్మరాజు ముగ్గురే అని చెప్పబడినది. కావ్యమునందలి పురుషుల నందరను పాత్రములనుట కొంత రూఢమైపోయియున్నది గనుక వీరిని ప్రధానపాత్రములని చెప్పుకొనవచ్చును అట్టి ప్రధానపాత్రముల క్రమోన్మీలనమును తిక్కన్నగారెట్లు నిరూపించిరో కొద్ది పరిధిలో సోదాహరణముగా నిరూపింపబడును

## 4. పాత్రోన్మీలనము-ధృతరాష్ట్రుడు

భారత యుద్ధమునకు ప్రబలమైన మూలకారణము ధృతరాష్ట్రుని యుపేక్ష. పుత్రవ్యామోహరూపమైన ఉపేక్ష యుద్ధ మారంభమగువరకు నున్న ధృతరాష్ట్రుని స్థితికిని, తరువాత స్థితికిని చాల భేదమున్నది అంతకు పూర్వ మాయన మనస్సు నందొక నిశ్చయ మున్నది. ఆ నిశ్చయ లక్షణ మెట్టిది? దుర్యోధనుడు భీమునిచేత తొడలు విరుగగొట్టబడి చనిపోయి నాడని విన్న ధృతరాష్ట్రుడు కుమారు నుద్దేశించి విలపించినాడు ఆ విలపించుటలో నాతని మనోనిశ్చయ లక్షణ మావిష్కృతమైనది తద్విలాపములోని మాటలయందు పరమార్థభూతమైన మాటయిది.

భవదీయానివార్య విక్రమమున
పాండు నరేంద్రసుతులు
తెగుదుర యని తలంచితి.[1]

---

1. భా. శల్య. 1-23.

ధృతరాష్ట్రుడనగా నది అదియే దుర్యోధను డేమిచేసినను నుపేక్షించుటకు హేతువు. నేతి నేతి మార్గమున భారత యుద్ధమునకు మూలకారణమును విచారించుకొనుచు పోయినచో, ధృతరాష్ట్రునియందలి ఏవం విధమైన మనోలక్షణము నేతియనబడుటను నిరాకరించి నిలువ ద్రొక్కికొన గలదు. పై కెన్ని మాటలు మాటాడినను తన కుమారులు పాండవులను జయింపగలరన్న గాఢమైన ఊహ నిశ్చలమై ఆ వాని మనఃప్రపంచము నావరించుకొనియున్నది. అందువలననే యుద్ధమైనది యుద్ధమున భీష్ముడు పడుటను విన్నప్పటినుండి ఆ మనోనిశ్చయము సడలజొచ్చినది అప్పటినుండి ధృతరాష్ట్రుడు వేరు. పూర్వపువాడు కాడు. ఆ వచ్చిన భేదమును తిక్కన్నగారు లెస్సగా నిరూపించిరి. ఒక విధముగా చెప్పినచో తిక్కన్నగారు వ్రాసిన దంతయు వేరైన ధృతరాష్ట్రుని క్రమ వికాసమే భీష్మపర్వమునుండి స్పష్టముగా తిక్కన్నగారి అట్టి రచన మొదలైనది చిత్రముగా నాది సభాపర్వములయందలి ధృతరాష్ట్రుని స్పృశించుచు, ఆశ్రమవాసపర్వమునందలి ధృతరాష్ట్రుని సూచించుచు మొదలైనది. భారతమంతయు నొక మహాకథను చుట్టుకొనియున్న నిర్మాణము కదా? అందువలన తిక్కన్నగారట్లు వ్రాయుటయే లెస్స.

భీష్ముడు యుద్ధమున శిఖండి కారణముగా పడినాడని సంజయుడు వచ్చి చెప్పినాడు. ఆ మాట విని కొంచెముసేపు విలపించి చివరకు ధృతరాష్ట్రుడిట్లనినాడు

నెట్టన యాపగాసుతుఁడు నేలకు వ్రాలె ననంగ విన్న నా
కట్టిడి పీను లేమి విను కాటియ కోర్వవు? దుర్వినీతికిం
బుట్టిన యిల్లనై వినక పోవఁగ వచ్చునె యింక నాకు—? నే
దిట్టఁడ నైతి నెల్లప్రియుఁ డెల్లముగా విననేర్తు సంజయా![1]

ధృతరాష్ట్రుని దుర్వినీతి లక్షణము నంతయు పునాదులుగట్టి చేసి వ్రాసినది నన్నయ్యగారు ఈ పద్యమున దుర్వినీతికిం బుట్టిన యిల్లయిన వాడనిన ధృతరాష్ట్రునిచేత తిక్కన్నగారనిపించి చిత్రముగా నాది సభాపర్వములను స్పృశించుచున్నారు. ధర్మరాజును భీష్మవిదురులతో విచారించి యావరాజ్యాభిషిక్తుడుగా ధృతరాష్ట్రుడు చేసినాడు. ఆ తరువాత నొకనాడు దుర్యోధనుడు తన

1. భా. భీష్మ. 1-65.

మనస్సులోని విషయము తండ్రితో చెప్పినాడు. అంతకు పూర్వము దుర్యో ధనుడట్లు తండ్రితో పాండవుల విషయము చెప్పలేదు. అదియే మొదటి సారిగా చెప్పుట దుర్యోధనుడానాడు చివరికిట్లనినాడు

"ఒరులఁ గొలిచి కుడువనోప మేమట్లుగా
కుండ మమ్ముఁ జేయ నోపు దేనిఁ
బాండురాజు తొంటి భక్తియు నప్పాండు
తనయులందు ప్రియయుఁ దలఁపకుండు

వ ........ఉపాయంబున గొంతిని బాండవులను దదీయ భృత్యా మాత్య వర్గంబుతో వారణావతంబునకుం బుత్తము మనకు రాజ్యంబు సుప్రతిష్ఠితంబైన మఱి వారలిందులకు వత్తురు "[1]

అదివిని ధృతరాష్ట్రుడిట్లనినాడు "ఏ నెల్ల ప్రొద్దు నాయెదలోన దలతు నీ యభి ప్రాయంబు. ఇది దారుణంబుగాన వాక్కునకుఁజుల్కన తేరనోప కడగి పాండవు లనేకత మెట్టు లనుపగానగు? మఱి దీని గాంగేయ విదుర కలశజాశ్వత్థామ గౌత ముల్ బుద్ధిగా నొడంబడుదురె? కాదయ్య"[2] ధృతరాష్ట్రుని జీవలక్షణమే చిత్రముగానున్నది పాండురాజు తనయందు చూపిన భక్తినిగాని, పాండవుల యందు తాను చూపు దయనుగాని ధృతరాష్ట్రుడు మనస్సున తలపకుండవలయు నని యెల్లప్పు డనుకొనుచుండునా? లేక పాండవులను ఎచటికేని పంపి రాజ్యము తన కుమారులకు సుప్రతిష్ఠితము చేయవలయునని యెల్లప్పుడు తలచుచుండునా? రెండు కావచ్చును అపుడిట్లు ధృతరాష్ట్రుని అంతర్యమును భావింపవలయును పాండురాజు తనయందు చూపిన భక్తిగాని, తాను పాండ వులయందు జూపు దయకాని రెండును వానిమనస్సును పట్టుకొనియున్నవికావు అయినను బంధువులలో విషయమైపోయినది అందువలన మనస్సును పట్టి లేక పోయినను నున్నట్లు కనిపించవలసివచ్చుచున్నది రాజ్యము పాండవులకు లేకుండ తన కుమారులకే ఉండవలయును. కాని భీష్మాదులంగీకరింపరు. అం దువలన తన యూహను వెలికిరానీయరాదు. అదియునుగాక నాయూహ దారుణముగా కనిపించుచున్నది. అందువలనను వెలికిరానిచ్చుట వాని కిష్టము

1. భా. ఆది. 6-127,128.
2. భా. ఆది. 6-129.

లేదు. అనగా ధృతరాష్ట్రునకు పాండవులమీద దయలేదు వారికిరాజ్యముండుట ఇష్టములేదు. ఈ విషయమున దుర్యోధన ధృతరాష్ట్రులకు భేదములేదు. కాని ఆ తన లోపలి ఆలోచన చాల దారుణమైనదని ధృతరాష్ట్రున కప్పుడప్పు డని పించుచుండును. అందువలనను మరియు భీష్మాదులకు వెఱచుట యున్నందునను ధృతరాష్ట్రుడు పాండవుల విషయమున సక్రమముగనే వర్తించుచున్నాడు దుర్యోధనున కీ స్థితిలేదు. వానికి తన యాలోచన దారుణమైనదన్న జ్ఞానము లేదు భీష్మాదులవలన వెఱపునులేదు. ఇదియే ఆ యిరువురకునుగల భేదము ధృతరాష్ట్రునియందున్న ఆ జ్ఞానరేఖ పోలుపే వానిని దుర్వినీతునిగా జేసినది ద్యూతము జరుగుటలో వాని దుర్వినీతి శిఖరము నందుకొన్నది. పాండవశ్రీ అపహరింపవలయుననియే దుర్యోధనుడు, శకుని ద్యూతము ప్రవర్తింపజేయ వలసినదిగా ధృతరాష్ట్రుని బోధించినారు. వానికి లోపల నది యిష్టమేకాని విదురాదుల భయముచేత వెంటనే అంగీకరింపలేదు చివరకు సుహృద్ద్యూతమని ధర్మరాజును పిలువనంపినాడు ఆ జూదమున కావలసినదైనది. దుర్యోధనుడు ద్రౌపది నవమానించుటవరకు పోయినాడు. అది మరియు విపరీతమైనది బంధు వులలో విషయమట్లు కారాదను జ్ఞానము ధృతరాష్ట్రునకున్నది. అందువలన తాను స్వతంత్రించి పాండవుల రాజ్యము పాండవులకు నిచ్చి ధర్మరాజుతో "నేను బుద్ధిలేక జూదం బుపేక్షించితి—"[1] అని యీ మొదలుగాచెప్పి, జరిగిన దానికేమియు ననుకొనకుమన్నట్లుగా ప్రాధేయపడినాడు. ధర్మరాజును పంపించి నాడు తిరిగి దుర్యోధనుడు వచ్చి" వారలనను ద్యూతంబునఁ బరాజితులం గావించి విరళదేశనిర్వాసితులం జేయుట కార్యంబనిన ధృతరాష్ట్రుండొడంబడి యప్పుడ యనుద్యూతార్థంబు ధర్మనందనుం దోడితేరం బ్రాతికామిం బంచి"[2] నాడు. ఇదియే దుర్వినీతి ఇదిలేని దుర్యోధనుడు లోపలనొకటి పైకొకటికాదు. ఉద్యోగపర్వమున సంజయుని పాండవులవద్దకు పంపుటయు నా దుర్వినీతిలోని భాగమే. మరియు శ్రీకృష్ణుడు రాయబారము విఫలమైపోవునప్పుడు చెప్పిన "వీరును బాండుపుత్రులు వేరము దక్కి పొసంగి మన్కి.... .... నీకు శుద్ధుండ నగుటయు...నాకుఁ జాలు"[3] అను ఈ మొదలైన మాటలన్నియు తద్దుర్వినీతి లోనివే. రాజ్యము పాండవులకు లేక తన కుమారులకే ఉండుట – పాండవులను

1. భా. సభా. 2-267.
2. భా. సభా. 2-274.
3. భా. ఉద్యో. 4-3,5.

తానన్యాయము చేసినట్లు లోకమునకు కనుపించకుండుట. అట్టి యిచ్ఛతోడి యట్టి ప్రవృత్తియే దుర్వినీతి అది ధృతరాష్ట్రునకు తెలియును. తెలిసి తెలిసి అట్లు ప్రవర్తించినాడు. అదియే చిత్రమైన విషయము. భీష్మపర్వమునందు 'దుర్వినీతికిం బుట్టిన యిల్లనై' అని ధృతరాష్ట్రుడనగనే ఆదిపర్వమునందలి పనెల్ల ప్రొద్దు నాయెడలోన తలతు నీయభిప్రాయంబ' అని యనినది స్మృతికి రావల యును. అపుడుగాని వాని దుర్వినీతి వానికి తెలిసిన లక్షణము మనకు తెలియదు

భీష్ముని పడిపోవుట వినగానే తనకుమారులకిక అపజయమే అను నిశ్చయ భావము ధృతరాష్ట్రుని బుద్ధిని తాడితము చేసినది. తాను తెలిసి తెలిసి చేసిన దాని ఫలితమిట్లు కనిపించుచున్నది ఫలితమిట్లు కనిపించుటచేత, దీనికిమూలమై తాను చేసినది, అది చేసిన తన యిప్పటి బుద్ధిలక్షణము ధృతరాష్ట్రునకు స్ఫురిం చినవన్నమాట. అట్లు స్ఫురించినప్పుడే దర్విసీతికింబుట్టిన యిల్లని తనను తానను కొనుట సమర్థింపబడును. పాత్రపోషణమనగా నిట్లు వ్రాయుటయే. నేను దుర్మార్గము చేయుచున్నానని తెలిసి ధృతరాష్ట్రుడు చేసినట్లుగా నన్నయ్య గారు వ్రాసిరి. నేను చేసినదాని ఫలితమనుభవించుచున్నానని తెలిసి ధృతరాష్ట్రు డనభవించుచున్నట్లుగా తిక్కన్నగారు వ్రాసిరి ధృతరాష్ట్రుని పాత్రమట్లు ఉన్మీలనము చేయబడినది. ఆ పద్యమునందలి మిగిలిన వాక్యములన్నియు సాధా రణములైనవి. భీష్ముడు నేలకు వ్రాలిననాడనుటను వినిన నేనింక నేమైనను విన వచ్చును వినవచ్చునేమి? వినకతప్పదు. తప్పించుకొన నావశమా? అన్నియు విననేర్తును. చెప్పుము—ధృతరాష్ట్రుడనిన దిది.

ఇచట ధృతరాష్ట్రునిచేత చెప్పబడిన "దుర్వినీతికిం బుట్టిన యిల్లనై" అను నది ఆశ్రమవాసపర్వమున పౌరులతో "అన్యాయ మాచరించి, దుర్ణయంబున నిలయేలి త్రుంచెకులము నుర్విగల భూపతులను దుర్యోధనుండు వాని దుశ్చేష్ట లకు మూల మేనకాదె"[1] అని చెప్పబోవుదానికి మూలముగానున్నది. భీష్మ పర్వమునుండి ధృతరాష్ట్రుని యందు పశ్చాత్తాప రూపచిత్తవృత్తి నిరూపింపబడి నది. అది క్రమముగా నాశ్రమవాసమునాటికి వాని పాపమును క్షాళనముచేసి నది. భీష్మపర్వమున తిక్కన్నగారు వ్రాసిన ఆ పద్యమునందలి ఆ యొక్క వాక్యము ధృతరాష్ట్రుని అంతస్సత్వమును ముందువెనుకల మీద వ్యాఖ్యానించు

1. భా. ఆశ్ర. 1-88.

చున్నది. ఒక మహాకవి వ్రాసిన ఒక వాక్యము పూర్వాపరములయందలి యర్థ సంఘటనము మీదగాని పరమ రమణీయముకాదు. సామాన్యులైన కవులక్కడి కక్కడే ఒక చిన్న చమత్కారమును పుట్టించి దాటవేసికొని పోవుచుందురు. తిక్కన్నగారు మహాకవి గనుక నట్లు వ్రాసెను

భీష్ముని పతనము విన్నప్పటినుండి, అనగా సంజయుడు యుద్ధమును క్రమముగా చెప్పుట మొదలుపెట్టినప్పటినుండి ధృతరాష్ట్రునకు తన మనోనిశ్చయము సడలిపోజొచ్చినది మరియు పశ్చాత్తాపము ప్రారంభమైనది. చిత్రమైన విషయమేమనగా యుద్ధము వినుచు మధ్యమధ్య ధృతరాష్ట్రుడు దుర్యోధనుని వలననే ఇదంతయు నిట్లయినదని వాపోవుచుండును తనవలననైనదని వాచ్యముగాననడు ధృతరాష్ట్రుడు వాపోయినప్పుడెల్లను సంజయుడు మాత్రము "నీ తప్పున బుట్టిన చేటునకు శోకింపం బనిలేదు"[1] "నీ యవినయంబు పెంపున నీ యాపదసంభవించె"[2] "నీ చేసినదుర్ణయమున జేటొందెను, వగవక రణము వినుము."[3] అని యీ ధోరణిలో ననుచుండును ధృతరాష్ట్రుడాసంజయుని మాటల కెదురుచెప్పడు అనగా లోపల వానికి తెలియును-తనవలననే అంతయు నిట్లయినదని అందుకనియే మాటాడడు

భీష్ముని నాల్గవనాటి యుద్ధము వినుచు సంజయునితో ధృతరాష్ట్రుడిట్లనినాడు.

మానుష మేటికి ? దైవా
ధీనము సర్వంబు నస్మదీయస్వాయ
త్సేనలఁ బాండున్నృపాలక
సూనులు గెల్చెదరు కంటె సూతతనుజా![4]

తాను మానుషము చేసినాడు దైవమున కెదురుతిరిగి చేసినాడు. కాని సర్వము దైవాధీనము. మానుషము దైవముముందు చిల్లిగవ్వకు పనికిరాదు. పాండవులు దైవబలము కలవారు. వారు మానుషబలము కలిగిన తనసేనల నోడించెదరు యుద్ధము వినుచున్న ధృతరాష్ట్రునకు దైవము మానుషము అను

1. భా. భీష్మ, 3-32.
2 భా. ద్రోణ. 4-22.
3. భా. కర్ణ. 2-360.
4. భా. భీష్మ, 2-198.

రెండింటిని గల బలమునందలి భేదము తెలియవచ్చినది వాని పశ్చాత్తాపము నందిది యొక భాగము పాపపుటూహాలు చేసినవాని బుద్ధి ఈ విధముగా దైవ మానుషములను విచారించుకొనుచు పాపక్షాళనముచేసికొన్నది మరియు భీష్ముని ఆరవనాటి యుద్ధమును వినుచు పాండవులు గెలుచుట దైవముగెలు చుటగా ధృతరాష్ట్రు డనినాడు అట్లే ద్రోణుని నాల్గవనాటి యుద్ధము వినుచు "వినుపౌరుషము నిరర్థకము అనుమానములేదు దైవ మధికంబు" అని సంజ యుడు విని "ధర్మ మధర్మము నోర్వకున్నె ?" అని యనినాడు. కర్ణుని రెండవ నాటి యుద్ధము వినుచు "దైవంబు బలవంతంబని" నిశ్చయించి పలికినాడు ఈ విధముగా యుద్ధము వినుచున్నంత కాలము తన చేసిన మానుషమధర్మ మని మిక్కిలిగా వాపోయినాడు ధృతరాష్ట్రుని పశ్చాత్తాపము లక్షణ మద

యుద్ధమున దుర్యోధనుడు మరణించినాడని వినినప్పటినుండియు ధృత రాష్ట్రుని దుఃఖము మఱియొక మార్గము పట్టినది. కేవలము తన యుపేక్షవలన నిట్లయినదని బాహాటముగా పేర్కొనుచు వాపోవుట యది మరియు నిక పాం డవులచేత తానవమానింపబడవలసిన రోజులు వచ్చినవిగదా అని వాపోవుటయు నున్నది కాని యిది పై దానివలె జీవితాంశములేదు

మును విదురుండు సెప్పె నలిమూర్ఖమనోగతియైన యీ సుయో
ధనుచరితంబు గీడఖిలధాత్రిజనంబులకుం బొనర్చు నా
శన మని దాని గొంద ఱవిచారులు పాటిగఁ బట్టరైరి నా
కును మది వారికెట్లటుల కుత్సితమయ్యె విధాత త్రిప్పునన్ [1]

దుర్యోధనుని మరణమువిన్న తరువాత సంజయుని ముందు స్వగతమువలె ధృతరాష్ట్రుడు చింతించిన విధమది మరియు నింకను స్పష్టముగా తరువాత "పాండున్పపాలుపాలు తత్సుతులకుఁ బంచి యీ నాకతమునఁ బోలిసిరి నంద నులు జెలులు చుట్టంబులును సహాయులును-"[2] అని యీ మొదలుగా ధృత రాష్ట్రుని పశ్చాత్తాపదుఃఖము సాగిపోయినది కుమారుని చావు వినకపూర్వ మును నిట్టి దుఃఖలక్షణము వానియందున్నది కాని విన్నతరువాత నిదియే ప్రధానమైనది అందువలన ప్రత్యేకము చెప్పబడుచున్నది భీష్ముడు పరలోక

1. భా. శల్య. 1-36.
2. భా. స్త్రీ. 1-12.

గతుడుకాగా ధర్మరాజు తిరిగి దుఃఖవివశుడైనపుడు ధృతరాష్ట్రుడు "విదుర హితాలాపములు తన వినకుండుటయు సుయోధనుని కీడు నద్దుష్టబుద్ధిఁదా ననుస రింపగ ధర్మ మెడలిన కతమున నింత పుట్టెననియు తెలియనాడి"[1] వాని నోదార్చినాడు తరువాత తాను వానప్రస్థుడు కాదలచి ధర్మరాజు ననుమతి మీద వనములకు పోవుటకు ముందు కుండ బ్రద్దలు కొట్టినట్లుగా వాని బంధు జనముల సమక్షమున ధృతరాష్ట్రి డిట్లనినాడు

నా కంఠంబున జేసి యా కౌరవులకు నా
శంబు వాటిలుట దెల్లంబ మీకు
జడు-క్రూరు-నతిలోభి-జ్ఞాతిజనద్రోహ
కరు రాజుఁ జేసితిఁ గురు ధరిత్రి
కచ్యుతు చెప్పిన యమలవాక్యమ్ములు
విననేరనైతి నా తనయువలని
ఘనతర స్నేహంబునను మొగమోటను
దగియెడు మాటలఁ దఱిమి యొత్తి

యాడకుండితి భీష్ముండు నస్త్రగురుఁడు
విదురుఁడును సంజయుండును వేవిధముల
నాకుఁ జెప్పిరి. గాంధారి నన్ను దూఱి
చెప్పె అమ్మాటలేఁ బెడచెవుల నిడితి [2]

ఏమియు దాచుకొనకుండ బయటపడి ధృతరాష్ట్రుడు చెప్పిన మాటలివి ఈ పద్యమునందలి అచ్యుతు చెప్పిన వాక్యములు విననేరనైతి-నా తనయుని తగియెడు మాటల తఱిమియొత్తి యాడకుండితి-అను ధృతరాష్ట్రుని అంతర్భ మును పట్టి ఆదిసభాపర్వములయందు వానిచేసిన దానిని, ఉద్యోగపర్వమున శ్రీకృష్ణునితో తనవలన నేమియు దోషములేదని చెప్పుటను మరియు యుద్ధము మొదలగుటకు ముందుగా వ్యాసునితో "నా సుతుల నయంబుమైఁ దఱిమి చూచితి........నా దెస తప్పులేమి మీ మదిఁ దలపోయు''[3]డని యనుటయు

---

1. భా. అశ్వ. 1-6.
2. భా. ఆశ్ర. 1-21.
3. భా. భీష్మ. 1-13.

మొదలుగా గలిగిన పూర్వపు ధృతరాష్ట్రుని అంతర్యమును భావించినచో వాని దుర్వినీతి లక్షణము లెస్సగా నవగతమగును

భీష్మునిపాటు విన్నప్పటినుండి పశ్చాత్తాపము పొందుటను ధృతరాష్ట్రుడు చివరకు తనను తాను శాసనము చేసికొనినాడు తిక్కన్నగారు వ్రాసిన దంతయు ముఖ్యముగా మనఃకల్మషమునుండి దూరమగుచున్న ధృతరాష్ట్రుని గురించియే.

ఇక పాండవులవలన తన కవమానము జరుగునని యనుకొనుట, పాండవులందరవలనను ధృతరాష్ట్రు డవమానము నూహించినట్లులేదు. దుర్యోధనుని మరణము విని అత్యంతదుఃఖదూషితస్వాంతు డగుచు ధృతరాష్ట్రుడు సంజయునితో నిట్లనినాడు.

"తలపఁగ భాగ్యవంతుల కుదాత్తశుభం బగుఁ గాక పుణ్యహీ
నుల కది గల్గనేర్చునె తనూభవు లాఱడివోయి రింకఁగా
నఁ జరియింపఁ బోవుటయు నా కుచితం బటుగాక చండిసై
నిలిచిననేని మాటలనె నిచ్చలు భీముఁడు మాడు చుండఁడే

విను దుర్యోధన దుశ్శా
సనులఁ బలికి పలికి నిచ్చచావుగ నస్పా
వని యలఁచుగాన యడవికిఁ
జనుటయు మేలైన తెఱఁగు సంజయ నాకున్" [1]

ఈ రెండు పద్యములయందును భీముడు నిత్యమును తనను మాటలచేత చంపుచుండక మానడని ధృతరాష్ట్రుడు కచ్చితముగా జెప్పుచున్నాడు మిగిలిన వారి విషయమేమియు లేదు ముఖ్యము ధర్మరాజుకదా ? ఆయన విషయమును ధృతరాష్ట్రుడు చెప్పుటలేదే? భీముడు ధర్మరాజునకు లోబడియుండువాడు భీముడనుననగా పైకనుపని యర్థము ధర్మరాజు పైకనడు భీమునిచేత ననిపించును ఈ యూహ ధృతరాష్ట్రునకున్నదా ? ఉండవచ్చును. ఈ యుండవచ్చుననుటను తిక్కన్నగారు మరొకచో నున్నదని నిర్ధారణచేసి వ్రాసిరి పుత్రమరణశోకసంతప్తుడగు ధృతరాష్ట్రుని తగిన మాటలాడి యోదార్చుటకు తరువాత

1. భా. శల్య. 1-31, 32.

వ్యాసుడు వచ్చినాడు. అపుడు "అవ్విభుండు తనకుం బాండవాగ్రజుం డవమానం బాచరించునను శంకనూని యునికి యమ్మహాముని (కి) దివ్యబోధంబునం దేటపడి"[1] నదని తిక్కన్నగారు వ్రాసిరి. ధర్మరాజే తననవమానించునని ధృతరాష్ట్రునకు లోపలకలదు పైకనలేదు భీముని విషయము పైకి చెప్పినాడు ధర్మరాజు విషయమున వానికిగల శంకసామాన్యులకు తెలియునదికాదు వ్యాసునకు దివ్యబోధశక్తి యున్నందున తెలిసినది. దివ్యబోధశక్తి యనగా సకల ప్రాణి చిత్తవృత్తంబులును తేటపడం గనియెడు శక్తి. ధర్మరాజును శపింపవలయునని గాంధారి మనస్సు ననుకొనుటను వ్యాసుడెరిగి వారించినాడు గదా! అట్లే ధృతరాష్ట్రుని మనస్సునందున్న ధర్మరాజు విషయమైన శంకను వ్యాసుడెరిగినాడు అట్టి శంక వాని యందంత లోతున నున్నది పైకి భీముని వలన తన కవమానము జరుగునని భయపడినట్లుగా మాటాడినాడు కాని ధృతరాష్ట్రుని ఆ మాటాడిన దానిని బట్టి ధర్మరాజు విషయమాతని మనస్సునందున్నదని తెలియరాదు. కనుకనే తిక్కన్నగారు వ్యాసుడా విషయము నెరిగినాడని వ్రాయుట. ఎరిగి వ్యాసుడు ధృతరాష్ట్రునితో ధర్మరాజును గూర్చి చెప్పుచు "నీ దెస నాతనికిన్ విముఖత్వము గల్గదు భక్తి మెయిం దా వినయం బెనయం గొనియాడుట తప్పదు"[2] అని ఈ విధముగా నిశ్చయించి పలికినాడు నిజముగా ధృతరాష్ట్రునకు ధర్మరాజు విషయమున శంక లేక, భీము నొక్కని విషయమునందే యున్నచో వ్యాసునితో నాకు ధర్మరాజు విషయమున నేమియు లేదు-అని ఈ మొదలుగా ననియుండవలయును కాని అనలేదు అనగా వాని మనస్సుందున్నది ధర్మరాజును గూర్చిన శంకయే పైకి మాత్రము భీముడనుచున్నాడు. ఇట్లనుటచేత భీముని విషయమున నాతనికి శంకయే లేదని అర్థము కాదు భీము డుద్ధతుడు. ధర్మరాజట్టి వాడుకాడు మిగిలినవారును కారు. అందువలన వారెవరును పైకి నిందించి మాటాడరు. భీముడు మాత్రము పైకనును అది ధర్మరాజు హర్షించును అదియే తనను పాండవు లవమానించుట యగును-ఈ విధముగా తనకిక పాండవులవలన జరుగబోవు నట్టి యవమానమును దుర్యోధనుని చచ్చిన పిదప ధృతరాష్ట్రు డూహించి దుఃఖించినాడు వ్యాసుడు స్పష్టముగా ధర్మరాజు విషయము చెప్పిన తరువాత "నీదు వచన

1. భా. స్త్రీ. 1-82.
2. భా, స్త్రీ 1-90

ములు విని మనివరేణ్య శాంతుడనైతి''[1]నని ధృతరాష్ట్రు డనినాడు. అనగా వ్యాసుని మాటలవలన ధృతరాష్ట్రుని చిత్తము నాశ్రయించిన ఆ దుఃఖము లక్షణము పోయినదన్నమాట అందువలననే ఈ రకము దుఃఖమెక్కువకాలము వాని యందుండలేదని వెనుక వ్రాయబడినది

మరియు నా తరువాత వ్యాసునితో ''నిర్భర బాంధవంబు నొందెద పురుషోత్తములైన పాండు పుత్రకులదెస'' అని ధృతరాష్ట్రుడు చెప్పినాడు. ఇక జీవితాంతమట్లే ప్రవర్తించినాడు. కాని పొలికలనికి బోయినప్పుడు భీముడను మాట వినగనే అతిభీకమైన అలుక పుట్టినది భీముని ఆయసరూపము నా యలు కతోడనే విరిచివేసినాడు వెంటనే తెలిసినది తాను విరిచినది భీముని ప్రతి రూపమునని శ్రీకృష్ణుడు మరియు ధృతరాష్ట్రుని బోధించినాడు ''సుతు లీల్గుట కుం దాపము బొంది తాల్మి దిగద్రావి మహాకోపుడనైతి''ని ''తెలిసితి నీ మాటలం బుత్రుల దెస నెవ్వగల నెల్ల దొఱగి యనుజపుత్రుల నాకు ప్రియ మొనర్పంగలవారుగ నడచువాడ''[2] నని శ్రీకృష్ణునితో చెప్పినాడు ధృతరాష్ట్రుడు. ఇక జీవితమట్లే వెళ్ళదీసికొనినాడు పాండవులకు ''శ్రీయు నాయువు వైరిజయము మానసమున నాశాసించు''[3] స్థితి ధృతరాష్ట్రునకు కలిగి నట్లుగా నాశ్రమవాసపర్వము మొదట చెప్పబడినది ధృతరాష్ట్రుని మనస్సట్లు చివరకు పాండవుల యందు లగ్నమైనది ఆదిపర్వమున ధృతరాష్ట్రుని మనస్సు పాండవుల యందులేదు. ఆశ్రమవాసపర్వమున ధృతరాష్ట్రుని మనస్సు పాండవుల యందు తప్ప మరిదేనియందును లేదు భారతమున ధృతరాష్ట్రుని పాత్ర మట్లున్మీలనము చేసి చూపబడినది అదొక క్రమమున చూపిబడినది. మధ్యలో తానందుకొని వ్రాయుట ప్రారంభించి పూర్వపర్వ కథార్థము సంగతము చేయుచు తిక్కన్నగారు తుదముట్టించుట లెస్సయైన విషయము

## 5. పాత్రోన్మీలనము - దుర్యోధనుడు

''పాతకియై సుయోధనుఁడు పాండుతనూజులు సల్పుచున్న యజ్ఞాత విధివ్రతంబు గలుషంబుగఁ జేయఁ దలంచి ......''[3]నాడని తిక్కన్నగారు వ్రాసిరి.

1 భా. స్త్రీ. 1-93.

2. భా స్త్రీ. 1-148, 149.

3. భా స్త్రీ. 1-14-

తాను వ్రాసిన భారతభాగమున దుర్యోధనుని ఉద్దేశించి తిక్కనగారు చెప్పిన మొట్టమొదటి పద్యమది పాతకియై సుయోధనుడని ప్రారంభింపబడినది. పరమదుర్మార్గుడైన సుయోధనుడు – అని సాధారణముగా దాని కర్థము చెప్పుకొనవచ్చును మరియు సూక్ష్మముగా విచారించినచో నిట్లుండును పాతకియై అనునది భూతకాలికమై దుర్యోధనుని గతచరిత్రమును స్పృశించుచున్నది. మొదటినుండియు దుర్యోధనుడు పాపబుద్ధి కలవాడే పాండవుల అజ్ఞాతవాస వ్రతమును భంగముచేయవలయునని తలంచుటతో వాని పాపబుద్ధి లెస్సగా పరిపక్వమై నిండైన పాతకిగా వానిని చూపించుచున్నది దుర్యోధనున కేవంవిధమైనబుద్ధి యెప్పటినుండి కలిగినదనగా నేనపాండవముగా రాజ్యమే లేదనని ఎప్పుడనుకొనినాడో అప్పటినుండి కలిగినది అపుడునన్నయ్యగారు దుర్యోధనుడు "పాపబుద్ధియందుఁ గృతనిశ్చయుండై"[2]న వాడని చెప్పిరి ఆ పాపబుద్ధియందలి దుర్యోధనుని కృతనిశ్చయత్వము క్రమముగా నపాండవము చేయుటకు చాల చేసినది. అజ్ఞాతవిధివ్రతమును భంగము చేయవలయునన్న పూనిక పూర్వము చేసిన వాటికన్నింటికిని శిఖరభూతము దీనితో దుర్యోధనుడు కేవలము పాపబుద్ధి మూర్తిగొన్నట్లుగానైనాడు అందువలన పాతకియై అని చెప్పబడినాడు మరియు నొక విశేషమేమనగా బాగుగా చిన్నవాడుగానున్నప్పుడు, భీముని చంపించుటకు చేసిన చిల్లర యత్నములు తప్ప, దుర్యోధనుడు తరువాత తరువాత చేసినవన్నియు నేదేనొక విధముగా తండ్రియనుమతిమీద చేసినవే చివరకు ఘోషయాత్రకుపోవుటకుకూడ తండ్రియనుమతి తీసికొనినాడు. అవన్నియు పాపబుద్ధియందు కృతనిశ్చయుడైన దుర్యోధనుడు చేసిన పనులు ఈ యజ్ఞాతవిధివ్రతమును భంగము చేయుటకు ధృతరాష్ట్రుని అనుమతి లేదు దుర్యోధనుడు స్వయముగా నిర్ణయించినాడు. ఏవం విధమైన స్వయం వ్యక్తిత్వ మెప్పుడు దుర్యోధనునకు కలిగినదో అప్పుడు కేవలము పాపబుద్ధి మూర్తిగొన్నట్లుగానైనాడు. అప్పుడు తిక్కన్నగారు పాతకియై సుయోధనుడని వ్రాసిరి నన్నయ్యగారు వేసిన భారతకథాపథకము తిక్కన్నగారిచేత నెట్లు కొనసాగింపబడినదో దీనినిబట్టి తెలియగలదు

1. భా విరా. 3-72.
2. భా. ఆది. ౯-169.

తానుచేసిన ప్రయత్నములన్నియు పాండవులను నాశనము చేయుటయందు విఫలములైనను దుర్యోధనునకు నపాండవముచేసి తానే రాజ్యమేలవలయునన్న నిశ్చయబుద్ధికి మాత్రము చలనములేదు దుర్యోధను డంతగట్టివాడు. పదిదినములు యుద్ధము జరిగి భీష్ముడు పడిపోయిన మరునాడు "అప్రతిహతభూతి పెద్దకాల మేను పలుదు పృథివి యెల్ల"[1] అని మాటాడ గలిగిన దుర్యోధనుని నిశ్చయబుద్ధిలక్షణము గట్టితన మూహాకందనిది. వాని గొప్పతనమంతయు దానిమీద ఆధారపడియున్నది వానిప్రవృత్తి సమస్తము దానినిచుట్టుకొనియున్నది యుద్ధపుదినములలో వాని యా మనోలక్షణమును తిక్కన్నగారు చమత్కారముగా నిరూపించిరి భారతయుద్ధమునందలి మరొక వీరునియందు చెప్పబడని ఒకానొక చిత్రమైన లక్షణమును దుర్యోధనునియందు చూపించి దానివలన వాని మనోలక్షణమును ప్రతీయమానము చేసిరి. తన్నుం దాన పురికొలుపుకొనుచు దుర్యోధనుడు యుద్ధమునందు ప్రవృత్తుడై నాడట ఈ చిత్రమైన లక్షణమును తిక్కన్నగారు దుర్యోధనునియందు రెండు పర్యాయములు చూపించిరి–యుద్ధమెనిమిదవ నాడొకసారి [2] పదునాల్గవనాడు మరియొకసారి [3] ఈ దుర్యోధనుని విషయమున చెప్పబడిన "తన్నుందాన పురికొలుపుకొను"టను రెండు విధముల నర్థము చేయవచ్చును కౌరవసేనలో వయస్సుచేత పెద్దవారును మరియు ముఖ్యులును భీష్మద్రోణులు. కర్ణుడు దుర్యోధనునికంటె పెద్దవాడే అయినను మిత్రుడు. మరియు దుర్యోధనున కనుకూలముగా పాండవులయందు వైరము కలవాడు భీష్మద్రోణులకు దుర్యోధనుడు పాండవులతో యుద్ధము పెట్టుకొనుట ఇష్టము కాదు భీష్మద్రోణులు దుర్యోధనుని యుద్ధమున నెప్పుడును పురికొల్పరు మరియు దానికితోడు పాండవుల నగ్గించి పలికి, దుర్యోధనుని విజయము నడుగడుగునను శంకించి పలుకుచుందురు వారి యా మాటలను పెడచెవులబెట్టి యుద్ధమునందు తాను ప్రవృత్తుడగుచు మిగిలినవారు నగునట్లు చేయవలసిన యవసరము దుర్యోధనునకు పట్టినది అందువలన నాతడు తన్నుందాన పురికొలుపుకొనునని చెప్పబడియుండవచ్చును.మరొక విధముగా నిట్లుచెప్పవచ్చును. దుర్యోధనుని సమరోత్సాహము చాలదొడ్డది ఇతరు

---

1. భా. ద్రోణ. 1-111.
2. భా. భీష్మ. 3-116.
3. భా. ద్రోణ. 4-168.

లుత్సాహపరచవలసిన స్థితిలో దుర్యోధనుడులేడు. అంత సమరోత్సాహము కల వానినిగూడ పురికొలుపవలయునన్న చో నంతకంటె నుత్సాహము కలవాడుకావల యును అట్టివాడు కౌరవపక్షమునలేడు కనుకదుర్యోధనుడు తన్నుదాన పురికొలు పుకొనునని చెప్పబడియుండవచ్చును. ఈ రెండవ యర్థమునకంటె మొదటిదే యుచితముగా నుండును. మరియు వాస్తవమునకు దగ్గరగానుండును భీష్మ ద్రోణులు సేనానాయకులుగానున్న కాలముననే దుర్యోధనుని విషయమున నా లక్షణము చెప్పబడినది. ఎనిమిదవ నాడనగా భీముడు కురుకుమారులు సునాభాదులను చంపిన దినము. మరియు ఘటోత్కచుడు కౌరవసేనమీద పడి వీరవిహారము చేసిన దినము భీష్ముడు కౌరవసేనానాయకుడు చూచి చూడ నట్లున్నాడు ఆ సమయమున దుర్యోధనుడు తనను తాను పురికొల్పికొని వెలు పూనక ఘటోత్కచుని నెదుర్కొనినాడు పదునాల్గవనాడనగా సైంధవవధ జరుగుదినము. సాత్యకి, భీముడుకూడ కౌరవసేనను చొచ్చుకొని నురుమాడు చున్నారు ముఖద్వారమున సేనానాయకుడు ద్రోణుడుండిగూడ, అర్జునుడు, సాత్యకి, భీముడు వరుసగా లోనికి ప్రవేశించుట నడ్డగింపలేదని దుర్యోధనునకు కోపము అంతముందొకసారి ద్రోణుని నిందించి దుర్యోధనుడు మాటాడినాడు మరియు కొంచెము సేపైన తరువాత తన వారందరును నశించిపోవుటనుచూడ లేక వచ్చి ద్రోణునితో నిందాపూర్వకముగా మొఱపెట్టుకొనినాడు. అపుడు ద్రోణుడు, దుర్యోధనుడు పాండవులను జూదమున నోడించుటను పేర్కొని ఉల్లస మాడినాడు. దానిమీద దుర్యోధనుడు మొగమింత చేసికొని తనను తాను పురి కొల్పికొనుచు యుద్ధము చేయబోయినాడు. ఈ విధముగా భీష్మద్రోణులు సేనాపతులుగా నున్న దినములలోనే జరుగుట మూలమున మొదటి యర్థము వాస్తవమునకు దగ్గరగా నుండును. దుర్యోధనుని బుద్ధిలక్షణ మట్టిది.

మరియు దానిని సమర్థించునట్టి యుదాహరణ మొక్కటి చూపింప బడును. కర్ణార్జునుల యుద్ధమునకు ముందు-అనగా కర్ణుడు మరణించునాడు వాని మరణించుటకు కొంచెము ముందుగా-అశ్వత్థామ దుర్యోధనునితో నిక యుద్ధము లాభము లేదని సంధి చేసికొమ్మని అనినాడు. దుర్యోధను డంగీకరింప లేదు. మరియు నశ్వత్థామ మాట లుచితములు కావన్నట్లుగా మాటాడినాడు. కర్ణుడు మరణించిన తరువాత కృపాచార్యు డిక యుద్ధము సేత మంచిదికాదని దుర్యోధనుని బోధించినాడు. అపుడు "వేడి నిట్టూర్పు నిగిడించి యొక్కింత

సేపు చింతాక్రాంతుండై యూరకుండి వ్రాల్చిన కనుదోయి విచ్చి యవ్విప్ర వరు మొగంబుసూచి"[1] నాడని దుర్యోధనునిగూర్చి తిక్కన్నగారు వ్రాసిరి. ఇట్టి చింతాక్రాంతత దుర్యోధనుని విషయమున కర్ణుడు బ్రతికియున్నంతవరకు చెప్పబడలేదు. కర్ణుని మరణానంతరము దుర్యోధనుని మనోనిశ్చయము కించిత్తు సడలినది కాని వెంటనే నిలువ ద్రొక్కికొనినాడు. అట్లు చూచి కృపునితో దుర్యోధను డిట్లనినాడు

పొడుతు నెట్లు పాండు పుత్రులతోఁ గయ్య
మేను నీవు దీని కియ్యకొనుము
పలుకు వినమిగాఁగఁ దలఁపకు ముచితంబు
తెలుఁగు ధీరజనుల కెఱుఁగరాదె[2]

ఈ మాటలనుబట్టి దుర్యోధనుడు తన్నుందాన పురికొలుపుకొనుట యన నేమో ఊహింపవచ్చును. అపాండవము చేసి తీరవలయునన్న వాని నిశ్చయించుకొన్న దాని తీవ్రత యట్టిది యుద్ధముచేసి నిజముగా తనను గెలిపించవలయునని హృదయములయందు లేని, మరియు మాటిమాటికి తన కపజయమును పాండవులకు విజయమును నుగ్గడించు మిక్కిలి బలవంతులైన సేనాపతులను పెట్టుకొని యుద్ధమునకు దిగిన దుర్యోధనుడు తనను దాను పురికొలుపుకొనక పోయినచో నెట్లుసాగును ?

అట్లే తరువాత శల్యుని సేనానాయకుడుగా చేసికొని పాండవులతో పోరాడ గలిగినంత పోరాడినాడు. శల్యుడు మరణించినాడు. అపుడు దుర్యోధనుడు ద్వైపాయనహ్రదమున దాగికొనపోవుచు, సంజయుని మూపుపైఁ జేయిడి ఇట్లనినాడు.

ఇమ్మడువులోన డాగెద
నిమ్ముల నెచ్చటికి నైన నేఁగెద తగు వృ
త్తమ్మునఁ దొలగి నిలిచి మఱి
యెమ్మెయి నేనియును దీర్తు నేఁ బగ-[3]

1. భా. శల్య. 1-63.
2. భా. శల్య. 1-69.
3. భా. శల్య. 2-15.

మరియు తానిట్లనినట్లు ధృతరాష్ట్రునితో చెప్పుమనినాడు. కృపాచార్యాది రథిక త్రయము తప్పమరియొకడు తన పక్షమున బ్రతికిలేడు తానిక పాండవులను జయింపగలనన్న ఆశ తనకులేదు అట్టి సమయమునకూడ ధర్మరాజునకు రాజ్య మిచ్చుటను తలపక, ఎట్లయినను వారిని రేపట మాపట హతమార్ప వలయునన్న నిశ్చయమును వెలిబుచ్చుచున్న దుర్యోధనుని పాపబుద్ధి యందలి కృతనిశ్చ యత్వమెంత బలవతియో ఊహాకందుటలేదు. తా నా హ్రదమున దాగికొన్న తరువాత వచ్చిమాటాడిన కృప కృతవ ర్మాశ్వత్థామలతోకూడ దుర్యోధనుడట్లే యనినాడు. "తొలంగి నేఁటి మాత్ర నిలువుదు. ఎల్లి పైకొని యరాతుల గెల్తము"

తరువాత ధర్మరాజాదులు దుర్యోధను డా హ్రదమున దాగి యుండుట నెరిగి వచ్చినారు. ధర్మజు డాడిన మానము నుచ్చిపోవు మాటలకు తట్టుకొనలేక దుర్యోధనుడు భీమునితో కలియబడి గదాయుద్ధము చేయుటకు వెలికి వచ్చినాడు ఆ యుద్ధమున భీమునిచేతిలో నేలకొరిగినాడు అప్పటికిని వానికి తనయందు తనకొక తృప్తియున్నది

చదివితినెల్ల వేదములు జన్నము లొప్పగఁ జేసితిన్ రమా
స్పదమగు వృత్తిఁ బొల్చి నరపాలకు లెల్లను గొల్వఁ గంటి దు
ర్మదరిపుగాఢగర్వపరిమర్దనకేళి యొనర్చితిం దగం
దుది నని మిత్రబాంధవులతోఁ ద్రిదివంబునకేఁగు టొప్పదే [1]

తొడలువిరిగి నేలబడిన దుర్యోధనుడు శ్రీకృష్ణునితో నన్నమాటలవి మరియు తరువాత సంజయుడురా వానితో నిట్లనినాడు

పగవారి నాశ్రయింపక
మగఁటిమియును బ్రాభవంబు మానము నెందుం
బొగడొంద నుల్లసిల్లితిఁ
దెగునంతకు లక్ష్మితోఁ బ్రదీప్తుడనైతిన్ [2]

ఆ రాత్రికి యశ్వత్థామ పాండవశిబిరముల మీదికి పోవుటకు ముందు కృపకృత వర్మలతో వచ్చి దుర్యోధనుని జూచి విలపించినాడు. అపుడు దుర్యోధనుడు

1. భా. శల్య. 2-329.
2 భా. శల్య. 2-391.

వారితో నాడిన మాటలు వాని మహానుభావత్వమునకు నిదర్శనములు. తాని ట్లయితినన్న దైన్యముగాని, తనతల్లిదండ్రులను గూర్చిన విచారముగాని వాని మాటలలోలేదు. నిర్వికారుడుగా నిట్లనినాడు

వినుఁడు మహానుభావుఁడగు విష్ణు నెఱింగి యెఱింగి యే మిముం
గాని వెఱపేది కాదె పగకుం దలకొంటి జయంబుగోరి మీ
రును బలశౌర్య సంపదను రూపముగాఁ బొగడొందు భంగులం
బెనగితి రేమి సేయుదురు బెట్టిదుఁడై విధి తప్ప జూచినన్ [1]

తరువాత అశ్వత్థామ దుర్యోధనుని చేత నభిషేకింపబడి పాండవశిబిరముల మీదికిపోయి ఈశ్వర ప్రేరితుడై ఉపపాండవులు మొదలుగా గలిగిన వారి నందరను నూచకోత కోసి తిరిగి దుర్యోధనుని వద్దకు వచ్చినాడు. కృప కృత వర్మలును వచ్చినారు. "పాండవులేవురును మురారియును సాత్యకియును నా బారిఁ బడరు"[2] మిగిలినవారలను మాత్రమే చంపివచ్చితినని అశ్వత్థామ చెప్పి నాడు పాండవులు బ్రతికిపోయిరే అని అశ్వత్థామకు మనస్సున కించయున్న దేమోకాని దుర్యోధనునకులేదు ఎవరున్నను ఎవరు పోయినను పట్టించుకొను స్థితిలోలేడు దుర్యోధనుడు అంత యుదాత్తుడును, నిర్వికారుడును నైపోయి నాడు. వారితో నిట్లనినాడు "మీరు కృతకృత్యులరు సుఖులరై యుండుడు. పునర్దర్శనంబు త్రిదివంబున నయ్యెడుగాక వగలుమాని పొండు"[3] ఈ విధ ముగా పలికి ప్రాణములు విడిచినాడు.

ఇవన్నియు దుర్యోధనుని మొదటినుండి చివరవరకుగల మనస్థైర్యమును మరియు దాని చెదరిపోనితనమును నిరూపించునవియే మరియు నొక చిత్ర మైన విషయమేమనగా తాను తొడలువిరిగి పడియుండి పాండవుల నుద్దేశించి సంజయునితో నిట్లనినాడు.

ఎదిరి పెనఁగఁగఁజాలక నిదురవోవ
నొంచు తెఱఁగున విషము పెట్టించు పగిది

1. భా. శల్య. 2-409.
2. భా. సౌప్తి. 1-229.
3. భా. సౌప్తి. 1-237

ఇంటఁ జిచ్చిడు చాడ్పున నిట్లు సేసి
పడయుదురు గాక రాజ్య మప్పాండుసుతులు [1]

తన ధర్మముగా నోడించి పాండవులు విజయులై నారని దుర్యోధనుడు చెప్పు చున్నాడు తన నోడించుట ఎట్లున్నదనగా నెదురుపడి యేమియు చేయుటకు చేతగాక దొంగచాటుగా పగవాడు నిద్రపోవుచున్న సమయమున చంపినట్లు, వానికి తెలియకుండ అన్నమున విషము పెట్టించి చంపినట్లు మరియు వా డజాగ్రత్తగా నింటనున్నపుడు ఇంటికినిప్పుపెట్టి చంపినట్లును నున్నదనుచున్నాడు ఆ మూడు పనులును పాండవుల విషయమున దుర్యోధను డాదిపర్వమున చేసినవి తాను చేసిన వాటినే పేర్కొని, అవి ధైర్యముచాలనివాడు చేయు పనులని, ధర్మరాజాదులు తనను తెగటార్చుట కేవలమట్లున్నదని అనుట చాల చిత్రమైన విషయము కాదామరి! దుర్యోధను డే అంతర్యముతో నట్లనినాడో స్పష్టమగుట లేదు బహుశః వాని అంతర్యమిది కావచ్చును నేను చేసిన పనులు ధర్మబద్ధములు కావని మరియు మగవాడైనవాడు చేయవలసిన పనులుగావని పాండవులందరుగాని, వారు యుద్ధముచేసిన వైఖరి మాత్రమేమంత మహాప్రశస్తముగా నున్నది? నా చేసిన పనుల వలెనే వారు చేసిన పనులును నున్నవి దేవవ్రతగురు కర్ణులను వారన్యాయము చేసియే చంపిరి నన్నును కేవలమధర్మముగనే ఇట్లు పడగొట్టిరి నాకంటె వారేమియు ధర్మాత్ములుకారు–అను విధముగా దుర్యోధనుడట్లనినాడేమో అనిపించుచున్నది. కాక తాను చేసిన పనులు ధర్మములన్న నిశ్చయము కలిగిన తరువాతి పశ్చాత్తాపమునుండి వెగిలి వచ్చిన మాటలు కావచ్చునా ?

దుర్యోధను డచంచలమైన మనోనిశ్చయము కలవాడు అనుకొన్నది పైకి చెప్పగల ధైర్యము కలవాడు అభిమాని. వాని జీవితమే చిత్రమైనది వాని జన్మించిన విషయమును నన్నయ్యగా రిట్లు చెప్పిరి. కుంతికి భీముడు పుట్టిన నాడే దుర్యోధనుడును పుట్టినాడు

అనిలజు పుట్టిన దివసము
నన యట దుర్యోధనుండు నరనుత ! ధృతరా

---

1. భా. శల్య. 2-393.

ష్టునకున్ గాంధారికి న
గ్రనందనుఁడు ఘనుఁడు పుట్టె కలియంశమునన్.[1]

ఘనుడు పుట్టినాడనుట చాల చమత్కారముగా నున్నది దుర్యోధనుడు పుట్టి నేలమీద పడగనే క్రవ్యాదారవము, శివానాదము, మదఘూక ఘూంకృతియు, నానారభసధ్వానమును-ఈ మొదలైన లోకనాశక సూచనలు కనిపించినవి దుర్యోధనుడు భీమునిచేత తొడలు విరుగగొట్టబడి నేలమీద పడి శ్రీకృష్ణునితో తాను చేసిన దేదియో చేసి సక్రమమార్గమున స్వర్గమునకు పోవుచున్నానని తృప్తిగా మాటాడుటతో "పుష్పవర్షంబులు గురిసె. దేవదుందుభులు మొరసె దిశలు తెలివొందె మృదు సమీరణంబు సుగంధియై వీతెంచె" దుర్యోధనుడు కారణజన్ముడు వాని జీవితమొక బిగిమీద నడచినది. ఉత్తరగోగ్రహణ కాలమున నర్జునుడు దుర్యోధను నుద్దేశించి ఉత్తరునితో చెప్పిన మాటలు వాని జీవ౦ంపుటిని స్పృశించుచున్నవి

ఉగ్రుడు
అనూనమానమహిమోన్నతచిత్తుఁడు
అజయ్యవిక్రమోదగ్రుఁడు
హస్తలాఘవసమన్వితుఁ డేయునెడన్
సమగ్రకోపాగ్రహబుద్ధి మా దెస
అనార్యుఁడు కార్యమునందు.[2]

## 6. పాత్రోన్మీలనము - ధర్మరాజు

అంగిరసము నాయకని చిత్తవృత్తి ననుసరించి పుష్టము కావలయును ధర్మజుని చిత్తవృత్తి లక్షణమును పట్టుకొని భారతమున శాంతము పుష్టము కావలయును. అనగా వాని విషయమున తృష్ణాక్షయరూపసుఖపరిపోషణము నిరూపింపబడవలయును. తృష్ణాక్షయమును చూపించుటకు ముందుగా తృష్ణకు ప్రవృత్తి చూపింపబడవలయును. ఈ తృష్ణయొక్క స్వరూపమేమి ? తన వశమునయున్న దానిని గాని, లేనిచో సంపాదించి కాని, అనుభవమున కగునట్లుగా

1. భా. ఆది. 5-105.
2. భా. విరా. 5-15.

చేదికొనవలయునన్న ఇచ్ఛకలిమిని తదభిముఖముగా నుద్యమించిన చిత్తవృత్తికి తృష్ణయని పేరు. ధర్మరాజు తన వశమునుండి తప్పింపబడిన సామ్రాజ్యమును సాధించుకొనుటకు పూనుకొనినాడు. ధర్మరాజుయొక్క తత్ప్రవృత్తి తృష్ణా రూపము అది క్షయముకావలయును అపుడుగాని మోక్షమున కభిముఖము కాదు. అనగా ధర్మరాజు ప్రవృత్తిపరుడుగా నున్నను వాని మనోలక్షణము మోక్షాభిముఖమై యుండుటను మానుకొనరాదు. అట్లు నిర్వహింపబడవలయును. అపుడే ఆయన శాంతరసప్రధానమైన భారతమునకు నాయకుడు కాగలడు. ప్రవృత్తినివృత్తులు ప్రక్కప్రక్కగా చూపింపబడుచు నివృత్తిరూప చిత్తవృత్తి చేత ప్రవృత్తికి క్షయము చెప్పబడవలయును అనగా ప్రధ్వంసాభావ లక్షణము మీద ధర్మరాజు పాత్ర ఉన్మీలనము కావలయును

ధ్వన్యాలోకమున నొక వాక్యమున్నది. "అంగిరస విరుద్ధానాం వ్యభిచారిణాం ప్రాచుర్యేణావివేశనం. నివేశనేవా క్షిప్రమేవ అంగిరస వ్యభిచార్యనువృత్తిః".[1] ధర్మరాజు విషయమున తృష్ణాక్షయము భారతమునకు కావలయును. ధర్మరాజు విషయమున తృష్ణచూపింపబడనిచో భారతములేదు. ఉద్యోగ పర్వమునుండి సౌప్తికపర్వమువరకు ధర్మజుని విషయమున తృష్ణారూపమైన ప్రవృత్తి లక్షణము చెప్పబడనేవలయును. అట్లని ప్రచురముగా చెప్పరాదు అది ప్రధానమునకు బాధకముగదాయని విడువరాదు ఇది చాల గడ్డయిన సమస్య. కనుక ఆనందవర్ధనులు చెప్పినట్లుగా నంగిరస విరుద్ధముగా ధర్మరాజు విషయమున నే భావ మెప్పుడు చెప్పబడినను వెంటనే దాని నెట్లయినను అంగిరసమున కనుకూలముగా పరిణమింపచేయవలయును. భారతమున ధర్మరాజు పాత్రమును పోషించుట యనగా నదియంత జాగ్రత్తతో కూడినపని

సమరసన్నాహమును గురించి వ్రాయునపుడు ధర్మజుని చిత్తవృత్తిలక్షణ మెంత జాగ్రత్తగా చమత్కారావహముగా తిక్కన్నగారిచేత నిరూపింపబడి నదో చూపించబడినది యుద్ధపుదినములలో వాని ప్రవృత్తిని ప్రధానరసము దృష్ట్యా నిర్ణయించుటలోనే కావ్యశిల్పమున్నది. యుద్ధానంతరమది యొక కష్టమైనపనికాదు ఏమనగా నప్పటి ధర్మజుని చిత్తవృత్తి శోకరూపము దాని నుండి నివృత్తిని సులభముగా పుట్టింపవచ్చును అనగా పరమమైన మోక్షధర్మ

1. ధ్వనిసారః-పుట 41.

మునందు, ఇహామునుండి తొలగించి, వాని చిత్తమును సులభముగా ప్రవేశపెట్ట వచ్చును యుద్ధపుదినములు అట్టివికావు. కేవలము తీవ్రమైన యుత్సాహాము తోడి ప్రవృత్తిలక్షణమే అపుడుండును అట్టిచోకూడ అంగిరసభావములకు ప్రసక్తి కల్పింపబడవలయును. లేనిచో తద్విరుద్ధమైన ప్రవృత్తిలక్షణమే పుష్టమై ధర్మజునియందు వీరము ప్రతీయమానము కాగలదు. కారాదు. కాకుండ తిక్కన్నగారు విరుద్ధములైన అంగరసభావలను, వెంటవెంటనే అంగిరసభావము లను ప్రయోగించుటవలన ప్రధ్వంసముచేసి శాంతరసగ్రంథమైన భారతమునకు నాయకుడైన ధర్మజుని పాత్రనొడ్డు పట్టించిరి. ఇది యుద్ధపుదినములలో విష యము అటుతరువాత సరేసరి.

సమరోద్యోగము కాలమున ధర్మరాజంతగా బయటకు పొక్కలేదు. అనగా యుద్ధమునందెంత నిశ్చయబుద్ధితోడి యుత్సాహామున్నదో, దానినంతగా వెలికి కనిపించనీయకుండ, కొండొకచో "కౌంతేయాగ్రజు డాలము పొంత పో నొల్లడ"నిపించునట్లుగా కూడ ధర్మరాజు ప్రవర్తించినాడు యుద్ధము మొద లైనప్పటినుండి ధర్మజుని యుత్సాహాము వెనుకపట్టుట చూపింపబడినది. ముఖ్య ముగా భీష్ముడు యుద్ధము చేసిన పదిదినములు. అనగా పదునెనమిది దినముల యుద్ధమున పదిదినములు ధర్మరాజు విషయమున సమరోత్సాహాము వర్ణింపబడ లేదు. మిగిలిన దినములయందనేకరకములుగా తదుత్సాము ప్రతీయమానము చేయబడినది. అదంతయు ధర్మరాజు శల్యుని సంహారించుటకు ననుకూలమైన వాతావరణము కల్పింపబడుటగా తోచుచున్నది దుర్యోధనుడు తొడలు విరుగ గొట్టబడుటతో ధర్మజుని చిత్తవృత్తి ప్రధానరసమున కభిముఖమైనదిగా చూప బడుట మొదలైనది. అనగా గూఢమైన ప్రవృత్తిపరుడుగా ధర్మరాజు యుద్ధ మునకు దిగినాడు. భీష్ముని యాటోపమునకు వెనుకాడినాడు. తరువాత చిత్ర మును తీవ్రమునునైన ప్రవృత్తిపరుడైనాడు దుర్యోధనుని పడిపోవువరకట్లే యున్నాడు. తరువాత నివృత్తిమార్గము పట్టినాడు. ఇది ధర్మజుని చిత్తవృత్తి క్రమముగా తిక్కనగారు నిరూపించిన విధము. ఇది సోదాహరణముగా వివ రింపబడినచో ధర్మరాజు పాత్రోన్మీలనము విషయము చాలవరకు చెప్పినట్లగును.

నరపతుల నెల్ల భీష్మున

కెరగా నొప్పింపఁజాల నే నడవులకున్

మరలం బోయెద నచటం
దిరిగెదఁ గూరాకుగోసి తినియెదననఘా ![1]

మొదటినాటి యుద్ధమైపోయినది. ఆ రాత్రి శ్రీకృష్ణునితో ధర్మరాజనిన మాటలవి భీష్ముని యా మొదటినాటి యాటోపమంతగా ధర్మజుని గుండెలను చెదరగొట్టినది ఇక యుద్ధము కొనసాగించుట యనగా తనపక్షమువారి నందరను భీష్మున కెరచేయుటయే యని ధర్మరాజున కనిపించినది అనిపించి శ్రీకృష్ణునితో ననుచున్నాడు- నేనడవులకు మరలపోయెద నని. యుద్ధము మానుకొని దేశమునందుండవచ్చును గదా! అడవులకు బోవుదు ననుట యేమి? ఆయనుట మాటవరుస కనుటయా? కావచ్చునుగాని కాదు ధర్మజుని బుద్ధి రెండింటియందున్నది అయినచో సామ్రాజ్యమునందు కానిచో నడవులయందు అడవులయందనగా తపోవృత్తియందన్నమాట అనగా జ్ఞానమార్గమును పట్టుకొని పరసుఖమునైనను చూచుకొనుట యన్నమాట యుద్ధము ప్రవృత్తిమార్గము. దీనివలన నిహమున రాజ్యసుఖము దక్కవలయును కాని భీష్ముని యాటోపమును చూడగా నది దక్కగలదన్నఆశ అణగారిపోవుచున్నది ఇక ఊరక రాజలనందరనేల భీష్మున కెరచేయ వలయును? అందువలన యుద్ధము విరమించుకొనుటయు, విరమించుకొని అడవులకు బోవుటయు కార్యముగా ధర్మరాజు చెప్పుచున్నాడు. మరియు తొమ్మిదవనాటిరాత్రి శ్రీకృష్ణుని వద్దకుపోయి ధర్మరాజిట్లనినాడు

మనవా రెవ్వరు నోర్వ రాతనికి దుర్మానంబునం జేసి యే
మును గార్యస్థితిగాననైతి విను నిర్మూలంబుగాఁ బోరఁ జ
చ్చిన సామ్రాజ్యము గొన్నయట్లుగునే? నిశ్చింతంబునం గాననం
బునకుం బోయెదఁ దమ్ములంగొని తపఃపూజ్యుండనై యుండెదన్ [2]

ఇంతకుముందా మొదటినాటిరాత్రి ధర్మరాజు శ్రీకృష్ణునితోనన్న మాటలయర్థ మీపద్యమున మరియు స్పష్టముగానున్నది. ఉన్నచో నిహమున సామ్రాజ్యసుఖము ననుభవింపవలయును. లేనిచో నడవులకుబోయి తపోవృత్తియందుండి పరసుఖమును చూరగొనవలయును ఆ రెండే ధర్మరాజు ధ్యేయములు. ఉద్యోగ

1 భా. భీష్మ. 2-8.
2. భా. భీష్మ. 3-278.

పర్వమునందలి ధర్మరాజు మనోలక్షణమునకును, తరువాతి ధర్మరాజు మనోలక్షణమునకును చాలభేదమున్నది ప్రధానరసమున కనుకూలములైన భావములు ధర్మరాజు విషయమున సహజసుందరములుగా యుద్ధవుదినములయందు చూపింపబడినవి భీష్ముడు యుద్ధముచేసిన పదిదినములలో మొదటినాడు మరియు తొమ్మిదవనాడు ధర్మజుని చిత్తము యుద్ధమునుండి వైదొలగి తపోవృత్తియందు ప్రవర్తించుట చూపబడుటవలన నా మధ్యగలదినములన్నియు ధర్మరాజట్టి చిత్తవృత్తితోడనే గడిపినట్లర్థమగుచున్నది అనగా దాదాపు భీష్ముడు యుద్ధముచేసినన్ని దినములును ధర్మరాజు సమరోత్సాహము వెనుకాడుచునే యున్నదన్నమాట మరియు తపోవనగమనాభిలోష కొనసాగుచునే యున్నది ఆ విధముగా యుద్ధము సగమునకుపైగా నైపోయినది

భీష్ముడు యుద్ధమునుండి వైదొలగినప్పటినుండి ధర్మజుని సమరోత్సామభివ్యక్తము కాజొచ్చినది ద్రోణుని మొదటినాటియుద్ధమున ధర్మరాజుయొక్క ఉదాత్తసన్నాహమును, గంభీరోత్సాహమును పేర్కొనబడినవి. ఈ సమరోత్సాహముయొక్క పరాంకోటిస్థితి అభిమన్యుడు యుద్ధరంగమున తన కన్నుల యెదుట శత్రువులచేత సంహరింపబడినప్పుడు ధర్మరాజాడిన మాటలలోనున్నది అభిమన్యుడు మరణించుటను చూచి పాండవబలములు ఱిచ్చవడినవి అపుడు ధర్మరాజు తనవారిని హెచ్చరించుచు నిట్లనినాడు.

మార్బలంబులు సొచ్చి మాతంగముల గూల్చి
రథరాజిఁ గలఁచి తురంగమముల
ద్రుంచి పదాతులఁ దునుమాడి పెక్కండ్రు
సైనికప్రవరుల సమయఁ జూచి
మూఁకల విరియించి వీఁక నాచార్యాది
యోధులనెల్లను నొక్కదెసకు
వెలిచి వియచ్చరుల్ వినుతింప నాకంబు
చూఱగొన్నట్టి యర్జున తనూజుఁ
జూచి మనకు నేల శోకింప ? వైరుల
గండడంచి గెలుపుగంద ముచిత

భంగిఁ బ్రొద్దుకొలఁది పరికించి మన సైన్య
ముల మరల్తి మెలమి దలకొనంగ.[1]

అభిమన్యుని మరణమును కూడ లెక్కచేయకుండ తత్కాలమునందంతగా నుత్సాహమును జూపుట పరమమైన ధీరోదాత్తలక్షణము. యుద్ధమానాటికి విరమించుకొని శిబిరములకు బోయిన తరువాత ధర్మరాజు దుఃఖము పట్టరానిదిగా వెలికివచ్చుట అదివేరువిషయము. పురుషుని గొప్పతనమంతయు ననుభవదూరుడై యుండుటలోలేదు. కొన్నికొన్నిసమయములయం దనివార్యముగా వెలికిరావలసిన సుఖదుఃఖరూపమైన అనుభవమును వెలికిరానియ్యక పోవుటలో నున్నది. కొడుకు మరణించినాడనగా శోక మభివ్యక్తము కావలయును. యుద్ధరంగమైనను నగుటయేసాధారణము కాకుండ నణచుకొనుటయే ధీరోదాత్తత. ఆ యణచుకొను ప్రయత్నమే అంత దీర్ఘముగా సైన్యమును ధర్మరాజు హెచ్చరించుట. అదియొక విధముగా తనను తా నుత్సాహపరచుకొనుట భారతయుద్ధమున మరియొకనా డెప్పుడుగాని ధర్మరాజంతగా సైన్యమును హెచ్చరించి మాటాడినట్లు తిక్కన్నగారు వ్రాయలేదు

పై పద్యమువ్రాసి తిక్కన్నగారు ధర్మజుని అవిషాదత్వమును నిరూపించిరి. అవిషాదత్వము వీరుని లక్షణము. తత్కాలమున ధర్మరాజు వీరుడుగా చూపబడినాడన్నమాట. కాని ధర్మరాజు వీరరస నాయకుడు కాదు కనుక వెంటనే అ రాత్రికి శిబిరములయందు ధర్మరాజు విషయమున విషాదము నిరూపింపబడినది. అది వీరమునకు విరోధి. అందువలన పూర్వపు వీరభావము ప్రధ్వంసముచేయబడినది. శోకము నివృత్తి కనుకూలమైన భావము. అనగా శాంతరసమున కనుగుణమైన భావము ప్రవర్తింపజేయబడినది. తృష్ణాక్షయరూపచిత్తవృత్తి వెలికితీసికొనిరాబడినది.

బాలుఁడు సుకుమారుడు పె
క్కాలములం జొచ్చి యెఱుఁగ డనక మొన సొరం
జాలుదు చొరుమని పనిచితి
నేలా నన్నాస దోస మెఱుఁగగనిచ్చున్.[2]

1. భా. ద్రోణ. 2-136.
2. భా. ద్రోణ. 2-141.

ఇది ధర్మరాజు శోకించిన విధము ఆశాదోషము వాని బుద్ధిని తాడితము చేసినది. అది తృష్ణాక్షయరూపచిత్తవృత్తి లక్షణము.

ద్రోణవ నాడు ధర్మజుని చిత్తము విజయము చేకొనుటయం దెంతగా ప్రవర్తించినదో, అసత్యదోషమున కంతగా భయపడినట్లు తిక్కన్నగారు చిత్రముగా నిరూపించిరి

అనృత భయము నాజి జయముఁ
గొనియెడు తమకంబు పెంపు గుదియింపఁగ బాం
డునరేంద్రు నగ్రతనయుం
డనుమానము వాయఁబెట్టి యస్త్రగురునితోన్.[1]

అశ్వత్థామ చనిపోయినాడని ధర్మరాజు చెప్పవలయును నిజమున కశ్వత్థామ చచ్చిపోలేదు భీముని మాటను నమ్మక ద్రోణుడు తన కుమారుడు చచ్చినదియు, బ్రతికియున్నదనియు కలరూపు చెప్పుమని ధర్మరాజు నడిగినాడు. ధర్మరాజనగా ననృతమాడనివాడు. ఆయన అబద్ధమాడడని దుర్యోధనునకు తెలియును. ఉత్తరగోగ్రహణకాలమున, పాండవుల అజ్ఞాతవాససంవత్సరము పూర్తియైన తరువాతనే అర్జునుడు కనిపించినాడని భీష్ముడు చెప్పిన దానిమీద నమ్మకములేక, ధర్మతనయు డసత్యమున కియ్యకొనమి యెఱిగియె కదా ఆ విషయము తెలియ చెప్పుమని దుర్యోధనుడు దూతను పంపించి అడిగించినది! భీష్ముడు పాండవ పక్షపాతమున నబద్ధమాడినాడనవచ్చును ధర్మరాజట్టివాడు కాడు. ఇది దుర్యోధనుని యూహ చిత్రముగా నున్నది. దుర్యోధనునికంటె విరోధి ధర్మరాజున కుండడు అట్టి దుర్యోధనునకు ధర్మరాజుయొక్క అనృత మాడని తనము నందంతటి గౌరవము-నమ్మకము. ధర్మరాజనగా నట్టివాడు. పరమశత్రువుచేత నట్లు భావింపబడు ధర్మజుని సత్యనిష్ఠ కవధి ఊహింపవలసి యున్నది. అట్టి లోకోత్తరమైన సత్యవ్రతమును పాలించు ధర్మరాజు ద్రోణుని జయించుట కనృత మాడవలసివచ్చినది అబద్ధమాడనివాడని ద్రోణుడు ధర్మజుని అశ్వత్థామ విషయ మడిగినాడు. ధర్మరాజబద్ధమాడినాడు యుద్ధమున విజయమును సాధింపవలయు నన్న తమకముయొక్క ఆధిక్యమువలన నబద్ధ మాడినాడు. తమకమనగా లుబ్ధత. లుబ్ధతయనగా తెగని యాశ. ధర్మజునకు

1. భా. ద్రోణ. 5-314.

నాజివిజయమునందు తెగని యాశారూప చిత్తవృత్తి యున్నది అట్టి చిత్త వృత్తి మరొకదానిని చూడనీయదు. తమకమునకు తొందరపాటనికూడ యర్థము న్నది. తొందరపాటనగా నేమి ? ఒకదాని యందు పర్యాప్తమైన ఆలోచనచేత స్థిరపడని చిత్తవృత్తితోడి ప్రవృత్తి. ఏవంవిధమైన ధర్మజుని చిత్తము విజయ మును సాధించుటయందే లగ్నమై, అనృత మధర్మమని ఆలోచించలేదు. ఏల అట్టి ఆలోచనరాలేదు ? వచ్చినది. కాని విజయమునందలి తమకము యొక్క పెంపు అనృతమువలని భయమును కుదించినది అనగా ననృతమన్నచో నంతకు పూర్వమెప్పుడును కలిగెడు భయ మానాడు ధర్మజుని చిత్తమునందు కలుగ లేదు అనాడు విజయము గొనవలయునన్న ఆశ ధర్మజు నందెంతగా పెరిగిన దనగా వాని పరమవ్రతమైన సత్యవాఙ్నిష్ఠ నణగద్రొక్కి పెరిగినది. ధర్మజుని సమరోత్సాహ మట్టిది.

ధర్మజుని యందనృతభయము కుదింపబడినది. అనగా తగ్గించబడినది. తగ్గించబడినదేగాని అసలు లేకపోలేదు ఆ యున్న భయమువలననే ధర్మ రాజు చిత్రముగా ద్రోణునకు సమాధానము చెప్పినాడు. ఆ చెప్పిన విధమును తిక్కన్నగారిట్లు వ్రాసిరి

> వలయు కొలఁది నెలుంగెత్తి వర్ణసమితి
> యచ్చుపడఁగ నశ్వత్థామ సచ్చె ననియె
> అని పదంపడి యల్లన యతని చెవికి
> వినఁగరాకుండఁ గుంజర మనియె—.[1]

అసత్యవచనదోషము ప్రాణరక్షణ సమయమున లేదనియు, ద్రోణుడు పడిన గాని మన ప్రాణములు దక్కవనియు భీముడును శ్రీకృష్ణుడును ధర్మరాజునకు తఱిమి తఱిమి చెప్పినారు. ధర్మరా జబద్ధమాడుటకు వెనుకాడుచున్నందున భీముడు అశ్వత్థామ యన్న పేరుగల మాళవేంద్రుని యేనుగు నిజముగా చచ్చి పోయినదనియు, అందువలన నశ్వత్థామ సచ్చెనన్నచో నటు ద్రోణనందనున కును, ఇటు ఏనుగునకును తాకివచ్చి నిజమాడినట్లే అయి కార్యము సాధింప బడినట్లగునన్న ధోరణిలో మాటాడినాడు. అంతేగాని పెద్దగా నశ్వత్థామ సచ్చె నని నెమ్మదిగా కుంజరమనుమని ధర్మరాజున కెవరును చెప్పలేదు. అది కేవలము ధర్మరాజు బుద్ధిచేసిన పని. కుదింపబడి లోపలనున్న అనృత భయమట్లు చేయించి

1. భా. ద్రోణ. 5-316.

ములు. వృత్తములలో చంప కోత్పల మత్తేభ శార్దూలములు నాలుగుమాత్రమే తెనుగున విరివిగా వాడుకయం దున్నవి. జాతిపద్యములలో ప్రధానముగా కందము, తరువాత మంజరీద్విపద, ఉత్సాహ, తరువోజ, మధ్యాక్కర మొదలైనవియు – ఉపజాతులలో సీసము, గీతము, ఆటవెలది అను నీ మూడును వాడుకలో నున్నవి. పదివందల సంవత్సరములనుండి తెనుగుకవిత్వ మా నాలుగు వృత్తములను, నాల్గయిదు జాత్యుపజాతి పద్యములను పట్టుకొని నిలువబడి యున్నది. ఈ మాట స్రగ్ధరాది వృత్తములయొక్కగాని, రగడలు మొదలైన జాతిపద్యములయొక్క గాని తెనుగునందలి యుపయోగమును గుర్తించనిది కాదు.

కవిత్వము హృదయసంవాది యగుటకు ఛందస్సును తగినంతిగా సహాయ పడుచున్నది. ఛందస్సనగా పద్యముయొక్క గతి విధానము. క్షేమేంద్రుడు సువృత్తతిలకమున సాంస్కృతికములైన వృత్తములలో కొన్నింటియొక్క వినియోగమును నిష్కర్షించిపెట్టు ప్రయత్నము చేసెను. పూర్వకవులు వ్రాసిన వృత్తములయందలి లక్షణములను పురస్కరించుకొనియే ఆయన ఆ పని చేసినను, అది సర్వధా సర్వత్ర వ్యాపనశీలమైన సిద్ధాంతముగా కనిపించుటలేదు. వృత్తములు గణముల మీద నిర్మింపబడినవి గనుక నా యా గణములవలన పద్యములలో వచ్చు భేదము లేకపోయినను, పరుషసరళాది, ద్విత్వసంయుక్తాది భేదములతో నున్న వర్ణములయొక్క కూర్పువలన శ్రవణేంద్రియమున కనుభవమునకు వచ్చు గతిభేదము పద్యములయం దనివార్యము. ఛందస్సుయొక్క సూక్ష్మరూపము వర్ణన మని చెప్పుటలోని ఆంతర్య మిదియే. అందువలన ఫలానా వృత్తము ఫలానా విషయమునకు వ్యంజకముగనుక, ఆ వృత్త మా విషయముననే వినియోగింప బడవలయు నని గాని, ఇంతకుపూర్వ మట్లే ఆ వృత్తము వినియోగింపబడినదని కాని సిద్ధాంతముచేయుటకు వీలులేదు. కవియొక్క సామర్థ్యము ననుసరించి వర్ణమాదిగా ప్రతిదియు విశిష్టార్థస్ఫోరకముగా రూపొందగలదు. తత్తత్ప్రకరణములను బట్టి, తత్తత్సంఘటనావిశేషములను పురస్కరించుకొని, సహృదయులు విశేషార్థమును భావించుట కుపకరించు బహువిషయములలో ఛందోగతి యొకటి. ఛందము శబ్దము నాశ్రయించియున్నది. శబ్దములు వర్ణములవలన నైనవి. కనుక వర్ణములయొక్క సంయోజన వైలక్షణ్యమును బట్టి పద్యయొక్క నడక యున్నది. గణములను బట్టి లేదు. స్థూలముగా నున్నట్లు కని

పిండ మెడలిపోయినఁ బిదప దిగంబడ
దయ్యె. నింత పుట్ట దట్టులైన [1]

నీవు పురుషుడవై కుంతీదేవి కడుపున పడకుండవలసినది. ఒకవేళ కడుపున పడి నను తరువాత పిండము జారిపోయి యుండవలసినది. అట్లయియున్నచో నిపు డిట్లయ్యెడిదికాదు. ధర్మరాజన్న మూడు వాక్యములివ్వి—ఇవు డేమైనది ? కర్ణుని చేతిలో తాను దెబ్బలు తినినాడు. కర్ణుడింకను బ్రతికియున్నాడు. కర్ణుని చంప కుండ నర్జునుడున్నాడు. ఇది యిపుడైనది. అర్జునుడు పుట్టియుండకపోయినచో నా స్థితి వచ్చియుండెడిది కాదని ధర్మరాజనుచున్నాడు. అనగా కర్ణునిప్రసక్తి తనకుండెడిదికాదు దుర్యోధనునితో విరోధమే యుండెడిదికాదు. అర్జునుడుం డుటవలన కర్ణునిచంపుదునని అనుటవలన తాను యుద్ధమునకు దిగినాడు. ధర్మ రాజు తానట్లు కర్ణుని చేతిలో నా డట్లవమానింపబడి శిబిరముల కేలపారిపోయి వచ్చినాడనగా నర్జునుడు వానిని చంపునుగదా యను నమ్మకముతో వచ్చి నాడు. కాని యర్జునుడు కర్ణుని సంహరింపకుండ వచ్చినాడు. కర్ణుని మరణ రూపమున నాటికి విజయమును సాధించవలయు ననుకొనుచున్న ధర్మజుని ఉత్సాహము అర్జునుడామాట చెప్పుటతో నధఃపతనమైనది అందువలన తదుత్సా హము క్రోధముగా మారినది. సాధారణముగా ధర్మరాజునకు కోపమురాదు. వచ్చినచో నది యంత తీవ్రముగానుండును. ఉద్యోగపర్వమున సంజయుని మాటల కొకసారి ధర్మజునకు కోపము వచ్చినది. కర్ణుని జన్మము విషయము చెప్పక దాచి అంత యుద్ధము కల్పించి తనచేత సర్వబంధునాశనము చేయించిన దని శాంతిపర్వమున కుంతిమీద కోపము వచ్చినది ఆ కోపమున స్త్రీ జనము నంతకు కలిపి యొక శాపము పెట్టినాడు కుంతివిషయమున వచ్చిన కోపము శోకతీవ్రతనుండి వచ్చిన కోపము దీనిని వదలినచో సంజయుని మీద వచ్చిన కోపమును, అర్జునుని మీద వచ్చిన కోపమును రెండును ధర్మజుని సమరోత్సా మును చుట్టుకొన్నవియే. భారతము మొత్తముమీద ధర్మరాజునకు కోపము వచ్చిన దీ మూడు సందర్భములయందే.

కర్ణుడసలు కిరీటచేత చంపబడినాడా ? ధర్మరాజు కోపముచేత చంపబడి నాడా ? ధర్మజుని క్రోధమే కర్ణుని సంహరించినట్లు కనిపించుచున్నది. ధర్మజు

1. భా. కర్ణ. 3-66.

డంతటి తీవ్రక్రోధమును వెలిగ్రక్కినాడు గనుకనే అర్జునుడు "ఎల్లభంగుల నేడు రాధం బుత్రరహితం జేసెద గాదేని గొంతిద్దైన యట్టిద యగుంగాక"[1] అని తెగించిపోయి కర్ణునెదుర్కొనినాడు అంతగా నర్జునుడు తెగించి విజృంభించినాడు గనుక నే కర్ణుడానాడు సంహరింపబడినాడు. కర్ణసంహారానంతరము తిరిగి వచ్చిన శ్రీకృష్ణుడు ధర్మరాజుతో మాటాడినమాట లీ పైయూహ కనుకూలముగా నున్నవి శ్రీకృష్ణు డిట్లనినాడు.

భువనము లన్నియు నొక్కట
గవిసియు కర్ణు పరిమార్పగా నోపునె భూ
ధవ! భవదీయ క్రోధా
గ్ని విహతుడై క్రాగె గాక నిక్కంబరయన్.[2]

ధర్మజుని సమరోత్సాహము క్రోధరూపమున పరిణమించి అర్జునుని ముఖముగా కర్ణుని సంహరించినది

శల్యసంహారమునకు పూనుకొనిన ధర్మరాజు తన తమ్ములను దొరలను చేరబిలిచి యిట్లు చెప్పినాడు.

"............................................. ఏను శత్రుసై
న్యమథనకల్యు శల్యు తెగటార్చెద. నాకిది కృత్య మీ సము
ద్యమ మనివార్యమై నెగడునట్టి తెఱంగు వినుండు చెప్పెదన్.[3]

శల్యుడు శత్రుసైన్యమథనకల్యుడు. వానిని ధర్మరాజు తెగటార్పబోవుచున్నాడు అది తన కృత్యము. అదియొక సముద్యమము అది వారింపబడక కొనసాగవలయును. అందుకు తగిన మార్గమిది యని ధర్మరాజు తనవారితో చెప్పినాడు. శల్యసంహారము జరిగినచో నిక దుర్యోధనునకు సేనాపతికాదగినవాడు లేడు. దుర్యోధనుడు యుద్ధము నిక సాగించలేడు. అపుడు తనకు విజయము. ఇదంతయు ధర్మజుని సమరోత్సాహము లక్షణము శల్యుని వధించు సమయమునకు ధర్మజుని చిత్తము భగవంతునియందలి భక్తితాత్పర్యమున ప్రవృత్తి కలది

1. భా. కర్ణ. 3-96.
2. భా. కర్ణ. 3-387.
3. భా. శల్య. 1-284.

యైనది. భగవద్భక్తి యుద్ధవీరమునకు సంబంధించినదికాదు అది శాంతమున కనుకూలమైన భావము అనగా ధర్మజుని చిత్తము శాంతరసానుకూలమైన భావమున ప్రవర్తించినదగుచు సమరవిజయము నుపలక్షించుచున్నదగుచున్నది. భగవంతుడైన హృషీకేశుని చిత్తమున నిలిపి ధర్మరా జిట్లు ప్రార్థించినాడు

నీ దెస నాదు చిత్తమున నెక్కొనియుండెడు భక్తి భద్రసం
పాదిని గావుటచ్చెరువె? భక్తజనాభిమతప్రదాన వి
ద్యాదయితత్వమేర్పడ జయం బొడగూర్పుము దేవ సంశ్రితాం
హోదళనంబు నీకు వ్రత ముల్లము నా పయి నిల్పు మిత్తఱిన్ [1]

ఏవం విధమైన భక్తిభావముతో సముత్సుకుడై ధర్మరాజు శల్యుని సంహరించినాడు

దుర్యోధనుడు ద్వైపాయనహ్రదమున నొక క్షుద్రవిద్యవలన జలము లను శరీరము సోకకుండునట్లుగా జేసికొని దాగియున్నాడన్న విషయమును తెలిసికొని ధర్మరా జచటకు బయలుదేరిపోవుటను తిక్కన్నగారిట్లు వ్రాసిరి.

తురగఖురపుట రథనేమి కరిపదాతి
ఘటనంబుల నేల గ్రక్కదల శంఖ
ప్రణవ నిస్సాణకాహళ రణన మెల్ల
దెసలఁ బరగంగ వచ్చె నద్దెసకు నధిప [2]

ధర్మజుని సమరోత్సాహ మింకెట్లు వర్ణింపబడవలయును? అనిలసుతుని వేటకాఱులా దుర్యోధనుని విషయమాచూకి చెప్పుటయే ఆలస్యముగా బయలుదేరినాడు ధర్మరాజు ఉద్దామగమనమున బయలుదేరినాడట ఉద్దాముని యొక్క గమన విశేషముతో బయలుదేరినాడని యర్థము ఉద్దాముడనగా భయమును కలిగించువాడు మరియు గర్వగంభీరుడు దుర్యోధనుడు పారిపోయి నీళ్ళలో దాగి కొనినాడని తెలిసికొన్న ధర్మరా జేతాదృశగుణగణ గరిష్ఠుడుగానై బయలు దేరినాడని యర్థము నిస్సహాయుడైన పరమశత్రువు మీద కట్టివాడు బయలు

1. భా. శల్య. 1-275.
2. భా. శల్య. 2-42.

వెడలుట ఎంతగా పట్టపగ్గములు లేకుండునో తిక్కన్నగా రా పద్యమున నర్థము చేత మాత్రమే కాకుండ, పద్యమును నడిపించుటచేత కూడ స్పష్టము చేసినారు ఆ ధర్మజుని రాకను గుర్తించిన కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనునితో "ధరణీనాయక ! పాండుపుత్రులు సముద్దామోద్ధతిన్ వీరె వచ్చిరి[1]...." అని చెప్పినారు. మహారథులైన కృపకృతవర్మాశ్వత్థామలకే ధర్మజుని యావచ్చు కలకలము విన్నమాత్రమున నది ఉద్దామోద్ధతి యనిపించినది ఉద్దామగమన మున బయలుదేరిన ధర్మరాజు దుర్యోధనుని సమీపించువరకు మరియు నుద్ధతుడై నాడన్నది వ్యంగ్యమర్యాదయా తెలియుచున్నది. ఉద్ధతియనగా గట్టిదెబ్బ యని యర్థమున్నది ఉద్ధతుడన్నపుడు గట్టిదెబ్బ కొట్టగలవాడని చెప్పవచ్చు నేమో ? అట్లు వచ్చిన ధర్మరాజు దుర్యోధనుని యభిమానము మీద లాగి కొట్టినదే కదా వానిని నీళ్ళలోనుండి వెలికిరాలాగినది ?

ధర్మరాజు దుర్యోధనునితో మాటాడిన తీరు చూడగా మొదటినుండియు బాహాటముగా యుద్ధమునందు నిశ్చయబుద్ధి కలిగి, పాండవులతో వైరమును పెంచుకొన్న దుర్యోధనునికంటె, ధర్మరాజే ప్రబలమైన నిశ్చయబుద్ధి కలవాడు గను, వైరము కలవాడుగను కనిపించుచున్నాడు. ధర్మరాజు దుర్యోధనునితో నిట్లనినాడు.

భయముం బాయఁగఁద్రోచి వీరగుణముం బాటించి సంగ్రామని
శ్చయ బుద్ధిం దలకొల్పి పౌరుషము మైఁ జావొండె గెల్పొండెఁ గా
క యధీరత్వము నాకు నీడె యని వీకంజేర్చి వేతాకు మెం
తయుఁ బేర ద్యోదు రమ్ము లెమ్ము దిగినన్ దైన్యమ్ము వచ్చుంజుమీ.[2]

ధర్మరాజు దుర్యోధనుని ప్రబోధించుచున్నను మరొక ప్రక్క మే మెట్లు విక్ర మించుచున్నామో నీవు చచ్చియైనను వీరుడవై యుద్ధమునకు నాయితము గమ్మని చూపి చెప్పుచున్నట్లున్న వీ ధర్మజుని మాటలు. అంతకుముందు ధర్మరా జింకొక మాటకూడ యనినాడు.

అంభోగర్భము సొచ్చి పాండుసుత బాహాగర్వ దుర్వారసం
రంభం బోర్వక డాఁగియుండె నటె రారా జిస్సిరో-చచ్చుచో

1. భా. శల్య. 2-44.
2. భా. శల్య. 2-61.

గాంభీర్యంబును ధైర్యమున్ విడిచి దోర్గర్వంబు బెండయ్యెనే
శుంభన్మానము దూలెఁగా కని జనస్తోమంబు నిందింపదే-[1]

దుర్యోధనుని నిందించుచు పాండుసుతుల బాహాగర్వము యొక్క దుర్వార మైన సంరంభము తరువాత జనములచేత పేర్కొనబడునని ధర్మరాజు తాత్పర్య ముగా తెలియవచ్చుచున్నది. జనముచేత చెప్పుకొనబడునది పాండవుల సమరో త్సాహమేకదా! పాండవులనగా ధర్మరాజనియే యర్థము అందువలననే దుర్యోధనునిమించి ధర్మజుని రణోత్సాహము కనిపించుచున్నదనుట. ఇందుకు ఉపబలకముగా మరియొక ఉదాహరణము చూపబడును దుర్యోధనుడు నీళ్ళలో నుండియే ధర్మరాజుతో నాకిక యుద్ధమక్కరలేదు- ఈ రాజ్యము నీ కిచ్చితిని- తీసికొనుము-నేనడవులకు బోయి తపస్సు చేసికొందును-అనినాడు ఆ మాటకు ధర్మరాజు ప్రతిగా నిట్లనినాడు

నాకు ధర యిచ్చితేనియును
నిను పోరిగొనకే విడువ.[2]

నా రాజ్యము నాకు నీవిచ్చినను నిన్నుమాత్రము చంపకుండ ప్రాణముతో పోనీయనని ధర్మరాజనుటకంటె వాని విషయమున సమరోత్సాహమును చూపు టకు మరొక ఉదాహరణమేమి కావలయును ?

భీమునిచేత దుర్యోధనుని పడగొట్టించిన తరువాతి క్షణమునుండి ధర్మ జుని సమరోత్సాహ ముపశమించినది ఉపశమించుటతోపాటు శోకరూపచిత్త వృత్తి బయలు దేరినది దీనిచేత పూర్వపు చిత్తవృత్తి పిహితమైపోయినది. ఇక బంధుభావము-ధర్మచింతన-ఇత్యాదు లుబికివచ్చినవి. దుర్యోధనుని నేలమీద పడిన వానిని వామపాదమున భీముడు శిరమును తన్నినాడు. మరియు వెనుకటి దుర్యోధనుడు చేసిన ఎగ్గుల నుగ్గడించి నిందించుచు వాని శిరమును కాల దన్ని నాడు. అపుడు ధర్మరాజు విషయమును తిక్కన్నగారిట్లు వ్రాసిరి.

"మును దన్నుట నెమ్మన మెరియు తదగ్రజుం డమర్షముతోడ హర్షావేశ లఘుచారిత్రుండగు నమ్మారుత పుత్రున కిట్లనియె.

---

1. భా. శల్య. 2-58.
2. భా. శల్య. 2-76.

తల యదియేల తన్నెద వధర్మమునొందుట కాత్మరోయఁగా
వలవదె రాజరాజనుఁడవర్గముఁ దక్కిన బంధుకోటియుం
గల పరివారముం దెగిన గౌరవమొందగఁ బోరి సంగర
స్థలమునఁ బడ్డ నీతులవ చందముచేత జనంబు మెచ్చునే ?[1]''

మొదటిసారి భీముడు దుర్యోధనుని తల దన్నినపుడే ధర్మజుని మనస్సు కలక్కుమన్నది అయినను భీమునపుడు వారించుచు నిందింపలేదు రెండవసారి నిందించినపుడు నిందించుచు మాటాడినాడు. దీని రహస్యమేమి ? ఇట్లు కావచ్చును దుర్యోధనునియందు ధర్మరాజునకు విపరీతమైన ఆగ్రహమున్నది ఎట్లును వానిని చంపక విడువరాదను పట్టుదల యొకటియున్నది ధర్మరాజట్టి బిగిమీద మన్నపుడు భీముడు దుర్యోధనుని తొడలు విరుగగొట్టి శిరము దన్నినాడు భీముడుద్రేకము నాపుకొనలేక ఆ పని చేసినాడు లెమ్మని ధర్మరాజనుకొనినాడు. మరియు ధర్మజుని చిత్తమప్పటికి సమరోత్సాహమునుండి వైదొలగి ప్రసన్నము కాలేదు. బంధుభావము చిత్తమునార్ద్రము చేయలేదు అందువలన మొదటిసారి భీముడు తన్నినపుడు కొద్దిగా మనస్సు చివుక్కుమనినది గాని ధర్మరాజేమియు మాటాడలేదు. మరల రెండవసారి భీముడట్లు చేయునప్పటికి ధర్మజుని చిత్తము తేరుకొనినది అపుడమర్షవతియైనది. అమర్షమనగా కోపమని సామాన్యార్థము. భీముడు చేసినదానికి ధర్మజునకు కోపము వచ్చినదని చెప్పవచ్చును. నమర్షణ మమర్షః మృషసహనే-ఓర్చుకొనలేని తన మమర్షము. మొదటిసారి భీముడు తన్నినపుడు ధర్మజుని మన స్సెరిసినది. అట్లు నెమ్మవ మెరియుటను ధర్మరాజు భీముడు రెండవసారి తన్నుటతో నోర్చుకొనలేనివాడయినాడు. ఎరియుట యనగా మండుట మొదటిసారి భీముడుచేసిన యా పనికే మనస్సు భగ్గుమన్నది. అనగా నగ్నిసోకినట్లయినది ఆ యగ్నిసోకువంటి బాధనపుడోర్చికొనినాడు గాని రెండవసారి భీముడు చేయుటతో నోర్చుకొనలేకపోయినాడు అపుడు తలయది యేల తన్నెద వధర్మమను నీ మొదలైన మాటలతో భీముని మందలించినాడు ఇక ధర్మజునిబుద్ధి ధర్మనిరతియందు-బంధుభావమునందు ప్రవర్తించుట మొదలైనది. అట్లుపడియున్న దుర్యోధనుని చూచి బాష్పాకుల లోచనుడై ధర్మజుడిట్లు దుఃఖించినట్లుగా తిక్కన్నగారు వ్రాసిరి.

1. భా. శల్య. 286-288.

విధి ప్రతికూలుఁడై వేరంబు పుట్టించి
మాకు నీవును మేము నీకు నలిగి
ఇతరేతర ద్రోహమతిఁ దెగి యింతలు
సేయుట గావించె నీ యధర్మ
పరతయు లోభంబు బాల్యంబు మదమును
నిన్ను నింతకుఁ దెచ్చె నీ కతమున
నాకు బాంధవులకు నాశంబు వాటిల్లె
ధృతరాష్ట్ర కోడండ్రు తీవ్రశోక

కారి యయిన వైధవ్యంబు కారణముగ
నన్ను నిందింతు రను వచనములు మొదలు
గాఁగ బహువిలాపంబులఁ గరుణ మావ
హిల్ల దురపిల్లె నుల్లంబు తల్లడిల్ల.[1]

ఈ విధముగా దుర్యోధనుని పతనానంతరము ధర్మజుని చిత్తము దైన్యమున కును ప్రబలమైన శోకమునకును నాస్పదమైనది. దుర్యోధనుని భంగపాటును జూచి పాండవులలో దుఃఖించినది ధర్మరాజొక్కడే మరి యెవ్వరుగాని కంట తడిపెట్టలేదు. దుర్యోధనుని విషయమున నీ దుఃఖించుటయే ధర్మరాజుయొక్క నిర్వేదమునకు ప్రారంభము.

యుద్ధము మొదలగుటకు మునుపు సన్నాహసందర్భమున ధర్మజుని యుద్ధమునందలి ప్రవృత్తి చాలవరకు గూఢముగా చూపింపబడినది. భీష్ముని పతనము వరకు వాని యుత్సాహము వెనుకపట్టుట చూపింపబడినది. ఆ తరు వాత తదుత్సాహము రెండు మూడు మార్గముల చూపింపబడి మరియు నంగి రనమునకు లోబడియుండుట నిరూపింపబడినది. దుర్యోధనుడు పడిపోయి నప్పటినుండి అంగిరసానుకూలమైన భావములే వాని విషయమున చెప్ప బడినవి

మొదట రణోత్సాహము ధర్మరాజునకు కలిగించినది దుర్యోధనుడు. చివ రకు నిర్వేదము పుట్టించినది దుర్యోధనుడు. తన లోభబుద్ధిచేత, అపాండవము

---

1, భా. శల్య. 2-291.

చేసి సమస్తరాజ్యము తానే ఏలుటకుగాను చేసిన చేయగూడని సర్వప్రయత్నములచేత దుర్యోధనుడు ధర్మజునకు సమరోత్సాహము కలిగించినాడు. తమ్ములు-బంధువులు-మిత్రులు-అందరను యుద్ధరంగమునకు బలిచేసి, నిస్సహాయుడై కేవల మభిమానమును పట్టుకొని ప్రాణములను లెక్కచేయక భీమునితో పోరుటకు వచ్చి, అధర్మయుద్ధమున వాని తొడలు విరగగొట్టబడుటచేత మరియు నధర్మముగా వాని వామపాదముచే శిరము తన్నబడిన వాడగుటచేత, ధర్మరాజునకు నిర్వేదము పుట్టించినాడు ఏ యుద్ధమెవడు కారణముగా ధర్మరాజు చేయవలసి వచ్చినదో, ఆ యుద్ధమువలని ఫలానుభవమును ధర్మజునకు వాని నుండియే సంప్రాప్తమగుట విచిత్రమైన విషయము. భారతయుద్ధమువలని ఫలము రాజ్యభోగానుభవము కాదు శోకానుభవము ఏవంవిధమైన అనుభవము ధర్మరాజునకు దుర్యోధనుడు పడినప్పటినుండి మొదలైనది పడిపోయిన తనను వదలి పాండవులు పోవుటకు ముందు దుర్యోధనుడు వారి నుద్దేశించి శ్రీకృష్ణునితో నిట్లనినాడు- "ఏనెట్టి వాడనైన నాకేమి? మీరింక పశ్చాత్తాపదుఃఖితులగుచు నుండుడుగాక". ధర్మరాజట్లే తరువాత బ్రతికినాడు

యుద్ధము ముగిసినప్పటినుండి అనగా ఉపపాండవులు గూడ అశ్వత్థామ చేత చంపబడి నప్పటినుండి ధర్మజుని చిత్తము కేవలము శోకమునందే ప్రవృత్తి కలది. గాంధారి కడుపు శోకము మరియు ధర్మజుని తత్ప్రవృత్తికి నుద్దీపకమైనది ఉదకప్రదానవేళ కర్ణుడు కన కగ్రజుడని కుంతివలన విన్నప్పటినుండి ధర్మజుని శోకమింకను నధికమై రాజ్యభోగములయందు విరక్తిని పుట్టించినది కర్ణుని చావుతోపాటు - అభిమన్యుని చావు - గురువధ - మొదలైన వన్నియు కలిసి ధర్మజునకు నిర్వేదమును పెంచినవి. తాను జ్ఞాతివధచేసి రాజ్యమును గ్రహించినాడు. ఆ పరిగ్రహదోషము పరిగ్రహత్యాగమునగాని పోదని, రాజ్యము తన కక్కరలేదని, దానిని తమ్ములకు వదలి తా నడవులకుబోయి తపోవృత్తి నుండుటకు నిశ్చయించుకొని తద్రూపమున పరిదేవనము చేసినాడు శోకము సర్వచిత్తవృత్తులను నశింపజేయునది శోకము జ్ఞానమువలన నశించును. అందువలననే ముందు కృష్ణ కృష్ణద్వైపాయన నారద దేవలాదులు పెక్కు విధముల ధర్మవాక్యము లుపన్యసించి ధర్మజుని శోకమును కొంత తగ్గించి రాజ్యాభిషేకమున కంగీకరించునట్లు చేసినారు అయినను ధర్మజుని శోకము తుదిముట్టలేదు. భీష్మోపదేశమువలన నది పూర్తిగా నశించినది. అనగా రాగద్వేషములయందు

ధర్మజుని చిత్తమునకు ప్రవృత్తిలేకుండనయినది. ధృతరాష్ట్రుని విషయమున రాగమును, వాని వనవాసగమన సందర్భమున కొంత శోకమును ధర్మజునియందు ప్రతీయమానములైనవి అది అచ్చమైన పితృభక్తి లక్షణముగా ననుకొన దగినది. ధర్మరాజు తనను తాను వాటినుండికూడ నిగ్రహించుకొనినాడు.

ధృతరాష్ట్రుని విషయమున ధర్మరాజు పితృభక్తి చూపుట రాజ్యాభిషేకమైనప్పటినుండి మొదలైనది. తాను రాజ్యాభిషేకము నెందు కంగీకరించినాడో ధర్మరాజే యిట్లు చెప్పినాడు.

జ్ఞాతి వధమట్లు సేసియు
నీతనిఁ గొల్చుటకుఁ గాఁగ నీ గృహధర్మో
పేతత్వముఁ బొరసితి భూ
భూతికి మనకు విభుఁ డీ ప్రభువ మఱవకుఁడీ![1]

ధర్మరాజు రాజై ధృతరాష్ట్రుడే రాజన్నట్లుగా వర్తించినాడు తన కొడుకు మరణించినాడని విని ధృతరాష్ట్రుడు "నిచ్చలు భక్తిమై వచ్చి గారవింప నింకెవ్వరుగలరు నాకు"[2] అని విలపించినాడు. ధర్మరాజందుకు నేనున్నా నన్నట్లుగా ధృతరాష్ట్రుని మన్నించినాడు. ఆశ్రమవాసపర్వమున నా తండ్రి కొడుకుల అన్యోన్యమును తిక్కన్నగారిట్లు వ్రాసిరి—

..............................

...... పాండునందను లాంబికేయు
నెడ భక్తి వినయంబు లెసగ వర్తింతు
రతని యోగక్షేమ మరసి యెపుడు
తత్సమీపమ్మునఁ దగనిల్చి తమకు నె
య్యదియైన నెఱిగించు నట్లుగాగ
నుందురు. విదుర యుయుత్సు సంజయులు దా
రును నిత్యమును వచ్చి వినతిఁజేసి

1. భా. శాంతి 1-377.
2. భా. శల్య. 1-18.

కొలిచి కూర్చుండి యాన్నపు నలఘుకార్య
విధము లేర్పడ నడిగి యవ్విభుని చెప్పి
నట్ల చేయుచు రతడును నాదరంబు
గాఢ వత్సలత్వంబును గలిగియుండు.[1]

ధర్మరాజు తానట్లు ప్రవర్తించుచు తనవారట్లు వర్తించినట్లు చేసినాడు మరియు ధర్మరాజు తనను గొలువవచ్చిన రాజులందరును ముందు ధృతరాష్ట్రుని గొలుచు నట్లుగా చేసినాడు. అందువలన నాతడు నిజాత్మజు వలనకంటె ధర్మరాజు వలన నధికప్రియమును పొందినాడు ధర్మజుని పితృగౌరవము ధృతరాష్ట్రుడు తన కాశ్రమవాసమున కనుమతి నిమ్మని కోరినపుడు లెస్సగా నభివ్యక్తమైనది.

తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దైవము నా కరయంగ నీవ భూ
వల్లభ ! నీవు కానన నివాసము గోరి చనంగ నెట్టులే
నుల్లసువట్టి హాస్తిపురి నుండగనేర్తు ? యుయుత్సు పెంపు సో
ఖిల్లగ రాజు చేయు నిను బ్రీతి యెలర్పగ గొల్చివచ్చెదన్.[2]

అని ధర్మరాజు మరియు నిట్లనినాడు.

నీవు రాజవుగాక నీ కేను రాజనే
గురుని మహారాజు కురువరేణ్య
నిటు సేయుమని పంప నే నోడయుండనే-?[3]

తరువాత వ్యాసుడువచ్చి ధర్మజునితో నిక ధృతరాష్ట్రుని తపోవనములకు పోనిమ్మని చెప్పినాడు. ధర్మరాజంగీకరించినాడు. తానాశ్రమవాసమునకు పోబోవుముందు ధృతరాష్ట్రుడు రాజనీతివాక్యములు కొన్నిచెప్పి ధర్మరాజుతో ఈ విషయము లిదివరలో భీష్ముడు మొదలైన వారి వలన నీవు వినినవియే అయినను నాకు నీయందున్న ప్రీతివలన నీ నాల్గువాక్యములు చెప్పినా నని నాడు. అందుకు ధర్మరా జిట్లనినాడు.

---

1. భా. ఆశ్రమ. 1-3.
2. భా. ఆశ్రమ. 1-32.
3. భా. ఆశ్రమ 1-34.

ఆపగాసుతుఁడు లే డబ్జనాభుఁ
డాత్మ పురంబునకరిగె. వాత్సల్యత
నీవు దక్కఁగ నాకు హితము సెప్ప
నొడయుఁ డెవ్వఁడు ? భవదుపదిష్టపథమున
నిష్టమై నడచెద.[1]

ధృతరాష్ట్రునియందు ధర్మరాజునకున్న పితృగౌరవము లక్షణమట్టిది.- ధృతరాష్ట్రుడు గాంధారీసహితుడు వనములకు బయలుదేరినాడు నగరు వెడలినాడు. నగరనగా రాజప్రాసాదము. అనగా ధృతరాష్ట్రుడు తన మహారాజ సౌధము తల వాకిలి గడపదాటినాడు అంతకు పూర్వమాయన ఆ గడిన దాట లేదు. ఆనాడు దాటినాడు ధర్మరాజుయొక్క అప్పటిస్థితిని తిక్కన్నగారిట్లు వర్ణించిరి.

పాండవాగ్రజు డక్కురుభర్తవలను
శోకదీనుఁడై తప్పక చూచి యేడ్చి
హా మహారాజ ముఖ్య యెం దరిగె దనుచు
నొడలు కంపింప జదికిల బడియె నధిప.[2]

ధర్మరాజునకు తెలియును ధృతరాష్ట్రుడెచటకు పోవుచున్నదియును. తెలిసియే హామహారాజ! యెందరిగెద వనచు నేడ్చినాడు మమ్మువదలి పోవుచున్నావు గదా అను దుఃఖముతోడి మాటయది ధృతరాష్ట్రుని యందలి ధర్మరాజు యొక్క ప్రేమానురాగ - భక్తి గౌరవ దయాదాక్షిణ్యాది బంధుసంబంధము లైన బహుభావము లావర్తములగుచు వెలికి వాగ్రూపమున నట్లు వచ్చినవి- ఇదంతయు ధర్మజుని నిర్వేదానంతరపు ధృతరాష్ట్రునియందలి పితృగౌరవము లక్షణము

ధర్మజుని స్వర్గారోహణ మది చాల చిత్రముగా నిరూపింపబడినది. పరీక్షితునకు పట్టాభిషేకము చేసి సుభద్రకు వాని నొప్పి చెప్పి సామజుడు, సభార్యుడు ధర్మరాజు మహాప్రస్థానమునకు బయలుదేరినాడు. అందరును యోగ శక్తికలవారే. ఆ యోగశక్తిచేత భేదములేకుండ మేరు సమీపమువరకు నంద

1. భా. ఆశ్రమ 1-80
2. భా. ఆశ్రమ. 1-140.

రును పోయినారు ఆ యోగశక్తి ఎవరి కెప్పుడు సడలునో వారి శరీరమప్పుడు పతనమగును ముందు ద్రౌపదికట్టయినది తరువాత సహదేవాదులకు నట్లే యైనది ధర్మరాజు మాత్రమా యోగ మెడలకుండ పోవుచున్నాడు యోగ మనగా చిత్తమునకు విషయములయందు ప్రవృత్తిలేకుండ నిరోధించుకొను టయే కదా! అందువలననే ద్రౌపది మొదలైనవారి మరణముల విషయమున ధర్మజుని చిత్తము దుఃఖమును పొందలేదు. ధర్మరాజట్లు తన చిత్తమును నిరోధించుకొనినాడు. ధర్మజుని యీ చిత్తము లక్షణమును ద్రౌపది మొదలైవ వారు మరణించినప్పుడెల్లను తిక్కన్నగారు జాగ్రత్తగా స్పృశించిరి. ద్రౌపది మరణించినది. "ధైర్యస్థైర్యమున వికృతిలేని" వాడై ధర్మరాజు నడచెను సహదేవదు మరణించినాడు. ధర్మరా "ఉపేక్షా నిరూఢబుద్ధి" యై ముందుకు సాగినాడు. నకులుడు మరణించినాడు. "ధృతిసారం బూది" ధర్మరాజు సాగి పోయినాడు. అర్జునుడు మరణించినాడు. ధర్మజుడు "తాల్మిజేసి బద్ధానిర తాత్ముడై యరిగి" నాడు భీముడు మరణించినాడు. "ధైర్యసారోదారుడును, నిశ్చయమహితుడునయి" ధర్మరాజు చనినాడు. ఇదంతయు నుత్కటమైన ధృఢయోగ సేవనము లక్షణము. ఇంద్రుడు రథము తీసికొని ధర్మరాజున కెదురుగా వచ్చినాడు ఇక చిత్తవికారము మొదలైనది అనగా నింద్రదర్శనముతో ధర్మజునకు యోగము సడలినది. కాని ధర్మజునకు శరీరపతనము జరుగలేదు. బహుశః అది ఇంద్రుని మహిమ కావచ్చును ఇంద్రదర్శనముతో వాని యోగ మెడలినదని యేమి గుర్తునవచ్చును. ఇంద్రుడు వానిని తన దివ్యరథ మెక్కుమనినాడు అపుడు ధర్మరా జిట్లనినాడు

తోడంబుట్టువు లందఱుం బడిన యీ దుఃఖంబు చిత్తంబు సం
పీడం బెట్టెడు సౌకుమార్యవతి డప్పిం గూలె బాంచాలి వార్
తోడై వచ్చిరి వారులేక యిట మీతో రాను వారెల్లనా
తోడం గూడగ వచ్చునట్లుగ కృపాధుర్యాత్మ కావింపవే.[1]

తమ్ములును భార్యయు మరణించిన తత్కాలమున ధర్మజున కేమి యనిపించినట్లులేదు. దుఃఖముచేఖ పొలుపుగూడ వాని చిత్తమున కనిపించలేదు ఇంద్రుని యెదుట నిప్పుడు తనవారి మరణమువలన దుఃఖము చిత్తమును పీడించుచున్న

1. భా. మహాప్రస్థానిక. 1-50

దనుచున్నాడు. అంతవరకు ధర్మరాజు తన చిత్తమా దుఃఖము విషయమున ప్రవృత్తిని పొందకుండ నిరోధించుకొని యుండవలయును. ఇంద్రదర్శన మగుటతో వాని చిత్తము వానిచేత నిరోధింపబడుటను నిరాకరించి దుఃఖ విషయమున ప్రవృత్తమైయుండవలయును. లేనిచో నింద్రునితో నట్లనుట పొసగదు. ఆ తరువాత వారందరును స్వర్గమును ముందుగనే చేరుకొనినారని దేవేంద్రుడు చెప్పగా ధర్మజు డా రథమునెక్కి (సారమేయముతో కూడ-అనగా ధర్ముడు ప్రత్యక్షమైన తరువాత) స్వర్గమును చేరుకొనినాడు. యోగమెడలిన చిత్తము తోడనే ధర్మరాజు స్వర్గమున కాలుపెట్టినాడు తమ్ములను, భార్యను మొదలుగా గలిగిన బంధువ్రాతమును చూడ వలయునన్న కోరిక పుట్టినది. మొట్ట మొదట స్వర్గమును సుయోధనుడు కనిపించినాడు. సుయోధనుడన్నచో ధర్మరాజుయొక్క అంతరాంతములో నెట్లున్నదో స్వర్గమున నపుడాడిన మాటలు విన్నచో తెలియగలదు.

ఇతఁ డతిలోభోపహత మానసుఁడు దీర్ఘ
దర్శిగాఁ డితని కతమునఁ జేసి
నిఖిల దేశంబుల యఖిల నృపాలురుఁ
ద్రుంగిరి దంతి తురంగ సహిత
ముగ. అనవద్యాంగి విగతకల్మష ధర్మ
చారిణి సాధ్విఁ బాంచాలి నార్య
జనములు ననుగొన సభలోన నవమాన
పెట్టిన తులువ.ప నిట్టి వాని
తోడఁ గలసి మెలఁగుదునె? మహితాత్మకు
లార! యెచటనున్న వారు భీమ
ఫల్గునులును గవలుఁ బాంచాలియును నన్ను
నచటి కనుపవలయు — —.[1]

ఇంతకు పూర్వ మాశ్రమవాసపర్వమున ధృతరాష్ట్రునితో ధర్మరాజాడిన మాటలు స్మృతియందిపుడున్నచో వాని జీవలక్షణము రహస్యము తెలిసిపోవును. అప్పటి వాని మాట లిట్లున్నవి.

---

1, భా. స్వర్గ. 1-5.

దుర్యోధనాదుల దుష్కృతములు
నా మదిలో నిల్వ నేమును వారును
విధి మోహమున నైన విరసభావ
మావహిల్లినఁ బుట్టె నంతలు పనులు [1]

ధర్మజుని యా యీ మాటలకు పోలికయే లేదు. ధర్మరాజు వశీకృతచిత్తుడని సంజయు డుద్యోగపర్వమున చెప్పినదాని రహస్యమిచట పర్యాలోచన చేయ వలసియున్నదేమో ? మరియు నీ సందర్భమున ధర్మరాజు నుద్దేశించి అశ్వత్థామ చెప్పిన "అంతర్మద దుష్టుడు'' అనుమాట కూడ స్మృతికి తగులవచ్చును. ధర్మరాజుయొక్క వశీకృతచిత్తత, ఇంద్రదర్శన మైనప్పటినుండి మరియు స్వర్గమున చేరినప్పటినుండి తొలగినట్లు స్పష్టముగానున్నది వశీకృతచిత్తు డనగా స్వాధీనమునందుంచుకొన్న చిత్తముయొక్క ప్రవృత్తిలక్షణము కలవాడు. ఆశ్రమవాసమునందలి మాటలా లక్షణముతో మాటాడిన మాటలు కావలయును. స్వర్గమున నొకసారి ధర్మరాజునకు చిత్తము తన వశము దప్పి ప్రవర్తించుట తోచి అదియొక క్రొత్త యనుభూతికాగా దిక్కుతోచక వ్యాకులపడినాడు. అచట తిక్కన్నగారు చిత్రముగా వ్రాసిరి—

అని యగ్గలపుఁ జింత మునిగి కలంక మ
నోవికారము నాకు నావహిల్లఁ
గతమేమి యొకో ? ఇది ఘనమాయయో-? కల
గనుటయో-? యరయ నిక్కంబొ-? చిత్త
విశ్రాంతిఁ జేసి వివేకింపనేర రా
దయ్యెడు నని పరమాకులేంద్రియుఁడు
శోక దుఃఖమయుఁడునై కొండొక
ప్రొద్దూరకుండి సద్బుద్ధిఁ దలచి
యలుక యింద్రుపై బొడమిన...... [2]

తన తమ్ములు భార్య మొదలైనవారు నరకమున నుండుటను, దుర్యోధనుడు స్వర్గమున మహారాజువలె నుండుటను చూచిన ధర్మరాజున కగ్గలపుచింత కలిగినది అపుడు తనను నిగ్రహించుకొని యేమిది? నాకీ మనోవికార మేమి ? ఇది మాయయా? కలయా? నిజమా? దేనిని విచారించుకొనుటకును చిత్తము వశము

1. భా. ఆశ్రమ 1-34.
1. భా. స్వర్గ. 1-27.

దప్పియున్నదే! అని దుఃఖమున పొందినాడు. కొంచెము స్థిమితము చిక్కించు కొని విచారించగా నింద్రునిమీద కోపము వచ్చినది. అగగా చిత్తము తనవశము గాకుండ చేసిన దా యింద్రు డన్న జ్ఞానము కలిగినదన్నమాట. ఇంద్రుడు ధర్మ జుని చిత్తమును వాని వశమునుండి యేల తప్పించినాడు? రెండు విధములుగా నూహింపనగుచున్నది ఒకటి-వాని అంతర్యము బట్టబయలై మనస్సు సగ్వాకల్మ షములనుండి క్షాళితము చేయబడుట కావచ్చును రెండు-ఇతిహాసనాయకుని పరలోకానుభవమును చూపించుటకొరకు కావచ్చును. ఈ రెండును నొకదాని యొక్క ఇరుమొగములు మాత్రమే. స్వర్గమునను నరకమునను ధర్మజుని అను భవమును ప్రదర్శించుటకు కానిచో వానిని శరీరముతో స్వర్గమునకు తీసికొనిపో నక్కరలేదు అందరవలెనే శరీరమును త్యజించిపోయిన సరిపోవును స్వర్గమున మనోవికృతులుండవు. అచట జీవులకీ స్థూలదేహములుండవు. వికృతులు దేహధర్మ ములు దుర్యోధనుడు శరీరమును త్యజించి స్వర్గమునకు బోయినాడు ధర్మరాజు కనిపించినపు డచట వాని కేమియు ననిపించలేదు. శరీరముతోనున్నాడు గనుక ధర్మరాజు వీడున్నచోట నేనుండ ననినాడు

చిత్తమును వశము దప్పించి శరీరముతో ధర్మరాజు స్వర్గమునకు తీసి కొనిపోవుట, ఇతిహాస నాయకునియందు కర్మఫలానుభవము, ఇహాపరముల యందు రెండును నిరూపించుటగాక మరొక ప్రయోజనము కనిపించుటలేదు. స్వర్గమున ధర్మరాజనుభవించిన దుఃఖమది దైవవిహితముగా దేవేంద్రుడు చెప్పి నాడు. తరువాత ధర్మునిచేత ప్రబోధింపబడి ధర్మరాజాకాశనదీపావనసలిల ముల మునిగి లేచినాడు

మానుషతనువు నమ్మాత్రన విడిచి ది
 వ్యంబగు మహితదేహంబు దాల్చి
వైరమత్సర స్నేహసంవాస లౌల్య
 గర్వ శోకాదులైన హృద్గత వికార
ములు దొలంగి నిర్ధూమత్వమున వెలుంగు
 పావకుఁడు బోలె శోభిల్లె —[1].

ఇది ధర్మజుని, భారతనాయకుని, పాత్రమును తిక్కన్నగారు క్రమోన్మీలనము చేసి చూపిన విధము

---

1. భా. స్వర్గ. 1-52.

# అష్టమోన్మేషము

## 1. దోషముకాని రసదోషము

"అర్జునుఁడు విరాటసుతున కిట్లనుఁ గేవల
వీరరసమయాత్మకుఁ డగుచున్" విరా 5-3
"వీరరసాంబుపూరమును.... ." భీష్మ 1-54
"రౌద్రరసవినోదియైన యర్జునుఁడు......" విరా. 5-154
"ఆ విల్లు ద్రుంచి రౌద్రరసావేశం బొప్ప......" భీష్మ 2-338
"రౌద్రరసంబు దలకొత్త దర్పంబున......" ద్రోణ. 3-142
"అత్తెఱఁ గద్భుతరసము వెల్లి దేల్చె జనములన్" ద్రోణ 4-298
"సకలభూతములు మహాద్భుతరసమున మునిగె..." ద్రోణ. 4-331
"కరుణనాద మెసగ నాక్రందించెన్" భీష్మ 1-45
"కరుణ మాత్మకు నింత మిక్కిలి గాకయున్నె..." స్త్రీ 2-63
"రౌద్ర భీభత్సకరుణ భయానకైక హేతువయ్యె—" ద్రోణ. 3-279
"భీభత్స రౌద్ర మహాద్భుతములు మూర్తిమంతములుగ-" ద్రోణ 3-158
"సర్వజ్ఞుఁడు ప్రీతుఁడగు శాంతరసు మొప్పు జూమీ" అశ్వ. 2-30

ఇట్టి వాక్యములు తిక్కన్నగారి భారతమునుండి మరియు నేరి చూపించ వచ్చును. వీటికి తోడుగా "సాఖ్యరసము" (విరా. 5-102) "కోపరసము" (ద్రోణ. 2-319) నంటివి గూడ చూపించవచ్చును. రస, స్థాయి, సంచారులను స్వశబ్దములచేత పేర్కొనుట రసవర్ణనమునందలి ముఖ్యమైన దోషముగా నాలంకారికులు కొందరు నిష్కర్ష చేసిరి అందువలన నేవంవిధమైన దోషము తిక్కన్న గారి రచనయందు పూర్తిగా నున్న దని పైన ఉదాహరింపబడిన వాక్యముల వలన తెల్లగా స్పష్టము కాగలదు. కాని సూక్ష్మముగా విచారించినచో మొదలది యొక దోషము కాదనియు, భారతమువంటి ఇతిహాసగ్రంథమున నది గుణమే యగు ననియు తోచగలదు

స్వశబ్దములచేత రసాదులను పేర్కొనుట వమన మను దోష మని మమ్మటాదులు వ్రాసిపెట్టిరి. తద్దోషకల్పనము కేవలము నిర్మూలమని, బహువిధముల

విచారింపబడి సిద్ధాంతము చేయబడినది.[1] కనుక నది దోషమే కాదు అ విషయ మట్లుంచి ఇచట అది దోషమైనను కొన్నిచోట్ల గుణ మెట్లగుచున్నదో విచారించబడును.

నవరసగంగాధరమున నీ వమనాఖ్యదోషమును ప్రతిపాదించు సందర్భమున నీ వాక్యము లున్నవి - "స్వశబ్దోక్తి ఉంటే రసము ఆస్వాద్యము కాదు ప్రకట మయినప్పుడు దాని అభిరుచి తగ్గుతుంది"[2] ఈ రెండువాక్యముల యర్థమును విచారించినచో నిట్లుండును. ఏరసము సహృదయముల కాస్వాద్యము కాకుండుట నే కవి యిచ్చించునో దానిని స్వశబ్దముచేత చెప్పవచ్చును వ్యంగ్యము కాదగినది వాచ్యమయినచో నది చమత్కారకారి కాదు అందువలన సహృదయుల కది ఆస్వాద్యము కాదు ఏ ఏ రసములయందు సహృదయుల కభిరుచి తగ్గించవలయు నని కవి తలపెట్టునో వాటిని స్వశబ్దములచేత పేర్కొనినచో సరిపోవును ఈ ఫలానారసము సహృదయుల కాస్వాద్యము కావలయు ననుకొన్నప్పుడు మాత్రము దానిని స్వశబ్దముచేత చెప్పరాదు విభావానుభావసామగ్రీసమగ్రముగా వర్ణించినచో నది వ్యంగ్యమై చమత్కారకారి యగును అట్లు విభావాదులచేత నభివ్యక్తమగుచున్న దానిని స్వశబ్దముచేత వాచ్యముచేయుట కాపేయకల్ప మగును. కనుక నది దోషము జగన్నాథ పండితరాయలు దేనిని దోషముగా సిద్ధాంతము చేసినాడో అది కొండొకచో గుణ మగుచున్నది కొండొకచో ననగా నితిహాసములయం దని గ్రహింపవలయును.

మరియు సాహిత్యదర్పణకారుని మతమును పరిశీలించినచో పై యర్థము సంగతపడును "ఎచ్చట విభావానుభావకృత పరిపుష్టి లేమియే అనుగుణమో, అచ్చట వ్యభిచారిని తన శబ్దముచేత చెప్పుట దోషము కాదు." మరియు నెచట "విభావాది పరిపోషము ప్రకృతరస ప్రతికూలప్రాయ మగు" నో అచట "స్వశబ్దముచేత చెప్పుటయే న్యాయము"[3] ప్రకృతరస మనగా అంగియైన కావ్యరసము. ఏ వ్యభిచారిభావమును విభావాదులతో పుష్టముచేయుట

1. ఆంధ్ర ధ్వన్యాలోకము- పుటలు 547-568.
2. నవరసగంగాధరము-పుట 141.
3. ఆంధ్రసాహిత్యదర్పణము-పుటలు 258, 259.

కావ్యమునందలి ప్రధానరసమున కనుకూలము కాదో దానిని స్వశబ్దముచేత చెప్పుట దోషము కాదనియు మరియు నట్లు చెప్పుట తగు ననియు విశ్వనాథకవి రాజు చెప్పుచున్నాడు. ఇచట సామాన్యబుద్ధితో నిట్లు శంకింపవచ్చును. వ్యభి చారులను స్వశబ్దముచేత నొకచో చెప్పుట దోషము కాదనియే కవిరా జను చున్నాడు కాని రసమును స్వశబ్దముచేత చెప్పుటకూడ దోషము కాదని యనుట లేదు కదా ? అని. ఇందుకు సమాధాన మాయన గ్రంథమునందే రసదోష నిరూ పణము సందర్భమున నున్నది. "రసమును తన శబ్దముచేత చెప్పుట, స్థాయి సంచారిణులను సయితము స్వశబ్దముచేత చెప్పుట... రసగతదోషము[1]" అని యచట వ్రాయబడినది రసస్థాయి సంచారిణులను స్వశబ్దముచేత చెప్పుట దోష మన్నది సిద్ధాంతవాక్యము దానినుండి సంచారిని గ్రహించి ఒకచో నది స్వశ బ్దముచేత చెప్పబడుటదోషముకాదనుటవలన రసమును, స్థాయియును చెప్పినట్లే యగుచున్నది కనుక శంక అనవసరము అదియునుగాక "రసము లన్నియు నించుమించుగా వ్యభిచారులే యగు నను భరతోక్తిని బట్టి, వాని నామగ్రహ ణము దోషము కాజాల దనుట, రసనామగ్రహణము దోష మనుట, స్వవచన వ్యాఘాత"[2] మగును. అందువలన సంచారి స్వశబ్దముచేత చెప్పబడుట దోష ముకా దనుటతో రసమును స్థాయియును గ్రహింపబడనేవలయును. ఇంతకును ఫలితార్థ మిది. కావ్యమునందలి ప్రధానరసము దృష్ట్యా ఏ ఏ రసభావములు లెస్సగా పోషింపబడుట తగదో వాటిని స్వశబ్దములచేత చెప్పుట దోషముకాదు- అని.

భారతమున ప్రధానరసము శాంతము అయినను అది ఇతిహాసమగుట వలన మధ్యమధ్య ప్రవర్తించిన అనేకములైన ఉపకథలవలన మరియు పదునెని మిది దినముల మహాయుద్ధమువలన శాంతరసప్రతికూలములైన రసభావములు తప్పనిసరిగా చూపింపబడవలసియున్నది అట్లని వాటిని విభావాదులతో విపుల ముగా వర్ణించినచో ప్రధానరసమునకు దెబ్బతగులును. ఎంత జాగ్రత్తగా తగ్గిచింతగ్గించి వర్ణించినను నైదుపర్వములను వ్యాపించియున్న యుద్ధమును చెప్పు టలో వీరాదిరసము లెప్పుడేని ఆస్వాద్యములగు ప్రమాద మున్నది అయినచో

---

1. ఆంధ్ర సాహిత్యదర్పణము-పుట 244.
2. ఆంధ్ర ధ్వన్యాలోకము-పుట 567.

ప్రధానరసము పిగిపోయినట్లే అందువలన ప్రధానరసము దృష్ట్యా అంగభూత ములై భారతమున ప్రవర్తించిన రసములను తిక్కన్నగారు స్వశబ్దములచేత చెప్పుచు, వాటి యభిరుచిని తగ్గించిరి. ఆ యంగరసభావములకు పరిపుష్టి లేమియే భారతమునకు వలయును. ఎచటనేని అవి కొద్దిగా విభావానుభావ కృతపరిపుష్టికలవియైనను అనగా నగుచున్నను అవి రసములుగా నాస్వాద్య మగుట భారతకర్త కిష్టము కాకపోవుటయే సమంజసము గనుక స్వశబ్దములచేత నా యా రసములను పేర్కొనుటయే చేయదగినది కనుకనే తిక్కన్నగా రట్లు చేసిరి. ఈయనయే కాదు- నన్నయ్యగారును చేసిరి. భీమసేన జరాసంధుల మల్ల యుద్ధమును "భయానకం బయ్యె[1]" నని ఆయన చెప్పెను. మరియు భారత మునం దంగరసములు తత్తత్సందర్భములయందు విభావాది పరిపుష్టి లేకుండ తావన్మాత్రములుగా నూహ కందిచ్చుటకొరకు వాటిని స్వశబ్దములచేత చెప్పుట జరిగినది. అది భారతమున గుణమే గాని దోష మేమాత్రమును గాదు.

స్వశబ్దవాచ్యరూప వమనాఖ్యదోషము మొదలు దోషము కాదు. అయి నను అనౌచిత్యము కొండొకచో నౌచిత్యమై కావ్యోత్కర్షకు హేతువైనట్లు, కావ్యదోషములును కొండొకచో గుణములై కావ్యపరమార్థమున కుపజలకము లైనట్లు, ఈ వమనాఖ్యదోషముకూడ నొకచో దోషము కాక పోవుట సిద్ధాం తము. అనగా నిది దోషముకాని రసదోషము.

భారతమునం దిది యెట్లు గుణ మగుచున్నదో కించిత్తు వివరింపబడును. అర్జునుడు సారథిగా నుత్తరునితో కలిసి కౌరవులమీదికి వచ్చినాడు. మధ్యలో రథికుడైనాడు. అగుటతో తానే యుద్ధము చేయవలసివచ్చుటచేత మహావీరు డైన అర్జునునియం దుత్సాహము ప్రబలమైనది విరాటనగరమునుండి బయలు దేరునప్పుడు తాను యుద్ధముచేయవలయునని అర్జునున కున్నను, ఉత్తరుడు భయపడి పారిపోవు నంతవరకు నాతడు దానిని వెలికిరానిచ్చుటకు వీలులేదు అందువలన వానియం దవు డేవిధమైన ఉత్సాహమును వర్ణించుటకు వీలులేదు రథికు డైనప్పటినుండి వర్ణింపబడవచ్చును. కాని భారతమున నుత్తరగోగ్రహణ కాలమున నర్జునుడుచేసిన యుద్ధమే ప్రధానయుద్ధము కాదు ప్రధానయుద్ధ మునే విభావాదులచేత పుష్టముచేసి చూపుటకు వీలుకానపుడు ఈ అప్రధాన

1. భా. సభా. 1-204.

యుద్ధమున నర్జునుని యుత్సాహమును వర్ణించుట కేమాత్రమును నవకాశము లేదు కాని అర్జునునియందలి ఉత్సాహము తత్ప్రకరణమున సహృదయుల బుద్ధికి తోచవలయును రసముగా నాస్వాద్యము కారాదు అందువలన విభావాదివర్ణన మేమియు చేయకుండ తిక్కన్నగా రూరక అర్జునుడు వీరరసమయాత్మకు డై నాడని చెప్పి వదలిరి కొంచెము ముందువెనుకలుగా విచారించినచో నదియు చమత్కారకారి యగుచున్నది అర్జునుడు రథికుడై కౌరవచక్రవర్తి దుర్యోధనుని దెసకు రథము తోలుమని భూమింజయునకు చెప్పినాడు. అత డా పనిచేయుచుండగా గాంగేయాదులు తమ రాజున కడ్డపడి కవ్వడిదిక్కు-మొగముగా తిరిగి నిలిచిరి అంత దుర్యోధనుడును సానుజుడు కిరీటి కభిముఖుడై వెన్నుదన్ని నిలిచెను. అపై మిగిలిన కౌరవబలమంతయు కూడగట్టుకొని దళముగా గలిసినది ఇదంతయు చూచిన అర్జునుడు వీరరసమయాత్మకు డై నాడని తిక్కన్నగారు వ్రాసిరి అర్జునుని ఉత్సాహాతిశయమును చెప్పుటకు వీరరసమయాత్మకత చెప్పబడినది. ఉత్సాహశబ్దముచేత నప్పటి యర్జునుని పేర్కొనినను స్థాయిభావశబ్దమును చెప్పినట్లే యగును. రసమును చెప్పినను దాని స్థాయిని చెప్పినను నొకటియే. తద్భేదమును సూక్ష్మముగా విచారించినచో కౌరవసేనాసముదాయముయొక్క సమరోత్సాహము పార్థునియందు వీరరస పర్యవసాయియైనట్లు కనిపించుచున్నది అనగా కౌరవులయొక్క ఉత్సాహముతోడి దళముగా గలిసి తన కెదురై నిలచుట అర్జునునకు పరమసంతోషమును కలిగించిన దన్నమాట. శత్రువుల తేజోబలములను గుర్తించి వారిపై ఎత్తిపోవుట మహావీరుల లక్షణము కదా! అర్జునుడు దట్టివాడు. అంతకుమునుపు కౌరవులు పరస్పర మె ట్లధిక్షేపముగా మాటాడుకొనినను, అర్జునుడు పైబడవచ్చు నప్పటికి వారందరును నెట్లుత్సాహముచేసి యెదురుదన్ని నిలిచినదియు, అది యర్జునుని మీద నెట్టి ప్రభావమును చూపినదియు తిక్కన్నగా రా వీరరసమను శబ్దము నుపయోగించి చిత్రముగా నిరూపించిరి ప్రధానమైన భారతయుద్ధమును తన భుజస్కంధముమీద నడిపింపబోవుచున్న అర్జునున కీ ఉత్తరగోగ్రహణకాలమున కౌరవుల పూనిక లెస్సగా నుత్సాహమును కలిగించిన దన్న సూచన లోకాతిశాయి రమణీయముగా నున్నది విభావాది వర్ణనము లేనందున రసమేమో ఆస్వాద్యమగుట లేదు. రసము స్వశబ్దముచేత వాచ్యమగుటచేత మిగిలిన తత్సంబంధి బహువిషయములు కేవలము వార్తలవలె బుద్ధికి తగిలివచ్చి తత్ప్రకరణ

మేమో దీప్తమగు చున్నది అందువలన వీరరసమును అర్జునాత్మకముగా వాచ్యముచేయుట మిక్కిలిగా గుణమే యగుచున్నది.

ఈ విధముగా మిగిలిన వాటినికూడ పూర్వాపరములమీద నర్థము చేయ వచ్చును. ఆ యా రసశబ్దములు తత్తత్ప్రకరణార్థములను కొద్దిగనో గొప్పగనో సముద్దీపింపజేయుచునే యుండును కరుణనాద మెసగ నాక్రందించినది, పదిదిన ములు యుద్ధముచేసిన భీష్ముని అస్తమయమును చెప్పుటకు ధృతరాష్ట్రుని వద్దకు వచ్చిన సంజయుడు. ఆ సంజయుడు శోకించుట యెట్లున్న దనగా దానిని చూచు వారికి కరుణ మాస్వాద్య మగునట్లున్నది. సంజయుని దుఃఖమును మిక్కిలిగా వర్ణించకుండ కరుణశబ్దమును ప్రయోగించుటచేత నది యంత విపరీతముగా నున్న దన్న అర్థము బుద్ధి కందుచున్నది మరియు నది ధృతరాష్ట్రున కుద్దీపక మగుటయు సంభవించుచున్నది. యుద్ధకథనమునకుముం దట్టి శోకము ప్రవర్తిం చుటచేత యుద్ధరసభావముల దీప్తి సహజముగాం కొంత తగ్గిపోయినది. ప్రధాన రసము దృష్ట్యా అది యవసరము. కనుక కరుణశబ్దము పేర్కొనబడుట గుణమే కాని దోషము కాదు రౌద్ర బీభత్స కరుణ భయానకైక హేతువయ్యె నను నీ మొదలుగా రసనామములు వరుసగా గ్రుచ్చి యెత్తుబడుట యున్నది. ద్రోణుని రెండవనాటి యుద్ధమును, నాల్గవనాటి యుద్ధమును వర్ణించుచో చెప్పబడిన వాక్యము లవ్వి. ద్రోణుడు సేనానాయకుడైన రెండవనాడు సంశప్తకులతో యుద్ధముచేయుట కర్జునుడు వేరుగా తొలగిపోయినాడు అత డట్లు తొలగిపోయిన తరువాత ద్రోణుడు ధర్మరాజు మొదలైనవారి యుద్ధ మింకొక ప్రక్కన జరిగి నది. అనగా నా నాడు రెండుచోట్ల విడివిడిగా యుద్ధములు జరిగినవి. ద్రోణుడు పాంచాలబలంబులమీద విజృంభించె నన్న మాత్రము చెప్పబడి ద్రోణుని యుద్ధ వర్ణన మాపబడినది సంశప్తకులతోడి యర్జునుని యుద్ధము వరుసగా వర్ణింప బడినది అదియైనతరువాత కొంతసేపటికి తిరిగి ద్రోణుని యుద్ధమందుకొని ఆ సందర్భమున మొదటినుండియు ద్రోణుని యుద్ధము తీవ్రమై కొనసాగింప బడుచువచ్చుచున్న దను విషయము స్ఫురింపజేయుటకుగాను రౌద్ర బీభత్సాది రసములు నామములచేత వరుసగా గ్రుచ్చియెత్తబడినవి. అర్జునుని యుద్ధ మాపబడి ద్రోణుని యుద్ధము వరుసగా వర్ణింపబడినను, అర్జునుని యుద్ధమందు కొనుచోనైనను నట్లు చెప్పవలసినదే. అర్జునుని ఆహ్వానించి ప్రత్యేకముగా ప్రక్కకు సంశప్తకులు తీసికొనిపోయినారు గనుక వారితోడి యుద్ధమును

మధ్యలో నాపకుండ వర్ణించుటయే ఉచితముగ గనుక నట్లు చేయబడినది. దుర్యోధనుడు ద్రోణు డిచ్చిన అద్భుతకవచమును ధరించి అర్జునుని తాకపోవుటకు ముందుగా నర్జునుని యుద్ధశీప్రశంసను చెప్పుచు బీభత్స రౌద్ర మహాద్భుతములు వరుసగా పేర్కొనబడినవి అంత మహోత్సాహముతో నున్న వానిని దుర్యోధను డెదుర్కొనబోవుచున్నా డనగా నర్జునుని చేతిలో నా తడెందును గాకుండబోవునన్న స్ఫురణ మందిచ్చిన ట్లగుచున్నది సైంధవుని వధించుటకు ప్రతిజ్ఞ చేసిన పార్థుని నాటి వీరవిహారమును కేవల మా యా రసశబ్దములు తమ యర్థములచేతనే స్ఫురింపజేయుచున్నవి. అందువలన వరుసగా నట్లు రసనామ లను గ్రుచ్చియెత్తుటయు గుణమే యగుచున్నది ఇంతవరకు నంగరసముల విషయము చెప్పబడినది అంగిరసమునుకూడ తిక్కన్నగారు స్వశబ్దముచేత పేర్కొనిరి. శాంతరస మొప్పుజుమీ—

రస మెప్పుడును వాచ్యముకాదు అది యే విధముగను వాచ్యము చేయబడదు. రసానందము బ్రహ్మానంద సహోదరము కదా! బ్రహ్మము నే శబ్దమును నెట్లు చెప్పలేదో, రసమును నట్లే యే శబ్దమును చెప్పలేదు సత్య జ్ఞానానందాది శబ్దము లుపలక్షణవృత్తిచేత బ్రహ్మమును సూచించునట్లుగనే శృంగారాది శబ్దము లుపలక్షణద్యోతకములై రసమును సూచించును అనగా శృంగారాది శబ్దములు రసవాచకములు కావు రస లక్ష్యకములు. అందువలన శాంతరస మనగనే అది వాచ్యమగుటలేదు స్వశబ్దవాచ్యరూప వమనాఖ్యదోషము దోషము కాజాలదనుటలోని అంతర్య మిదియే ఇంతకును తేలిన సారాంశ మిది. స్వశబ్ద వాచ్యత యను దోషము రసమునకు లేదు. ఉన్న దనుకొన్నను భారతము వంటి ఇతిహాసగ్రంథమున నది గుణమేకాని దోషముకాదు. దోషముకాని రస దోష మది.

## 2. అంగరసములు

వీరాది యుద్ధరసములను వదలినచో ముఖ్యముగా చెప్పదగిన భారతము నందున్న అంగరసములు కరుణము-శృంగారము మాత్రమే. కరుణము భారతమునందలి అంగియైన శాంతమున కుద్దీపకమైన రసభావము శృంగారము మధ్య మధ్య ప్రసక్తములైన చిన్న చిన్నకథలలో కనిపించినను, అది ప్రధానముగా విరాటపర్వమున ఆభాసరూపమున ప్రధానకథాసంబంధిగా నిరూపింపబడి

యున్నది. ఏత దాభాసశృంగారము విషయమును, మిగిలిన నొకటి రెండు కథలలోని శృంగారమును, కరుణమును - ఇచట కొద్దిలో విచారింపబడును.

**కరుణము**: భారతమున "నయ్యది" స్త్రీపర్వమున "ప్రాధాన్యము వహించి గాంధారియొక్కయు, నితర కురుపాండవస్త్రీలయొక్కయు నాక్రందనములం దుత్కటమై సిద్ధిగాంచినది"[1] మరియు ద్రోణపర్వమున నభిమన్యుని మరణానంతరమును, సౌప్తికపర్వమున నుపపాండవుల వధయైన తరువాతను, అశ్వమేధపర్వమున పరీక్షిజ్జననసందర్భముననుస, ఆశ్రమవాసమున ధృతరాష్ట్రుడు వనములకు బోవునప్పుడును కొద్దిపరిధిలో కరుణము ప్రవర్తించినది. మరియు ప్రాసంగికములైన కొన్నికథలయందును ప్రవర్తించియుండవచ్చును. ముఖ్యముగా స్త్రీపర్వమున, అందును ద్వితీయాశ్వాసమున కరుణము లెస్సగా దీప్తికి వచ్చినది. గాంధారి యాలంబనముగా వచ్చినది "పుత్త్రాది వియోగ మరణాది జన్మవైక్లవ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేషః శోకః"[2] భారతయుద్ధమున గాంధారియొక్క నూర్గురుకొడుకులును మరణించిరి మరియు బంధుజనులు, వంశవృద్ధులు మొదలైన వారందరును మరణించిరి. ఈ వీరందరును పుత్త్రాదులు భీష్మాది సౌప్తికపర్వాంతముగా నడచిన గ్రంథమున వారి వారి మరణించుటలు చెప్పబడినవి. స్త్రీపర్వమున గాంధారి శోకమున కుద్దీప సామగ్రియైన, చేతులు కాళ్ళు తెగి, సృగాలాది జంతువుల కాహార మగుచున్న ఆ యా వీరుల మృతశరీరములతోడి గుండెలు బ్రద్దలుచేయు యుద్ధభూమి అంతయు నామె కాలోకన గోచర మైనట్లుగా వర్ణింపబడినది అట్లు చూచుచు నా యా శవముల మధ్యగా నామె తిరుగాడుటను చెప్పుటవలన, శోకము నామెయందు మరియుమిక్కిలిగా పర్ణించుటకు వీలైనది.

ఇక్కడ నొక్క విషయము చెప్పవలయును. గాంధారి నాధారము చేసుకొని కరుణము నింతగా నీ పర్వమున నేల వర్ణింపవలయును? మిగిలిన అంగరసములవలె దీనిని గూడ నూరక స్ఫురణమాత్ర పర్యవసితముగా జేసి వదలినచో సరిపోవును గదా? అని ఈ విధముగా ననిపించవచ్చును. కాని యట్లు కాదు భారతమున ప్రధానమైన శాంతమున కవ్యవహితముగా ముందు

---

1. భారతము-తిక్కనరచనము-పుట 137.
2. నవరస గంగాధరము-పుట 97.

ప్రవర్తింపజేయబడిన అంగిరస మిది తత్పూర్వ మున్నవి వీరాది యుద్ధరస భావములు ఎంత తావన్మాత్రములుగా చేయబడి వర్ణింపబడినను అవి శాంతరసవిరోధులే. ఈ కరుణము వీరాది యుద్ధరస భావముల స్ఫూర్తిని దూరీకరించి సహృదయుల బుద్ధులను శాంతమున కభిముఖము చేయుటకుగాను ప్రవర్తింపజేయబడినది. అందువలన విపులముగా వర్ణింపబడినది ఇంకను నిట్లు విచారించవచ్చును వీరాదులు ప్రవృత్తిలక్షణము కలవి నివృత్తిలక్షణముకలది శాంతము ప్రవృత్తి యనగా వాగ్బుద్ధిశరీరారంభము. రాగద్వేషరూపచిత్తవృత్తులతో పుణ్యపాప రూపకర్మలయందు ప్రవర్తించుటయే ప్రవృత్తి. ఇదికాక దీనికి వ్యతిరేకమైనది నివృత్తి లోకము ననుసరించి చెప్పినచో ప్రవృత్తి రక్తి. నివృత్తి విరక్తి. విరక్తియన్నది శోకమునుండి పుట్టుట లోకానుభవమువలన తెలియుచున్నది రక్తియొక్క తీవ్రత శోకమునందు పర్యవసించుటయు లోకమున కనిపించుచున్నది. అనగా రక్తి విరక్తులకు మధ్య శోకము లోకమున ప్రవర్తించుచుండుట ప్రత్యక్షముగా కనిపించుచున్నది లోక మెట్లో కావ్యములును నట్లే. ఈ శోక మిటు రక్తికి భరతవాక్యముగను, అటు విరక్తికి నాందిగను కనిపించుచున్నది. ఇది యా రెండు విరోధిభావములకును నవిరోధి. కనుకనే తాను మధ్య వర్తించి తద్విరోధమును పరిహరించి ఏకవస్త్వాశ్రయమును వాటికి కలుగజేయుచున్నది. అందువలననే భారతమున వీరాది యుద్ధరసభావములు ప్రవర్తించిన వెంటనే శోకము ప్రసక్తికి తీసుకొనిరాబడినది. అనగా నంగిరసమున కిది ప్రధానమైన అంగముగా భారతమున నిర్వహింపబడినది ప్రధానమైన అంగరసము గనుక విపులముగా వర్ణింపబడినది ఇపుడు మరియొక విధముగా నిచట ప్రశ్నింపవచ్చును. ప్రధానరసము నాయకు ననుసరించియుండును గదా ! తదుద్దీపకమైన కరుణముకూడ నాయకు డాలంబనముగా వర్ణింపవలయును గాని గాంధారి నాలంబనముగా చేయుట యేల? అని శాంతరసనాయకుడైన ధర్మజుని యందు శమరూపచిత్తవృత్తియే వర్ణింపవలయును అనగా చిత్తవృత్తులు పుట్టి శమించుటను వర్ణింపవలయును శమింపజేయవలసిన చిత్తవృత్తిని విపులముగా పెంచి వర్ణించుట తగదు పుట్టిన చిత్తవృత్తి యొకటి పుష్టమైనచో నది త్వరగా శమింపదు అందువలననే ధర్మజునియందు వీరాదులేవియును పుష్టము చేయబడలేదు ఆ పుట్టిన చిత్తవృత్తు లెట్లు వెంటనే శమింపజేయబడినవో ఇతఃపూర్వ మీ గ్రంథమున చాలచోట్ల చెప్పబడినది. దుర్యోధనుడు తొడలువిరిగి

పడుటతో ధర్మరాజునకు శోకరూపచిత్తవృత్తి ప్రారంభమైనది. సౌప్తికపర్వమున నుపపాండవులు మరణించినప్పు డది మరికొంచెము పెంచబడినది. తరువాత నది శమింపజేయబడలేదు, పుష్టము చేయబడలేదు గాంధారిశోక ముద్దీపనప్రాయముగా చేయబడినది. కేవలము ధర్మజుని శోకమును విపులముగా వర్ణించినదానికంటె ఈ యుద్దీపనకల్పనము చాల సొగసైన పని. దీనివలన భారతయుద్ధమున ప్రతిపక్షమువారి ఫలానుభవము చెప్పినట్లయినది మరియు ధర్మజుని చిత్తమునందు, ఆ వృద్ధగాంధారియొక్క శోకము ప్రభావము పడి బంధుభావము తోడి నిర్వేదము ప్రతీయమానమగుట కవకాశము కల్పించినట్లు అయినది కనుక స్త్రీపర్వమున గాంధారి నాలంబనముగా చేసి శోకమును వర్ణించుటయే శ్రేష్ఠమైన పని

శోకవర్ణన మనగా నిర్వ్యాపారాత్మకమైన దుఃఖరూప చిత్తవృత్తిని బహువిధముల నిరూపించుట గాంధారి నూర్గురుకొడుకులను పోగొట్టుకొన్నది. ద్రౌపది యైదుగురు కొడుకులను పోగొట్టుకొన్నది. ఉన్న కొడుకు లందరును మరణించుట యన్నది ఇరువురకును సమానమే. ఆ యిరువురును యుద్ధభూమి యందు కలిసికొనినారు. ద్రౌపదికి గాంధారి పెద్దత్తగారు ద్రౌపది గాంధారి కాళ్ళు చుట్టవేసుకొని బావురు మని యేడ్చినది. పెద్దదిగనుక తాను ద్రౌపది నోదార్చవలయును తన దుఃఖము తన కున్నది. తనదియు పుత్రశోకమే. ఒక చిత్రమైన సన్నివేశ మది. కుటుంబకలహమువలని ఫలిత మది. ఎంత వైరము వచ్చినను ఎంత దుఃఖము కలిగినను బంధుభావ మది రక్తనిష్టమైన గుణ మెచటకు పోవును? ముందు గాంధారి తన దుఃఖమును దిగమ్రింగికొని ద్రౌపది నుద్దేశించి యిట్లన్నది—

పుత్రి యిట్లగు నమ్మ శోకముఁ బొంది కుందుచునున్న నీ
గాత్ర మొండొక కీడు వాటిలి కందు పాండుతనూభవుల్
పుత్రవర్గము చన్నచో నెద భూరితాపముఁ బొందుడుం
బౌత్రహీనతఁ బడ్డ గొంతికి బాయనేర్చునె నెవ్వగల్ [1]

మరియు తన దుఃఖమును వెలికివచ్చుచున్నది దాని నాపుకొనుచున్నట్లుగా ద్రౌపదితో నింకను గాంధారి యిట్లన్నది.

1. భా. స్త్రీ. 1-183.

నిను నే నిట్టూరార్చెద
నను నీ పూరార్పవలదె నా నీ తెఱఁగుల్
విను మొక్క రూప మన కే
మన గలదు విధాత క్రూరుఁడై పరుపంగన్ [1]

వ. ఎవ్వరు నేమి సేయుదురు? కాలవంశంబున నవశ్యభావియైనది యయ్యె నుపశమింపుము-[2] తాను పెద్దదైనందున కోడలి నోదార్చుట, నిన్ను నే నోదార్చెదను— నన్ను నీ వోదార్పుము- మనయిద్దర గతియు నొక్కవిధ ముగనే పట్టినది అని ఈ మొదలుగా దిగ్రమింగికొనజాలని తన దుఃఖమును దిగ్రమింగికొనుటలను బట్టి యా సన్నివేశ మెంత శోకమయమో భావింపవల యును ఒకటిరెండు పద్యముల నుదాహరించి అందీ రసము ప్రతీయమానమగు చున్నదనుట కేవల మనుభవవిషయము పూర్వాపరములయందలి విభావాను భావరూపసామగ్రిని పురస్కరించుకొని అభివ్యక్తముకావలసినది రసము పద్యము నుదహరించుట యనగా వ్యంజకమును చూపించుట. అందు ఫలానా రసమున్న దనగా తద్రసము నభివ్యంజనము చేయుట కా పద్యము ముందువెనుకలమీద నాధారపడి సమర్థమగుచున్నదని యర్థము వాచ్యవాచకములను మించి రసము ధ్వనింపవలయును ఉదాహరణము లెన్ని యిచ్చినను నవి రసమూర్తులు కావు అవి యాధారముగా భావన చేయబడవలయును.

స్త్రీపర్వమునందలి ద్వితీయాశ్వాస మంతయు గాంధారి ముఖమున సర్వ కౌరవపాండవ దుఃఖము వర్ణింపబడినది అందరును గాంధారికి కావలసినవా రగుటచేత నామెయందు శోకము స్థాయినందుకొనునట్లుగా వర్ణించుటకు వీలైనది చివర కామె పుత్రశోకము "చిత్తస్థాయి" యైన దని తిక్కన్నగారు వ్రాసిరి. ఆ శోకమును తిక్కన్నగారు వర్ణించిన రెండుమూడు విధానము లిచట చూపబడును.

దుర్యోధనవల్లభ భర్తశవమును పట్టుకొని యొకప్రక్కను కుమారుని శవమును పట్టుకొని మరొక ప్రక్కను చిత్త మురియాడ నేడ్చు చు న్న ది. గాంధారి ఆ కోడలిని చూచి ఆమె దుఃఖము నంతయు పేర్కొని తాను విల పించినది.

---

1. భా స్త్రీ. 1-184.
2. భా. స్త్రీ. 1-186.

కొడుకు చావు కంటెఁ గోడలి యడలునఁ
బెరిగి శోకవహ్ని దరికొనంగ
నంతరంగ మిప్పు డగ్గల మెరయంగఁ
దొడఁగె దీని కేది తుది యుపేంద్ర.[1]

చూడు మిమ్ముద్దియ సుతుఁజూచి వదన మ
ల్లార్చుచుఁ బ్రాణేశు నాననంబు
పైఁజూడ్కి యడరించి పాణితలంబున
నందంద నెమ్మొగ మడిచికొనుచు
మరలఁ బుత్రునిదెస కరిగిన మనసు వే
రడలున మునుగంగ నతని చెన్ను
మోమునఁ దన మోము మోపి మూర్ఛిల్లుచుఁ
దెలిసి వల్లభు నురస్థలము గ్రుమ్మ

నుదుకుఁ గన్నీరఁ దడియంగ నొఅగుచు వి
చేష్టయై యూరకుండుచుఁ జెలులతోడఁ
దిరిగి పొగులంగ వేనలి విరియ మేన
నవులఁ దిరుగుచు నున్నది యక్కటకట.

వ. అని వెండియు

ఈ సుమధ్యమ యిమ్మహీశ్వరు బాహుత
లంబున లలితోపలాలనంబు
నొంది రాగిల్లెడు నుల్లంబుతో నుండు
నింకిట నిమ్ముగ్ధ నెట్లు సూడ
వచ్చుఁ గనుంగొన వశముగా దిది యిట్టి
కొడుకును మనుమండుఁ బుడమి నిట్లు
పడియుండఁ జూచెడు పాపజాతికి నిప్పు
డవియక నిగ్గడిదైన యినుప

1. భా.స్త్రీ. 2-44.

గుండియకుఁ జేటుపాటింకఁ బుండరీక
నయన ! యెన్నడు లేమి నిర్ణయము గాదె
యింత కోర్చెడునట్టి వారెన్నఁ డేని నుర్వి
నెందేనిఁ గలుగుదురొక్కో ? యొరులు.

జననియు భార్యయు నేమై
న నేమి ? వేదములు బొంకునకుఁ జోరమి నిజం
బని పుణ్యలోకమగు నని
తన కార్యము సూచె నిట్లు తగునె యితనికిన్ "[1]

ఇదంతయు నా దుర్యోధనునివల్లభ దుఃఖమును చూచి పేర్కొనిన గాంధారి యొక్క నిబ్బరించుకొనలేక పగులబడిన పుత్రశోకముయొక్క వాగ్రీతి-ఇట్టిదే యింకొకటి. కూతురు దుస్సలాదేవి సైంధవుని కళేబరము వద్ద చుట్టుప్రక్కల వాని శిరముకొరకు వెదకుచున్నది అది చూచి గాంధారి యిట్లేడ్చినది.

హృదయమున వగలేనియ ట్టిట్టునట్టుఁ
దరుగుచున్నది దుస్సల వరుని శిరముఁ
గానక ఈ కూతు నిమ్మెయి గనుటకంటెఁ
దలప నెక్కుడు దుఃఖంబు గలదె కృష్ణ [2]

మరియు నభిమన్యుని శవమును కౌగిలించుకొని ఉత్తర యేడ్చుచుండుటను పేర్కొని గాంధారి యిట్లే విలపించినది ఈ విధముగా కోడలు - కూతురు - మనుమరాలు మొదలుగాగలిగిన స్త్రీజనముయొక్క చేష్టలను పేర్కొనుచు గాంధారి విలపించినట్లు వర్ణించుట యొక పద్ధతి

"యతః ప్రకృతి మధురాః పదార్థాః శోచనీయతాం ప్రాప్తాః ప్రాగవస్థా భావిభిః సంస్మర్యమాణై ర్విలాసై రధికతరం శోకావేగ ముపజనయంతి"[3] అని కరుణరసపరిపోషణ విషయమైన వాక్య మొకటియున్నది. ప్రకృతిమధుర పదార్థ మనగా నొక్కశృంగారమే కాదు. ఒక ఉదాత్తమైన జీవనవిధానము కూడ ప్రకృతిమధురమే కరుణమును పోషించుటకు, అనగా శోకావేగమును

1. భా. స్త్రీ. 2-45....48.
2. భా. స్త్రీ. 2-96.
3 ధ్వనిసారః—పుట 1-39.

పెంచుటకు ప్రకృతదుస్థితికి వ్యతిరేకములైన ప్రాగవస్థాభావులైన విలాసరూపమైన సుస్థితికి స్మృతికి తేవలయును ఆ విలాసరూపసుస్థితి శృంగారాత్మకమే కానక్కరలేదు. దుర్యోధను నుద్దేశించి గాంధారి విలపించుటలో నొక పద్యమిట్లున్నది—

పదునొకం డక్షౌహిణులే
పొదవంగ నలిం గొలువ నొప్పు నుర్వీశ్వరుం డే
తుది నిష్పరివారుండై
గదం జేకొని యొంటి పోరి కలనం బడియెన్ [1]

దుర్యోధనుని ప్రాగవస్థ పదునొకం డక్షౌహిణుల పరివారముతో కొలువబడిన నుర్వీశ్వరత్వము ప్రస్తుతావస్థ పరివారమున నొక్కడును మిగులనివాడై యొంటరిగా శత్రువును గదాయుద్ధమున నెదుర్కొని చచ్చి నేలపై తొడలు విరిగి పడియుండుట ఈ ప్రకృతావస్థ శోచనీయముగా నున్నది. ప్రాగవస్థ ప్రకృతి మధురము అది స్మృతికి తీసికొనిరాబడినందున ప్రకృతస్థితివలని దుఃఖమున కుద్దీప్తికలిగినది గాంధారి ద్రోణుని శవమును చూచి యిట్లు ప్రాగవస్థను తలచి విలపించినది-

సతతంబును శిష్యులు సద్వినయా
న్వితులై ప్రణమిల్లెడు వీరి పద
ద్వితయంబు గడుం జెడ దిన్నవి సూ
చితె నక్కలు దైవము చెయ్ది కటా ![2]

పేరు పేరు వరుసన పేర్కొనకుండ గాంధారి యుద్ధమున మరణించిన రాజుల నుద్దేశించియు నీ పద్ధతిలోనే విలపించినది-

హంసతూలికాతల్పములందుం బొందు
భోగిజనముల మృదుగాత్రములు ముకుంద
కంటెం బరుసని ధరణిభాగమున గూలి
యున్న యవి సూచువారల యుల్ల ముడుక.[3]

---

1. భా. స్త్రీ. 2-47.
2 భా. స్త్రీ. 2-121.
3. భా. స్త్రీ 2-14.

వనితలు మేలపుమెయి మెలు
పునఁ దిగిచిన నొప్పు హారములు మొదలగు ప్ర
న్నని తొడవులు గ్రద్దలు దివి
య నరేంద్రులు గొంద ఉనికి యచ్యుత కంటే [1]

ఈవిధముగా నీయాలంకారిక పద్ధతికి ఉదాహరణములు చాల చూపించ వచ్చును. అధికభాగ మీ విధముగనే తిక్కన్నగారు వర్ణించిరి అభిమన్యుని శవమువద్ద పడి కన్నీరు మున్నీరుగా నేడ్చు ఉత్తర చివర కిట్లన్నది—

............నిన్నొందఁ గాంచి
యారునెలలు వోయె నంతియ యింతియ
కాని లేదె తొంటి మేనఁ జేసినట్టి మేలు—[2]

తా నభిమన్యుని పొంది యారునెల లైనదని యుత్తర యనుచున్నది మరియు నంతకంటె నధికమైన ఫలము ననుభవించుటకు తాను పూర్వజన్మమున చేసిన పుణ్యము లేదనుచున్నది. ఉత్తరాభిమన్యుల వివాహ మైనప్పటినుండి పాండవుల సమరసన్నాహమే యున్నది ఆ సన్నాహము యుద్ధము మొత్త మైదారునెలలు పట్టినది అభిమన్యుడును మహావీరుడు గనుక తనకు వివాహమైన క్రొత్త పెండ్లముతోడి సంసారసుఖము ననుభవించుటకంటె తండ్రులతోపాటు సమర సన్నాహములయందే అధికముగా పాల్గొనియుండవచ్చును. యుద్ధమున పదు మూడవనాడు మరణించినాడు పసుపుబట్ట లింకను మాయని ఆరునెలలు తిరుగ కుండ విధవయైన ఉత్తర ఆ మొదటి మూడుదినముల అభిమన్యుని పొందును భావించుచున్నట్లున్నది ఆ పూర్వస్మృతియొక్క మాధుర్యము తత్కాలము నందు శోకముయొక్క ఆ వేగమును లెస్సగా పెంచుచున్నది — ఈ విధముగా ప్రకృతావస్థకు వ్యతిరేకమైన ప్రాఙ్మధురావస్థను స్మృతికి తీసికొని వచ్చి ప్రకృతమైన శోకమును విరివిచేయుటయన్న పరమమైన ఆలంకారికమార్గము స్త్రీ పర్వమున మిక్కిలిగా ననుసరింపబడినది

కొందర అమానుషపు చర్యలను, మరియు నధర్మయుద్ధములను పేర్కొనుచు గాంధారి విలపించినట్లుగా కొంత గ్రంథము వ్రాయబడినది. "నెత్తురె త్తి

1 భా. స్త్రీ. 2-17.
2. భా. స్త్రీ 2-81.

త్రావుట భీముండు గడున్ ఘోరము చేసెను.''[1] దుశ్శాసను నుద్దేశించి విల పించుటలోని వాక్యమిది ఇట్లే అభిమన్యుని పలువురుకూడి చంపిన విషయ మును, భూరిశ్రవసుని చేతిని అర్జునుడు ఖండించుటను, ప్రాయోపవేశమున ప్రాణత్యాగము చేయుటకు సిద్ధముగా నున్న వాని శిరమును సాత్యకి అర్జునా దులు వారించుచున్నను నిలువక త్రుంచుటను మొదలుగా గలిగిన యుద్ధమున జరిగిన అధర్మపుచేతలను పేర్కొనుచు నామె విలపించినది

మరియు దుర్యోధనాదుల దుష్కృత్యములనుకూడ పేర్కొనుచు గాంధారి శోకించినది ఇది యా దుఃఖమునుండి తనను తా నుపశమింపజేసి కొను ప్రయత్నము కావచ్చును దుర్యోధను నుద్దేశించి యిట్లన్నది

విదురుఁడుఁ దండ్రియు దనకుం
బదివేల విధములఁ జెప్ప బాటింపక దు
ర్మదమున తగియెడు బుద్ధులు
విధిమూడిన మర్త్యుఁ డేల విను నుచితోక్తుల్ [2]

దుశ్శాసను నుద్దేశించి యిట్లన్నది

దుశ్శాసనుఁ డీతండు సభకు ద్రుపద
పుత్రి నీడిచి తెచ్చి పొలుపు తనమ్మునఁ
బతుల సన్నిధిఁ గురుక్షితివిభునకుఁ
గర్ణునకుఁ జిత్తసంప్రీతిగాగఁ దూల
పుచ్చెఁ బెక్కువిధంబుల నొచ్చి యా మృ
గాక్షి యప్పుడు మారుతి యంతరంగ
మేర్పఁ దలపించు దానన యింత పుట్టె [3]

శకుని నుద్దేశించి యిట్లన్నది

.........నెత్త మాటకు నీతండు
గఱచు టెల్లఁ గురునికాయ నాశ

1. భా. స్త్రీ. 2-62.
2. భా. స్త్రీ. 2-40.
3. భా. స్త్రీ. 2-55.

మునకు నయ్యె ఈ నృపుడకాడె పాండునం
దనులతోడి వైరమునకు కర్త.[1]

ఈ విధముగా భారతయుద్ధమునకు కారణభూతులైనవారి దుష్కృత్యములను తలపోయుటవలనను, మృతులయొక్క పరమమైన ప్రకృత నీచదశను చూచి పరమోదాత్తమైన ప్రాగవస్థను స్మరించుటవలనను, అనాథలైన బంధుజనము యొక్క దుఃఖముపొందుటను చూచి సహింపలేక వాపోవుటవలనను, గాంధారి యొక్క పుత్రాదుల మరణముపలని దుఃఖము చిత్తస్థాయి యగునట్లుగా స్త్రీ పర్వమున వర్ణింపబడినది భారతమునందలి ముఖ్యమైన అంగరసము కరుణము వర్ణింపబడిన విధానము స్థూలముగా నిట సూచింపబడినది

**శృంగారము :**

అర్చించు నప్పు డయ్యంగన కెంగేలి
జిగిసొంపు చిత్తంబు దిగిచికొనగ
నరసి కన్గొను నప్పు డయ్యింతి కనుఁగవ
పొలపంబు రాగంబు వొదలఁజేయ
నన్యూలఁ బనిఁ బంచు నప్పు డమ్ముద్దియ
పలుకుల తీపు గోర్కులఁ గెలర్ప
నల్లన యూఁదెడు నప్పు డక్కొమ్మ వా
తెఱతావి ధైర్యంబు ద్రిప్పుకొలుప

మరుఁడు దోడ్తోడఁ దేకువమాలి కదిసి
తూపుగముల క్రొవ్వాడిమి సూపనంత
కంత కగ్గలమగు వలపంతఁ దూల
పోయె పావకుఁ డేమి సెప్పుదు నరేంద్ర [2]

దుర్యోధను డను రాజు కూతురు సుదర్శన ఆమె తండ్రి పనుపున నింట వాని యగ్నిహోత్రముయొక్క పరిచర్యా పరిరక్షణములయందు వ్యగ్రబుద్ధియై వర్తించుచున్నది. అగ్ని దేవున కామెయందు మనస్సు పోయినది ఇక శృంగా

1. భా. స్త్రీ. 2-136.
2. భా. అను. 1-48.

రము ప్రవర్తించుచున్నది అగ్నిదేవతయందు మానవతాలక్షణ మాపాదింపబడినది సుదర్శనయొక్క చేష్ట లాయనకు నుద్దీపకములైనవి. ఇక్కడ తిక్కన్న గారు చేయుచున్న దేమనగా సుదర్శనయొక్క బాహ్యచేష్టాభివర్ణనముతో నగ్నిదేవుని అంతర్వికారములను కలిపిచెప్పుట అనగా నామె విషయమున మనోవికార మున్నట్లులేదు. అగ్నివిషయమున బాహ్యచేష్టలు లేవు సుదర్శన ప్రతినిత్యము నగ్ని నర్చించుచుండును తను నర్చించు నెపమున ఆ కెంపురంగు చేతుల సుషమాసౌభాగ్యముచేత తన చిత్తమును దగ్గరకు లాగికొనుచున్నట్లున్న దగ్ని దేవునకు కొంచెము నుసి యధికముగా క్రమ్ముకొని అగ్నికణములను వెలికి కనిపింపనీయనప్పు డామె విప్పుగన్నులతో నరసి బూదిని తొలగద్రోసి అగ్నిని జ్వలింపజేయును. సుదర్శన విప్పుగన్నులతో నట్లు చూచుట అగ్నికెట్లున్నదనగా తనలోని రాగభావమును విస్తరింపజేయుచున్నట్లున్నది అప్పుడప్పు డామె ఇతరులతో నీ వా పని చేయుము, నీ వీ పని చేయుము, అని ఈ మొదలుగా నాజ్ఞాపించుచున్నట్లు మాటాడుచుండును అట్లామె ముఖముగా నాజ్ఞారూపమున వెలికివచ్చు వాగ్రీతిమాధుర్యము, తనలోపలి కోర్కెలను ప్రకోపింపజేయుచున్న ట్లగ్నికుండును మరియు నగ్నిని రవులుకొనజేయుట కామె కొంచెము మీదికి వంగబడి నోటితో నూదును. ఆమె ప్రాణవాయువుల ట్లా అధరమును స్పృశించుకొనుచు పోయి సోకగా నగ్నికి తన మనస్సుయొక్క దిటవుతనమును చెదరగొట్టుచున్న దనిపించుచుండును. అనగా తాత్పర్య మిది అగ్నిదేవుని చిత్త మా సుదర్శనయందు బద్ధమైన ప్రవృత్తిలక్షణముకల దైనది రాగము దినదిన మభివృద్ధి యగుచున్నది. లోపలి తన కోర్కెను చెప్పవలయు ననుకొనుచున్నాడు. అగ్నిదేవుడు తనను తాను నిబ్బరించుకొనలేకపోవుచున్నాడు ఈ యన్నింటిమొత్తము రూపమున మన్మథుడు వానిని బాధించుచున్నాడు. అగ్ని దేవునకు సుదర్శనయందలి రతిభావముయొక్క పుట్టుక చెప్పబడినది సుదర్శన చిత్తములక్షణమిందు చెప్పబడలేదు అనగా నేకత్రైవానురాగ వర్ణనమువలె నున్నదివలె ఉన్నదే కాని అసలు కాదు ఏమనగా నగ్ని "వల్లభ వగుము నాకు" అని యొకనా డామె నడుగగా "సిగ్గుగదిరి యాననము వాంచి యలతియెలుగున నిట్లను నా లతాంగి" అని తిక్కన్నగారు వ్రాసిరి ఆమె అగ్నితో నన్న మాట లివ్వి.

కులకన్యకలకు వేడుకఁ
దలవీడులఁ బరులతోడి తగు మాటలకుం
దలకొనఁ దగునే ? గురుజన
ముల కా క త్తెఱగు వారు పురుషార్థనిధీ ![1]

తలవాకిట నిలబడి, వేడుకపడి పరపురుషులతో నందుకు తగిన మాటలు మాటాడుటకు కులకన్యకలు పూనుకొనరాదు కదా ! కులకన్యకల ఆ వేడుక తెఱగునకు తగిన మాటలు పరులతో మాటాడవలసిన వారు తల్లి దండ్రులు కదా ! పురుషార్థముల కునికివైన నీ కీ విషయము తెలియదా ? అని సుదర్శన అగ్నితో ననినది అనగా నీయందు నాకును వేడుకయున్నది. సిగ్గు విడిచి నే నా తెఱగు మాటలు నీతో మాటాడరాదు నేను కులకన్యకను కదా నీ వా విషయము మా గురుజనము నడుగుము వారు మాటాడుదురు - అని సుదర్శన చెప్పినట్లు తిక్కన్నగా రుపదేశించిన 'తలవీడుల' అనుదానికి సిగ్గు మర్యాదలు విడిచి యని యర్థము ఈ సుదర్శన మాటలవలన నామె కగ్ని యందు మనస్సున్నదన్న విషయము స్పష్టము. కనుక నే వల్లభవగుము నా కని అగ్ని అడుగగనే సిగ్గుగదరినది ఆననము వాంచినది అలతి యెలుగున మాటాడినది. ఈ సుదర్శన ఆంతర్యమును తిక్కన్నగారు సీసపద్యము మొదటిపాద మున చిత్రముగా నిక్షేపించిరి మొదటిపాదాంతమున కొను ధాతువు ప్రయుక్త మైనది అది కర్త్రర్థకమున ప్రేరణాత్మనేపద చిహ్నము మిగిలిన మూడు పాదాంతములయందలి క్రియ లట్టివికావు. అవి కర్మార్థకవిషయముగా నున్న ప్రేరణములు క్రియాఫలము కర్తృగామి యగుచున్నప్పుడే కొనుధాతు వను ప్రయుక్తమగును. అగ్నిదేవుని చిత్తము ను సుదర్శన తన కెంగేలి యర్చనారూప క్రియకు ఫలముగా పొందినది అనగా వాని చిత్తము తనకు స్వాయత్త మగు నట్లుగా నామె తన కెంగేల అర్చించినది. కనుక మొదటినుండియు సుదర్శనకు కూడ వానియందు మన స్సున్నది ఒక్క క్రియాశబ్దముయొక్క ప్రయోగ వైచిత్రి నాశ్రయించి తిక్కన్నగారు సుదర్శనవిషయమును పరమరమణీయ ముగా నభివ్యక్తము చేసిరి. సుదర్శన అగ్నితో మాటాడిన మాటల తీరును బట్టి వెనుకకు చూచినచో నీయర్థ మా ధాతువునందు నిక్షిప్తము చేయబడినట్లు

1. భా. అను. 1-51.

కనిపించుచున్నది ఇచట నీ విషయమును చెప్పదలచియే మొదట సుదర్శన మనో వికారము విషయ మా సీసపద్యమున చెప్పబడినట్లు లేదని చెప్పబడినది మొత్తముమీద సుదర్శనాగ్నుల శృంగారకథ అన్యోన్య మానుకుల్యము కలదియే సుదర్శన విషయమున కూడ మనోవికారమును వర్ణించినచో శృంగారము మరియు దీప్తికి వచ్చును శాంతరసప్రధానమైన గ్రంథమున శృంగారమున కంత దీప్తిని కలిగించుట మంచిది కాదు. కనుక తిక్కన్నగారా పని చేయలేదు. అగ్నివిషయమున నట్టి వర్ణనము తత్ప్రకరణమున కవసరము.

గృహస్థధర్మమునయందుండి కూడ పురుషుడు మృత్యుభయమునకు లోను గాకుండుటకు వీలున్నదా యని ధర్మరాజు భీష్ముని అడిగినాడు. ఉన్నదని భీష్ముడు సుదర్శనుని కథను చెప్పినాడు ఆ సుదర్శనుని తల్లిదండ్రు లీ సుదర్శనాగ్నులు ధర్మరాజు ప్రశ్నకు సమాధానము సుదర్శనుని ఓఘవతితోడి గృహస్థవృత్తి కథనము సుదర్శనాగ్నులది కాదు. కాని చెప్పబడినది ఒక్క సుదర్శనాగ్నుల విషయమే కాదు సుదర్శనయొక్క తల్లిదండ్రుల విషయము కూడ తత్పూర్వము సూచింపబడినది. సుదర్శన తండ్రియొక్క సొగసుందనము నర్మదకు కామావేశమును కలిగించినది. స్త్రీరూపమున నర్మద దుర్యోధనుని పొందినది. సుదర్శన పుట్టినది. సుదర్శన సౌందర్యము అగ్నిదేవునకు కామావేశమును కలిగించినది. ఈ యిరువుర పొందువలన సుదర్శనుడు పుట్టినాడు. అనగా సుదర్శనుని పుట్టుకకు మూలమైన ఆప స్తేజోభూతములు రెండును కామ పరవశములై ప్రవర్తించినవి సుదర్శనుడు కామమును జయించినవాడు. సర్వ కామమును ఆప స్తేజోభూతములు తా మనుభవించి కామస్పర్శలేని పరమ ధార్మికమూర్తిని సుదర్శనుని ప్రసాదించినవి ఆ విధముగా సృష్టి ప్రథమలక్షణములైన భూతములచేత పరిశుద్ధుడుగా పుట్టకపోయినచో సుదర్శనునియందంతటి రాగములేనితనము నిరూపించుట కవకాశ ముండదు. అతిథి వచ్చి నిన్నను భవించుటను కోరినచో నీ వందుల కంగీకరించి అనుభోగ్యవు కమ్మని భార్యకు చెప్పగలుగుట రక్తనాళములు తెగిపోవలసిన విషయముకాని మరొకటి కాదు. నిర్వికారుడు సుదర్శనుడు చెప్పినాడు. భార్య అతిథితో నింట నేకాంతమున నుండగా వచ్చి వాకిట నిలిచి,పిలిచి, లోపలనుండి మేమిట్లున్నా మన్న పురుషస్వరమును విని "నీదు కతమున నేను సమ్మోదమగ్నమానసుడ నైతి .... నా వచ

నంబు నట్టుల మనంబును''[1] అని సుదర్శనుడు నిలువగలిగినాడు. ఆయన కా బలము నిచ్చిన దా యాప స్తేజోభూతములు. సర్వకామమును నవి పుంజుకొన్నవి. పురుషార్థనిధియైన అగ్ని కామవశుడైనా డనగా కామము వాని యనుభవించుట వలన భస్మీభూతమైపోయిన దని యర్థము కనుక నే వాని కుమారుడైన సుదర్శనునకు ధర్మార్థ మోక్షములే పురుషార్థములుగా మిగిలినవి. కామము రూపము లేదు. సుదర్శనుని చిత్తము శమస్థాయి నందుకొని మోక్షావలంబియైనది.

సుదర్శనాగ్నుల ప్రణయకథ భారతమున నెందుకు వ్రాయబడినదో ఇప్పటికి స్పష్టపడియుండును అగ్నిదేవుని కామవివశత్వము వర్ణింపబడి తరువాతి సుదర్శనునికథలోని పరమార్థమును స్ఫురింపజేయుచున్నది. తిక్కన్న సుదర్శన విషయము వర్ణించకుండనే స్ఫురింపజేసి అగ్నివిషయమును వర్ణించుటలోని రహస్య మది.

మరియు భారతమున సుకుమారీనారదుల ప్రణయకథ యున్నది అచట కూడ తిక్కన్నగారు నారదుని విషయమే స్పష్టముగా వర్ణించెను. గాని సుకుమారి మనోభావము లట్లు చెప్పలేదు దానికి కారణ మింకేమియును లేదు. శృంగారమున కంతగా దీప్తిని కలిగించుట భారతమువంటి గ్రంథమునకు తగ దనియే ఆయన స్త్రీపురుషుల ఇరువుర విషయమును చెప్పిన దొక్క ఉత్తరాభిమన్యుల వివాహ సందర్భముననే. తెరయెత్తబడిన తరువాతి వధూవరుల ప్రథమాన్యోన్యావలోకమును తిక్కన్నగారు వర్ణించిరి.

వరు చూడ్కి ముద్దియ వదనంబుపైఁ బాటి
　　తివుటమై నునుఁ గాంతి తీపుగ్రోలు
సుందరీరత్నంబు చూపు మనోరము
　　నడుగుల యొప్పుపై నల్ల నడరు
పతివిలోకనములు పడతుక మైఁదీవఁ
　　గలయంగఁ బలుమఱు మెలగుచుండు
వెలదికటాక్షముల్ విభునిపైఁ గ్రమమున
　　నెగసి మోమునఁ జోకి మగిడివచ్చు

1. భా. అను. 1-76.

నొండొరువుల లేఁజెమటల నూని ప్రేగు
పడిన చాడ్పున నవయవఘంగులందుఁ
దగిలి మఱపునఁ దడయు నిద్దఱ విశాల
నయనదీప్తులు నెఱుకువ బయలుపడఁగ.[1]

ఉత్తరాభిమన్యుల అన్యోన్యాసక్తమైన మనోగతులను వర్ణించుటకు భారతమున తిక్కన్నగారి కవకాశము లేదు. ఆ వివాహమే హఠాత్తుగా నిర్ణయమైనది అయినవెంటనే వివాహమునకు ముహూర్తము పెట్టబడినది ద్వారకనుండి అభిమన్యుడు పెండ్లికి తరలివచ్చినాడు. వివాహమునకు ముందు వధూవరులు చూచుకొనకూడ దన్న శాస్త్రసంప్రదాయము కథలోనే కలిసివచ్చినది. అందువలన తెరయెత్తబడిన తరువాతి యవలోకనమే వారికి ప్రథమాపలోకనమైనది. తదావరణవస్త్ర మొక్కసారిగా తొలగింపబడదు "తత స్సుముహూర్తే ఆవరణవస్త్రం కించి దపాస్య వరః కన్యాం దృష్ట్వా చక్షుషీ ఉపసగ్ంహ్యాత్యా... ఆవరణవస్త్ర ముత్తరతోపాస్య. అత్ర వరవధ్వో సంకల్పయతః ....... ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని ప్రజా శ్చోత్పాదయితవ్యాః"[2]- ఈ మొదలైన తత్కాలమునందు ప్రవర్తించు మంత్రముల నెరిగి తిక్కన్నగారు వ్రాసిన ఆ పద్యమును భావించినచో మరియు చమత్కారముగా నుండును. ముందొకసారి కొద్దిగా తెర తొలగింపబడినది అభిమన్యుని చూపు ఉత్తరముఖముమీద పడినది. ఆ యుత్తర యోరగా వంచిన తల నట్లే యుంచి కనురెప్ప లెత్తి చూపు సారించినది. ఆ చూపు అభిమన్యుని పాదములమీద పడినది రెండవసారి ఆవరణవస్త్రము పూర్తిగా తొలగింపబడినది అభిమన్యుని చూపులు ఉత్తరవపు వెల్లను చుట్టుకొని పోయినవి. సిగ్గుపెంపున వంచిన తలను కించిత్తు కించిత్తుగా నుత్తర యెత్తుటతో నామె చూపు క్రమముగా నభిమన్యుని శరీరమున ప్రాకి ప్రాకి వాని ముఖముమీద పడినది అభిమన్యు డామెనే చూచుచున్నాడు చూపును చూపెదుర్కొన్నది. తత్క్షణమే ఉత్తర తన చూపును దించినది ఆ యిరువుర చూపు లట్లు కలిసి సాత్త్వికోదయమైనది. దానితో నా యిరువుర కొక ప్రేగుదన మేర్పడినది. ఆ చూపులట్లే నిలిచినవి. వారి అంతర్యములు బయలుపడినట్లే అయినది. వైవాహికమైన మర్యాదను చిత్రముగా నా పద్యమునందు తిక్క-

1. భా. విరా. 5-395.
2. ఆపస్తంబీయ పంచదశకర్మానుక్రమణిక-పుటలు 256, 257.

న్నగా రిమిడ్చివ్రాసిరి మరియు వారి యన్యోన్యానురాగమును సాత్వికోద యమువరకు చెప్పి శృంగారమును తత్ప్రకరణమున చేయవలసినంతవరకు పుష్టముచేసిరి. సంతానార్థముగా చేయుసంకల్పమునకు ముందటి అన్యోన్యావ లోకనమును వర్ణించి వారియందు సాత్వికోదయమును పేర్కొనుటవలన, వారి వివాహ మేమి ప్రయోజనము నపేక్షించి భారతమున వర్ణింపబడుచున్నదియు సూచించినట్లయినది ఆ ప్రయోజన మింతకుముం దీ గ్రంథమున వ్రాయ బడినది.

ఇక విరాటపర్వమున నాభాసరూపమున ప్రవర్తించిన శృంగారము—కీచ కునకు ద్రౌపదియందు పుట్టిన మోహావేశము వర్ణన మది ఈ శృంగారాభాస మును భారతకర్త కల్పించుటలోని ఆంతర్యము వెనుక చెప్పబడినది ద్రౌపదిని కీచకుడు కామించినాడు. ఆమెకు వానియం దసలు బుద్ధియే లేదు కనుక కేవలము కీచకముఖముగనే శృంగారభావపరంపర కొనసాగింపబడవలయును. తిక్కన్నగారు రెండతస్తులుగా నీ కీచకుని శృంగారమును వర్ణించిరి భీముడు కీచకసంహార మనివార్య మన్న నిశ్చయమునకు రా లాగిన కీచకుని కాముక చిత్తవృత్త్యభివర్ణనము మొదటిది తదనంతరపు కీచకునియొక్క మోహావరి తాపము వర్ణనము రెండవది భారతకథకు మొదటివర్ణన మవసరము రెండవ దానితో నంత ప్రయోజనము లేదు. అది కేవలము ద్రౌపదియందు వాని కెంతటి మోహాభావమున్నదో వ్యక్తముచేయునది. మోహావేశముతో వాడు చేసిన చేతలు భారతమునకు కావలయునుగాని వాని కేవలమోహాభావ మక్కర లేదు కీచకుడు ద్రౌపదిని కామించుట మాత్రమున భీమునిచేత చంపబడలేదు. కామించి అనుచితముగా ప్రవర్తించుటవలన చంపబడినాడు. తదనుచితప్రవ ర్తనమంతయు మొదటి ఘట్టమున తిక్కన్నగారు వర్ణించిరి. కనుక నది భార తమున కవసమైనది. రెండవ దట్టిదికాదు. కాకపోయినను తిక్కన్నగారు వర్ణిం చిరి. అది వేరు విషయము

పరదారాభిమర్శనాభిలాషి యైన కీచకుడు ద్రౌపదిని చూచుటతో కథ ప్రారంభింపబడినది కీచకుడు కుసాభిమాని నానాభరణ ధరణశీలుడు దుర్వి దగ్ధుడు. బలగర్వితుడు. ఈ నాలుగు లక్షణములను వానియందు తిక్కన్నగారే చెప్పిరి వాని శృంగార మా నాల్గులక్షణములమీదనే పరచబడినది. దుర్విదగ్ధత కేవలము బుద్ధి విషయము గనుక నది వానియందలి శిఖరభూతమైన లక్షణము.

ద్రౌపది చాల అందమైనది. ఆమె శరీరలావణ్యమును చూచి ధార్తరాష్ట్రాంగ నలు నూర్గురు నోర్చుకొనజాలరైరి - యని నన్నయ్యగారు చెప్పిరి ఆమె అంత అందమైనది. కీచకుడు రూపాభిమాని ఆమెమీద పడిన తన చూపును క్రమ్మఱుప నేరక యూరక అక్లే నిల్చిపోయినాడు ఆమెను చూచిన తరువాత వాని చిత్తమున పుట్టిన మొదటి యూహను తిక్కన్నగా రిట్లు వ్రాసిరి.

> ఎందును నిట్టి రూపు నరు లెవ్వరు గాంచిరె నాక కాదు సం
> క్రందనసూతికిం దగిలి కన్గొనఁ జాలదె దీన నిందిరా
> నందనుశాజ్ఞ యేచి భువనంబులఁ బ్రబ్బదె యిత్తలోదరిం
> జెందగఁ గాన్పు గాదె ఫలసిద్ధి పురాతనపుణ్యవృద్ధికిన్ [1]

ఆమెను కీచకుడు చూచుటయు, ఆమె రూపలావణ్యమునకు వాని కన్ను భ్రమసి పోవుటయు, ఆమెను పొందుటను వాడు తలపెట్టుటయు-అన్నియు నేకకాల మున జరిగినట్లున్నవి. తరువాత తరువాత వాడు ద్రౌపది రూపసౌందర్యము నెంతగా నెట్లు భావించినదియు తిక్కన్నగారు విపులముగా వ్రాసిరి కీచకుడు నెమ్మదిగా ద్రౌపదిని సమీపించి యడిగినాడు. ఆమె తన పతుల పరాక్రమమును చెప్పి బెదరింపజూచినది కీచకుడు బలగర్వితుడు "నా యతుల బాహుబలముఁ బెనయంగ భవదీయ పతులు కారు, మూడులోకంబులందు నెవ్వాడు లేడు నిక్కువం బింత నమ్ముము-"[2] అని ద్రౌపదికి సమాధానము చెప్పినాడు. ఈవిధ ముగనే తనను వారించుటకు జూచిన సుధేష్ణతోకూడ చెప్పినాడు ద్రౌపదిని వెంటబడి కొలువుకూటముముందు తలపట్టి తిగిచి పడదన్నుట వాని బలగర్వము నకు శేఖరమైన ఉదాహరణము. ద్రౌపది నర్తనశాల సంకేతముగా చెప్పిన తరువాత నామె (భర్తలు) గంధర్వు లేవురు గలరని చెప్పిన దానిని స్మరించియు అర్ధరాత్రమున శంక యొక్కింతయులేక తా నొక్కడు నర్తనశాలను చేరబోవు టకు వాని బలగర్వమే కారణము అపుడు వాని స్వాంతము బాహుగర్వ ఘన సంతమసాంధమైన దని తిక్కన్నగారు వ్రాసిరి నానాభరణధరణశీలత వాని కాముక చిత్తవృత్తి ననుసరించిన బాహ్యలక్షణము ఒకటి రెండు చోట్ల నదియు సూచింపబడినది. వాని దుర్విదగ్ధతను తిక్కన్నగారు లోకోత్తరముగా నిరూ పించిరి.

---

1. భా. విరా. 2-26.
2. భా. విరా. 2-56.

దుర్విదగ్ధత యనగా దుష్టమైన బుద్ధియొక్క వైశారద్యము అది కల వాడు దుర్విదగ్ధుడు కీచకు డట్టివాడు వాని బుద్ధినైశిత్యము చాల గొప్పది కాని యది దుష్టము. చిక్కంతయు నక్కడే యున్నది. ద్రౌపది నెట్లయినను "అలవరించి కూర్చు" భారమును నెత్తినవేసికొని సుధేష్ణ కీచకు నప్పటికి వంపి వేసినది వాడు తనమందిరమునకు పోయినాడు ఇక తన యక్కగారిచేత నలవ రించి పంపబడు ద్రౌపదియొక్క తన యెదుటికి వచ్చుటను కీచకుడు భావింప మొదలు పెట్టినాడు అపుడు తిక్కన్నగారు "దుర్విదగ్ధుండు గావున నమ్ము గ్ధకుం దన సన్నిధిఁ గామవికారంబు పుట్టుట గలుగ భావించినా"డని కీచకుని గూర్చి వ్రాసిరి కీచకుని ఆభావించుటను లోకాతిశాయి రమణీయముగా తిక్క న్నగారు వ్రాసిరి.

కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్ళుఱికెడు
వాలుగు సోగల నేలుదెంచి
కరువలి సుడియమిఁ గదలక చెన్నొందు
నెఱవిరి తమ్మిల నుఱక తెగడి
బెడఁగొందఁ దుడిచి మైఁదొడసిన వలరాజు
వాలిన తూపుల దూలఁ దోలి
పొలపంబు మెఱసి దిక్కులఁ గాంతి పూరించు
క్రొక్కారు మెఱుగుల నుక్కడంచి

తన విలోచనములు నాదు మనము నాఁచి
కొనగ నయ్యింతి ననుఁ గనుఁగొనియె నాత్మఁ
గైకొనియె రాగరసమునఁ గడలుకొనియె
మదనవికృతి బయల్పడి నుదిలకొనియె.[1]

ఈ సీసపద్యము పై నాల్గుపాదములును ద్రౌపదియొక్క విలోచనచ్ఛవ్యతిశ యముచేత నెందుకును కొరగాకుండ చేయబడినవాలుగలను, నెఱవిరితమ్మిలను, వలరాజు వాలికతూపులను, క్రొక్కారు మెఱుగులను, చెప్పుచున్నవి. అదంతయు సాధారణమైన విషయము. లోకోత్తరత గీతపద్యమందున్నది కీచకు డనుకొనుచున్నాడు – ఆమె నా వైపు చూచినది. నా మనసు నామె

1. భా. విరా. 2-83.

చూపులు లాగికొన్నవి చేత నందిపుచ్చుకొన్నట్లు నా యాత్మను స్వాయత్తము చేసికొన్నవి. నాయందు ప్రసరించు రాగముయొక్క రసరూపతవలన నామె కన్నులు విస్తరించినవి దానితో తాను మదనవికారమును పొందుట బయట పడగా లజ్జాభిమానము కలిమిని మురిసిపోయినది. ద్రౌపదినయనము లాలంబన ముగా కీచకుని దుర్విదగ్ధత చేసిన సుకుమారమైన ఊహ యది. తనయందే కోశ మునను మనసులేని ఆమెను గూర్చి, ఆమె తనవద్దకు వచ్చినట్లు, తనను చూచి మదనవికారము నాపుకొనజాలనట్లు, తన సర్వమును విలోకనము మాత్రమున నామె స్వాయత్తము చేసికొన్నట్లు, మధురలజ్జ పొందినట్లు – ఇంత ఊహ చేసి నాడు ఈ యూహ కంతకును మూలము తనయక్క తనకిచ్చిన మాట. మాటమీద వా డూహలు పెంచినాడు. తనను గురించి తన యక్క ఆమెతో చెప్పును మరియు నాధికారికముగా తనవద్ద కామె నాజ్ఞాపించి పంపినను పంపవచ్చును ఆమె తన కడ కెట్లును వచ్చును. తనతో నపు డట్లన్నది. కాని తనయం దామె కును భావమున్నది. ఆ విధముగా వచ్చి తనను దగ్గరగా చూచుటతో, మరియు తనను గురించి తన యక్క చెప్పినవిషయము లన్నియు తలపోయుచు వచ్చి నందున, కామభావము నెగజిమ్ము చూపులతో తనను చూచును ఆ చూపు లతో తన మనస్సును లాగికొనును లాగికొను నేమి? లాగికొనియెను ఆత్మ గై కొనియెను రాగరసమున గడలుకొనియెను మదనవికారము కలిమిని ఉది లకొనియెను కీచకుని ఊహ పెరిగిన విధమిది సంభావనరూపమున మొదలైన ఊహ నిశ్చయరూపమున ముగిసినది. చిత్రముగా కీచకుని ఊహ మలుపుతిరిగి నది. అది వాని దుర్విదగ్ధత లక్షణము.

కీచకుడు చేసిన ఊహావలన వాని మోహ వివశత్వము తెలియనగుచున్నది. అట్టి దశలో వాడుండగా ద్రౌపది సుధేష్ణచేత పంపబడివచ్చినది. కాని కీచకు డనుకొనుచున్నట్లు రాలేదు. అందువలన వాని యూహప్రపంచ మంతయు తల క్రిందులైనది. అగుటతో నుచితానుచితములను కోలుపోయినాడు. రహస్య ప్రకాశవిభేద విచారశూన్యుడైనాడు. అది యొక ఉన్మాదస్థితి సంప్రాప్తించి నది. ఆ స్థితిలో ద్రౌపదిని వెంటబడి కొప్పువట్టి లాగి పడదన్నినాడు. కీచక సంహారమునకు భీముడు పూనుకొనుట కదియె హేతువు. అనగా కీచకుని దుర్వి దగ్ధలక్షణము మీద ఉచితానుచితము లరయని తొందరపాటును సృష్టించి, తద్వ

ధకు దానిని కారణముగా తిక్కన్నగారు నిర్వహించి చూపినట్లుగా కనిపించు చున్నది

స్త్రీపురుషుల అన్యోన్యాలంబనము కలిగిన ప్రేమాఖ్యచిత్తవృత్తి విశేషమును తిక్కన్నగా రెచటను విపులముగా వర్ణించలేదు. లేదనగా భారతమునం దట్టి యవసరము కలుగలే దని యర్థము. అవసరము వచ్చిన ఒకటి రెండు చోట్లను గూడ ప్రధానరసము దృష్ట్యా శృంగారమును విభావాదులవలన పుష్టము చేయకుండ కేవలము భావమాత్రపర్యవసితముగా ప్రకరణము ననుసరించి చెప్పివదలెను కరుణమువలె శృంగార మెచ్చటను స్థాయినందుకొనలేదు. అందుకొనకపోవుటయే భారతమునకు కావలయును అంగరసముల పరిమితి నెరిగి తిక్కన్నగారు రచన చేసిరి స్త్రీల మనోవికారములను వర్ణించకుండ, పురుషుల చిత్తవృత్తిని వర్ణించి, స్త్రీలవిషయమును సహృదయుల బుద్ధికి వదలుట తిక్కన్నగారి శృంగారవర్ణనమునం దున్న ఏకైకమైన విశేషము.

## 3. అలంకార విచారము

బహుప్రయోజనముల నాశించి కావ్యములయం దలంకారములు వినివేశింపబడును. ప్రయోజనములు చాల యున్నను అలంకారముయొక్క సహజలక్షణము వర్ణ్యవస్తువుయొక్క స్వరూపస్వభావములను సముద్దీపింపజేయుట. అలంకారములను బహువచనప్రయోగ మది యొక వ్యావహారిక సత్యము. పరమార్థము విచారింపబడినచో నలంకార మనునది యొక్కటియే. అది యేదని ప్రశ్న. ఉపమాన మని సాధింపవచ్చును రూపక మని చూపవచ్చును. అతిశయోక్తి యని నిరూపింపవచ్చును. అది వేరు విషయము. కావ్యములయం దలంకారములు కవియొక్క ప్రౌఢోక్తిచేత సిద్ధించును. మరియు కవినిబద్ధ పాత్రవాచికమువలన సిద్ధించును. ఎట్లు సిద్ధించినను, వర్ణ్యవస్తువుయొక్క తత్కాలము నందలి స్వరూపస్వభావములను సహృదయుని బుద్ధియందు సముద్దీపింపజేయునదిగను, మరియు ప్రధానకథాసంబంధి అనగా నంగివిషయసంబంధి పరమార్థమును స్ఫురింపజేయునదిగను, అలంకార ముండవలయును.

సమదవారణము జంగమలత వెనుకొని
సరభసంబునఁ బట్ట జను విధమున

క్రూరదానవుఁడు భూచారి నిర్జరకాంతఁ
　　బొదువ రయమ్మునఁ బోవు భంగి
ఘోరగృధ్రము సుకుమార నాగాంగనఁ
　　బిటుగతి నొడియంగఁ బాఱు కరణిఁ
ప్రబల బిడాలంబు బాల శారికమీఁద
　　నడరి సత్వరముగ నరుగు మాడ్కి

సింహబలుఁ డత్యుదగ్రుఁడై చిగురుఁబోఁడి
పజ్జఁ గడువడిఁ దగిలి కోపంబు గదుర
నొడిచి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ
గొంకు కొస రించుకయు లేక కూలఁ దాచె.[1]

కీచకునిగాని ద్రౌపదినిగాని ప్రత్యేకము వర్ణించు పద్యము కాదది. కీచకుడు ద్రౌపది వెంటబడినాడు ద్రౌపది కీచకునిచేత వెంటబడబడినది. ఏవంవిధమైన ఆ సన్నివేశము వర్ణ్యవస్తువు. దాని చారుతను ప్రకాశింపజేయుకొరకు తిక్కన్న గా రలంకారము నాశ్రయించిరి ఆ పద్యము కవియొక్క ప్రౌఢోక్తి. పద్యమంతయు నుపమానములతో గ్రుచ్చియెత్తబడినది. ఆ యుపమానముల సార్థక్యత కొద్దిగా విచారింపబడును.— ముందు ద్రౌపది పరుగెత్తుచున్నది. అది యెట్లున్న దనగా నొక తీగియ గాలికి కొట్టుకొనిపోవుచున్నట్లున్నది అట్లు కొట్టుకొనిపోవు తీగెను పట్టుకొనవలయు నని మదించిన యేనుగు వెంటబడినట్లుగా కీచకుడు ద్రౌపదిని వెంబడించినాడు. ద్రౌపది జంగమలత లతకు జంగమస్వభావము లేదు. ఆరోపింపబడినది. ఆ యారోపణము రెండర్థములను సాధించిపెట్టుచున్నది ఒకటి-ద్రౌపదియొక్క ఆ పరుగెత్తుట అమె తెలిసిన తెలివితో కాదు. ఆమె బుద్ధి పనిచేయుట లేదు ఆ కీచకుడు అంతఃపురమున పైనబడి పట్టుకొనబోయినప్పటి భయము వాయువు లతను వలె ద్రౌపదిని ముందుకు నెట్టుకొనిపోవుచున్నది అనగా ద్రౌపది చైతన్యము లేనిదై యేదో ప్రేరణవలన పరుగుతీయుచున్న దని యర్థము. ఆమె నట్లు జంగమలతగా చెప్పుటవలన కీచకుని వలన నెంతటి భయ మామె నావరించినదియు ఊహకు విషయమైనది. రెండు— ఆమె జంగమలత. వాడు సమదవారణము. వారణమునకు లత కట్టి జంగమ

1. భా. విరా. 2-128.

స్వభావము లేదని తెలియును కాని లత కదలిపోవుచున్నది అయినను ఎక్కడనో అది అగక తప్పదు గాలికి కొట్టుకొని యెంత దూరము పోగలదు ? ఈ మొదలైన అనుభవజ్ఞానముతో వారణము లతను వెంబడించును అనగా నా వారణమున కా లత తన యనుభవమున కగు నన్న నిశ్చయజ్ఞాన మున్నది. కనుక నే కాకుండపోవుచున్న దాని వెంట సరభసముతో నడచుట కీచకుడు సమద వారణము. వానికి ద్రౌపది తన కనుభవమున కగు నన్న నిశ్చయ మున్నది. సుధేష్ణ అట్లు ద్రౌపది నొప్పించి పంపుదు నని వానితో చెప్పియున్నది అట్లే వచ్చిన దనుకొనుచున్నాడు. కాని యామె తన కభిముఖికాక పరుగెత్తుచున్నది అందుకొరకు వచ్చినది పారిపోవుట యేమి? ఎంత దూరము పోగల దన్నట్లుగా కీచకుడు వెంబడించినాడు ఈ విధముగా మొదటిపాదమునందలి ఉపమానము ద్రౌపదీకీచకులయొక్క అంతశ్చేతన లక్షణమును స్ఫురింపజేయుచున్నది ఇక రెండవపాదమునందలి ఉపమానము లక్షణము మరియొక విధము. ద్రౌపది నిర్జరకాంత మరియు భూమియందు చరించుచున్న నిర్జరకాంత అనగా కొంత దూరము పరుగెత్తిన తరువాత ఆమెకు చైతన్యము కలిగిన దన్నమాట. ఇక తెలిసి పరుగెత్తుచున్నది. కీచకుడు క్రూరదానవుడు. ద్రౌపదియం దెప్పుడు కాంతాలక్షణరూపచైతన్యము మేల్కొనినదో అప్పుడే కీచకునియందు దాన వత్వము మేల్కొనినది. మరియు నది క్రూరమైనది. ఇక్కడ చమత్కార మొకటి యున్నది భూచారి నిర్జరకాంతను పట్టుకొనుటకు దానవు డంత రయ ముగా నేల పోవలయును ? రయముగా పోనిచో నామె కొద్దిసేపటిలో ఖేచరి కావచ్చును దానవునకు ఖేచరత్వ ముండదా ? కొందర కుండకపోవచ్చును అసలు విషయ మిది కొంత దూరము వెంటబడిన పిదప ద్రౌపది నిర్జరకాంత యని కీచకున కనిపించియుండవలయును ఆమె తనతో నంతకు మునుపు మత్ప తులు గీర్వాణాకృతు లని చెప్పియున్నది అందువలన పతులు గీర్వాణు లైన ప్పుడు సతియు నగును అందువలన ద్రౌపది నిర్జరకాంత యని కీచకున కని పించినది ఆమె నేలమీద పోవుచున్నపుడే పట్టుకొనవలయు నని కీచకుడు తన పరుగెత్తుటలో వేగము పెంచినాడు. తనకు ఖేచరత్వము లేదు కదా ! అందుకని దేవకాంతలను జూచినచో దానవులు మరియు మిడిసిపడుదురు. ద్రౌపది నిర్జర కాంత యనిపించుటతో కీచకున కా మిడిసిపాటు కలిగినది. అందుకని వాడు క్రూరదానవుడుగా చెప్పబడనాడు మొత్తముమీద నా దృశ్య మెట్లున్న దనగా

దేవకాంతను పట్టుకొనుటకు క్రూరదానవుడు వెంటపడినట్లున్నది ఈ యుప మానము, బహుగ్రంథ పరిశీలనమువలన, ఒక సంప్రదాయమువలన సహృదయుల బుద్ధులయందున్న, దానవుల పారుష్యము - అధర్మము - దేవతల సౌకుమార్యము - ధర్మము - ఈ మొదలైన వారి వారి స్వరూపస్వభావలక్షణసుష్ఠు పరిజ్ఞానముమీద కల్పింపబడినది.

మిగిలిన రెండు పాదములయందలి యుపమానములలో మరియొక విధమైన చమత్కారమున్నది ద్రౌపది సుకుమార నాగాంగన. కీచకుడు ఘోర గృధ్రము నాగము నేల నానుకొనిపోవును. మరియు మెలికలు తిరుగుచుపోవును. ద్రౌపది పరుగెత్తుట యట్లున్నది. పరుగెత్తుటవలని ఆయాసముచేత నేల కొరుగుచు మెలికలు తిరిగిపోవుచున్న దని చెప్పినట్లయినది. గృధ్ర మాకాశమున పోవునది. అట్లు పోవుచు నేటవాలుగా దూసికొనివచ్చి అది నాగమును పట్టుకొనును ఈ యుపమానమువలన కీచకు డామె మీదకు దూసికొనివచ్చుట చెప్పబడుచున్నది. రెండవపాదమునందలి యర్థమున కిది విశేషణమువలె తోచుచున్నది అచట 'రయము' అన్నది కీచకుని గతివిశేషమునకు విశేషణము ఈ మూడవపాదమునందలి యుపమానార్థము దాని తీవ్రత నింకను నతిశయింపజేయుచున్నదివలె నున్నది మరియు నచట ద్రౌపది నిర్జరకాంత గనుక ఖేచరి కావచ్చునని కీచకున కనిపించుట చెప్పబడినది ఆమెకంటె ముందు తానే ఖేచరుడైనచో నన్నవృత్తి. ఈ మూడవపాదమున గృధ్ర ముపమానముగా చెప్పబడినందున, వానియందు స్ఫురించుచున్నది ఈ మూడవపాదము, కీచకుడు ద్రౌపది కింతకు పూర్వమునకంటె చాల దగ్గరగా దూసికొని వచ్చి పడినాడన్న యర్థమును బుద్ధి కందిచ్చుచున్నది. నాల్గవపాదమున కీచకుడు ప్రబల బిడాలము ద్రోపది బాల శారిక బిడాలము శారికమీద కరుగుట యనగా కేవలము దానిమీద పోయిపడుటయే అన్నమాట. ఈ ఉపమానముతో కీచకుడు ద్రౌపది నందిపుచ్చుకొనినా డను ఉపమేయార్థము లోకోత్తరముగా చెప్పబడినది.

ఈ సీసపద్యములోని నాల్గుపాదములును, కీచకుని యంతఃపురమునుండి విరాటుని కొలువుకూటమువరకు, పరుగెత్తుకొనుచు వచ్చిన ఆ యిరువుర యొక్క ముందు వెనుకలయందలి అంతరమును చెప్పుచున్నవి. కీచకుని అంతఃపురమునుండి తదావరణము దాటువరకు ద్రౌపది జంగమలత. ఈ విషయము స్పష్టపడుటకుగా నా పద్యమునకు ముందున్న వచనమును చూడవలయును. ఆ

యావరణమును దాటి, యామె మరలి చూచి, కీచకుడు వెనువెంట దగిలి వచ్చుటవలన భయభ్రాంతయైనది. సీసపద్యము రెండవపాదమున నీ విషయము చెప్పబడినది తరువాత నెవ్వలనికి బోదునో అని తలంచినది ఏవంవిధమైన తలంపుతోడి కదలిక నాగాంగన కదలికగా మూడవపాదమున చెప్పబడినది. అంత నామె దైవయోగంబున విరాటుం డప్పుడు గొలువునికిం జేసి తత్సభా భాగంబు దెసకు వేసం బాటినది ఈ విషయము నాల్గవపాదమున శారికోప మానముతో చెప్పబడినది శారిక జనము తనను రక్షించువారని వారివద్దకు చేరును విరాటుడు తనను కీచకుని బారినుండి రక్షించు నని ద్రౌపది వాని దెసకు పరుగెత్తినది ఇక కీచకుని విషయ మూహింపనగును.

ఈ విధముగా నుపమానములను గ్రుచ్చియెత్తి తిక్కన్నగా రా సన్నివేశ మును ప్రకృష్టముగా మూర్తిమంతము చేసిరి. ఇది కేవల మొక సన్నివేశమును దాని పరిధిలో దానిని అలంకారమును ప్రయోగించి ప్రకాశింపజేయుట. ప్రధాన కథార్థమును స్ఫురింపజేయు లక్షణ మందేమియు లేదు అలంకార మునం దా లక్షణ మెట్లుండునో మరొక ఉదాహరణమును చూపబడు చున్నది.

కౌరవపాండవసైన్యములు రెండును యుద్ధమునకు సిద్ధమై కురుక్షేత్ర మున నెదురెదురుగా నిలిచినవి ఉభయసైన్యముల నిలుచుటను తిక్కన్నగా రిట్లు వర్ణించిరి—

అప్పుడు రెండు సైన్యములు నాహవకేళికి నుత్సహించి పె
ల్లొప్పెఁ జెలంగి యుబ్బిన సముద్రతిఁ బోల్పగు తొంటి చందముల్
దప్పి యుగాంతకాలచలితత్వము నొంది పరస్పరాకృతుల్
గప్ప నెదుర్చు నంబుధియుగంబు మహోగ్రతఁ గ్రేణి సేయుచున్ [1]

ఈ పద్యముగూడ కవియొక్క ప్రౌఢోక్తియే. సంజయుడు కదా వక్త యనరాదు. భారతమున వైశంపాయనుడు జనమేజయునకు చెప్పినట్లు, సంజ యుడు యుద్ధమును ధృతరాష్ట్రునకు చెప్పినాడు. అనగా భారతము వారు చెప్పినట్లు వ్రాయబడినది. కవి నిబద్ధపాత్రము లనగా కథా పురుషులు. యుద్ధ

1. భా. భీష్మ. 1-146.

మును వినిపించు సంజయుడు కథాపురుషుడు కాదు. అందువలన పై పద్యము కవియొక్క ప్రౌఢోక్తియే అది యట్లుండె కౌరవపాండవసైన్యములు రెండింటికిని రెండు సముద్రము లుపమానముగా చెప్పబడినవి అందువలన నా యా సైన్యములయందు, సముద్రమంతంత విరివి, మరియు దాని అలలతో లేచి ముందుకు తూగివచ్చు లక్షణము వంటి సైనికుల సమరోత్సాహము మొదలైన విశేషములు స్ఫురించుచున్నవి. ఈ మాత్రమే అయినచో నలంకారము సామాన్యముగా నున్నట్లే. కాని కాదు ఎట్లనగా నుపమానము సవిశేషముగా చెప్పబడినది. అవి యెట్టి సముద్రములు? పొల్పగు తొంటి చందములు తప్పి యుగాంతకాల చలితత్వము నొంది పరస్పరాకృతులు గప్ప నెదిర్చిన సముద్రములు. యుగాంతమునందు కాలవశతను మేరల తప్పు నంతగా చలించిపోయి. అంతకుపూర్వ మున్న తమ స్థిమితమును పూర్తిగా కోలుపోయినవై యొక దానిమీద నొకటిగా దూకి దీని రూపము నది దాని రూపము నిది మాయజేయుటకు నుద్ధతిలో సంసిద్ధమైయున్న సముద్రము లవ్వి ఉపమానము నింత సవిశేషముగా కల్పించుటవలన నది ప్రధానకథార్థమును స్ఫురింపజేయుచున్నది. ఆ సముద్రము లట్లు పరస్పర మాక్రమించుకొనుటకు సంసిద్ధమగుట తమ ప్రయోకత్వమువలన కాదు. అవి యట్లు చలించుటకు హేతువు యుగాంత కాలము. అట్లే కౌరవపాండవు లట్లు యుద్ధమునకు సిద్ధమగుట వారి వారి ప్రయోజకత్వములవలన కాదు. భూమి భారమును తీర్చు ద్వాపరయుగాంత కాలము వచ్చి వారి నట్లు యుద్ధమున కభిముఖులుగా చేసినది ఆ సముద్రములు తొంటి చందములు తప్పినట్లుగనే కౌరవపాండవు లుభయులును నన్నదమ్ముల మర్యాదలు తప్పిపోయినారు ఆ యుపమానమునకు చెప్పబడిన ఆ విశేషము వలన ఉపమేయమునం దీ విధమైన అర్థము స్ఫురించుచున్నది మరి యీ సిద్ధించిన యరము ప్రధానకథార్థముతో సమన్వయింపవలయును గదా అన్నచో లక్షణముగా సమన్వయించును. ఆదిపర్వమున వైశంపాయునుడు జనమేజయునకు భారతయుద్ధము భూభారము తొలగించుటకే ప్రవర్తించిన దని చెప్పినాడు.[1] స్త్రీపర్వమున వేదవ్యాసు డిదియే విషయమును ధృతరాష్ట్రునకు చెప్పినాడు.[2] మరియు శాంతిపర్వమున ధర్మజునకు దుఃఖోపశమనము చేయబడిన

1. భా. ఆది. 3-52...57.
2. భా. స్త్రీ. 1-72...78.

విధాన మంతయు నీ భీష్మపర్వమునందలి ఈ పద్యములోని ఉపమానవస్తువునకు చెప్పబడిన విశేషణముయొక్క అర్థమును బట్టుకొనియే యున్నది. ఉదాహరణముకొరకొక పద్యము చూపబడుచున్నది.

తారు గొందఱకు బాధకులయి నడచుట
పరులచే బాధలు బడుట గలుగు
నివి కాలభావ్యంబు లెఱుకగల్గిన నొరుఁ
బఱిచితి నొరునిచేఁ బడితి ననుచుఁ
బురుషుండు ప్రియశోకములఁ బొందఁ దర్థ దా
రాపత్య బాంధవ హాని కాత్మఁ
గుందగ నడలుట మందబుద్ధిత్వంబు
వగఁ గీడుమాను నే వలవ దడల
శోక భయ కారణమ్ములు లోకమున న
నేకములు దానఁ దలసూపు శోకములకు
భయములకు బుద్ధి నెడ యీఁడు పండితుండు
మూఢు డవి త్రోవ నేరండు మునుగు వగల.[1]

కాలము పరమేశ్వరస్వరూపము. అది శక్యసమస్తకార్యము. ఈ జ్ఞానమునందు చిత్తము యొక్క ప్రవృత్తియే శమలక్షణము. శాంతరసప్రధానమైన భారతమున నేవంవిధమైన చిత్తవృత్తి కనుకూలమైన విషయ మనేకముఖముల తత్ర తత్ర నిక్షేపింపబడుచుండును. యుద్ధ మింకను ప్రారంభము కాకముందు కౌరవ సైన్యములను వర్ణించుటకు నుపమాలంకారమును కల్పించి, దానివలన నావర్ణ్య వస్తువును సంప్రకాశింపజేయుటతోపాటు గ్రంథమునందలి ప్రధానకథార్థము స్ఫురింపబడినది. ఉపమానమును వ్యంజకత్వశక్తి సంపన్న మొనర్చి దానినుండి ప్రధానకథార్థమును ధ్వనింపజేయుట అలంకారతత్త్వము రహస్యము నెరిగి చేయుటగాని మరొకటి కాదు.

సంజయుడు వక్త యన్నప్పుడు కూడ తదర్థము రమణీయమై తత్ప్రకరణోచితముగా నున్నది. సంజయుడు పదిదినముల యుద్ధమైన తరువాత ధృత

1. భా. శాంతి 1-188.

రాష్ట్రునివద్దకు వచ్చి ముందు భీష్ముని పడుటను చెప్పినాడు. ధృతరాష్ట్రుడు మిక్కిలిగా శోకించినాడు. ఇక యుద్ధమును వరుసగా చెప్పబోవుచున్న సంజయు డా పద్యము ధృతరాష్ట్రునితో ననినాడు. అనగా - దుఃఖించి ప్రయోజనము లేదు. కాలస్వరూపుడైన పరమేశ్వరుడు యుద్ధమును ప్రవర్తింప జేయుచున్నాడు. కాలపురుషునివలన ప్రేరితులై కౌరవపాండవు లట్లు తలపడిరి. ఎవరు మాత్ర మేమిచేయగలరు. ఉపశమింపుము- అని ఈ మొదలుగా సంజయుడు చెప్పిన ట్లర్థమగుచున్నది. తత్ప్రకరణమున నది యెంతయు నుచితమే యగును గదా!

ఈ విధముగా నా పద్యమునందలి యలంకారము బహ్వర్థములను స్ఫురింపజేయుచున్నది. ఇంతకును నది యేమి యలంకారము? ఉపమాన మన్నట్లుగా నింతవరకు వ్రాయబడినది. ఉపమేయములైన సేనలు ఉపమానము లైన సముద్రములను గ్రేణిసేయుచున్న వని పద్యమునం దున్నది. అనగా నుప మేయ ముపమానమును తిరస్కరించుచున్న దని చెప్పినట్లయినది.. ఉపమానము నందుకంటె ఉపమేయమునందే ఆధిక్యవిశేషము చూపబడినందున వ్యతిరేకా లంకారము కావలయును. మరియు నా యుపమానము సాభిప్రాయవిశేషణ పూర్వకముగా నున్నది. అపుడు పరికరాలంకారముకూడ చెప్పబడవలయు నేమో!

భారతమునం దధికముగా నుపయోగింపబడిన అలంకార ముపమానము. దాని తరువాత రూపకము. మిగిలినవి క్వాచిత్కములు. వర్ణ్యవస్తువును మిక్కి లిగా దీప్తిమంతముచేయుటకు మిగిలిన అన్ని యలంకారములకంటెను నధికముగా నా రెండును సమర్థములు మరియు నందు రూపకమునకంటె ఉపమానము సమ ర్థము. దీని తాత్పర్య మిది. రూపకము కొనసాగింపబడినకొలదియు వర్ణ్య వస్తువుయొక్క స్వరూపస్వభావములు కొండొకచో మసకపడి స్పష్టముగా భాసింపకపోవుటయు సంభవము. ఉపమానమువిషయ మట్లుకాదు. అది యెంతగా విస్తరింపబడునో అంతగా నుపమేయము దీప్తిమంతమగును. అవగా విస్తృతిమీద నొకచో రూపకముచేత నలంకరింబడిన వాచ్యమునుండి వ్యంగ్య మును గ్రహించుటకు కొంత క్లేశపడవలసివచ్చును. విస్తరించిన ఉపమ వాచ్యము నలంకరించుచో నా వాచ్యము వ్యంగ్యమును మరియు తెస్సగా స్ఫురింపజేయ గలదు. రూపకోపములకు విస్తారముమీద కొండొకచో గల భేద మిది. అందు

వలన నుపమాసామర్థ్యము పేర్కొనబడినది. ఈ ఉపమానముయొక్క విస్తృతి రెండువిధములుగా నుండును. ఒక ఉపమను బహువిశేషలక్షణకథనముతో పెంచి ప్రయోగించుట ఒక విధము. ఒక ఉపమేయమును బహుముఖముల దీపింప జేయుట కనేకోపములను ప్రయోగించుట మరొక విధము భారతమున తిక్కన్నగా రుపయోగించిన ఉపమాలంకారము లన్నియు చాలవరకు నీ రెండు విధములుగనే ఉన్నవి.

ఉపప్లావ్యమునుండి తిరిగివచ్చిన సంజయుని మాటలు విన్న తరువాత దుర్యోధనునితో నందరును పాండవులతో సంధిచేసికొని కలిసియుండుట మంచిదని చెప్పిరి. అందరతోపాటు బాహ్లికుడును చెప్పినాడు.

కను భ్రమసిన తెరువరి తన
కనపాయం బైన మార్గ మరసి తగ నెఱిం
గిన వారు సెప్పఁగాఁ గై
కొనిన కరణి తగిన వెంటకుం జొర వకటా ![1]

ఇందు ఉపమేయము దుర్యోధనుడు. ఎవరిమాటను కూడ వినని దుర్యోధనుడు. ఉపమానము తెరువరి ఆత డెట్టివాడు ? కన్నులు తిరిగి దిగ్భ్రమచెందినవాడు ఆ భ్రమలో పోగూడని మార్గమున బోవుచున్నవాడు. అయ్యో పీ డిట్లపాయకరమైన మార్గమున పోవుచున్నాడే అని ఆ మార్గము లక్షణము తెలిసినవారు- ఓయీ ! అటు పోబోకుము- ముం దపాయమున్నది- తిరుగుము- అసలు త్రోవయిటున్నది- కుడివేపిప్రక్కగా నిటు రమ్ము- అని ఈ మొదలుగా సెప్పినను వారి మాటలను తిరస్కరించి పోగూడని ఆ మార్గముననే పోవుచున్నవాడు. ఇదంతయు నా తెరువరి విశేషలక్షణ కథనము. దుర్యోధను ని ప్రవర్తించు విధమా తెరువరి ప్రవర్తనమువలె నున్నది. ఇది బాహ్లికుడు చెప్పినది తెరువరి విషయము దృష్టాంత మని కూడ చెప్పవచ్చును అది వేరు విషయము- దుర్యోధనుడెందరి మాటను వినక కాని తెరువున పోవుచున్నాడో, అంతగా విస్తరించిన ఆ యుపమానము స్పష్టముచేయుచున్నది. మరియు నా ఉపమయం దొక ప్రధానమైన చమత్కారమున్నది. తెరువరి కన్నులు తిరిగిన వాడుకదా ! తెలి

1. భా. ఉద్యో. 2-280.

సినవారు చెప్పుచుండగా నేల వినలేదు ? కన్నులు తిరుగుటకును నెదుటివారి మంచిమాట వినకపోవుటకు నేమి సంబంధము ? అనగా వానికి మతిభ్రమణము కూడకలిగిన దని యర్థము. కన్నులతోపాటు మతియు భ్రమించి ఆ తెరువరి అనపాయమార్గమును చెప్పువారి మాటలు పాటించలేదు అట్టి తెరువరి దుర్యోధనునకు నుపమానముగా చెప్పబడినది. అనగా నా యలంకారము దుర్యోధనుని అలంకరించుచు వాని బుద్ధిలక్షణమును స్ఫురింపజేయుచున్నది. మొద లందు కొరకే ఆ ఉపమాన మట్లు కల్పింపబడినది. దుర్యోధనునకు తిరిగినది కన్నులు కాదు. మతి. అందువలననే ఎవ రెంత చెప్పినను వినలేదు. జాప్లికుడు దుర్యోధనున కే యర్థము చెప్పదలచుకొనినాడో అది అలంకారమునందే వ్యంగ్యము చేయబడినది. అనగా నలంకారముగాక దానియందలి వ్యంగ్యము అలంకార్యము నలంకరించి తజ్జీవలక్షణమును ప్రకాశింపజేయుచున్న దన్నమాట. ఇది యొక లోకోత్తరమైన రచన. మరియొకటి చూపింపబడును.

పీకమెయిఁ గ్రీడికొడుకుం
దాకగ నీ కొడుకు తలచి కవిసె పే
రాకలితో నున్న హరిం
దేకువసెడి చేరు కరిగతిం గురుముఖ్యా ![1]

దుర్యోధనుడు అభిమన్యునిమీదికి పోవుటను చెప్పుచున్న పద్యమది. సింహముపై కేనుగు పోయిన ట్లన్నది ఉపమానము దుర్యోధను డభిమన్యునిముందు కొరగా డను విషయమును స్ఫురింపజేయుట కా మాత్ర ముపమానము చాలును. కాని తిక్కన్నగా రా ఉపమావాచకములను సవిశేషముగా చెప్పిరి. అభిమన్యుడు పేరాకలితో నున్న సింహమువంటివాడు. దుర్యోధనుడు తేకువసెడిన కరివంటి వాడు. తేకువ శబ్దమున కా ప్రకరణమున ధైర్యము - వివేకము-అని అర్థము చెప్పికొనవలయును ఇపు డా ఉపమానము నిట్లూహింపవలయును. మంచి ఆకలితో నున్న సింహము ఎదురు తన్నినిలిచి యేనుగును కదలనీయలేదు. అ యేనుగున కిక తన ప్రాణములమీద ఆశపోయి ధైర్యము తల్లటిల్లినది. దిక్కుతోచక నా సింహముమీద కురికినది. ఆ యురుకుట సింహము చేతిలో నెట్లును చావు తప్ప దని మూర్ఖముచేసి యురుకుటయే గాని దానిని తాను చంపగల నన్న

---

1. భా. ద్రోణ. 2-19.

నమ్మకముతో గాని జ్ఞానముతో గాని కాదు. అట్టి యేనుగు దుర్యోధనున కుప మానము. అభిమన్యునిచేతిలో "దీనదశకు వచ్చిన" స్వసైన్యమును చూచి ధైర్యమును కోలుపోయి చేయునది లేక దుర్యోధనుడు వాని మీదకు దూకి నాడు. దుర్యోధనుని తత్కాలమునందలి మనోలక్షణమును, అభిమన్యుని విజృం భణమును సవిశేషములైన ఆ ఉపమానములు స్ఫురింపజేయుచున్నవి. మరియు నొక్కటి

విపుల హర్మ్యతలంబులు వెడలునట్టి
వెలది ముత్తముల్ వొల్చె బల్వేటకాఁడు
పతులఁ జంపిన గిరిగుహాప్రతతి వెడలు
వాఁడు సింగంపు బెంట్లకుఁ బాటి యగుచు[1].

ధృతరాష్ట్రుడు గాంధారీసహితుడు పొలికలనికి బయలుదేరినాడు. ఆయన మాటగా విదురునిచేత చెప్పబడి ధార్తరాష్ట్రుల భార్యలందరును బయలుదేరి నారు. ఆ వారి తమ తమ సౌధములనుండి వెలికివచ్చుటను వర్ణించు పద్యమది. భర్తలు మరణించిన ధృతరాష్ట్రుని కోడండ్రు శోకమూర్తు లుపమేయము. వేటకాండ్రచేత చంపబడిన పతులు గలిగిన ఆడసింహము లుపమానము. వారి వారి రాణివాసము లుపమేయము. గిరిగుహ లుపమానము. వేటకాం డ్రుప మానమై పాండవుల నుపమేయముగా స్ఫురింపజేయుచున్నది, పాండవులు కౌర వులను వేటాడి చంపినారు. కౌరవాంగనలు భర్తల మరణములకు సౌధముల తలుపులు మూసికొని కుమిలి కుమిలి యేడ్చుచున్నారు. వారికి శోక మెంత యున్నదో పాండవులయందు క్రోధ మంత యున్నది. మామగారి మాటమీద సౌధముల తలుపులు తెరచికొని పొలికలనికి బయలుదేరినారు. శోక క్రోధములు పెనవేసికొన అయిన మూర్తుల వలె బయలుదేరినారు. ఈ విధముగా నుపమేయము, ఆ యుపమానమువలన స్ఫూర్తిమతి యగుచున్నది. ఉపమాన మును విస్తరించి చెప్పుటవలన నధికముగా పూర్ణోపమలు సిద్ధించుచున్నవి, ఉప మేయముయొక్క స్ఫూర్తి ఉపమానము పూర్ణముగా కల్పింపబడినప్పుడు మరియు నధికముగా నుండును. ఈ విధమయిన ఉపమానములు భారతమున వందలసంఖ్యలో నున్నవి. ఇట నూరక కొన్ని చూపింపబడును.

---

1. భా. స్త్రీ. 1-102.

ధర్మజుని మాటలకు తట్టుకొనలేక దుర్యోధనుడు హ్రదమునుండి వెలికి వచ్చినాడు, అంతకుముందే వాని శరీరము రక్తసిక్తమై యున్నది. ఆ గాయములతో నల్లే గదా యుద్ధమునకు సిద్ధమై మడుగునుండి బయటకు వచ్చినాడు. ఆ వచ్చిన దుర్యోధనుడు "కావి సెలయేఱు లెల్లెడఁ గలయ బర్వ బొలుచు కులపర్వతంబు చాడ్పున"[1] నున్నాడని చెప్పబడినది. తొడలు విరిగి పడిన దుర్యోధనుడు తన నాక్షేపించి పలుకుచున్న శ్రీకృష్ణుని ప్రక్కగా తలయెత్తి కోపముతో చూచినాడు. "అపరభాగంబు విరుగ బ్రేటుపడి యలిగి తలయెత్తి చూచు మహానాగము చందము"[2] గా నా చూచుట వర్ణింపబడినది. భీముడు క్షేమధూర్తియను వానిని, వాని యేనుగును చంపినాడు. ఆ యేనుగుప్రక్కగా నా క్షేమధూర్తి చచ్చిపడినాడు. ఆ పడియుండుట "వజ్రప్రహారంబున గూలిన కులశైలంబు సమీపమున నిర్ఘాతపాత పతితంబైన కంఠీరవంబు కరణి"[3] యున్నదని వర్ణింపబడినది. కర్ణుడు ధర్మజుని మైమఱువును భేదించినాడు. ఆ కవచము శరీరమునుండి జారి క్రిందపడిపోయినది. అది యెట్లున్నదనగా "సౌదామినీ చారు జలద మంబుజాప్తుని తనువున కడ్డమై యుండి వాతాహతంబై పాయు నట్టు"[4] లున్నది.— ఈ ధోరణిలో నెన్నైననను జూపించవచ్చును. ఆ యా ప్రకరణములం దవి వర్ణ్యవస్తువును లెస్సగా దీపింపజేయుచున్నవి. ఉదాహరణములతో గ్రంథము పెంచిన ప్రయోజనము లేదు.

ఇక భారతమునందలి రెండవపద్ధతిలోని ఉపమానము విషయము వ్రాయబడును. ద్రోణుని మరణానంతరము తిరిగివచ్చిన సంజయుడు ధృతరాష్ట్రునకు, ద్రోణుడు సేనానాయకుడుగా పట్టాభిషిక్తుడు గాకపూర్వము భీష్ముని కోలుపోయిన కౌరవసేనయొక్క స్థితి నిట్లు వర్ణించి చెప్పుచున్నాడు.

పతిరహితాత్మయైన సతి భంగియు గోపకహీనమైన గో
వ్రతతి విధంబు సస్య విధురస్థితియైన ధరిత్రి చాడ్పు ను

1. భా. శల్య. 2-101.
2. భా. శల్య. 2-324.
3. భా. కర్ణ. 1-85.
4. భా. కర్ణ. 2-188.

ద్ధత హారిశూన్యమైన వసుధాధరకంధరభూమి చందమున్
మతి మన సేన దోఁచె బుధమాన్యుఁడు భీష్ముఁడు లేకయుండుటన్.[1]

ఐదుదినముల క్రితము కౌరవసైన్యముయొక్క స్థితిని వర్ణించు పద్య మిది. తత్కాలమునందలి ఆ స్థితి యొక్కటియే ఉపమేయము. నాలుగుపమానముల చేత నలంకరింపబడినది. ఇట్లనేకోపములను ప్రయోగించి వర్ణ్యవస్తువును మూర్తి కట్టించు ప్రయత్నము కావ్యములయందు కంటె ఇతిహాసములయందు మిక్కుటము. ఇతివృత్తముయొక్క విస్తృతి దీని కొక కారణము కావచ్చును. ఇతిహాసమున ప్రధానకథ యొక్కటియే మొదటినుండి తుదివరకు నెడతెగక వ్యాపించియుండదుకదా ! మధ్య మధ్య అనేకములైన ఉపకథలు ప్రవర్తించుచుండును. ఆగి యాగి కొనసాగు ప్రధానకథయు, మధ్యలో పరిసమాప్తము లగు చిన్న చిన్న కథలును స్ఫుటముగా మూర్తిమంతములు చేయబడవల యును. అందుకొరకే అనేకోపమ లుపయోగపడుచున్నట్లు కనిపించుచున్నది. ముఖ్యముగా ప్రధానకథాసంబంధి బహ్వంశము లీ యలంకారములచేత స్ఫూర్తి మంతములు చేయబడుచున్నవి. పై పద్యమున ప్రధానకథాసంబంధి అయిదు దినముల క్రిందటి యొకపక్షము స్థితిని ప్రకాశింపజేయుటకు నాల్గుపమ లుప యోగింపబడినవి. అట్లే భవిష్యదర్థమును చెప్పుచోఁగూడ అనేకోపమలు ప్రవర్తించుట యున్నది. సంజయుడు, తన ముఖమున నర్జునుడు కౌరవులతో నిట్లను చున్నాఁ డని, ధృతరాష్ట్రుని కొలువున వినిపించిన మాటలలో నొక పద్య మీ విధముగా నున్నది.

కోల్పులి పీఁకమై గొదగొని లేళ్ళకు
నుఱుకు తెఱంగున దఱియఁ జొచ్చి
పెనుగాలి జీమూతబృందంబుపై బెట్టి
దంబుగ వీచు చందమున నడరి
కసిమసంగిన మారి గడగి జీవులమీద
నుగ్రత గవియున ట్లురవడించి
ఆకొన్న లయరుద్రు డాగ్రహంబున జగ
త్ప్రచయంబు ముట్టెడు భంగిఁ బొదివి

1. భా. ద్రోణ. 1-16.

నకులుఁడును దదనుజుఁడు సాత్యకియు నా సు
భద్రకొడుకును నెదిరిన బలము నెల్ల
బెదర చెదర బడల్పడఁ బెల్లుసావఁ
జేయఁ గని కౌరవులు సంధి సేయువారు.[1]

ఇదంతయు భవిష్యదర్థమును మూర్తికట్టించుట. ఇట్లని భూతభవిష్యదర్థములను వర్తమానమున దీపింపజేయునప్పుడు మాత్రమే అనేకోపమలు ప్రవర్తించు నని సిద్ధాంతముచేయుట కాదు. అదియునుగాక నీ పద్యమున చెప్పబడిన నాల్గుపమలును నకులాదులకు క్రమముగా వర్తించుచున్న వనవచ్చును. జరుగబోవు యుద్ధముయొక్క తీవ్రత ప్రధానమైన వర్ణ్యవస్తువు. అనగా నకులాదులు పరాక్రమమును వర్ణించు తాత్పర్యముతో కా దా పద్యము వ్రాయబడినది. అందువలన నుపమేయముయొక్క భావియుద్ధము తీవ్రలక్షణమే. వర్ణ్యవస్తువున కెంతగా దీప్తిని కలిగించవలయు నని కవి యనుకొనునో అంతగా నుపమలను వరుసగా ప్రయోగించును పరమార్థ మిదియే.

యుద్ధవర్ణనమునం దీ విధముగా నుపమలను కూర్చుట మిక్కిలిగా కనిపించుచున్నది ద్రోణుని మూడవనాటి యుద్ధమున కౌరవు లభిమన్యు నెదుర్కొనినారు. అభిమన్యుడు మహావీరుడు విజృంభించినాడు. కౌరవులు వాని మీది కురుకుటను నాలంకారికముగా చెప్పి వాని పరాక్రమమును తిక్కన్నగారు స్ఫురింపజేసిరి.

"మానధనులగు మానవపతులు నేను నేన యని కడంగి యక్కుమారునిమీద నుఱికి పెనుచోఱ మొగంబునం బడిన చిఱుచేపల తండంబుల చందంబున, దావానలంబు దరియం జారిన మృగంబుల చాడ్పున, సముద్రంబుఁ జొచ్చిన యేరుల చందంబున, అతనియంద డిందిరి.[2]

దుర్యోధన భీమసేనులు గదాయుద్ధము చేయుటకు ద్వైపాయనహ్రదము వద్దనుండి పొలికలనికి వచ్చినారు. యుద్ధమున కభిముఖులై నిలిచినారు. అప్పటి అయిరువుర స్థితిని వర్ణించు పద్య మీ విధముగా వ్రాయబడినది.

ఆభీలగర్జన శోభిత దేహులై
యుద్భట వృషభముల యొప్పుఁ దాల్చి

1. భా. ఉద్యో. 2-139.
2. భా. ద్రోణ. 2-78.

రోష మహావిష భీషణ వదనులై
చండోరగంబుల చంద మొంది
మదసముజ్జృంభిత మండితాకారులై
భద్రద్విపంబుల పగిదిఁ బొల్చి
చారు గదా శృంగ సందీప్త మూర్తులై
మహితపర్వతముల మాడ్కి మెఱసి

వాసుదేవయుగము వరుణద్వయంబు వై
శ్రవణయుగ్మకంబు రామయమము
పోతె దర్శనీయ లీల వహించి యం
భోధియుగళ మనఁగ బొంగు మిగిలి[1].

ద్రోణుని నాలవనాటి యుద్ధమున భీముడు కర్ణుడు తలపడి తీవ్రముగా యుద్ధము చేసిరి వారి యుద్ధ మిట్లు వర్ణింపబడినది.

బలుడేగల కై వడి బె
బ్బులుల పగిది మత్తకరుల పోలిక దర్పో
జ్జ్వల సింహంబుల చాడ్పున
నలవుఁ జలము మెఱయఁ బెనఁగి రా రథికవరుల్ [2]

ఈవిధముగా యుద్ధపర్వములనుండి చాల ఉదాహరణములు చూపించవచ్చును మరియు యుద్ధపర్వములయందు, తదనుయాయి రసభావములు మిక్కిలిగా పుంజుకొనకుండ జేయుటకును ఉపమాలంకార ముపయోగింపబడినది. ఈ విష యము యుద్ధవర్ణనమునుగూర్చి వ్రాయునపుడు చెప్పబడినది. ఒకటి రెండు ఉదాహరణము లిచటను చూపబడును.

నెత్తుటఁ దోఁగి నేల యెఱనింగి తెఱంగున నుండె నక్కుమా
రోత్తము డందుఁ జంద్రు క్రియ నొప్పె సితాయుధఖండభూషణో
దాత్తమణిప్రతానములు తారల చందము నొంది యందమై
యత్తటి నుల్లసిల్లె వసుధాధిప చూపఱపిందు చూడ్కికిన్.[3]

---

1. భా. శల్య. 2-233.
2. భా. ద్రోణ. 4-181.
3. భా. ద్రోణ. 2-127.

అభిమన్యుఁడు మరణించి పడియున్న యుద్ధభూమిని వర్ణించు పద్య మిది. రక్తముతో తడిసిపోయిన యుద్ధపునేల ఉపమేయము. ఎఱ్ఱని ఆకాశ ముపమానము. ఆ నేలమీద పడియున్న అభిమన్యు డుపమేయము. ఆ యెఱ్ఱని ఆకాశమునం దున్న చంద్రు డుపమానము. అ నేలమీద నభిమన్యుని చుట్టుకొని చెదరిపడి యున్న తెల్లని ముక్కలు ముక్కలైన ఆయుధములు, భూషణములు, మణులు మొదలైనవి ఉపమేయము ఆ యెఱ్ఱని ఆకాశమున చంద్రుని చుట్టుకొని యున్న నక్షత్రము లుపమానము. ఉపమేయమునందలి బీభత్స భయానకాది లక్షణము, ఉపమానమునందలి సౌకుమార్యముతోడి చారుతవలన విహితము చేయబడినది. భారతమువంటి గ్రంథమునం దిట్టి రచనయే చేయబడవలసినది. ఉపమాన మట్టిది చెప్పుచుకూడ 'అందమై' అని మరియు పేర్కొనుట తిక్కన్నగా రెంత జాగ్రత్తగా యుద్ధవర్ణన చేయుచున్నదియు స్పష్టము చేయును. ఆయన చాలచోట్ల నా విధముగా చెప్పుట కలదు.

నెత్తుటఁ దోఁగియు నిగిడి పోరెడు వీరు
లలరిన నడమోదుగుల విధంబు
గ్రక్కునఁ దెగిపడి కదలెడు బాహుదం
డములు మహాభుజంగముల భంగి
యవని రక్తాక్తంబులై యున్న యట్టి బల్
దలలు గెంజామరకొలని వగిది
దఱచుగా నెఱి దప్ప నొఱగిన గజములు
గులిశ భగ్నాచలకులము నట్లు
దునిసి తొఱగిన జోదుల తొడలు సామ
జముల కరములు నొండొంటి చందములు గ
నుంగొనఁగ వింత లగుటను సంగరాంగ
ణంబు రమణీయమును భీషణంబు నయ్యె.[1]

ఆ చెప్పుటలో ముందు రమణీయమును చెప్పుట గమనింపదగినది.

భారతమునందు విస్తరింపబడిన రూపకాలంకారము విషయము కూడ రెండు మూ డుదాహరణములు చూపి చెప్పబడును.

1. భా. శల్య. 1-129.

బాణజ్వాలలు బెట్టు పర్వ గగన ప్రక్షోభణజ్వాలతా
క్వాణస్ఫూర్తి ఛటచ్ఛటారవముగాఁ గర్ణోగ్ర దావాగ్ని య
క్షీణోదగ్రత వైరిసైన్యవన భస్మీభావనిర్వాహపా
రీణంబై వెలుఁగొంచె నిర్జరులు వర్ణింపంగ నేముబ్బగన్.[1]

కర్ణుని రెండవనాటి విజృంభణమును వర్ణించు పద్య మిది కర్ణుడు భయంకర మైన దావాగ్ని శత్రుసైన్య మంతయు వనము. కర్ణుడు వదలు బాణము లగ్ని జ్వాలలు కర్ణుని వింటినారియొక్క మ్రోత అగ్నియొక్క ఛటచ్ఛటలు. ఈ విధ ముగా రూపకము చేయబడినది ఉపమానమునందు కంటె అధికమైన జాగ్రత్త యున్న గాని రూపకముచేత నలంకరించినప్పుడు వర్ణ్యవస్తువు దీప్తి తోచదు. అంతే. మరొకటి—

కరి కళేబరము లు ధరణీధరములు దు
రంగ గాత్రమ్ములు గ్రాహసమితి
నర శరీరము లు మీనములు కౌక్షేయక
క్షురి కాది శస్త్రంబు లురగకులము
రుధిరార్ద్రి శరములు రుచిర ప్రవాళముల్
ప్రేవుల ప్రోవులు ఫేన తతులు
నెత్తురు వెల్లువ నీళులు భూషణ
స్తోమాస్థిచయముల తుమురు లిసుక
గాగ నంబురాశి కరణి సంగ్రామభూమి—[2]

రూపకాలంకారముయొక్క విస్తృతివలన వర్ణ్యవస్తువు సంకీర్ణమై విశదముగా స్థూలదృష్టికి ప్రకాశించ దని చూపుటకే ఈ పద్యములు చూపించుట. కొంచెము జాగ్రత్తగా భావన చేసినచో సరిపోవును.

అర్జునోదగ్ర దవశిఖ హారిమహోని
లంబు ప్రేరేప వైరిబల ప్రకీర్ణ

1. భా. కర్ణ. 2-184.
2. భా. ద్రోణ. 2-128.

గహన దహన విహారము గ్రముగఁ జలుపఁ
దేటి చూడను రాకున్కి తెల్ల మధిప [1]

కర్ణుడు మరణించిననాటి రాత్రి కృపాచార్యుడు దుర్యోధనునకు హితోపదేశము చేయుటలోని పద్య మిది ఈ యర్థమే మరునాటి యుద్ధమున నర్జునుడు విజృంభించుటను చెప్పుచో చెప్పబడినది. ఇచట కౌరవపక్ష మూరక గహన మని చెప్ప బడగా నచట నదియు నిరూపింపబడినది. "ఉత్తుంగ మాతంగ మహీరుహా శోభితంబును సాంద్రస్యందనగుల్మగహనంబును బహుళహయకక్షాకీర్ణంబును సముద్భటసుభటలతాసితంబును నైన సుయోధను సేనాకాననంబునందు మాధవ మహావాయువు ధనంజయ దారుణానలంబు దరికొల్పెను—" [2] కౌరవ సేన ఎట్లడవియైనదో రెండు మూడు విధముల రూపకల్పన చేయబడినది. ఏనుగులు కొండ లని రూపించి నప్పుడు బుద్ధికి తోచుచున్న యర్థ మంత స్పష్టముగా తరువాతి రూపకములయందు దర్థము తోచుట లేదు. రథములు పొదలు, గుఱ్ఱములు దుబ్బపోతులు, కాల్బలము లతలు-వీటిని భావించుట కొంచెము క్లేశముతో కూడిన పని. ఇది రూపకాలంకారము విషయము.

వర్ణ్యవస్తువును స్ఫూర్తిమంతము చేయుటలో నుపమానమున కున్నంత శక్తి మరొక దానికి కనిపించదు అన్ని యలంకారములకు నుపమయే పరమార్థభూతమైనది. భారతమున నైదువందలకు పైగా నుపమాలంకారములు వాడబడినవి ఇందు కొన్ని పునరుక్తు లుండవచ్చును. ఉపమయే ఒకచోట దృష్టాంతముగను, మరొకచోట రూపకముగను, ఇంకొకచోట మరొకటిగను నుపయోగింపబడుచుండును. ముఖ్యముగా శాంతిపర్వమునందు దృష్టాంతరూపమున నుపయోగింపబడినది. అచటకూడ ననేకోపమలు ప్రవర్తించి, ఒక వర్ణ్యవస్తువును దీపింపజేయుట చాల చోట్ల నున్నది. రెండు మూ డుదాహరణములను చూపించి ఈ అలంకార విచార విషయము ముగింపబడును.

పందునకు బిడ్డ నిచ్చిన చంద మొందు
బూదిలో నేయి వేల్చుట బోలు నోటి

---

1. శా. శల్య. 1-48.
2. శా. శల్య. 1-361.

కడవ నీళ్ళులు వెట్టిన కరణి యగు న
పాత్ర జనులకుఁ బెట్టుట పౌరవేంద్ర.[1]

అనఘ ! సోమము లేని యధ్వరంబును శశి
లేని రాత్రియు రవి లేని నభము
నాత్మధర్మము లేని యాశ్రమంబును బుష్ప
సంపద లేని భూజమును బోలె
హీనత నొందు గంగానది లేని దేశంబు.[2]

.... .... .... .... ఉదుంబ
రమున మశకమ్ము వారి మీనము వసించు
నట్లు సత్త్వంబునం దంతరాత్మఁ డుండు—.[3]

శాంతిత్రయమునయం దలంకారముల స్థితి ఈ విధముగా నుండును. భారతమున నుపయోగింపబడిన ప్రధానాలంకార ముపమానమును పేర్కొని దాని వినియోగము కొంత సూచింపబడినది. శబ్దాలంకారముల వినియోగము భారతమువంటి గ్రంథమున నుండదు క్వాచిత్కముగా నెచట నేని ఒకటి రెండు వాక్యములలో నున్నను అది పరిగణింపదగినది కాదు. తిక్కనగారు ఆశ్వాసాంత పద్యములయందు మాత్రము తత్ర తత్ర శబ్దాలంకారముల నుపయోగించిరి. అవి భారతకథాసంబంధి పద్యములు కావు గనుక నిట వాటి విషయము చెప్పబడుట లేదు

## 4. వృత్తౌచిత్య విచారము

సృష్టిలోని సర్వభాషాకవిత్వములును ఛందస్సునందే యున్నవి. ఛందస్సును వదలి కవిత్వములేదు. ఛందస్సుయొక్క సూక్ష్మరూపము వర్ణము స్థూలరూపము పద్యము పద్య మనగా నిబద్ధపద బంధము. కవిత్వము పద్యములందుండును పద్యము వృత్త జాతి భేదముచేత ద్వివిధాభూతము. జాతియం దవాంతర భేదము ఉపజాతి. వృత్తములు సాంస్కృతికములు జాత్యుపజాతులు దేశీయ

1. భా. శాంతి. 1-332.
2. భా. అను. 2-106.
3. భా. అశ్వ 2-186

ములు. వృత్తములలో చంప కోత్పల మత్తేభ శార్దూలములు నాలుగుమాత్రమే తెనుగున విరివిగా వాడుకయం దున్నవి. జాతిపద్యములలో ప్రధానముగా కందము, తరువాత మంజరీద్విపద, ఉత్సాహ, తరువోజ, మధ్యాక్కర మొదలైనవియు – ఉపజాతులలో సీసము, గీతము, ఆటవెలది అను నీ మూడును వాడుకలో నున్నవి. పదివందల సంవత్సరములనుండి తెనుగుకవిత్వ మా నాలుగు వృత్తములను, నాల్గయిదు జాత్యుపజాతి పద్యములను పట్టుకొని నిలువబడి యున్నది. ఈ మాట స్రగ్ధరాది వృత్తములయొక్కగాని, రగడలు మొదలైన జాతిపద్యములయొక్క గాని తెనుగునందలి యుపయోగమును గుర్తించనిది కాదు.

కవిత్వము హృదయసంవాది యగుటకు ఛందస్సును తగినంతిగా సహాయ పడుచున్నది. ఛందస్సనగా పద్యముయొక్క గతి విధానము. హేమేంద్రుడు సువృత్తతిలకమున సాంస్కృతికములైన వృత్తములలో కొన్నింటియొక్క విని యోగమును నిష్కర్షించిపెట్టు ప్రయత్నము చేసెను. పూర్వకవులు వ్రాసిన వృత్తములయందలి లక్షణములను పురస్కరించుకొనియే ఆయన ఆ పని చేసినను, అది సర్వథా సర్వత్ర వ్యాపనశీలమైన సిద్ధాంతముగా కనిపించుటలేదు. వృత్తములు గణముల మీద నిర్మింపబడినవి గనుక నా యా గణములవలన పద్యములలో వచ్చు భేదము లేకపోయినను, పరుషసరళాది, ద్విత్వసంయుక్తాది భేదములతో నున్న వర్ణములయొక్క కూర్పువలన శ్రవణేంద్రియమున కనుభవ మునకు వచ్చు గతిభేదము పద్యములయం దనివార్యము. ఛందస్సుయొక్క సూక్ష్మరూపము వర్ణన మని చెప్పుటలోని ఆంతర్యమిదియే. అందువలన ఫలానా వృత్తము ఫలానా విషయమునకు వ్యంజకముగనుక, ఆ వృత్త మా విషయముననే వినియోగింప బడవలయు నని గాని, ఇంతకుపూర్వ మట్లే ఆ వృత్తము వినియోగింప బడినదని కాని సిద్ధాంతముచేయుటకు వీలులేదు. కవియొక్క సామర్థ్యము ననుస రించి వర్ణమాదిగా ప్రతిదియు విశిష్టార్థస్ఫోరకముగా రూపొందగలదు. తత్త త్ప్రకరణములను బట్టి, తత్తత్సంఘటనావిశేషములను పురస్కరించుకొని, సహృ దయులు విశేషార్థమును భావించుట కుపకరించు బహువిషయములలో ఛందో గతి యొకటి. ఛందము శబ్దము నాశ్రయించియున్నది. శబ్దములు వర్ణముల వలన నైనవి. కనుక వర్ణములయొక్క సంయోజన వైలక్షణ్యమును బట్టి పద్య యొక్క నడక యున్నది. గణములను బట్టి లేదు. స్థూలముగా నున్నట్లు కని

పించును. వృత్తముల విషయమే ఇట్లున్నపుడు, ఆ ఫలానా గణములే వరుసగా రావలయు నని నియమము లేని మరియు మాత్రల లెక్కమీద ఆధారపడిన జాత్యుపజాతుల విషయ మసలే నిర్ణయింప వీలుకానిది కనుక వృత్తౌచిత్య మన్నది ముఖ్యముగా నా యీ ప్రకరణమును బట్టి కించిత్తు గ్రహింపదగిన దియే గాని, ఫలానా వృత్తము ఫలానా విషయమును వర్ణించుటకే ఉపయో గించుటను సిద్ధాంతము చేయుటకు నలవికాదు. ఏమనగా క్షేమేంద్రుడు ఏ వృత్త మున కే వినియోగమును చెప్పినాడో, ఆ వృత్తమట్లే సర్వకవుల గ్రంథముల యందును లేదు. సంస్కృత కావ్యములయం దా విషయ మెట్లున్నను తెనుగున మాత్ర మాయన చేసిన నిష్కర్ష తూ చా తప్పకుండ పాటింపబడ లేదు. కొన్ని వృత్తముల విషయము క్షేమేంద్రుని సిద్ధాంతమున కనుగుణముగా సమర్థింప వచ్చును తిక్కన్నగారు వాడిన విశేషవృత్తము లీ క్షేమేంద్రుని మతము నను సరించి మరియు నన్నయాదుల ననుసరించి విచారింపబడుచో పై విషయము లన్నియు స్పష్టము కాగలవు

మరియు క్షేమేంద్రుడు కొన్నిరకముల గ్రంథములయందు కొన్ని రక ముల ఛందస్సులే ఉపయోగ్యము లనియు, అట్లుపయోగించుట సలక్షణమార్గ మనియు సిద్ధాంతముచేసెను. అది కొంతవరకు సంస్కృతమునందు వలెనే తెను గునకును సమన్వయించునదిగా కనిపించుచున్నది. ముందా విషయను కొద్దిగా విచారింపబడును — "శాస్త్రకావ్యే అతిదీర్ఘాణాం వృత్తానాం న ప్రయోజనమ్ పురాణప్రతిబింబేషు, ప్రసన్నోపాయ వర్త్మసు, ఉపదేశ ప్రధానేషు, కుర్యా త్సర్వే ష్వనుష్టుభామ్" శాస్త్రకావ్యమునం దతిదీర్ఘములైన వృత్తములవలన ప్రయోజనము లేదు పురాణప్రతిబింబములుగా నున్న కావ్యగ్రంథములయం దన్నింటను అనుష్టుప్ఛందము నే వాడవలయును. అర్థప్రసన్నత ప్రధానమైన మరియు నుపదేశాత్మకతకల వాటియందు అనుష్టుప్ఛందము నే ఉపయోగింప వలయును. ఇది క్షేమేంద్రుని సిద్ధాంతవాక్యతాత్పర్యము. క్షేమేంద్రుడు నన్న య్యగారికి సమకాలికుడు.

ధ్వన్యాలోకమున భారతము శాస్త్రకావ్యముగా చెప్పబడినది క్షేమేం ద్రుడు శాస్త్రకావ్య మనునది ఫలానా అని ఉదాహరింపక పోయినను "శాస్త్ర కావ్యం చతుర్వర్గప్రాయం సర్వోపదేశకృత్" అని తల్లక్షణము చెప్పినాడు. ధర్మార్థకామమోక్షస్థితికి భారతము మూదల యని తిక్కన్నగారును, ధర్మార్థ

కామమోక్షములకు నత్యంత సాధనము భారత మని నన్నయ్యగారును చెప్పి యున్నందున క్షేమేంద్రుడు చెప్పిన శాస్త్రకావ్యలక్షణము భారతమునం దున్నది. కనుక శాస్త్రకావ్యమైన భారతమునం దతిదీర్ఘములైన వృత్తముల వలన నంతగా ప్రయోజనము లేదు. మరియు భారత మితిహాస మగుటవలన పురాణ ప్రతిబింబలక్షణము కొంత యున్నది. ఉపదేశాత్మకతయు భారతమున కున్నది. అట్టి గ్రంథమున కర్థ ప్రసన్నత మరియు ముఖ్యముగా నుండవల యును సంస్కృతభారత మనుష్టుప్ఛందము నాశ్రయించి వ్రాయబడినది. కనుక నచట క్షేమేంద్రుడు చెప్పినట్లు సరిపోవుచున్నది. మరి తెనుగున ననుష్టు ప్ఛందము లేదు. తెనుగుభారత మెంత కావ్యేతిహాసముగా వ్రాయబడినను శాస్త్రవాసన చాల యున్నది. కనుక నే ఛందము నాశ్రయించి తెనుగు భార తము వ్రాయబడవలయును ? ఈ విషయమును మొదట నన్నయ్యగారే ఆలో చించియుండవలయును. ఆయన ఆలోచించెను. ఆలోచించి తెనుగున కంద పద్యము, సంస్కృతమున ననుష్టుప్పువలె, ప్రయోజనమును సాధించగల దను నిర్ణయమునకు వచ్చెను. ఆయన వ్రాసిన భారతభాగమున నన్నింటికంటె కంద పద్యములే అధికముగా నుండుట[1] ఆయన నిర్ణయమునకు ప్రబలమైన ప్రమా ణము. మరియు నాయన ఆలోచించి చేసిన దేమనగా సంస్కృతమునందువలె గ్రంథమునం దందటను నొక ఛందస్సే వాడక, కందమువంటి చిన్న చిన్నపద్య ములు ఆటవెలది తేటగీతి మొదలైనవియు వాడెను కందను: తరువాత నెక్కు వగా నన్నయ్యగారు వ్రాసినది సీసపద్యము. గీతమో, ఆటవెలదియో సీస ముతో కలిసియే యుండును గదా ! వాటిని వ్యస్తముగా చేసి లెక్కచూచి నచో కందము తరువాత నాయన అధికముగా వ్రాసిన పద్యము లాటవెల దులు గీతములే యగును ఈ యన్నింటిని బట్టి చూడగా తెనుగుభారతమును చిన్న చిన్న పద్యములలో వ్రాయుట నాయన ఆలోచించి చేసినట్లు స్పష్టమగు చున్నది. వృత్తములలో నాయన మిక్కిలిగా నుపయోగించిన దొక్క చంప కమే. ఆ చంపకముల మొత్తము సంఖ్య 240. తెనుగుభాషా స్వరూపస్వభావ ములకు కావ్యములయందు ఛందోవైవిధ్య ముండుట గుణ మని ఆయన భావిం చినట్లు కనిపించుచున్నది. తెనుగు భాషావైలక్షణ్యమును గ్రహించి భారతము

1. శ్రీ నిడుదవోలు వేంకటరావు గారి "తెలుగుకవుల చరిత్ర-" పుట 119.

వంటి గ్రంథమును వ్రాయుటకు తగిన ఛందమును సంభావించి నన్నయ్యగా రాంధ్రమహాభారతమును వ్రాసిపెట్టిరి.

తిక్కన్నగారు నన్నయ్యగారి మార్గమునే అనుసరించిరి మరియు నన్నయ్యగారు వ్రాసిన భారతభాగమునందు కంటె, ఉపదేశాత్మకత మొదలైన లక్షణములు తిక్కన్నగారు వ్రాసిన భాగమునందే అధికముగా నున్నవి. అందువలన దీర్ఘవృత్తముల నుపయోగించు నవకాశము తిక్కన్నగారికి మరియు తక్కువ. కనుకనే గ్రంథమంతయును కందపద్యములతోను, గీతము, ఆటవెలది మొదలైన వాటితోను నింపివేయబడినది. నన్నయ్యగారివలెనే తిక్కన్నగారును వృత్తములలో నొక్క చంపకమునే కొంచెము మెక్కువగా వాడెను. మత్తేభ శార్దూలములు చాల తక్కువ. పదునైదుపర్వముల భారతమునందు కనీస మొక నూటపాతిక శార్దూలవృత్తములు లేవన్నచో ఛందస్సు విషయమున కూడ నన్నయ్యగారి పథకమును తిక్కన్నగా రెంత జాగ్రత్తగా కొనసాగించిరో ఊహింపవచ్చును. ఏదేని విశేషప్రయోజన మాశించకుండ శార్దూలాది దీర్ఘ వృత్తములను భారతకవులు వ్రాసియు వ్రాయ లేదు. ఛందస్సుయొక్క వినియోగరహస్యము నెరిగి రచనచేసిన ఋషులు భారతకవులు.

దీర్ఘవృత్తముల పొంత నంతగా బోక, కావలయునని విచారించి చిన్న చిన్న పద్యములలోనే భారతమును వ్రాయబూనుట క్షేమేంద్రమతానుసారముగా బాగుగనే యున్నది. అయినచో నొక్క కందపద్యమునే విరివిగా నేల నన్నయ తిక్కన్న లుపయోగింపవలెయును? విచారించినమీద నిట్లు తోచుచున్నది. యతిప్రాస లుండి, నాల్గయిదు గణములు దేని తరువాత నేది వచ్చుటకైనను వీలుండి, పాదము విడిచి పాదమునకు మాత్రలచేత నొక సమత యుండి,[1] దీర్ఘముకానిది కందపద్యము యతిప్రాసలవలన పద్యమునం దప్రయత్నముగా శబ్దాలంకారము సిద్ధించుచున్నది. అక్షరముయొక్క ఆవృత్తియే శబ్దాలంకారము. వివరములకు దిగనిచో నక్షరముయొక్క ఆవృత్తియే యతియు ప్రాసయు నగుచున్నది. యతి పేర నాల్గక్షరములు ఒక్కొక్కొటి

---

1. ద్వితీయ చతుర్థ పాదములయందే యతి. జగణ మెప్పుడును బేసి సంఖ్యగా వాడబడదు ప్రథమ తృతీయ పాదము లొక్కొక్కటి 12 మాత్రలతోడను, రెండు, నాలుగు పాదము లిరువది యిరువది మాత్రలతోడను ఉండును.

రెండుసార్లును, ప్రాస పేర నొక యక్షరము నాల్గుసార్లును తెనుగుపద్యమునం దావృత్తము లగుచున్నవి. తెనుగుపద్యసాధారణమైన ఈ విషయము శబ్దాలంకారమునందలి యనుప్రాసలక్షణము. అనపహ్నవనీయమైన శ్రోత్రగ్రాహ్యమగు రసాభివ్యంజకత స్వభావము వర్ణమున కేది కలదో దానిమీద శబ్దాలంకారము సృష్టింపబడినది. అట్టి శబ్దాలంకారము యతిప్రాసల రూపమున తెనుగుపద్యముయొక్క లక్షణ మైపోయినది. చిన్నపద్యములలో కందమునం దున్న విశేష మేవంవిధమైనది. మరియునంచు భ-జ-స-నల-గగ- అను నీ గణములు దేని తరువాత నేదైన నుపయోగింపబడవచ్చును. కావలయు నను కొన్నచో నొక్క గణముమీదనే పద్యమును చాలవరకు నడిపించవచ్చును. అందువలన విసుగుదల బుట్టించని గతివైవిధ్యరూపమైన గుణ మీ కందపద్యము లక్షణమునందే యున్నది. ఛందోగతి నెప్పటి కప్పుడు మార్చుటకు వీలైన చిన్నపద్యము కందము తప్ప మరొకటి లేదు. ఈ పద్యమున నుపయోగింపబడు గణములు నాలుగేసి మాత్రలవి. అందువలననే గణమెచట నుపయోగింపబడినప్పటికిని, మాత్రానియమము కలిగి పాదములు పద్యముయొక్క సమతను కాపాడుచుండును. పద్యము దీర్ఘమైనది కాదని దానిని చూచుటతోడనే తెలియును. ఇన్ని వెసులుబాట్లుగల పద్యము గనుక కందమును నన్నయ్యగారు భారతరచనయం దధికముగా నుపయోగించిరి. పద్యము రహస్యము తెలిసిన తిక్కన్నగారు నన్నయ్యనే అనుసరించెను. దీని తరువాత ప్రాసలేని, యతితో పాటు ప్రాసయతియు గల, ఛందోగతి కొద్ది పరిధిలో మారుటకు వీలున్న చిన్న పద్యములు తేటగీతి-ఆటవెలది. ఇందు సూర్య-ఇంద్రగణములలో నిష్టము వచ్చినది వాడుకొనవచ్చును గాని, ఆ సూర్యేంద్రగణముల క్రమమును మాత్రము మార్చరాదు. కొద్ది పరిధిలో ఛందోగతి మార్చుటకు వీలున్న దనగా నర్థ మిదియే. సీస మింతకంటె పెద్ద పద్యమే అయినను. అదియు నీ పద్ధతిలో ఛందోగతి మారుటకు వీలైనదియే. తిక్కన్నగారి యుద్ధవర్ణనలు గాని, ధర్మతత్త్వవిషయకథనముగాని విసుగుపుట్టక రక్తి కట్టుచుండుటకు ప్రబలమైన హేతు వాయన కందపద్యముయొక్క రహస్యమును పట్టుకొని రచించుటయే. ఒక్క కందమును తప్ప మరి యే యితర పద్యమును తిక్కన్నగారు భారతమున వరుసగా రెండింటిని మించి వ్రాయలేదు.[1] వరుసగా మూడు నాల్గు కందము

1. ఒక్క సీసపద్యమును మాత్రము షోడశరాజుల చరిత్రమును వ్రాయుటలో వరుసగా పదునారుసార్లు తిక్కన్నగా రుపయోగించిరి.

లుండుట తిక్కన్నగారి భారతమున సర్వసాధారణ విషయము. మరియు పది పన్నెండు పద్యములు, మధ్య అనవుడు-నావుడు వంటి కొద్దిపాటి వచనము కూడ లేకుండ, వరుసగా తిక్కన్నగారు వ్రాసినా రన్నచో నైదారేడు పద్యములు తఱచు వ్రాయుటను చెప్పనక్కరలేదు [1] దాని నడకలో క్షణక్షణము మార్పును చూపించుట కున్న వీలునుబట్టియే ఆ కందపద్య మా విధముగా నుపయోగింపబడినది దాని గతివిశేషమునకు సూచనగా రెండుమూ డుదాహరణములు చూపబడుచున్నవి. ఒకటి రెండు గణముల నెక్కువగా నావృత్తి చేసినచో నా పద్యమున కొక అందము వచ్చును.

గోవులు సూర్యుని యుజ్జ్వల
గోవుల యట్లగుటఁ జేసి గాదానపరుల్-[2]

ఐదు భగణములను వరుసగా వాడి దీని నడకయం దందము తేబడినది.

కావునఁ జెఱవులు నూతులు
బావులుఁ గొలుకులును నెపుడుఁ బౌరవవర్యా-[3]

ఇందు భగణము నలము గ్రుచ్చియెత్తబడినవి మరియు ప్రాసాక్షరము ద్విత్వమో, సంయుక్తమో అయినచో దాని గతి మరొక విధముగా నుండును.

ఇక్కడఁ గృష్ణుల తేజము
నక్కడఁ బవమాననందనాది జనుల పే
ర్కుక్కును గెలిపించె మనలఁ
జిక్కక వెడలితిమి శత్రుసేనలచేతన్[4].

---

1. ఈ విషయమును నిరూపించుటకుగా నుదాహరణము లెత్తివ్రాయ నవసరము లేదు. భారతమునం దెచటనైనను చూచుకొనవచ్చును. అయినను ద్రోణపర్వము ప్రథమాశ్వాసము 152-158, శాంతిపర్వము తృతీయాశ్వాసము 28-34, మరియు 430-439 పద్యములను చూడవలయుననుట పైన చెప్పబడిన దాని కొక సూచన కాగలదు.

2. భా. అను. 2-461.

3. భా. అను. 2-384.

4. భా. ద్రోణ. 4-57.

కూల్చుచు గజముల నెత్తుటఁ
దేల్చుచుఁ దురగముల వీకఁ దేరులు మరలన్
వేల్చుచుఁ గాల్బలములఁ బోరి
మాల్చుచు రౌద్రముగ మారి మసగిన భంగిన్[1].

ప్రాసాక్షరము లిట్లున్నప్పుడును మరియు బిందుపూర్వకముగా నున్నప్పుడును పద్యమున శబ్దాలంకారము శ్రవణేంద్రియమును స్పృశించుచుండును యతి ప్రాసలవలన పద్యమున నప్రయత్నముగా శబ్దాలంకారము సిద్ధించుచున్నదనుటకు స్థూలముగా నుదాహరణము చూపబడినది మరియు నీ పద్యమున నొకటి రెండు వర్ణములను పదములను ఆవృత్తిచేసినచో నందము సులభసాధ్యము. అల వోకగా పద్యమును గుమ్మనిపింపజేయవచ్చును.

శిరము లురంబులు గరములు
చరణంబులు రూపుమాయ శకలములై సం
గరధరఁ దొరఁగిరి యోధులు
గరి తురగ రథాస్త్ర శస్త్ర ఖండంబులతోన్[2].

రవర్ణముయొక్క ఆవృత్తిమీద పద్యము నడింపబడినది.

కడువడి నీ వరుగఁగ వడ
ముడియును నీ వెనుక శీఘ్రమున నెయిదుం గ
వ్వడి కుళలియైన విజయం
బొడగూడును మనకు దీని కొడబడు మనఘా ![3]

ఈ పద్యమునందలి డవర్ణముయొక్క ఆవృత్తి ద్రోణుని నాల్గవనాటి యుద్ధమున నర్జునుని విషయమున భయపడి వానికి రక్షణగా సాత్యకిని పొమ్మని తొందరపెట్టు ధర్మజుని చిత్తముయొక్క తత్తరపాటును లెస్సగా దీపింపజేయుచున్నది.

---

1. భా. ద్రోణ. 1-141.
2. భా. ద్రోణ. 1-265.
3. భా. ద్రోణ. 3-297.

కోకిలకుల గంధర్వా
నీకధ్వను లెనసి బెరసి నిగుడగ నమరీ
లోక భ్రమరీ మండలి
కాకలకలనాదములును గలసి చెలంగన్.[1]

సంగము బంధ మఖిల ని
స్సంగత మోక్షంబు బహువిచారము లేలా
పింగజటాజూటకలిత
గంగా బాలేందు మహిత గౌరీసహితా.[2]

ఈ విధముగా పర్ణము లొకటి రెండు ఆవృత్తములు చేయబడినచో కందపద్య మెక్కడికక్కడ క్రొత్తనడకల సొగసులు సంతరించుకొనుచుండును పద్యము చిన్నదగుటచేత రచనలో నే మాత్రపు పనితనము చూపింపబడినను నది చమత్కారమవనీయమై జిగిమీరపోవుచుండును పదముల యావృత్తియు నిట్లే యుండును.

శరము లొకఁడొకఁడు పదిపది
పరఁగింపఁగ మూటమూఁటఁ బార్థుఁడు నొంచెన్
సరి నైదైదేయఁగ న
న్నరు డందఱ రెంటరెంట నవి నొప్పించెన్[3]

పదియును నూఱును వేయును
మొదవులు గలవారు దానములుగా నొకటిం
బదియింటి నూటి నిచ్చిన
నదియు నదియు నదియు సదృశమగు ఫలము నిడెన్.[4]

ఈ రెండు పద్యములును కేవలము పొడియైన వార్త వంటి విషయమును చెప్పునవి పద్యములు నడిపింపబడిన తీరు సహృదయ పాఠకుల బుద్ధినార్ద్రము చేసి తద్విషయగ్రహణమువలని క్లేశమును సుకుమారముగా త్రోసిపుచ్చుచున్నది. పద

1. భా. అను. 4-417.
2. భా. అను. 4-238.
3. భా. ద్రోణ. 1-241.
4. భా. అను. 3-30.

ముల యావృత్తిమీద తిక్కన్నగారు పద్యములను రక్తికట్టించిరి ఆయన చేతిలో కందపద్యమీ పోకడపోయినది, ఈ పోకడ పోలేదని లేదు దాని లక్షణ రహస్యము నెరిగి, దానివలన నెంత ప్రయోజనమును సాధింపవచ్చునో తిక్కన్నగా రంత ప్రయోజనమును సాధించిరి మరియు నాయన తన తెనుగుజాతి వాక్యనిర్మాణ వైలక్షణ్యము నెరిగినతనముతో నా పద్యమును లక్ష క్రొత్తనడకలు నడిపించెను ఆయన అన్ని పద్యముల నట్లే వ్రానె ననుట అది వేరు విషయము. ఛందస్సుయొక్క రహస్యము, భాషయొక్క ఆయువుపట్టయిన నుడికారమునందలి గూఢత, తెలిసిన మహాకవులే పద్యము నైనను నట్లే వ్రాయుదురు భారతమువంటి గ్రంథము వ్రాయుటకు తగినదిగా నిర్ణయింపబడిన ఛందమునయం దాయన చేసిన లోకాతిశాయి రమణీయమైన పనివానితనము చాల దొడ్డది యైనందున ప్రకృతము దాని విషయమే కొంత విచారింపబడినది. చిన్నపద్యములలో కందమే యేల విరివిగా వాడబడవలయు నన్న ప్రశ్నకు సమాధానముగా నందున్న కొన్ని వెసులుబాట్లు చూపబడినవి. అంత మాత్రమే.

ఇక తిక్కన్నగారి భారతమునం దున్న విశేషవృత్తముల వినియోగము విషయము వ్రాయబడును— భారతమునం దొక్క సౌప్తికపర్వమునను మరియు స్త్రీపర్వమునను మాత్రమే విశేషవృత్తములు వాడబడినవి. ఇందు కపవాదముగా స్రగ్ధర, మహాస్రగ్ధర, తరువోజ, ఈ మూడును నితర పర్వములయం దొక అయిదు కనిపించవచ్చును విశేషవృత్తము లనగా, చంపకోత్పల శార్దూల మత్తేభములు; కందము, సీసము, ఆటవెలది, తేటగీతి; అను నీ యెనిమిది పద్యములును కానివి మరి అట్టి విశేషవృత్తము లా రెండుపర్వములయందే తిక్కన్నగా రేల వాడవలయును ? అశ్వత్థామ పాండవ శిబిరములను, దుర్యోధనుడు తొడలు విరుగగొట్టబడిన నాటి రాత్రమున ప్రవేశించి సుప్తావస్థయందున్న జీవులమీద పడి సర్వసంహారము చేయుట సౌప్తికపర్వము ప్రథమాశ్వాసమునందలి విషయము స్వపుత్ర బాంధవమరణ దుఃఖితులైన పాండవు లశ్వత్థామను వెంటాడి వాని శిరోమణి నపహరించి తేజోవిహీనుని చేయుట రెండవయాశ్వాసమునందలి విషయము. స్త్రీపర్వము ప్రథమాశ్వాసమున ధృతరాష్ట్రుడు గాంధారి మొదలైన స్వజన మరణదుఃఖపీడితులు, తమ యా దుఃఖమునకు మూలభూతులైన ధర్మరాజాదులను కలిసికొని మాటాడుటయు, ద్వితీ

యాశ్వాసమున బీభత్సమును భయానకమును నైన యుద్ధభూమిని తిరుగాడుచు గాంధారి మృతులను పేరు పేర పేర్కొని గుండియలవియ నేడ్చుటయు విషయము అశ్వత్థామ చేసిన దొకవిధముగా యుద్ధము కాదు ఈ విషయ మీ గ్రంథమున వెనుక నొకసారి చెప్పబడినది. కాకపోయినను మరియొక విధముగా నది యుద్ధమే. దుర్యోధనుడు తొడలు విరుగగొట్టబడి పడియున్నాడే కాని ఇంకను మరణించలేదు అశ్వత్థామ కాతడు సేనాధిపత్యాభిషేకము చేయించి పాండవుల మీదకు పంపినాడు దుర్యోధనుడు ప్రాణములు విడుచు వరకు యుద్ధము జరిగినట్లే లెక్క. యుద్ధమును ధృతరాష్ట్రునకు వినిపించుటకు గాను వ్యాసుడు సంజయున కనుగ్రహించిన వరము మహిమ వానిని విడిచి దుర్యోధనుడు ప్రాణములు విడుచుటతో పోయినది అశ్వత్థామ పాండవుల శిబిరములను ప్రవేశించి శివావేశమున మైమరచి సర్వసంహారము చేసి వచ్చి యిది యిట్లయిన దని చెప్పిన తరువాత దుర్యోధనుడు ప్రాణములు విడిచినాడు అందువలన నశ్వత్థామ చేసినది యుద్ధమే. కాని తత్పూర్వము ప్రవర్తించిన యుద్ధము వంటిది మాత్రము కాదు తేజోరూపమున శివునిచేత నావేశింప బడినవా డశ్వత్థామ. ధృష్టద్యుమ్నాదులు సుప్తులు. అశ్వత్థామ వారిమీద విరుచుకపడి కుత్తుకలు తెగగోసినాడు. మీదపడిన తరువాత మేల్కొని కొంచెము పెనుగులాడుటయే కాని ధృష్టద్యుమ్నాదులయందు యుద్ధసన్నద్ధత లేదు ఇట్టి పరిస్థితి తత్పూర్వము జరిగిన పదునెనిమిది దినముల యుద్ధమునం దెప్పుడును తటస్థపడలేదు కనుక నశ్వత్థామ యుద్ధము యుద్ధము కాదు. అట్లని యుద్ధము కాకను పోదు అదియొక విశేషమైన యుద్ధము అందువలన తిక్కన్నగారు దాని విశేషమైనతనమును స్ఫురింపజేయుటకుగాను, తత్పూర్వము యుద్ధమును వర్ణించునప్పు డుపయోగించిన పద్యములు కాని విశేషవృత్తములతో, నా యుద్ధము కాని యుద్ధమును వర్ణించునట్లు కనిపించుచున్నది. రెండవ యాశ్వాసమునను, అశ్వత్థామ సంరంభము, పాండవుల పుత్రశోకముతోడి విజృంభణము మొదలైన విషయము లున్నందున విశేషవృత్తము లుపయోగింప బడిన ట్లూహింపవలయును. స్త్రీపర్వమున శోకము చిత్తస్థాయిగా వర్ణింపబడినది. అది భారతమున ప్రధానమైన అంగరసము. అది తత్పూర్వము ప్రవర్తించిన గ్రంథమునందలి రసభావములకును, తత్పరమున ప్రవర్తింపనున్న రసభావములకును విరోధమును పరిహించు విశేషమైన రసము భారతమున దాని

వైశిష్ట్యము స్ఫురించునట్లుగా తిక్కన్నగారు విశేషవృత్తములతో చిత్తస్థాయిగా తచ్ఛోకము నభివర్ణించినట్లు తెలియవలయును. అనగా పూర్వాపరముల నుండి దేనిని విలక్షణముగా స్ఫురింపజేయుటను తిక్కన్నగా రాశించిరో ఏత ద్విషయ వర్ణమునకు విశేషవృత్తము లుపయోగించినట్లు తోచుచున్నది ఇంత కంటె విశేషవృత్తముల వినియోగమును గురించి చెప్పదగినది కనిపించుట లేదు.

తిక్కన్నగా రుపయోగించిన విశేషవృత్తములలో క్షేమేంద్రుడు విని యోగమును నిష్కర్షించిపెట్టిన వృత్తములు చాల తక్కువగా నున్నవి. నన్న య్యగా రుపయోగించని వృత్తములను తిక్కన్నగారు చాల ఉపయోగించెను. ఇంద్రవజ్ర, మంజుభాషిణి మొదలుగాఁగలిగిన వృత్తముల నొక్క తిక్కన్నగా రొక్కచోటనే వ్రాసియున్నందున ఆయన వ్రాసిన సందర్భమే సందర్భముగా చెప్పవలసివచ్చును. అదొక విశేష విచారము కాదు. అందువలన నా విష యము వ్రాయబడుట లేదు. తరలము, మత్తకోకిల, తరువోజ, ఉత్సాహము, మాలిని, కవిరాజవిరాజితము—ఈ వృత్తములు తిక్కన్నగారివలె నన్నయ్యయు కథాసందర్భమున నుపయోగించెనుగాని, తిక్కన్నగా రుపయోగించిన సందర్భము లకును వాటికిని పొత్తుకుదురుట లేదు మొత్తముమీద నొక సూత్రమున కొదు గలాగుటకు వీలు కనిపించనందున వాటి విషయమును నిచట చెప్పబడుట లేదు. వనమయూరము, ద్రుతవిలంబితము, అంబురుహము, భుజంగప్రయాతము, స్రగ్విణి, క్రౌంచపదము, దోదకము—ఇవి నన్నయ్యగారిచేత గాని, ఎఱ్ఱన్న చేతగాని కథాసందర్భములయం దుపయోగింపబడలేదు ఆశ్వాసాంతముల యందున్న వారి పద్యములను బట్టుకొని కథాసందర్భములయందున్న తిక్కన్న గారి పద్యములతో పోల్చి విచారించుట కవకాశము లేదు. చెప్పబూనినచో తిక్కన్నగా రొక్కరే వ్రాసిన పద్యముల విషయమును చెప్పినట్లే చెప్పవలసి వచ్చును కనుక దానివలెనే ఇదియు నిచట పేర్కొనబడుట లేదు క్షేమేంద్రుని మతము ననుసరించి, విశిష్టార్థ స్ఫోరకములుగా తిక్కన్నగారు వ్రాసిన కొన్ని విశేషవృత్తముల వినియోగము విషయము నన్నయ్య ఎఱ్ఱన్నలతో పోల్చుచు నిచట విచారింపబడును నన్నయ్య ఎఱ్ఱన్నలను ప్రసక్తికి తెచ్చుటవలన నొక్కొక్క విశేషవృత్తము వినియోగము విషయమున కవిత్రయమువారి దృష్టి యెట్టిదో తెలియగలదు.

స్రగ్ధర-మహాస్రగ్ధర: ఈ రెండింటిని కలిపి చెప్పుటకు కారణ మేమనగా క్షేమేంద్రుడు స్రగ్ధరావృత్త వినియోగమును ఫలానా అని నిర్దేశించినట్లుగా మహాస్రగ్ధర విషయమును చెప్పలేదు. సావేగపవనాదీనాం వర్ణనే స్రగ్ధరా మతా-అని ఆయన చెప్పెను. స్రగ్ధర ఏ విషయమున నే ప్రయోజనమున నుప యోగింపబడునో, ఆ విషయము, ఆ ప్రయోజనము, ఇంకను మహత్తైన దైనచో మహాస్రగ్ధర నుపయోగించుకొనుటను వేరుగా చెప్పనక్కర లేదని క్షేమేంద్రు డూరకుండెనేమో అని తోచుచున్నది సావేగపవనాది యనగా వేగవంతమైన వాయువును మొదలైన వని యర్థము సావేగపవన మన్నది ప్రళయవాయువును స్ఫురింపజేయుచున్నది. అనగా భయంకరమైన ఝంఝ యని అట్టి ప్రళయవాయూపమ విషయవర్ణనమునకు స్రగ్ధరావృత్తము లెస్స యైన దని క్షేమేంద్రుని తాత్పర్యముగా మనము గ్రహింపవచ్చును.

తిక్కన్నగారు విరాటపర్వమున దుర్యోధనుని వర్ణించుచు స్రగ్ధరావృత్త మును వ్రాసిరి ఆ దుర్యోధను డెట్టివా డనగా పాండవుల యజ్ఞాతవిధివ్రతమును భంగముచేయుటకు వారి యునికి నెరిగిరా వేగులవాండ్రను నలుదిశలకు పంపి, వారెరిగియే వత్తురన్న ఆశతో భీష్మ ద్రోణాది మహావీరమతు లందరును తనను చుట్టుకొని కొలిచియుండగా మహాసింహాసనమున కొలువున్న దుర్యోధనుడు. అట్టి వాడు మరియు సకలసామంతక్ష్మాపాలురచేత నంజలిఘటింపబడి కొలువబడు చున్నాడు ఈ కొలువబడుచున్న దుర్యోధనుని తిక్కన్నగారు స్రగ్ధరావృత్త మున వర్ణించిరి. భారతము ముత్తముమీద మరియెచ్చటను దుర్యోధను డొక మహారాజువలె కొలువుదీరియుండుట వర్ణింపబడలేదు ఈ యొక్కచోటనే అట్లు వర్ణింపబడినది. మరియు నది స్రగ్ధరావృత్తమున. ధర్మరాజాదులు దేశమునలేని పదురెండేడుల పైచిలుకు కాల మా దుర్యోధను డట్లొక మహారాజు రీవిని కొలు వుండి రాజ్యమేలినా డను విషయ మా ఘట్ట మూరక స్ఫురింపజేయుచున్నది అది యట్లుండె. దుర్యోధను డట్లు సామంతనృపాలురచేత కొలువబడుచున్న ఆ కొలువునం దప్పుడు వానిచేత పంపబడిన చారులు తిరిగివచ్చి పాండవులు కానరాలే దని విన్నవించినారు. అనగా చారులు తిరిగివచ్చు సమయమునకు దుర్యోధను డా స్రగ్ధరావృత్తమున వర్ణింపబడి నట్లుండెను. ఆ దుర్యోధనుడు లోపల నేమనుకొనుచున్నాడో మనకు తెలియదు. తిక్కన్నగారు వాని బాహ్యా డంబరమునే వర్ణించిరి. దానిని బట్టి యి ట్లూహింపవచ్చును - తాను పంపిన

చారులు పాండవుల యునికి నెరిగి వత్తురు అపుడు వారిని తిరిగి తా నడవులకు పారద్రోలవచ్చును. వేగులవారు దేశములను బట్టుకొనిపోయికూడ చాల కాల మైనది నేడో రేపో రావలయును ఇంతకు ముందే రావలసినది త్వరగా వచ్చిన బాగుండును - ఇట్టి ఉత్తాలములైన ఊహాతరంగములచేత తాడితమును నుద్ధత మును నగుచున్న చిత్తవృత్తి యప్పటి దుర్యోధనునిది. మరియు దుర్యోధనుడు సామంతరాజులచేత కొలువబడుచున్నాడు ఆదిపర్వమునుండి అపాండవము చేసి తాను రాజ్యముచేయవలయునని సలిపిన ప్రయత్నముల ఫలితముగా తా నా స్థితికి వచ్చినాడు దాదాపు పదుమూడుసంవత్సరము లనుభవించినాడు. అది యట్లే కొనసాగించుకొనవలయును పాండవుల యజ్ఞాతవాసమును కలు షము గావించినచో తన కది మరల పదమూడేండ్లు కొనసాగును. తరువాత చూచుకొనవచ్చును అపుడును నిట్లే చేయవచ్చును కనుక త్వరగా వేగులవారు రావలయును. సామంతరాజులచేత కొలువబడు తన యా స్థితిని కొనసాగించు కొనవలయును. వారు పాండవుల జాడ నెరిగియే వత్తురు. తన యభీష్టము తనకు నెరవేరినది ఈ మొదలైన తీవ్ర పర్యాలోచన తోడి మహోత్సాహ ముతో దుర్యోధను డప్రధృష్యుడుగా నున్నాడు ఇట్టి బహువిషయములు స్ఫురించునట్లుగా తిక్కన్నగా రచట స్రగ్ధరావృత్తమున వానిని వర్ణించిరి. అది పూర్వాపరములయందున్న వాటికంటె భిన్నమైన విశేషవృత్త మగుట మాత్ర ముచేతనే ఆ యా విషయములను స్ఫురింపజేయుచున్నది అట్లు పద్యమును వ్రాయుట వృత్తౌచిత్యము భారతేతిహాసమునందలి ప్రతినాయకుని యొక్క త్రికాలసమాపతితమైన ప్రబలోత్సాహము సావేగవాయువీచీవిశాలరమణీ యమై యున్న దను విషయమును వృత్తౌచిత్యముమీద తిక్కన్నగారు స్ఫురింప జేసిరి. తత్స్ఫురణము కొంత ఆవృత్తముయొక్క ఛందోగతిని బట్టి శ్రవణేం ద్రియము ద్వారా బుద్ధికెక్కు లక్షణముతో నున్నది. ఏతల్లక్షణము వ్రాయ దగినది కాదు. అనుభవింపదగినది ఆ పద్యమును, వార్తాపత్రికనువలె గాక, పైకి ఉచ్చారణదక్షతకలిమిని పఠించినచో తదనుభవము కలుగును. మొదలు కవిత్వముతోడి పద్యము లన్నియు నట్లు గొంతెత్తియే పఠింపబడవలయును. ప్రతిపద్యమునకును నొక గతివిశేషమున్నదిక దా! పద్యము పైకి పఠింపబడనిచో శ్రవణేంద్రియముద్వారా రసాస్వాదనమున సహకారియగు వర్ణములయందు పరుషసరళాది రూపమున నున్న వ్యంజకత్వస్వభావము కనీసము కొంతయైనను

వృథయైపోవును. అప్పుడు పద్య మెంతగా నర్థము కావలయునో అంత యగుట లేదు. కనుక పద్యము పైకి చదువబడవలయును.

మరియొక్క స్రగ్ధరావృత్తమును తిక్కన్నగారు ఉద్యోగపర్వమున సంజయునితో ధర్మరా జన్న మాటలు గా వ్రాసిరి. శూన్యహస్తములు చూపించి శుష్క ప్రియములతో ధర్మరాజు నుపశమింపచేయుటకుగా ధృతరాష్ట్రునిచేత పంపబడి వచ్చిన సంజయు డా మాట లీ మాటలు మాటాడుచు, పైకేమియు కనిపించకుండునట్లు గడుసుగా దుర్యోధనాదులను యుద్ధమున మీరు జయించలేరను తాత్పర్యమును ధర్మరాజునకు సూచించినాడు తమ బలమును తీసికట్టినట్లుగా మాటాడు సంజయుని మర్మమును గ్రహించిన ధర్మరాజునకు కోపము వచ్చినది ఆ కోపముతో దుర్యోధనాదులు మా చేతిలోపడి చావకపోవుట వారి వశమా ?–అని ఈ మొదలైన మాటలు సంజయునితో ననినాడు. ఆ ధర్మరాజన్న మాటలను తిక్కన్నగారు స్రగ్ధరావృత్తమున వ్రాసిరి. సాధారణముగా ధర్మరాజుకు కోపము రాదు అనగా వెలికి రాదు ఆయనకు భారతము మొత్తము మీద రెండు మూడు సార్లు కోపము వచ్చినది ఈ ఉద్యోగపర్వమున తప్ప మరియెచ్చటను వాని కోపమువచ్చిన మాటలు స్రగ్ధరాది విశేషవృత్తముల యందు తిక్కన్నగారు వ్రాయలేదు యుద్ధమునకు ముందున్న ధర్మజుని సమరోత్సాహముతోడి చిత్తలక్షణముయొక్క పరాంకోటిదశను విశేషముగా స్ఫురింపజేయుట కట్లు విశేషవృత్తమును తిక్కన్నగారు గ్రహించినట్లు కనిపించుచున్నది. దుర్యోధనాదులను జయించుట యెంత పని యను నిశ్చయాత్మకమైన ఉత్సాహముతో నున్న ధర్మరాజును సంజయుని మాటల యాంతర్యము చురుకుదెబ్బ కొట్టినది ఆ దెబ్బ వెంబడి ధర్మరా జొక తీవ్రానిలమువలె తాడియెత్తున లేచినాడు అట్లు లేచిన ఆగ్రహపరవశుడైన వాని మాటలు స్రగ్ధరావృత్తమున వ్రాయబడినవి. అనగా నచట నావృత్తమును వ్రాసి తిక్కన్నగారు ధర్మజుని పైన చెప్పబడిన స్థితిని స్ఫురించునట్లు చేసినా రని. ధర్మరాజునకు కోపము వచ్చిన దనగా నదియొక మహావాయువుయొక్క చెలరేగినతనము వంటిది. ముఖ్యముగా నుత్సాహముతోడి కోప మట్టిది. యుద్ధము జరుగుచున్న కాలముననుు, యుద్ధ మైపోయిన తరువాతను భారతమున వానియందు చెప్పబడిన కోపము దైన్యముతోడి కోపము, మరియు శోకముతోడి కోపము. అట్టి కోపములకంటె భిన్నమైన, మరియు వాటి కన్నింటికి మూలభూతమైన సమరో

త్సాహముతోడి ధర్మజుని క్రోధమును భిన్నవృత్తము నాశ్రయించి వర్ణించి తిక్కన్నగా రౌచిత్యమును వెలుగబట్టిరి

ఇచట నొక విశేషము కనిపించుచున్నది దుర్యోధనుని మహారాజ్యపదవీ స్థితిని తిక్కన్నగా రే విశేషవృత్తమున వర్ణించిరో ఆ విశేషవృత్తముననే ధర్మ జుని సమరోత్సాహముతోడి క్రోధమును వర్ణించుట గమనింపదగినది. ఇందలి రహస్య మిట్లూహింపదగియున్నది పాండవులను పారద్రోలి సర్వరాజ్యమును తానే మహారాజై పాలింపవలయు నన్న ప్రగాఢమైన వేరుదన్నిన ఇచ్ఛ దుర్యో ధనున కెంతయున్నదో, దుర్యోధనాదులను సర్వనాశనముచేసి యైనను రాజ్య మును సంపాదించితీరవలయు నన్న ఇచ్ఛ ధర్మరాజున కంత యున్నది. ఈ యిరువురకు గల భేద మంతయు వెలికికనిపించుట, కనిపించకపోవుట మాత్రమే. దుర్యోధనునిది బాహ్యాడంబరముతోడి ప్రవృత్తి ధర్మజుని ప్రవృత్తి అంతర్ని గూఢమైనది. మహాభారతమంతయు నిందుల కుదాహరణమే అందువలననే తిక్కన్నగారు దుర్యోధనుని సామంతరాజులు సేవించుచున్న విధమును వెలికి కనిపించు దానిని సాలంకారముగా స్రగ్ధరావృత్తమున వర్ణించిరి. ధర్మజుని లోపలి యుడుకును, మరియు దుర్యోధనాదులు చావకుండనెట్లు పోగల రన్న నిశ్చయరూపమైన మనోలక్షణమును నిరలంకారముగా స్రగ్ధరావృత్తమున నిరూ పించిరి. నాయక ప్రతినాయకులైన ధర్మజునియొక్కయు, దుర్యోధనుని యొక్కయు విశిష్టమైన జీవలక్షణములు పునాదులుగా నా రెండుపద్యములును వ్రాయబడినవి. వృత్తౌచిత్య మన్నది ఇంతకంటె మహనీయార్థవంతమై యుం డుటకు వీలులేదు ప్రధానకథార్థమునకు దీప్తిని కలిగించునట్లుగా వృత్తమును గ్రహించుట యట్లుండును అన్నిచోట్ల వృత్తముల నట్లు గ్రహించి వ్రాయుట సాధ్యముకాదు. తత్తత్ప్రకరణార్థమునందలి యొక ప్రత్యేకతను మాత్రమే అచటి విశేషవృత్తములు సూచించును.

సౌప్తికపర్వమున నీ స్రగ్ధరావృత్తముతో పాటు మహాస్రగ్ధరయు నుప యోగింపబడినది మహాస్రగ్ధరతోపాటు స్రగ్ధరయు నుపయోగింపబడిన దన్నచో యథార్థము చెప్పిన ట్లగును. అందు ప్రథమాశ్వాసమున మహాస్రగ్ధరల వినియో గము మరియు నెక్కువ. తన తనువునయం దావేశించిన శివతేజముతో నశ్వత్థామ మహాప్రళయానిలమువలె విజృంభించినా డనువిషయమును స్థూలముగా నావృ త్తములు స్ఫురింపజేయుచున్నవి. సాక్షాత్తు పరమశివుని తేజమది. శివుడు

లయకారకుడు కదా! ఆ తేజమువలన జీవు లణగిపోవుట మరియు మిక్కిలి చిత్రమును విశేషమును నైన విషయము. కనుక తత్స్ఫురణ కలుగునట్లుగా మహాస్రగ్ధరావృత్తములు గ్రహింపబడినవి తదాశ్వాసాంతమున తిక్కన్నగారు హరినాథుని గూడ మహాస్రగ్ధరయందే సంబోధించుటయు నొక విశేషము ద్వితీయాశ్వాసమున నశ్వత్థామ పై భీమార్జునుల విజృంభించుట విషయము ఇది రెండవనాటి కథ అశ్వత్థామయందు శివతేజము లేదు భీమార్జునులయందు క్రోధము దుఃఖము రెండే యున్నవి నాటి భీమార్జునుల విజృంభణము యుద్ధపు దినముల విజృంభణము వంటిది కాదు మరియు గతరాత్రి శివతేజముతో నశ్వత్థామ విజృంభించుట వంటిదియు కాదు అందువలన నేవం విధమైన తత్కాలము నందలి విశేషలక్షణము స్ఫురించుటకుగాను తిక్కన్నగారు స్రగ్ధరావృత్తములను మిక్కిలిగా నుపయోగించిరి ద్వితీయాశ్వాసమున మహాస్రగ్ధరలు ధర్మరాజాదుల దుఃఖము నభివర్ణించుచో నుపయోగింపబడినవి తద్దుఃఖమునకు హేతువు శివతేజముతోడి యశ్వత్థామయొక్క విజృంభణము కనుక కార్యకారణములయొక్క సమానమైన తీవ్రలక్షణమును స్ఫురింపజేయుటకుగా తిక్కన్నగా రా రెండు సందర్భములయందును మహాస్రగ్ధరావృత్తములను వ్రాసిరి.

శాంతిపర్వమున వ్రాయబడిన స్రగ్ధరా మహాస్రగ్ధరా వృత్తములు రెండును సంగ్రామకేళీవ్యసనరసికుడు సుదేవు డనువాని వీర విజృంభ లక్షణమును చెప్పుచో నుపయోగింపబడినవి. దేవేంద్రునంతటివానికి మెచ్చుగొల్పిన వీరుడు సుదేవుడు. అది విశేషము. మరియు దేవేంద్రుడే వాని విషయము నంబరీషునకు చెప్పినాడు అది మరియు విశేషము ఆ విశేషవృత్తములను వ్రాసి తిక్కన్నగారు తత్ప్రకరణార్థమును దీపింపజేసిరి.

నన్నయ్యగారు, గురుదక్షిణార్థము ద్రుపదుని పట్టుకొనిరాబోయిన కౌరవ పాండవులు పాంచాలురతో పెనగుచుండగా నర్జునుడు ద్రుపదునిమీద విజృంభించుటను, స్రగ్ధరావృత్తమున వర్ణించినారు. సీతను జూచివచ్చినా నని శ్రీరామునకు జెప్పిన హనుమంతుడు తాము బయలుదేరిపోయిన క్రమము చెప్పుచో మలయశైలశిఖర మెక్కి సముద్రమును జూచినా మని చెప్పినాడు. ఆ సముద్రమును ఎఱ్ఱన్నగారు స్రగ్ధరావృత్తమున వర్ణించిరి. మరియు నాంజనేయుడు ధూమ్రాక్షుని సంహరించుటను కూడ స్రగ్ధరావృత్తముననే ఎఱ్ఱన్నగారు వర్ణించిరి. సముద్రమథనము సమయమున నమృతముకొరకుగా దేవదానవులకు జరి

గిన యుద్ధమును వర్ణించుచో నొక మహాస్రగ్ధరను, దిగ్విజయముచేసిన పాండు భూపాలుని సామంతమహీపతులందరు సేవింపవచ్చిన విధమును వర్ణించుచో నొక మహాస్రగ్ధరను నన్నయ్యగారు వ్రాసిరి. ఎఱ్ఱాప్రెగడ, దుర్యోధనుని విడిపించుటకుగా చిత్రసేనుని గంధర్వసైన్యముతో భీమార్జుననకులసహదేవులు చేసిన యుద్ధమును వర్ణించుచో నొక మహాస్రగ్ధరయు, వానరసైన్యముమీద నడరి విహ్వలము పాలుచేసిన ధూమ్రాక్షుని తీవ్రతను వర్ణించుచో నొక మహాస్రగ్ధరయు వ్రాసెను.

ఈ యన్ని సందర్భములను బట్టి చూడగా కవిత్రయమువారు, ఒక విస్తృతిమీది కోలాహలముతోడి విషయమును వర్ణించు సందర్భమునను, ఒక భయావహమైన ఉత్సాహముతోడి యుద్ధతవిషయవర్ణనము పట్టునను, ఒక సహింపరాని చిత్తవృత్తియొక్క అభివ్యక్తిని చెప్పు సమయమునను, ఈ స్రగ్ధరా మహాస్రగ్ధరా వృత్తములను భారతమున వినియోగించినట్లు కనిపించుచున్నది. సామంతమహీపతుల రాకయు, సముద్ర వర్ణనము మొదటి సందర్భమున కుదాహరణములు. ధర్మరాజాదులు దుఃఖము మూడవవిధమున కుదాహరణము. ఇక మిగిలిన పట్ల నున్న పద్యము లన్నియు రెండవపద్ధతిలోనివి. ఇది స్థూలముగా చెప్పబడుచున్న విషయము క్షేమేంద్రుని తాత్పర్యమీ చెప్పబడిన విధానములయందు రేఖామాత్రముగా లేకపోలేదు. ఫలానావృత్తము ఫలానావిషయమునే వర్ణించుట కుపయోగించు నన్న విషయము సిద్ధాంతము చేయదగినది కాదని మొదటనే చెప్పబడినది.

**వసంతతిలక :** తన మరణించిన నూర్గురుకొడుకులకును నగ్నికార్యము నిర్వర్తింపను, తిలోదకప్రదానములు సేయను పాలికలనికి బయలుదేరుటకు ముందు ధృతరాష్ట్రుడు నేలగఱచుకొని తలదూర్చికొనుచు, ఇక కొడుకులుపోయి అన్యుల కృపమీద బ్రతుకవలసిన దినములు వచ్చినవే భగవంతుడా యని విలపించుట యేది కలదో దానిని తిక్కన్నగారు వసంతతిలకావృత్తమున వ్రాసిరి. క్షేమేంద్రుడు-సంకరే వీరరౌద్రయోః-అని యావృత్తమును నిష్కర్షించినాడు. తిక్కన్నగారు వినియోగించిన సందర్భ మట్టిదిగా కనిపించుట లేదు. నన్నయ్యగారీ వృత్తమును కథాసందర్భమునం దొక్క చోటమాత్రమే వ్రాసెను గంగా నదీతీరమున కర్ణుని కన్న కుంతి, సూర్యనిభుడైన యా పిల్లవానిని విడిచిపోలేక, తీసికొని బంధు లందర ముందరకు నింటికి పోలేక, దిక్కుతోచని స్థితి

కాస్పదమైన వగవుతోడి చిత్తవృత్తిని నన్నయ్యగా రా వృత్తమున వ్రాసిరి. నూర్గురు కొడుకులను బోగొట్టుకొని పరమదైన్యమునకు పాల్పడి, ఇతరులైన పాండవులు తనయందు చూపించు దయను తాను చూచి సహింపలేకపోవుటను పేర్కొను ధృతరాష్ట్రుని విలక్షణమైన వగపును తిక్కన్నగా రా వృత్తమున వ్రాసిరి. కనుక నన్నయ్యగారినే తిక్కన్నగా రనుసరించి వ్రాసినట్లు చెప్పవలయును అచట కుంతియొక్క మనోగతమైన వాక్కలాపమును నన్నయ్య వ్రాసెను. ఇచట ధృతరాష్ట్రునియొక్క మనోవేదనను తిక్కన్న వాని వాగ్రూపమున నభివ్యక్తము చేసెను.

క్షేమేంద్రుని వాక్యముయొక్క తాత్పర్యమును కొంత సూక్ష్మముగా విచారించినచో నన్నయ్య తిక్కన్నల వసంతతిలకావృత్తవినియోగము తదనుగుణమై కనిపించును సంకరే వీరరౌద్రయోః— అనగా వీరరౌద్రముల యందు ప్రవర్తించు భావముల సంకర మెచట వర్ణింపబడునో అచట వసంత తిలకను వ్రాయుటను క్షేమేంద్రుడు చెప్పుచున్నాడు. ఆ భావము లెచట నైనను, ఏకవిషయ నిష్ఠములై ఏకకాలమున ప్రవర్తించుచో నది సంకరమే యగును. అనగా భిన్నభావ సాంకర్యమును వర్ణించుచో నా వృత్తమును వ్రాయవలయు నని యర్థము అ భావము లెట్టి వన్న విషయము స్పష్టపడుటకై వీరరస రౌద్రరసములయందు ప్రయోగింపదగిన భావములని చెప్పెను తత్తద్రసాభిముఖములయినను కాకపోయినను నట్టి భావముల కలగలుపును వసంతతిలకయందు వర్ణించిన బాగుండు నన్నది వాని తాత్పర్యము కావలయును. అట్లయినచో నన్నయ్యగారు వ్రాసిన కుంతివిషయమున వితర్కము, అమర్షము-అను వీరరౌద్రములయందు ప్రయోగింపదగిన రెండు భావముల కలయికయు; తిక్కన్నగారు వ్రాసిన ధృతరాష్ట్రుని విషయమున ఆవేగము, చపలత-అను వీరరౌద్రములయందు ప్రయోగింపదగిన భావముల[1] కలయికయు కనిపించుచున్నది దుర్వాసు డిచ్చిన మంత్రమునకు శక్తియున్నదియు లేనిదియు నెరుగుటయందున్న ఉత్సాహము కలిమిని సూర్యుని ప్రార్థించినది ఆ మంత్రమునకు శక్తి యున్నది. సూర్యునివలన కొడుకు బుట్టినాడు తన కన్యాత్వము దూషితము కాకుండ సూర్యుడు వరమిచ్చినను, అ కుమారుని తీసికొని

1. నాట్యశాస్త్రము-పుట 258.

యింటికి పోయినచో వివాహముకాని తాను బంధువులలో నవమానము పాలు కావలసినదే కదా ! తత్కాలమునందలి కుంతియొక్క ఒక లక్షణ మది అనగా నామె యుత్సాహమునుండి అవమానమును పొందినట్లు అది అమర్షము.[1] దాని ననుసరించియే పిల్లవాని నింటికి తీసికొనిపోవుటయా ? లేక నచటనే దిగవిడిచి పోవుటయా ? అను వితర్కము పుట్టినది. అమర్షముయొక్కయు వితర్కము యొక్కయు సంకరమును నన్నయ్యగారు కుంతియందు వర్ణించిరి. తిక్కన్న గారు వర్ణించిన ధృతరాష్ట్రుని విషయమున ముందావేగము గోచరించుచున్నది. అది తన కుమారులందరును మరణించినా రను అప్రియవార్తాశ్రవణకృతమైన ఆవేగము. నేలమీద పడుట – తలదూర్చికొనుట – విలపించుట మొదలైన వన్నియు నా యా వేగలక్షణములే.[3] మరియు వెంటనే ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుడు మొదలుగా గలిగిన వారి మాటలు వినకపోయిన దాని ఫలమిట్లయిన దని వాపోయినాడు. అది తన యనాలోచితముగా ప్రవర్తించిన విధమునుభావించుట. అనాలోచిత ప్రవర్తనము చపలత[4]. అనగా నావేగము యొక్కయు, చపలత యొక్కయు సంకరమును తిక్కన్నగారు ధృతరాష్ట్రునియందు వర్ణించిరి. అట్టి భావసాంకర్యమును వర్ణించుచో నన్నయ తిక్కన లిరువురును వసంతతిలకా వృత్తమును క్షేమేంద్రుని వాక్యార్థ మింకను పర్యాలోచింపబడవలసియున్నది. అంతవరకు నే విషయమును తేల్చి గట్టిగా చెప్పుటకు వీలులేదు. బుద్ధికందిన నంతవరకు క్షేమేంద్రుని వాక్యార్థము విచారింపబడినది. అంత మాత్రమే.

**ఉపజాతి :** శృంగారాలంబనయైన ఉదారమైన నాయికారూప వర్ణనమునకు, మరియు వసంతాది ఋతువులయొక్కయు తదంగములయొక్కయు వర్ణనమునం దీ యుపజాతివృత్తమును వ్రాయుట మేలుగా నుండునని క్షేమేంద్రుడు చెప్పెను తిక్కన్నగారు ఉపయోగించిన సందర్భము క్షేమేంద్రుడు చెప్పిన దానితో నే మాత్రమును సంబంధములేనిది స్త్రీ పర్వమున ధృతరాష్ట్రుని నోదార్చుటకు వ్యాసుడు వచ్చినాడు. ధృతరాష్ట్రుడు వానితో తన దుఃఖమును వెళ్ళబోసికొనినాడు తన నిర్భాగ్యతవలన తనకు చావు రాలేదని,

---

1. నాట్యశాస్త్రము–పుట 251.
2. నాట్యశాస్త్రము–పుట 248.
3. నాట్యశాస్త్రము–పుట 247.

మూర్ఛవలన తెగటారిన దనుకొనిన చిత్తము తిరిగి శరీరమున ప్రవేశించుట నిర్భాగ్యలక్షణము కాక మరేమి యని, ధృతరాష్ట్రుడు పారాశర్యునితో నన్న మాట లుపజాతివృత్తమున వ్రాయబడినవి ఈ వృత్తమును నన్నయ్య వ్రాయ లేదు. ఎఱ్ఱన్న వ్రాయలేదు. అందువలన తిక్కన్నగారి విషయమున నేమి చెప్పుటకును వీలుకాదు. ఆయన వ్రాసిన సందర్భమే సందర్భ మగుచున్నది

**తోటకము :** తిక్కన్నగారీ పద్యమును రెండు సందర్భముల వ్రాసిరి. భయపడిన చిత్తముయొక్క వికలమైన స్థితిని వర్ణించుచు నొకసారియు, శోక మూల మగుచున్న వస్తువుయొక్క పూర్వపుటున్నతిని, ప్రస్తుత హీనస్థితిని కలిపి వర్ణించుచు నొకసారియు వ్రాసిరి. కథాసందర్భమున నన్నయ్యగారీ పద్య మును వ్రాయలేదు. హరివంశము - ఉత్తరభాగమున, బాణుని యుద్ధతికి మరియు నాతడు శివుని కోరిన వరమునకు వెరచి తత్ఫలిత మెట్లు పరిణమిం చునో తెలియక వ్యాకులపడు వాని మంత్రి కుంభాండుని మనోభావమును వర్ణిం చుచో, నెఱ్ఱన్న వ్రాసెను. స్తిమితమును కోలుపోయి ముందువెనుకల కూగిస లాడు చిత్తలక్షణ వర్ణనమునకీ తోటక ముపయోగింపబడినట్లు పై సందర్భ ములను బట్టి తెలియగలదు.

ఒక డడవినబడి పోవుచున్నాడు. అసలే యది యడవి. ఎప్పుడే శరభ మృగము వంటిది వచ్చి మీదబడునో తెలియదు. కొంచెము దూరమున నవి తిరుగుచుండుట కన్నులకు కనిపించుచునే యున్నది. అవి కనిపించినపు డెల్లను వాని ప్రాణములు పైకి లేచుచున్నవి. అట్లే ఊపిరి బిగపట్టుకొని నడచు చున్నాడు. ఇంతలో వానివెంట దొంగలు పడినారు. ప్రక్కగా నెవ్వైనను పరుగెత్తుద మన్నచో నడవిమృగములు. త్రోవను దొంగలు. ఏవంవిధమైన స్థితిలో ప్రాణభయమున చేడ్పడిన చిత్తవృత్తి వాని శరీరాంచలములమీద నభి వ్యక్త మగుటను తిక్కన్నగారు తోటకవృత్తమున వర్ణించిరి మరియు గాంధారి పొలికలనిలో నందర శవములను చూచి విలపించుచు సాగిపోవుచున్నది. ఇంతలో ద్రోణుని శవము కనిపించినది. ఆ శవము పాదములు నక్కలు పీకికొని తిని పోయినవి. బహుశః గాంధారి అటువైపు వచ్చుచుండుటను చూచి నక్కలా శవమును విడిచిపోయియుండవచ్చును. ఆ ద్రోణుని పాదములను చూచి గాంధారి దుఃఖవివశయై శ్రీకృష్ణునితో - శిష్యులచేత నిరంతరము నమస్కరింప బడు పాదములు నక్కలచేత చెడదినబడినవి-ఆ వెనుకటి దశకును, ఇప్పటి స్థితి

కిని సంబంధములేదు - దైవ మెంత చేసినదో చూడు మన్నట్లుగా ననినది ఆ గాంధారిమాటలు తోటకవృత్తమున వ్రాయబడినవి మొదటిపద్యమున భయస్థితియు, నీ రెండవ పద్యమున శోకస్థితియు వర్ణింపబడినది రెండింటియందును స్థిమితము లేని మనోలక్షణమే ప్రధానము ప్రాణము దక్కించుకొనుట కెటు పోవుటయా యను చిత్తముయొక్క అవ్యవస్థ మొదటి పద్యమ నను, ద్రోణుని పూర్వప్రక్రృతావస్థలమీద ప్రసరించు గాంధారి చిత్తముయొక్క అవ్యవస్థ రెండవ పద్యమునను తిక్కన్నగారు వర్ణించిరి ఎఱ్ఱన్నయు, అనేక విషయముల వలన భయపడి తన ప్రభువునకు ప్రాణముమీదికి వచ్చుచున్న దని ఆరాటపడు కుంభాండుని చిత్తముయొక్క అవ్యస్థనే వర్ణించెను. వికలమైన మనోలక్షణమును వర్ణించుచో తోటకవృత్తమును తిక్కన్నగారు వాడినారనియు, ఆయన ననుసరించి ఎఱ్ఱన్నయు నట్లే వాడెననియు చెప్పవచ్చును.

**లయగ్రాహి :** మహాభాగయైన గాంధారికి వ్యాసుని వరమువలన నైన దివ్యదృష్టిపథమున, నధిక విస్తారదూరప్రాప్తయైన యుద్ధభూమిని నాలుగు లయగ్రాహి వృత్తములలో తిక్కన్నగారువర్ణించిరి ప్రతి పద్యము చివర, నందు వర్ణింపబడిన దృశ్య మామె మనస్సుమీద నేమి విధమున ప్రభావము చూపుచున్నదో చెప్పబడినది. మొదటి లయగ్రాహి చివర "మనోవికృతి సేయన్" అని ఇట్లే క్రమముగా "నెడద కారటము సేయన్" అని, అధిక మ్మగు కలంక హృదయమ్మున కొనర్పన్" అని, మరియు "పరిక్షుభిత చిత్తత యొనర్పన్" అనియు చెప్పబడినది. ఆ యుద్ధభూమి దర్శనము గాంధారియొక్క, అల్పాంతరములు కల మనోబుద్ధ్యహంకారచిత్తరూపమైన అంతఃకరణమును సర్వథా వికృతిని పొందించిన దని యర్థము గాంధారిరూప జీవుడు తద్దర్శనమున కలగుండుపడినాడు ఆ జీవుని యట్టి స్థితికి తెచ్చుటకు మూలమైన యుద్ధభూమి లయగ్రాహియందు వర్ణింపబడినది ఆ యుద్ధభూమి యధికవిస్తారదూరప్రాప్తము. అంత విస్తృతిమీది విషయము వర్ణింపబడినది

వసంతఋతువు రాగా ప్రకృతి యిట్టి దయ్యె నని వర్ణించు సందర్భమునను, క్షుత్క్షాభిత ప్తయైన జీవరాశిని అన్నముచేత రక్షించిన సూర్యభగవానుని వర్ణించు సందర్భమునను నన్నయ్యగారు లయగ్రాహిని వాడిరి. మరియు నెఱ్ఱన్న ఈ వృత్తమును రావణునిచేత ప్రార్థితుడును ప్రబోధితుడును నై శ్రీరామునితో యుద్ధమునకు బయలుదేరివచ్చిన కుంభకర్ణుని వర్ణించు సందర్భ

మున వాడెను, నన్నయ్యగారు వర్ణించిన వసంతఋతువు ప్రభావము పొందు భూపాలునిమీద కలదు సమ్మోహానలక్షణముకల వర్ణన మది. యుద్ధభూమి వర్ణన మంతయు గాంధారిని చిత్తము కలంచి శోకము పాలుచేసినది. అట్లు కుంభకర్ణుడు యుద్ధమునకు రాగా కపివీరుల కచ్చెరువు కలిగినది వసంతఋతు వర్ణన మనగా నదియు బహువిస్తృతిమీది విషయము. యుద్ధభూమి సరేసరి కుంభకర్ణుడు నొకనిసి యొక్కడే అయినను వానివలన కపివీరులయం దందరి యందును నాశ్చర్యము వ్యాపించినది కపిసేన విస్తృతమైనదియే అంత విస్తృతిమీద ఆశ్చర్యము వ్యాపించుట కాస్పదమైనవాడు కుంభకర్ణుడు అందు వలన నొక విస్తరించియున్న విషయము అన్యచిత్తములమీద ప్రభావముకలది యైనచో తద్విషయ వర్ణనము లయగ్రాహింగుందు చేయుట కవిత్రయము వారి యందు కనిపించుచున్నది మరి సూర్యభగవానుని విషయము చెప్పబడలే దేమనవచ్చును. ఈ సృష్టిసమస్తము వాని వెలుగులో నున్నది మరియును భూతరాశిని రక్షించి సర్వసృష్టియొక్క స్థితికిని మూలభూతమైన సూర్యభగవా నుడు విస్తారుడు గాక సామాన్యుడు కాడు గదా! అందుచే నదియు గతా ర్థమే. ఒక విధముగా లయగ్రాహియొక్క వినియోగవిషయము కవిత్రయ మువారి దృష్టి ననుసరించి చెప్పబడినది.

**స్వాగతము :** పొలికలనికి బయలుదేరిపోవు ధృతరాష్ట్రగాంధారులకు నొక క్రోశ మాత్రము దారి గడచిన పిదప కృప కృతవర్మాశ్వత్థామ లెదురు పడినారు అపుడు కృపుడు తనుజశోకార్తయైన గాంధారి నోదార్చుచు మాటాడుటలో దుర్యోధన ప్రభృతులైన కుమారులయొక్క పౌరుషము నగ్గించి పలికినాడు. అట్టి యొకటి రెండు మాటలు తిక్కన్నగారిచేత స్వాగతవృత్త మున వ్రాయబడినవి అనగా దుర్యోధనాదుల బుద్ధి యుద్ధధర్మమునయం దెట్లు నిశ్చాయకమై వీరలక్షణము కలిగి ప్రవర్తించినదో అది యా పద్యమున వర్ణింపబడినది.

నన్నయ్యగారు కథాసందర్భమున నొక్కచోట మాత్రమే స్వాగతవృత్త మును వ్రాసిరి. సాల్వుని రథాశ్వముల మర్మములను సాంబుడు జాంబూనద పుంఖములైన విశేషముల భేదింపగా నా వేదనకు తట్టుకోనలేక నా గుఱ్ఱములు యుద్ధభూమినుండి రథమును తొలగ లాగికొనిపోయినవి అపుడు సాల్వుని పక్షమునందలి వీరుడు వేగవంతు డనువాడు సాంబుని దాకి విశిఖప్రయోగము

చేసినాడు. వేగవంతు డట్లు సాంబుని దాకవచ్చుట స్వాగతవృత్తమున వర్ణింప బడినది.

ప్రాణములను లెక్కచేయక యుద్ధమునకు చొచ్చుకొనిపోవు వీరపురుష వర్ణనము సందర్భమున నన్నయ్యగారును, ఆయన ననుసరించి తిక్కన్నగారును స్వాగతవృత్తము నుపయోగించినారని చెప్పవలయును.

ఇంతవరకు క్షేమేంద్రుడు వినియోగమును నిష్కర్షించి చెప్పిన, చెప్పని కొన్ని వృత్తములయొక్క యౌచిత్యము, తిక్కన్నగా రెట్లు పాటించిరో, ఆ యా వృత్తముల విషయమున నన్నయ ఎఱ్ఱయల దృష్టులు కూడ నెట్లున్నవో, క్షేమేంద్రుని మతమునందలి తాత్పర్యబుద్ధితో విచారింపబడినది. ఈ విచారణము చాల పరిమితమైనది. వృత్తౌచిత్యమువిషయము సర్వకావ్యసాధారణముగా నొక సిద్ధాంతముచేయుట కనువైనది కాదు ఇక్కడ నింకొక్క సంగతియు గమనింపవలసినది యున్నది. వృత్తనామార్థమును బట్టుకొని అది వర్ణ్యవస్తువునకు కించిత్తనుగుణముగా నున్నచో నచట కవి వృత్తౌచిత్యమును పాటించినా డని చెప్పుటయు నున్నది[1]. అది మరియు పరిమితమై విశేషవిచారముతో నిమిత్తములేనిది.

పూర్వాపరములనుండి భిన్నమును విలక్షణమును నైన నొక భావముగాని, ఒక కథాఘట్టమునుగాని, అర్థవంతముగా కవి సాధింపదలచుకొన్నచో నచట అవసరమును బట్టి కొన్ని భిన్నవృత్తము లుపయోగించును. వాటి ప్రయోజనమును ముందువెనుకలను విచారించుకొనుచు చదువుకొనువాడు భావించును భిన్నవృత్తవినియోగము తావన్మాత్రమైన యౌచిత్యమునే సంపాదింపగలదు. అంతకుమించి, ఫలానావృత్తమున ఫలానా ఫలానా విషయములు వర్ణింపబడు నను సిద్ధాంతముగాని, ఫలానావృత్తము గతి ఫలానావిషయమునకు వ్యంజక మను నిష్కర్షగాని, వృత్తనామార్థముల ననుసరించి తత్తదనుకూల విషయవర్ణనల కా యా వృత్తము లుపయోగించుట యుచితమని గాని భావించుటయు, నందుకొరకు కావ్యములయందు వెదకుటయు, రెండును నిష్ప్రయోజనములు.

---

1. కుమారసంభవము (మ. వి) - పీఠిక - పుట 55

క్షేమేంద్రు డన్ని వృత్తములకు వినియోగము సంభావన చేసి వ్రాసి పెట్టినను తెనుగుకవు లెవరును దానిని పాటించినారు కారు. ఒక్క మాలినీ వృత్తమును మాత్ర మాయన మాటను బట్టి తిక్కన్నగారు మొదలైన కవులు చాలమంది ఆశ్వాసాంతములయందే వ్రాసినారు వ్రాయనివారును చాల మంది యున్నారు నన్నయ్యగారే దానిని నియమముగా పాటింప లేదు. క్షేమేంద్రుడు చెప్పిన కొన్ని రకముల గ్రంథములకు కొన్నిరకముల ఛందమే ఉచిత మను విషయము మాత్రము నన్నయ్యగారిచేత విచారింపబడి భారత కవులచేత పాటింపబడినది మిగిలిన వృత్తముల విషయమున నెవరి యిష్టము వారిది. అయినను తిక్కన్నగా రుపయోగించిన కొన్ని విశేషవృత్తముల యౌచిత్యము క్షేమేంద్రుని మతానుగుణమైన బుద్ధితో నిచట విచారింప బడినది

# అనుబంధములు

## 1. నన్నయ్యగారి పర్వసంగ్రహము - తిక్కన్నగారు

భారతమునందలి పదునెనిమిది పర్వములయందును ఏ యే విషయములు ఏ క్రమమున నుండవలయునో పర్వసంగ్రహమను పేర నన్నయగారాదిపర్వమున వ్రాసిరి తిక్కన్నగారు చాలవరకు నన్నయ్యగారి పర్వసంగ్రహము ననుసరించియే విరాటమాదిగా పదునైదు పర్వముల భారతమును వ్రాసిపెట్టిరి. చాలవరకనగా నాలుగైదు కొద్దిపాటి భేదములతో నని యర్థము.

నన్నయ్యగారు వ్రాసిన పర్వసంగ్రహము కూడ అన్ని పర్వముల విషయమునను, వ్రాయబడవలసిన అంశముల నొక క్రమమున చెప్పుటలేదు ఉద్యోగపర్వమునం దంబోపాఖ్యానము తరువాత సంక్రందనోపాఖ్యానము పేర్కొనబడినది నిజమున కా సంక్రందనోపాఖ్యానము ప్రసక్తి "నారాయణుని నొక్కని నర్జునుండు గోరికొనుటయు" ( ఆదిపర్వము - 1 - 42 ) అను వాక్యము తరువాత రావలయును కర్ణపర్వమునందు "వృషసేను వధయును, దుశ్శాసనుం జంపి భీముండు తద్వక్షోరక్తం బాస్వాదించుటయు" (వ 48) అను రెండు వాక్యములును సువ్యస్తములై యుండవలయును తిక్కన్నగారు ముందు వృషసేనుని వధ వ్రాయలేదు. వ్రాయకపోవుటయే యుచితము వృషసేనుని అర్జునుడు జంపుటతో కర్ణార్జునుల యొక్క, దేవతలకు ప్రేక్షణీయమైన, యుద్ధము మొదలైనది. ఆ యుద్ధముననే కర్ణుడు మరణించినాడు. కర్ణవధతో పర్వము సమాప్తమగు చున్నది. అట్లుగాక వృషసేను వధానంతరము, కర్ణవధకు పూర్వము దుశ్శాసనుని భీముడు చంపుట వ్రాయబడినచో కథాకథనమున సొగసుపోవును. అందువలన పర్వసంగ్రహము నందలి యా వాక్యములు ముందు వెనుకలుగా నుండవలయును. మిగిలిన అన్ని పర్వములకు వ్రాయబడిన పర్వసంగ్రహ మంతయు సక్రమముగనే యున్నది.

తిక్కన్నగారు పర్వసంగ్రహమునకు భిన్నముగా వ్రాసిన అంశము లిక విచారింపబడును.

1. "గోగ్రహణంబున గురు బలంబులనెల్ల నొక్కరుండ జయించి ధనంజయుండు గోగణంబులఁ గ్రమ్మఱించుటయు—". 1-40

అని మాత్రమే నన్నయ్యగారు వ్రాసిరి. ఇది కేవల ముత్తరగోగ్రహణమునకు సంబంధించిన వాక్యముగా కనిపించుచున్నది దక్షిణ గోగ్రహణము సంగతి నన్నయ్యగారిచేత పర్వసంగ్రహమున చెప్పబడలేదు తిక్కన్నగారు దక్షిణ గోగ్రహణమును కూడ విపులముగనే వ్రాసిరి.

2. "ధృతరాష్ట్రునకు మనస్తాపోపశమనంబుగా సనత్సుజాతుం డధ్యాత్మ కథలు సెప్పుటయు___" 1-42

అని నన్నయ్యగారు వ్రాసిరి. అధ్యాత్మకథలు సెప్పుటయు ననగా నాయన ఫలానా ఫలానా విషయములు చెప్పెనని తెనుగు భారతమున వ్రాయబడ వలయుననియే కదా అర్థము. తిక్కన్నగా రా విషయముల నేమియు వ్రాయ లేదు. మరియు నన్నయ్యగా రధ్యాత్మకథ లనిరి నిజమునకు సనత్సుజాతీయ మున కథ లేమియులేవు. కథ యనగా విషయ మనియె అర్థము గ్రహింప వలయును.

3. "అర్ధరథులలోనం గలయం దన్నెన్నిన నలిగి కర్ణుండు భీష్ము పదిదినంబులు సమరపరాఙ్ముఖుండగుటయు" 1-42

నన్నయ్యగారు వ్రాసిన ఈ వాక్యమునుబట్టి భీష్ము డర్థరథుడుగా కర్ణుని నిర్ణయించి నపుడే కర్ణుడు యుద్ధపరాఙ్ముఖు డయినాడని యర్థమగుచున్నది కర్ణు డస్త్రసన్యాసముచేసి భీష్ముడు యుద్ధమున పడిపోవుదనుక తాను యుద్ధము నకు రానన్నది ఉద్యోగపర్వము ద్వితీయాశ్వాసమున (289) అనగా సంజయుడు ఉపప్లావ్యమునుండి తిరిగి వచ్చి కౌరవుల కొలువున నచటి విషయము చెప్పిన నాడు నన్నయ్యగా రా సందర్భమున కర్ణుని సమరపరాఙ్ముఖత చెప్పబడవలయు నని వ్రాయలేదు నన్నయ్యగారు చెప్పకపోయినను ద్వితీయాశ్వాసమున తిక్కన్నగారు వ్రాసిరి. మరియు నన్నయ్యగా రెచట చెప్పబడవలయుననెనో అచ్చట తిక్కన్నగారు దానిని వ్రాయలేదు అనగా కర్ణు డర్థరథుడుగా నిర్ణ యింపబడిన చతుర్థాశ్వాసమున (234) అస్త్రసన్యాసము చేసి కర్ణుడు భీష్ముడు యుద్ధమున పడిపోవుదనుక తాను యుద్ధమునకు రానన్నట్లుగా తిక్కన్నగారు వ్రాయలేదు. భీష్ముడట్లు నిష్కర్షించిన తరువాత కర్ణుడు దుర్యోధనునితో "ఏ దుర్మాని యని కాదె యీతనితో నడచుట కొల్లనైతి దురమున కధిపా!" (4-244) అని తా నదివరలో నస్త్రసన్యాసముచేయుటను సమర్థించుకొని

నాడు. అంతేగాని క్రొత్తగా యుద్ధపరాఙ్ముఖుడగుట చతుర్థాశ్వాసమున లేదు.

భీష్ము డర్ధరథు డనిన తరువాత నస్త్రసన్యాసము చేసినట్లు చెప్పినచో మరియు సహేతుకముగా నుండును గాని కర్ణుడు ద్వితీయాశ్వాసముననే యుద్ధ పరాఙ్ముఖుడగుటను చెప్పుటలో నేమి యందమున్న దనవచ్చును ఇది యొక విధముగా నిజమేకాని, ద్వితీయాశ్వాసమున చెప్పబడినందున మరొక ప్రయోజనము సాధింపబడుచున్నది. యుద్ధ మింకను గట్టిగా నిశ్చయముకాని రోజు లవి అపుడే కర్ణుడు అస్త్రసన్యాసము చేసినాడు. దానితో దుర్యోధనుని సమరబుద్ధి వెమకాడవలయును. కాని వాని బుద్ధి చెదరలేదు. తన యుద్ధభారమంతయు వహించగలడని యే కర్ణునిగూర్చి దుర్యోధను డనుకొనుచున్నాడో అట్టివాడు యుద్ధ పరాఙ్ముఖుడైనను వాని బుద్ధి యుద్ధనిశ్చయమునుండి కించిత్తుకూడ వైదొలగలేదన్నచో సమరోత్సాహము ప్రతీయమాన మగుచున్నది కదా! అది చాల ముఖ్యమైనది

4. "నాగాస్త్ర భయంబున నర్జును రథంబు శ్రీకృష్ణుండు భూమియందుఁ జొనుపుటయు, నింద్రాదిత్యుల పరస్పర సంవాదంబును—" 1-48

కర్ణపర్వసంగ్రహము చెప్పుచు నన్నయ్యగారు వ్రాసిన వాక్యము లవి. శ్రీకృష్ణుడు రథమును భూమియందు క్రుంగజేసిన తరువాత దేవతల ప్రసక్తియే తిక్కన్నగారి భారతమున లేదు. కర్ణపర్వమున తిక్కన్నగారు దేవతల ప్రసక్తి తెచ్చి వ్రాసినది వృషసేనుని అర్జునుడు చంపుటవలన శోక వ్యాకులిత చేతస్కుడును, కోపాటోపమున నుద్భటుడును నైన కర్ణు డర్జునుని మీద విజృంభించినపుడు ఆ యిరువుర యెక్కటికయ్యము చూడవచ్చి నభస్సున నిలిచిన దేవతలలో ముందు బ్రహ్మ రుద్రులు కర్ణార్జునులను గురించి మాటాడుకొనుచుండగా నింద్రుడు వారితో తన మాటలను కలిపినాడు. ఆదిత్యుని ప్రసక్తి ఆ సందర్భమున రాలేదు. అనగా నన్నయ్యగారు కర్ణపర్వమున రావలయునన్న ఇంద్రాదిత్యుల పరస్పర సంవాదమును తిక్కన్నగారు రాకుండ జేసిరి. వచ్చినచో శ్రీకృష్ణ భారతమునందువలె (4-216) కర్ణార్జునుల విజయము విషయమున సూర్యుడును, దేవేంద్రుడును పక్షము వహించి వివాదము పెంచుకొన్నట్లు, బ్రహ్మ వారికి తీర్పు చెప్పినట్లు — ఈ మొదలుగా

నుండెడిది. ఆ విధముగా నింద్రాదిత్యులు వివదించుకొనుట బాగులేదు. ఒక వేళ మొదలా దేవతల సంభాషణాదికమె తిక్కన్నగారు లేకుండ జేసినచో మరియు బాగుండెడిదికదా యనరాదు. దానివలన బహుప్రయోజనములు సాధింపబడినవి. దేవతా ప్రసక్తివలన కర్ణార్జునుల యుద్ధము దేవతలకు ప్రేక్షణీయ మయ్యెడునంత తీవ్రమును లోకోత్తరమును నైనదన్న స్ఫూర్తి కలిగింపబడినది. మరియు కర్ణార్జునులలో నెవరధికు లన్నది ప్రశ్న ఇరువురు నిరువురే. కాని అర్జునుడు జయించినాడు ఆ దేవతల సంభాషణమున నర్జునుడు జయించుట నిశ్చయింపబడినది అనగా నర్జునుడు జయించుట దేవతలచేత సంకల్పింపబడినది. కర్ణు డర్జునునిచేత జయింపబడుట దేవతల కిష్టమైనది. అందువలన కర్ణుని చంపుటకు నర్జునునకు వచ్చిన శక్తిలో దేవతల సంకల్పబలము సంక్రమించినది. తత్సంకల్పబల మున్నది గనుకనే తన కే విధముగను తీసిపోని కర్ణుని అర్జునుడు జయించినాడు. అర్జునుని విజయమునందలి రహస్యమును ప్రతిపాదించు దేవతల సంభాషణాదికమును తిక్కన్నగారు వదలకూడదు. ఆయన వదలలేదు. ఇంద్రాదిత్యుల సంవాదమువలన నర్జునుని విజయము సాధింపబడుటకంటె, సూర్యుని ప్రసక్తి లేకుండ దానిని సాధించుటయే సమంజసము. అందువలన ఇంద్రాదిత్యుల సంవాదము నన్నయ్యగారు చెప్పినను తిక్కన్నగారు వ్రాయలేదు.

అయినచో నీ మాత్రపు టూహలేకుండనే నన్నయ్యగారు పర్వసంగ్రహమున నింద్రాదిత్య పరస్పర సంవాదమును పేర్కొని వ్రాయరాదు. ఇంతకంటె యధికముగనే ఆయన ఊహింపగలడు ఆయనయే కర్ణపర్వమును వ్రాసియున్నచో నింద్రాదిత్య సంవాదము నెట్లు వ్రాసి, ఏమి పరమార్థమును సాధించియుండెడివాడో తెలిసెడిది. మరి ఆయన వ్రాయలేదు. బ్రహ్మరుద్రుల సంవాదమును తొలగించుట నాయన సంకల్పించి యుండవచ్చును. అది వేరు విషయము నన్నయ్యగారి ఊహావైభవమునకంటె ప్రస్తుతము తిక్కన్నగారు చేసిన దానిలోని సామంజస్యము విచారింపవలసినది.

౬. అశ్రమవాస పర్వమున కర్ణజన్మవృత్తాంతము కుంతిచేత వ్యాసునకు చెప్పబడుటను నన్నయ్యగారు పర్వసంగ్రహమున పేర్కొనలేదు. తిక్కన్నగారు విపులముగా కుంతి వ్యాసునకు చెప్పినట్లుగా కర్ణజన్మకథను వ్రాసిరి. ఇంతకంటె నన్నయ్యగారి పర్వసంగ్రహము నతిక్రమించి తిక్కన్నగా రేమియు చేయలేదు.

## 2. రెండు మూడు కొద్దిపాటి సవరణలు

తుది రాజ్యమ్ము సగమ్ము గొ మ్మడవియందుం బేరువచించియుం
బదుమూఁడేడులు నీవునుం దిరిగిరాఁ బాలికపోవచ్చునే
యది గాదేఁ దెగి బంటవై యఱుము మాయల్వన్ను నేర్పింకఁజె
ల్లదుసూ నీ కని యా సుయోధనుని యుల్లం బుచ్చిపోనాడుమీ.

హాస్తినాపురమునకు రాయబారము నెరపుటకు పోవుచున్న శ్రీకృష్ణునితో తన అన్నగార్లందరు తమకు తోచిన మాటలు చెప్పిన తరువాత సహదేవుడు చెప్పిన మాటగా నా పద్యమును తిక్కన్నగా రుద్యోగపర్వమున వ్రాసిరి. ఈ పద్యమున కర్థనిర్ణయము చేయుచు క్రీ. శ 1928-29 సంవత్సరములలో శ్రీ దూసి రామమూర్తి శాస్త్రిగారును, శ్రీ చంద్రాభట్ల రామమూర్తిగారును పత్రికలలో వ్రాసిరి. మరియు నంతకు పూర్వమే 1915 సంవత్సరమున ప్రకటింపబడిన శ్రీ పార్నంది రామశాస్త్రులవారి "శ్రీమహాభారత విమర్శనము-ఉద్యోగ పర్వము" అను గ్రంథమున నీ పద్యము యొక్క అర్థము కొంతవిచారింపబడి నది (పు 88, 89) పద్యమునందలి 'తిరిగిరా' అన్నదానికి 'తిరుగురా' అని మరొక పాఠము సూచింపబడినది మొత్తముమీద శ్రీ రామశాస్త్రులవారి సమన్వయమంత సముచితముగాలేదు. మొదలా పద్యమునకు పాఠభేదములే అచ్చయిన ప్రతులయం దీయబడి కానవచ్చుటలేదు అది యట్లుండె

ఆ పద్యముననున్న చిక్కంతయు 'నీవును' అని యుండుటలో నున్నది. తుదిరాజ్యమ్ము సగమ్ము గొమ్ము - చిట్టచివరకు (వచ్చి) సగము రాజ్యమును తీసికొనుము, అడవియందున్ - అరణ్యమునయందున; పేరువచించియున్ - మారు పేరు పెట్టుకొని, పదుమూడేడులు - పండ్రెండు సంవత్సరము లరణ్యవాసము, ఒక సంవత్సర మజ్ఞాతవాసము (చేసి); నీవునుం దిరిగిరా - ఓ దుర్యోధనా! నీవును తిరిగిరమ్ము. అనగా సహదేవు డిట్లనినట్లు—ఓ దుర్యోధనా! నీవును మావలెనే అరణ్యాజ్ఞాతవాసములతో పదమూడేడులు గడిపివచ్చి నీ సగము రాజ్యము నీవు తీసికొనుము—అని. దుర్యోధనున కట్టిపనిచేయవలసిన అవసర మేమున్నది గనుక ? అతడు పాండవులవలె జూదమాడి యోడిపోలేదుగదా!

తా మోడిపోయి, అప్పుడన్నట్లుగా ప్రతిన నెరపి తిరిగి వచ్చి మా రాజ్యము మా కిమ్మని దుర్యోధనుని అడిగివచ్చుటకు శ్రీకృష్ణుని పంపుచు వానితో దుర్యోధనుని పదుమూడేడులు గడిపి తిరిగి రమ్మనుమని చెప్పుటలో సామంజస్య మేమున్నదియు తోచుటలేదు మరియు నసందర్భముగా కనిపించుచున్నది. ధర్మరాజాదు లెవురుగాని ఇట్లనలేదు సహదేవుడే ఇట్టి ఊహాచేసినాడు అయినను, పాలీకపోవచ్చునే – అన్నదాని యర్థ మేమి ? భాగమిచ్చుటకున్నదెవరు ? తా మేకావలయును అయినచో పదుముదేడులు గడిపి వచ్చి సగము రాజ్యము తీసికొమ్మని చెప్పి మరల మేము నీకు భాగమియ్యక పోవచ్చునా అనుట యేమి ? మరియు, అదికాదేన్ – ఏదికాదేని ? తాముపాలీకపోవుటయా ? అయినచో, తెగిబంటవై యఱుము, మాయల్వన్ను నేర్పింక చెల్లదు – ఇది యేమి ? నీవు సాహసించి వీరుడవై యుద్ధమునకురా – నీ మాయలిక చెల్ల నేరవు దుర్యోధనుడు చేసినమాయ యేమున్నది గనుక ? తామే మాయచేసినవారగుచున్నారు సీవు పదునూడేడులు గడిపివచ్చి రాజ్యము తీసికో అనిచెప్పి పాలీయక పోవుటవలన తామే మాయలు పన్ని నేర్పుగా దుర్యోధనుని నేడ్పించినవా రగుచున్నారు. కాని సహదేవుడు దుర్యోధనునితో నీ మాయ లింక చెల్లవు సుమా అని అనవలసినదిగా శ్రీకృష్ణునితో చెప్పుచున్నాడు. ఇదంతయు సందర్భపడి యున్నట్లు కనిపించుటలేదు ఈ యసందర్భమంతయు 'నీవునుం' అన్నదానినుండి పుట్టుచున్నది శ్రీ చంద్రాభట్ల రామమూర్తి గారది 'నీవనన్' అని యుండదగునని చెప్పినారు. అట్లు శ్రీరామమూర్తిగారు సూచించిన పాఠమే సమంజసముగా కనిపించుచున్నది. అపుడు వాని (పద్యము) అర్థ మిట్లు సంగతపడియుండును శ్రీరామమూర్తిగారు వ్రాసిన యర్థమే యిచట వ్రాయబడుచున్నది "అడవియందున్ – అరణ్యములోను, పేరు వంచించియున్–మారుపేరులు పెట్టుకొనియు, పదుమూడేడులు–పదుమూడు సంవత్సరములు, ఉండి యను క్త్వార్థక మధ్యాహారము, తుదిన్ – చివరను, రాజ్యమ్ము సగమ్ముగొమ్ము – అర్థరాజ్యమును స్వీకరింపుము (అని), నీవు – నీవు (దుర్యోధనుఁడని యర్థము), అనన్ – (ధర్మరాజుతో) అనగా, (అట్లుచేసి) తిరిగిరాన్ – తిరిగిరాగా, పాలీకపోవచ్చునే – భాగమీయకుండుట న్యాయమా ? అది కాదేన్ – అది నీయిష్టముకాకున్న, తెగి – సాహసించి, బంటవై – వీరుడవై, అఱుము – ఆక్రమింపుము (గెలువుము), మాయల్ వన్ను నేర్పు – మాయలను గల్పించు తెలివి, ఇంకన్ – ఇఁకమీద, చెల్లదుసూ –

పనికిరాదుసుమా, నీకని, ఆ సుయోధనుని-ఆ దుర్యోధనుని మొక్క, ఉల్లంబు-డెందంబు. ఉచ్చిపోన్ - దుస్సిపోవునట్లుగా, ఆడుమీ - పల్కుమా—

వనవాసాజ్ఞాతవాసములు రెండును బదుమూడేడులు సలిపి తుదిరాజ్యమ్ము సగమ్ము గొమ్మని నీవనగా, ధర్మరాజు తిరిగిరా పాలీయకుండుట న్యాయమా? అట్లిష్టపడవేని సాహసించి వీరుడవై యుద్ధమున గెలువుము. మోసగించి సంపాదించు నేర్పింక నీకు సాగదుసుమా ? యని యా సుయోధనుని యుల్లంబుచ్చిపోవునట్లు వచింపుమా యని సహదేవుడు శ్రీకృష్ణునితోఁ జెప్పెనని తాత్పర్యము''.

(చూ ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సంపుటి 17 సంచిక 5. పుట 283)

శ్రీ చంద్రాభట్ల రామమూర్తిగారు ''నీవనన్'' అని సవరించి చెప్పిన యర్థము సముచితముగా కనిపించుచున్నది. సభాపర్వమునను ద్యూతకాలమున దుర్యోధనుడు స్పష్టముగా సహదేవుడు చెప్పుచున్నట్లనకపోయినను, ధర్మరాజుతో శకుని కితవుడు (2-278) పలికిన పలుకుల యర్థ మదియేకదా ! అజ్ఞాతవాసమున నెఱుగబడనిచో, రాజ్య మనుభవించవచ్చునని యే అర్థము. అందువలన 'నీవనన్' అనుసవరణ అంగీకరింపదగినదిగా నున్నది.

ఈ పద్యమును గురించి శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులవారు ''ఇటనున్న విషమాలంకారము సంధియుద్ధముల యనానురూప్యమును వ్యంగ్యమొనర్చుచుఁ దద్వారమున వీరోత్సాహమును బోధించు'' చున్నదని వ్రాయుచు నుదాహరించినప్పటి పద్యమున ''నీవునుం'' అనియే యున్నది. ఈ పాఠము విషయమున శ్రీ ఆచార్యుల వారేమియు వ్రాయలేదు. ఆ పద్యమునకు నర్థము వ్రాయకుండనే శ్రీ ఆచార్యులవారు వ్యంగ్యవిషయమును చెప్పిరి. అందువలన నీవునున్' అని యున్నచో నెట్లర్థము కుదురుచున్నదని శ్రీ ఆచార్యులవారు భావించిరో తెలియవచ్చుటలేదు (చూ. ఆంధ్ర విద్యార్థి, ఆగష్టు 1934 పు.55).

మరియొకటి అనుశాసనికపర్వమున సుదర్శనోపాఖ్యాన మున్నది. అగ్ని సుదర్శనను వివాహము చేసికొనినాడు. వారిరువురుమ సంసారము చేసిరి. ఇక తిక్కన్నగారిట్లు వ్రాసిరి.

అనలునకు సుదర్శనకును
జనియించె ముదాత్తగుణ విశాలుఁడు సుద
ర్శన నామధేయుఁ డానృపుఁ
డనూన ధర్మమున దాల్చె నవనీభరమున్

వ. (ఆ సమయమున)

అతని కోఘవంతుఁడనువాడు జనియించె
నుదితయశుఁడు వానికోఘరథుడు
నోఘవతియు ననగ నుదయించి రయ్యోఘ
వతికి నా విభుండు వరుని నరసి

వ ఒరులమెచ్చక.

ఆ లేమ సుదర్శనునకు
నాలింగా నిచ్చె నద్దహననందనుడున్
లోలతఁ గై కొని పరిణయ
కేలినడపి—" 1-60...64

అగ్నికి, సుదర్శనకు సుదర్శనుడను వాడు పుట్టినాడు. వాని కోఘవంతుడను వాడు జనియించెను ఆ ఓఘవంతునకు నోఘరథుడను కొడుకు, ఓఘవతి యను కూతురును పుట్టిరి ఆ పిల్లకు సంబంధములు విచారించి, ఎవరిని మెచ్చుకొనక ఓఘవంతు డామెను సుదర్శనున కిచ్చి పెండ్లి చేసినాడు. ఆ సుదర్శనుడు చేసి కొనినాడు అనగా సుదర్శనుడు కొడుకు కూతును చేసికొనినట్లు ఆమెను చేసికొని గృహస్థధర్మమున మృత్యువును జయించెదనని కృతనిశ్చయుడై యేమోచేసినట్లు తరువాత కథ యున్నది కొడుకు తనకూతును తీసికొనిపోయి తన తండ్రికే యిచ్చి పెండ్లి చేయుటయు, నాయన చేసికొనుటయు, రెండును సందర్భపడిలేవు. అదియును గాక గృహస్థధర్మమున మృత్యువును జయించు టకు కొడుకు కూతును చేసికొనవలయునన్న నియమ మేమియు కానవచ్చుట లేదు. అందువలన ప్రస్తుతమున్న అనుశాసనమునందలి పద్యరచన ఉచితముగా లేదు. మరియు నందలి "ఆసమయంబున" అను వచనము వ్రాతప్రతులలో లేదని శ్రీ బుక్కపట్టణము రామానుజయ్యగారు ఆనంద ముద్రణాలయము (1925) న ముద్రింపబడిన భారతమున నఖోజ్ఞాపికలో పేర్కొనినారు (పుట 6).

ఆ వచనము లేనిచో మరియు నవ్యవధానముగా సుదర్శనున కోఘవంతుడు వాని కోఘరథుడు, ఓఘవతి పుట్టినారని యుండును అందలి యసంగర్భమును చూచియే దానిని దొలగించుటకుగా నచట 'నా సమయంబున' అను వచనము నెవరో చేర్చియుందురు. దానివలన నసంగర్భ మేమియు తొలగింపబడ లేదు దాని తరువాత నున్న "అతని కోఘవంతు డను వాడు జనియించె'' నన్న పద్యపాదమును మార్చినగాని అసందర్భము తొలగదు లేనిచో కొడుకు కూతును చేసికొనుటను ధర్మశాస్త్ర ప్రమాణములతో సమర్థించి, అట్టి యవసరము భారతమున తత్కథయం దెట్లు కలుగుచున్నదో సోపపత్తికముగా నిరూపింపబడవలయును అంతవరకు నచటి రచన మసందర్భముగా నున్నదనియే అనుకొనవలయును శ్రీకృష్ణభారత మానుశాసనికపర్వముగల సంపుటమునకు పీఠిక వ్రాయుచు శ్రీ విద్వాన్ వారణాసి సూర్యనారాయణ శాస్త్రిగారు తిక్కన్నగారు వ్రాసిన దసందర్భముగ నున్నదనియే వ్రాసిరి (పుట 8) "ఇట్లు సుదర్శన కుమారుండు బ్రహ్మజ్ఞానియై యున్న కాలంబున - ఇల నోఘవంతుడన్ నృపుఁడు నృగుపితామహుఁడు ప్రబలుండయి యోఘవతియు, నోఘరథుండన నొప్పు పుత్రికఁ బుత్రుఁ గని సుదర్శనునకా కన్నె నిచ్చి పెండ్లి గావించె—'' (1-75, 76) అని శ్రీ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు వ్రాసిరి. కనుక తిక్కన్నగారి భారతము నందలి పద్యము మార్పును గోరుచున్నదనియే చెప్పవలయును. "ఆ సమయంబున'' అన్న వచనము నట్లేయుంచి తరువాతి పద్యము మొదటి పాదమును-అనఘుఁ డోఘవంతుడను వాడు భువి నేలు - అని ఈ మాదిరిగా నెట్లేని మార్చినచో సరిపోవును. మిగిలిన మూడు పాదము లట్లే యుండును.

మరియు నొక్క పద్యము ఉద్యోగపర్వమున నున్నది

కావునఁ బాండవ పక్షము
భూవల్లభకోటి యిచట బ్రోవగు నిమ్మె(?)
నా పేరులు నీ పేరులు
దేవాసురులట్లు యనికిఁ దెగుదురు కడిమిన్. 1-16

అభిమన్యుని పెండ్లియైన తరువాతి మంత్రాలోచనము సమయమున శ్రీకృష్ణుడు మాటాడుచు కౌరవ పాండవులు యుద్ధమునకు దిగుదురని తన పట్ల నున్న

వారితో నన్న పద్యమది. ఆ వీరులు - ఈ వీరులు దేవాసురులట్ల యన్నపుడు క్రమముగా కౌరవులు దేవతలును, పాండవులు రాక్షసులును అని యర్థము వచ్చుచున్నది. దేవాసుర యుద్ధమున దేవతలకే విజయము పాండవుల విజయమునుగోరు శ్రీకృష్ణుడు కౌరవులను దేవత లనడు. మరియు నది యుచితము కాదు. కందపద్యము మూడవపాదము ఈ వీరులు - ఆ వీరులు అని ముందు వెనుకలుగా మార్చినచో ఔచిత్యము సంపాదింపబడును తిక్కన్నగారు ఈ వీరులు - ఆ వీరులు అనియే వ్రాసియుందురు ఎక్కడనో లేఖక ప్రమాదమువలన నది తల్లక్రిందులై యుండును దగ్గరగానున్న పాండవుల నా వీరులని, దూరముగా నున్న కౌరవులను ఈ వీరులని శ్రీకృష్ణుడని యుండుట నూహించుట మరియు సందర్భము కాదు గదా! అందువలన నా మూడవ పాదము నట్లు మార్చుటయే పరమార్థము.

## 3. సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనలు

| సూర్యోదయము | | | | సూర్యాస్తమయము | | |
|---|---|---|---|---|---|---|
| పర్వము | ఆశ్వా | పద్యసంఖ్య | | పర్వము | ఆశ్వా | పద్యసంఖ్య |
| విరాట. | 2 | 236–'41 | | విరాట. | 2 | 316–321 |
| | 3 | 34–35 | | | 3 | 193–197 |
| ఉద్యోగ. | 2 | 107–114 | | ఉద్యోగ | 2 | 2 |
| | 3 | 245 | | | 3 | 232 |
| | 4 | 390,391 | | | 4 | 338 |
| భీష్మ. | 1 | 82 | మధ్యాహ్నసూర్యుడు | భీష్మ. | 1 | 299,300 |
| | 2 | 21 | | | 2 | 94 |
| | 2 | 95 | | | 2 | 166 |
| | 2 | 167 | భీష్మ. 2–130 | | 2 | 252 |
| | 2 | 274 | 2–295 | | 2 | 339 |
| | 2 | 344 | 2–381 | | 2 | 405 |
| | 3 | 9 | 3–345 | | 3 | 65 |
| | 3 | 183 | | | 3 | 161 |
| | 3 | 315 | | | 3 | 270 |
| ద్రోణ. | 1 | 214 | ద్రోణ. 1-148 | | 3 | 417 |
| | 1 | 387 | | ద్రోణ. | 1 | 213 |
| | 3 | 5,6 | | | 1 | 387 |
| | 5 | 285 | | | 2 | 137 |
| కర్ణ. | 1 | 218 | కర్ణ 2–226 | | 5 | 10 |
| శల్య. | 1 | 113–116 | | | 5 | 275,276 |
| సౌప్తిక. | 1 | 237 | | | 5 | 418 |
| | | | | కర్ణ. | 1 | 209 |
| | | | | | 3 | 368,369 |
| | | | | సౌప్తిక. | 1 | 11–14 |
| | | | | శాంతి. | 1 | 126 |
| | | | | | 1 | 196 |